# బంజారా చరిత్ర

## (సంస్కృతి - ప్రగతి)

# BANJARA CHARITRA

## (SAMSKRUTHI - PRAGATHI)

రచన

బి. చీనియానాయక్

ప్రకాశకులు

శ్రీమతి బి. లక్ష్మీబాయి

శ్రీ హాథీరాం బావాజీ పబ్లికేషన్స్

నెం. 11/339ఎ1, అరవింద నగర్, అనంతపురం - 515 001

ఫోన్ నెం: 08554-33072

**BANJARA CHARITRA (SAMSKRUTHI - PRAGATHI)**
Written by **B. Cheeniya Naik**, Retd., Deputy Training Officer, Government I.T.I. (Employment and Training Department, A.P.) and General Secretary All India Banjara Seva Sangha, Andhra Pradesh Branch, Anantapur.

Pages : XXIV + 526 + 26 +16 Photos

First Edition : 1998





ప్రతులు : 1000

ముఖచిత్రం : శ్రీ రాణా ప్రతాప్ సింగ్ రాథోడ్
400 సంవత్సరములనాటి చరిత్ర చెప్పిన సత్యం (పు.89)

అట్టవెనుక : శ్రీ గురునానక్ మరియు శ్రీ గురు గోవింద్ సింగ్
చామ్‌కార్ సాహెబ్ యుద్ధం (పు. 82)

**Price :Rs.400/-**
వెల : రూ.400/-



**Published by: B. Lakshmi Bai Cheeniya Naik**
**M/s. Hathiram Bavaji Publications,**
11/339A-1, Aravinda Nagar,
Anantapur - 515 001, Phone : 08554-33072

**For Copies : B. Lakshmi Bai Cheeniya Naik**
**M/s. Hathiram Bavaji Publications**
No.11/339A-1, Aravind Nagar
Ananthapuram -515 001
Phone : 08554-33072

**Printed by : Sree Laxmi Process**
Bangalore - 560 040

# అంకితం



తండ్రి నిర్యాణం : 21-8-1978 తల్లి నిర్యాణం : 2-2-1982

మా తల్లిదండ్రులయిన

కీ.శే. శ్రీమతి బాణోత్ గుజరిబాయి

మరియు

కీ.శే. శ్రీ బాణోత్ చందియానాయక్ (కుంతావత్ రాఠోడ్)

నమస్సుమాంజలితో

-బి. చీనియానాయక్



గ్రంథకర్త బి. చీనియానాయక్ మరియు వారి సతీమణి బి. లక్ష్మీబాయి (మనుమడు) భాణజో అనురాగ్ రాఠోడ్ (మింయు)

# విషయసూచిక



## మొదటి అధ్యాయం : బంజారాల చరిత్ర

## రెండవ అధ్యాయం : బంజారా సంస్కృతి



### బంజారాల కథలు

## మూడవ అధ్యాయం : పెద్దల జీవిత చరిత్ర

## నాల్గవ అధ్యాయం : బంజారాలపై నేనుగావించిన కృషి



**Prof. H.S.BRAHMANANDA**
M.A.(Tel) M.A.(Ling) Ph.D.,
Chairman Board of Studies,
CHIEF INVESTIGATOR,
Gorboli in India, (U.G.C. Project)

S. K. University
Phone : 55367-369 Extn 160
ANANTAPUR - 515 003

# ముందుమాట

దాదాపు 2 దశాబ్దాలకు ముందు మాట ఇది. నేను శ్రీ కృష్ణదేవరాయ విశ్వ విద్యాలయంలో చేరిన కొత్తలో శ్రీ బాణోత్ చీనియానాయక్‌గారితో పరిచయం ఏర్పడింది. పుంగనూరులోని శ్రీ బి.కె. సత్యం మాష్టారు, బొంబాయి మిత్రులు శ్రీ రంజిత్‌నాయక్‌గారు శ్రీ చీనియానాయక్‌గారిని కలవమని సలహా ఇచ్చారు. నేను అప్పటికే రాయలసీమలోని సుగాలీల మీద పరిశోధన మొదలు పెట్టాను.

శ్రీ నాయక్‌గారితో పరిచయం కావటం నా పూర్వ జన్మ సుకృతంగా భావిస్తాను. వారు పుట్టినది మొదలు బంజారా సంస్కృతిని సంపూర్ణంగా జీర్ణించుకొన్నవారు. అంతే కాకుండా వారు ఆ రోజులలోనే విద్యావంతులైన అతి కొద్ది మందిలో ఒకరు. అంతేకాకుండా బంజారాలు బాగుపడాలని, వారిలో విద్య వ్యాపించాలని, లిపి భాషా పరిశోధన జరిగినప్పుడే అది సాధ్యమవుతుందని గట్టిగా విశ్వసించి తమవంతు కృషిని సాగించినారు. వారు గొప్ప మనసున్న మనిషి. నిరంతర కృషి ఉన్నవారు. సాంకేతిక రంగంలో శిక్షకుడుగా పనిచేస్తున్న వారికి మంచి సాహిత్య భాషా ప్రవేశాలు ఉన్నాయి. కృష్ణాజిల్లా ప్రాంతంలోకొంత కాలం ఉన్నందువల్ల ఇతర రాయలసీమ బంజారాల కన్నా వారు మంచి తెలుగు వ్రాయగలరని వారి ఈ రచన నిరూపిస్తుంది. రచయితకు శుభాకాంక్షలు. పాఠకలోకం తరపున కృతజ్ఞతలు చెబుతూ 'బంజారా సమస్య' నునుదించి కొన్ని విషయాలు ప్రస్తావిస్తాను.

భారత దేశంలో బంజారాలు విశ్వ వ్యాప్తంగా కనిపిస్తున్న 'రోమాజిప్సీల' సగోత్రులు. వీరి స్వస్థలం రాజస్థాన్ అయినా వీరు ఈనాడు దాదాపు అన్ని రాష్ట్రాల్లోనూ కనిపిస్తున్నారు. కానీ ఉత్తర, పశ్చిమ, దక్షిణ భారత దేశంలోనే అధికంగా వ్యాపించి ఉన్నారు. వీరిది ఒక బహుజన సమాజం. బంజారా అన్నది ఒక కులంకాదు సామాజిక సమూహం (Social Group). వారిలో 'గోర్ బంజారాలు' రాజస్థాన్‌లోని రసపుత్రులతో సగోత్ర సంబంధం గలవారనీ రక్త పరీక్షలు నిరూపించాయి. శ్రీ చీనియానాయక్‌గారికి ఈ పరిశోధనలన్నీ తెలుసు. కనుకనే

బంజారాల చరిత్రను సమగ్రంగా నిరూపించారు. వాణిజ్యకారులే బంజారాలని; లమన్ విక్రేతలే లంబాడీలని; మంచి ఆలకాపరులే సుగాలీలని వీరు తమ గ్రంథంలో చక్కగా విశ్లేషించి చూపారు.

ఇలాంటి బంజారాలను గిరిజనులని ఒక చోట, వెనుకబడినవారని మరొకచోట, దళితులని ఇంకోకచోట వర్గీకరించి పరిగణిస్తున్నారు. వీరిలోని రెండు మూడు ప్రత్యేకతలు ఏ ఇతర జనసముదాయాల్లోనూ లేవు.

1. బంజారాలు భారత దేశంలోనే అత్యధిక సంఖ్యలో ఉన్న ఒక జన సముదాయం. ఆయా ప్రాంతాల్లోని భాషల్ని నేర్చుకొని, ఆయా ప్రాంతంలోని జనులతో కలిసిపోయి, తొలి వృత్తి అయిన వ్యాపార వాణిజ్యాలను, పశు పోషణను వదలకుండా, ఊళ్ళకు దూరంగా ఉంటున్నా తమదైన సంస్కృతిని వదలకుండా రక్షించుకొంటూ రావటం.

2. భారతదేశం భిన్నత్వంలో ఏకత్వం కల్గింది అనే నానుడికి బంజారాలే అద్భుతమైన నిదర్శనం కావటం. దేశంలోని ఏ రెండు ప్రాంతాలలోని బంజారాలైనా దాదాపు ఒకే 'గోర్‌బోలి' లో మాట్లాడగలగటం, అదే వారి సమైక్యతా సూత్రం కావటం.

3. హైందవ మతాల మూలాలను పరిరక్షిస్తూ అటు పంజాబులోని గురుద్వారాలలోనైనా, ఇటు ఆంధ్రప్రదేశ్‌లోని బాలాజి మందిరంలోనైనా పరమ భక్తులుగా, నిస్వార్థులైన దేశ భక్తులుగా ఆత్మత్యాగ సంసిద్ధులుగా, సేవాతత్పరులుగా పరిగణన పొంది ఉండటం 'సేవల్ భాయా' భగవదవతారంగా పరిగణింపబడిన బంజారా వీరుడు కావటం.

ఈ నేపథ్యంలోనుంచి చూసినపుడు ఇతర గిరిజన జాతుల వంటిది బంజారా కాదని గుర్తించవలసి వస్తుంది. ఆటవిక గిరిజన జీవితం వీరికి మధ్యయుగాల్లో వచ్చిందే తప్ప తొలుత వీరు మహానాగరికతా వైభవాన్ని చవిచూసిన వారని వారి సంస్కృతి, వేషభాషలు, కథా సాహిత్యం – పాటలు – సామెతలు నిరూపిస్తాయి.

ఇక వీరి భాషను గురించి. వీరి భాషను 'గోర్‌బోలి' అనిపిలుస్తారు. 'బోలి' అనే మాటకు ఒక ప్రత్యేకమైన అర్థం ఉంది. అది మండలీకంకాదు. ఎన్నో ప్రాంతీయ భేదాలున్న ఒక జాతి భాష అని అర్థం. వీరి వ్యవహారంలోని భిన్న ప్రాంతాల్లోని పదాలను పోల్చి చూస్తే దాదాపు 9–11 శతాబ్దాల నడుమ రాజస్థానీ – హిందీ – గుజరాతీల మూలరూపం ఏది ఉంటుందో – అదే బంజారాలు ఈనాడు మాట్లాడే భాష అని తెలుస్తుంది. కాబట్టి నిస్సందేహంగా బంజారా భాష హిందార్య కుటుంబానికి చెందిన ఒక 'చారిత్రక భాష' (Historical Language) అని చెప్పవచ్చు.

ఇలాంటి భాషకు 'లిపి' లేక పోవటంలో ఆశ్చర్యంలేదు. ఎందుకంటే 'సంచార జీవితం' లోని సమస్యలలో ఒకటి, ఒక చోట స్థిరంగా నివసించకపోవటం. అంతేకాకుండా వ్యాపారులు కాబట్టి 'మోడి' లిపి ఒకటిచాలు సంఖ్యా పరిగణలోనికి. నిత్య జీవితం ఒక భాషతో కుదిరే పనికాదు. అందుచేత ఆయాప్రాంతాల్లోని భాషను నేర్చుకొంటూ – మరిచి పోతూ – తమ

భాషను అతి కష్టం మీద కాపాడుకుంటూ వస్తున్నవారు బంజారాలు. కాబట్టి వీరి భాషకు 'అంతర్జాతీయ భారతీయ లిపి' ఒకటి అవసరం. ఆ ప్రయత్నం కూడా ఇందులో జరిగింది.

చివరగా బంజారాల ప్రగతి. బంజారాలు నిత్య కృషీవలులు, ఉత్సాహవంతులు, వెనుదిరిగి చూడటం అలవాటులేనివారు. కాబట్టి బంజారాలలో గొప్ప గొప్ప సాంఘిక సేవా తత్పరులు గత 100 సంవత్సరాలుగా పుట్టారు. భూక్య బాలాజీదాస్‌గారి వంటి అద్వైత వేదాంతులు, బలిరాం పటేల్‌గారి వంటి చరిత్రకారులు, ఆత్మారాం కనీరాం రాథోడ్‌వంటి మహా పరిశోధకులు పుట్టారు. ఇంకా ఎంతో మంది పత్రికాకారులు, రచయితలు, కళాకారులు జన్మించారు. వీరందరి కృషి ఎలాంటిదో శ్రీ చీనియానాయక్ మూడవ అధ్యాయంలో స్మరించారు. చివర తాను చేసిన కృషిని వివరించారు.

చివరగా రచయిత తన కథను వినిపించారు. ఈ అధ్యాయం చాలా మనోహరంగా ఉంది. ఈనాడు తానింతవారు కావటానికి ఆనాటి సమాజం ఎలా తోడ్పడిందోవారు చక్కగా వ్యాఖ్యానించారు. ఒకమాటలో చెబితే ప్రతి బంజారా వ్యక్తి చేతిలో ఉండదగ్గ 'భగవద్గీత' లాంటిది ఈ గ్రంథం.

ఇలాంటి ఈ గ్రంథాన్ని పాఠకలోకం తప్పక ఆదరిస్తుందని నా నమ్మకం. రచయితకు నా శుభాకాంక్షలు. పాఠకులకు స్వాగతం పలుకుతున్నాను. ప్రతివ్యక్తి తన కృషిపైన పైకిరావాలి తప్ప, ఎవరో ఏదో చేస్తారని, ఎదురు చూడటం మంచిదికాదని శ్రీ చీనియా నాయక్‌గారి జీవితం నిరూపిస్తుంది. ఇది సోదరులందరికి కనువిప్పు కావాలి.

అనంతపురం

బంజారా సేవలో
హెచ్. యస్. బ్రహ్మానంద

# ప్రస్తావన

బంజారాలు-లంబాడీలు, సుగాలీలు అను పేర్లతో వ్యవహరింపబడుతూ తరతరాలుగా గ్రామాలకు దూరంగా అరణ్య ప్రదేశాలలో తాండాలను నిర్మించుకొని వ్యవసాయము, పశువుల పెంపకం, గొఱ్ఱెల పెంపకము-వ్యాపారాది వృత్తులతో జీవిస్తూండేవారు.

ఈ బంజారాల జీవిత రహస్యాలు, ఆచార వ్యవహారాలు – సాంఘిక కట్టుబాట్లు, బయటి ప్రపంచానికి తెలిసేవి కావు. బంజారా కుటుంబములో జన్మించి బాల్యమాదిగా వారి ఆచార వ్యవహారాలను – సాంఘిక కట్టుబాట్లను చక్కగా పరిశోధించి జీర్ణించుకొని అనుభవ పూర్వకముగా ''బంజారా చరిత్ర (సంస్కృతి -ప్రగతి)'' అను ఈ ఉద్గ్రంథాన్ని శ్రీ బి. చీనియానాయక్ రచించి బంజారాలకే గాక ఇతరులకు గూడ మహోపకారమొనరించి నారనుటలో అతిశయోక్తి కాదు.

బంజారాల జీవిత రహస్యాలను-ఆచార వ్యవహారాలను – సాంఘిక కట్టుబాట్లను కన్నులకు గట్టినట్లు వర్ణించి, రచించడం ఒక చీనియా నాయక్‌గారికే సాధ్యమయింది. కాని ఇతరులకు సాధ్యమయ్యేపనికాదు. తన బంజారాల జీవిత చరిత్రకే తన జీవితాన్ని అంకితంచేసి జాత్యుద్ధరణ కోసం కంకణం గట్టుకొని ఈ గ్రంథాన్ని రచించిన శ్రీ బి. చీనియా నాయక్‌గారి కృషి శ్లాఘింపదగ్గ విషయం. వీరికి భగవంతుడు ఆయురైశ్వర్యములొసంగి రక్షించుగాక!

లలిత కవికోకిల విద్వాన్ తలమర్ల కళానిధి
11/308 లక్ష్మీకళా సౌధం
అరవిందనగర్,
అనంతపురం – 515 001



**Dr. T.V. SUBBA RAO**
M.A.; Ph.D.
Professor of Emeritus (U.G.C.)
Department of Studies in Telugu

**BANGALORE UNIVERSITY**
Jnana Bharathi, Bangalore - 560 056

# ''వీరగల్లు''

ప్రపంచంలో వీరులు లేని దేశం లేదు; వీరగాథలు లేని సాహిత్యమూ లేదు. డెన్మార్క్, స్కాట్లండు, స్పెయిన్ దేశాలు వీరగాథలకు ప్రసిద్ధికెక్కిన దేశాలు. భారతదేశంలో రసపుత్రులకు జన్మభూమియైన రాజస్థాన్ వీరగాథల పురిటిగడ్డ. మాతృభూమి సంరక్షణలో ప్రాణాలను తృణప్రాయంగా బలిపెట్టిన మహావీరులు రసపుత్రులు ( రాజపుత్రులు). ఈ రసపుత్ర వంశానికి చెందిన వీరజాతి నేటి సంచారజాతియైన 'బంజారాలు'. వీరినే 'సుగాలీ', 'లంబాణీ', 'లంబాడీ' అనే పేర్లతో కూడా పిలుస్తున్నారు.

పాండవ వీరవంశం అభిమన్యునితో అంతరించిపోకుండా శ్రీకృష్ణభగవానుడు కాపాడాడు. ఉత్తర గర్భంలోని పరీక్షిత్తును రక్షించాడు. ధర్మరాజు తరువాత పరీక్షిత్తు పట్టాభిషిక్తుడయ్యాడు. పరీక్షిత్తు కొడుకు జనమేజయుడు. ఆతనికి వ్యాస శిష్యుడైన వైశంపాయనుడు మహాభారత గాథను సవిస్తరంగా వివరించాడు. పాండవులు మహాప్రస్థానం చేసే నాటికే కలియుగం వచ్చేసింది. పరీక్షిత్తు–జనమేజయుల వంశంలోని వాడే మహావీరుడు పృథ్వీరాజు. జనమేజయుని నుండి పృథ్వీరాజు వరకూ గల వంశవృక్షం బయటపడింది. (పూర్వం దీనిని గురించి భారతిలో ఒక వ్యాసం వచ్చింది). భారతదేశాన్ని, భారతీయ సంస్కృతిని కాపాడటానికి ప్రాణాలొడ్డిన శూరశిఖామణి పృథ్వీరాజు. అతడు రసపుత్ర వీరుడు. అలాగే తరువాతి కాలంలో మొగలాయి చక్రవర్తులపై తిరుగుబాటు చేసిన రాణా ప్రతాప్ సింగ్ రసపుత్ర వీరుడు. ఈ మహావీరుల సంతతివారు బంజారాలు.

భారతదేశంలో ప్రతి రాష్ట్రంలోనూ బంజారాలున్నారు. మహమ్మదీయుల దౌష్ట్యంపై పోరాడిన శిక్కు జాతికూడా మూలాలు వెదకితే బంజారా జాతిగానే కనబడుతుంది ( మక్కన్‌షా లభానా). అంతెందుకు? కొందరు మహమ్మదీయులు కూడా ఔరంగజేబు కాలంలో బంజారాల నుండి మతం మార్చిడి అయిన వారే(''ముల్తానీ బంజారాలు''). భారతవీరులైన

రాజపుత్రులలో నాలుగు ప్రధాన వంశాలున్నాయి: రాఠోడ్, చౌహాన్, పవార్, జాదవ్. ఈ వంశాలు నాలుగూ రాజపుత్రుల నాలుగు ప్రధాన గోత్రాలు. వీరిలో సగోత్రీకులు వివాహాలు చేసుకోకూడదు. ఈ నియమాన్ని అతిక్రమించటం వల్ల తరువాతి కాలంలో రాఠోడ్ వంశం నుండి ''బాణ్ణోత్'' వంశం విడిపోయింది. రాఠోడ్ వంశంలో 27సగోత్రాలున్నాయి. చౌహాన్ వంశంలో 6 సగోత్రాలు, పవార్ వంశంలో 12 సగోత్రాలు, జాదవ్ వంశంలో 52సగోత్రాలు ఉన్నాయి. మహావీరుడు పృథ్వీరాజు 'చౌహాన్' వంశానికి చెందినవాడు. మహారాణా ప్రతాపసింగ్ 'రాఠోడ్' వంశానికి చెందినవాడు. ఈ వంశాలగురించీ, వివిధ గోత్రాలగురించీ, పూర్వచరిత్ర గురించీ, స్త్రీల వేషభూషణాల గురించీ సర్వసమగ్రంగా చర్చించారు ''బంజారా చరిత్ర (సంస్కృతి - ప్రగతి)'' అనే ఈ గ్రంథంలో శ్రీ బి. చీనియానాయక్‌గారు. బంజారాలు భారతదేశంలో ఏ మూలన ఉన్నా సరే ఆయా ప్రాంతీయ భాషలు మాట్లాడుతూ, మాతృభాషగా ఒకే భాష('గోర్‌బోలి' భాష) మాట్లాడుతారు. ఇది భారతీయ సమైక్యానికి గొప్ప దృష్టాంతం.

శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్న ఆచార్య H.S. బ్రహ్మానందగారు భారతదేశంలో ఉన్న బంజారాల భాషకై విశేషమైన కృషి చేశారు. ఆయన పర్యవేక్షణలో శ్రీ M. గోనా నాయక్‌గారు సుగాలీల భాషా సంస్కృతులను గురించి Ph.D. పరిశోధన చేశారు. (ఈ పరిశోధనకు నేను పరీక్షకునిగా ఉన్నాను.) ఈ గురు శిష్యులిద్దరికీ విషయ సేకరణలో శ్రీ చీనియా నాయక్‌గారు చాలా సహకరించారు.

రసపుత్రులు ఉత్తమ క్షత్రియ వంశ సంజాతులు. వీరిలో సూర్యవంశ క్షత్రియులు, చంద్రవంశ క్షత్రియులు ఉన్నారు. తరతరాలుగా మహమ్మదీయులతో పోరాడిన వీర జాతి రాజపుత్రులు కాలక్రమాన మహమ్మదీయుల క్రౌర్యాలకు తట్టుకోలేక కాందిశీకులై నలుదిక్కులకూ చెదరిపోయారు. భారతదేశంలో ఉన్న బంజారాలు, ఐరోపాదేశాలలో ఉన్న జిప్సీలు మన రసపుత్ర శూర సంతతివారే. ఆనాడు దేశంకోసం ప్రాణాలర్పించిన వీరజాతి నిన్నమొన్నటి వరకు నిలువ నీడలేకుండా సంచార జాతిగా బ్రతికినారు. ఇది విధివైపరీత్యాలలో ఒకటి! ఈ వీరజాతిని గురించిన సర్వసమగ్రమైన మహాగ్రంథం మీ చేతుల్లో ఉంది. దీని రచయిత బంజారా జాతిలోనే పుట్టిన శ్రీ బి. చీనియా నాయక్‌గారు కావడం విశేషం. ఇది బంజారాల చరిత్రను, బంజారాల సంస్కృతిని, ఆధునిక కాలంలో బంజారా జాతిలో పుట్టిన మహామహుల జీవిత విశేషాలను, బంజారాలను గురించి గ్రంథకర్త చీనియా నాయక్‌గారు చేసిన కృషిని సవిస్తరంగా సుమారు 600 పుటలలో విశ్లేషిస్తోంది. ఈ గ్రంథం భారతీయ బంజారా విజ్ఞాన సర్వస్వం (Encyclopaedia) అనడంలో అతిశయోక్తి లేదు. ఇది రాజపుత్ర జాతుల ''వీరగల్లు'' అని నేనంటున్నాను. ఇటువంటి పుస్తకం తెలుగులో ఇంతకుముందు రాలేదు. ఎంతో శ్రమించి, ఈ పరిశోధన చేసి, తన రిటైర్‌మెంటు డబ్బునంతా ఈ గ్రంథ ముద్రణకోసం ఖర్చు పెట్టిన మిత్రులు శ్రీ బి. చీనియానాయక్‌గారిని అభినందించకుండా ఎవరు ఉండగలరు? ఇది బంజారాలే కాదు సమస్త భారతదేశవాసులూ ఆదరించవలసిన అత్యుత్తమ గ్రంథం! ఇలాంటి సమస్త జాతుల చరిత్ర కలిస్తేనే కాని భారతీయ సంస్కృతి సర్వ సంపూర్ణం కాదని నా అభిప్రాయం.

బెంగుళూరు

– తంగిరాల వెంకట సుబ్బారావు



గ్రంథకర్త శ్రీ బి. చీనియానాయక్, శ్రీమతి బి. లక్ష్మీబాయి, పెద్దఅల్లుడు డా. కె. శివశంకర్‌నాయక్, M.Sc., Ph.D., పెద్దకుమార్తె డా. పద్మావతిబాయి M.D. (Gyn. & Obg.) AIMS, రెండవ అల్లుడు డా. వి. ఆర్. సురేంద్రనాథ్‌నాయక్ M.D. (Dermotology) రెండవ కుమార్తె బి. ఇందిరాబాయి B.Tech (Electronics), మూడవ అల్లుడు సి. కె. అశోక్ Camera Man (Doordarshan), మూడవ కుమార్తె భ్రమరాంబ మల్లేశ్వరీబాయి Staff Nurse (Railways), కుమారుడు బి. బాలాజి హరినాథ్ రాథోడ్ B.Tech (Chemical Enginering)

# నా మాట

## మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ

జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపి, గరీయసి! ఎవరైతే మాతా, పిత, గురువు, దైవము, మాతృ భూమిపై భక్తి విశ్వాసములు కలిగి ఉంటారో, వారు తమ మాతృ భాషను కూడ చాలా గౌరవిస్తారు. తల్లి గర్భమునుండి భూమిపై పడిన ప్రతివాడు తన మాతృభాషలో ''యా'' ''అమ్మ'' అను శబ్దమును ఎవరి ప్రమేయం లేకనే భగవంతుడువారి నోట పలకరిస్తాడు. అలాగే తన మాతృభూమి పై గౌరవముండి, శత్రువులనుండి ఎవ్వరైతే రక్షించుకుంటాడో, తన్ను తాను రక్షించినవాడు అవుతాడు. భరత ఖండములో జన్మించిన బంజారాలు, తమ మాతృభూమి రక్షణార్థమై తమ సర్వశ్వములను వదులుకొని, ఎన్నో యుద్ధాలు చేసి, శత్రువులను ఎదిరించి, ఆఖరకు తమ స్థానబలమునే వదలుకొని, అరణ్యముల పాలైనారు. 6వ శతాబ్దమునుండి 11వ శతాబ్దమువరకు మొత్తం ఉత్తర హిందుస్థానమును, ఏకధాటిగా పాలించినారు. వారిలో ఆఖరువాడైన శ్రీ పృథ్వీరాజ్ చౌహాన్ కాలంలో వీరి సైన్యం మూడు భాగములుగా విడిపోయి, ఒక భాగం రాజస్థాన్ కోటలలోను, ఒక భాగం అడవుల పాలై మరియొక భాగం ఇతర దేశాలకు తరలి పోయారు. ప్రస్తుతం రాజస్థాన్‌లో ఉన్న వారే క్షత్రియులుగా( రాజపుత్రులుగా) గుర్తించబడినారు. పరదేశములకు పోయినవారే జిప్సీలు. అడవుల పాలైనవారు బంజారాలు. మధ్యకాలంలో చిథోడ్‌ను పాలించిన మహారాణాప్రతాప్‌సింగ్ రాథోడ్‌గారు, అక్బరు పాదుషాతో యుద్ధములు చేసి, చేసి అలసి చనిపోయినారు. వారి వారసులే ఈ బంజారాలు. బంజారాలలో నాల్గు క్షత్రియ వర్ణములు ఉన్నవి. 1) రాథోడ్ వంశము 2) చౌహాన్ వంశము 3) పవార్ వంశము 4) జాదవ్ వంశము ఈ నాల్గు వర్ణములే ప్రపంచములోని క్షత్రియ వర్ణములకు చెందినవారు. అనగా వారి వంశనామముల ద్వారానే వీరు క్షత్రియ జాతి సంతతివారని అర్థమగుచున్నది.

కానీ కాలక్రమమున వారి జీవనాధారం కొరకు వారు వ్యాపార వృత్తిని స్వీకరించటం జరిగింది. అందువలన వీరిని బంజారాలు అంటారు. బంజారా అనగా సంస్కృతంలో వ్యాపారి అని అర్థం చెప్పబడుచున్నది. వీరు ప్రపంచ మొత్తంలో తమ వ్యాపారములను విస్తరింప చేశారు. దీనికి ఉదాహరణ Laman Margas of India అను చిత్రపటం ద్వారా తెలియబడుచున్నది. బంజారాలలో మక్కన్ షా బంజారా, లక్కీషా బంజారా మరియు ఎంతోమంది ఉన్నారు. షా అనగా రాజు అను అర్థం వచ్చుచున్నది. 11వ శతాబ్దములో జరిగిన ఈ మార్పువల్లనే, బంజారాలు తమ మాతృభాష అయిన రాజస్థానీ, గుజరాతీ భాషలనే తమ వ్యాపార రహస్యములను కాపాడుకొనుటకు వక్రంగా మాట్లాడుటవలన, ఈ రోజులలో అది ''గోర్‌బోలి'' అను పేరుతో నిలచి పోయినది. మొత్తం భారతంలోని బంజారాలు, భారతీయ భాషలన్నింటిని నేర్చుకొని, అందరు ఒక చోట కలసిన బంజారా భాషలో మాట్లాడగలరు. దీనివలన భారత జాతీయత వీరి ద్వారానే సాధ్యపడగలదను ధ్రుఢవిశ్వాసం కలదు. 1,000 సంవత్సరములు వెనుకబడిన బంజారాలు స్వయంగా వారు ఎవరోవారికే తెలియటంలేదు. అందువలననే ఒక ఉద్యోగిగా పనిచేస్తూ బంజారా సాంఘిక కార్యకర్తగా, ప్రధాన కార్యదర్శిగా రాష్ట్ర మొత్తము, దేశము

మొత్తం ప్రయాణించి, గ్రహించిన విషయములను జాతి అభివృద్ధికి, దేశాభివృద్ధికి ఉపయోగపడే ఈ గ్రంథము రచించి, ప్రచురించుటకు పూనుకొన్నాను. ఆర్థికంగా ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొన్న నేను, ప్రజల భవిష్యత్తును, దేశ భవిష్యత్తును దృష్టిలో ఉంచుకొని దీనిని ముద్రించుటకు సాహసించుచున్నాను. నా 40 సంవత్సరముల అనుభవము, నాకు జన్మనిచ్చిన ఈ బంజారా సమాజమే నాకు జ్ఞానోదయమును ప్రసాదించినది. ఈ గ్రంథము బంజారాల జాగృతికి, బంజారేతర విద్యావంతులకు మంచి విలువైన విషయములను తెలియపరచి భారత జాతి అభివృద్ధికి దోహద పడగలదని ఆశిస్తాను. ఈ పుస్తకమును, నాకు జన్మనిచ్చిన నా తల్లిదండ్రులకు సమర్పించుకొంటున్నాను. ప్రజలందరు దీనిని అభిమానించగలరని ఆశించుచున్నాను.

పాఠక లోకమునకు నా నమస్కారములు. నేను భాషా పండితుడను కాను. నా కున్న ఈ కొద్ది భాషా జ్ఞానముతో ఈ గ్రంథమును రచించినాను. తప్పులున్న క్షమించగలరు. మీ సహాయ సహకారములను అందించగలరని కోరుతాను. ఈ గ్రంథముపై తమ అభిప్రాయములను సహృదయముతో అందించగలిగిన సంతోషిస్తాను. ఈ గ్రంథములో కొన్ని విషయములు సమయము, సందర్భమును బట్టి వ్రాసిన విషయమే వ్రాయడం జరిగినది. దీనిని గ్రహించవలయును.

ఇట్లు
బి. చీనియానాయక్
గ్రంథకర్త

# సి. లక్ష్మానాయక్‌గారి సందేశము



శ్రీలక్ష్మానాయక్ దంపతులు

శ్రీమాన్ బి. చీనియానాయక్‌గారు, అఖిల భారత బంజారా సేవా సంఘం, ఆంధ్రప్రదేశ్ శాఖ, జనరల్ సెక్రెటరి, అనంతపురం. సంఘం సంస్థలను స్థాపించి, నడిపి ప్రతిభావంతుడైన బంజారా జనుల మనిషి అయినారు. శ్రీయుతులు సర్వజనుల జీవితాలలోని ఒడుదుడుకులను, స్వంతంగా అనుభవించి అనేక కష్టనష్టాలను అనుభవించి, వాటిని సులభముగా పరిష్కరించుతూ వచ్చినారు. వారు నా మిత్రులు మరియు సమకాలికులు, అనుభవమున్న సమాజసేవకుడు. మేమిద్దరం ఆంధ్రప్రదేశ్ వాసులము. నేను ప్రభుత్వ సేవా రంగములో పనిచేసి, ఇప్పుడు పదవి విరమణ గావించాను. శ్రీ చీనియానాయక్ తనదైన రీతిలో వేరువేరు రంగాలలో సమాజ సేవకులుగా, తన, మన, ధనములను ముడుపుగా చెల్లించి పగలనక రాత్రి అనక కష్టపడినారు. బంజారా జనుల శ్రేయస్సు కొరకు పాటుపడినారు.

శ్రీయుతులు సంఘం సేవాభిలాషి కావున కర్నాటకలో ఐదు సంవత్సరాలుగా విజృంభిస్తున్న కన్నడ బంజారా కేసరి వారపత్రిక సభ్యుడిగా ఉండి కన్నడ మరియు తెలుగు భాషా లిపులు చాలా దగ్గర సంబంధం కలిగి ఉండుటవలన ఈ పత్రికను సులభముగా చదువుతున్నారు. శ్రీయుతులు ఈ పత్రిక బంజారా జనులకు సమర్పించి, సామాజిక సాంస్కృతిక, నైతిక మరియు విద్యాధికముగా చేయుటకు ఒక విధమైన స్ఫూర్తిని అలవరచు కొనినారు. ఇదే పత్రికను తెలుగులో ప్రచురించి(ఎడిషన్) మొత్తం ఆంధ్రప్రదేశ్‌లోని బంజారాలకు ప్రచారం గావించుటకుగాను, అనంతపురంనుండి తెలుగులో ముద్రించి(ఎడిషన్) విడుదల చేయుటకు ప్రయత్నాలు జరిపినారు. దీనికి కూడ బంజారా జనుల దైవమైన శ్రీ సేవాభాయవారి ప్రేరణ జరిగి ఉండవచ్చును.

సంఘ సేవను వేరు వేరు రూపాలలో, సంఘ సేవకులు చేయువచ్చును. సాంఘికముగా, అంటే కొందరు చేరి సంఘము స్థాపించుకొని, దాని ద్వారా జనులకు ప్రచారం చేయవచ్చును. అయితే ఇలాంటి సంఘములు దేశము మొత్తము మీద ఎన్నో పుట్టగొడుగులుగా

పుట్టినవే తప్ప సంఘమునకు సరియైన ప్రోత్సాహము ఇవ్వటములో విఫలమైనవి. దీనికి కారణము డబ్బు కొరత ఒకటైతే! ''లోకో భిన్నరుచి'' అనులోకోక్తిని ఇంకొక విధంగా కొందరు. ఎందరో వంటవాళ్లు చేరి ఒక వంటను ఎలా పాడుచేస్తారో అలాగే ఈ సంస్థలను కూడ అదే దారిలో నడిపిస్తున్నారు. అందువలన ఏ ఒక వ్యక్తి, ఇంకొకరి మంచితనమునకు ఆశపడునో అతను, తనదే అయిన రీతిలో సమాజసేవ చేయుటకు ఇచ్ఛకుడై(ఇష్టపడి) ముందుకు వచ్చుట యదార్థము. ఈ దిశలో కనపడే వ్యక్తులలో శ్రీ బి. చీనియానాయక్ ఒక్కరు. ఆర్థికముగా ముందుకు వచ్చినవారు ఎవరైనా ఉన్నా, ఎవరి సహాయం లేనిదే, ఇలాంటి సంఘ సంస్థలు నిరంతరంగా నడుపుతూ పోవుట కష్టసాధ్యము. అలాగే ఈ బంజారా జనులలో డబ్బుకలవారు ఉన్నారు. అయితే వారిలో ధర్మగుణం ఎప్పుడు కలుగుతుందో అప్పుడు మన సమాజ సేవను వ్యక్తిగతంగా, ఒడుదుడుకులు లేకుండ కొనసాగించవచ్చును. దీనికి ఒక మార్గము, ఏమిటంటే ''మనస్సుంటే – మార్గముండును'' అనే భావనే శ్రీ బి. చీనియానాయక్‌గారి ప్రయత్నం. బంజారా జాతి అభివృద్ధికై – బంజారాల చరిత్ర, సంస్కృతి, ప్రగతి అను గ్రంథమును ప్రచురించి, తమ జనులకు సేవ చేయవలయునన్న ఆకాంక్ష ఒక సుభ సంకేతము. ఈ దిశలో వారి యొక్క ప్రయత్నం ఫలిస్తుందని, వారికి నా శుభాకాంక్షలు.

ఈ సందర్భములో నా యొక్క చివరి ప్రార్థన ఏమనగా మన బంజారా జనుల పూర్వ చరిత్ర, సంస్కృతి, సామాజిక మార్పు, బంజారా జనుల నిత్య జీవన విధానములోని మంచి చెడులను మన దృష్టికి, తోటి సమాజం మరియు ప్రభుత్వ దృష్టికి తేగల సాధనమైన ఈ పుస్తకం ఒక దేవుని రథము లాంటిదని భావించి, దీని ద్వారా జనులలోని అజ్ఞాన, అంధకారములను చాలావరకు పోగొట్టేందుకు ప్రయత్నం చేస్తున్నారు. ఈ బంజారా జాతి అను రథమును ఎన్ని కష్టములు వచ్చినా, ఆపకుండా ముందుకు సాగిస్తూ, మొత్తం భారతావనిలోని బంజారా జనుల బాగోగులకు ఒక సాధనముగా ఉపయోగించి, దీనికిగాను అందరి సహకారము, సర్వకాలములలో లభించుగాక అని నా యొక్క ప్రార్థన.

తమ విశ్వాశ పాత్రుడు

సి. లక్ష్మానాయక్

బెంగుళూరు

# కృతజ్ఞతలు

*''బంజారా! భాయీ! నగా! రాం రాం! సాణలో, పచారేలాక్, ఆన్‌పచారేనవాలాక్!''*

ఈ గ్రంథ రచనకు నన్ను తొలుత ప్రోత్సహించిన ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానంద, శ్రీ కృష్ణదేవరాయ యూనివర్సిటి, అనంతపురం వారికి, వారి ధర్మపత్నికి, పిల్లలకు నా హృదయ పూర్వక ధన్యవాదములు. శ్రీ లలిత కవికోకిల విద్వాన్ తలమర్ల కళానిధిగారికి నా పాదాభి వందనములు. 83 సంవత్సరములు పైబడిన వయస్సు కలిగి కూడ ఎంతో ఓపికతో నా ఈ గ్రంథమును చదివి తప్పులు దిద్దగలిగారు.

ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు నాకు శ్రీలక్ష్మి ప్రోసెస్ ప్రెస్సులో పరిచయమైనారు. నేను వ్రాసిన ''బంజారా చరిత్ర (సంస్కృతి-ప్రగతి)'' అను గ్రంథము పై తమ యొక్క సమీక్షను తెల్పవలసినదిగా నేను కోరిన వెంటనే వారు స్పందించి ''వీరగల్లు'' పేరుతో తమ అమూల్యాభిప్రాయమును తెలిపిన ప్రసిద్ధ జానపద సాహిత్య విద్వాంసులు. ముఖ్యముగా వీరగాథలపై విశేష పరిశ్రమ చేసిన ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు (బెంగుళూరు విశ్వవిద్యాలయం, బెంగుళూరు) గారికి నా హృదయ పూర్వక ధన్యవాదములు.

ఈ పుస్తకాన్ని రాయటానికి వెనుక దాదాపు 40సంవత్సరముల కృషి ఉంది. నాకు ప్రప్రథమముగా విద్యాదానము చేసిన కీ.శే.శ్రీ లక్ష్మయ్య పంతులుగారు, కీ.శే. శ్రీ వి. ఏబుల్‌గార్కి మరియు వారి కుటుంబాలకు నా నమస్సుమాంజలులు. నాకు సాంకేతిక విద్యను ప్రసాదించిన నా గురువులు కీ.శే శ్రీ అనంతరామన్‌గారు, వారి కుటుంబ సభ్యులకు నా నమస్సుమాంజలులు.

నా హైస్కూలు విద్య అభ్యసించు కాలములో నాకు తన ఇంటిలో ఆశ్రయమిచ్చి నన్ను ప్రేమతో ఆప్యాయతతో చూచిన కీ.శే. శ్రీ ఎమ్.లక్ష్మానాయక్ (లోకల్‌ఫండ్ ఆడిటర్) వారి ఇద్దరి భార్యలకు నా నమస్కారములు. వారి పిల్లలకు నా ఆశీర్వాదములు. నేను సాంకేతిక విద్య అభ్యసించు కాలములో తన సొంత సోదరునిగా భావించి నన్ను ఆదరించిన మా అక్క కీ.శే. శ్రీమతి తులసిబాయి, బావ కృష్ణానాయక్‌గార్లకు నానమస్కారములు. వారి పిల్లలకు నా ఆశీర్వాదములు. నా ఉద్యమాలలో, సేవా కార్యక్రమాలలోను నాకు వ్యాసములు వ్రాయుటకు, పత్రిక ప్రకటనలు ఇచ్చుటకు సహకరించిన కీ.శే. శ్రీ మారుతిరావుగారు, శ్రీశైలం; శ్రీ గుంటూరు వెంకటశాస్త్రిగారు, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా; శ్రీ రామ క్రిష్ణ ,విశాలాంధ్ర; శ్రీ నవ్వుల రామారావు, (ఆంధ్రపత్రిక); శ్రీ యాధాని కాశీపతి (ఆంధ్రప్రభ) నా వ్యాసములను, ప్రకటనలను ప్రచురించిన ఎడిటర్లు విశాలాంధ్ర దినపత్రిక, ఆంధ్రవారపత్రిక, జాగృతి వారపత్రిక, సౌజన్య వారపత్రికలకు, కీ.శే. శ్రీ రెవరెండ్ దైవాధీనం (అనంతపురం); కీ.శే. శ్రీ ఎమ్. ఎల్. ఎన్. ఆచారి, (ఎ.జి. ఆఫీసు, శ్రీశైలం);శ్రీ మూర్తిగారు, (స్టెనో, ఎ.జి. ఆఫీసు, శ్రీశైలం ప్రాజెక్టు); శ్రీ పిళ్లైగారు, శ్రీ రాయుడుగారు, శ్రీ యం. మంతృనాయక్ హెల్పర్, శ్రీ యం.స్వామి నాయక్, (ఎజి.ఆఫీస్); శ్రీ స్వామినాయక్ (శ్రీశైలం దేవస్థానం),కీ.శే. శ్రీ బి. కోటియానాయక్, ఫారెస్ట్‌గార్డ్ రామకృష్ణానాయక్, శ్రీ సక్రునాయక్‌గార్లకు నా కృతజ్ఞతలు.

కన్నడంనుండి తెలుగులో అనువదించుటకు సహకరించిన నా మిత్రుడు అయ్యన్నగార్కి నా ధన్యవాదములు. ఉద్యోగరీత్యా నన్ను నా పనిని, అర్హతను గుర్తించిన శ్రీ మొహినుద్దీన్ ప్రిన్సిపాల్ (ఐ.టి.ఐ., అనంతపురం); శ్రీ పి. సత్యనారాయణ, ప్రిన్సిపాల్ శ్రీశైలం ఐ.టి.ఐ. వారికి నా హృదయ పూర్వక అభినందనములు.

బంజారా జాతి గర్వించగల ఏకైక నాయకుడు శ్రీ వి.పి.నాయక్‌గార్కి నేను జన్మ జన్మలుగా ఋణపడి ఉన్నాను. వారి ఆశీర్వాదమే నాకు శిరోధార్యం. ముఖ్యంగా ఈ పుస్తకరచనకు కావలసినంత విషయములను అందించిన బంజారా హింది, రోమా బంజారా, హింది, ఇంగ్లీషు ఎడిటర్ శ్రీ రంజిత్‌నాయక్ వారి శ్రీమతి చంద్రకళగార్లకు నా హృదయ పూర్వక నమస్కారములు. సంఘసేవలో అన్ని విధములుగా సహకరించిన శ్రీ వి. గోపాలరావునాయక్, వారి సతీమణి శ్రీమతి లక్ష్మీబాయి, వారి పిల్లలందరికి నా కృతజ్ఞతలు. సంఘ పనులతో కలసి మెలసి పని చేసిన శ్రీ బి. రామానాయక్,(పుంగనూరు); శ్రీ యన్. భీమానాయక్, శ్రీ బి. రామాకృష్ణ నాయక్, (గుంటూరు); శ్రీ బి.కె.సత్యం, (పుంగనూరు). వీరు బ్రాహ్మణ కులస్తులైనను, తను ఎన్నడును బ్రాహ్మణుడునని గుర్తు వచ్చునట్లు చేయలేదు. తను ఒక బంజారాగా భావించి, బంజారా సమాజమునకు, స్వయం బంజారాలు చేయలేనంత సేవను చేసారు. వారికి వారి కుటుంబమునకు బంజారా జాతి ఎంతగానో ఋణపడి ఉన్నది. శ్రీ మెగ్యానాయక్ చౌహాన్, (వరంగల్); శ్రీ మేఘనాథ్ చౌహాన్,(జడ్చర్ల) గార్లకు నా కృతజ్ఞతలు. నా ఆర్థిక ఇబ్బందులను తొలగించుటకు సహకరించిన నా మిత్రులు శ్రీ ఎ.ఎల్.విఠల్‌రావు, శ్రీ సి.కె.రామచంద్రరెడ్డి మరియు శ్రీ కీ.శే.మాణిక్యంశెట్టిగారికి నాప్రత్యేక అభినందనలు. శ్రీ హెచ్.సి. శరీన్, (ఆంధ్రప్రదేశ్ గవర్నర్ సలహాదారు); శ్రీ మెహతా, (స్పెషల్ ఆఫీసరు, ఆంధ్రప్రదేశ్); శ్రీ జలగం వెంగళరావు, (రాష్ట్ర మాజీముఖ్యమంత్రి); శ్రీ హయగ్రీవాచారి, (రాష్ట్ర మాజి పంచాయితి రాజ్ శాఖ మంత్రి వర్యులు); శ్రీ యం.వి.యస్. ప్రసాదరావు, ఐ.ఏ.యస్. (పంచాయతి రాజ్ సెక్రటరీ); శ్రీ యస్.ఆర్. శంకరన్, ఐ.ఏ.యస్ (రాష్ట్ర గిరిజన (ట్రైబల్) శాఖ సెక్రటరి) గార్లలకు నా ప్రత్యేక ధన్యవాదములు. శ్రీ వి.సి.బి.నాయక్, యం.ఆర్.నాయక్, ఎల్ రూప్లానాయక్, బి.దూదియానాయక్ గార్లకు నా ధన్యవాదములు. శ్రీ జి. అమర్‌సింగ్ రాథోడ్, (ఎం.ఎల్.సి.); కీ.శే.శ్రీ శివరామ్ జ్యాదవ్, దీపలాల్ చౌహాన్, కీ.శే. శ్రీ జి. స్వామినాయక్, (ఎం.పి., ఎర్రగడ్డ తాండా, హైదరాబాదు); కీ.శే. శ్రీ నర్సింగ్ నాయక్, ఎం.ఎల్ సి, ఎం.పి(టిడిపి); శ్రీ కిషన్‌సింగ్, (ఎక్స్ ఎం.ఎల్.ఏ); శ్రీ బద్దు చౌహాన్ (ఎం.ఎల్.ఏ.,సి.పి.మ్); శ్రీ గోవిందనాయక్,(ఎం.ఎల్.ఏ, టి.డి.పి); శ్రీ రెడ్యానాయక్, (ఎం.ఎల్.ఏ., కాంగ్రెస్(ఐ); శ్రీ ఎ. చందూలాల్, (ఎం.పి., టిడిపి); కీ.శే. శ్రీ అంబాజీనాయక్, (ఎక్స్ ఎం.ఎల్.ఏ); శ్రీ జగన్ నాయక్, (మాజీమంత్రి); కీ.శే. శ్రీ కేశవ్ నాయక్,(మాజి ఎం.ఎల్.ఎ, మాచర్ల); శ్రీ వి. గోపాల్ నాయక్, (మాజి ఎం.ఎల్.ఎ, కదిరి పడమట); శ్రీమతి బి.టి. లలితా నాయక్,(మాజిమంత్రి కర్ణాటక రాష్ట్రం); శ్రీ బాబురావ్ చౌహాన్, (ఎక్స్ ఎం.ఎల్., కర్ణాటక) వీరికి నా అభివందనములు. నా మహారాష్ట్ర టూర్‌నందు సహకరించిన శ్రీ సి.ఆర్.చౌహాన్ (గురుజీ) వారి సంఘ సభ్యులు (నెహ్రూనగర్, షోలాపూర్); శ్రీ పి. కడమేనాయక్, శ్రీ మోహన్ పవార్‌గారు, శ్రీ లోహిదాస్ రాథోడ్, (బొంబాయి); శ్రీ బి. మోతిలాల్‌నాయక్‌గారు,(హైకోర్టు జస్టిస్, ఎ.పి.); శ్రీ ప్రేమ్‌సింగ్ అసరాం జాదవ్‌గారు వారి

సంఘ సభ్యులు, (ధులియా, మహారాష్ట్రము); శ్రీ ఆత్మారామ్ అమర్‌సింగ్ రాఠోడ్, (అకోలా); శ్రీ పి. ఆర్. ఆడే, శ్రీ సుధాకరరావునాయక్ (మాజి గవర్నర్, మాజి ముఖ్యమంత్రి); శ్రీ భోపిదాస్ రాఠోడ్, శ్రీ చరణసింగ్ ఆడే వీరందరికి కుటుంబ సమేతంగా నా ధన్యవాదములు. జగద్గురు శ్రీ రామారావ్ మహారాజ్, సేవాభాయా దేవస్థాన స్థాపకులు, పొహరాదేవి, వీరి పాదపద్మములకు నా శిరస్సు వంచి నమస్కరించుచున్నాను. దేవస్థానం పూజారి, శివరామ్ మహారాజ్‌గారు, శ్రీ కాశీనాథ్ బాబాసంఘ సభ్యులకు నా నమస్సుమాంజలులు. బాబా సాహెబ్ నాయక్‌జీ, శ్రీ మూడే గురుజీ, శ్రీ బాణావత్‌జీ, శ్రీ వసరాం పటేల్, శ్రీ హర్జి విస్రామ్ పటేల్, శ్రీ కె. డి. జ్యాదవ్ మరియు గౌలి సభకు విచ్చేసిన పెద్దలందరికి నా నమస్కారములు. నాందేడ్ బంజారా సంఘ సభ్యులకు నా నమస్కారములు, భోజాజీ రామారావు రాఠోడ్ పరభాని వారి కుటుంబ సభ్యులకు నా నమస్కారములు.

శ్రీ రాజారామ్ రాఠోడ్ ఔరంగాబాద్, వారు నేను పోయిన వెంటనే ఔరంగబాద్‌లో పనిచేయుచున్న అధికారులను, సంఘ సభ్యులను సమావేశపరచి నన్ను గౌరవించారు. వారందరికి నా ధన్యవాదములు, కీ.శే. శ్రీ కె. టి. రాఠోడ్‌గారు, (కర్ణాటక మాజీ మంత్రివర్యులు); వారి సంఘ సేవలో పనిచేయుచున్న ఎల్. ఎల్ రాఠోడ్‌గారు, వారి సంఘ సభ్యులకు నా ధన్యవాదములు. హెచ్. హనుమేష్‌నాయక్ (ధార్వాడ్), చిత్రదుర్గ సంఘ కార్యకర్తలకు ఎస్. టిగ్యానాయక్‌గార్లకు నా నమస్కారములు, వి. రామస్వామి నాయక్, సి. లక్ష్మానాయక్‌వారి కుటుంబ సభ్యులకు (బెంగుళూరు), శ్రీ భుక్యాబాలాజీ దాస్ రాఠోడ్, బన్సిలాల్, భీక్కు; భగవాన్ దాస్ రాఠోడ్, నారాయణ్‌సింగ్ నాయక్, ఖమ్మం జిల్లా, శ్రీ డి. లచ్చిరాం నాయక్, వరంగల్ జిల్లా, భట్టు పంతులు, ప్రేమసింగ్ జాదవ్ (హిందీ పండిట్, బిబీనగర్) నల్లగొండ జిల్లా వారికి నా ధన్యవాదములు.

నేను పి. డబ్ల్యూ. డి. లో పనిచేసిన కాలంలోనాకు సహకరించిన చిరంజీవి రావ్ (ఇంజినీరు); శ్రీ కె. వి. శివారెడ్డి, (సూపరెండెంట్ ఇంజినీరు); శ్రీ హఫీజ్‌గారు, (ఇంజనీరు); నాతో పనిచేసిన రాజు, హఫిజ్ గార్లకు నా నమస్కారములు.

నేను చేసిన సంఘ కార్యక్రమములలో ప్రభుత్వ అధికారులుగా నాకు సహకరించిన, శ్రీ ఎల్. నారాయణ రెడ్డి, (డి. ఎల్. సి. ఓ); శ్రీ నారాయణ, (సి. యస్. ఆర్.); శ్రీ ఆదిశేషయ్య, (ఇ. ఓ. కోఆపరేటివ్); కీ. శే. శ్రీ గోవిందప్ప, (సి. యస్. ఆర్.); కీ. శే. శ్రీ కోనయ్య, (ఇ. ఓ. కోఆపరేటివ్); శ్రీ అరోరా, ఐ. ఏ. యస్., (జిల్లా కలెక్టరు); శ్రీ కె. యస్ అగర్వాల్, ఐ. ఎ. యస్., (సబ్-కలెక్టరు); శ్రీ కె. యస్ శర్మ, ఐ. ఏ. యస్., (జిల్లా కలెక్టరు); శ్రీ ఎల్ సుబ్బయ్య, ఐ. ఎ. యస్., (జిల్లా కలెక్టరు); శ్రీ వై. సి. తిమ్మారెడ్డి, (జిల్లా పరిషత్ ఛైర్మెన్); శ్రీ అంజనప్ప, (సమితి ప్రెసిడెంటు); శ్రీ నర్సిరెడ్డి, (సమితి ప్రెసిడెంట్) గార్లకు నా ధన్యవాదములు. నారసింహపల్లి తాండా సమిష్టి వ్యవసాయ సహకార సంఘము పనులు చేపట్టుటకు ముఖ్య కారకులైన పేదలపాలిటి పెన్నిధిగా పేరుగాంచిన భారత జాతి గర్వించగల ఏకైక నాయకురాలు భారతరత్న కీ. శే. లు శ్రీమతి ఇందిరాగాంధి మన ప్రియతమ ప్రధానమంత్రిగార్కి నా తాండా ప్రజల తరపున మా ధన్యవాదములు. మేము వారికి తరతరాలుగా ఋణపడి ఉంటాము.

నేను స్థాపించిన సమిష్టి వ్యవసాయ సంఘమునకు, షేరు డిపాజిట్ కట్టుటకు 500 రూపాయలు ఇచ్చి సహకరించిన నా మేనమామ శ్రీ భుక్యా గోర్ల సామేనాయక్, వారి అన్న

నాణేనాయక్, తమ్ముడు శ్రీ రామస్వామినాయక్ (అడవి బ్రాహ్మణపల్లి తాండా) వారికి నా హృదయ పూర్వక ధన్యవాదములు.

శ్రీమతి జానకమ్మగారు బి.డి.ఓ. (పెనుకొండ). శ్రీ సుబ్బన్న (సహాయ సంచాలకులు, పశుసంవర్ధన శాఖ, పెనుకొండ), శ్రీ రవిశంకర రెడ్డి (రెవిన్యు ఇన్స్‌పెక్టరు) మరియు జిల్లా కలెక్టరువారి క్యాంపు క్లర్కుగా వున్న టైములో నా యొక్క సేవాతత్పరతను జిల్లా కలెక్టరు, శ్రీ కె.యస్.శర్మగారికి తెల్పి వారి సహాకారంతో అనంతపురం జిల్లాలో బంజారాల అభివృద్ధికి ఎన్నో విలువైన పనులు చేయించారు. ఒక్కమాటలో చెప్పవలెనంటే 3 నెలల కాలంలో సుమారు 40 లక్షల ధనమును బంజారాల అభివృద్ధికి ఖర్చు చేయించారు. వారి సహాకారాంతోనే నాయక్‌నగర్, గిరిజన కార్పొరేషన్, అనంతపురంలో మూడు హాస్టళ్ళ స్థాపన, విద్యార్థులకు పుస్తకములు, స్కాలర్‌షిప్పులు, తాండానుండి జిల్లా లెవల్‌వరకు, జిల్లా మొత్తంలో పాడిపశువుల పంపకం మొదలైన ఎన్నో అంశాలు. ఆనాటినుండియే అనంతపురం జిల్లాలో అభివృద్ధి కార్యక్రమములు చేపట్టడం జరిగినది. ఆ తరువాత ప్రత్యేక జిల్లా గిరిజన శాఖను స్థాపించటం జరిగినది. వీటన్నిటికి ప్రేరణ శ్రీ రవిశంకరరెడ్డిగారే. వారి కుటుంబ సభ్యులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. అనంతపురంలో నాయక్‌నగర్ ఇండ్ల స్థలాలు సేకరణ చేయుటలో సహకరించిన శ్రీ మల్లయ్య,(డెప్యూటి తాహసిల్దర్ ల్యాండ్ ఎక్విజేషన్) గారికి నా ప్రత్యేక అభినందనములు. శ్రీ సి.యస్.కళ్యాణనాయక్ గారి ప్రోత్సాహముతో బంజారా కేసరి తెలుగు వారపత్రికను అనంతపురంనుంచి నడిపించవలయునను ఉత్సాహముతో ముందుకు వచ్చినప్పుడు నన్ను ప్రోత్సహించిన శ్రీ హెచ్. తారనాథ పవార్, యస్.ఖీరానాయక్, యన్.కృష్ణానాయక్, బి.లక్ష్మిబాయి రూప్లానాయక్, సి. లక్ష్మానాయక్, వై.రూప్లానాయక్, (ఐ.ఏ.ఎస్.); కీ.శే. డాక్టర్. ఆర్. లాల్యానాయక్, డాక్టర్. ఆర్. గంగాధరనాయక్, ప్రకాష్ రాఠోడ్, డాక్టర్ వి.జి.జ్యాదవ్, వి.సి.బి.నాయక్,(బెంగుళూరు); శ్రీమతి చంద్రిబాయి లక్ష్మానాయక్, శ్రీ ఠాకూర్‌నాయక్, శ్రీమతి లక్ష్మి శౌరి, డాక్టర్ ఆర్.నారాయణ్‌నాయక్, పి.ఎల్.రవీంద్రనాయక్,(సి.ఐ.); శ్రీ ఎల్.రామానాయక్, యం.పోమియానాయక్ (అనంతపురం); శ్రీ పి. రంజిత్‌నాయక్, శ్రీ టి.కె.నాయక్,(ముంబాయి); శ్రీ యం.ఆర్. నాయక్, శ్రీ పి.జగన్‌నాయక్,(ఎక్స్. మినిష్టర్); ఆర్.భాస్కరనాయక్,(హైద్రాబాదు); బి.బాలాజి,(కోదాడ); శ్రీ యం.భావసింగ్‌నాయక్,(భువనేశ్వర్); జి.రుద్రానాయక్, (మంగుళూరు); కె.యస్. శంకర్‌నాయక్,(రైల్వే డ్రైవర్); డాక్టర్ ఇందిరానాయక్, (షిమోగ); బి.జయరాంనాయక్, ఎస్.శ్రీరామమూర్తి,(బి.హెచ్.వి.పి., విశాఖపట్నం); ఆర్.రామచంద్ర నాయక్, (కేరళ); జె.శ్యామసుందర్‌నాయక్,(యన్.టి.పి.సి., కరీంనగర్); డాక్టర్ ఆర్.విజయకుమార్,(గోవా); ఆర్. లాలూనాయక్,(తెనాలి); వి.రవీనాయక్, (నంద్యాల); శ్రీ కె.పి.కృష్ణానాయక్,(నారశింహపల్లి తాండా); ఒక అజ్ఞాతవ్యక్తి వీరందరికి నా హృదయ పూర్వక ధన్యవాదములు.

వీరందరి ద్వారా వసూలైన మొత్తం సుమారు 20,000రూ.లు. కాని ఖర్చు అయిన మొత్తం సుమారు 35వేలు. బంజారా కేసరి స్థాపనకు నేను చేసిన శారీరక శ్రమతో పాటు, ఆర్థికంగా కూడ 15వేలు రూపాయలు వృధా అయినది. కాని అదే ప్రేరణతో ఈ బంజారా చరిత్రను వ్రాయగలిగాను. ఈ గ్రంథము బంజారా చరిత్రలో భారతదేశములోనే ప్రథమ

గ్రంథము కావచ్చునని నా భావన. ఎందుకనగా ఈ గ్రంథములో బంజారాల చరిత్ర, సంస్కృతి, ప్రగతి, పెద్దల జీవిత చరిత్ర అన్నియు మిళితమై ఉన్నవి. ఈ గ్రంథము బంజారా సోదరులకు ఒక గైడుగా ఉపయోగ పడవచ్చును. ఆ దృష్టితోనే ఈ గ్రంథమును రచించడం జరిగినది. నా యొక్క వ్రాత ప్రతులను తెలుగు టైపింగ్ చేసి నాకు ఎంతో సహకరించిన ఇ.నాగార్జున (టైప్‌రైటింగ్ ఇన్‌స్టిట్యూట్, అనంతపురం) వారికి నా హృదయపూర్వక నమస్కారములు. నాకు అన్ని రకముల సహకారమందించిన సోదర వర్గమునకు, నా తాండా ప్రజలకు, మాచిన్నాయనగార్లు బి. రామస్వామి నాయక్, కీ.శే. బి. బోడియా నాయక్, బి. రంజిత్ నాయక్, నా సోదరులు కీ.శే. బి. థావురియా నాయక్, బి. ఠాకరియా నాయక్, వారి కుమారులు బి. వాసుదేవ్ నాయక్, మొత్తం కుటుంబసభ్యులకు, నా సోదర, బంధు వర్గమునకు నా ధన్యవాదములు. వి. ఠాకుర్ నాయక్,(సిద్ధాపురం తాండా); శ్రీ ఠాకర్‌నాయక్,(బళ్ళారి); టి.అర్జున్‌నాయక్, ఎస్.కె. రామచంద్రనాయక్, ఆర్.ఎస్.శంకర్‌లాల్ నాయక్, బి. రామా నాయక్,(ఎక్స్ సమితి ప్రెసిడెంట్); డి. నారాయణ నాయక్ మరియు కీ.శే. ఆర్.కుల్లాయి నాయక్,(మండల ప్రెసిడెంట్) గార్లకు నా ధన్యవాదములు.

తన్నుతాను, నన్ను గురువుగా ప్రకటించుకొన్న శ్రీ బి. కృష్ణానాయక్ ఎం.ఎ. (కర్నూల్) వారికి నా ఆశీర్వాదములు. నా కృషిలో సదా నాకు సహకరించిన నా శ్రీమతి చి. సౌ. బి. లక్ష్మిబాయికి, నా కుమార్తెలు డాక్టర్ బి.పద్మాబాయి, ఇందిరాబాయి, భ్రమరాంబా మల్లీశ్వరి బాయిలకు, నా కుమారుడు బాలాజి హరినాథ్ రాఠోడ్, నా అల్లుళ్ళు డాక్టర్ కె.శివశంకర్ నాయక్, డాక్టర్ వి.ఆర్.వి. సురేంద్రనాథనాయక్, శ్రీ సి.కె.అశోకనాయక్‌గార్లకు, నా మనవుడు చిరంజీవి కె. అనురాగ్ రాఠోడ్(మింటు)కు నా ఆశీర్వాదములు. మరియు శుభాకాంక్షలు.

గత 20 సం.లుగా బంజారా భాషామాండలీకాల కోసం భారత దేశములో భిన్న రాష్ట్రాలు పర్యటించి, ఆచార్య హెచ్.యస్. బ్రహ్మానందగారు, ''గోర్‌బోలి ఇన్ ఇండియా'' అనే 500 పుటల రిపోర్టును యు.జి.సి.కి పంపారు. ఆ రిపోర్టులోని బంజారా భాషా వ్యాకరణానికి, తెలుగు అనువాదాన్ని, డా. యం.గోనానాయక్‌గారి సుగాలీ సంస్కృతి భాషా సాహిత్యం అనే గ్రంథం (1993) నుండి గ్రహించాను. వీరికి ధన్యవాదములు.

నా ఈ పుస్తకమును, ముద్రణచేయుటకు సహకరించిన శ్రీ ఎస్. సుబ్రహ్మణ్య కుమార్‌గారు, వీరు పశ్చిమగోదావరి జిల్లా వాసులు, స్వచ్ఛమైన తెలుగుభాషను తెలిసినవారు. వారు ఈ పుస్తకమును క్షుణ్ణంగా పరిశీలించి, వాక్యములను సరిదిద్ది, ఒకటికి రెండుసార్లు స్వయంగా తప్పులను దిద్ది, ఈ పుస్తకమును ముద్రించగలిగారు. ఈ పుస్తక ముద్రణలో వారు తీసుకున్నటువంటి జాగ్రత్తకు నా ధన్యవాదములు. ఈ పుస్తక ముద్రణలో సహకరించిన వారి ముద్రణాలయంలో పనిచేయుచున్న సాంకేతిక నిపుణులకు, వారి కుటుంబ సభ్యులకు నా హృదయ పూర్వక ధన్యవాదములు. వారి ముద్రణాలయము దిన దినాభివృద్ధి చెందవలెనని భగవంతుని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

అనంతపురం

బి.చీనియానాయక్

రచయిత

# సృష్టి క్రమం

భగవంతుడు మొదట సృష్టినంతా సృష్టించి, ఆ తరువాత మానవుని సృష్టించినాడు. అనగా నీ కన్న ముందు నీకు కావలసిన సౌకర్యములను కల్పించినాడు. ఆ తరువాతనే నిన్ను పుట్టించినాడు. కావున నీ శక్తి సామర్ధ్యములను ఉపయోగించి సుఖపడు అన్నాడు. దీనిని బట్టి వారి వారి కష్టసుఖాలు, వారి తెలివితేటలపై ఆధారపడి తనకు కావలసిన సుఖం, సౌఖ్యములను, కష్టసుఖాలను అనుభవించు అని అన్నాడు.

ఆ మాటకు వస్తే ప్రపంచంలోని జనాభా అంత కూడ ఒకనాడు ఒక స్త్రీ పురుషుల సంతానమే. కాలక్రమేణ వారు అభివృద్ధి చెందుచూ, జనసంఖ్య పెరిగే కొద్ది గుంపులు గుంపులుగా విడిపోయి, వారి వారి అనుకూలమును బట్టి, ప్రదేశములను బట్టి, వారి గుంపు సంఖ్యా బలమును బట్టి ఒకరి రహస్యములు మరి ఒకరు తెలుసుకొనుటకు వీలుకాని విధముగా భాషను మార్పు చేస్తూ మొత్తం ప్రపంచంలో వ్యాప్తి చెందియున్నారు. వాతావరణములను బట్టి వారి రంగులు, రుచులు మారినవి. ఉదాహరణకు ఎక్కువ చలిప్రాంతములో నివసించువారు తెల్లగాను, సమశీతోష్ణములో నివసించువారు తెల్లని గోధుమ వర్ణములోను, కొంత వేడి ప్రదేశములో నివసించువారు ఛామన ఛాయ రంగులోను, భూమధ్య రేఖకు దగ్గరలోను, భూమధ్య రేఖ మధ్యలో నివసించువారు ఒక విధమైన నలుపు లేదా పూర్తిగా నల్లగాయుందురు. ఎక్కువ చలిప్రదేశములో నివసించువారు తెల్లగా ఉంటారు. మధ్య ఆసియాలో నివసించువారు గోధుమ రంగులోను, దక్షిణ పశ్చిమ ఆసియాలో నివసించువారు మధ్యస్థ రంగులోను, దక్షిణ భారతం శ్రీలంక వాసులు కొంత నలుపు రంగులోను, దక్షిణాఫ్రికా, దక్షిణ అమెరికాలలో నివసించువారు పూర్తిగా నలుపు రంగులోను ఉండుట గమనించదగిన విషయం. అదే ఉత్తర ఆసియా ఖండము, యూరప్ ఖండము, ఉత్తర అమెరికా ఖండవాసులు పూర్తిగా తెలుపు రంగులో ఉండటం గమనించదగిన విషయం. ప్రాంతము, వాతావరణం, సారవంతమైన ప్రదేశములు, జీవనదులు ప్రవహించి, సహజ సంపదలు ఎక్కువగా యున్న ప్రాంతములు, అక్కడ నివసించు ప్రజల హావభావములు, శక్తి సామర్థ్యములు, నిజాయితి, కష్టించి పనిచేసే గుణముల ఆధారంగా ప్రపంచ దేశాలు, ప్రజలు అభివృద్ధి చెంది యున్నారు.

కాని ఇప్పుడున్న ప్రజలు, వారి భాషలు, వారి సంపదలు, కులాలు, మతాలు దేవుడు పుట్టించినవి కావు. ఇవి అన్నియు మానవుడి మేధస్సు పెరిగే కొద్ది, వారి నిజాయితి, వారివారి స్వార్థబుద్ధులను బట్టి ఇప్పటి ప్రపంచములో ఇంత మార్పు వచ్చినది. ప్రతివారు వారి వారి తెలివితేటలను బట్టి, వారు ఆలోచించే విధానాలనుబట్టి వాటిని ఎంచుకొన్నారు.

ఇప్పుడు ఉన్నట్లుగా భగవంతుడు భారతీయులని, చైనీయులని, రష్యన్లుఅని, యురోపియన్లు అని, ఆంగ్లేయులని, అమెరికనన్లి, ఆఫ్రికన్లని, ఆస్ట్రేలియన్లని, జపానీయులని, వేరువేరుగా పుట్టించి పంపలేదు. అలాగే హిందువులు, మహమ్మదీయులు, జైనులు, బౌద్ధులు, క్రైస్తవులు అని పుట్టించి పంపలేదు.

అదే విధంగా బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, నిమ్న జాతివారు అని పుట్టించనూలేదు. మానవుని మనుగడ పెరిగే కొద్ది వారి వారి మనుగడకు ( అవసరములకు)

సరియైన వసతి సౌకర్యములకు, సుఖజీవనమును అభివృద్ధి పరుచుటకు మానవులు చేసుకొన్న ఏర్పాట్లు.

మన పురాణలలో చెప్పినట్లుగా భగవంతుడు మానవుని పుట్టించే ముందే, మానవునికి కావలసిన వసతులను మొత్తం సృష్టించి తరువాత మానవుని పుట్టించాడని ముందే విన్నవించుకున్నాను.

మానవుడు కూడా ఈ సృష్టిలో ఒక భాగమే. చెట్లు చేమలు, నదులు, జంతువులు, పక్షులు, వనచరములు మొదలైనవన్నీ ఎలాగో మానవుడు అలాగే. అలాగే పంచ భూతములు. ఒకరి అదుపు ఆజ్ఞలలో లేనివి. భూమి, ఆకాశం, గాలి, నీరు, అగ్ని. ఈ ఐదును లేనిదే ఈ సృష్టిలేదు. చెట్లు చేమలు లేవు. జంతు, జలచరాలు, పక్షులు, మానవులు లేవు. కావున సృష్టి అంతయు ఈ పంచభూతములపై ఆధారపడియున్నదని గ్రహించవలెయును.

ఈ పంచభూతములను ఆధారం చేసుకొని మానవుడు తన యొక్క మనుగడను రకరకాలుగా రూపొందించుకొనుచున్నాడు. సుఖ సౌఖ్యములు, భోగభాగ్యాలను అనుభవించు చున్నాడు. తమకు కావలసిన భూములను, నీటిని ఆధారంగా చేసుకొని దానికి అనుకూలమైన ఆకాశం మార్గం, గాలిని, అగ్నిని తన అదుపు ఆజ్ఞలలో ఉంచుకొని సుఖమును అనుభవించు చున్నాడు.

సారవంతమైన భూమి, నీటి వసతియున్న ప్రాంతము నందలి గాలిని, ఆకాశమును, అగ్నిని తనకు అనుకూలంగా ఉండునట్లు చేసుకొన్నారు. భూమి, నీటి ద్వారా లభించిన సంపదతో గాలిని బంధించి ఏర్ కండిషన్స్ ఏర్పాటు చేసుకొని సుఖమును అనుభవిస్తున్నారు. చలి ప్రాంతములలో ఉన్నవారు అగ్నిని బంధించి, వెచ్చదనం కలిగించుకొని ఆనందించుచున్నారు. అగ్ని అనగా ఇంధనం (ఖనిజ సంపద). ఇక ఆకాశం, భూమి ఎంత విస్తరించి యున్నదో ఆ పై భాగములోయున్న ఆకాశ మార్గం నాది అంటున్నారు. వారి ప్రాంతములను ఉల్లఘించిన వారి మీద కఠిన చర్యలు తీసుకొని, ఆకాశంను కూడ వారి అదుపు ఆజ్ఞలలో ఉంచుకొంటున్నారు. ఈ విధంగా భగవంతుడు సృష్టించిన ఈ సృష్టిపై మానవుడు ఇంత అభివృద్ధిని చెందియున్నాడు. కాని స్వార్థ పూరితమైన మతాలు, కులాలు మాత్రం మానవునిలో ఇంకనూ పోలేదు. వారివారి అనుకూలములను బట్టి కులాలు, మతాలు, పుట్టినవి కాని, నవీన ప్రపంచంలో మానవుడు తన పెత్తనమును సాగించుటకుగాను పార్టీలను కూడ పుట్టించుకున్నాడు. ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క విధంగా ఎన్నో రకాల పార్టీలను ప్రపంచం మొత్తంమీద సృష్టించి దేశాలను ఏలుతూ ప్రజలపై తమ అదుపు ఆజ్ఞలను ప్రసరింపచేస్తున్నారు. ఈ విధంగా రోజురోజుకు తరాలు మారే కొద్ది, కాలం గడిచేకొద్ది ప్రజలలో, ప్రపంచంలో, వాతావరణములో ఎన్నో రకాల మార్పులు వస్తున్నవి. ఇవిఅన్నియు ఒక్క మానవుని మేధస్సు వల్లనే జరుగుచున్నది. ఈ విషయం ప్రపంచంలోని ప్రజలు గ్రహించిననాడు వారు వారి అభివృద్ధికి ఏఏ పద్ధతులను అవలంభించ వలయునో అని తలంచిననాడు తను స్వయంగా అభివృద్ధి చెందుటకు ఉపక్రమిస్తారు. కాని ఈ తెలివి తేటలు ప్రపంచ జ్ఞానము రావలయునన్న అజ్ఞానమును తొలగించి జ్ఞానమును సంపాదించ గల విద్య చాల ముఖ్యము. అందుకే పెద్దలన్నారు ''విద్యలేనివాడు వింత పశువు'' అని. నిజంగా విద్య లేనివాడు వింత పశువుగా ప్రవర్తించు చున్నాడు. ఇప్పటికీ గ్రామాలలోని పెద్దలు చాలా మంది ప్రస్తుత నవీన ప్రపంచంలోని విషయములను అర్థం చేసుకొనలేకపోతున్నారు.

ఒక రేడియో చూచినవారికి వింతగానే వుండును. టీ.వీ చూచిన వారికి అలాగే అనిపిస్తుంది. వారికి ప్రపంచమంటే ఏమిటో, దేశాలంటే ఏమిటో వారికి అర్థం కావటం లేదు. కావున వింత పశువులలాగానే ప్రవర్తిస్తున్నారు. వారికి ఏ విషయము గూర్చి చెప్పిన వింతగానే భావిస్తారు. అదే విద్య ఉన్నవారికి చెప్పిన కనీసం విషయమునైన గ్రహించి అభివృద్ధి చెందే అవకాశమున్నది.

ఈ విధంగా ప్రపంచంలో మార్పులు వస్తున్నాయి. అయినను మన వాళ్ళు మతాల పేర, కులాల పేర, పార్టీల పేర, రాష్ట్రాలను, దేశాలను ఏలుచున్నారు. ఎవరికి ఎంత అవసరమో అంత వరకు వారు రాష్ట్రాలను, దేశాలను ఏలే కాలంలో ఎవరికి వారు, ఏ కులానికి ఆ కులము వారు మేలుకొని, అభివృద్ధి చెందకపోతే ఈ రాష్ట్రాలు, ఈ దేశాలు చాలా కాలం నిలబడే రోజులు కనిపించడం లేదు. కొందరి స్వార్థ పరుల కోసం అధిక సంఖ్యగల ప్రజలు చాలా ఇబ్బందుల పాలు కావలసివుండును.

అసలు పూర్వీకులైన మానవులు తమ మనుగడను సులభంగా సాధించుటకు నాలుగు వర్ణములుగా విభజించారు. 1. తాము ఇతరుల బారి నుండి రక్షణ పొందుటకుగాను ఒక వర్గమును ఏర్పాటు చేసి వారిని 'క్షత్రియులు' అన్నారు. 2. వారి అభివృద్ధిని సరియైన మార్గంలో నడిపించుటకు గాను వారికి మార్గదర్శకులుగా విద్యను బోధించు వారిని 'బ్రాహ్మణులు' అన్నారు. 3. వారి జీవనాధారమునకు కావలసిన వస్తువులు ఒకచోట చేర్చి, అందరికి అందుబాటులో ఉంచువారిని 'వైశ్యులు' అన్నారు. 4. పై పదార్థములను ఉత్పత్తి చేయువారిని 'శూద్రులు' అన్నారు. అనగా వ్యవసాయం, పశుపోషణ, కూరగాయలు, పాలు, పండ్లు, మాంసము అనగా సమస్తము ఉత్పత్తి చేయువారిని శూద్రులు అన్నారు.

ఈ శూద్రులలో భూములు దున్ని పంటలు పండించువారు, భూమికి సంబంధించిన వ్యవసాయ పనిముట్లు తయారుచేయువారు 'సాలెలు' (వస్త్రములు సమకూర్చువారు). భోజన పదార్థములు వండుకొను పాత్రలు తయారు చేయువారు 'కుమ్మరులు'. తమ బట్టలు శుభ్రము చేయువారు 'చాకలి'. అలాగే 'మంగలి', ఆభరణములు తయారుచేయు 'కంసాలి', పశుపోషకులు 'గొల్లలు', కురబలు మరియు ఇతరములైన పనులు చేయుటకు 'బోయలు'. ఈ విధంగా రకరకాల వృత్తులవారిని రకరకాల పేర్లతో పిలవటం వలన వీరే తరతరాలుగా, యుగయుగాలనుండి వస్తున్నారు. కావున వారిని రకరకాల కులాల పేర్లతో పిలుస్తూ వస్తున్నారు.

వీరిలో భూమిని సాగు చేయు రైతులు కాపులు, కమ్మలు. వీరు ఎక్కువుగా భూకామందులుగా ఉండి ఆహారధాన్యములను ఉత్పత్తి చేసి మంచి ఆర్థిక శక్తిని సంపాదించి, వారి కుటుంబాలను అభివృద్ధి పరుచుకొని, వృత్తి రీత్యా జీవించువారికి వారు యిచ్చు శ్రమ శక్తిపై ఆధారపడి జీవించుట వలన రోజురోజుకు వారి శక్తి తగ్గి, వారి అదుపు ఆజ్ఞలలో పనిచేసుకొంటూ వచ్చి, ఆర్థికంగాను, వైజ్ఞానికంగాను, రాజకీయంగాను వెనుకబడి వారి చెప్పుచేతులలో జీవనం సాగించవలసివచ్చినది. కాని ప్రస్తుత నవీన ప్రపంచంలో వ్యవసాయకం గాను, పారిశ్రామికంగాను చాలా అభివృద్ధిని సాధించుట వలన రకరకాల వృత్తులు ఉద్యోగవకాశములు కలుగుచున్నవి. ఈ నవీన యుగంలో పై తెల్పిన వర్గములు, వర్ణములు, మతములు, కులములకు కాలం చెల్లుబాటు అగుట వలన ప్రతి మానవ జీవి రక్షణ రంగంలోను, విజ్ఞాన రంగంలోను, కమ్యునికేషన్ రంగంలోనూ, వ్యవసాయ, నవీన వృత్తి రంగాలలోను

ప్రవేశించుచున్నారు. కావున కుల వ్యవస్థ తగ్గినది. అయినను స్వార్థపరులు తమ స్వార్థమును అభివృద్ధి చేసుకొనుటకు కులములను, మతములను, కార్మికులను అడ్డు పెట్టుకొను చున్నారు.

వేదములలో చెప్పినట్లుగా బ్రాహ్మణులు మస్తిష్కము నుండి ఉద్భవించారని, క్షత్రియులు భుజ స్కంధముల నుండి జన్మించారని, వైశ్యులు శరీర మధ్య భాగము ఉదరము, నడుమునుండి జన్మించారని, శూద్రులు తొడల నుండి ఉద్భవించారని, పంచములు పాదములనుండి ఉద్భవించారని పోల్చియున్నారు. అనగా ఆనాటి వేద పండితులు నాలుగు వర్ణములకు సరిపోవునట్లుగా మానవ శరీరముతో పోల్చియున్నారు. మానవ మేధస్సు శిరస్సు భాగము నుండి ఉత్పత్తియగుచున్నది. కావున వారిని బ్రాహ్మణులు లేక బ్రహ్మజ్ఞానులని, ధైర్యము మరియు శక్తి మానవుని గుండె నుండి భుజముల నుండి ఉద్భవిస్తున్నది. కావున వీరిని క్షత్రియులని, శరీరము మొత్తమును సమానముగా ఉంచునది ఉదరము, నడుము భాగం నుండి వచ్చును కాన సమతూల్యమును కాపాడుటకుగాను బ్రాహ్మణులకు, క్షత్రియులకు, శూద్ర గణములకు ఆహారపదార్థములను అందించు వారిని వైశ్యులనియు, పై మూడు వర్ణములు మరియు నాల్గవ వర్ణమైన శూద్రులు. ప్రతి జీవికి కావలిసిన కూడు, గుడ్డ నీడ కావున పై మూడింటిని ఉత్పత్తి చేయువారని శూద్రులని పిలిచినారు. అయితే ఐదవ వర్ణం ఎక్కడి నుండి వచ్చినది? పై నాల్గు వర్ణముల ప్రజల నుండి ఉద్భవించినదే (పుట్టినదే) ఈ ఐదవ వర్ణం.

పూర్వం ఆరోగ్య విషయంలో ఇప్పుడు ఉన్నన్ని ఆరోగ్య సౌకర్యములు ఉండేవికావు. ఏదైన ఒక జబ్బు వచ్చిన వారిని, బాగు పరుచుట వీలు ఉండేది కాదు. ఆరోజులలో విపరీతమైన ప్రాణాంతకమైన అంటు వ్యాధులు వస్తుండేవి. వాటి బారిన పడినవారు జీవించుట కష్టమే. అతని ద్వారా సంక్రమించిన రోగం మరియొకరికి వచ్చేది. ఆ విధంగా వచ్చిన అంటు వ్యాధులు అందరిని హరించుకొనిపోయేవి. అటువంటి వ్యాధులు వచ్చినప్పుడు, అప్పటి ప్రజలు భయభ్రాంతులకు లోనైయ్యేవారు. అందువలన వారి సంతతిని అభివృద్ధి పరుచుటకు గాను, మరియు భయంకరమైన అంటు వ్యాధుల నుండి బయటపడుటకు గాను, వారు కొన్ని కట్టుబాట్లు నియమ నిబంధనలను ఏర్పరచుకొన్నారు.

ఆనాటి ప్రజలు తమ గుంపులోకాని, గ్రామము లేక పల్లెలోకాని, ఎవరికైన అంటు వ్యాధి సోకిన , ఆనాడు వచ్చు మహమ్మారి అయిన కలరా, పెద్ద అమ్మవారు, కుష్టు వ్యాధులు మరియు ఇతర వ్యాధులు వచ్చినటువంటివారు జీవించటం చాలా కష్టం. అటువంటివారు రాజులు కావచ్చు, రాణులు కావచ్చు, బ్రాహ్మణులు కావచ్చు, వైశ్యులు కావచ్చు, శూద్రులు కావచ్చు, ఆడ మగ కావచ్చు, వృద్ధులు పసిపిల్లలు కావచ్చు. ఆ రోగము వచ్చినవారు ఎవరైనా కావచ్చు. అటువంటివారిని అందరు కలిసి, ఊరికి దూరంగా పంపిచేవారు. వారిలో ప్రియమైనవారు, ప్రియాతిప్రియమైనవారు అయి ఉండవచ్చు, అయినా ఊరిలోకి రానివ్వరు. వీరు కూడ పోకూడదు. అలా ఎవ్వరైన చేసిన వారికి అంతకన్నా కఠిన దండనలు ఉండేవి. అసలు ఎవరికి వారు ప్రాణభయంతో ఉంటారు. అలాంటప్పుడు భార్య అయితేనేమి? భర్త అయితేనేమి? కన్న కొడుకైతేనేమి? కన్న కూతురైతేనేమి? తల్లి అయితేనేమి? తండ్రిఅయితేనేమి? రాజుఅయితేనేమి? రాణులైతేనేమి? ఎవరి ప్రాణ భయంవారిది. అందువలన వారిని దూరంగా ఉంచేవారు. ప్రేమ కలిగినవారు వారి తల్లిదండ్రులకో, కొడుకు-కూతళ్ళకో అన్నం పెట్టవలెనన్న దగ్గరకు పోవుటకు వీలులేదు. దూరంగా పెట్టిన తన వారే తింటారని ఏమున్నది? ఆ రోజులలో ఎవ్వరు శక్తి కలిగి

ఉంటారో వారు వచ్చి పెట్టిన అన్నం తినిపోయేవారు. ఆ విధంగా ఎవరికి ఎన్ని రోజులు ప్రేమ ఉండునో, అన్ని రోజులే వారు ఆహారం ఇచ్చేవారు. అటువంటి సందర్భంలో వెలివేసిన వారిలో తీవ్రమైన రోగములతో వున్నవారు, ఆకలి బాధలు తట్టుకొనలేక చనిపోయినవారు, ఆహారం ఉన్నా శక్తి లేక తిననివారు ఈ విధంగా ఉంటూ వారిలో వారికి వ్యాధులుపోయి బ్రతికినవారు వారందరు కలిసి ఒక గుంపుగా మిగిలారు. ఈ విధంగా ఉండవచ్చునా! లేదా? అని నిర్ధారణ చేసుకొనవలయునంటే ఇంగ్లీష్ సినిమా 10 కామాన్డ్మెంట్స్ చూచిన వారికి అర్ధమౌతుంది. అందులో ఒక పెద్ద గుహలో ఈ అంటు వ్యాధులు వచ్చిన వారిని బంధించివుంచారు. వారికి ఆహారం పై కప్పు భాగంలోని రంధ్రము ద్వారా తాడు సహాయంతో గంపల నిండా అన్నంపెట్టి వదులుతారు. ఆ అన్నమును తినుటకు ఎగబడి ఒకరిని ఒకరు త్రొక్కుకొంటూ బలవంతులు బలహీనుడి చేత జిక్కిన ఆహారమును బలవంతంగా లాక్కొని తింటారు. ఈ విధంగా మిగిలిన వారికి సరియైన ఆహారం లభించక తమ ఆకలి మంటలను చల్లార్చుకొనుటకు ఏది దొరికితే అది తినటం నేర్చుకొన్నారు. చనిపోయిన జంతువుల కళేబరాలను తినటం, వాటి చర్మములను శుభ్రంచేసుకొని ధరించటం చేస్తారు. కాలక్రమేణ అవి రకరకాల చర్మపు వస్తువులుగా (చెప్పులు మొదలైనవి) రూపాంతరం చెందినవి. ఈ విధంగా ఏర్పడినవారే హరిజనులు.

ఈ హరిజనులు ఒక కులస్థులుకారు. అన్ని కులముల నుండి వచ్చినవారు. క్షత్రియులు, బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు. ఒక గ్రామంలో ఎన్ని కులాలు ఉంటాయో వారు అన్ని రకాల ఇంటి పేర్లతో ఉంటారు. అంటు రోగాలతో బ్రతికి బయట పడినవారు, స్త్రీ పురుష అనుకూలములను బట్టి వివాహములు చేసికొని వారి సంతతిని కూడ అభివృద్ధి చేసుకొని ఐదవ వర్ణం అయిన పంచమ వర్ణంగా తయారైనారు. వారిని గూర్చి ఎవరు తలంచరు. అన్ని కులాల వారికి సంబంధించిన మన పూర్వీకులు అను భావన కూడ లేదు. ఆనాటి వ్యవస్థను బట్టి ఈ విధంగా అనాశ్రయులై అనాధలుగా మిగిలిపోయినారు అని ఎవరూ వారిపై కరుణ, జాలి చూపరు.

ఏ బాదరబంది లేనివారు, ఆస్థిపాస్థులు లేనివారు, రెక్కాడితేగాని డొక్కాడనివారు, ఒక కూటికొరకే పగలంతా కష్టపడి పనిచేస్తున్నవారు వీరు. వీరి నిస్సహాయతను తెలుసుకొన్న స్వార్ధ చింతన కలిగినవారు వారిని దగ్గరకు తీసుకొని పశువులను కాయుటకు, వ్యవసాయ పనులు చేయుటకు పెట్టుకున్నారు. వారిని తరతరాలుగా అలాగే ఉంచివున్నారు. వారు స్వహస్తములతో వేసుకొన్న గుడిసెలు తప్ప, దున్ను కొనుటకు భూమి లేదు. పశువులు లేవు. మరి యేమియులేవు. కాన వారు కడుపుమంట చల్లార్చుకొనుటకు ఏ పని చేయమంటే ఆ పని చేయుటకు సిద్ధపడినారు. యుగయుగాలుగా తన స్వంత మనుష్యులే వీరిని అణగద్రొక్కి వేశారు. ఇప్పుడువున్న ఈ నవీన ప్రపంచ ప్రజలు సత్యమును గ్రహించిననాడు వారిలో జనించే దయా, జాలి గుణముల వలన ఈ అణగారిన ప్రజలు పైకివచ్చి, వారు నివసించే ఈ భూమిపై తలయెత్తి తిరిగే అవకాశం రాగలదని భావిస్తాను.

ఏ దేశం గొప్ప! యేమున్నది గర్వకారణము. ఆ దేశము గొప్పతనం ఆ దేశంలో నివసించే ప్రజల శక్తి సామర్ధ్యములపై ఆధారపడియున్నది. కోట్లాది ప్రజలు నిరాశ్రయులైవుండి ఏ కొద్దిమందో కష్టించి పనిచేస్తున్నారంటే , వారివల్ల ఈ దేశం అభివృద్ధి చెందుతుందా? ప్రతియొక్కరు ప్రతియొక్క అంగుళం భూమిని సాగు చేసి, ఈ భూమిలో దొరికే ప్రతి సంపదను

సక్రమముగా ఉపయోగించి వాటియొక్క సామర్థ్యమును పెంచిననాడు ఈ దేశం యొక్క గౌరవం పెరుగుతుంది.

ఈనాడు ప్రపంచ దేశాలలోని కొన్ని దేశాల పేర్లను మాత్రమే మనం చెప్పు కుంటున్నాము. భారతీయులకు జపాన్ వస్తువులంటే చాలా ఇష్టం. వారు ఉత్పత్తి చేసే వస్తువుకు నాణ్యత ఉన్నదనేగా అర్థం. అక్కడి ప్రజల శ్రద్ధా శక్తులు, కష్టించి పనిచేయడం, వస్తువు యొక్క నాణ్యతను అభివృద్ధి చేయటం వలన జపాన్, ఎక్కడో సముద్రమధ్యలో చిన్నచిన్న దీవులుగాను, ఎల్లప్పుడు అగ్ని పర్వతములతో దద్దరిల్లుతున్న జపాన్‌వారు ఉత్పత్తి చేసిన వస్తువులకు ప్రపంచ మొత్తంలో మార్కెట్ సౌకర్యమును ఏర్పరుచుకొని వున్నారు. ఒక చిన్నచిన్న దీవుల్లాగా సముద్ర మధ్యలో, దక్షిణ భారతంకన్న చిన్నదైన ఇంగ్లండ్ మొత్తం ప్రపంచమునే జయించి రవి అస్తమించని సామ్రాజ్యమును స్థాపించగలిగారు. జర్మనీ ప్రపంచ ఖ్యాతి గాంచిన దేశంగా గుర్తించబడినది. అమెరికా ప్రపంచ దేశాల ప్రజలను తమ వద్దకు రప్పించుకొని, వారి ద్వారానే వారి అభివృద్ధిని సాధించి ప్రపంచ దేశాలలోనే అగ్ర దేశంగా నిలబడింది.

ఐదు రాజ్యాలవారి కబళింపులకు గురియైన చైనా, అమెరికా, ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్ చేతులలో పోవలిసిన చైనా, చైనా ప్రజలు మేల్కొని కమ్యూనిస్ట్ రాజ్యమును స్థాపించి ఇప్పుడు ప్రపంచ దేశాలలో ఒక అగ్ర రాజ్యంగా గుర్తింపు పొందినారు. అందుకే అన్నారు గురజాడ ''దేశం అంటే మట్టి కాదోయ్, దేశం అంటే మనుషులోయ్''. ఈ విషయమును ప్రతి భారత పౌరుడు గ్రహించవలెను. ఏదో కొన్ని అగ్రవర్ణాల కులస్థులవల్ల కాదు.

"THE WEALTH OF THE NATION DEPENDS UPON THE WEALTH OF ITS PEOPLE." అన్నారు. ఒక దేశ సంపద ఆ దేశంలో నివసించే ప్రజల ఆరోగ్యముపై ఆధారపడియున్నది. పనిపాటా లేకుండా బాగా తిని ఆరోగ్యంగా వుండుటయనికాదు దీని అర్థం. ఒక దేశ సంపద ఆ దేశంలో నివసించే ప్రజల శక్తి సామర్థ్యములు, నీతి నిజాయితీలపై ఆధారపడియుండునని అర్థం. అంతేకాని పై చెప్పిన విధంగా కాదు.

మన దేశం సర్వసంపదలకూ నిలయం. మంచి సమశీతోష్ణ వాతావరణం కలిగినది. భగవంతుడు ప్రసాదించిన జీవనదులువున్నవి. భారతదేశం చుట్టూ విశాలమైన సముద్రతీరం వున్నది. అన్నింటికంటే మించిన మానవ సంపద వున్నది. అటువంటి ఈ దేశంలో నూటికి 80 శాతం మంది అజ్ఞానములో కొట్టుమిట్టాడుతున్నారు. స్వార్థపరుల చేతులలో చిక్కి కులాలు, తెగలు, వర్ణములు అని వర్గములుగా విభజించి వారివారి పబ్బములను గడుపుకొనుచున్నారు. దీనికంతటికీ కారణం ప్రజలే! వారి అజ్ఞానం తొలగనంతవరకు వారు అభివృద్ధి చెందరు. వారు అభివృద్ధి చెందనిదే, ఈ దేశం అభివృద్ధి చెందదు.

పూర్వం ''యథారాజ! తథాప్రజా!'' అనేవారు. ఆ కాలంలో రాజులు ఎలా నడుచుకొంటారో ప్రజలూ అలాగే నడుచుకొనేవారు. ఇప్పుడు ఇది ప్రజా రాజ్యం. ప్రజలచేత పాలించబడే రాజ్యం. ప్రజల ఓట్ల ద్వారా ప్రజా ప్రతినిధులను ఎన్నిక చేయించి, వారిద్వారా రాజ్యపాలన జరుగుచున్నది. కావున ''తథాప్రజా! యథారాజా'' అయినది. ప్రభుత్వంలో జరిగే మార్పులకు, అభివృద్ధికి ప్రజలే భాధ్యులుకాని పాలకులు కాదు. ఎవరిని నిందించవలసిన పనిలేదు.

ఆనాడు నాలుగు వర్గములుగా ఏర్పడిన గుంపులు క్షత్రియులు, బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు. అందరూ సమానమే. వారు వారివారి విధులను నిర్వర్తించుటకు ఏర్పాటు చేసుకొన్నదే కాని ఒకరి మీద మరియొకరు పెత్తనం చెలాయించుటకు కాదు. అందులో స్వార్థ చింతన కలిగియున్న కొంతమంది విజ్ఞులు. బలవంతులైన రాజులు పరులనుండి కాపాడవలసిన వారి పక్షములోని స్వార్థపరులతో ఏకమై ఒకరిపైనొకరు పెత్తనం చెలాయించడం జరిగినది. అప్పటినుండి రాజులు రాజ్యాలు ఏర్పడటం ప్రారంభమైనవి. అదే పద్ధతిలో మొత్తం ప్రపంచంలోని ప్రజలు వారివారి అవకాశములను బట్టి రకరకాల రాజ్యములను ఏర్పాటు చేసుకొని, బలహీనుణ్ణి, బలవంతుడు ఓడించుకొంటూ వేరువేరు రాజ్యములను, వేరువేరు భాషలు, వేరువేరు ప్రాంతాలను సృష్టించుకొన్నారు.

మొత్తం క్షత్రియ వర్గం వారిలోని బలవంతుణ్ణి, శక్తి యుక్తులు కలిగిన వాడిని రాజుగా ప్రకటించుకొని రాజు, మంత్రి, సేనాధిపతియని రకరకాల పదవులను సృష్టించుకొన్నది. మిగిలినవారు సైనికులుగా నిలబడగలిగారు.

బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానము కలిగినవారుయని చెప్పుకొంటూ బలవంతులైన రాజుల పంచన చేరి మంత్రులుగా, సలహాదారులుగా, ప్రజలను ఆకట్టుకొనుటకు రకరకాల కథలను అల్లుకొంటూ, రకరకాల దేవతలను సృష్టించుకొనుచు, రాజులచేత గుళ్ళు గోపురాలు కట్టించుకొంటూ, వాటి నిర్వహణకు మణులు మాన్యాలు పొందుతూ తలలోని నాలుకులై ఉండిపోయినారు.

వైశ్యులు వీరు ఉత్పత్తియైన మొత్తం సంపదను తమ అదుపు ఆజ్ఞలలో ఉంచుకొని అటు ఉత్పత్తిదారునికి ఇటు రాజులు, రాజ్యాధికారులకు, బ్రాహ్మణ వర్గమునకు అందరికి అందించువారు. వీరినే ఆశ్రయించునట్లుగా తమ శక్తిని నిలబెట్టుకొని ఆర్థికంగాను మరి ఇతర రంగాలలోనూ అభివృద్ధి చెంది, తమకంటూ ఒక స్థానమును నిలబెట్టుకొనగలిగారు.

శూద్రులు వీరిలో భూమిపై ఆధారపడియుండి ధాన్యములను పండించి వాటివలన ధనమును సంపాదించుకోగలిగారు. పశువుల కాపరులు వీరు కొద్దోగొప్పో భూ సంపదను కలిగి పశు సంపదపై ఆధారపడి కొంతవరకు ధనమును సంపాదించి మధ్య వర్గీయులుగా నిలద్రొక్కుకున్నారు. మరికొంత మంది రకరకాల చేతివృత్తులను స్వీకరించి వారి చేతి వృత్తిపై దొరికిన ఆహార పదార్థములను పొంది బ్రతకలేక చావలేక తమ కాలం గడుపుకొంటూ వచ్చారు. మిగిలిన వారు హరిజనులు. వీరిని గూర్చిన విషయం విపులంగా ముందుగానే చర్చించటం జరిగినది.

పై నాలుగు వర్ణములలోను మూడు వర్ణములు వారివారి జనాభానుబట్టి నిలద్రొక్కు కున్నారు. క్షత్రియ వర్గం మాత్రం 80శాతం నశించిపోయినది. ఎందుకనగా వీరి పని ఎల్లప్పుడు యుద్ధములు చేయటం. అందులో జన నష్టం జరగటం, కొందరు రాజ్యాలు వదిలి వారి ప్రాణ రక్షణార్థం ఎవ్వరికీ అందనటువంటి అరణ్యములకు పారి పోవటం, అక్కడ వారికి ఎటువంటి వసతులు దొరకక ఆర్థికంగా, వైజ్ఞానికంగా, రాజకీయంగా చితికిపోయి ఆఖరికి వారెవరో వారికే తెలియకుండా అడవి మనుష్యులాగా ఉండిపోవుట. అటువంటివారే ఇప్పుడు నల్లమల అడువులలో వున్న చెంచులు. ఏజెన్సీ ప్రాంతములలో వున్న కొన్ని రకాల జాతులు మరియు

బంజారాలు. వీరిని ఎలా చెప్పగలరు అని చెప్పవచ్చు? 1969వ సంవత్సరము నేను శ్రీశైలములో పనిచేయుచున్నప్పుడు గాంధీ జయంతినాడు అక్కడి పేద ప్రజలకు అన్నదానం చేశాము. ఆ అన్నదానమునకు చెంచులు వచ్చారు. వారు బంతిలో కూర్చున్న వెంటనే వారిని మీరు దూరంగా పోండి మీరు శూద్రులు అన్నారు. మీరెవరు అని అడిగితే మేము క్షత్రియులు అన్నారు. ఇలాగే దేశంలోని అన్ని ప్రాంతాలలో నివసించే గిరిజనులు సుమారు 50 నుండి 75 శాతం వరకు క్షత్రియ వర్ణము వారేయని నాభావన.

# బంజారాలు వీరి పూర్వ వృత్తాంతము

బంజారాలు 1000సంవత్సరములు వెనుకబడియున్నారు. కారణం వీరు సుమారు 5వ శతాబ్దము నుండి 11వ శతాబ్దం వరకు వున్న కాలమును "రాజ పుత్ర యుగం" అంటారు. ఉత్తర భారతమును వీరు సుమారు 600 సంవత్సరములు ఏకఛత్రాధిపత్యముగా పాలించి యున్నారు. ఆనాడు ఘూర్జరులు, పాలమారులు, సోళంకులు, బుందేలులు, కాళచూరులు మొదలగు రాజ్యములన్నియు బంజారాలవి. వీరు బంజారాలే అని తెలుపుటకు ఉదాహరణ : ఈనాటి వరకు పురుషులు, స్త్రీలు ఆ నామములతోనే పిలువబడుట. ఉదాహరణకు బుందేలులు – బుదేలా; పాలవూరులు– పేవ్మ్యా; కాళచూరులు– కాళియ; ఘూర్జరులు–ఘుజరి; శోళంకులు– సోమ్లా మరియు భూణా; హూణా; దేవలి; చోక్లా; గోన్యా; సోమ్లీ; సాలి; పేమణి; లాంపళి; మొదలుగాగల పేర్లన్నియు పై విషయములను తెలియ పరుచుచున్నవి. వీరు రాజపుత్రులని తెలియబడుచున్నది.

11వ శతాబ్దములో ఢిల్లీని పాలించిన పృథ్వీరాజ్ చౌహాన్‌గారికి, కాబోలును పాలించుచున్న మహమ్మద్ ఘోరిగారికి జరిగిన యుద్ధంలో, కడపట జరిగిన మోసము వలన పృథ్వీరాజుగారు మహమ్మద్ ఘోరీ చేతిలో ఓడిపోయినారు. మహమ్మద్ ఘోరి పృథ్వీరాజు యొక్క రెండు కళ్ళను తీయించి 9 మణుగుల ఇనుప గొలుసును మెడకు, కాళ్ళకు, చేతులకు వేసి చీకటి గదిలో (గుహ) పడత్రోస్తాడు.

ఆ విషయము పృథ్వీరాజు గురువు, మంత్రియైన చాంద్ బద్దాయికి (భట్) తెలుస్తుంది. అతను చాలా దుఃఖితుడై అతి కష్టము మీద కాబోలు చేరుకొని ఘోరీని దర్శిస్తాడు. తనను గూర్చి విషయమును తెలుపుతూ, ఈ అవసాన దశలో తన రాజును, శిష్యుడిని దర్శించుకొని తనువు చాలించుకొంటానని ప్రార్థించుతాడు.

అప్పుడు రాజు కొంత సైన్యమును తన వెంట ఇచ్చి చూచి రమ్మని ఆజ్ఞాపిస్తాడు. చాంద్‌బద్దాయి బంజారాల ఢాడి అంటారు. ఢాడి యనగా తెలుగులో భట్ రాజులు అంటారు. ఇతను ఢాడీ (భట్ రాజు) యగుటవలన రాజును గౌరవముగా దూరంనుండియే పొగడుచు మహారాజా, పృథ్వీరాజా అంటూ పోయినాడు.

చీకటిగుహలో తొమ్మిది మణుగుల ఇనుప గొలుసుతో బంధించబడియున్న పృథ్వీరాజా ఈ శబ్దములను విని ఎవరూ? అని జవాబు ఇచ్చాడు. నేను తమ గురువును చాంద్‌బద్దాయిని అని చెప్పిన వెంటనే గురువునకు నమస్కారముచేయు ఉద్రేకముతో తన రెండు

చేతులను పైకెత్తి నమస్కరించబోయాడు. అంతలో ఆ తొమ్మిది మణుగుల ఇనుపగొలుసు పటపటయని విరిగిపోయినది. ఈ దృశ్యమును చూచిన రాజ భటులు మహమ్మద్ ఘోరీతో చెప్పారు. అప్పుడు ఘోరీ తొమ్మిది తొమ్మిది 18 మణుగుల గొలుసు వేయమని ఆజ్ఞాపిస్తాడు అది విని చాంద్ భట్‌గారు చాలా దుఃఖితుడౌతాడు.

ఘోరీ చంద్‌బర్దాయిని ఉద్దేశించి మీ రాజు అంత బల శాలియా అని ప్రశ్నించినాడు. చాంద్ భట్‌గారు తమ రాజు యొక్క బల పరాక్రమముల గూర్చి చాలా విషయములు తెల్పినాడు. రాజులకు యోధుల బల పరాక్రమములు చూచుట ఒక వినోదముగా భావించేవారు. కావున మీ పృథ్వీరాజు ద్వారా మాకు ఎటువంటి విద్యను చూపించగలవు యని ప్రశ్నించారు. చాంద్‌భట్‌గారు పృథ్వీరాజు గుడ్డివారు కదా అతని విలువిద్యను ప్రదర్శింపచేస్తాను అన్నారు. రాజుగారితో ఒక సభను ఏర్పాటుచేసి, ఆ సభ మధ్యలో ఒక స్తంభమును నాటించి ఆ స్తంభము చివరి కొనలో గంట కట్టబడుతుంది.

ఆ సభలో పృథ్వీరాజుగారిని రప్పించి, చాంద్‌బర్దాయిగారు రాజుతో స్తంభమునకు కట్టిన గంటను ఐదు అడుగుల ఐదు అంగుళముల ఎత్తులో ఒక కోణములో బాణమును వదిలిన గంట తెగిపోగలదు అని చెప్పేరు. అదే ప్రకారం పృథ్వీరాజు బాణమును వేస్తారు. వెంటనే గంట త్రెగి క్రింద పడుతుంది. ఈ దృశ్యమును చూచిన మహమ్మద్ ఘోరీగారు గద్దె మీద నుండి గట్టిగా ''శభాస్ శభాస్'' అంటారు. వెంటనే వేరొక బాణమును తీసి శబ్దమునకు సంధించి వదులుతాడు. ఆ బాణమునకు ఘోరీ తల ఎగిరి పడుతుంది. ప్రజలంతా హాహాకారములతో ఘోరీవున్న ప్రదేశమునకు వెళ్ళిపోతారు.

చాంద్‌బర్దాయి పృథ్వీరాజుగారితో ఈ విషయమును తెల్పుతూ వారు వెనుతిరిగిన మనలను ఖైమా వుండలు చేస్తారు అంటారు. పృథ్వీరాజుగారు మనము వారిచేతులలో మరణించుటకన్న మీరు ఒక ఖడ్గముతో నా కంఠమును ఖడించండి. నేను మీ గొంతు పిసుకుతాను అంటాడు. ఆ వెంటనే చాంద్ బర్దాయిగారు పృథ్వీరాజు మెడను ఖండించడం, పృథ్వీరాజు చాంద్‌బర్దాయిగారి గొంతును పిసుకుతాడు ఈ విధంగా జరిగిన వెంటనే మహమ్మద్ ఘోరీని చూడబోయిన ప్రజలు పట్టండి చంపండి యని వెనుతిరుగుతూనే వారిద్దరు చనిపోయి ఉంటారు. ఈ విధంగా ఒక గ్రుడ్డివాడు ఒక ముసలివాడు మన రాజునే చంపగలిగారు. ఈ జాతివున్న మనకు చాల ప్రమాదము ''ఈ గోరవట్'' అనే జాతిని సర్వనాశనం చేయండియని తరువాత రాజు ఆజ్ఞాపిస్తాడు.

ఆ ప్రకారం నిరాయుధులైన గోరవట్ (బంజారాలను) ను చంపుట వలన వీరు అడవుల పాలై తమ దుస్తులను చింపిరి చింపిరిగా చేసి అక్కడేవున్న ఎఱ్ఱ మట్టిలో పులిమి వేషభాషలను మార్చుకొని అడవుల పాలౌతారు.

దీనికి ముందు జరిగిన యుద్ధంలో పృథ్వీరాజుగారి సైన్యము మూడు భాగములుగా ఏర్పడి ఒకటి రాజస్తాన్ కోటలలోను రెండవ భాగము అడవుల పాలు, మూడవ భాగము పరదేశములకు పోయినారు. వారినే జిప్సీలూ లేక రోమాబంజారాలు అంటారు. వీరు యూరప్ ఖండములోని 60 దేశాలలో 1.3 కోట్ల రొమా బంజారాలున్నారని తెలియుచున్నది. రాజస్తాన్‌లో ఉన్నవారే క్షత్రియులుయని పిలుచుకొంటున్నారు.

అడవులకు పోయిన వారిలో కొంతకాలమునకు చిథోడ్ కోటను నిర్మించుకొని రాజ్యమును పాలించారు. వారిలో రాణాప్రతాప్ సింగ్ రాథోడ్ ముఖ్యులు . వారినే మనము రాణాప్రతాప్ సింగ్ యని చరిత్రలో చదువుకొనుచున్నాము. రాణాప్రతాప్‌సింగ్ రాథోడ్ అనగా రాథోడ్ వంశమునకు చెందినవాడు. వీరు అక్బరు బాదుషా కాలంలో యుద్ధములుచేసి చేసి వారి ధాటికి ఆగలేక అడవులపాలౌతారు. హల్దిఘాట్ అనే ప్రదేశములో ఒక శపథమును చేసియున్నారు. ఈ భారతదేశమును ''సర్వ స్వాతంత్ర్యము'' వచ్చేట్టు చేసేంతవరకు చిథోడ్ కోటలో కాలు పెట్టమని, చుట్టూ గుడిసెలలో కాపురం చేస్తాం, కఠిన నేలపై పవళిస్తాము , మూకట్లలో ( మట్టి పాత్రలో) భోజనం చేస్తాము యని ప్రమాణం చేసియున్నారు. అదే ప్రకారం బంజారాలు చదువు సంధ్యలు లేక స్వాతంత్ర్యము వచ్చు వరకు పై తెల్పిన విధంగా జీవనం సాగిస్తూవచ్చారు.

భారత దేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత మన ప్రథమ ప్రధాన మంత్రియైన శ్రీ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారు చిథోడ్ కోటలో వేల గృహములను నిర్మించి గొప్ప ఊరేగింపుతో అక్కడే నివసించుచున్న లోహార్ బంజారాలను కోటలో ప్రవేశించమని ఆహ్వానించారు. కాని కోట ద్వారము వరకు పోయిన బంజారాలు ఏమియు అనకనే వెనుతిరిగి వెళ్ళిపోయారు.

రాణాప్రతాప్ సింగ్ రాథోడ్‌గారు ఈ దేశమును సర్వ స్వాతంత్ర్యము వచ్చునంత వరకు అని ప్రమాణం చేసియున్నారు. మనకు స్వాతంత్ర్యము వచ్చినదే కాని, ఇప్పటి వరకు సర్వ స్వాతంత్ర్యము సిద్ధించలేదు. ఇదే దీనికి నిదర్శనము. ఈ విధంగా బంజారాలు దేశ సేవకై పాటు పడుతూవచ్చారు.

బ్రిటిష్ వారు వచ్చినప్పుడు వారిని తరిమి వేయుటకు అమర్ సింగ్ రాథోడ్ మధ్య భారతంలో స్వతంత్ర్య పోరాటమును సాగించాడు. అమర్ సింగ్ రాథోడ్ సినిమాలోని పాట ఈనాటి వరకు సిలోన్ రేడియో స్టేషన్ నుండి ఈ పాట వినిపిస్తుంది. ''ఏ గోరవటే'' అను పదము. ఇదే ఈ గోరవట్‌ల వృత్తాంతం.

# నాయక్ బిరుదము

బంజారాలు పూర్వం తమ వంశ నామములను పేరుకు చివర రాథోడ్, చౌహాన్, పవార్, జాదవ్ అని పెట్టుకొనేవారు. ఈ బంజారాలు 15వ శతాబ్దములో ఉత్తరాది నుండి దక్షిణాదికి 1లక్ష 85వేల ఎడ్ల బండ్లపై తమ బిడారులను తరలించుకొని వచ్చారు. వీరు దక్షిణభారతం మొత్తంలో విస్తరించివున్నారు.

శ్రీరంగపట్టణంను పాలించిన హైదర్ ఆలీ, టిప్పు సుల్తాన్ సైన్యములో చేరి స్వతంత్ర్య పోరాటం సాగించారు. వీరు చాలా యుద్ధ నైపుణ్యము కలిగినవారగుట వలన గూఢాచారులుగాను, సైన్యములో వారికి ఆహార పదార్థములు యుద్ధ సామగ్రి అందించుటలోను ముఖ్య పాత్ర వహించారు. వారి యుద్ధ నైపుణ్యముల వలన మంచి పేరు సంపాదించారు. టిప్పు సుల్తానుగారు ఆ నాటి తన సైన్యములో ఉన్న యుద్ధ వీరులకు ''నాయక్'' అను బిరుదమును ఇచ్చారు. వారిలో కొంత మందికి వారి వంశము వారికి మాత్రమే ''నాయక్'' యను బిరుదమును

తమ నామమునకు వారికి చివర ఉంచుకొనవచ్చును. అట్టి వారిలో మంగళూరులోని కొన్ని బ్రాహ్మణ కుటుంబాలు, కర్ణాటకలోని దావణగెరి చిత్రదుర్గ ప్రాంతములోని బోయలు, మహారాష్ట్రములోని వనజారులు, కడప పట్టణం, అనంతపురం జిల్లా తాడి మర్రి గ్రామంలోని మహమ్మదీయులు, నెల్లూరు జిల్లాలోని బెస్తవారు ''నాయక్'' అని తమ నామము చివర ఉంచుకొంటున్నారు.

బంజారాలకు వస్తే మొత్తం దక్షిణ భారతంలోని బంజారాలు తమ నామం చివర నాయక్ అను బిరుదమును వుంచుకొంటున్నారు. బంజారాలు స్వతహా క్షత్రియులు కావున వారికి కమాండ్ చేయవలసిన అవసరంలేదు అని అర్థమగుచున్నది. మా తాత శ్రీ బాణోత్ వసరాం నాయక్ (కుంతావత్ రాథోడ్) గారి తాతగారైన శ్రీ తోకానాయక్‌గారు, టిప్పు సుల్తాన్‌గారి సైన్యములో కమాండింగ్ ఛీఫ్‌గా వుండేవారు. వారి(నా ముత్తాత తండ్రి)కి ఒక జానెడు తోక కూడా వుండేదట. వారు ఉపయోగించిన ఖడ్గము, బల్లెము (పొడుగాటి కట్టెకు బిగించిన శూలము) ను ఇప్పటివరకు మాకుటుంబీకులు పూజలు చేస్తూ వున్నారు.

వీరు తమ యుద్ధ నైపుణ్యమును చూపి, రాజుల విజయమునకు ముఖ్య కారకులైనారు. రాజుగారు వీరికి ఒక తామ్ర పత్రమును(రాగి శాసనము)ను ఇచ్చివున్నారు. అందులో వీరు నాలుగు కోరికలను కోరియున్నారు. ఒకటి గ్రామములకు పయనించునపుడు ఏదేని గ్రామములో తమ గోవులు ఇంటి ముందున్న కుడితి నీరు త్రాగుచున్న తోలరాదు. 2. ఏదేని పొలములో ప్రవేశించి మేయుట సంభవించిన అడ్డగించరాదు. 3. బంజారాలు తమ ఆహారము కొరకు చెలువులలో వేసిన దోసకాయలు కళింగర కాయలు (పుచ్చకాయలు) మొదలగు వాటిని కోయునపుడు అడ్డగించరాదు. 4. 'బారాఖూని మాఫ్' తమ మనుగడకు ఆపద సంభవించునపుడు ఆత్మ రక్షణార్థమై ఒక రోజుకు 12 మందిని ఖూనీలు చేసిన విచారించరాదు. అంతకన్న ఎక్కువ ఖూనీలు జరిగిన మాత్రమే విచారించవలెను.

ఈ విధంగా పై నాలుగు కోరికలను శాసన రూపంలో గ్రహించి తమ గోసంపదకు అనువైన ప్రదేశములను ఎన్ను కొని తమ తాండాలను స్థాపించుకొని వారి మనుగడను సాగిస్తున్నారు. అందువలన దక్షిణ భారతంలోని బంజారాలు తమ వంశనామములను మరిచిపోయి తాము ఎవరో.అని అనుకుంటూ అన్ని కులములలాగే మనమువున్నామనే భావన కలిగియున్నారు. ఇదే ఉత్తర కర్ణాటక, తెలంగాణ, మరాట్వాడ మరియు భారతదేశంలోని బంజారాలు తమ నామము చివర వంశనామములను వుంచుకొని తమ నాయకులు ఏమని చెప్పినను వినుట వలన ఎన్నో రకాలుగా వెనుకబడిన తెలంగాణా ప్రాంత బంజారాలు, మొత్తం రాష్ట్రంలో ముందంజ వేసి రాజకీయ నాయకత్వమును వహిస్తున్నారు. కాని దక్షిణ ప్రాంతంలోని బంజారాలు తమ నామము చివర నాయక్ అను బిరుదము వుంచుకొనుటవలర అభివృద్ధి చెందలేక పోవుచున్నారు.

విడిపోతే పడిపోతాం!
చీలిపోతే కూలిపోతాం!
కలసివుంటే బలసిపోతాం!

# ప్రకృతిలోని రంగుల వడిలో తమ ఆట పాటలతో రసవత్తరమైన బంజారాల జీవితం

ఈ రోజు ఇక్కడ, రేపు అక్కడ. ఆ ప్రకారమైన జీవితమును ఒక్క చోట నిలువనీయకుండా తమ జీవితములను చిరస్థాయిచేసుకున్నారు బంజారాలు. ఎద్దుల వీపులపై ఆహారం, ధనం ధాన్యములను ఒక చోటినుండి వేరొక చోటికి తీసికొనిపోవుటయే వీరి వృత్తి. ఈ వృత్తిని స్వీకరించిన ఫలస్వరూపం, మరియు ఎద్దులు ఆవులు, మేకలు, గొఱ్ఱెలు మొదలైనవే వీరి స్థిర ఆస్తులు అయినందువలన వాటికి ఆహారము , నీరు మొదలైనవాటి కోసం వారు గ్రామము పట్టణముల రద్దీని స్వీకరించకుండా, దూరంగా అరణ్యంలోని ఎదో ఒక కొండ పాదములో వుండుటకే వీరు ఎక్కువ ఇష్ట పడతారు.

పోవుటకే సాధ్యం కానటువంటి ప్రదేశములనుండి ఎత్తైన కనుమల ద్వారా తమ తాండా వారితో నడుస్తూ నడుస్తూ తలపై నీలి ఆకాశమును చూస్తూ పచ్చని మైదానములతో, ఎత్తైన వనములతో, సెలయేళ్ళ గలగలరావముల మధ్య, ఎత్తైన కొండ శిఖరములనుచూస్తూ, ఆనంద భరితమైన మనస్సుతో నడచి నడచి బంజారాల పాదములు సాయంత్రపు నీడలలో నడుస్తూ, సాయంత్రం అవగానే తమ తాండావారి విశ్రాంతికొరకై తమ బిడారులను దించి విశ్రాంతి తీసుకొంటారు. తెల్లవారు జాముననే సూర్యుడు ఉదయించే ముందుగానే వీరి రెండవ నివాసంకై ప్రయాణం సాగిస్తారు.

తాండా నిద్ర మేల్కొనక ముందే ఎద్దుల మెడలలోని గంటలు, కోకిల రాగాలు చెపుతాయట. పరదేశిలెయ్యి నీకు ముందుసాగే పనివుంది. ముందు గ్రామములో చేసుకొందువు మీ తాంబూల శాస్త్రము. ఈ విధంగా గ్రామం తరువాత గ్రామము వదులుతూ తాండా ముందుకు సాగిపోతూ వుండును.

**ప్రకృతిమయమైన తాండా సంస్కృతి :** ఏ విధమైన స్థిరనివాసంలేని జీవితమును గడుపుతూ ఎల్లప్పుడు కారు చీకట్లను చూచారు. వర్ష ఋతువులలో సంభవించు భయంకరమైన తుఫానులకు, ఆకాశములో కారు మేఘములతో నిండిన మేఘముల ఘర్జనలు, మెరుపులు, పిడుగుపాట్లను వారు స్వయంగా చూచారు. ఒక్కొక్కసారి తమ తాండాలు తుఫానులలో చిక్కుకొనిపోయినవి. వీటినన్నింటిని ఎదురించి ముందుకు సాగి వారు నీలి ఆకాశములో వందల వేల కోట్ల నక్షత్రాలను చూస్తూ, అదే సమయములో భూమిపై వెలిసిన వన మైదానములను ముదురు పసుపు, ఎరుపు రంగులలో వెలసిన వన్య క్షేత్రములను వాటి స్వాభావికమైన ఆనందాన్ని చూస్తూ అనుభవించారు.

శిఖరాగ్రములనుండి వెలసిన సెలయేళ్ళను, భూమిపై ప్రవహించు జలపాతములను, వాటి ఇరు ప్రక్కలయున్న వృక్షములు, వాటిపై వెలసిన పసుపు ఎరుపు రంగుల పూల ఆనందాన్ని చూస్తూ, చెట్ల కొనలపై కూర్చుని సంగీతమును ఆలాపించు పక్షుల కిల కిల రావములను వీరు విని ఆనందించారు.

వసంత ఋతువులో ఆకాశములో వెలువడు ఇంద్ర ధనస్సులోని ఏడు రంగులయొక్క మంగళ ప్రదమైన బంధనమును, ప్రసరింపచేస్తున్నాయి. పచ్చని నిండైన వనములతో, అప్పుడప్పుడే మొలుస్తున్న మెత్తని పచ్చదనంతో నిండియున్న గడ్డిని మేస్తూ వెళ్ళుచున్న ఎద్దులు, ఆవులమందలను తోలుకుంటూ తాండా ఇక్కడా? ఎక్కడా? అన్నట్లు వ్యాపించియున్న వనాలను చూస్తూ వారి మనస్సులు ఆనందములో లీనమైపోయాయి.

కార్తీక మాసంలో సాయంకాలము, సూర్యాస్తమయంయొక్క ముదురు ఎరుపు రంగు (ఎఱ్ఱగౌరు) లోని పసుపు, ఎరుపు, బంగారు వర్ణములాంటి లోతైన గోతిలో సూర్యుడు పడిపోతున్నట్టుగా వారు చూచారు. తరువాత వారి తాండ ఒక గ్రామము తరువాత వేరొక గ్రామమును చేరకనే చీకటి పడినది.

పూలగుత్తులలోని ఎట్టిటి పూల ఆనందాన్ని ఆ వనములో పూచిన వివిధ రంగులలో వున్న పూల అహ్లాదాన్ని, కోవెలయొక్క పంచమ రాగాలను మరియు దయాళు పక్షులయొక్క మనోహరమైన సంగీతమును వింటూ బంజారాలు వారియొక్క సాంస్కృతిక జీవనము గొప్ప ఆనందముతో వెల్లివిరిసినవి.

వారి తాండ ఒక గ్రామము వదిలి మరియొక గ్రామము పోతున్నప్పుడు వారు ప్రకృతియొక్క ప్రతి ఫలమును చూస్తూ వాటి ఆనందమును అనుభవిస్తూ, కీకారణ్యముల నుండి వెలువడు సంగీతమును, వనము పుష్పించి వెదజల్లు సువాసనలను గుర్తించుచూ, వాటి దగ్గర వుండి ఆనందించి అనుభవించారు. వాటియొక్క ప్రతిబింబమును వాటి కళాపూర్ణతను చాటి చెప్పినవి. అయిన వారు విద్యావిహీనులుగా వుండిరి. వారి వద్ద సౌందర్యమును ఆస్వాదించే శక్తి గల నిర్మలమైన మనస్సు కలిగియుండిరి.

స్వశక్తిపై జీవిస్తూ ఎల్లప్పుడు ఒక చోటినుండి, మరియొకచోటికి ప్రయాణం సాగిస్తూ వారి జీవితమును దుఃఖమనే వదనమునకు దూరంగా ఆశాజీవులుగాజీవించుటకు వారు ఎట్టిటి రంగునకు ఆకర్షించబడిఉండిరి. అలాగే వారు ప్రసిద్ధిచెందినారు. దాని ఫల స్వరూపం ఎట్టిటి రంగునకు ఇతర రంగులను కలుపుట వలన వారియొక్క వస్త్రములలో సౌందర్యమును జోడించి గుర్తింపును పొందారు. గ్రామాల, పట్టణాల ద్వారా వెలువడు శబ్ద కాలుష్యం నుండి దూరంగా వుండి వీరి జీవన ప్రపంచం. వనములలో లభించు ఎదురు పిల్లన గ్రోవి శబ్దమునకు ముగ్ధులైన వీరి జీవితం ఆట పాటలతో ఆనంద భరితము చేసుకొన్నారు.

బంజారా శబ్దముయొక్క ఉత్పత్తి మరియు దాని వ్యవస్థ ''వాణిజ్యం'' అను మూల శబ్దము సంస్కృత శబ్దమునుండి బంజారా లేక వనజారా అనుశబ్దముయొక్క ఉత్పత్తి అయినది. వాణిజ్య శబ్దముయొక్క అర్థం వ్యాపారం. ప్రాచీన కాలంలో బంజారా ప్రజలు, ఎద్దులు మరియు ఇతర జంతువుల వీపులపై ధాన్యములనుతీసుకొని ఒక ఊరి నుండి మరియొక ఊరికి అందిస్తూ అక్కడినుండి వేరు పదార్థములను తీసుకొని వస్తూ వుండిరి. కాని వారు ధాన్య వ్యాపారం చేసేవారుకాదు. ఒక మహామేధావి ఇయస్‌టీన్ తన పుస్తకములో ''క్యాస్ట్స్ అండ్ ట్రయిబ్స్ ఆఫ్ ఇండియా'' (నాలుగవ భాగంలో) వ్రాసివున్నది. ఏమనగా బంజారాలు తమ నాయకునితో కలిసి మెలసి యుంటారు. కాని ఇతర జాతులతో వీరు కలిసేవారు కాదు. వారివద్ద వుండటానికి ఇళ్ళు లేవు అలా కనిపిస్తారు. వ్యాపారము కొరకు వారు దూరదూర ప్రాంతాలకు ప్రయాణము

చేస్తూ చాల కష్టతరమైన ప్రాంతములలో కూడ వారు ఆహార ధాన్యమును చేరవేసే కార్యక్రమం చేపట్టినారు. వారు తమ దుస్తులను తయారుచేయునపుడు వాటిని రకరకాల అలంకరణలు చేస్తారు. అవి అద్దాల ముక్కలను, గవ్వలను, సీసముతో చేసిన ఆభరణములు, వెండి గజ్జెలు, వెండి బిళ్ళలను కళాత్మకంగా వాటిని వస్త్రములపై అమర్చుతారు. సాధారణంగా వారి వస్త్రములలో అన్ని రకాల ముదురు రంగు గుడ్డలను ఉపయోగిస్తారు. దీని వల్ల వారు వెంటనే ప్రజల కంటికి ఆకర్షించబడతారు.

సూర్యోదయమునకు ముందు తమ ఎద్దులు నడచిన ఎఱ్ఱటి ధూళి లేచినతోడనే బంజారా స్త్రీల మనస్సులలో వారి శ్రమ గూర్చిన విషయం తెలియగానే వారు పచ్చదనంతో నిండిన అడవిలో రేగి పండ్లు, కట్టెలు, గడ్డి, కందమూలాలు, పండ్లు, పూలు అన్నియు సేకరించి ఆనందముతో పాటలు పాడుకొంటూ చతురములు ఆడుకొంటూ బయలుదేరుతారు.

## సొమ్ముల మీద మోజు :

బంజారా స్త్రీ తన శరీర అందములను పెంపొదించుట కొరకు వారి అంగములకు సరిపడు సొమ్ములను తొడిగి అలంకరించుకొంటారు. ఈ విషయములో డా.ఇయస్‌టీన్ చెప్పినదియేమనగా వీరి వేష ధారణ చాల అద్భుతంగా వుండును. వారు తొడిగే సొమ్ములు చాల అద్భుతంగా కనిపిస్తాయి. మేము చూచినటువంటి బంజారా స్త్రీలయొక్క చేతులలోనూ, కాళ్ళలోనూ, ఎనిమిది నుండి పది పౌనుల బరువు వరకు లోహములతో చేయబడినవి కాని, ఏనుగు దంతములతో చేయబడిన ఆభరణములు వుండినవి. వారు చేతులకు తొడిగిన ఏనుగు దంతములతో చేయబడిన గాజులు చేతులనిండా ఉండుటవలన వారు చేతులను శుభ్రము చేయుటకు వీలుపడుతుందా లేదా? యని అనుమానము కలిగినది.

## అపురూపమైన అందం:

బంజారా స్త్రీలయొక్క ముక్కుల గూర్చి చెప్పవలెయునంటే వారు వేసుకొనే ముక్కుపుడక ''భూరియా'' (గుండ్రని చందమామలాంటి) ముఖంయొక్క అందాన్ని ఇనుమడింపజేస్తుంది. చేతులనిండా వేసికొనియున్న తెల్లటి ఏనుగు దంతములు వారియొక్క అందాన్ని ఇంకా ఎన్నో రెట్లు పెంచుతున్నది.

## పెండ్లి అయిన బంజారా స్త్రీ వేసుకొనే సొమ్ములు :

''గుఘరీ'' అను పేరుగల సొమ్ము చాలా అందమైనది (వెండితో చేయబడినది) తన పొడుగాటి నల్లని వెంట్రుకలు, తన నొసటినుండి తీసిన ''మాంగ్'' (పాపిట) తన ఎద్దపైకి చూస్తునట్లు అల్లిన వెంట్రుకలను పట్టుకొని వేలాడుతూ ఈ గుఘరీతో పాటు ''టోప్లి'' లను జోడించి (వెండితో చేయబడిన ఆభరాణాలు) ఉందురు. ''చూడో'' అనగా తెల్లటి ఏనుగు దంతములతో ,చేయబడిన గాజులు మోచేతికిపైన నిండుగా కనిపించుతాయి. వీటితో పాటు ''కస్సె'' వాంకడి వీటిని కాళ్ళల్లో ధరించుతారు. వీరు నడిచినప్పుడు వాటిలోవున్న సన్నని

గుంఢ్లవలన ఝుమ్ ఝుమ్ అని చాలా ఆకర్షణీయమైన శబ్దము కలుగుతుంది. ''మాటలీ'', ఆంటీ మరియు చూడ్ వీటియొక్క సుందరమైన అలంకరణ చాలా చూడ ముచ్చటగావుండును. వారి ముక్కునకున్న ''భూరియా'' (ముక్కుపోగు )ముత్తైదు స్త్రీయొక్క అందాన్ని ఇనుమడింపచేస్తుంది.

పూర్వం వెండి రూపాయల బిళ్ళలతో తయారు చేసిన కంఠహారం సుందరీమణుల కంఠములను అలంకరించియుండును. పగడములతో గ్రుచ్చబడిన (లాల్డి) దండలు ప్రతి బంజారా స్త్రీ కంఠములో తొడగబడిన ముత్తైదువ అని అర్థం చేసుకొనవలెను. వెండితో మెడనిండా గుండ్రముగా లావుగావుండు ''హాసలి'' దాని ముందు భాగంలో వెండితీగతో లావుగా చుట్టబడి ఎదలను అంటునట్లుగా వెండితో చేయబడిన బిళ్ళలు, వాటి క్రింద వెండి గొలుసులతో వెండి గజ్జలు వ్రేలాడబడి చూచుటకు చాలా అందంగా వుండును. ఇది కాస్త సంపదవున్నవారు మాత్రం వేసుకొంటారు. సుమారు ఒక కేజి బరువు కలిగి వుంటుంది.

## వివాహితులు అవివాహితులైన బాలికలయొక్క ఆభరణములలో బేధము :

వివాహితులైనవారు కాళ్ళలో ''వాంకడి'' తొడుగుతారు. అవివాహితులు కాళ్ళల్లో ''గరతణి'' తొడుగుతారు. వివాహితులైన స్త్రీలు మాత్రమే మోచెయ్యి నుండి భుజము వరకు ఏనుగు దంతములతో తయారు చేసిన గాజులను తొడుగుతారు. ''ఆంటి'' మూడు అంగుళముల పొడవు ''V'' ఆకారంలో రెండు కట్టె పుల్లలు వెనుక జడభాగంలో కుచ్చి భద్రంగా అల్లివుంటారు. ఇవి అన్నియు సౌభాగ్యవతియైన స్త్రీ యొక్క చిహ్నములు (గుర్తులు) ఈ ఆంటి ఆకారం విదర్భ ప్రాంతంలో వున్నది. (మహారాష్ట్రం). ఖందేశ్ ప్రాంతంలో ఆంటి బదులు ''హతోడీ'' అనగా ఒక పొడుగాటి కట్టెను వుంచి వెనుక జడలో అమర్చుతారు. ఇది మహారాష్ట్ర ప్రాంత బంజారాలు మాత్రం పాటిస్తారు. ఖండేశ్ భాగంలోని బంజారా స్త్రీలు వేసుకొనే దండ పొడవు ''సవా హాత్'' సుమారు 22 అంగుళముల పొడగుంటుంది. దీనిని నెత్తిపైన జడలో బిగించి యుంటారు. ఇది ఇంటిలోకి వెళ్ళినప్పుడు ఇబ్బందిగా వుండకుండా దానిని వంచి తిరిగి వెంటనే నిలువుగావున్నట్లు తయారు చేసి ఉన్నారు. అదికనిపించకుండా దీనిపై నుండి తమ వస్త్రమును కప్పియుంటారు. (కట్టి) వివాహిత స్త్రీ ఇంటిలో పోవునపుడు తన ఎడమ చేతితో వంచి ఇంటిలో వెళ్ళిన వెంటనే అది నిలువుగా ఉండిపోతుంది. వివాహముకాని ఆడపిల్లలు ఇవి ఏమియు తొడగరు.

## వివాహిత స్త్రీలు ధరించే దుస్తులు :

వివాహిత బంజారా స్త్రీ ''ఫేటియా'' (లంగా) దానిపైన రకరకముల అద్దములు, ''పూందా''(కుచ్చులు) ''లామణ్'' ''లేపో'' ''సాడీ'' అను రంగురంగు గుడ్డలతో జోడించి వాటిపై కళాత్మకమైన అల్లికలతో తయారు చేసివుంటారు.

''కాలీ'' ఇది కూడ ''ఖవ్యా'' ''తన్‌తనియా'' ''పేటి'' అను రకరకాల అల్లికలతో అద్దాలు, గవ్వలు, సీసముతో చేసిన ఆభరణాలు వెండి గజ్జలు వేసి అలంకారముగా కుట్టి వేసుకొంటారు.

''ఛాంటియా'' (పైట) ఇది తలపై నుండి శరీరము మొత్తమును కప్పుకుంటారు. దీనికి ''ఘుంగటో'' మరియు రకరకాల అల్లికలతో, అద్దాలతో అందంగా అలంకరించి వుంటుంది. ఇవి అన్నియు ధరించి రోడ్లపై నడుస్తునప్పుడు వారి కాళ్ళకివుండు వాంకడీలోని రాళ్ళు ఝుమ్ ఝుమ్‌యని శబ్దములను ఇస్తూ, వారి నోటి నుండి వెలువడు సుమధురమైన సంగీతమునకు తాళములు వేస్తున్నట్లుగా విన్నవారికి అనందాన్ని కలిగిస్తూ వుంటుంది. బంజారా స్త్రీలయొక్క సంగీతం, బంజారాలయొక్క ఉనికిని వెంటనే తెలియపరుస్తుంది. కోవిలయొక్క గానం వెదురుతో తయారు చేసిన పిల్లనగ్రోవినుండి వెలువడు సుమధురమైన వేణుగానం ప్రకృతిలోని ఆనందము బంజారా స్త్రీలకు గానమును నేర్పించినవి. సంగీతమనేది వారియొక్క గుణముల స్వాభావికమైనవి. వారు ధాన్యమును దంచునపుడు, పిండి చేయుటతో పాటు ఇతర కార్యక్రమములను చేయునపుడు వారు ఆనంద పరవసులై పాటలు పాడుచూ ఉండటం మనం చూడవచ్చును.

## బంజారా స్త్రీలయొక్క గ్రూప్ నృత్యాలు చాలా ప్రఖ్యాతి చెందినవి

''కుమారి'' బంజారా పెండ్లికాని ఆడపిల్లల వేషధారణ కొంచెము వేరుగా వుంటుంది. వారు గవ్వలతో అల్లిన సుందరమైన ''ఫేఠియా'' (లంగా), ''కాంచలి''కి (జాకెట్) బదులుగా సాధారణ కాలీ అలంకారము లేనిది వేసుకొంటారు. ప్రకృతి ఒడిలో తిరుగుతూ ఆడుతూ పాడుతూ తిరిగే బంజారా స్త్రీ జన్మతా చూడటానికి మనోహరమైన మరియు సుందరమైన శరీరముతో వుండి శ్రమపడి పనిచేయుటలో సిద్ధహస్తులు. ఖాళీగా వుండు కాలములో ప్రకృతి సిద్ధమైన ముదురు రంగు ఎరుపు, పసుపు ఆకుపచ్చ, నీలము రంగులతో కలిసిన గుడ్డ ముక్కలను వాటికి సరిపోవు ఇతర రంగు గుడ్డలను జోడించి, ఎరుపు, నలుపు, తెలుపు ఇతర రంగుల దారములతో తమకు కావలిసిన గుడ్డలను జోడించి తమ దుస్తులను స్వయంగా తయారుచేసుకుంటారు. వారియొక్క కళాత్మకమైన, మనస్సుకు నచ్చిన రీతిలో సౌందర్యప్రదానమైన అల్లికలనుచూచి విదేశీయులు కూడ ఆకర్షించబడుచున్నారు. వీరియొక్క కళను ప్రశంసిస్తూ ఈ రోజులలో గాజు ముక్కలను ఉపయోగించి తయారుచేయబడిన అలంకరణములను ఈ నాటి ఆధునిక యువతి యువకుల భుజములపై వ్రేలాడబడియున్నవి మనము చూస్తూనేవున్నాము. దీనిని బట్టి ఒక విషయం అర్ధమౌతుంది బంజారాలయొక్క అలంకరణలు మనకు చాలా ఇష్టమయినవి.

## రెండు పీటల వెడల్పయిన రొట్టెలు:

బంజారా స్త్రీ తయారుచేసే రొట్టెల పద్ధతి అన్నింటి కంటె చిత్రంగా వుంటుంది. గోధుమ పిండిని కలిపే ముందు రుచికొరకు ముందు కొంత ఉప్పునువేస్తారు. దానిని బాగా కలిపి ముద్దగా చేసి ''దరాణి'' పైన అంటే పిండిని విసరడానికి ఉపయోగించు దప్పమైన గుడ్డతో

దీనిని తయారు చేసివుంటారు. దానిపై కలిపిన పిండి ముద్దను వుంచుతారు. మొదట రెండుచేతులకు మంచి నూనె పూసుకుంటారు. బాగా పిసికిన పిండి ముద్దను పిడికిలినిండా తీసుకొని దరాణిమీద ఉంచి రెండు చేతులతో దానిని తట్టుకుంటూ చాల వెడల్పుగా గుండ్రముగా తయారుచేస్తారు. చాలా వెడల్పుగాను, చాలా పలుచగాను తయారు చేసినరొట్టెను చూచినవారు మంత్రముగ్ధులైపోతారు. వీటిని వెడల్పయిన పెనములు మీద కాల్చుతారు. వేడివేడి రొట్టెలను తినుట వలన మంచి రుచికరంగా వుండి ఆనందాన్ని ఇస్తుంది.

## మదిరా – మాంసము భుజించిన ఆనందములో సంగీతం :

· ప్రతి ఆహ్లాదకరమైన వాతావరణంలో మరియు పండగ ఉత్సవాలలో మాంసమును ఉపయోగిస్తారు. మేక పోతును కాని పొట్టేలుకాని వాటిని దేవతలకు నరికి వాటి మాంసంమును వండి బంజారాలు తమ తమ ఆనందాన్ని ప్రకటించుకొంటారు. వారు దేవునికి నైవేద్యము పెట్టుటకు పసుపు, ఉప్పు కారము మాత్రమే వేసి ''ఫేరేర్‌బోటి'' అని తయారుచేస్తారు. దీనితోపాటు దేవతలకు నైవేద్యము పెట్టిన ''లాఫ్సీ'' (పాయసం) బియ్యం, బెల్లం, పాలు, నెయ్యి వేసి తయారు చేసినది గట్టిగా ముద్దగా వుంటుంది. ఇది మాంసంతో చాలా రుచిగావుంటుంది. మరియొక పద్ధతి ''సలోయి'' అనగా మొదట మెత్తని మాంసం. శరీరంలోపలి భాగంలోవున్న అన్ని అవయవములు మొత్తం మసాలా వేసి వండిన తరువాత ముందుగా తీసివుంచిన రక్తమును ఆఖరులో కలిపి వండుతారు. ఇది చాలా రుచిగావుంటుంది. దీనిని రాగి రొట్టెలు, అన్నం కలిపి తిన్న చాలా రుచిగావుండి ఆనందాన్ని కలుగజేస్తుంది. మాంసమును ఉప్పు, కారం, పసుపుతో బాటు ధనియాలు, అల్లం, కొత్తిమిర,ఎండు కొబ్బరి వేసి బాగా ఉడికిన తరువాత సుగంధ ద్రవ్యాలు అన్నియు చివరలో పొడి చేసి వేసి వండిన మాంసము చాలా రుచిగావుటుంది. బంజారాలకు ఇష్టమైన పదార్థములు రొట్టెలు మాంసము మరియు మధుపానంతో ఆనందిస్తారు.

బంజారాలు తమ ఆనంద సమయంలో నగారా మోగిస్తూ కంచు పళ్ళెములను మ్రోగిస్తూ పిల్లనగ్రోవిని ఊదుతూ పాటలు పాడుతుంటే బంజారా స్త్రీలు గుంపుగా గుండ్రగా చేరి ఆనందముతో నాట్యము చేస్తూ భూమిపై స్వర్గమును సృష్టిస్తారు. బంజారా పురుషులు నగారా – తాళములు పళ్ళెములు మ్రోగిస్తు తమ పూర్వుల చరిత్రను గానము చేస్తూ వుంటే చూపరులకు విన్న వారికి ఒళ్ళు పులకరించి ఆనందముతో ప్రకృతిమయమైన ఆ గానములో పరవశులైపోతారు. బంజారాలు తమ పండగలు పూజలు అన్నియు సాయంత్ర్య కాలం లేక రాత్రి పూట చేస్తారు. వీరు పగలంతా తమ దిన చర్యలలో మునిగి వుంటారు. మంచి వెన్నెల రోజులలోనే, మంగళవారంనాడే ఎక్కువగా చేస్తారు. ఎందుకనగా రాత్రి పూట వారికి విశ్రాంతి దొరుకుతుంది. భాగా భోజనాలు చేసిన తరువాత ధట్టమైన అరణ్యములో చల్లని తెల్లటి వెన్నెలలో రమణీయమైన వాతావరణములో వీరు తమ ఆటలు పాటలు, నృత్యాలు చేసుకొని ఆనందిస్తారు.

## కఠినమైన స్వరముకల ఆడపిల్లలు పెండ్లికిదూరం :

బంజారా సమాజంలో పెండ్లి కుమార్తెకు సంగీతం మరియు నాట్యం ముఖ్యంగా వచ్చివుండవలెను. ఈ విషయములో అందరు తమ ఇష్టమును ప్రకటిస్తారు. ఈ కారణం వలన

కఠినమైన మాట గల అమ్మాయిని ఎవ్వరూ పెండ్లి చేసికొనుటకు ఇష్టపడరు. పెండ్లి అవటం కష్టమైపోతుంది. అప్పుడప్పుడు కఠినంగా మాట్లాడే పెండ్లి కాని కన్యలు ఈ సమాజంలో కనిపిస్తారు. ఎందుకనగా సంగీతం నృత్యం బంజారా స్త్రీ జీవనవిధానంలో ఒక అంగంగా నిలిచిపోయినది. ఇంటిలో పెండ్లి అయ్యే బిడ్డ (మధ్య తరగతి వారికి) ఉండడం సాధారణ విషయం. బిడ్డ పెండ్లి చేయవలెయునన్న తండ్రికి ఒక సమస్యగానే వుంటుంది. కారణం వారికి కట్నం ఇవ్వవలసివుంటుంది కాని ఇటువంటి పరిస్థితి బంజారా సమాజంలో లేదు. పూర్వకాలంలో ఆహార ధాన్యములనుతీసికొని రావటం తీసికొనిపోవటం జరుగుచుండేవి. వారు ఈ విధంగా వుంటూనే వారు ఒక నిర్ణయించబడినచోటుకు వచ్చి కలుసుకుంటూవుండేవారు. ఒక తాండా మరియొక తాండాతో కలుసుకొనేవారు. వాటియొక్క వర్ణనలను వారు ఈ రోజు కూడ పాడుకుంటూ ఆ ప్రదేశమును తలచుకుంటారు. ఉదా: ఒక చోటు (స్థలం) ''బాదుర్ బండా సత్తేనసాన్–మూడు భుక్యార్ ఏకజ్ మలాన్'' వధువు మరియు వరుడు గోత్రములు సరిపోయిన వరుడు కొరకు వధువునడగడం జరుగుతుంది. పెండ్లి కావలిసిన వరుని తండ్రి వధువు తండ్రికి ఇచ్చే సొమ్మును ''కరార్'' (వోలి) ఇవ్వటం జరుగుతుంది. ఇది జాత్ వారికైతే 101రూపాయలు. భుక్యా వారికైతే 100 రూపాయలు. వివాహం 7రోజులనుండి 3నెలల వరకు తాండాయొక్క ఆర్థిక పరిస్థితులనుబట్టి మరియు పెండ్లి కుమార్తె తండ్రి యోగ్యతను బట్టి చేయటం జరుగుతుంది. ఈ వివాహం గూర్చి శుభ కార్యములు అను విషయములలో పూర్తిగా వివరించడం జరగినది.

## హృదాయాన్ని కదలించే ''ఢావలో'' గీతం :

ఢావలో గీతం బంజారా స్త్రీ యొక్క కర్తవ్య నిర్వహణలో స్త్రీ మనస్సు మరియు జీవితం ఇమిడియున్నది. తనయొక్క జీవిత మార్గమును ఆమె నిర్ణయించుకొంటుంది. బంజారా పెండ్లి కూతురు వివాహమునకు ముందు ''ఢావలో'' అను గీతంను నేర్పిచండం జరుగుతుంది. బంజారాలయొక్క జీవితం సంగీతమయమై వుండుటవలన వివాహిత జీవితంలో వివిధములైన విషయాలలో స్త్రీలయొక్క పాటల విధానం మార్పుచెందుతుంది. ఏ ఏ విషయములో ఎలా పాడాలి, ఎలా రాగం తీయాలి అను విషయం పాటలు పాడుతూ ముత్తైదు స్త్రీలు నేర్పించుతారు. దుఃఖ సమయంలో ఆత్రంతో, ప్రార్థన చేయు సమయంలో నిశ్చలమైన మనస్సుతో తమ కోరికలను వేడుకొనుట. తల్లిదండ్రుల ఇంటికి పోయినప్పుడు తమ తల్లిదండ్రులకు ప్రమాణం చేసే టైమ్‌లో బంజారా పెండ్లి కుమార్తెకు ''ఢావలో'' వివిధ పద్ధతులలో రాగాలు తీస్తూ వారి మెడలను రెండు చేతులతో వాటేసుకొని కరుణతోను హృదయాన్ని కదిలించే విధంగా పాడటం జరుగుతుంది. ఈ వివిధ రకాలైన కరుణ, దయ, హృదయ విదారకమైన విషయములను తెలుపుతూ చేసే ''ఢావలో'' పాడిన పాటలో ప్రతిబింబించగలవు. అత్తగారియింటికి సాగనంపేటప్పుడు వధువు మనస్సులో ఆనందము దాగివుంటుంది. అత్తగారు ఊరు (తాండా) పోయినప్పుడు ఆ తాండాలో తన గూర్చి చర్చ ఎలాగుంటుదో మరియు తన పుట్టిన తాండా విడిచిపెట్టే సమయంలో మనస్సు వియోగమును పొందుతుంది. ఇటువంటి సందర్భములో పెండ్లి కుమార్తె తన తాండా ప్రజలతో ప్రతిజ్ఞ చేస్తుంది.

''రాంగో నవజూం-నవియూం-
రూపో తపజూం తపియూం
సూఈరే నాకె మాయాతి నికల్‌యూ
తోబి తమారే ఆకీమా కొనిఆయేదూ!
మార్ నాయేకే బాపు-హి--హాం

నేను సీసముతో సమానముగా కోమలంగా (మెత్తగా) ఉండి నా అత్త మామగారి ఇంటిలో పెద్దలయొక్క ఆజ్ఞను పాటించుతాను. వెండి ఎలా కంసాలి చేతిలో వేడిని తట్టుకొని ఆభరణములు చేయుటకు వీలు కలిగిస్తోందో అదే ప్రకారం కఠినమైన పరిస్థితులను ఎదుర్కొని పనిచేస్తాను. సూదిలోని దారంలాగా వారి ఆజ్ఞలను పాటిస్తాను. అత్తమామలు తల్లిదండ్రులు పుట్టిన తాండాకు చెడ్డ పేరు తెచ్చేయంత పనిని నేను ఎన్నడుచేయను అని ప్రతిజ్ఞ చేస్తున్నాను.

ఎల్లప్పుడు తన కర్తవ్య నిర్వాహణలో ఒక చోటి నుండి మరియొక చోటుకు ప్రయాణమైపోవు ప్రజలలో కూడా తమ సంసార విషయములలో పాటించు కొన్ని నియమములు వారి సంస్కృతిని కాపాడుకొనుచు వారి జీవన గమ్యమును సాగించుతూ వుంటారు. ''ధావలో గీతం నుండి వెలువడు శబ్దముళను'' వరుని తరుపు వచ్చినవారు నిశబ్దమును పాఠించుతూ పెండ్లి కుమార్తె చేసిన ప్రతిజ్ఞను వింటారు. ఈ ప్రతిజ్ఞ విన్న తరువాత అందరు కలిసి వారి ఆనందమును పంచుకొంటారు.

# బంజారా చరిత్ర - ప్రాముఖ్యత

## బంజారాలు -సంస్కృతి యొక్క వంశ పారంపర్య రక్షకులు

సంస్కృతిని వంశ పారంపర్యంగా రక్షించినవారు. పంచాయత్ ప్రణాళిక బంజారాలలో ప్రారంభము నుండి (పూర్వకాలము నుండి) వస్తున్నది. వారియొక్క ఉత్తమ న్యాయమైన (ధనం) పద్ధతి వంశ పారంపర్యంగా వస్తునట్లుగా ప్రకటించడమైనది. బంజారాల న్యాయ స్థానములో జాతి భేదము, ప్రాంతీయ భేదము చూడటానికి కూడ కనిపించదు. దీనియొక్క ముఖ్య కారణం ఏమనగా అన్ని పోట్లాటలు- రంపులు, వీరి తాండా నాయకుని ద్వారా పంచాయితీ ద్వారా తీర్పు చెప్పబడుతుంది. పంచాయితి కూడ నియమబద్ధమైన దండన ద్వారా అందరి సమ్మతితో విధించబడుతుంది. ఎవరైతే మోసగించబడినారో వారిని గూర్చి బాగా విచారణ చేసి వాస్తవమును గ్రహించి, అందరిని గుచ్చి గుచ్చి విచారించి ప్రజా సమ్మతముతో దండన అమలు పరుచుటకు గాను పూనుకుంటారు. ఉదా: పంచాయితిలో విచారించేటప్పుడు ఒకడు తాను చెప్పిన విషయం పూర్తి అయ్యే వరకు, రెండవవాడు ఒక పల్లెత్తు మాటకూడ మాట్లాడడు. ఏదైన చెప్పదలచుకుంటే ముందే నాయకునితో అనుమతి తీసుకొనే మాట్లాడవలెను. న్యాయం కొఱకు వచ్చిన బంజారా ''సుణజోరే వర్గామ్ వామనియభట్'' అను శబ్దములు చెప్పి తనయొక్క మాటలు ప్రారంభము చేస్తారు. (రాజుగారు, మంత్రిగారు నా మాటను ఆలకించండి లేక తాండాలోని నాయకుడా మరియు కార్యదర్శిగారు) అని అర్థం. ఈ విధంగా వీరి పంచాయితి (న్యాయస్థానము) పూర్తి కావలెనన్న నాలుగు ఐదు రోజుల వరకు

జరుపుటకు వీలు వుండిన ఆ నాలుగు ఐదు రోజులు ముద్దాయిలిద్దరకు వారి భోజన ఖర్చులు కూడ భరించవలసి వస్తుంది. ఈ విధంగా పంచాయితి నడుస్తూనేవుంటుంది. అలా భరించలేని పక్షంలో పంచాయితి కూర్చున్న పెద్దలు తమ తమ ఇండ్ల నుంచి భోజానాలు తెప్పించుకొని భోజనం చేస్తారు. పంచాయితి చేయటం మాత్రం వదిలిపెట్టరు. ఎప్పటి వరకు పంచాయితి తీర్పు కాదో అప్పటి వరకు పంచాయితి చేస్తూనే వుంటారు. ప్రజా తంత్ర మరియు న్యాయ విచారణలో మాత్రం ఈ విధమైన – అద్భుతమైన ఈ వంశ పారంపర్యంగా వస్తున్న పద్ధతి ఎక్కడ కూడ చూచుటకు కనిపించదు.

## ప్రామాణికమైన ఒక గొప్ప సాధు గుణం :

వ్యాపార వృత్తి బంజారా ముఖ్య కార్యక్రమముగా వుండెను. అయినప్పటికి వారు సంపూర్ణ మనస్సుతో కేవలం మాట మరియు నమ్మకముపైననే జరుగుచుండెను. ఎద్దులపై గాని, ఒంటెలపైగాని వస్తువులను, ఆహార పదార్థములను రవాణా చేస్తువుండిరి. రకరకాల వస్తువులు ధాన్యములు తీసుకొనిపోవునపుడు ( బస్తాలు) వాటిని భద్రపరుచుటకు చర్మములతో తయారుచేసిన వాటిని కప్పుచుండిరి. ( తడసిపోకుండా) ఇది వెంటనే ప్రజల కంట పడుచుండెను.

వ్యాపార సమయములో వ్రాతకోతలు లేకుండగనే అక్కడచూచిన సాక్షాధారములపైననే బంజారా ప్రజలు ఒక లెక్కగా తీసుకొని విశ్వాసపాత్రులుగా వుండి పనిచేసేవారు. పరివర్తన చెందిన కాలంలో కూడ పారంపర్యంగా వస్తున్న గొప్ప సాధు గుణం వారియందు కనిపిస్తుంది.

## వారు నివసించే విధానం లేక ఉండే పద్ధతి :

వివిధ ప్రాంతాలలో నివశించే బంజారాలలో కొంత మార్పు ఉండవచ్చు అయినా సమానముగానే మొత్తం హిందూదేవీదేవతలను వారు నమ్ముతారు మరియు పూజించుతారు. ఎంత వరకనగా పంజాబులోని ముల్‌తాని బంజారాలు ముస్లిములు అయివుండి కూడా ఈ పద్ధతులనే పాటించుతారు. బంజారాలంతా ఒక్కటే అంటారు. వారు జీవించే విధానమొక్కటే. పైకి కట్టిన పంచలు, భుజాలపై అంగ వస్త్రం తమయొక్క దర్జాను చూపించే పెద్దదైన తలపాగ, సాధారణమైన చెప్పులు ఇది పురుషులయొక్క వేషధారణ. చేతిలో వెండి కడియం నడుమునకు వెండి మొలత్రాడు , చెవులకు ''కన్యా'' అనగా పెద్ద రింగు దానికి గజ్జులు. చెవికి పై భాగంలో తొడుగుతారు. భుజంపై దుప్పటి బాగా అలంకరించినది. మంచి అందంగా వేసుకొంటారు. చేతిలో ''కరవాలం'' (ఖడ్గము) నడుముకు కఠారి ( నడుమునకు బాకు) కూడా ధరించుతారు. అనివార్యమైనవి అయిన వాటిని కూడా వీరు విడవరు.

## బంజార స్త్రీ వేషధారణ :

ఆకర్షణీయంగా వుంటుంది. ఆభరణాలు, గుడ్డలు ఎన్ని తొడుగుతారంటే అవి చాల బరువు కలిగి వుంటవి. వీరు వేసుకొనే ఆభరణాలు వెండి, బంగారము, కంచు, ఇత్తడి, మొదలైనవి వుంటవి. ''ఏనుగు దంతములతో గాజులు'' మోచేతి నుండి ముంజేతి వరకు తొడుగుకొని వుండుట వీరిలో ముఖ్య విశేషం. వీరి తలపై ధరించు వస్త్రము అంచులో వెండి నాణ్యములతో

చేసిన పావలా బిళ్ళలు, ముందుకువ్రేలాడుతూవుంటవి. అవి చూడటానికి చాలా అందంగా కనిపిస్తవి. దీనిని ''రూఫేర్ ఘుంగటో'' అంటారు. ఇది సౌందర్యమైన వారి శరీరమునకు రెండింతల అందమును కల్పిస్తుంది. తమరు లేక తమ అను స్థానములో ''తూ'' (నీవు) అని పలకరించిన మంచి ఆధారాభిమానంగా భావిస్థారు. తమయొక్క తాండాలను ఎల్లప్పుడు గ్రామములకు దూరంగా ఒకటి లేక రెండు మైళ్ళ దూరముపైననే నివశిస్తారు.

## ప్రజల హితంకోరి కార్య ప్రణాళిక తయారుచేయవలెను

ఎద్దులు లేక ఒంటెల వీపులపై ఉప్పు మూటలు వేసుకొని ఎల్లప్పుడు పనిచేసి హోలి పండగవరకు వాటిని వేసుకొని దేశములోని ఈ కొననుండి వేరే కొనవరకు తీసికొని పోవుట, తీసికొని వచ్చుట వంటి పనులను చేస్తూ ఉండిరి. మొత్తం తన కుటుంబము, బంధువులతో తిరుగుచుండు వృత్తిని స్వీకరించిన ఈ జాతి ఈ నాడు కూడ తమ ఆచరణలను అమలు పరచుకొనుచున్నది. చాచా నజీర్‌గారు తమ యొక్క మొత్తం వృత్తాంతమును బోధించుతూ పోతున్నారు. ఎవరైతే ఆధ్యాత్మిక చింతనతో చిత్రణ చేసి ఉన్నారో దాని పై బంజారాలయొక్క వృత్తిని గూర్చి ఒక సుప్రసిద్ధమైన ఉర్దూ కవిత్వంలో ఈ క్రింది విధంగా వర్ణించడమైనది. దీనికి తోడు వందల కొలది జానపద పాటలు కూడా ఆయా ప్రాంతములలో ప్రచారణలో వున్నవి. ఇది ఈ రూపంలో ప్రకటించబడి బంజారాల వృత్తి, ఉద్యోగ ధర్మమును, పారంపర్యంగాను కాపాడుకొంటూ వచ్చినారు. బంజార మహిళల పాత్ర ఇందులో సంపూర్ణమైన సహకారమున్నది. వారు మగవారితో భుజమునకు భుజం కలుపుతూముందుకు వచ్చి వారితో పాటు శ్రమలకు ఓర్చి సహకరించారు. చిన్న పిల్లల నుండి ముసలివారివరకు అందరూ కష్ట జీవులే. అన్ని రకాల వస్తువులతో పాటు పసువుల వ్యాపారం కూడా చేస్తారు మరియు గుంపులు గుంపులుగా వుండి మాత్రమే వీరు ప్రయాణము సాగిస్తూవుంటారు. ఎద్దుల వ్యాపారంలో ఒక లక్ష ఎద్దుల కన్న తక్కువ వ్యాపారం చేసేవారు కాదు. అందువలననే పెద్ద పెద్ద వ్యాపార వేత్తలు ''లాఖా బంజార'' అని పిలుచుకొనుచుండిరి. అందువలననే వీరు దేశంలోని ఎన్నో ప్రాంతములలో చెఱువులు, బావులు, కొండ ప్రాంతాలలో ఘాట్లు, మార్గాలు, మందిరములు కట్టించారు. వాటిలో ఎన్నో కేవలం రాతి కట్టడాలేవున్నవి. సున్నం గాని సిమెంట్ మొదలగునవి నామ మాత్రమునకు కూడ లేవు. బంజారాలు శిల్ప కళలలో విశేషమైన అభిరుచికి, పరిచయములుగా ఉన్నవి. ప్రజల హితం కోరి నిర్మించినవి, కావున లక్షలకొద్ది స్త్రీ పురుషులు వీటి లాభంను పొంది బంజారాలకు లక్షల ఆశీర్వాదములను ఇచ్చారు.

## బంజారాల అభివృద్ధి :

'' బణజ్'' ''బలద్'' ''నాయక్'' ''తాండా'' మొదలగు శబ్దము ఏ విధంగానైన వచ్చిన వెంటనే బంజారాలయొక్క స్మరణ అయిపోతుంది. అన్ని ప్రక్కల బంజారా శబ్దమే. ''వణజ్'' అనగా వ్యాపారము చేయువారు అనే అర్థమగుట స్పష్టం. అయితే ప్రజలు భారత మొత్తంలో వ్యాపించియున్న బంజారాలలో ముఖ్యమైన మూడు రకాల జాతులున్నవి. అవి తమ ఉత్పత్తిని కూడా వేరువేరు ప్రమాణములలో ఇచ్చి వేరువేరుగా చూపిస్తారు ఎట్లనగా హైదరాబాద్ బంజారాలు తమకు శ్రీ కృష్ణ భగవానుని జతగాడైన గోవుల కాపరియైన మోలా,మోటా

సంతానమని చెప్పుకుంటారు. పంజాబ్‌లోని ''బణజారే సరా బగి'' బనియా ద్వారా తమ ఉత్పత్తి యని సంబంధమును చెప్పుకుంటారు. ఇపుడైతే వారు ముస్లిములు అయిపోయినారు. స్వార్థముతో ముల్‌తానీ బంజరాలు చెప్పునది ఏమనగా ''మధ్య ప్రదేశ్ మరియు రాజస్థాన్ బంజారాలు తమ ఉత్పత్తి రూపానాయక్'' ద్వారా అయినది అని చెప్పుకుంటారు. వీరిని క్షత్రియులని ''వడబమనియా'' అని రాజస్థాన్‌లో అంటారు. ఇతర ప్రాంతంలలో కూడ ఇటువంటి విభిన్న భావములను కలిగి యున్నారు. దీని ఆధారముపై కాలమే నిర్ధారణచేయవలెను. ఎందుకనగా బౌద్ధ కాలమునాటి లేఖనము, జానపద కథలలో కూడా బంజారాల గూర్చిన విషయములు వైశ్యుల నుండి కూడా చెప్పబడినది. ఇది నిశ్చియము కూడ, ఎందుకనగా బంజారాలు ప్రాచీనా కాలము నుండి అభివృద్ధి చెంది వస్తున్నారు.

## రెండు సంస్కృతుల ప్రాముఖ్యత :

అంతములో రెండు ముఖ్య విషయములను చూపించి దీనిని సంక్షిప్త విషయములతో సమాప్తము చేయవచ్చును. మొదటిది బంజారాల కలయిక. ఇది జగత్ ప్రసిద్ధి చెందినది. బంజారలు ఎక్కడవున్నా ఎలావున్న వారు ఎక్కువ కాలం తరువాత కలసిన మెడలు పట్టుకొని గంటలకొద్ది ఏడుస్తూవుంటారు. ఈ విషయంలో చెప్పటం కన్నా వినటం కన్నా చూడటంలోనే బాగా అనిపిస్తుంది. ఈ విధంగా ఏడ్చిన తరువాతనే వారు తమ క్షేమ సమాచారములు అడిగి ఒకరినొకరు తెలుసుకుంటారు.

ఇదే విధంగా బంజారాలు ఇతర బంజారాలను కలుసుకొన్నప్పుడు చెప్పులు కాళ్ళ నుండి ప్రక్కకు వదలి ఒట్టి కాళ్ళతోనే తమ మనస్సులో ఎంతో గౌరవ భావముతో ''సే ఆచ్ ఛే'' (అందరూ బాగున్నార) అని అడుగుతారు. ఆ తరువాతనే మిగిలిన విషయములగూర్చి మాట్లాడుతారు.

## రెండవ విషయం గొప్ప మహత్యం గల వీరి జానపద నాట్యం

వీరు కళాత్మకముగా, వీరావేశముతో భావభంగిమలతో నాట్యం చేస్తారు. కావున ప్రజల హృదయములను దోచుకుంటారు. ఆనందమును కలుగజేస్తారు. బంజారాల ప్రస్తావన లేని చరిత్ర అది చరిత్ర కాదు. మనయొక్క గొప్ప ప్రాచీనమైన దేశంలో సాంస్కృతిక జీవనములో వుండిపోయేది. అందులో బంజారాలయొక్క మహత్యం వంశ పారంపర్యంగా సరియైన రూపంలో వారి గూర్చి తెలియపరచలేదు. వాత్సవములో నేను బంజారాల భావమును భారత వర్షములో గౌరవ పథంగా ఆది కాలంనుండి మరియు ప్రాచీన కాలమునుండి వచ్చుచున్న సమస్యలను మనస్పూర్తిగా బాగుచేయుటకు ఒక మార్గమును ఏర్పాటు చేసి, దాని అభివృద్ధికి ఒక ప్రత్యేకమైన శాసనము ద్వారా గౌరవ ప్రదముగా అభివృద్ధి చేయవలెను. (రైళ్ళు , మోటార్లు మొదలైనవి అనేకమైన సాధనములు. వాటి కారణంగా వీరియొక్క వంశ పారంపర్యంగా చేస్తూ వచ్చిన వ్యాపారం పడిపోయి వీరి జీవితం కఠినమైయుండెను. అటువంటి కాలం వెళ్ళిపోయినది, అయినప్పటికి వీరి గూర్చిన విషయములు ఇప్పటికి మన సమాజ సంస్కృతిలో నిలిచిపోయినవి. సంక్షిప్తంగా ఇందులో వారిని గూర్చి కొన్ని విషయములను మాత్రమే తెలియపరచడమైంది. ( రోమా బంజారా,బొంబాయి).

# బంజారాల తోడు నీడ ఎద్దు

టూండా ప్రదేశ్‌యొక్క అభివృద్ధి కొరకు రేండియాక్‌తో పాటు మడి స్థలం నివాసీయులకు ఒంటెపైవున్న గౌరవ స్థానము ఏలాగున్నదో బంజారాలు కూడ తమ ఎద్దులపై అంతే గౌరవమున్నది. అంతే కాకుండ 'ఎద్దు' బంజారాల జీవన విధానంతో ముడిపడియున్నది. ఎద్దు ద్వారానే తన సర్వస్వమును అభివృద్ధి చేసుకొంటాడు. ఎద్దే తన ధనము, సంపద , డబ్బు, భూమి , నిజాయితితో తన ధర్మం పాటిస్తాడు. ఆ ఎద్దు తన సహాయకారిగ భావిస్తాడు. మరియు తన పరివారములోని ఒక వ్యక్తి గా భావిస్తాడు. వారు ఎద్దుయొక్కలాలన పాలన తన పిల్లల మాదిరిగా చూస్తాడు. ఎద్దు లేనిదే అతను ఏ పని చేయలేడు. ఎద్దు సహకారంతోనే తన జీవన గమ్యము సాగిస్తాడు. అదిలేనిదే తన జీవనము గడవదు.

ఈ భూమి పై వారి పశువులే తోడు నీడ, గుఱ్ఱములు, ఏనుగులు గార్దభం, ఒంటెలు, మేకలు, గొఱ్ఱెలు, ఎద్దులు, ఎనుములు మొదలగునవి. వీటితో పాటు కలుస్తున్నవి. ఒక ప్రశ్న ఉద్భవిస్తుంది. బంజారాలు ఎద్దులనే తమకు తోడుగా వుండునట్లు ఎందుకు ఏర్పరచుకున్నారు. ఈ సందర్భము గూర్చి అనేక విధాలుగా చెప్పుకుంటారు. 1. అది అతి సాధారణమైన సాధు స్వభావముకల జంతువు. 2. ఇది శక్తివంతమైన పశువు. 3. ఇది ఆజ్ఞలను పాటిస్తుంది 4. ఎక్కువ దూరం ఒకే నడకలో వెళ్ళుతుంది. 5. గడ్డిని అయితే తింటున్నది కాని గోధుమ గడ్డి (పొట్టు) వరిగడ్డి, చెఱుకు ఆకులు మరియు చెత్తా చెదారము తింటుంది. అన్ని చోట్లలలో సులభంగా లభిస్తుంది. 6. కేవలం భూమిపై గడ్డి మేసి తన పొట్ట నింపుకొంటుంది. 7. అది ప్రత్యేక స్థానములోని వాతావరణములను సహిస్తుంది. 8. అన్ని ప్రదేశములకు సునాయాసంగా ప్రయాణిస్తుంది. 9. ఎక్కువ బరువును మోసుకొని ప్రయాణం చేస్తుంది. 10. తన తోటి ఎద్దులతో కలసిమెలసి వుండుటకు ఇష్ట పడుతుంది. 11. ఏ మార్గములో అయితే నడుస్తుందో దానిని మరచిపోదు. 12. ఎద్దు వీపుపై సామానులు వుంచుటకు చాల ఉపయోగంగా వుంటుంది. 13. ఎద్దులు భారతదేశములోని అన్ని ప్రాంతములలో అభివృద్ధి చెందినవి. 14. గోవుల ద్వారా లభించినవి కావున ధర్మగుణం కలిగి వుంటుంది. ఎద్దును తనకు తోడుగా ఉంచుకున్న ధర్మముయొక్క దృష్టిలో చాల మంచిది. 15. ఎద్దు ఎక్కువ సమయం వరకు ఆకలిని, దప్పికను సహించివుంటుంది.

ఎద్దులు బంజారాలకు ఎంతోప్రియమైనవి. వారు ప్రాచీన కాలమునుండి తమ పనులకు ఉపయోగించుకుంటూనే ఉన్నారు . దీనివీపుపైన పలువిధములైన సామానులు మోయించుకొని దేశములోని ఒక ప్రదేశము నుండి మరియొకప్రదేశమునకు ప్రయాణం చేస్తూనేవుండిరి. ఈ రోజులో ఎద్దుల మీద కాకుండా ఎడ్ల బండ్లను ఉపయోగించుచున్నారు.

సంవత్సరము పొడవునా ఎద్దులతో పనిచేయించుకుంటూనేయున్నారు. ఎప్పుడు వాటితో పనిచేయించలేక పోతారో అప్పుడు వాటికి విశ్రాంతిని ఇస్తారు. ఆ సమయములో వారు ఎద్దులకు స్నానాలు చేయిస్తారు. మంచిగా తినిపిస్తారు. శ్రద్ధగా అవి తిని బలవటానికి ప్రారంభిస్తాయి. వాటి హృదయంలో కపటం ఉండదు కావున అవి పనిచేయని కాలంలో గుంజలకు కట్టకుండా వాటిని విచ్చలవిడిగా వదలటం జరుగుతుంది. వాటికి ముక్కుకు వేసిన

ముక్కుత్రాడు తీసివేస్తారు. అందువలన అవి ఏ ఆటంకం లేకుండా శ్రద్ధగా మేసి బలవటం ప్రారంభిస్తాయి. తిరిగి దశరా సమయమునుండి వాటిని ఉపయోగించడం మొదలుపెడతారు.

ఎద్దులను దీపావళి పండుగ టైములో ఎక్కువగా ఆదరించుతారు. దానిని అలంకరించుతారు. దాని శరీరంపైన, నడుముపైన పిర్రలపైన రంగులతో అలంకరిస్తారు. ఎద్దుల పూజ చేస్తారు. వాటి కొమ్ములను బాగా శుభ్రం చేసి నూనె రాశి దారంపూలతో కొమ్ము కుప్పులు అలంకరిస్తారు మరియు ఎద్దు యొక్క తోక వెంట్రుకలను కత్తిరించి అందంగా చేస్తారు. దానియొక్క పేడను ఇండ్ల లోగిళ్ళకు అలుకుకొనుటకు ఉపయోగిస్తారు. దీపావళి ముందు రోజు ''గోవర్ధన పూజ'' చేస్తారు. (కృష్ణుని పూజ) ఆ రోజు సాయంకాలం నాలుగు లేక ఐదు గంటలకు మొత్తం ఎద్దులను వదిలి పెడతారు. అవి ఆనందముతో (పొగరుతో) ఎగురుతూ ఉంటవి. అవి వేసే పేడ భూములకు ఎరువుగా పనిచేస్తుంది. పిడకల రూపంలో వంటచేయుటకు ఉపయోగపడుతుంది. ఇండ్ల లోగిళ్ళు అలుకుటకు ఉపయోగపడుతుంది. బంజారా ప్రజలు ఎద్దుల వీపులపైన గోధుమలు, బియ్యం, బెల్లం, జొన్నలు, సజ్జలు, మరియు ఉప్పు వేసుకొని దేశవిదేశాలకు పోవుచుండిరి. సామానులు నింపుటకుగాను వారివద్ద ఎద్దుల ద్వారా బలమైన సుందరమైన (గూణ్) జనపనార సంచుల వీటిలో సామానులు నింపుకొని వాటి మూతలను కుట్టి వేస్తుండిరి. ఎద్దుల వీపులపై రెండుప్రక్కల వ్రేలాడునట్లుగా ఉంచబడుతుంది. బంజారాలు తమ యాత్రలను ప్రారంభించి వారు కూడా ఎద్దులతో పాటు వాటి వెంట పోవుచుండిరి.

ఓ హోరె ఎద్దు! ఈ రోజులలోవున్న రైలు కూడా నెరవేర్చలేని పనులను ఆనాటి బంజారా బిడారులు నెరవేర్చుతూ ఉండిరి. బంజారా ఎద్దులు ఇప్పుడు కూడా ఉత్తర హిందూస్థానములో ఈ కార్యక్రమములు చేపట్టియున్నవి.

## బంజారా పురాతన పాట

ఏ సావన్ మహినే లగాయో రామ్ కోని ఆయో!
ఏ టవే టపే గోపన్‌యా క వేణ ఝురే ఆవే లో!
ఏ సావన్ కా సడికా దాదా భియో కోని ఆయోరే
ఏ బీజల్ చమకే ఆగమ్ కీ భీతే కోని ఆయో!
ఆరే పరణ గయో పాపిరే పాభో గధి ని ఆయో
ఆరే చలమో బణజారా భాయా రే వ్యాపారకి!
అరే కోణ డర్ సే ఆయీ మండల్ కో న డర్‌సే ఆయి ఏ
ఏ ఇతే టటి ఇతే టాటో జిప్‌మే డట్ డక గయా
ఏ కోణ డర్ సే ఆయియే!
ఏ తారి రే బలద్ బణజారా కోయీ భర లాయో!
ఏ మారి కే బాదల్ నే రామ్ టాణరే లియా!
అరే బాబ జీనే మిసార్ కి టాణ బణాయో జేరె వనాయోజిరే!
ఏ భాగమే భాగమే బణజారే రుణి ఫేజో గయే
అరే ఛూటావ్ మూలాకా పాప్ జి ధిణ మార్ మార్ ఫిర్ నే.

# బంజారా వంశీయుల దేవతలు

| | | |
|---|---|---|
| రాఠోడ్ వంశము (భుక్యా) | దేవతా – ఖోక్‌రోచి (పార్వతి) | జిల్లెడు చెట్టు క్రింద పూజిస్తారు |
| చౌహాన్ వంశము | దేవతా – నాగరచి (లక్ష్మి) | తులసి చెట్టు క్రింద పూజిస్తారు |
| పవార్ వంశము | దేవతా – ఆసావళి (ఛండి) | ఆరిమాను (ఖింజేర్) చెట్టు క్రింద పూజిస్తారు |
| జాదవ్ వంశము (వడితియా) | దేవతా – పానావళి(ఛండి) | మట్టి చెట్టు క్రింద పూజిస్తారు |

## అందరు కలిసి పూజించే దేవతలు

- సితళా దేవి
- మంత్రాల్
- మరియామా
- దండమారి
- తొళజాదేవి (మాతా)
- దసరావ్
- సమనేకేర్ పూజ
- సత్తిర్ పూజ

## పండగలు

- సంవత్సరాది (ఉగాది)
- శ్రీ రామనవమి
- దశరా
- దీపావళి
- సంక్రాంతి
- శివరాత్రి
- హోళి పండుగ

## దేవుళ్ళు

- బాలాజి (శ్రీ వెంకటేశ్వర స్వామి)
- గరుబావా (గురునానక్)
- సేవల్‌భాయా
- హాథిరాం బావా
- హనుమాన్ (హనుమంతుడు)
- కన్నయ్యార్ (శ్రీ కృష్ణ భగవానుడు)

# క్షత్రియ వంశాలు

## 1. రాఠోడ్ వంశము

### సతాయీాస్ పాడా భుక్యా (27)

1 కరంతోట్
2 కానావత్
3 పితావత్
4 ఖేతావత్
5 మేగావత్
6 నెణావత్
7 డుంగావత్
8 కోడావత్
9 రామావత్
10 రాజావత్
11 డేగావత్
12 కుమావత్
13 భిలావత్
14 భాణావత్
15 ఖిలావత్
16 మేరావత్
17 ఖాత్రోత్
18 ఆళోత్
19 మేరాజోత్
20 దేపావత్
21 రాత్ళ (పులియా)
22 సోట్కి
23 ఝుండావత్
24 దేవసోత్
25 పాతళోత్
26 రణసోత్
27 సంగావత్

### పాంచ్ పాడా భుక్యా

1 కరంతోట్
2 రామావత్
3 నేణావత్
4 డుంగావత్
5 దేపావత్

## 2. చౌహాన్ వంశము

### ఛోగోత్ చౌహాన్ (6)

1 మూడ్
2 పాల్త్యా
3 సబావట్
4 కొట్రా
5 డుమావత్
6 కేలోత్

---

## బాణోత్ వారి వంశ వృక్షం

హలన్
బాలన్
మోహన్ ముచ్ఛాళో
జాట్యా జాంగడ్
ధంశీగోర్
దాధాభికా
రాహూ రాఠోడ్

## బాణోత్ వర్గం

1 కుంతావత్ రాఠోడ్
2 జాత్రోత్ రాఠోడ్
3 రూపావత్
4 ఘుగరివాళో
5 సబ్దాసోత్
6 అడోత్
7 పద్మావత్
8 ఖాత్రోత్
9 పంచాప్లా

# గోత్ర నామములు

## 3. పవార్ వంశము

### బార్‌గోత్ పవార్ (12)

1 విస్లావత్
2 వాంకోడోత్
3 ఝురపలా
4 ఆంగోత్
(హాథీరాంబావా)
5 నూన్‌సావత్
6 ఇంద్రావత్
7 ఇన్‌లోత్ పమార్
8 బాణ్ణి
9 తరబాణ్ణి
10 పమాడియా
11 ఐవత్ పమార్
12 చైవోత్ పమార్

## 4. జాదవ్ వంశము

### బావన్ పాడా వడితియా (52)

| | | |
|---|---|---|
| 1 | గోరాం | 29 |
| 2 | ధారావత్ | 30 |
| 3 | లోకావత్ | 31 |
| 4 | గుగ్లోలోత్ | 32 |
| 5 | హాలావత్ | 33 |
| 6 | కుణ్‌సోత్ | 34 |
| 7 | బోడా | 35 |
| 8 | తేజావత్ | 36 |
| 9 | బర్మావత్ | 37 |
| 10 | మాలోత్ | 38 |
| 11 | ఆజ్మేరా | 39 |
| 12 | జేట్ | 40 |
| 13 | భరోత్ | 41 |
| 14 | జళోత్ | 42 |
| 15 | జాజిగిరి వడితియా | 43 |
| 16 | భగవాన్‌దాస్ | 44 |
| 17 | బాదావత్ | 45 |
| 18 | ఉందావత్ | 46 |
| 19 | లోనావత్ | 47 |
| 20 | సేజావత్ | 48 |
| 21 | తువర్ | 49 |
| 22 | డుంగరోత్ | 50 |
| 23 | మేరావత్ | 51 |
| 24 | లూలావత్ | 52 |
| 25 | టేపావత్ | |
| 26 | పూస్లమల్ | |
| 27 | మోహన్‌దాస్ | |
| 28 | తేరావత్ | |

# బంజారాలు క్షత్రియ వర్ణము

బంజారాలు క్షత్రియ వర్ణమునకు చెందిన వారు. వీరు క్షత్రియ వర్ణము వారే అని తెలుపుటకు వారి వంశనామ గోత్రములే కారణం. క్షత్రియులు నాలుగు వర్ణములవారు. 1 చౌహాన్ 2. రాథాడ్ 3. పవార్ 4. జాదవ్ వీరిని క్షత్రియులుగా గుర్తించినారు. పూర్వం బ్రాహ్మణులు రాజాస్థాన్‌లోని ఆబు పర్వతముపై ఒక గొప్ప యజ్ఞం చేశారట. ఆ యజ్ఞనము నుండి నలుగురు మహాయోధులు ఉద్భవించారట. ఆ యోధుల పేర్లే పై తెల్పిన నాలుగు అని మన వారు చెప్పుకొంటారు. ఇవన్నియు ప్రజల మెప్పు పొందుటకు వారంటే భయము భక్తి కలిగియుండుటకు బ్రహ్మజ్ఞానులు సృష్టించిన కథనం. అంతేకాని మరియొకటికాదు.

పూర్వం ఇప్పటికి క్రీ. శ. 500సంవత్సరముల నుండి 1000 సంవత్సరముల క్రిందటివరకు ప్రస్తుతమున్న రాజస్థాన్, గుజరాత్, పాకిస్థాన్, ఆఫ్ఘనిస్థాన్, ఉత్తర మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్, పంజాబ్, హర్యానా, హిమాచలప్రదేశ్, జమ్మూ కాశ్మీరం, టిబెట్ వరకు మొత్తం పశ్చిమ మధ్య ఉత్తర హిందుస్థానం మొత్తం రాజపుత్ర రాజుల పాలనలో ఉండెను. సుమారు 600 సంవత్సరముల కాలమును రాజపుత్ర యుగం అంటారు. భారతదేశ పఠములో ఈ గుర్తింపువున్నది. ఆ విధంగా రాజపుత్రులు రాజ్యాలుయేలుకాలంలో మధ్య పశ్చిమ ఆసియా ఖండము నుండి మహమ్మదీయ రాజులు చాలా సార్లు భారత దేశంపై దండెత్తినారు. మహమ్మద్ ఘోరీ, ఘజనీ మహమ్మద్ లాంటి తురుష్కులు దేశంపై దండెత్తటం వారికి చేతనైనంతా దొరకినదంతా దోచుకొంటూ తిరిగి వెళ్ళిపోవటం ఆ విధంగా జరుగుచుండెడిది. ఒక్క ఘజనీ మహమ్మదే భారతదేశంపై 17 సార్లు దండెత్తి దొరకిన దేవాలయములన్నింటిని కొల్లగొట్టగలిగేరు. గుజరాత్‌లోని ఒక్క సోమనాథదేవాలయమునే 17 సార్లు దోచుకొనిపోయి రాజపుత్ర రాజులను ఒకరి తరువాత ఒకరిని బలహీన పరుస్తూ వారి వారి స్వార్థములకు వారిని ఉపయోగించుకొంటూ వచ్చారు.

ఆ కాలంలో 11శతాబ్దంలో ఢిల్లీ ని పాలించిన పృథ్వీరాజా చౌహాన్ కాలంలో బంజారాలు పృథ్వీరాజా సైన్యములోని ఒక భాగం విడిపోయి అడవుల పాలైనారు. ఈ విషయం బంజారాల పూర్వ వృత్తాంతములో తెల్పటం జరిగినది. బంజారాయను పదము తరువాత కాలంలో వచ్చిన పేరు. వీరు అడవుల పాలైన తరువాత చాలా కాలమునకు తమ జీవనాధారము కొరకు కొన్ని వృత్తులను స్వీకరించినారు. ఆహార ధాన్యములను, యుద్ధ సామగ్రులను ఒకచోటి నుండి మరియొకచోటికి గోనె సంచులలో సాగించారు ఎడ్లపైన ప్రధానంగా ఏఏ ప్రాంతాలకు ఏది అవసరమో వాటిని ఉపయోగించారు. ఎడారులలో ఒంటెలను కొండ ప్రాంతాలలోను కంచెర గాడిదలను, గాడిదలను, ఏనుగులను సముద్ర ప్రాంతములలో ఓడలను, నదుల ప్రవాహములలో పడవలను ఉపయోగించారు. అలాగే ఒక రాజ్యము నుండి మరియొక రాజ్యమును దాటి వారి సరకులను చేరవేయుటకు బిడారుల ముందు వెనుక సైన్యములను కూడ నడిపించారు. లేనిచో వారి సరకులను మధ్య దారిలోనే కొల్లగొట్టే అవకాశంవున్నది. అందుకు అప్పటి రాజులు బంజార బిడారులు అనగా వారి జోలికి పోయేవారుకాదు. ఈ బంజారాలలోను చాల గుంపులు తయారైనవి. 1. మారణాయుధాలను తయారుచేయువారిని లోహార్ బంజారాలు, (లోహముతో పనిచేయువారు) 2. ఎద్దులను ఉత్పత్తి చేయుటకుగాను ఆవులను పోషించారు.

ఒంటెలను కంచర గాడిదెలను, గాడిదెలను పోషించారు. 3. గోనె సంచులు కావలయును కావున కొంత మంది గోనెలు మాత్రం అల్లుచుండిరి. 4. ఆహార పదార్థములలో అన్నింటికంటె ముఖ్యమైనది సముద్రపు ఉప్పు. దీనిని సముద్ర ఒడ్డుల నుండి సేకరించి దేశం మొత్తంలో విస్తరింపజేసిరి. ఈ విధంగా ఒక గొప్ప కార్యమును చేపట్టినారు. పై కారణాలవలన బంజారాలు మొత్తం భారతంలో 44పేర్లతో పిలువ బడుచున్నారు.

ఈ బంజారాలు భారతదేశం మొత్తంలో కన్యాకుమారి నుండి కాశ్మీరము వరకు వ్యాపించియున్న భారతమును రహదారులులేని కాలంలో నదీ ప్రవాహములనే తమ రహదారులుగా ఎంచి నది గట్లపై నిర్మించబడియున్న పెద్ద పెద్ద పట్టణములను దర్శించి వారికి కావలిసిన సమస్త వస్తువులను అందించుతూ వచ్చారు. ఈ విషయం మొత్తం లమన్ మార్గములు అను భారత చిత్ర పటము ద్వారా గుర్తింపబడుచున్నది.

బ్రహ్మపుత్ర, గంగా, సింధు, మహానది, గోదావరి, కృష్ణా, కావేరి, తుంగభద్ర నదీ ప్రవాహములనే వారు తమ రహదారులుగా ఏర్పాటు చేసుకున్నారు. మరియు తూర్పున మొత్తం సముద్ర ఒడ్డునే తమ మార్గములుగా భావించారు. అలాగే పడమటి కనుమల ద్వారా వారు పెద్ద పెద్ద పట్టణములను వారి మార్గములుగా భావించారు. వారు మద్రాసును ఈ నాటి వరకు చెన్నపట్టణమే అంటారు. నదీ ప్రవాహములు సముద్రములు కలిసిన స్థలముల పేర్లను కలకత్తా, విశాఖ పట్టణం , మచిలీపట్టణం, చెన్నపట్టణం అని వారి పాటలలో గుర్తించియున్నారు. కొచ్చిన్ మంగళూరు, గోవా, బొంబాయి, గుజరాత్‌లోని ఓడరేవులను గుర్తించినారు. కొంత మంది బంజారాలు ఆ ఓడ రేవులనుండి విదేశాలకు సహితం తమ వ్యాపారములను విస్తరింపచేశారు. ప్రతి ఓడరేవు దగ్గర ఆ నాడు వ్యాపారం చేసిన బంజారా నాయకుల పేర్లు చెప్పబడినవి.

ఈ బంజారాల లదణి, (ట్రాన్స్‌పోర్టేషన్) ఆంగ్లేయులు వచ్చిన తరువాత పడిపోయినది. వారు భారతదేశం మొత్తమును తమ హస్తగతము చేసుకొన్న తరువాత వారి పెత్తనం దేశం మొత్తంలో త్వరితగతిని అభివృద్ధి చెందుటకుగాను రోడ్లు, రైలు రోడ్లు వేయడం జరగినది. బంజారాలు ఆంగ్లేయులకు ఎక్కడ ఎదురైతే అక్కడ ఎదురు తిరిగారు. వారి వృత్తికి భంగము కలుగుచున్నది. రోడ్లు, రైలు రోడ్లు వేయనీకుండా యుద్ధాలు చేశారు. అంగ్లేయులు విడదీసి పాలించు అను సూత్రమును ప్రయోగించి పెద్ద పెద్ద వ్యాపార వేత్తలను తమ గుప్పెట్లో ఉంచుకొని మీరు ఈ ఎడ్ల మీద ఇంత మందిని వెంట బెట్టుకొని ఎప్పుడు సరకును రవాణా చేస్తారు. దేశమంతయు మీరు ఈ రోడ్లపైన , రైళ్ళపైన సరకులు అందించి మంచి లాభములు పొందవచ్చునని వారిని మభ్యపెట్టి మిగిలిన వారికి మీ ఆది శక్తిపేరనే రైళ్ళు నడిపిస్తామని మైమరపించారు. ఎదురు తిరిగిన వారిని చంపటం, ఉరితీయటం జరిగినది. ఈ విధంగా బంజారాలను నానా రకాల పద్ధతులలో అణచి వేశారు. అలా ఎదురించిన వారిలో ''మీటు భుక్యా'' గూర్చి కథలు కథలుగా చెప్పుకొంటారు. ఆ విధంగా బంజారాలు ఆంగ్లేయులను ఎదుర్కొన్నారు. ''సేవాభాయా'' తన గుంపుతో ఒక నాడు భజన చేయుచుండిరట. వీరువున్న చోటికి కొంత దూరంలో ఇంగ్లీష్‌వారి క్యాంప్ వున్నదట.వీరు చేసే భజన వారికి నిద్రాభంగం చేస్తున్నది. అందుకు ఆగ్రహించిన ఆంగ్లేయులు వారిని భజన ఆపివేయమని అడిగినారు. వీరు ఆపలేదు. అప్పుడు అక్కడవున్న ఉన్నతాధికారి వారిని దగ్గరలోవున్న పాడుపడిన బావిలో పడవేసినారట. అప్పుడు కూడ బావి నుండి భజన వినిపించింది. ''టుమికి ఆకులను

తాళములుగాను '' ''రాళ్ళను పళ్ళెములుగా'' చేసుకొని భజన చేస్తున్నారట. అప్పుడతని మహిమను వెరచి వారే అక్కడ నుండి తొలిగిపోయారట. ఈ విధంగా ఆంగ్లేయులు బంజారాలను ఎక్కడ ఎదురుపడితే అక్కడ అటకాయించుట వలన వారు బంజారాలను క్రిమినల్ ట్రైబ్స్ జాబితాలో చేర్చి వారిపై ఒక కన్ను వేసివుంచారు. ఈ ప్రకారం బంజారాలు క్రిమినల్ ట్రైబో అగుటవలన ప్రజలలో వీరంటే కొంత చెడు అభిప్రాయం కూడా ఏర్పడినది. ఈ విధంగా బంజారాలు దేశం మొత్తం మీద విస్తరించి అందరూ ఒకచోట కలుసుకోలేక వారి వారి బంధువులతో వారికివున్న పశు సంపదకు అనుకూలమైన నీటి వసతి అడవి ప్రాంతములను చూచి వారివారి తాండాలను నిర్మించుకొని మొత్తం భారతంలో విస్తరించిపోయారు. బంజారాలు దేశం మొత్తంలో విస్తరించియున్నను భాష, వేషము, ఆచార వ్యవహారములు శుభ కార్యములు పండగలు మాత్రం మొత్తం దేశంలో ఒకే రకంగా వున్నవి. వీరి తాండాలు పల్లెలకు ఒకటి లేక రెండు మైళ్ళ దూరంలో నిర్మించుకొనివున్నారు. దీని భావన ఏమనగా వారు ఇతర కులస్థులతో కలవకుండా వారి ప్రత్యేకతను కాపాడుకొంటూ వచ్చారు. అసలైన ముఖ్య విషయం యేమనగా వీరు క్షత్రియులగుట వలన వీరి సంతానోత్పత్తిలో కల్తీ లేకుండా వారి ప్రత్యేకను కాపాడుకొంటూవచ్చారు. ఏ విధమైన క్రాసు బ్రీడింగ్ జరుగుటకు అవకాశం లేకుండా చేయుటకు చాలా కట్టు బాట్లను ఏర్పాటు చేసుకున్నారు. ఏదైనా ఎక్కడైన పొరపాటు జరిగిన కఠినమైన చర్యలు, దండనలు విధించేవారు. ఆ భయంతో ఎవరు పొరపాట్లుచేయుటకు ముందంజవేశేవారుకాదు.

# జాంగడ్ (పెంపుడు కుమారుడు కుమార్తె)

కొంత మంది బంజారాలు తమకు పుత్ర సంతానం లేనపుడు బంజారేతర పిల్లలను పెంచుకునేవారు. అటువంటి వారిని ''జాంగడ్'' అంటారు. వారికి బంజారాల బిడ్డలతో పెళ్ళిళ్ళు చేయరు. అదే సంతతికి చెందిన ( జాంగడ్ ) వారి పిల్లలతో బంధుత్వం చేస్తారు. ఈ విధంగా ఏడు తరాలవరకు వారిని కలుపుకోరు. ఏడు తరాల తరువాత ఒక గొప్ప సభను ఏర్పాటుచేసి చుట్టు ప్రక్కల తాండాలలోని ఈ సంతతి వారి అందరిని ఒక చోట ఆహ్వానించి కొన్ని శాస్త్రములను చేపట్టి వారినందరిని బంజారాలతో పాటు ఒకే బంతిలో కూర్చోబెట్టి వారికి వడ్డించిన ఆహారములో వారు తింటూ ఎంగిలి చేసిన అన్నమును అక్కడ చేరిన తాండా పెద్దలు అందరు ఒక్కొక్క పిడచ తీసుకొని తింటూపోతారు. ఆ విధంగా వారిని బంజారాలలో చేర్చుకుంటారు ఆ కార్యక్రమము అయినప్పటి నుండి వారిని జాంగడ్ యని పిలువరు. వారు కూడ గోరవట్ అయిపోతారు. ఈ విధంగా వచ్చిన వారినే కొన్ని చోట్ల తాండా నాయకులుగా ఎన్నిక చేసుకుంటారు.

ఒక వ్యక్తి యొక్కగుణగణములు వారి ఏడు తరాల వరకు తన సంతానములో వుండునట, ఆ విధంగా ప్రతి తరం తరమునకు ఆ వ్యక్తి గుణములు మార్పు చెందుతూ ఏడవ తరం తరువాత మొదటి వ్యక్యి యొక్క గుణ గణములు ఏ మాత్రం వుండవట. ఈ ఏడు తరములలోను వారి గుణగణాలు మార్పు చెందుతూ మొదటి జనరేషన్ గుణాలు పూర్తిగా పోయి తను ప్రస్తుతం ఉండేవారికి సమానంగా వుంటారు. అందువలన బంజారాల పిల్లలు

కాకుండా బంజారేతర పిల్లలను పెంచుకొన్నప్పుడు వారి పూర్వ గుణగణములన్నియు తొలిగిపోయి ప్రస్తుతం నివసించు వారి గుణగణములకు అలవాటు పడిపోయి వారిలాగానే వుండిపోతారని అర్థం. ఈ విధంగా బంజారాలు తమ సంతతిని కాపాడుకొంటూవస్తున్నారు. ప్రస్తుత పరిస్థితులలో చాల మంది దీనిని పాటించడంలేదు. దీని వలన జనరేషన్‌లో మార్పులు వచ్చే అవకాశం వున్నది. అందువలననే బంజారాల పూర్వీకులు చాలా దూర దృష్టితో వారి సంతతిని భద్రపరుచుకొనుటకు చాలా కష్టములను అనానుకూలతలను కూడా లెక్కచేయకుండా వారి ధర్మములను వారు నెరవేర్చియున్నారు. కావున ప్రస్తుతతరాలవారు కూడా వారి ధర్మమును నెరవేరుస్తారని భావించుతాను.

పై కారణాల వల్ల బంజారాలు పల్లెలకు పట్టణాలకు దూరంగావుంటూ చదువుకొనుటకు వసతులులేక రహదారులు లేక ప్రభుత్వం వారితో ఎటువంటి సంబంధములు పెట్టుకోక విద్యా పరంగాను, ఆర్థికపరంగాను, రాజకీయంగాను చాలా వెనుక పడిపోయి గిరిజనులు కాకున్నను గిరిజనుల గుణగణములు వుండుటవలన గిరిజనులుగాను కొన్నిచోట్ల యస్.సి., కొన్ని చోట్ల డినోటిఫైడ్ ట్రైబ్స్, కొన్ని చోట్ల బీసిలుగా గుర్తించబడినారు. ఈ విధంగా దేశం మొత్తంలో నానాగ్రూపులలో వుండి సమాన అభివృద్ధి చెందలేకపోయినారు. కావున వీరు మొత్తం భారతంలో ఒకే విధంగా అభివృద్ధి చెందవలెయునంటే వీరికి వీరి భాషలో విద్యను నేర్పించవలెను. ఇది సాధ్యమా అనవచ్చు? ఖచితంగా సాధ్యమే. బంజారాలు మొత్తం భారతదేశంలోవున్నను ప్రత్యేక తాండాలలో (పల్లెలలో) నివసిస్తున్నారు. బంజారాలలో విద్యావంతులైనవారికే టీచర్ ట్రైనింగ్ ఇచ్చి వారి ద్వారా బంజారా భాషలోను, రాష్ట్ర భాషలోను, దేశ భాష అయిన హిందీలోను మరియు ఆంగ్ల భాషలో ఒకే ఉపాధ్యాయుని ద్వారా నేర్పించవచ్చును. అలా పగలు బడిలో పిల్లలకు విద్య నేర్పుతూ, రాత్రి పూట బంజారా భాషలో నిరక్షరాస్యులకు విద్యను నేర్పి బంజారాలలో అక్షరాశ్యులను చేయవచ్చును. కావున వెంటనే బంజారా కార్యకర్తలు చదువుకున్న విజ్ఞాన వంతులు అర్థం చేసుకొని బంజారాలను సంఘటితం చేసి సంఘము తరపున రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వంతో సంప్రదించి జనాభా ప్రాతిపదికన విద్యా ధనమును బంజారాల వాటాగా గ్రహించి అభివృద్ధి చెందవలెను. విద్యాభివృద్ధి వలన బంజారా నిరుద్యోగులకు ఉపాధ్యాయ వృత్తి ద్వారా ఉద్యోగ వసతి కల్పించవచ్చును.

## జాత్ - భుక్యా

బంజారాలు ముఖ్యంగా నాల్గు రాజపుత్ర వంశాలు, వీరు ఒకరి గోత్రంలో మరియొకరు బంధుత్వం చేసుకొనవచ్చును. చౌహాన్ వంశం వారు రాథోడ్, పవార్, జాదవ్ వంశంల్లో పెండ్లి చేసుకొవచ్చును. రాథోడ్ వంశంవారు, చౌహాన్ వంశం, జాదవ్ వంశంలో బంధుత్వం చేసికొనవచ్చును. అలాగే పవార్ వంశం, జాదవ్ వంశంవారు కూడ స్వంత గోత్రం వదిలి మిగిలిన గోత్రం వారితో బంధవ్యాలు చేసికొనవచ్చును.

కాని బంజారాలలో రెండు ముఖ్య గోత్రాలు మాత్రమే నిర్ణయించి ఉన్నారు. 1. జాత్-భూక్యా దీనికి కారణం ఏమనగా రాథోడ్ వంశంలో 27 గోత్రాలు వీరిని సతాయిన్ పాడ భూక్యా అంటారు. భూక్యావారి జన సంఖ్య ఎక్కువ. 27 మంది.

## (6) ఛోగత్ చౌహాన్, (12) బార్ గోత్ పవార్

ఇక చౌహాన్ -6 గోత్రాలు, పవార్ 12గోత్రాలు, జాదవ్ 52 గోత్రాలు (బావన్ పాడా వడతియా). ఈ నాల్గు గోత్రాలలో స్వగోత్రం వదిలి మిగిలిన మూడు గోత్రాలు పెండిండ్లు చేసికొనవచ్చును. ఈ పద్ధతి భూక్యా వారికి కష్టమైనది. భూక్యా ఆడ పిల్లలకు గాని, మగ పిల్లలకుగాని, వధువునకు వరుడు, వరునకు వధువు దొరకటం కష్టం అయినది. అందువలన పెద్దలందరు కలసి ఒక నిర్ణయమునకు వచ్చారు. ఈ నాల్గు గోత్రాలలో వధువు, వరులను శులభతరం చేయుటకుగాను రెండు వర్గాలుగా విభజించుటకు నిర్ణయించారు. భూక్యా మాత్రమే ఒక వర్గంగాను, మిగిలిన మూడు వంశాలు ఒకటి అని, వారెనే జాత్ గోత్రీయులు అని పిలుస్తారు. భూక్యా 27 గోత్రములు చౌహన్ 6+పవార్ 12=18 అయిన భూక్యా వారితో సమానం అగుటలేదు. అందువలన జ్యాదవ్ (వడితియా) వారిని జాత్ గోత్రంలో కలిపి, జాత్=భూక్యా అనిపించారు. జాదవ్ (వడతియా) దీనికి సమ్మతించలేదు. మీ మూడు వంశాలు కలిసిన, మా 52 గోత్రాలకు సమానంలేరు. మేము ఒప్పుకోము అన్నారు. తిరిగి పెద్దలందరూ కలిసి ఒక తీర్మానానికి వచ్చారు. ఈ జాత్ – భూక్యా గోత్రాలు రెండే వుండాలి. కాని జాదవ్ మాత్రం (వడతియా) జాత్‌లోను, భూక్యాలోను కూడ బంధుత్వం చేసుకొనవచ్చును అని తీర్మానించుకొన్నారు. ఆ ప్రకారంగనే బంజారాలు తమ బంధుత్వాలు కలుపుకొనేటప్పుడు జాత్ గోత్రమా, భూక్యా గోత్రమా అని తెలుసుకుంటారు. భూక్యా అయితే ఏ గోత్రం. 27 గోత్రాలలో ఏది, జాత్ అయితే చౌహన్ గోత్రమా, పవార్ గోత్రమా, వడతియా గోత్రమా. అందులో చౌహన్ గోత్రమైతే ఆరు గోత్రాలలో ఏది? పవార్ గోత్రమైతే 12 గోత్రాలలో ఏది? వడతియా గోత్రమైతే 52గోత్రాలలో ఏది? ఈ విధంగా తెలుసుకొంటారు. అయితే ఇక్కడ బాణోత్ అనే గోత్రం ఒకటివుంది. ఇది వాస్తవములో భూక్యా గోత్రము. 27 గోత్రాలలో ఒకటి. పూర్వం బాణోత్ అనే గోత్రియుడు స్వగోత్రమైన భూక్యా గోత్రం అమ్మాయిని ప్రేమించి పెండ్లి చేసుకున్నాడు. చెల్లెలు వరుసవున్న అమ్మాయిని, అయితే వారికి జన్మించిన పిల్లలకు ఏ గోత్రంలో చేర్చవలెను. అందుకు బాణోత్‌ను కూడ నీవు జాత్ గోత్రములోనే ఉండు అన్నారు. అందువలన బాణోత్‌కు స్వయాన తమ్ముడైన జాట్రోత్‌ను మాత్రం తన గోత్రియుడుగా భావించి, మిగిలిన అన్ని గోత్రములలో బంధుత్వము చేసుకుంటారు. కాని తెలంగాణా ప్రాంతములోవున్న భూక్యా గోత్రియులు బాణోత్ వారితో బంధుత్వం చేసుకోరు. బాణోత్ కూడ రాఠోడ్ వంశీయుడుకదా! కాని మహారాష్ట్రంలోని బంజారాలు బాణోత్ గోత్రియులు తమ నామము చివర "అడే" అను పేరు పెట్టుకొంటారు. "అడే" యనగా బాణోత్ గోత్రియుడు అని అర్థం కాని అడే అనేది చాలా తప్పు. దీనికి మూలము ఏది లేదు? బాణోత్‌కు మూల పురుషుడు రాఠోడ్ మాత్రమే. ఇది గ్రహించవలసియున్నది. ఇవి వీరి గోత్ర సంబంధాలు. బంజారాలు ఎక్కువుగా ఓలి ఇచ్చే పద్ధతిపైనే పెళ్ళిళ్ళు చేస్తారు. జాత్ వధువు అయితే 101 రుపాయలు అదే భూక్యా వధువు అయితే 100 రూపాయలు ఓలి ఇస్తారు.

ప్రతి ఒక్కరు అందరి కోసము,
అందరు ప్రతి ఒక్కరు కోసము.

# బంజారాలు చెప్పుకొను తమ వంశావళి చరిత్ర

ద్వాపరయుగంలో శ్రీ కృష్ణ భగవానుడు తన అవతారమును చాలించే ముందు తనకున్న సమస్త సంపదను అందరికి దానమిస్తారు. అప్పుడు తన గోవుల కాపరులైన మోలా, మోటా అనే ఇద్దరు శ్రీ కృష్ణ భగవానుని వద్దకు పోయి అయ్యా! మిమ్మలనే నమ్ముకొని తమ గోవుల కాపరులమైన మాకు జీవన మార్గమును చూపించలేదు. మా జీవితం ఎలా గడుస్తుంది అని ప్రార్థించారు. అప్పుడు శ్రీ కృష్ణ భగవానుడు మీకు ఎటువంటి ఆపద లేకుండా కాపాడగల తల్లి రాధ వున్నది. ఆమెను మీకు దానంగా ఇస్తున్నాను. ఆమె చెప్పినట్లు నడుచుకొనుడు. మీ జీవితం సుఖాంతం అవుతుంది అంటారు. అదే విధంగా రాధామాత వీరిని వెంటపెట్టుకొని గారడి విద్యలు చేస్తూ జీవిస్తూ వుంటారు. వారికి ముసలి తనము దగ్గర పడేకొద్ది మమ్మలను ఎవరు చూస్తారు అని తలంచుకొంటూవుంటారు. ఒకనాడు వారు రాథోడ్ గడ్ కోట లేక రాజ్యముపోయి అక్కడ గారడీ విద్య ప్రదర్శించి రాజును మెప్పిస్తారు. ఆ రాజు వారికి ఏమి కావలయునని అడుగుతారు. అయ్యా! మాకు ముసలితనము వస్తున్నది. మమ్మలను చూచుకొనువారు కావలయును. మాకు ఒక బాలుని దానం చేయండి అంటారు. అప్పుడు రాథోడ్ వంశంవారు బాలుని ఇస్తారు. అలాగే చౌహాన్‌గడ్ పోతారు. అక్కడ ఒక బాలుని దానం తీసుకుంటారు. అలాగే పవారగడ్ పోతారు. అక్కడ ఒక బాలుని దత్తత తీసుకుంటారు. ఆ విధంగా ముగ్గురు బాలురను తీసికొని వారికి గారడి విద్యలను నేర్పించి తమ జీవితం సాగిస్తూవుంటారు. వారికి యుక్త వయస్సు వచ్చి యవ్వనులై వుంటారు. వీరికి పెండ్లి ఎలా చేయాలి అనే ఆలోచనలో పడింది రాధాబాయి.

ఒక ఊరిలో ఒక పేద బ్రాహ్మణుడు వుంటాడు. అతనికి ముగ్గురు కుమార్తెలు మరియు ఒక కుమారుడు ఉంటాడు. భార్య చనిపోయివుంటుంది. ఆ పేద బ్రాహ్మణుడు బిక్షాటనము చేసి పిల్లలను పోషిస్తూ ఉంటాడు. తన బీదరికము వల్ల తన కుమార్తెలకు పెండిండ్లు చేయలేకపోతాడు. వారు ముగ్గురు యుక్త వయస్సు వచ్చి రజస్వరాళై ఉంటారు.

ఆ కాలంలో బ్రాహ్మణ కుటుంబములలో ఆడపిల్లలకు రజస్వరాలు కాక ముందే పెళ్ళిళ్ళు చేసే ఆచారమున్నది. కాని తన పేదరికము వలన పెండిండ్లు చేయలేకపోతాడు. అప్పుడు ఆ గ్రామమలోని బ్రాహ్మణులు ఈ పేద బ్రాహ్మణుని మీద ఆగ్రహించి బ్రష్టుడా మా అందరిని అవమానపరిచినావు. నిన్ను వెలివేస్తున్నాము. మా గ్రామము నుండి తక్షణం నీ పిల్లలతో ఎక్కడికైన వెళ్ళిపో అని శాసించుతారు. అప్పుడు ఆ పేద బ్రాహ్మణుడు చేయునది ఎమియు లేక ముగ్గురు కుమార్తెలు, కుమారునితో ఊరు ఒదలి వెళ్ళిపోతాడు. ఆ విధంగా దూరదేశములకు అడవి మార్గమున వెళ్ళుతూ సాయంత్రం సమయానికి ఒక నది ఒడ్డున చేరి బస చేస్తారు.

ఆ రాత్రి వీరు ఆ నది ఒడ్డున పరుండిరి కాని బ్రాహ్మణునకు నిద్ర పట్టలేదు. తన మనస్సంతయు పిల్లల పెండిండ్లు చేయలేదని ఆవేదనతో నిండియున్నది. ఇక లాభం లేదని మనస్సులో తలంచి పిల్లలు మంచి గాఢ నిద్రలో ఉండే సమయంలో ఒక మొద్దు తెచ్చి వారి ప్రక్కలో పెట్టి దానికి దుప్పటి కప్పి వారిని వదిలి వెళ్ళిపోతాడు. తెల్లవారు జామున పిల్లలు లేచి

చూచారు . మొద్దుకు కప్పిన దుప్పటి తీశారు . నాన్న కనిపించలేదు. అప్పుడు వారు గట్టిగా ఏడుపు లఘించుకుంటారు.

అదే సమయములో ఆవలి ఒడ్డున బసచేసివున్న రాధాబాయి వీరి ఏడ్పులను విని కుమారులతో నది ఆవలి ఒడ్డున ఎవరో ఏడుస్తున్నట్టువున్నది, అను విషయమును తెలుసుకొని వారిని పిలుచుకొని రండి అని పంపిస్తుంది. వారు వచ్చి ఆ ముగ్గురు అమ్మాయిలను సంప్రదించి, అబ్బాయిని పిలుచుకొని వచ్చి రాధాబాయికి చూపిస్తారు.

రాధాబాయి వారి ద్వారా జరిగిన విషయమును గ్రహించి, యుక్త వయస్సులో ఉన్న తన ముగ్గురు కుమారులకు పెండ్లి ఎక్కడ చేయవలయునా అని ఆలోచిస్తున్న తనకు దేవుడే ఈ ముగ్గురు అమ్మాయిలను పంపించాడని తలంచి పెద్దవాడైన రాఠోడ్‌కు ఖోక్‌రచిని, రెండవ వాడైన చౌహాన్‌కు నాగరచిని, మూడవ వాడైన పవార్‌కు ఆసావాళికి ఇచ్చి పెండ్లి చేస్తారు. ఈ విధంగా పెండ్లి చేసుకొన్నవారికి పిల్లలు జన్మిస్తారు. రాఠోడ్‌కు ఇద్దరు కుమారులు. వారిలో పెద్ద వానికి 14మంది, చిన్న వాడికి 13మంది మొత్తం 27 మంది వీరినే సతా ఈస్ పాడా భూక్యా అంటారు.

చౌహాన్‌గారికి ఆరుగురు కుమారులు. వారినే ఛోగోత్ చౌహాన్ అంటారు. పవార్ గారికి 12మంది కుమారులు. వారిని బార్‌గోత్ పమ్మార్ లేక పవార్ అంటారు. జాదవ్‌ను వడతియా అంటారు. బ్రాహ్మణ కుమారుడైన పరశురామ్‌ను, పవార్ వంశంలోని ఝురపలా కుమార్తెను ఇచ్చి పెండ్లి చేస్తారు. వీరికి కుమారులు జన్మిస్తారు. వారికి మొత్తం 52 మంది జన్మిస్తారు. వారినే బావన్ పాడా వడతియా అంటారు. బావన్ అంటే 52 అని అర్థం . ఈ బావన్ పాడానే కొంత మంది బామన్ పాడా వడతియా అని కూడ చెప్పుకుంటారు.

ఈ వంశాలకు మూల తల్లులైన వారే వంశ దేవతలుగా పూజింపబడు చున్నారు. రాఠోడ్ వారికి ఖోక్‌రచి దేవతగా అనగా పార్వతిగా భావించి జిల్లేడు చెట్టు క్రింద పూజిస్తారు. చౌహాన్ వంశ దేవత నాగరచి అనగా లక్ష్మిగా భావించి తులసి చెట్టుక్రింద పూజిస్తారు. పవార్ వంశ దేవత ఆసావాళి అనగా ఛండిగా భావించి ఆరిమాను క్రింద ( జీంజేర్ ఝాడ్) పూజిస్తారు. జాదవ వంశ దేవత పవార్ వంశంలోని ఝురపలా కుమార్తెతో పెండ్లి జరిగినది కావున పానావళి అనగా ఛండి ( ఆదిశక్తి) అని మర్రి చెట్టు క్రింద పూజిస్తారు. ఈ విధంగా బంజారాల వంశాభివృద్ధి జరిగిందని వారు చెప్పు కుంటారు. బంజారాల మూల పురుషులు క్షత్రియులని తల్లి బ్రాహ్మణ స్త్రీగా గుర్తించబడినది. వీరు క్షత్రియ – బ్రాహ్మణ సంకరముయని భావించవచ్చును.

వాస్తవముగా చూచినట్లైన బంజారాలు రెండు రకముల గుణములు కలిగి ఉన్నారు. తండ్రి క్షత్రియుడు కావున క్షాత్ర గుణమును తల్లి బ్రాహ్మణ స్త్రీ గావున మంచి తెలివి తేటలను కలిగి ఉన్నారు. ఎవరైన బంజారాలను కదిపిన తన క్షాత్ర గుణమును తెలివితేటలను ప్రదర్శించుతాడు. నేను ( గ్రంథకర్త) చాలా మందిని చిన్నప్పటినుండి వీరిని పరీక్షించటం జరిగినది. వీరికి విద్య, ఆర్థిక సదుపాయములు లేనందువలన క్షాత్రగుణము, తెలివి తేటలు ఉండి కూడ వీరు ప్రజలలో రాణించలేకపోయినారు. ఇది బంజారాలు చెప్పుకొను వంశావళి చరిత్ర.

బంజారాలు భారతదేశంలో పిలువబడే నామములు వారి ఉపనామములు

వీరిని **44** పేర్లతో పిలుస్తారు మరియు రెండు భాగములుగా విభజించిరి

## 1. క్షత్రియ వర్ణము

### ఎ) బంజారాల ఉపనామములు

| | | |
|---|---|---|
| 1 | బంజారా | ఉత్తర భారత రాష్ట్రములలో |
| 2 | బంజరా | |
| 3 | వనజారా | |
| 4 | బంజారి | |
| 5 | బంజరి | |
| 6 | బ్రింజారి | |
| 7 | బ్రిజ్‌వాసి | |
| 8 | లమాణా | కర్నాటక రాష్ట్రములో |
| 9 | లమాణి లేక లంబాడిణి లంబాడా | |
| 10 | లంబాడా | ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములో |
| 11 | లంబాడి | |

12 లబాన్ లేక లబాన

13 లభాన్

14 లభని

15 లభన లేక లంభాన

16 బలడి

17 లదనియా

18 సుగాలి– ఆంధ్రప్రదేవ్, మద్రాస్

19 గహర్ లేక గౌరియ–కేరళ రాష్ట్రములు

20 గవారియా, రాజస్థాన్,

21 గవారియా లేక గమాలియా, రాజస్థాన్, పంజాబ్ ప్రాంతం

22 గవర

23 కంగ్ లేక కంగసిమా, మహారాష్ట్ర

24 గవారా

25 సిరికి బాండ్ } ఢిల్లీ, హరియానా,

26 సిరికివాలా } పంజాబ్ ప్రాంతం

27 శింగడి వనజారి, మహారాష్ట్రలోని వనజారులు కాదు

## 2. ఇతర వర్ణములు

### బి) బంజారాల ఉపనామములు

1 గోర్

2 మథర లేక మథురి

3 ఢాడి రబాబ్ మీద (డ్యాస్నర్లు) బంజారాల చరిత్ర గోత్ర నామములు చెప్పువారు

4 సనార్ (కంసాలి)

5 నావి (మంగలి)

6 ఢాలియా (తప్పెట కొట్టువారు)

7 శింగాడియా (కొమ్ములు ఊపేవారు)

8 మరు

9 బమణియా (బ్రాహ్మణులు)

10 బగోరా

11 డిగోరా లేక జిగోరా

12 చరణ (చెప్పులు కుట్టువారు)

13 బాడి

14 ఓసారియా

15 జోగి లేక భరావా (సీసంతో అచ్చు పోయువారు)

16 రోహిదాస్ (శికారీలు)

17 ధన్‌కోటె (ధాన్యం ధంచేవారు) ఉత్తర ప్రదేశ్, ఉత్తర భాగంలో

# బంజారాలు - భారతదేశంలో పిలువబడే నామములు వారి ఉప జాతుల నామములు

దేశం మొత్తం పర్యటించిన తరువాత తెలుసుకొన్నదేమనగా వేరువేరు రాష్ట్రములలో రకరకాల పేర్లతో పిలువబడుచున్నారు. దీనికి తోడు వీరికి కొన్ని ఉపజాతివారు కూడ ఉన్నారు. మేము తెలుసుకొన్న దానిని బట్టి చూస్తే బంజారాలు 26 పేర్లతోను ఉప జాతులు 18పేర్లతోను పిలువబడుతున్నారు. వారి పేర్లను రాష్ట్రాలవారిగా ఇందులో తెల్పడం జరిగినది. కొన్ని రాష్ట్రాలలో వీరిని రకరకాల పేర్లతో పిలుస్తున్నారు. దీని వివరణ కూడ తెల్పడం జరిగినది. మా పర్యవేక్షణ ఆధారంగా మేము ఈ క్రింది విధముగా నిర్ణయము చేయడం జరిగినది. ఉప జాతుల గూర్చి అయితే వారిని ప్రముఖ బంజారా జాతి నుండి మూడు ఆధారలపైన నిర్ణయము చేయడమైనది. బంజారా మరియు లమన్ శబ్దముపై స్థానిక భాషల ప్రభావం. 2. రైలు, రోడ్డు మార్గము ఏర్పడక ముందు నుండే వారు తరతరాలుగా పూర్వ కాలమునుండి వస్తువులను చేరవేయటం. 3. తాండా శాసనము ప్రకారము పూర్వం నుండి కట్టుబడియుండటం. వారిలో బంజారాలకు సహాయ సహకారంగా ఉండే 1.మంగలి 2. ఢాడి 3. ఢాలియా 4. కంసాలి మొదలగువారు వస్తారు. అందువలన ఈ మూడు ఆధారములు వీటిలో కలిసినవి. క్రింద తెలియ పరచిన వివరముల వలన ఇంకా ముఖ్యంగా స్పష్టంగా తెలుసుకొనవచ్చును.

1. ప్రాంతాల వారి శబ్దములు : 1. రెండు శబ్దములతో ప్రచురించిన పేరు, బంజారా మరియు లమన్ 2. ఎ)''బలదియా'' శబ్దంయొక్క అర్థం వారు ఎద్దుల (బలద్) వీపులపై ఆహారధాన్యములను మోయించుకొని రాకపోకలు చేస్తుండిరి. పంజాబులో ఎద్దు అను శబ్దమును బంద్ అంటారు. దీనిని బంజారాలు ''బళద్'' అంటారు.

   బి) ఆంధ్రప్రదేశ్ తమిళనాడు మరియు కేరళలోని బంజారాలను ''సుగాలి'' అను పేరు పెట్టారు. తెలుగు భాషలో సుగాలి శబ్దముయొక్క అర్థం మంచి గోవుల కాపరులు. దక్షిణ రాష్ట్రంలో కొంత మంది బంజారాలు గోవులను పెంచేవారు. అందువలన వారిని సుగాలి అని పేరు చెప్పబడినది.

3. **1** గవర్ లేక గోరియా **2.** గవారియా **3.** గావారియా అను పేర్లు చెప్పడం జరిగినది **4.** గవారా బంజారాల ముఖ్య సముదాయమును ''గోర్'' అను పేరుతో పిలుస్తారు. పంజాబ్‌లో పంజాబి భాషయొక్క ప్రభావంతో ఈ శబ్దము ''గవార్, గౌరియా మరియు గావారియా'' అనురూపంలో పిలవటం మొదలు పెట్టారు. ఈ విధంగా ''గోర్ బంజారాలు'' రాజస్థాన్‌లో వున్నారు. రాజస్థానీ భాషలో దీని ప్రభావంతో ''గవారియా, గమాలియా'', మరియు గవారా అని పిలువబడిరి.

4) 1.కంగి, కంగిసియా మరియు ఫనాడ్. ఈ పేర్లు బంజారాలకు ఏలా వచ్చిందంటే వారు దువ్వెనలు చేయటం మొదలు పెట్టేరు. కంగి అంటే మరాఠిలో ''ఫణి'' అని పిలుస్తారు. ఆ విధంగా దువ్వెనలు చేసే వారిని మరాఠిలో ''ఫనాడ'' అని పిలిస్తారు.

2. ''షిరికి బాండ్'', ''షిరికీవాలా '' (చాపలు అల్లేవాడు) షిరికి అల్లేవాడు అను పేరు ఇచ్చారు. షిరికి (జంబు) తో అల్లుతారు. ఇందులో జంబును షిరికి అంటారు. హిందీలో జంబును షిరికి అంటారు. దీని ద్వారా చాపలను అల్లే వృత్తి స్వీకరించుట వలన వారికి పంజాబ్, హర్యానా, ఢిల్లీలలో ''షిరికి బాండ్'' లేక షిరికి వాలా అని పిలవటం జరిగినది.

5) ఉప జాతులు : 1. గోర్ మథుర లేక మథురే, మరు''డిగోరా'' లేక గిగోరా వీరు బంజారాలలో స్వతంత్ర ఉప సముదాయం . వీరు ఇప్పటికి ఆహార పదార్థములను బండ్ల ద్వారా రవాణా చేస్తున్నారు (బండ్లు) 2. ఢాడి, సనార్, నావీ, ఢాలియా, సింగాడీయా, బాడి మరియు ఒసారియా, జోగి, భరవా మరియు రోహిదాస్.

వీరందరు బంజారాలే. ఎవరైతే తాండా శాసనమును పాటించి వారి స్వతంత్ర వృత్తిని చేపట్టినారో, వారు తమ కుటుంబ పోషణకై ఈ వృత్తులను చేపట్టివుండిరి. వీరి వృత్తులు ఏమనగా 1. ఢాడి కుటుంబీకులు బంజారాల వంశ నామములు తెలిసికొని, వారి బంధుత్వముల గూర్చి చెప్పెడివారు. బంజరా నాయకుల గుణగణములను (చరిత్రలను ) గానము చేస్తూ చెప్పుచుండువారు. 2. సనార్ లేక సూనార్ అనగా కంసాలి బంజారా స్త్రీల ఆభరణములు చేయువారు. 3. నావి అనగా మంగలివారు. 4. ఢాలియా అనగా తప్పెటలు కొట్టువాడు, నగార మోగించువాడు. 5. సింగాడియా కొమ్ము-కొమ్ము వాయిద్యము ఊదేవారు. 6. బాడి లేక ఒసారియా వాయిద్యములు వాయించువారు. వీరి వెంట వాద్య బృందమువుంటుంది. 7. జోగి లేక భరావ బంజారాల రకరకాల సొమ్ములను సీసముతో చేసి అమ్మువారు. 8. రోహిదాస్ అనగా బంజారాల గుడ్డలు, డేరాలు కుట్టేవారు.

6. చరన్ మరియు ధన్‌కోటే: సంస్కృతములో ''చరన్'' అనగా గోవులు మేపువారు. కొంతమంది బంజారాలు గోవులను మేపే వృత్తిని స్వీకరించారు. అందువలన వీరిని చరన్ అని పిలుస్తారు. గుజరాత్, మహారాష్ట్ర మరియు రాజస్థాన్‌లో వారు ఈ పేరుతో పిలవబడుచున్నారు. గుజరాత్ మరియు రాజస్థాన్‌లో చరన్ పేరుతో మరియొక జాతి కూడా వున్నది. ఈ జాతి వారిని పై తెల్పిన చరన్ బంజారా జాతికి ఎటువంటి సంబంధము లేదు. బంజారాలలో చరన్ అను పేరుతో ఒక చిన్న తెగ వున్నది. అటువంటి వారే ఆంధ్రప్రదేశ్‌లో సుగాలిలనబడే బంజారా తెగ వున్నది. అటువంటిదే రాజస్థాన్‌లో బల్‌దియా బంజారాల సమూహమున్నది. గుజరాత్‌లో షెడ్యూల్ జాతిలో కలవబడిన చరన్ అను బంజారాల ఉప సమూహమున్నది.

''ధన్- కోటే'' ధన్ అనగా (వడ్లు) ధంచేవాళ్ళు. బంజారాలను ధన్ కూటే అని పిలువబడుచున్నారు. బంజారాలను ఇక్కడ వెనుకబడిన జాతుల జాబితాలో ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలో లెక్కించబడుచున్నది. ఇక్కడ ఆలోచించవలసిన విషయం ఒకటి వున్నది. బంజారాల మొత్తం ఉప జాతులు మరియు మొత్తం బంజారాలు వారి పేర్లతో పాటు బంజారా అను శబ్దమును చెప్పుకొనుచున్నారు. బంజారాల మాతృ భాషలమాణి లేక గోర్‌బోలి. బంజారాలు వారి మాతృ భాషను మొత్తం భారతంలో మాట్లాడుచున్నారు.

# సతీ సహగమనం

బంజారాలు పూర్వంనుండి ''సత్తి'' పూజలు చేస్తూ వచ్చారు. ఒక బంజారాగ (సుగాలి) ఈ నాటి వరకు సత్తి అంటే ఏమిటో తెలిసేదికాదు. ఈ సతీ పూజలు ఎందుకు చేస్తారని నా మనస్సులో మెదులుతూవుండేది. కాని ఈ 20వ శతాబ్దములో కూడ సత్తి అయినారు అని రాజస్థాన్‌లో జరిగిన ఒక సంఘటన వలన తేట తెల్లమైనది. (తెలిసింది) సత్తి అనగా భర్త చనిపోయిన తరువాత తన జీవితం వ్యర్ధమని భావించిన రాజ పుత్ర స్త్రీలు రణరంగములో చనిపోయిన తన భర్తతో పాటు సతీ సహగమనం చేశారన్న విషయమును చరిత్ర ద్వారా తెలిసికొన్నాము.

అటువంటి కథయే బంజారాలు తమ పూర్వీకులు చేసిన సతీసహగమనమును ఇప్పటి వరకు పాటల రూపంలో పాడుకుంటూ వారిని స్మరించుకొనుచున్నారు. ఆ కథా సంగ్రాహమును తెలియజేయుచున్నాను.

## ఈశ్వర్ సబావట్ మరియు పోమాపాతళిల కథ

పూర్వము బంజారాలు (సుగాలిలు) బిడారుల ద్వారా వ్యాపారము చేయు కాలములో ఈశ్వర్ సబావట్ మరియు పోమాపాతళిల తల్లిదండ్రులు ఒక చోట బిడారములలో నివసించారు. ఆ సమయములో ఈశ్వర సబావట్ పోమా పాతళిల తల్లిదండ్రులు వీరి వివాహ సంబంధమును కుదుర్చుకున్నారు.

ఆ రోజులలో మంచి మాట (ఆకు, వక్క, శాస్త్రము) కొరకు బంజారాలు ''ఫలోత్యార్ సగాయి'' చేస్తూండేవారు. చిన్న పిల్లల ఉయ్యాలలో వేసే గుడ్డలతో ఈ శాస్త్రము చేసి నిర్ధారించేవారు. ఆనాడు బెల్లంనకు బదులు '' లోద్యా'' అనగా ''బలిజకాయలు'' ఎఱ్ఱగా తియ్యగా వుండిన వాటిని బెల్లం స్థానంలో పంచారట. ఆ నాటి నుండి వారి వివాహ సంబంధము స్థిరపడిపోయినది. ఆ తరువాత వారివారి బిడారములతో వేరువేరు ప్రదేశములకు వెళ్ళిపోయారు. ఇలాగే కాలం గడిచిపోయింది. ఈశ్వర్ సబావట్ యుక్త వయస్సు వచ్చినది. పెండ్లి చేసుకొనవలయునని సంకల్పము కలిగినది. అలాగే పోమా పాతళి కూడ యుక్త వయస్సు వచ్చినది. ప్రియుని రాకకై ఎదురు చూస్తూ ఏడంతస్థుల భవనములో వుండిపోయినది.

ఈశ్వర్ సబావట్ చౌహాన్ వంశం, తల్లిదండ్రులు స్వర్గస్థులైనారు. పినతల్లి మాత్రం వున్నది. పెండ్లి ప్రయత్నం మొదలు పెట్టవలెయునను సమయములో కుల పెద్దలు నీ పెండ్లి ముహూర్తము నీ చిన్న వయస్సులోనే, మీ తల్లిదండ్రులు పోమాపాతళి అనే అమ్మాయితో చేసినారు. నీ భార్య ఆమెయే అని తెలిపినారు. అప్పుడు ఈశ్వర్ సబావట్, ఆమె జాడ తెలుసుకొనుటకు ఒక ఆడ గుఱ్ఱముమీద బయలుదేర నిశ్చయించుకున్నాడు.

ఆ సమయములో పినితల్లి అనుమతి కోరతలంచి ఆమె వద్దకు పోయినాడు. పిన తల్లి వంటచెఱకు కొఱకై పోయినది. ఆ విషయమును తెలుసుకొని పిన తల్లిని వెదుకుచూ పోయినాడు. పిన తల్లి కట్టెల మోపు నెత్తిపై మోసుకొని ఎదురు వచ్చింది. నమస్కరించి ఆమె అనుమతిని కోరగా కోపంతో '' తీన్‌వేరేమా'' మూడు యుద్ధాలు చేసి చనిపోయినా నీ శవమును

చూస్తాను కాని నీ ముఖమును చూడను అని కోపమును వెళ్ళగక్కినది. అప్పుడు. ఈశ్వర్ సబావట్ తనకు స్వారిగానున్న ఆ ఆడ గుఱ్ఱం కాళ్ళపై పడి దుఃఖించుచూ ప్రార్థించ మొదలుపెట్టాడు.

అప్పుడు శక్తిస్వరూపమును దాల్చిన గుఱ్ఱం తన దీక్షకు సంతసించి సుఖ ప్రదమైన 6 నెలల కాలం పట్టు మార్గమున పోవుదమా లేక దుఃఖమయమైన మూడు నెలలు పట్టు మార్గమున పోవుదమాయని తెల్పినది. ఈశ్వర్ సబావట్ దుర్గమమైన మార్గమునే ఎన్నుకొని ప్రయాణం సాగించాడు. కొంత దూరం ప్రయాణమైన తరువాత 9 లక్షల మంది భీల్ జాతి స్త్రీలు దీపములు పట్టుకొని ఎదురు వస్తున్నారట. అప్పుడు గుఱ్ఱంతో తల్లీ వీరు ఇంత మంది మనకు ఎదురుగా వస్తున్నారుకదా! వారినుండి ఎలా తప్పించుకొనవలయును అని గుఱ్ఱమును అడుగగా వారితో శాంత చిత్తముతో అమ్మలారా, పిన్నమ్మలారా, అక్కలారా, అత్తలారా అని అందరిని శాంత చిత్తముతో పలకరించి సంతోషపరుచుము. అప్పుడే వారు మనకు దారి ఇవ్వగలరు. లేకున్న చాల కష్టమని తెల్పినది. వారినందరిని గౌరవముతో పలకరించి తను పోవు కార్యము వారితో తెల్పి సమాధాన పఱచి వెళ్ళిపోయినాడు. పోమాపాతళి ఉన్న గడ్ ( రాజ్యము లేక భవంతి) పోయి వారితో తన రాకను తెలియపరుస్తారు. ఆ గ్రామస్థులు అత్తమామలకు తన అల్లుడి రాకను తెలియ పరుస్తారు. రజస్సురాలై 12 సంవత్సరముల నుండి వేచివున్న తన కుమార్తెకు వివాహము ఆసన్నమైన వార్తనువిని తల్లిదండ్రులు సంతోషించి పెండ్లి చేసి పంపిస్తారు. భార్యను తీసుకొని గుఱ్ఱంపై స్వారీ చేసుకువస్తున్న ఈశ్వర సబావట్, దారిలోవున్న ఘణిక్యా భీల్‌ను పలకరించ బుద్ధి పుట్టినది. (అతడు బలవంతుడు బకాసురుడి వంటివాడు). నిద్రపోవుచున్న ఘణిక్యా భీల్ వద్దకు పోయి. ''రామ్ రామ్ ఘణిక్యా భీల్'' అని పలకిరించుతాడు. అతడు మేల్కొని ఎదురుగా నున్న ఈశ్వర్ సబావట్‌ను ''రామ్ రామ్'' చేసినాడు. ఈశ్వర సబావట్‌కు ఆధిత్యము ఇచ్చుటకు తన ఏడుగురు భార్యలను వంటకాలతో రమ్మని ఆజ్ఞాపిస్తాడు. అప్పుడు ఈశ్వర్ సబావట్ అవసరంలేదు. నేను మా అత్తగారు పంపించిన ''చూర్మో'' తెచ్చినాను ( బియ్యపు రొట్టెలు బెల్లం, నెయ్యి కలిపిన పదార్థము ఉన్నది.) అని చెప్పి ఘణిక్యా భీల్‌కు పెట్టినాడు. దాని రుచికి ముగ్ధుడైన ఘణిక్యా భీల్ ఆహా ఈ చూర్మో ఎంత రుచిగాయున్నది. ఈ చిన్నారి ఇంకెంత బాగుండెనో కదా! కావున ఆ చిన్నారిని నేను తీసుకొని నా ఏడుగురు భార్యలను ఇతనికిచ్చిన బాగుండును అని భావించి ఈశ్వర్ సబావట్‌తో ముందుగామాట తీసుకొనుటకుగాను పై విషయమును తెల్పినాడు. ఆ మాట విన్న వెంటనే ఈశ్వరసబావట్ తన ఖడ్గమును తీసి ఘణిక్యా భీల్‌నుమూడు ముక్కలుగా నరికి బయలుదేరుతాడు. అంతలో తన ఏడుగురు భార్యలు తెలుసుకొని యుద్ధ నగరా మోగిస్తారు. ఈశ్వర్ సబావట్‌కు సంబంధించిన బంధువుల9 లక్షల గోవులను, 900 మంది భీల్ జాతియులు కసాయి వాళ్ళకిచ్చుటకు తోలుకుపోతున్నారు. అప్పుడు ఈశ్వర్ సబావట్ తన గుఱ్ఱమును గోవులకు అడ్డంగా పోనిచ్చి గోవులను తరిమి భీల్ జాతీయులతో యుద్ధము చేస్తాడు. ఆ యుద్ధ వర్ణన పాట వింటుంటే ఒళ్ళు గగురుపాటు చెందుతుంది. ఈశ్వర్ సబావట్ మొత్తం భీల్ జాతీయులను సంహరిస్తాడు. అంతవరకు భర్తకు తన ముఖమును చూపించని పోమాపాతళి తన ఘుంగటో తీసి తన మోము భర్తకు చూపి ఆనందించు సమయములో రక్తపు మడుగులో దాగివున్న ''లంగడో పో చౌదార్'' ( కుంటి ) భీల్ జాతీయుడు వింటిని సారించి ఈశ్వర్ సబావట్ చెవికి గురిపెట్టి వదులుతాడు. ఆ బాణము ఈశ్వర సబావట్ రెండవ చెవిలోకి దూరి

వెళుతుంది. ఈశ్వర్ సబావట్ నేలకొరిగాడు. తన రక్తము నేల తాకగానే 9 లక్షల మంది భీల్ జాతీయులు బ్రతికి లేస్తారు. అప్పుడు వాళ్ళు పోమాపాతళిని నా భార్య నా భార్య అని ఒకరిపై ఒక్కరు ఎగబడతారు. అప్పుడు పామాపాతళి అయ్యాలారా! నా భర్త దహన సంస్కరణలు అయిన తరువాత నన్ను మీ భార్యగా స్వీకరించండి. కాని ముందుగా గంధపు చెక్కలు తెచ్చి, చితిని పేర్చండి అని ప్రార్థిస్తుంది. దానికి సమ్మతించి గందపు చెక్కలతో చితి పేర్చి చితిపై ఈశ్వర్ సబావట్‌ను ఉంచుతారు. పామాపాతళి వారిని ఈ విధంగా ప్రార్థించుతుంది. ''నేను చితికి ఏడు ప్రదక్షణలు చేస్తాను అంతవరకు మీరు వెనుతిరిగి చితిని చూడకూడదు. నేను చెప్పినప్పుడు మాత్రమే చూడవలెయును'' అని తెలుపుతుంది. పోమాపాతళి చితి చుట్టూ ఆరు ప్రదక్షిణలు చేసి ఏడవ ప్రదక్షణలో ఎగిరి చితిలో దూకుతుంది. చితిలోని తన భర్త తన భార్యను రెండు చేతులతో పట్టుకొని తన ఒడిలో తీసుకుంటాడు. ఈ లోపు భీల్ జాతీయులు వెను దిరిగి చూస్తారు. అప్పుడు వారు ఆ మంటలలోనే ఆహుతి అవుతారు. ఈ విధంగా పోమాపాతళి సత్తి అయినది. దీనినే బంజారాలు ''సత్తి పూజ'' అని చేసి తమ బిడ్డల తల నీలాలను సమర్పించి వారి అచంచల భక్తిని ప్రకటించుకొంటారు.

కేశీ. సత్తి – భర్త ఛత్రు బాదావత్ రాఠోడ్ వంశం, పితావత్ గోత్రం, ( గోనిపెంట తాండా)

భీమి సత్తి – భీమీ సతీ(పావగడ తాలుకా –దేవాలయం) (––)

సీతా సత్తి – పవార్ వంశం, విస్లావత్ గోత్రం

రాజాసత్తి – రాఠోడ్‌వంశం, కరమ్ తోట్ గోత్రం, నారశింహపల్లి తాండా.

# భారతదేశంలో బంజారాల వ్యాపార మార్గములు
## (Laman Maga's of India )

భారత దేశంలో వేల సంవత్సరాల క్రిందటి బంజారాల లమన్ (వ్యాపారము) మార్గములు. కఠినమైన చారిత్రాత్మకమైన సత్యం : శ్రీ మానేశ్వర దీక్షిత్, (డైరెక్టర్ ఆఫ్ ఆర్కియాలజీ, డిపార్టుమెంట్ వారి మ్యూజియమ్‌లో లభించినది.)

నేను ముస్లిము మరియు ఆంగ్లేయుల పాలనలో జరిగిన, చారిత్రాత్మకమైన వాటిపై పరిశోధన చేసినపుడు ''లమన్'' అను శబ్దము ఎలా వచ్చినది అని పరిశోధన చేశాను. సంస్కృతంలో ''లమన్''యొక్క అర్థం ఉప్పు. దీనిని బట్టి చూచిన ప్రాచీనకాలంలో ఎవరైతే ఎద్దులపై ఉప్పు వేసుకొని దూర దూర ప్రాంతాలకు తీసికొని పోయేవారో వారినే లమన్ అని పిలుస్తు ఉండిరి.

దక్షిణంలో సంస్కృత భాషకు బదులు ఇతర భాషలు అభివృద్ధి చెందుటవలన ''లమన్'' అను శబ్దము ఉద్భవించినది. అలాగే దక్షిణ ప్రాంతములలో భాషాభివృద్ధితో పాటు అక్కడి వాడుక పదాలు కూడ మారాయి. ఎలాగంటే ''లంబాడా, లంబాడి'' మొదలైనవి. ఇదే విధంగా ఉత్తరం, తూర్పు, పశ్చిమ ప్రాంత భారతంలో కొన్ని చోట్ల ప్రాంతీయ భాషలను బట్టి వాటి ప్రభావమును బట్టి ''లఖానా'' మరియు ''లమన్ '' అను పేర్లు ప్రచారములో వచ్చినవి. సత్యంగా చెప్పవలయునంటే ఈ పేర్లన్నియు ''లమన్, లమాణి, లంబాడి, లంబాడా,

లబానా, లభానా, లమాణి'' మొదలగు పదములన్నియు సంస్కృత శబ్దము అయిన లమణ్‌తోనే వచ్చినవి. ఈ మాట దీనితోనే నిశ్చయమైపోతున్నది. ఎందుకనగా ఈ శబ్దములన్నియు ఒకే అర్థమును ఇస్తున్నవి. దీని అర్థమే ఉప్పు.

## లమన్ మార్గ :

చరిత్ర కారుడు శ్రీ ఎస్. ఆర్. కనిట్‌కర్ ఎం.ఎ. టి.సి.డి. గారు తన పుస్తకం ''హిస్టరీ ఆఫ్ ఇండియా'' లో తెల్పిన ప్రకారం 1934లో వ్రాసిన లమాణ్‌లు దూర దూర ప్రాంతాలకు సరకులను తీసికొనిపోయి అమ్మే కార్యక్రమమును చేపట్టి వుండిరి. క్రీ. పూ. 600 సంవత్సరముల

భారతదేశంలోని లమన్ మర్గాములు (Laman Margas in India)

నుండి క్రీ.శ. 350 వరకు ఏర్పడిన కాలంనాటి పరిస్థితులను, అప్పటి ప్రజల స్థితిగతులను వర్ణించుచూ శ్రీ కనికట్‌కర్‌గారు ఈ యుగంలో వెంట వెంటనే పంపించగల సాధనముల గూర్చి కూడ చెప్పడం జరిగినది. వారు చెప్పినది ఏమనగా లమణ్ ప్రజలు ఈ రోజులలో కూడ సామానులను, గుడ్డలు ఉతకటానికి కూడా పశువులపై ఎత్తుకొనిపోవుటకు ఉపయోగించుచున్నారు. ఎద్దులపై వ్యాపారం చేసేవారు భారత పఠముపై చూపబడిన మార్గములను బట్టి వారు ప్రయాణించిన మార్గములు చూపబడినవి.



బిడారి ఎద్దులు (Banjara Salt traders and their bullocks)

## లమణ్ మార్గములపై వివరణలు :

1. బరుకజ్ నుండి నలందా వరకు గల మధ్య ప్రాంతము, సముద్రతీర నగరములను, ఏరత్రియాన్ ( అరేబియా) సముద్ర తీరమువెంబడి మార్గము చూపబడినది. ఇది క్రీ.శ. 180 సంవత్సరాల తరువాత వ్రాయబడినదిగా గుర్తించడమైనది.
2. కోరమండల ప్రాంతము మరియు, పూర్వ సముద్రతీర ప్రాంతము గుండా చూపబడిన పటములో గుర్తించిన విధంగా తీసుకొనడం జరిగినది.
3. ఉత్తర భారతంలో గంగానదీ తీరము గుండా గుర్తించబడిన మార్గము బౌద్ధాలయముతో కలుపబడినది. ( కాశి, గయా) దీనియొక్క రచన ( గుర్తింపు) క్రీ.పూ. 4వ శతాబ్దము నుండి ఉన్నట్లు తెలియబడుచున్నది.
4. మధ్య మహారాష్ట్రం నుండి పోవు మార్గము దక్షిణమున శాతవాహన కాలమునాటి శిలా శాసనము ద్వారా తీసుకొబడినది. క్రీ. పూ. 200 సంవత్సరముల నుండి క్రీ. శ. 140 సంవత్సరముల వరకు తెలియబడుచున్నది.
5. ఉత్తర పశ్చిమ భాగంలో గుర్తించబడిన మార్గం, శిఖిందర్ మార్గమని (సుమారు) 723 క్రీ. పూ. నుండి లేక కుషానుల శిలాశాసనము ద్వారా సుమారు 220 క్రీ.శ. తీసుకొనటం జరిగినది.

6. సామాన్యముగా ఈ మార్గములలో ఏ మార్గములలో ఏ భాగము మరియు ప్రాంతముల పేర్లు చెప్పబడినవో వాటిని బట్టి తెలియుచున్నది ఏమనగా సుమారు 200 సంవత్సరముల క్రీ. పూ. నుండి 400 సంవత్సరముల క్రీ.శ. వరకు ఉన్న పేర్లు మాత్రమే వ్రాయబడి ఉన్నవి.

బంజారా అను శబ్దముయొక్క విశ్లేషణ మనలో మనము ఆ రోజులలో ఏ మనుకొనేవారో అర్థం అవుతుంది. ఆ రోజులలో ముస్లిములు మరియు ఆంగ్లేయుల చరిత్రకారులు, ఈ విషయము ఒక గొప్ప సందేహకరముగా ఉండిపోయినది. ఈ చరిత్ర కారులు చాలా సుదీర్ఘమైన ఆలోచన చేయకుండా ఎటువంటి విధమైన వ్యాఖ్యానాలు చేయకుండా వారు ఇదే శబ్దమునకు ఏదైన అర్థంయిచ్చిన వారి ఆలోచనలు నిజంకాదు. వారు బంజారా అను శబ్దము గూర్చిన సంపూర్ణ అర్థమును , పూర్తిగా విచారించి ఆలోచించలేక పోయినారు.

మాయొక్క ఆలోచన ఈ విధంగావున్నది. ఈ విషయములో మేము చాలా వివరంగా విచారించడంజరిగినది. బంజారా శబ్దముయొక్క ఉత్పత్తి మూలము సంస్కృత శబ్దము. బణిజాతో సంబంధము వున్నది. దాని అర్థం వ్యాపారి. ప్రాచీనా కాలంలో బంజారాల పని ఏమనగా ధాన్యములను పశువుల వీపు మీద వేసుకొని ఒక ప్రదేశము నుండి మరియొక ప్రదేశమునకు చేర్చుట కాని వారు వ్యాపారులు కాదు. వ్యాపారముతో మామూలు ప్రజలకు సంబంధములు కలిగియుండిరి. ప్రాంతీయ భాషలు అభివృద్ధియగుట వలన గుజరాతి, మరాఠి, హిందీ, ఉర్దు, రాజస్థాని వీటి అభివృద్ధియగుట వలన సంస్కృత ప్రభావం పడిపోయి, వ్యాపారముయొక్క శబ్దము కూడా మార్పు చెందినది. గుజరాత్‌లో వారు బంజారాలైయిపోయిరి. రాజాస్థాన్‌లో బంజారా. హిందీలో బంజారా, ఉర్దూలో వంజారా , మరాఠిలో బంజారి, బంజారా శబ్దము నుండి ఏ జాతి బేధము లేకుండా వుండెను. ఆనాడు వీరు చేసిన ఈ బిడారి వ్యాపారము ద్వారానే ఈ నాటి వరకు ఆ పేర్లను గుర్తించడం జరుగుచున్నది. ఉదా: బంగారు పని చేసేవారు, ఇనుముతో పని చేసేవారు, గుడ్డలు నేయువారు ఎలా పిలువబడుచున్నారో అదే విధంగా బంజారాలు పిలువబడుచున్నారు.

పూర్వకాలంలో దైనందిన జీవితంలో కావలిసిన ఆహర పదార్థములను, వస్తువులను, ఒకచోటి నుండి వేరొకచోటికి తీసుకొనిపోవలయునన్న పశువుల వీపుపై తప్ప మరియే వాహనములు ఉండేవి కావు. ఏ ప్రజలైతే ఎద్దుల వీపులపై ధాన్యములను వేసుకొని ఎన్నో రకాల ఇబ్బందులను అనుభవిస్తూ దూర దూర రాజ్యములకు వాటిని అందజేస్తూ ప్రజా ఎవ చేస్తూ వుండిరి. వారు కఠినాతి కఠినమైన రోజులలో ధాన్యములను ప్రజలకు, సైన్యములకు అందించుతూ, అవసరమైతే మధ్యలో యుద్ధములు చేస్తూ తమ బిడారులను సాగిస్తూ సైన్యాలకు వారు ఆహార పదార్థములను యుద్ధ సామగ్రిని అందచేస్తూయుండిరి. వారు బంజారాలుయని గౌరవంగా పిలవబడుచుండిరి.

''ఇయస్‌టీన్'' అనువారు వ్రాసిన పుస్తకములో ''క్యాస్ట్ అండ్ ట్రైబ్స్ ఆఫ ఇండియా'' నాల్గవ భాగంలో మూర్ అను శబ్దములో బంజారాయొక్క చాలా పెద్ద చిత్ర పఠమును గీచాడు. బంజారాలు తమ గ్రామ పెద్దతో ( నాయక్ ) చాలా బాగా కలిసిమెలసి యుంటారు. కాని ఇతర గిరిజనులతో వారు ఎప్పుడు కలవరు. వీరికి ఇల్లు ఆస్థులు ఉండవు. వ్యాపార విషయములలో వారు నిమగ్నమైవుంటారు. అదే ఉత్సాహముతో వారు దూర దూర

ప్రాంతాలకు పోతూనేవుంటారు. వారు తమ వస్తువులను లేక ఆహార పదార్థములను ఎక్కడ చేర్చవలయునో అక్కడ ఖచ్చితంగా చేర్చుతారు.

బంజారాల వ్యక్తిత్వం వారి శ్రద్ధా శక్తులపై విచారణ చేస్తూ సర్ ''హెచ్. ఎం. ఇలియట్'' గారు చెప్పినది యేమనగా ఇక్కడ నిర్ధారణ ( ప్రామాణికంగా) చెప్పడం ఏమనగా ఎవరైతే తమయొక్క పనులను శ్రద్ధా పూర్వకంగా చేస్తారో వారి గూర్చి ఒక సంస్కృత గ్రంథములో ''దక్షిణ కుమార చరితము''లో కూడా బంజారాల గూర్చి చెప్పబడినది. ఈ పుస్తకములో 11నుండి12వ పేజీలో వ్రాసివున్నది. ఈ వ్రాతను ఆధారంగా చేసుకొని సర్ హెచ్. ఎం. ఇలియట్ చెప్పినది ఏమనగా బంజారాలు అంటే ఎవరోకాదు, వారే ప్రాచీన కాలం ''కబిత్''వారు. వారు 4,7 శతాబ్దములలో గొప్ప బలశాలులుగా వుండి తమ మనుగడను సాగిస్తూయుండిరి. ( రోమా బంజార హిందీ, బొంబాయి).

# బంజారాలపై మత ప్రభావము

ప్రపంచంలో గొప్ప స్మగ్లింగ్ ఏదిరా అంటే మతం అని జవాబిచ్చారట. ఒక స్మగ్లర్ స్మగ్లింగ్ చేస్తున్నాడంటే బంగారమో, వజ్రవైఢూర్యములోలేక మణిమాణిక్యములో, గడియారాలో మరి ఏ ఇతర విలువైన వస్తువులతోనో సంతృప్తిపడతారు. దాని వల్ల ఏ కొద్ది మంది మాత్రమే ప్రజలకు, ప్రభుత్వమునకు నష్టం వాటిల్లవచ్చును. కాని ఈ మతమనే స్మగ్లింగ్ అన్నింటికన్నా విలువైనది. ఇది ప్రజల మనస్సులను స్మగ్లింగ్ చేస్తున్నది. దీని ద్వారా ప్రభుత్వాలు, దేశాలు తారుమారు కాగలవు. ఉదా:ఇంగ్లీషువాళ్ళు చైనాను పాలించేటప్పుడు ప్రజలను నానా విధాల ప్రలోభాలకు గురిచేసారు. కొందరికి నల్లమందు, ఇతర మత్తు మందులు అలవాటుచేసి వారికి ప్రభుత్వ కార్యకలాపాలకు దూరంచేసుకొన్నారు మరికొందరిని అధికారం, ఆర్థిక సహాయంచేసి ఆకట్టుకొన్నారు. అధిక సంఖ్యాకులుగా అమాయక ప్రజలకు క్రైస్తవ మత గురువుల నుంచి వారిని క్రైస్తవులుగా మార్చి వేస్తున్నారు. ఆ మతమౌఢ్యముతో వారు తమ మాతృదేశంపై చేస్తున్న అఘాయిత్యములను కూడా తెలుసుకోకుండా వారిని సహకరిస్తున్నారు. ఈ మత గురువులు చైనా పఠముపై ఒక వైట్ స్పాట్‌ను వుంచి ఇంగ్లండ్‌కు పంపుతున్నారు. ఒక వైట్ స్పాట్ చుట్టూ 20 నుండి 30 మైళ్ళ వ్యాసార్థం ( దూరం) వరకు నివసిస్తున్న చైనీయులందరు మన చెప్పుచేతులలో వున్నారని భావన. ఈ విధంగా వారు చైనీయులను మతమనే మౌఢ్యమునకు బానిసలుగా మార్చివేసి వారి మనస్సులను స్మగ్లింగ్ చేయటం మొదలుపెట్టారు.

ఆ సమయములో ఒక డాక్టరు, క్రైస్తవుడు అయిన శ్రీ సన్‌యట్‌సేన్ ఈ విషయం గ్రహించినాడు. తను ఎంత క్రైస్త్రవుడైనను, తనూ ఒక చైనీయుడే కదా! తన మాతృ భూమి చైనాయే కదా తను క్రైస్తవుడు అయినంత మాత్రాన తన మాతృ భూమి ఇంగ్లాండు కాదుకదా? ఇది గ్రహించిన సన్‌యట్‌సేన్‌గారు ఈ దురాగతానికి స్వస్థి చెప్పుటకుగాను ఒక ఆలోచన పుట్టినది. ఇదంతయు ఈ క్రైస్తవ మత గురువులు చేస్తున్న పని. కావున మొదట వీరిని రానీకుండా చేయవలయును అని అనుకున్నాడు.

తను తన స్నేహితులను, కొంత మంది యువకులను ప్రోగుచేసి వారికి మాతృభూమిపై భక్తిని, మాతృభూమిపై జరుగుచున్న దురాక్రమణల గురించి బోధించి వారిని

తన దారికి తాను చెప్పినట్లుగా మలచుకోగలిగాడు. ఆ తరువాత బృందాలుగా తయారుచేసి వారికి వ్యాయామము క్రీడలు నేర్పుతూ, అన్ని రకాల కరాతేలాంటి విద్యలు నేర్పించాడు. ఆ రోజులలో క్రైస్తవ మత గురువులు కొంత అహంకార భావము కలిగి ఉండిరి. చైనీయులు అన్న వారికి (బానిసలు) అణిగిమణిగి నడుచు అలవాట్లు కలిగియుండిరి. ఉదా: వారికి ఎదురుగా తలయెత్తి నడవరాదు, ఒంగి ఒంగి నడవాలి. వారిని చూచి దూరంగా పోవాలి. అటువంటి అలవాట్లు నేర్పించి ఉన్నారు.

ఈ విషయాలన్నీ తెలుసుకున్న సన్‌యట్‌సేన్‌గారు వారితో నిరాయుధులుగానే పోరాడి దూరంచేసారు. బాగా కరాతే వచ్చిన వ్యక్తిని తలవంచకుండా ఫాదర్ వచ్చే దారికి ఎదురుగా పోనిచ్చిన, ఆ ఫాదర్ అతన్ని పిలచి దండించుతారు. మరియు తమ అధికార గర్వంతో ఒక చెంప దెబ్బ కొడతారు. అప్పుడు ఆ వ్యక్తి ఎదురు తిరిగి అతనికి ముష్టి ఘాతముతో ఒక దెబ్బ కొడతాడు. ఆదెబ్బకు అతను చనిపోతాడు. డాక్టర్ అయిన సన్‌యట్‌సేన్ ఏ దెబ్బ ఎక్కడ కొట్టాలి ఏ అవయవానికి దెబ్బ తగులుతుంది. ఎక్కడ కొడితే ప్రాణాపాయము జరుగుతుంది అని నేర్పించి ఉన్నాడు. దాని ప్రకారం వాడు ముష్టి దెబ్బ కొట్టిన అతను చనిపోతాడు.

దీనిపైన న్యాయవిచారణ కూడా సరిగావుండదు. తను చెంప దెబ్బ కొట్టినందున నాకు కోపము వచ్చి నేను కొట్టాను. అతను చనిపోయాడు అని నట్లు జరగసాగింది. ఈ దెబ్బతో ఫాదరీలు చైనా రావటానికి భయపడి రాలేక పోయారు. ఈ లోపు మావోసేటుంన్, చెవన్‌లై గారి ద్వారా కమ్యూనిజమ్‌ను స్థాపించగలిగేరు.

భారతదేశ చరిత్ర చూచిన ఏముంది? హిందూ మతమును స్థాపించి రకరకాల దేవతలను సృష్టించుకొన్నారు. బౌద్ధ మతమును ప్రచారము చేసారు. ప్రపంచదేశాలన్నియు దానిని స్వీకరించాయి. ప్రపంచ జనాభాలో అత్యధిక సంఖ్యాకులు బౌద్ధులుగా రికార్డు చేసుకున్నారు.

చైనాను పాలించిన మంగోలియా రాజులు చైనా ప్రజలను ఆకట్టుకొనుటకు మొదట బౌద్ధ మతాన్ని స్వీకరించి మొత్తం చైనాను పాలించారు. ఆ తరువాత వారు అరేబియన్ దేశాలపై దండెత్తేరు. అక్కడ మహమ్మదీయ ప్రవక్త ప్రభావము ఎక్కువగా వుండుటచేత అందరు మహమ్మదీయ మతమును స్వీకరించియున్నారు. వారిని లొంగదీసి రాజ్యము చేయటం సాధ్యముకాదు అని భావించిన మంగోలియా రాజులు వారు కూడ మహమ్మదీయ మతమునే స్వీకరించారు. అక్కడ వారి రాజ్యములను స్థిరము చేసుకొని భారత దేశ సంపదపై ఆశ పెరిగి, అరేబియన్ ప్రజల సహకారముతో భారతదేశంపై దండెత్తి వచ్చారు.

ఆనాటి భారతదేశం వివిధ రాజ్యాలతో వందలకొలది రాజులు రాజ్యాలతో నిండివున్నది. వారు భారతదేశంను జయించటం చాల కష్టమనిపించింది. చైనాలాగ, లేక అరేబియన్ దేశాలలాగ మతంమార్పిడి చేసుకొన్నంత మాత్రాన దేశం వారిచేతికి రాదు. ఒకరిపై దండెత్తిన మరిఒకడు పైకి వస్తున్నాడు. అందువలన వీరిని జయించుట కష్టమై మహమ్మదీయ మతమును వదలలేక, వీరిని జయించలేక ఒక్కొక్క రాజ్యమునే తమలో చేర్చుకొంటూ భారత

ఈ విషయం శ్రీ అయ్య దేవర కాళేశ్వరరావుగారు రచించిన 'నవచైనా విప్లవం' అను గ్రంథంనుండి గ్రహించడం జరిగినది.

దేశమును లోబరుచుకోగలిగారు. కాని ఆ కాలంలో దేశభక్తులైన రాణాప్రతాప్ సింగ్ రాథోడ్ వారు తమ రాజ్యములను, తమ ప్రాణాలను ఒదులుకున్నారేగాని వారికి లొంగలేదు. ఆ తరువాత మొగలు రాజైన అక్బరు పాదుషా అక్కడ మహమ్మదీయులను కాదనలేక ఇక్కడ హిందువులను కాదనలేక, హిందువులను తన అదుపు ఆజ్ఞనలలో పెట్టుకొనుటకుగాను రాజపుత్ర స్త్రీని వివాహ మాడి ఒక వర్గమును తనవైపుకు లొంగదీసుకున్నాడు. తను మహమ్మదీయుడైన హిందూ స్త్రీ అయిన తన భార్యకు కట్టు, బొట్టు మాన్పించకుండా శ్రీ కృష్ణమందిరాన్నే తన రాజ భవనములో కట్టించుకున్నాడు. మరియు మొత్తం ప్రజలను ఆకట్టుకొనుటకు స్వంత, ప్రత్యేకమైన మతమును సృష్టించాడు. అదే ''దిన్ ఇలాహి'' అనే మతము. అందులో చేరేవాళ్ళు మహమ్మదీయ మతమును, హిందూ మతమును ఆచరించవచ్చును. ప్రజలు ఏ మతమును స్వీకరిస్తే ఏమి? తన రాజ్యము పదిలంగా ఉండాలనేదే ఆయన భావన.

ఆ తరువాత డిల్లీని పాలించిన ఔరంగజేబు కాలంలో మహమ్మదీయ మతమును దేశమంతటా వ్యాపింపచేయవలయునని దీక్ష పూనేడు. ఒక రోజుకు 17 మంది బ్రాహ్మణుల జందెం తెంచనిదే భోజనం చేసేవాడు కాదని చరిత్ర చెప్పుచున్నది. ఈ మత మార్పిడి కొరకు హిందువులను, హిందూ స్త్రీలను నానా విధాల హింసలకు గురిచేసేవాడట. ఆ కాలంలో కాశ్మీరులో ఎక్కువ మంది బ్రాహ్మణులు నివసించేవారు. వారిని చిత్రహింసలకు గురిచేస్తూ మహమ్మదీయులుగా మార్చుతుండిరి. కొంత మంది బ్రాహ్మణులు ప్రోగై ఆలోచించి ఔరంగజేబుతో, అయ్యా! మమ్ములను చిత్రహింసల పాలు చేసే బదులు మా రాజును మీరు మహమ్మదీయునిగా మార్చగలిగిన ఆయన రాజ్యములో వున్న మేమందరము ముస్లిములేగదా? అని సలహా ఇచ్చారట. ఆ విషయమును గ్రహించిన ఔరంగజేబు వెంటనే కాశ్మీర రాజును చెరపట్టి తీసుకొని రండియని ఆజ్ఞాపించాడట. ఆనాడు కాశ్మీరమును పాలించుచున్న రాజు సిక్కుల 9వ.గురువైన శ్రీ తేజ్ బహదూర్ సింగ్‌గారు. ఆయనను చెరపట్టి ఔరంగజేబు దర్బారులో నిలబెట్టినారు. ఔరంగజేబు వారిని చూచి నీవు మహమ్మదీయ మతమును స్వీకరిస్తావా లేక నిన్ను ఉరికంబము ఎక్కించి, నీ శవమును కాకులకు గ్రద్దలకు ఆహారంగా ఇవ్వవలయునా అని ప్రశ్నించాడు. అందుకు తేజ్ బహదూర్ సింగ్‌గారు, నేను ఉరితీయుంచుకొనుటకు సిద్ధమేకాని, నీవు చెప్పినట్లు నీ మతమును మాత్రం స్వీకరించను అని బదులు ఇచ్చారు. దీనికి ఆగ్రహించిన ఔరంగజేబు ఢిల్లీలోని ఎఱ్ఱకోట దగ్గరవున్న చాందిని చౌక్‌లో ప్రజల ముందే ఉరిశిక్షను అమలుపరిచాడు. ఉరితీసే ముందు ఆఖరి కోరికను కోరుకోమని అడిగాడట. తేజ్ బహదూర్ సింగ్‌గారు ఒక చిన్న కాగితపు ముక్క, ఒక పెన్సిల్ ఇవ్వమని కోరాడట. వారికి ఇవ్వగానే ఆ కాగితంపై ఏదో వ్రాసుకొని అది తన మెడకు తగిలించి ఇక ఉరి తీసుకో అన్నాడట.

ఉరిశిక్షను అమలు పరచిన తరువాత ఔరంగజేబుగారికి అనుమానం వచ్చినది. ఆఖరు కోరిక కోరుకోమన్నప్పుడు ఏ కోరికా కోరకుండా కాగితం కలం కోరటం ఆశ్చర్యమును కలిగిన ఔరంగజేబు వెంటనే ఆ కాగితపు ముక్కను తీసికొని రమ్మని ఆజ్ఞాపించాడట. ఆ కాగితపు ముక్కను చూడగానే అందులో ''దల్ దియా, దిల్ నహి దియా'' అని వ్రాసివున్నదట. అనగా నేను నా శరీరమునే ఇచ్చాను కాని నామనస్సును నీ కివ్వలేదు అను విషయము గ్రహించిన ఔరంగజేబు ముఖం చిన్న బుచ్చుకొని వెళ్ళిపోయాడట. నా మనస్సే నా ప్రజ అని జవాబు ఇచ్చాడు. ఆనాడు మతం అంటే అంత పవిత్రంగా చూచేవారు.

ఈ విధంగా ఉరి తీసిన తేజ్ బహదూర్‌సింగ్‌గారి భౌతిక శరీరమును దహన సంస్క్రియలు చేయనీకుండా చాందినీ చౌక్‌లో కాకులు, గ్రద్దలు తినాలని రోడ్డుపై దొర్లుతూ వుండాలి అని పారవేసి చుట్టూ సైన్యమును ఉంచారు.

అప్పటికి తేజ్ బహదూర్ సింగ్ కుమారుడైన గురుగోవిందసింగ్ 11సంవత్సరముల ప్రాయముకలవాడు. అయిన కాశ్మీరీ బ్రాహ్మణులు శ్రీ గురుగోవింద సింగ్ గారినే తమ రాజుగా ప్రకటించారు. 11 సంవత్సరముల ప్రాయమున్న బాలుడు గురుగోవిందసింగ్ ఒక బహిరంగ ప్రదేశములో కాళి మాతను ప్రతిష్టించి ఇంకను నా కరవాలమునకు బలి దానము కావలయునని ప్రజలను ఆహ్వానించాడట. అప్పుడు ఒకరు లేచి నన్ను బలిచేయండి అన్నారట. వారిని తెరవెనుక తీసుకొనిపోయి కత్తితో నరికాడట. కరవాళం ఎర్రపడి, ఆ రక్తం జివ్వుమని చిందించినదట. మరినొకరిని పిలిచినాడు. అతనిని ఆ విధంగా 5మంది రక్తంచిందించాడట. అక్కడి ప్రజలు ఆశ్చర్యపడి 11సంవత్సరముల వయస్సున్న ఈ బాలునికి ఎదైనా పిచ్చిపట్టిందా? అని తలా ఒక విధంగా చర్చించసాగేరు. అప్పుడు అతను కాళిమాతకు అడ్డంగాయున్న తెరను తొలగించగా ఆ ఐదు మంది అలాగే యున్నారట. అక్కడ చిందిన రక్తం ఐదు మేక పోతుల తలలట. అనగా ఆ వయస్సులో ఆ బాలుడు ప్రజలను పరీక్షించి చూచాడు. వీరు నా వెంట ఎంతవరకు సహకరించగలరని. ఆ ఐదుగురినే పంచ సింహములు అని పేరు పెట్టారు. గురుద్వారాలో ఏదైన ఉత్సాహాలు జరిగిన ఈ ఐదు మంది సిక్కులు కరవాళము ధరించి సాంప్రదాయమైన వస్త్రములను ధరించి ఉంటారు.

అసలు సిక్కు అనగా ఏమి? సిక్కు అనగా సిపాయి అని అర్థము. అనగా పూర్వం ఉత్తర హిందూస్థానములో మహమ్మదీయుల అరాచకాలను అరికట్టుటకు ప్రతి కుటుంబములో మొదట జన్మించిన మగ శిశువును సిక్కుగా చేసే సాంప్రదాయం ఉండేది. ఈ సిక్కు (సిపాయి) ఎల్లవేళలందు జాగ్రత్తగా దురాక్రమణలు జరుగకుండా అరికట్టుటకు సంసిద్ధముగా వుండవలయును. తన వద్ద ఐదు వస్తువులను ఎల్లప్పుడు ఉంచుకొనవలయును. 1.కత్తి 2. కడియము (కంకణము) 3. డ్రాయరు (సుమారు మూడు మీటర్ల గుడ్డతో కుట్టినది. మడచిన చిన్నదిగాను, విప్పిన పెద్దదిగాను ఉండవలెను.) 4. జుట్టు 5. దువ్వెన (జుట్టు గడ్డం ఎప్పటికప్పుడు దువ్వుకొంటూ అందంగా కనుపించునట్లు). ఈ ఐదు సిక్కులు ఎల్లవేళల కలిగియుంటారు. రాత్రిగాని, పగలుకాని. సిపాయి అనగా సిద్ధముగా వున్నవాడు అని అర్థము. ఈ విధమైన కట్టుబాట్లను చేసినారు. ఇప్పటికి ఉత్తర హిందుస్థానములో పిల్లలు కలగని హిందూ స్త్రీలు గురుద్వారాలకు పోయి పుత్ర బిక్ష పెట్టమని,మొదట జన్మించిన కుమారుని సిక్కుగా (నీ సేవకునిగా) చేస్తానని మ్రొక్కుకొని, వారి మొక్కుబడులు చెల్లిస్తున్నారు.ఈ విధంగా తయారైన ఈ సిక్కులు, వారే ఇప్పుడు ఒక వర్గంగా ఏర్పడి పూర్వ చరిత్రను మరిచి మాదే ఒక వర్గం, మాదే ఒక మతం, ఒక సాంప్రదాయం, ఒకే భాష అని చెప్పుకొంటూ పంజాబు రాష్ట్రం స్వయంగా ఏర్పాటుచేసుకొని ఇప్పుడు ఒక ప్రత్యేక దేశంగా విడిపోవాలని, భావిస్తున్నారు. కొంత మంది స్వార్థపరులు నేర్పించగా మాది ఖలిస్థాన్ దేశము అని పేరు పెట్టి పంజాబు అంతటిని అల్లకల్లోలం చేస్తున్నారు.

చాందినీ చౌక్‌లోయున్న తేజ్ బహదూర్ శవాన్ని హిందూ ధర్మశాస్త్ర ప్రకారం దహన సంస్కారము చేయవలెయునని అది ఎలా సాధ్యమని ఆలోచించారు. అప్పుడు లక్కిషా

బంజారా ఢిల్లీలో ఉన్న రాష్ట్రపతి భవన్, సెక్రటరెయేట్ మొత్తం సుమారు 300 ఎకరములు పైబడి లక్కీషా గోవులతో రాకబ్ గంజ్ అను పేరుగల తాండాలో నివాసముండెను. శ్రీ లక్కీషా బంజారాగారికి ఈ విషయమును తెలియగా తన లక్ష గోవులను చాందినీ చౌక్ మీదుగా పోనిచ్చాడు. ఈ గోవుల ప్రవాహానికి సైనికులు చెల్లాచెదురైనారు. ఆ గోవులచాటుగా పోయి ఆ శవమును తీసుకొని రాయసీనా బంజారాకు ఇచ్చారట.

రాయసీనా బంజారా ఆ రోజులలో గొప్ప వ్యాపార వేత్త అతను 100 ఎడ్ల బండ్లపైన దూదిని తీసికొనుపోవుచున్నాడట తేజ్ బహదూర్ సింగ్‌గారి శవమును దూది బండిలో కుక్కి, రాయసీనా బంజారాకు చెప్పి, వెళ్ళి గురుగోవింద్‌సింగ్ (రాజు) గారికి తెల్పినారు. ఈ లోపు ఔరంగజేబు సైనికులు శవమును వెతుకుతూ వచ్చారట. వీరిని అడుగగా మాకేమియు తెలియదు అని జవాబు ఇచ్చారు.

శ్రీ రాయసీనా బంజారాగారు మొత్తం 100 బండ్ల దూదిని తన ఇంటిలో ఉంచి అందులో శ్రీ తేజ్ బహదూర్‌సింగ్‌గారి భౌతిక కాయమును ఉంచి దహన సంస్కారములు చేసి తన మొత్తం దూదిని నిప్పంటించాడు. కాని ఆ రోజులలో ఈ విధంగా దహన సంస్కారములు చేసినారని తెలిసిన ఔరంగజేబు వారిని కూడ ఉరితీస్తాడు. అందుకని దూది అంతా ప్రమాదవశాత్తు తగలబడిపోయిందని చెప్పి తమ దేశ భక్తిని నిరూపించుకున్నారు.

ఈ విధంగా ఎంతో మంది బంజారాలు గురుగోవింద్ సింగ్ వెంట ఉండి ఎన్నో యుద్ధాలు చేసి ఈ దేశంను ఎన్నో రకాలుగా రక్షించగలిగారు. ఆఖరికి గురుగోవిందసింగ్‌గారు మరాట్‌వాడ నాందేడ్‌లో సమాధి అయివున్నారు. నాందేడ్‌లో బంజారాల సిక్కు మతమున్నది. ఎంతో మంది బంజారా సిక్కులు ఇప్పుడు ఆమతములో పనిచేస్తున్నారు. 1995లో శ్రీ సేవాలాల్ మహరాజ్ బాల బ్రహ్మచారి వారి దేవస్థాన, దర్శనార్థం పోయినపుడు ఈ గురు ద్వారాను దర్శించి వారి ఆథిత్యమును స్వీకరించి వచ్చాము. బంజారాలు గురునానక్‌ను పూజిస్తారు. ఇప్పటికి పెళ్ళిళ్ళు జరిగినప్పుడు ''గరూర్ రఫియా '' అని ఒక రూపాయిని ఆయన పేర తీస్తారు. ఇది వారి సాంప్రదాయంగా పాటించుచున్నారు. వారిని ''గరుబావా'' అని పిలుస్తారు. గురుగోవింద్ సింగ్ శిష్యుడైన శ్రీ లోకామసంద్ బంజారాగారు మహబూబ్ నగర్ జిల్లా కోసిగిలో నిర్యాణమైనారు. వారి పేర ఒక మఠమున్నది. ప్రస్తుతం అది ప్రభుత్వ ఆధీనములో వున్నది. అక్కడ ప్రతి సంవత్సరము జాతర జరుగును. మొత్తం ఆంధ్రప్రదేశ్, కర్ణాటకా, మహారాష్ట్రాలలోని బంజారాలు నగారాలు వాయించుకొంటూ వారి దర్శనార్థం వచ్చి పూజలు పునస్కారాలు చేసి వెళ్ళుతూవుంటారు.

బంజారాలు స్వచ్ఛమైన హిందువులు. వీరు హిందూ మతం. హిందూ దేశం గూర్చి తమ మాన ప్రాణాలను సహితం పోగొట్టుకొని వేయి సంవత్సరముల పైబడి అష్ట కాష్టాలను అనుభవించుతూ వచ్చారు. హిందువుల పండుగలైన అన్నింటిని వారు ఆచరిస్తారు. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన హిందువుల పండుగ హోలిని వీరు దక్షిణ భారతంలో బాగా చేసుకొంటారు. దీపావళి, ఉగాది, మొదలైన పండుగలు ఆచరించుతారు. అవే కాకుండా శక్తి పూజలు చేస్తారు. మర్యామ (ఆదిశక్తి) శీతళ, తీజ్, మంత్రాలమ్మ లాంటి చాల పండగలు చేస్తారు. వీరు శక్తి పూజలు చేయునపుడు బలి ఇస్తారు.

---

జాగృతి వారపత్రిక - విజయవాడనుండి గ్రహించిన విషయం

వీరు క్షత్రియులు కావున తమ క్షాత్ర ధర్మమైన కరవాళముతో వధించుట వీరికి చాలా ఇష్టము. ఈనాడు యుద్ధాలు మొదలైనవి లేవు. వారు వారి క్షాత్ర ధర్మమును మరిచి పోకుండా దేవతల పేర బలియిచ్చినపుడు ఆ రక్తం చిందించినపుడు దానిని చూచి మనస్సు కలత చెందకుండ వుండుటకుగాను వారు ఈ ఏర్పాట్లు చేసికొని వున్నారు. బలియంటే ఇదే దీని యొక్క ముఖ్య ఉద్దేశ్యం. కలియుగ దైవమైన శ్రీ వెంకటేశ్వర స్వామిని 14 సంవత్సరములు తపస్సు చేసి తిరుపతి అడువులలో ఆకులలములు తిని భగవంతుని మెప్పించి స్వయంగా ప్రత్యక్షముచేసికొని స్వామితో పాచికలాడి ప్రధాన అర్చకులుగా ఉండిన శ్రీ హాథిరాం బావాజీ బంజారాయే . ఇతను పవార్ వంశంమైన ఆంగోత్ గోత్రియుడు. ఈ నాడు శ్రీ వేంకటేశ్వరస్వామి సమక్షంలో బంజారాలకంటూ ఒక బంజారా మఠమును కలిగి ఉన్నాము. అంతటి గౌరవ ప్రదమైన బంజారాలు ఈ నాడు 5నుండి 6 కోట్ల పై బడిన జనాభాకల్గి కన్యాకుమారి నుండి కాశ్మీరము వరకు, అరేబియా సముద్రము నుండి బంగాళాఖాతము వరకు వ్యాపించి, స్వతంత్రముగా తాండాలను స్థాపించుకొని, తమ భాష, దుస్తులు ఆచార వ్యవహారాములు, ప్రత్యేక పండగలు మొదలైనవి కలిగియుండి స్వతంత్ర్యము వచ్చి 50 సంవత్సరములు అయినా వారికంటూ ఒక లిపిని ఏర్పాటు చేయకుండా మొత్తం దేశంలో వీరి చేత వెట్టి చాకిరి చేయించుకుంటున్నారు. వీరు కట్టని కట్టడములు లేవు, వీరు వేయని రోడ్లు లేవు. భవనాలు ప్రాజెక్టులు, వ్యవసాయం, పశుపోషణ అన్ని రంగాలలోనూ వీరి చేత పనులు చేయించుకుంటూ, వీరి గూర్చిన ఆలోచన ఇటు ప్రభుత్వమునకుగాని, ఓట్లు వేయించుకొని రాజకీయ లబ్ధి పొందుచున్న నాయకులకుకాని లేదు. బంజారాలు పేరు చెప్పుకొని రాజకీయ సౌకర్యములు పొందుచున్న బంజారాలు కాని ఆలోచించటం లేదు. ఇది చాల అన్యాయం అక్రమము, మోసము, దగా చేస్తున్నారు. భారత దేశంలోవున్న నిరక్షరాశ్యులలో నూటికినూరు పాళ్ళు నిరక్షరాశ్యులైన బంజారాలను అక్షరాశ్యులుగా చేయుట ప్రభుత్వ కర్తవ్యము. అటువంటి బంజారాలను అక్షరాశ్యులుగా చేయవలెయునంటే తమ మాతృభాషలోనే అక్షరాశ్యులను చేసిన అతి త్వరలో నిరక్షరాశ్యుల నుండి అక్షరాశ్యులుకాగలరు.

స్వాతంత్ర్యము వచ్చి 50 సంవత్సరములు అయినా భారత ప్రభుత్వం వీరి లిపి గూర్చి ఆలోచించలేదు. ప్రయత్నం చేయలేదు. కాని ఒక మత ప్రచారకులు అయిన క్రైస్తవులు, భారతదేశంలో వున్న బంజారాల జన సంఖ్యను దృష్టిలో పెట్టుకొని బంజారా భాషలో లిపి తయారుచేసి బైబిలును ముద్రించి, బైబిలు వాక్యములతో కేలండరును ముద్రించి సులభముగా వారి భాషలో మత బోధను చేసి క్రైస్తవులుగా మార్చుకొంటున్నారు. అసలు బంజారాలకు లిపి ఎందుకు అనవచ్చు? ఏ రాష్ట్రంలో వున్న వారు ఆ రాష్ట్ర లిపిని నేర్చుకొనవచ్చు కదా? అలాంటప్పుడు అన్ని భారతీయ భాషలలోను బైబిలును ముద్రించియున్నారు కదా? కాని / క్రైస్తవులు బంజారా లిపిని ప్రత్యేకంగా ఎందుకు తయారుచేసినట్టు. బంజారులు ఏ రాష్ట్రంలోవున్న అందరు ఒకే భాషలో మాట్లాడుచున్నారు. బంజారా లిపిని తయారు చేసి బంజారా భాషలో బోధించిన సులభముగా అర్థం చేసుకొని తమ మతములో చేరుతారు అనే భావనతో మొత్తం భారతంలోని బంజారాలను క్రైస్తవులుగా మార్చవచ్చు అను భావన కలుగుట వలలనే వారు ఈ కార్యక్రమమును ముమ్మరం చేసియున్నారు.

ఇది ఇలాగే ఉండిన భారతదేశం భవిష్యత్తులో ముక్కలు ముక్కలుగా అవటం ఖాయం. ఇప్పటికి వేయి సంవత్సరాల పైబడి వారి మనుగడను కాపాడుకొంటూ వచ్చిన

బంజారాలు వారి పూర్వ వృత్తాంతమును పూర్తిగా మరిచిపోయి అందరితో పాటు మనము అనే పరిస్థితికి దిగజారిపోయారు. ఈ మతం గురించే ఒక నాడు తన కోటను, ప్రజలను, భార్యా పిల్లలతో పాటు అడవుల పాలైన రాణాప్రతాప్ సింగ్ రాథోడ్ తను హలదీ ఘాటీలో చేసిన ప్రమాణములు ఈ దేశం సర్వస్వాతంత్ర్యము వచ్చేవరకు చిథోడ్ కోటలో కాలు పెట్టం, కఠిన నేలపై పండుకొంటామయని, చుట్టు గుడిసెలలో కాపురం చేస్తామని, మూకట్లలలో భోజనంచేస్తామని చేసిన ప్రమాణమును మరచిపోయే రోజులు వచ్చాయి.

ఈ దేశమునకు స్వతంత్ర్యము వచ్చినది కాని సర్వస్వాతంత్ర్యము ఇంకా రాలేదు. దీనికి ఉదా : ఈ ప్రమాణమును తెలుసుకున్న నెహ్రూజీ గారు చిథోడ్ కోటలో కొన్ని వేల గృహములను నిర్మించి అక్కడే నివాసం చేస్తున్న లోహార్ బంజారాలను పెద్ద ఊరేగింపుతో చిథోడ్ కోట ద్వారము వరకు పోయిన బంజారాలు ఏమి చెప్పకుండానే వెను తిరిగి వెళ్ళిపోయారట. కారణం వారి మనస్సులు, కోటలో కాలు పెట్టుటకు అంగీకరించలేదు. మనకు స్వాతంత్ర్యము వచ్చిందే కాని సర్వ స్వాతంత్ర్యము లభించలేదు. ఎవరైనా తనకు తెలిసిన మంచి విషయము చెప్పిన దానిని గౌరవించేవారు ప్రస్తుత రాజకీయాలలో లేరు. ఎవరికి ఎంత అబ్బితే అంత దండుకోవడానికి ప్రయత్నించుచున్నారు. కాని మంచిని గ్రహించే వారు మచ్చుకైనా లేరు. ఇది ప్రస్తుతమున్న పోకడ. ఎన్నో పరమాణువులు కలిసి ఒక అణువు, ఎన్నో అణువులు కలిసిన ఒక పదార్థం అవుతుంది అంటారు. ఈ పరమాణువులతోను , అణువులతోను తయ్యారైన ఈ బంజారాల శరీరములో ఇంకను ఆ ప్రమాణాలు దాగియున్నవి అని గ్రహించవలెను.

ఈ విధంగా హిందూ దేశమును పాలించే కాలంలో ఇంగ్లీషు వారు వ్యాపారం సాగించుకుంటు, మీ దేశభద్రతకు మా వల్ల మీకు ఏమియు ఉపద్రవము ఉండదని చెప్పిన ఆంగ్లేయులు భారత ప్రజల అమాయకత్వమును, ఇక్కడ పాలించే రాజుల అసమర్ధతలను ఆసరగా చేసికొని ఒకరిపైనొకరిని పురికొల్పుతూ వారికి సహాయం చేస్తున్న ట్లు నటిస్తూ కొద్ది కొద్ది గా వారి భూభాగములను రకరకాల కారణములవలన మొత్తం దేశమును వారు హస్తగతం చేసుకొని మొత్తం భారతమును 300 సంవత్సరములు రమారమి పాలించగలిగేరు.

ఈ భారత దేశమును రమారమి 800 సంవత్సరములపైన పాలించిన మహమ్మదీయులు ఇన్ని సంవత్సరములు ఎలా పాలించినది గ్రహించిన ఆంగ్లేయులు తమ మతమైన క్రైస్తవ మతమును కూడ అభివృద్ధి చేయుటకు మొదలు పెట్టారు.

వారికి చాల సులువైన పద్ధతి లభించినది. హిందూదేశంలో సుమారు 1/5వ వంతు జనాభాను ఆక్రమించిన హరిజనులు, హిందూవులుగా వుంటూ హిందూ మతాధిపతుల చేతనే అంటరానివారుగా పరిగణించి, దాదాపు బానిసత్వమును అనుభవిస్తున్న హరిజనులనుచూచి, వీరి ద్వారా మత మార్పిడి సులభముగా చేయవచ్చును. ఇది గ్రహించి వారికి అన్ని విధాలుగా ఆదుకుంటూ క్రైస్తవ మతమును స్వీకరించిన వారు అంటరానివారుగా ఉంచమని, వారికి హామీ ఇస్తూ విద్యా, ఉద్యోగం, ఆరోగ్యం, ఆర్థిక సౌకర్యాలు, భూవసతులు మొదలైనవి కల్పించటం జరిగినది.

ఈ విషయము గ్రహించిన మహాత్మాగాంధీ తన ప్రజలతోనే ( తన చేతులతోనే) తన కన్ను పొడిపించుటకు ప్రయత్నిస్తున్నారు అని '' హరిజనోద్ధారణ'' అను కార్య క్రమమును ప్రారంభించి హరిజన పత్రికను ప్రచురిస్తూ వారికి, రాజకీనాయకులకు జ్ఞానోదయమును

కలిగించగలిగారు. వారిని కూడ తమతో పాటు నాయకత్వంలో భాగ స్వాములను చేస్తూ, దేవాలయ ప్రవేశములను కలుగచేస్తూ కొంత వరకు అరికట్టగలిగేరేతప్ప తమ నిజమైన హరిజనోద్ధారణ మాత్రం కాదు. దీనిని గ్రహించినడా బాబా సాహెబ్ అంబేడ్కర్ గారు గాంధీ మీద తన ప్రభావమును చూపించాడు. ఆఖరుకు మాతృ భూమిపైవున్న గౌరవముతో హిందూ మతమును కాదని, భారత దేశమునకుసంబంధించిన బౌద్ధ మతమును స్వీకరించి తన అంతిమ శ్వాసను వదిలారు.

ఆఖరికి ఇంగ్లీషు వాళ్ళు భారతదేశమును వదలక తప్పలేదు. పోయేవాళ్ళు ఊరికే పోకుండా హిందూ ముస్లిమ్ అను మత ప్రభావమును చూపించి మనలో మనకు పోట్లాటలు బెట్టి దేశమును ముక్కలు చేసి పోయినారు. తూర్పు పాకిస్తాన్, పాకిస్తాన్, ఇండియాగా మార్చివేసారు. ఆ విధంగా విడిపోయిన పశ్చిమ పాకిస్తాన్ మతము కన్నా భాష మిన్న అని 1972 సంవత్సరములో బాంగ్లాదేశ్‌గా మారిపోయినది. ఇక కాశ్మీరు గూర్చి చూసిన, అది ఇంత వరకు సమస్యగానే ఉన్నది. పాకిస్తాన్ కు ఏమి సంబంధము లేక పోయిన 80 శాతము మహమ్మదీయులు కాశ్మీరులో నివసిస్తున్నారు కావున కాశ్మీరు కూడ పాకిస్తాన్‌లో కలవాలని పట్టు [illegible] ఇవన్నియు మతాల ద్వారా సంబంధించిన అరిష్టాలు కావా?

# రోమా బంజారాల మాతృదే[illegible]

## Banjara (Indian Roma from Bhar[illegible]an)

1978 సంవత్సరము ఎప్రిల్ 8 నుండి 11వరకు జనీవాలో జరిగిన రోమానో కాంగ్రెస్-2లో భారతదేశం నుంచి హాజరైన శ్రీ రంజిత్‌నాయక్ గారు (బొంబాయి) భారతీయ బంజారాల గూర్చి సమర్పించిన ఒక రిపోర్టు నందలి సారాంశము. భారత దేశంలో నివసించుచున్న కోట్లాది బంజారా లమాణి భారతీయ జిప్సీలు మొత్తం 31 రాష్ట్రాలు , యూనియన్ టెరిటోరియల్‌లోను 21 రాష్ట్రములు, టెరిటోరియల్‌లో నివసించుచున్నారు. వీరిని గూర్చిన విషయమును మేము ఈ సమావేశములో సమర్పిస్తున్నాము.

1. భారతదేశంలో బంజారాలు 27 పేర్లతోను, బంజారాల ఉప జాతులు 17 పేర్లతోనుపిలువ బడుచున్నారు. భారత దేశంలోని ప్రాంతీయ భాషలు మరియు రాష్ట్రీయ భాషలు మాట్లాడుట వలన వారు లమన్ లేక లమాణి లేక బంజారాలు 27 పేర్లతో పిలువబడినారు. బంజారాలైతే ''గోర్'' అని బంజారాలు కాని వారిని ''కోర్'' అని పిలుస్తారు. అలాగే రోమా బంజారాలు తమ వరిని రోమాయని ఇతరులను గాజో లేక గాజి అని పిలుస్తారు.

2. జనాభా భారతదేశంలో లమన్ లేక బంజారాల జన సంఖ్య ఉజ్జాయింపుగా లెక్క కట్టింది 15 మిలియన్లు. ప్రస్తుతం వీరు ఎక్కువగా రాజస్తాన్, పంజాబ్, ఉత్తరప్రదేశ్, మధ్య ప్రదేశ్ మహారాష్ట్రం, కర్ణాటక, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములలో ఎక్కువగా వున్నారు.

3. సంతతి : బంజారాలు ఆర్యా సంతతిగాని ద్రావిడ సంతతి వారు కాని కాదు. వీరు ఈ రెండు వర్గములయొక్క అభిమానమును చూరగొన్నారు. వీరు ప్రాచీన కాలము నుండి ఈ భారత దేశంలో విలీనమై ఉన్నారు. బంజారాలు చాల పురాతనమైన భారతీయ జాతిగా



*శ్రీ రంజిత్‌నాయక్ (బంబాయి) గారు 1978 సంవత్సరము ఎప్రిల్ 8 నుండి 11 వరకు జనీవాలో జరిగిన రోమానో కాంగ్రెస్-2లో భారతదేశం నుంచి హాజరై భారతీయ బంజారాల గూర్చి సమర్పించిన ఒక రిపోర్టు*

గణతికెక్కినారు. బంజారాలయొక్క ప్రత్యేకత వలన భాష, దుస్తులు, ఆచార వ్యవహారముల వలన గ్రామములకు దూరంగా ప్రత్యేకమైన నివాసములు ఏర్పరుచుకొనుట. వీరు చేయు బిడారి వ్యాపారము వలన ఒక రాజ్యము నుండి మరియొక రాజ్యముతో సత్‌సంబంధములు కలిగి ఉండుట వలన స్వాతంత్ర్యమునకు ముందే భారత్ మొత్తంలో మిళితమై ఉండిపోయినారు.

4. భాష : వీరియొక్క ప్రత్యేకత వలన బంజారాలు లేక లమణులు మొత్తం భారతంలో ఒకే ఒక భాషను మాట్లాడుతారు. వీరు మొత్తం భారతంలో నివసించుచు ప్రాంతీయ భాషలన్నింటిని మాట్లాడుతూ తిరిగి వారి భాషను వారు మాట్లాడగలరు. ఉత్తర భారతంలో వీరి భాషను ''బంజారా బోలి'' లేక ''గోర్ బోలి'' అని దక్షిణ భారతంలో వీరి భాషను లంబాడి భాషయని అంటారు. ఈ భాషయొక్క మూలము సంస్కృతం మరియు పాళి భాషకు సంబంధము కలిగియున్నది. ఈ రెండు భాషలు చాలా ప్రాచీనమైనవి. ఉత్తర పశ్చిమ భారతంలోని రాజస్థాన్, గుజరాత్, పంజాబు ప్రాంతములు వీరి పూర్వ నివాసములు. అందువలన ఈ ప్రాంతాలలో మాట్లాడే భాషల ప్రభావం వీరి భాషలో ఎక్కువగా ఉన్నది. బంజారాలు రాజపుత్ర వంశీయులగుట వలన రాజస్థానీ వంశ నామములు వీరిలోను వున్నవి. రాఠోడ్, చౌహాన్, పవార్ మరియు జాదవ్ అని ఈ నామ గోత్రములు రాజస్థానీయులు కూడ తమనామము చివర ఉంచుకుంటారు. కావున వారు వీరు ఒక్కటే అను భావన కలుగుచున్నది.

5. పురాతనము( ఆర్కియాలజి) నుండి బంజారాలు ఎల్లప్పుడు ఒక చోట నిలకడగా ఉండకపోవుటవలన ఎల్లప్పుడు వారు రవాణా వ్యాపారములో మునిగి తేలుచుండుట వలన. వారి కంటూ ఒక ప్రత్యేకమైన జ్ఞాపకార్థములు లేవు. వారు కట్టించిన గుళ్ళు గోపురాలు లేవు వారి నివాసములైన తాండాలు ఎప్పటికప్పుడు మార్చబడుతుండేవి. ఉత్తర భారతంలో కొన్నిచోట్ల అతి ప్రయాసముతో కొన్నింటిని గుర్తించగలిగాము. బంజారాలు విడిది చేయునపుడు నివసించుటకు కట్టిన విశ్రాంతి గృహములు, వారు క్యాంపులకు పోయినపుడు ఉంటారు. అటువంటి వాటిలో ''చంబల్ లోయ'' ఒకటి. భారతంలో వీరు ప్రయాణించిన అతి పురాతనమైన మార్గముతో ముద్రించబడిన భారత పటం , ''సాత్‌కువా'' బంజారాలు కట్టిన ఏడు బావులు మరియు వీరు ప్రయాణించినపుడు పేర్లు పెట్టిన బంజారా లోయలు , ఆయా ప్రాంతముల పేర్లు మాత్రం చెప్పగలుగుచున్నారు.

6. లదణి : రవాణా వ్యాపారం : బంజారాలు లేక లమాణీలు వీరి ముఖ్యవృత్తి రవాణా చేయడం. వీరు ముఖ్యంగా ఆహార ధాన్యములు, ఉప్పు మరియు ఇతర సామగ్రిని, ఒక చోటు నుండి మరియొక చోటికి లేక ఒక రాజ్యము నుండి మరియొక రాజ్యమునకు తమ ఎద్దులపై, ఒంటెలపై, గుఱ్ఱములపై, మరియు ఇతరములయిన జంతువుల వీపులపై గోనె సంచులలో నింపి వాటిగమ్యమును చేర్చు చుండేవారు. ఒక్కొక్క సమయములో యుద్ధ పరికరములను , మందు గుండు సామానులను కూడ ఒక రాజ్యము నుండి మరియొక రాజ్యమునకు చేర వేస్తూవుండిరి. ఈ వ్యాపారమునే బంజారాలు తమ భాషలో ''లదణి'' లేక ''బలాడ్'' అని చెప్పు చుండిరి.

భారతదేశంలో ఆంగ్లేయుల రాకతో వారి వ్యాపార అభివృద్ధిని పెంచుటకు వారు నవీన పద్ధతులను పాటించడం జరిగినది. రోడ్లపై వాహనములను నడిపించుట, రైలు మార్గములను భారత్ మొత్తంలో ప్రారంభిచుట వలన ప్రాచీన కాలము నుండి వీరు చేస్తూ వచ్చిన రవాణా వ్యాపారం పడిపోయి 19 శతాబ్దము మధ్య కాలంలో 1857 సంవత్సరము తరువాత వీరు తమ వృత్తిని కోల్పోయి నిరాశ్రయులైపోయినారు. అందువలన బంజారాలు భారతదేశం మొత్తంలో తమ వ్యాపార రీత్యా విస్తరించియుండిరి. ఎక్కడ వ్యాపారం అక్కడ నిలిచిపోయినది. అందువలన మొత్తం భారతంలోని బంజారాలు, ఒక చోటి కి చేరుకోలేక, తమ జీవితం కష్టతరం అగుట వలన, ఎక్కడివారు అక్కడ తమ వ్యాపార లావా దేవిలను పంచుకొని గుంపులు గుంపులుగా విడిపోయి, తమ పశు సంపదకు అనుకూలమైన ప్రదేశములను ఎన్నిక చేసుకొని కొండ పాదములలోను, మంచి అరణ్య మైదానములలో, నది ఒడ్డు మీద బంజారాలు తాండాలు తాండాలుగా, స్థిర నివాసము ఏర్పాటు చేసికొని ఇండ్లను, పూరి ఇండ్లను కట్టుకొని ఉండిపోయారు. వీరు తమ తాండాలను పట్టణ ప్రాంతములో కాని గ్రామమునకు దగ్గర కాని కట్టుకొనలేదు. అందువలన వారు ఒక ప్రత్యేకమైన గుర్తింపును పొందారు. ఎటువంటి చోటవున్న వారి ఆచార వ్యవహారములు, భాష, దుస్తులు కలిగి యుండుట వలన మొత్తం భారతంలో ఒకటిగా మెలుగుచున్నారు.

7. ప్రత్యేకమైన కళ : బంజారాలు ముందు నుంచి ఒక ప్రత్యేకతను కాపాడుకుంటూ వచ్చారు ఏమనగా జననాలు, మరణాలు, వారి పెండ్లి చేయు పద్ధతులు, వారు చేయు పండగలు, వారు



బంజారా దుస్తులలో శ్రీమతి ఇందిరాగాంధి

ధరించు రంగు రంగుల దుస్తులు, వారు ధరించు ఆభరణములు, భారత దేశం మొత్తంలో వారు మాట్లాడు భాష ఒక్కటే. వారు నివసించు ప్రత్యేకమైన తాండాల ప్రాముఖ్యత, వారి స్వతంత్ర్యమైన న్యాయమైన పద్ధతులు, వారు ఆస్వాదించు స్వతంత్రమైన స్వేచ్ఛావాయువులను పీల్చుతూ వుంటారు. బంజారాలు తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యములను అనుభవిస్తూ తమ జాతి ఔన్నత్యాన్ని చాటి చెప్పుచూ, ప్రకృతి సిద్ధమైన ఆటలు, పాటలు, నృత్యములు చేస్తూవుంటారు. వీరి సంగీత వాయిద్యములు కూడా ప్రకృతి సిద్ధమైనవి. వీరు ధరించే దుస్తులపై వారి కళలను ప్రతి బింబింపజేస్తాయి. వీటిన్నింటిని చూచిన భగవంతుడు వీరికి స్వర్గధామమైన జన్మను ప్రసాదించాడా అని అనిపిస్తుంది. బంజారాలను చూచిన వారు చేసే డాన్సులు, సంగీతం,

వాయించే వాయిద్యములు చూచిన ఇవి అన్నియు వారి నిత్య జీవితంలో ఒక కార్యక్రమముగా వారు అగుపించకమానదు.

8. రోమా బంజారాలు భారత దేశమును ఎప్పుడో వదిలిపెట్టివెళ్ళారు : ఒక వేళ వీరు తమ వ్యాపారమును పరదేశములలో విస్తరించవలెయునను ఉద్దేశ్యముతో ''ఖైబరు'' మరియు బోలాన్ కనుమల ద్వారా పోయి ఉండవచ్చును. ఈ మార్గములు ''లమన్'' మార్గములు అని భారత పటములో గుర్తించబడివున్నవి. వీరిని జిప్సీలు అంటారు. మరియొక వర్గం భారత దేశంలోనే ఉండి అడవులలో తిరగాడుచుండిరి. దీనినే చంబల్ లోయ అంటారు. ఇవి రాజస్థాన్‌లో చాలా పేరు గాంచిన ప్రాంతం. వీరినే ''లమాన్'' లేక ''బంజారాలు'' అంటారు. కొంతమంది మైదాన ప్రాంతాలకు వచ్చి వారి మనుగడకై యుద్ధములు చేశారు. వీరినే రాజపుత్రులు లేద జాటోలు. వీరే ఉత్తర భారతంలో యుద్ధ వీరులుగా ఖ్యాతిగాంచినారు.

9. నసాబ్ (పంచాయితి) : బంజారాలలో ఎవ్వరైన తప్పు చేసిన లేక హత్యలు చేసిన వారిని ''గోరేర్ నసాబ్'' లేక ''తాండా నసాబ్'' అనగా తాండా పంచాయితి ద్వారా న్యాయమును, అన్యాయములను వాది ప్రతి వాదులను విచారించి తీర్పు చెబుతారు. ఈ పంచాయితీలకు వ్రాత

బంజారాల నసాబ్ (పంచాయితి) చేయు పద్ధతి

మూలకములైన శిక్ష అంటూ ఏమి ఉండదు. అయితే పంచాయితీలో తీర్మానించిన శిక్షను మాత్రం హృదయ పూర్వకంగా స్వీకరిస్తారు. పంచాయితి కూర్చున్నప్పటి నుండి జరిగిన ఖర్చులను కూడ పంచాయితీ వారు నిర్ధారించి పంచాయితి ఎవరికైతే నిర్ణయిస్తుందో వారిపై వేస్తారు. లేక వాది ప్రతివాది కూడా భరించవలసి వస్తుంది. ప్రభుత్వం ఏర్పాటు చేసిన న్యాయ స్థానాలకు పోకుండగానే వీటిని పరిష్కరిస్తారు.

10. చరిత్ర : బంజారాలను గూర్చి వ్రాసిన చరిత్రలంటూ ఏమియు లేవు. కాని పరిసోధకులు, చరిత్ర కారులు వీరిని గూర్చి వ్రాసినది 2500 సంవత్సరముల వరకు మాత్రమే అర్థమౌతుంది. అందులోనూ వారు చేసిన వ్యాపారముల గూర్చి మాత్రమే తెల్పడం జరుగుచున్నది. ఇవి అన్నియు అసంపూర్తిగానే అనిపించుచున్నవి. అయితే బంజారాలు భావించే అసలైన చరిత్ర వారు పాడుకునే పాటలలోను, వారు చెప్పుకునే జానపద కథలలోనూ దాగియున్నది. వారు ఆచరించే

పద్ధతులలోను, వారి సంస్కృతిలో దాగియున్నది. వీటి గూర్చి కొన్ని పవిత్ర గ్రంథములలో ప్రస్తావించడం జరిగినది. అందులో ముఖ్యమైనది ''గురుగ్రంథ'' సిక్కు మతమునకు సంబంధించినది. బౌద్ధ గ్రంథములో ''జాతకాస్'' అనుగ్రంథములో జైన గ్రంథములలో తెల్పడం జరిగినది.

11. బంజారాలు భారతదేశం మొత్తంలో పూర్వకాలంలో సంచార వ్యాపారులుగా చెలామణి అయినారు లేక ప్రసిద్ధికెక్కినారు. స్వతంత్ర్య భారతానికి పూర్వం బంజారాలు తమ లదణి వ్యాపారమును చేయునపుడు ఒక రాజ్యము నుండి మరియొక రాజ్యమునకు సరుకులను రవాణా చేయుటకుగాను ఆయా రాజ్యము, రాజులయొక్క విశ్వాసమును చూరగొన్నారు. తమ ఆస్థులకు వీరి ద్వారా ఎటువంటి ప్రమాదముకలుగకుండా నమ్మకముగా చేరవేస్తారు అను విశ్వాసమును వారిలో కలిగించ గలిగారు. అందువల్లనే వారు బంజారాల వ్యాపార మంటే ఆనందముతో స్వీకరించేవారు. ఆ కాలములో భారతదేశం మొత్తంలో అనేకనేక రాజ్యములు ఉండేవి. ఆ రాజ్యముల అన్నింటిని దాటుకుంటూ ఆహార ధాన్యములను, యుద్ధ సంబంధమైన మందు గుండు సామానులను కూడా చేరవేసేవారు. వీరు అరణ్య మధ్యముల నుండి కొండ లోయుల నుండి ప్రయాణించేటప్పుడు దోపిడి దొంగలు వీరిని లూటీ చేయుటకు వచ్చినపుడువారితో యుద్ధం చేసి వారిని సంహరించి ముందుకు సాగిపోతుండేవారు. వీరి గూర్చి అర్థం చేసుకున్నవారు వీరిని నవీన పద్ధతిలో దేశంమంతా తిరుగుతూ సరుకులను అమ్మేవారు. అనుచుండిరి.

దేశం మొత్తం తిరిగి మత ప్రబోధము చేయువారు, మరియు రాజులు రాయబారులు, వీరిని సంరక్షలుగా వీరిని వెంట తీసుకునిపోవుచుండిరి. బంజారాలు ''లదణి'' సరకులను రవాణా చేయునపుడు వాటిని సురక్షితంగా చేర్చుటకుగాను, ముందు సైన్యం , వెనుక సైన్యం నడిపిస్తూ తమ వ్యాపారమును సురక్షితంగా ఒక చోటి నుండి మరియొక చోటికి చేర్చుతూ రాజులు, రాజ్యము యొక్క అభిమానమును పొందుచుండిరి.

12. **దేశమును గూర్చిన జ్ఞానము** : బంజారాలు తమ వ్యాపార రీత్యా దేశం మొత్తం పర్యటించుట వలన ఆయా ప్రదేశాల జ్ఞానము ఆయా రాజ్యాల రాజులయొక్క గొప్పతనము, ఆయా రాజ్యాల భూభౌతిక శాస్త్రము వారి రాజకీయం వారి సాంఘిక, సాంస్కృతిక మరియు ఆర్థిక స్థోమతల గూర్చి బాగా తెలుసుకొని యుండెడివారు. ఈ విషయములన్నియు చీకటిలో వారి నాలుకపై ఉండేవి. అయినా వాటిని ఎవ్వరికి తెల్పేవారు కాదు. ఈ విధంగా వాటి అన్నింటిని తమ హృదయములో దాచుకొని, వివిధ రాజులు రాజ్యాలయొక్క మన్ననలను పొంది ఒక రాజ్యము నుండి మరియొక్క రాజ్యమునకు పోవుటకు వారి నుండి అభిమానము పొంది వారి భూబాగము నుండి ప్రయాణము సాగిస్తూ ఉండిరి. ఈ విధంగా భారత దేశంలోని అన్ని రాజ్యాలతో వీరు సత్ సంబంధములను కలిగియుండిరి. బంజారాలు స్వయంగా రాజులు కానప్పటికి, వారు రాజ్యాలు పాలించనప్పటికి, వారు రాజ గౌరవమును పొంది యుండిరి. (రాజ మర్యాదలు పొందియుండిరి.)

13. భారత దేశంలో గణతికెక్కిన బంజారా మేధావులు భారత దేశంలోని బంజారాలలో ప్రఖ్యాతి గాంచిన వారిలో ఈ క్రింద తెల్పిన వారు ముఖ్యులు. వీరు తమ జీవిత కాలంలో చాలా

గొప్పవైన ముఖ్యమైన పనులు చేయుట వలన ప్రజలలో చాలా మన్ననలను పొందారు. వారియొక్క తెలివి తేటలు, వారు చేపట్టిన పనుల యొక్క శక్తి సామర్థ్యములు, ఆ నాటి పాలకులు ( రాజులు) దేశం మొత్తం తిరిగి వారు సంపాదించిన విజ్ఞానం, భూ భౌతిక స్వరూపం, రాజకీయ చతురత, సాంఘిక ఆర్థిక సంపదను వీరు బాగా అవగాహన చేసికొనియుండిరి. అటువంటి వారిలో కొందరు ప్రజల దృష్టిలో మంచి పేరు సంపాదించారు. వారిలో 1.శ్రీ లక్కీషా బంజారా, ఢిల్లీ, వీరు రాకబ్ గంజ్ గురు ద్వారాను కట్టించారు. అందువలన దీనిని ''రాకబ్‌గంజ్ గురు ద్వారా'' అంటారు. ఇది 9వ సిక్కు గురువైన శ్రీ తేజ్ బహదూర్‌సింగ్‌గారి సమాధి. ఇది ఢిల్లీలోని పార్లమెంట్ హౌస్‌కి దగ్గరలోయున్నది. 2. లక్ష బంజారా వీరు గుజరాత్‌లో ప్రసిద్ధులు. వీరు 1 లక్ష ఎద్దులపై బిడారి వ్యాపారం చేసారు. 3. మక్కన్‌షా బంజారా వీరు పంజాబ్‌లో చాల ప్రసిద్ధులు. వీరు కూడ చాల గొప్ప వ్యాపార వేత్తగా ప్రసిద్ధి చెందియున్నారు మరియు సిక్కు మతమును చాలా అభివృద్ధి చేసియున్నారు. 4. భూమ్ సింగ్ బంజారా వీరు రాజస్థాన్‌లో చాల ప్రసిద్ధులు. 5. జంగి మరియు భంగి వీరు నిజాం రాజ్యం హైదరాబాదులో చాల ప్రఖ్యాతి గాంచి యున్నారు. 6. మీటు భూక్యా బీదర్ రాజ్యంలో చాలా ప్రసిద్ధులు. వీరు ఆంగ్లేయుల గుండెలలో గుబులు పుట్టించారు. 7.శ్రీ భగవాన్ సేవాలాల్ మహరాజ్ బాల బ్రహ్మచారి . మధ్య భారతంలో మొత్తం బంజారాలకు దైవమై వెలసినారు. 8.దక్షిణ భారతంలో ''నానుసాద్''మొదలైనవారు. వీరందరు వారి జీవిత కాలంలో మంచి పేరు ప్రఖ్యాతులు గాంచుట వలన ఈ నాటి వరకు బంజారాలు వారిని తమ నాయకులుగాను తమ అభివృద్ధికి జన్మ ఎత్తిన భగవంతుడుగా భావించి వారి గొప్పతనమును , వారు చేసినటువంటి గొప్ప గొప్పపనులను కథలు కథలుగా చెప్పుకొంటూ వారియొక్క పాటలలో గానము చేస్తూవుంటారు.

# జిప్సీలు - రోమా బంజారాలు

రాజపుత్ర సైన్యములు 11వ శతాబ్దములో మూడు గ్రూపులుగా విడిపోయి ఒక గ్రూపు రాజస్థాన్ కోటలోను, ఒక గ్రూపు అడవుల పాలు, మూడవ గ్రూపు ఇతర ప్రపంచ దేశాలకు వెళ్ళిపోయినారు.

అలా 11వ శతాబ్దములో వెళ్ళిపోయిన వారినే జిప్సీలు అంటారు. వారే రోమా బంజారాలు . రోమా బంజారాలు అనగా రాముని దేశం నుండి వచ్చిన వారం అని చెప్పుకుంటారు. వీరికి జిప్సీ అను పేరు ఎందుకు వచ్చినది? వారు భారతదేశం వదలి వెళ్ళిన తరువాత ఈజిప్టు మీదుగా యూరప్ ఆసియా దేశాలలో విస్తరించారు. వారు చాల కాలం ఎవరి కంటా పడకుండా అడవులలోనే వుంటూ మెట్ట మొదట 1417లో జర్మనీలోను, 1419లో స్విట్జర్‌ల్యాండ్‌లో 1422లో ఇటలీలో కనిపించినారట. అప్పటికి ఒకే ఒక జిప్సీ రాజు ఉండేవాడట.

క్రీ.శ. 74 సంవత్సరములో ఇస్రాయిల్ దేశంలోవున్న యూధులనందరిని రోమనులు వారి మాతృ భూమి నుండి తరిమివేశారు. వారు మొత్తం ప్రపంచములో వ్యాపించినారు. అలాగే 11వ శతాబ్దములో రాజ పుత్రులు కూడా ఉత్తర భారతము నుండి మహమ్మదీయుల చేత

తరిమి వేయబడినారు. అలా తరిమి వేయబడిన యూధులు తమ స్వంత జన్మ భూమిని చేరుటకు సుమారు 1900 సంవత్సరములు పట్టినవి. 1948 సంవత్సరం, రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ఐక్య రాజ్య సమితివారు ఇస్రాయిల్ దేశమును ఏర్పాటు చేసినారు. దీని వైశాల్యము 27వేల చదరపు కిలో మీటర్లు జనాభా 55లక్షలు అయినా వీరు స్వతంత్ర్యము ప్రకటించుకొని వారి రాజ్యమును ఏర్పాటు చేసుకొని ప్రమాణ స్వీకారములు చేసేలోపు 5 అరబ్ రాజ్యాలు వారిపై దండెత్తి లక్షల సైన్యం వారిపై విరుచుకుపడ్డారట. కాని ఇజ్రాయిలీలు ధైర్యమును ఒదలక ఇజ్రాయిలీ గెరిల్లాలు కొన్ని వేల మంది, కొన్ని లక్షల మందిని తరిమి కొట్టారు.

జర్మనీ నాజియైన హిట్లర్60లక్షల యూధులను 17 నగరాలలోని గ్యాస్ ఛేంబర్‌లలో బంధించి ఘోరంగా హత మార్చాడు. అలాగే జిప్సీలను కూడా హిట్లర్ 5 లక్షల మందిని చంపించాడు. జిప్సీలలో మగవాడు దొరికిన 8రూపాయల చొప్పున ఆడ వాళ్ళకు 8 రూపాయల ప్రకారం ఇచ్చి ఏరి ఏరి చంపించాడట. ఎందుకనగా జిప్సీలు క్షత్రియులని, ఈ సంతతి చాలా ప్రమాదకరమైనది అని ఎప్పటికైన వీరి నుండి ముప్పు సంభవించునని రాజకీయమును తెలుసుకున్నవాడు కావున జిప్సీలను ఎక్కడ దొరికితే అక్కడ చిత్ర వధ చేయించినాడు. ఒక జిప్సీ స్త్రీ చాలా శక్తి పరురాలు ఉండెనట. ఆమె ముందు జరుగబోవు భవిష్యత్తును కూడా చెప్పేదట. ఆమెను పట్టుకొని హిట్లర్ తన భవిష్యత్తు గూర్చి తెల్పమన్నాడట. అప్పుడు ఆమె ఇంక కొద్ది సేపటిలో నీవు కుక్కచావు చస్తావన్నదట. అప్పుడు నీ గురించి చెప్పమన్నాడట, నన్ను నీవు చిత్ర వధ చేస్తావన్నదట. ఆ విధంగానే ఆమెను చిత్ర వధ చేసి తాను రష్యన్ల చేతులలో కుక్క చావు చస్తాడు.

జిప్సీలు రాకూడదు అని యూరప్ దేశాలు చాలా కఠిన శిక్షలను అమలు పరిచినవట. వారి దేశ సరిహద్దులలో ముళ్ళతీగలను ఏర్పాటు చేసినారట అయినను జిప్సీలు వారి కఠిన చర్యలకు ముండ్ల తీగలకు లెక్క చేయకుండా పయనించేవారట. వారి క్షాత్ర గుణము ఎక్కడ పోయినను తగ్గినది కాదు. వీరు యూరప్ ఖండములోని అన్ని దేశాలలోను వ్యాపించివున్నారు. స్పెయిన్, యుగోస్లోవేకియా, జగస్లోవేకియా, హంగేరి మరియు యూరప్ ఖండములోను, మధ్య ఆసియా ఖండములోను వున్నారు. పై దేశాల వారు వీరు మొదట్లో కనిపించినపుడు కుక్కలతో వేటాడినారట. ఎక్కడపడితే అక్కడ చెట్లకు వేల మందిని ఉరితీసినారట.

ఇంగ్లీషు వాళ్ళు( ఫ్రాన్సువాళ్ళు) వీరిని చంపుటకు క్రూరాతిక్రూరమైన శాసనములను చేసి చంపిచారు. హిట్లరైతే ఒకే చోట 28వేల మందిని క్రూరాతిక్రూరముగా చంపిచారట. యూరోపియనులు వీరిని బానిసలుగా చేసి వారిచేత రకరకాల పనులు చేయించుకున్నారట. ఇలా బానిసలుగా తీసికొనిపోయిన దేశములలో యుగోస్లోవేకియా, బల్‌గేరియా, ఇంగ్లండ్, హంగేరి, జకొస్లోవేకియా, స్పెయిన్, ఫ్రాన్స్ మరియు యు. ఎస్.ఎ. (యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా) దేశములు.

వీరు మొట్టమొదట ఇంగ్లండును 1490లో చేరారు. 1555 నుండి 1780 వరకు వీరిని లెక్కలేనన్ని కష్టాలకు గురిచేసారు. 1536 సంవత్సరములో స్వీడన్ దేశస్థులు 3నెలలలోపు వారు వారి దేశమును వదిలి వెళ్ళవలయునని లేకున్న అందరిని చంపివేయమని ఉత్తరువు జారీ చేసారు. 1539లో ఇంగ్లండు నందు వీరిపై కర్కశమైన, కఠినమైన శిక్షలు అమలు పరిచినారు. ఆస్ట్రియా దేశములో 1726సంవత్సరం ఛార్‌లెస్ 18 సంవత్సరములలోపు ఉన్న స్త్రీలు

పురుషులు అందరిని చంపివేయమని ఉత్తరువులిచ్చారు. మిగిలిన వారిని బానిసలుగా పని చేయించారు. వారి ఒక చెవిని కోసేయమన్నారు.

మొదట్లో ఇంగ్లాండువారు విదేశ పర్యాటకులు అని అనుకున్నారట. ఆ తరువాత జిప్సీలు ఎవ్వరు కూడా ఇంగ్లాండులో ప్రవేశించకూడదు. అలా ప్రవేశించిన వారికి చూచిన వెంటనే చంపివేయండి అని ఉత్తర్వులు జారీ చేస్తారు. ఈ విధంగా రోమా జిప్సిలు బంజారాలను 11 వ శతాబ్దము నుండి 19 వ శతాబ్దము వరకు చాల చిత్ర హింసల పాలైనారు. వారు యూరప్ ఖండమును బూడిద చేసి మాతృ భూమియైన భారతదేశమును చేరుకుంటామని ప్రతిజ్ఞను చేసారట.

రెండవ చక్రవర్తి అయిన జోసఫ్‌గారు వీరిపై విధించిన ఆంక్షలన్నింటిని ఎత్తి వేసి వారి ఇష్టము వచ్చినట్లు వారు ఎక్కడెక్కడ నివశించదలుచుకుంటే అక్కడ నివశించవచ్చని ఉత్తరువులు జారీ చేసారట. ''ప్రపంచ జిప్సీలందరు ప్రతి సంవత్సరము మే నెల **24** నుండి **26** వరకు దక్షిణ ఫ్రాన్స్‌లో లక్షాధికారులు, లాయర్లు, కవులు, నాట్య కళాకారులు, ఇతర కళాకారులు మరియు వాద్య బృందాలవారు సమావేశమై వారి ఆనందాన్ని పంచుకుంటారు''. వాళ్ళు ఎక్కువగా గుఱ్ఱముల పోషకులు. వారి వృత్తి ముఖ్యంగా గుఱ్ఱాల వ్యాపారం. ఇప్పుడు వారు మోటారు వాహనములు మిషన్ల వ్యాపారం చేస్తున్నారు. ఒకటవ శతాబ్దములో జన్మ స్థలం వదిలిన ఇస్రాయిల్‌లు 20 శతాబ్దములో తమ స్వంత మాతృ భూమిని చేరుకొని వీరికంటూ ఒక స్థానమును కల్పించుకొన్నారు. అలాగే 11వ శతాబ్దములో తమ మాతృ భూమిని వదిలిన రాజ పుత్రులు రోమా – బంజారాలు , బంజారాలు తిరిగి వారి పూర్వ స్థానమును తప్పకుండా చేరుకునే రోజులు దగ్గర పడుతున్నవి.

జాతి అభివృద్ధి చెందవలెయునన్న సమైక్యత చాల ముఖ్యం. 46 సంవత్సరముల క్రింద స్వాతంత్ర్యము సంపాదించిన ఇజ్రాయిలీలు 55 లక్షల మంది మాత్రమే. వారి దేశ వైశాల్యము 27 వేల చదరపు కిలో మీటర్లు . అందులో సగ భాగం ఎడారి మయం. కొంత అడవులు. మిగిలిన మొత్తం బంజరు భూమి. ఆ భూములు వారు అరబ్బుల ద్వారా కొన్నారు. ఇతర దేశములలో నివశించే యూదులు వారికి ఆర్థిక సహాయంచేసారు. వారు సైన్సు, ఇంజనీరింగ్, వైద్య ఇతర రంగాలలో నిపుణులు, ప్రతిభావంతులు, దృఢ నిశ్చయంతో, దీక్షతో, అంకిత భావంతో పని చేశారు. వారు మొట్టమొదట సమిష్టి వ్యవసాయ క్షేత్రములను ప్రారంభించారు. వివిధ దేశాల ప్రభుత్వాలు యూధులు అక్కడ వ్యవసాయం చేయకూడదని ఆంక్షలు విధించారు. 19 వందల సంవత్సరాల తరువాత ప్రథమ పర్యాయము యూదులు తమ మాతృ దేశములో వ్యవసాయమును ప్రారంభించారు. అయినా 1956లోను,1967లోనూ, 1973 లోనూ,1982లో అరబ్బు దేశాలతో యుద్ధాలు చేయవలసి వచ్చింది. ఆ యుద్ధాలలో వీరు అరబ్బులను ఓడించారు.

70 దేశాల నుంచి వచ్చిన 20 లక్షల మంది యూధులు 30 భాషలు మాట్లాడతారు అయిన వారందరి మాతృ భాషయైన ''హిబ్రూ'' భాషను నేర్చుకున్నారు. ఇజ్రాయిల్ అధికార భాష ''ఇబ్రూ'' ఇది యూధులందరిని సంఘటిత పరచింది. ఎడారి, బంజరు భూములను సస్య శ్యామల క్షేత్రాలుగా మార్చారు. విస్తృత స్థాయిలో అరణ్యాలను పెంచారు. ప్రతి నీటి బొట్టును సద్వినియోగ పరచినారు. వారికి వున్న ఒకే ఒక నదిని ఉపయోగించి

వ్యవసాయాభివృద్ధిని సాధించారు. తమకు కావలసిన ఆహార ధాన్యములన్నింటిని ఇజ్రాయిల్ ఉత్పత్తి చేసింది. 52,600 హెక్టార్లల్లో పండ్ల తోటలను పెంచి ప్రతి సంవత్సరము 5 లక్షల టన్నుల పండ్లను పండించుచున్నది. ప్రతి సంవత్సర ఆదాయం డాలర్లలో 450 మిలియన్ స్టెర్లింగులు. వ్యవసాయ ఉత్పత్తిలో 15.1 శాతము, పండ్లు 11.7 శాతము మొత్తం తాజా పండ్లను ఎగుమతి చేస్తున్నారు. మొత్తం పండ్ల ఉత్పత్తిలో వారి అవసరాలకు పోను 55 వేల టన్నుల పండ్లు ఎగుమతి చేస్తున్నారట. పూల ఉత్పత్తి 7.6 శాతం మొత్తం వ్యవసాయ ఉత్పత్తిలో ఉంటుంది. దేశం మొత్తం వ్యవసాయ ఉత్పత్తిలో 31 శాతంకి ఇది చేరుకుంటుంది. 1995లో రెండు వేల హెక్టార్ల భూమిలో 1.4 బిలియన్‌ల పూలను ఉత్పత్తి చేసింది. సంవత్సరము పొడవున పండించి యూరప్ దేశాలకు ఎగుమతి చేస్తున్నారు. ఈ పూలను ఇంటర్‌నేషనల్ స్టాండర్డులో ఉత్పత్తి చేసి పంపుతున్నారు. ప్రతి సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో సుమారు 1 హెక్టారు కన్న తక్కువ భూములో సాగు చేస్తున్నారు.

కూరగాయలు : ఇది వ్యవసాయ ఉత్పత్తిలో 17 శాతమును ఆక్రమించుకొంటుంది. 1994లో 1.4 మిలియను టన్నులు 55వేల హెక్టారులలో పండించారు. అందులో 100 డాలర్ల మిలియన్ల విలువ గల 90,000 టన్నుల కూరగాయలను ప్రతి సంవత్సరము ఎగుమతి చేస్తున్నారు.

పాడి పరిశ్రమ : ఒక ఆవు 40 నుండి 50 లీటర్ల పాల ఉత్పత్తిని చేస్తుంది. వారి తలసరి ఆదాయం 5 లక్షల రపాయలు సంవత్సరమునకు. అదే భారత దేశ తలసరి ఆదాయం 11,500 రుపాయలు. ఈ విధంగా చెల్లాచెదురైన ఇస్రాయిలీలు ( యూదులు) వారి యొక్క పూర్వ స్థితికి చేరుకొని ప్రపంచములో తమ స్థానమును నిలుపుకొన్నారు.

అలాగే బంజారాలు కూడ అఖిల భారతస్థాయిల్లో సంఘములను స్థాపించి సంఘ బలము ద్వారా తాండా స్థాయి సంఘములనుస్థాపించి తమకున్న మానవ వనరులను భూవనరులను, నీటి వసతిని, పశు సంపదను సమిష్టి క్షేత్రముల ద్వారా అభివృద్ధి పరచి బంజారాల ఆర్థిక స్థోమతను పెంచ వలసియున్నది.

49 సంవత్సరాల స్వల్ప కాలంలో ఇస్రాయిల్ యూరప్ దేశాలతో సమాన హోదాను సంపాదించి నూటికి నూరు శాతం విద్యను సాధించినది. ఇస్రాయిల్ వారి తల సరి ఆదాయం 14 వేల అమెరికన్ డాలర్లు. ప్రక్కన ఉన్న ఈజిప్టు, సిరియా, లెబెనాన్, జోర్డాన్, ఏమన్ దేశాల సగటు తలసరి ఆదాయం 500 నుండి 1500 అమెరికన్ డాలర్లు మాత్రమే. యూధులులాగే బంజారాలు కూడా భారతీయ సంస్కృతి తరువాత యూదుల సంస్కృతియే ప్రపంచంలో పురాతనమైనది అంటారు. బంజారాలు భారత దేశంలోని అన్ని రాష్ట్రాలలో ప్రత్యేకమైన తాండాలుగా, కొంత భూవసతిని కలిగి అన్ని రాష్ట్ర భాషలను మాట్లాడ గలిగి, తిరిగి బంజారాల భాషయైన ''గోర్‌బోలీ'' ని మాట్లాడుతారు. వీరే కాక రోమా-బంజారాలు ఎన్నో ప్రపంచ, యూరప్ భాషలను మాట్లాడి రోమా బంజారా భాషను మాట్లాడగలరు. రోమా బంజారాల భాష, బంజారా భాష ఒక్కటేయని రుజువగుచున్నది. ప్రాంతాలను బట్టి భాషలో కొంత మార్పువున్నది. కాని మొత్తం రెండు వర్గాల భాష ఒక్కటే అయినందు వలన బంజారా భాషకు బైబిల్ సొసైటివారు తయారు చేసిన లిపిని తీసుకొని బంజారా భాషను అభివృద్ధి పరచి బంజారాలలో విద్యాభ్యాసం కావించవలయును.

ఒక్క అనంతపురం జిల్లాల్లో 500 బంజారా తాండాలున్నవి. సుమారు 3 లక్షల పైబడి జనాభా కలిగియున్నది. అలాగే మొత్తం 25 జిల్లాలో 50 నుండి60 లక్షల పైబడి బంజారాల జన సంఖ్య వున్నది. వారి అధీనములో వున్న భూములు కూడ ఇజ్రాయిలీల భూ సంపద కన్న రెండు మూడు రెట్లు ఎక్కువగా ఉండవచ్చును. ఒక్క ఆంధ్రప్రదేశ్‌లో నివసించే బంజారాల జన సంఖ్య ఇజ్రాయిలీల జనాభా కన్న ఎక్కువ అలాగే మొత్తం భారతంలో చూస్తే ఎన్నో రెట్లు ఎక్కువ. బంజారాలు మొత్తం తాండా ఒకే వర్ణంనకు చెందిన వారు కావున ప్రతి తాండాలోనూ సమిష్టి వ్యవసాయమును ప్రారంభించి వారి భూసంపదను, జన సంపదను, వనరుల సంపదను, ఆధారం చేసుకొని ప్రణాళికలు తయారు చేసి పండ్ల ఉత్పత్తిగాని, కూరగాయల ఉత్పత్తికాని, పూలతోటలు ఏర్పరుచుటకాని, పాడి పరిశ్రమ అభివృద్ధి పరుచుటలోకాని, పట్టు పరిశ్రమ అభివృద్ధిలోగాని, వాణిజ్య పంటలు వేరుశనగ, చెఱుకు, ప్రొద్దు తిరుగుడు పూలు అభివృద్ధికిగాని, గొఱ్ఱెల పోషణలో కాని గణనీయమైన అభివృద్ధిని సాధించవచ్చును. ఇప్పుడు బంజారా తాండాలలో విద్యావంతులు అనగా వైద్యవిద్య, ఇంజనీర్లు, వ్యవసాయ పట్టభద్రులు, మరియు సాంకేతిక విద్య డిప్లమా, ఐ.టి.ఐ. చదివినవారు, ఉద్యోగ వసతులు లేక నిరోద్యుగులుగా తాండాలలో దిక్కుతోచని పరిస్థితులలో పడివున్నారు. అటువంటివారి నందరిని సేకరించి పై కార్యక్రమములు చేపట్టిన అనతి కాలంలోనే గొప్ప అభివృద్ధిని సాధించవచ్చును.

నారసింహపల్లి తాండాలోనే సుమారు 120 మంది విద్యావంతులైన యువకులు నిరుద్యోగులుగా మిగిలిపోయివున్నారు. వీరిలో వ్యవసాయంలో పిహెచ్. డి. ఒకరు ఇంజనీర్లు ఇద్దరు, వైద్య పట్టభద్రులు ఇద్దరు. ఎం.ఎ. బిఇడి. ఒకరు. బి.ఎబిఇడి ఒకరు, డిగ్రీ హోల్డర్లు

నారసింహపల్లి తాండా సహకార సమిష్టి వ్యవసాయ సంఘం రి. *T 216*

ఆరుమంది, డిప్లమాహోల్డర్లు ఎనిమిది మంది, ఇంటర్ చదివిన వారు నలభై మంది, ఐ.టి.ఐ చేసినవారు ఇరవై మంది, పదవ తరగతి చదివిన వారు ఇరవైమంది, అంతకన్నా తక్కువ చదివినవారు ఇరవై మందివరకూ వున్నారు.

1969 సంవత్సరములో రిజిస్టరు నెం. టి. 216 సమిష్టి వ్యవసాయ క్షేత్రము రిజిస్టరు చేసి 84 ఎకరముల భూమిని పొంది, 36X24X12 అడుగుల సైజులో ఆఫీస్ కమ్ స్టోర్ రూమ్ మరియు వరండ, ఆర్.సి.సి. బిల్డింగ్ ఒకటి, 12X11 X 12 అడుగుల సైజులో ఆర్.సి.సి. రూములు రెండు, 100X24X12 అడుగుల సైజులో గోశాల ఒకటి. 36X15X12 అడుగుల మల్టి పర్పస్ ఆయిల్ ఇంజను రూమ్ ఒకటి. 20X10 డయామీటర్‌లో ఒక బావి, 20౬8౬2 అడుగుల సైజులో ఆర్.సి.సి. వాటర్ టబ్బు ఒకటి. సొసైటీ బిల్డింగులు కట్టించుటకు 5 ఎకరముల స్థలము మొత్తం ప్రస్తుతం 10లక్షల పైబడిన కట్టడములు ఉన్నవి. ఆఫీస్ ఫర్నిచర్ ( గాడ్‌రెజ్ ఫర్నీచర్) 1979 నాటికి 10 వేల రూపాయలు . 10వేల రూపాయలు కన్స్యూమర్ స్టోర్‌ను స్థాపించడం జరిగినది. రెండు టైరు బండ్లు, 2 జతల ఎద్లు, 3 ఆయిల్ ఇంజన్లు ఆనాటి విలువ 30 వేల రూపాయలు. 10 వేల రూపాయల వ్యవసాయ పనిముట్లు. 10 జర్సీ ఆవులు వాటి దూడలు 8 అనగా 78 సంవత్సరములో 40 వేల రూపాయలు విలువ వుండి బాగా అభివృద్ధికి వచ్చే సందర్భంలో స్థానిక ఎం.పి. గారి కన్ను ఈ సొసైటిపై పడింది. తాను సహకరించ వలసినది పోయి తన స్వార్థబుద్ధిని ప్రదర్శించి, సంఘమును కష్టపడి రిజిస్టర్ చేసి దాని అభివృద్ధికై ప్రభుత్వ సహాయము తీసుకొని అభివృద్ధి పరచిన శ్రీ బి. చీనియా నాయక్ గారిని తన అధికార దర్పంతో అప్పటి జిల్లా కలెక్టర్ దివాన్ గారిపై తన పెత్తనం చెలాయించి హిందూపురం డివిజనల్ కో-ఆపరేటివ్ ఆఫీసర్ వారు ఎంత మొత్తుకొన్నను సొసైటి సభ్యత్వము నుంచి తొలగిస్తూ ఉత్తరువు జారీ చేసినారు . ఈ విధంగా ఆ సమిష్టి వ్యవసాయ సంఘమును పని చేయనీకుండా ఆపి వేసినారు. శ్రీ బి. చీనియా నాయక్ గారి ప్రాథమిక సభ్యత్వం తొలగించిన వెంటనే 40 వేల రూపాయలు విలువచేసే ఆవులను వాటి దూడలను కేవలం 5 వేల రూపాయలకు అమ్మివేసినారు. రెండు టైరు బండ్లు, రెండు జతల ఎద్దులు, ఒక విత్తనము ఎద్దు అన్ని అమ్మివేసినారు. ఆఫీస్ ఫర్నిచర్, స్టోర్ సామానులు పని ముట్లు, గోడ గడియారము, ఒక టన్ను పై బడి ఇనుప కడ్డీలు అన్నియు లారి తెచ్చి పర్సన్ ఇంచార్జిగా వున్న కో-ఆపరేటివ్ ఆఫీసరు, పెనుకొండవారు తీసుకొని వెళ్ళిపోయినారు. అధికారులు దగ్గరుండి పై వన్ని అమ్మి వేసినారు. ఇది మనము ఎన్నుకొని పెత్తనం కట్టబెట్టిన ప్రజా నాయకులు చేసే సేవ. వీరికి మన చేతులారా ఓటు వేసి వారినే మనపై పెత్తనం చెలాయించుటకు చేసుకున్న ఏర్పాట్లు. ఇటువంటి ప్రజా ప్రతినిధులు ఉన్నంత వరకు ఏ సమిష్టి వ్యవసాయ క్షేత్రము బాగుపడదు. ఏ దేశంను ఆదర్శంగా పెట్టుకొని పని చేసిన అభివృద్ధి చెందరు. మన అభివృద్ధిని మన చేతులారా నాశనం చేసుకుంటున్నాము. కావున ప్రతి విద్యావంతుడు గుడ్డిగా పోకుండా ప్రతి విషయాన్ని స్వంత దృష్టితో చూచి తాముగా ఆలోచించుకొని కార్యక్రమాలు చేపట్టవలెను. ఒక ఎం.పిగా తాను మాకు సహకరించినది ఏమియు లేదు. మా స్వశక్తితో మా తెలివి తేటలను ఉపయోగించి ప్రభుత్వ సహకారముతో కష్టించి పని చేసి అన్ని సమకూర్చుకున్న తరువాత ఆ సంస్థను బూడిదలో పోసిన పన్నిరుగా మా ఎం.పి. గారు చేశారు. అప్పటి నుండి మా సమిష్టి వ్యవసాయ కేంద్రము కోమాలోనే ఉంది.

# జిప్సీల ఉత్సాహ జీవితం

## Mr. VANIA DE GILLA (KOCHANOWSKI)

థింగానోస్, టిన్‌గాని, సిగన్, జిగనిర్, ఈజిప్సియన్, జిపాసి, గిటన్, రోమాని, వీరంతా ఎవరు? వీరు మొత్తం యూరప్‌లో ఎక్కడ చూచినా ఉన్నారు. ముఖ్యంగా మధ్య యూరప్‌లోనే వారిని చూడవచ్చును. వీరు చిన్న చిన్న గుంపులుగా ఒకచోట నుండి మరి ఒక చోటకి పాతూనే ఉంటారు. వీరు రంగు రంగుల వస్త్రములను ధరించి, ఆకర్షణీయంగా ఉంటారు.

ప్రతి దేశములోను ఒకటి, రెండు పేర్లతో వీరు సంచరించుతూ ఉంటారు. గ్రీకు దేశములో కూడ వీరు సంచరించుతూ ఉంటారు. గ్రీకు దేశములో వీరు ఎక్కువ పేర్లతో పిలువబడుచున్నారు. మనము స్నేహితులను, పెద్దలను కలసినప్పుడు రెండు చేతులు జోడించి నమస్కరిస్తాము. అలాగే జిప్సీలు కూడ సెకెండ్సు ఇవ్వరు. మన ఆచారంలాగే రెండు చేతులు జోడించి, నమస్కరిస్తారు. అదే రాజస్తానియులైతే రాం, రాం అంటారు.

ఈజీప్షుల సాంప్రదాయ ప్రకారం తమని జిప్సీలు అని పిలువటం, మధ్యయుగంలో జరిగినది. ''ఇసాబెల్లా'' క్యాథలిక్ మహారాణి ఇజ్రాయిల్ జ్యూలను తమ బానిసలుగా చేసుకొని, మతపరమైన ఆంక్షలతో కౄరంగా హింసిస్తునప్పుడు, మేము ఈజీప్సియనులు కామనీ, తమ కంటూ ఒక ప్రత్యేకతను ఏర్పరచుకొని, ఈ హింసల నుండి తప్పించుకోవడం జరిగినది. అందు వల్లే భగవంతుడు వీరిని నిత్యసంచారము నుండి విముక్తి ప్రసాదించి, స్థిర నివాసవంతుల్ని చేస్తారు.

వీరి అందచందముల వలన, మంచి గుఱ్ఱములు, మరియు అస్త్రశస్త్రముల వలన, వీరు ప్రతిచోట ఎందరినో ఆకర్షించారు. మరియు జిప్సీ వనితలు తమ జానపద నృత్యములతో, ఎంతో మంది యురోపియన్ వంశస్తుల ఘనస్సులను వశీకరణ చేసుకొన్నారు. అయితే మంచి శరీర రంగు, ధృఢత్వము, మరియు వీరత్వముతో కూడిన కృత్యములు(పనులు) చేయుట వలన, రోమానీలను పేరు వచ్చినది. అయితే వీరు తమ గుఱ్ఱములను, పశువులను తమ వెంట ఉంచుకొనుట వలన, వాటి మలమూత్రముల దుర్గంధము కల్గించుట వలన, సమాజములోని మతాచార్యులు, వైదికులు మరియు లౌక్యులు(పెద్దలు) వీరిని దూరం చేసారు.

ఒక్కసారి అలోచించండి 50 నుండి 100 మందివరకు గల వీరి గుంపులు (సమూహము) గుర్రాలపై వచ్చి, గుడారములు వేసుకొని, వారి గుఱ్ఱాలతో, జంతువులతో విచ్చల విడిగా కోతకువచ్చిన పచ్చిక పొలాలను పాడుచేస్తూ, వాతావరణాన్ని మలిన పరుస్తూయుంటే, వాళ్లు ఎంత గొప్పవారు అయితే మాత్రం, వారిని అక్కడ వారు తప్పుకుండా ఎదిరిస్తారు.

వీరి అస్త్రశస్త్రముల వాడకం మరియు తయారిలో నైపుణ్యం వలన ఎంతో మంది ఐరోపా వాసులు వీరికి బద్ధశత్రువులైనారు. అయినను 15వ శతాబ్దము వరకు సంస్థానాధిపతులు, ఈ ధైర్యవంతులను, మరియు ఉల్లాసవంతులైన రోమానీలను తమ భవనములలో నివాసం కల్పించారు. మరి కొందరికి వీరి సైన్యంలో స్థానం ఇచ్చారు కూడ. ఫ్రాన్సు నాల్గవ చక్రవర్తి రోమాణి దళాన్నీ కూడ తన సైన్యంలో విలీనం చేసుకొన్నారు.

16వ శతాబ్ద ప్రారంభానికి, రోమానీల ప్రకాశవంతమైన జీవనానికి తెరపడింది. అప్పటి చర్చికి సామాజిక వ్యవస్థ పై కూడ గొప్ప అధికారం వుండెడిది. అందువలన ఆ అధికారంతో, రోమానీలను మతపరమైన హింసలకు గురిచేయడం ప్రారంభించారు. అందువలన వారి జీవనానికి ముప్పు ఏర్పడినది.

స్పెయిన్, ఫ్రాన్సు మరియు ఇతర యూరోపియన్ దేశాలల్లో మత ద్రోహులైన కొంతమంది జిప్సీలను అన్ని రకాల క్షుద్ర మాంత్రికులుగా అభివర్ణించి, వారి ప్రాణాలకే, ఘాతుకాలను తలపెట్టారు. పురషులను సజీవంగా కాని, శవాన్ని గాని తెచ్చిన వారికి 18 (పద్దెనిమిది) పౌండ్లు మరియు స్త్రీలను పట్టి తెచ్చిన వారికి అందులో సగం (9 పౌండ్లు) డబ్బు ఇస్తామని ప్రకటించారు. ఈ విధంగా వారికి దొరకిన వారందరిని అంతమొందించారు.

ఈ మారణ హోమం నుండి బ్రతికి బయట పడ్డవారే ప్రస్తుతమున్న జిప్సీల పూర్వీకులు. ఆ మారణహోమం తరువాత జిప్సీల బ్రతుకులు, నక్కలు, తోడేళ్ల బ్రతుకుల కంటే హీనమైనాయి. అయిననూ వారి స్వభావ సిద్ధమైన గుణ గణాలను, వారి అచార వ్యవహారములను నిలబెట్టి వారి ఘనతను నిలబెట్టుకొన్నారు.

విద్యాధికులు, సంస్థానాధీపతులు మరియు ప్రభువులు కూడా ఈ అసాధ్యమైన జిప్సీలను మొదట యూరపులో అడుగిడినప్పటి నుండి, ఎప్పుడూ, ఎంతో ఆశక్తిని కనపరస్తూనే వచ్చారు. వారందరి రచనలు విశదంగా వివరించాలంటే కుదరదు. కాని జిప్సీల గురించి రచించిన, రచనలు, గ్రంథములు అన్నియు సేకరించిన ఒక గొప్ప మహా పెద్ద గ్రంథాలయం కాగలదు. ''యూజేన్స్ పిట్టర్డ్'' గారి రోమానీల పుట్టు పూర్వోత్తరాల గురించి రచన తప్పితే, మిగిలిన రచనలన్నీ దురదృష్టవశాత్తు ఐతిహస్య భావోత్పత్తి, శాస్త్ర ఆధారితాలే. అయితే నా డాక్టరేట్ థీసస్ ''ఇంట్రడక్షన్ టు ద యూరోపియన్ జిప్సీస్'' జిప్సీ (జిప్సీ అభ్యాసము మొదటి భాగం మన ఢిల్లీ 1963 ను లో ప్రచురితం) తో నేను ఒక నిర్ణయానికి వచ్చి నిరూపించాను కూడ. ఒకే భాష మాట్లాడు గుంపు గానీ, తెగకానీ, శతబ్దాలుగా ఒకే దేశంలోనివశించి ఉంటారు. అలా వారు ఒకే రకమైన అవసరాలు. ఇష్టాలు, పరిపాలనను కల్గింవుంటారు. ఆ విధంగా క్లుణ్ణంగా చెప్పాలంటే ఒక సైన్యంగా, ఒక రాజ్యంగా ఏర్పడి వుంటారు.

ఆవిధంగా జిప్సీల పుట్టుక, దేశ దిమ్మరి జనులనుండి కాదని నిర్ధారణ చేయవచ్చు, రోమాని భాష ఉచ్చారణ యొక్క విశ్లేషణను పరిశీలిస్తే దాని ప్రప్రథమంగా మాట్లాడు వారు గృహాలలో నివశించు దేశ ప్రియులని నిర్ధారించవచ్చు. భాషలో మనకు గుహలు, డేరాలులాంటి పదాలు కనపడవు. వాటి స్థానే ఇల్లు, ఆవులు, పందులు, గుఱ్ఱాలులాంటి పదాలు అగుపిస్తాయి.

మూలము :- నా నిర్ధారణను బట్టి అన్వేషణలకు విరుద్ధంగా వుంది. నాథీసిన్ దాఖలు చేసిన తరువాత అదే నెలలో ఉత్తర భారతదేశానికి వెళ్ళాను. అక్కడ నేను గమనించిన ముఖవైఖరి, రూపము, ఆకృతి. వస్త్రాలంకరణ, అన్నింటి కంటే ముఖ్యంగా సంగీతము మరియు నృత్యము మొదలైనవి. జిప్సీల జన్మభూమి భారత దేశమే అనుటకును, కాలము మరియు వారు భారత దేశాన్ని వదలిన కారణం, మరియు వారి నిజమైన కులమునకు గొప్ప సాక్ష్యాలనీ తేలినది.

నా మూడు సంవత్సరాల భారతదేశములోని పరిశోధనను క్లుప్తంగా, వ్రాసిన సారాంశం ''జిప్సీస్ అండ్ ది ప్రాబ్లమ్ అండ్ డిర్‌కల్చిర్'' ని ఇండోఏషియన్ కల్చర్, న్యూఢిల్లీ

జనవరి 1965 సం||లో ప్రచురితమైనది. ఈ సారాంశము కూడా 1964 సంవత్సరం ''ఇంటర్‌నేషనల్ కాంగ్రెస్ ఆఫ్ ఓరియెంటాలిస్ట్''లో నేను సమర్పించిన వ్యాసాల సంగ్రహ వ్యాసమే? ఆ సంగ్రహ వ్యాసం ప్రకారం ముఖ్యవాస్తవాలు క్రింద ఇస్తున్నాను.

12వ శతాబ్దములో జిప్సీలకే కాక మిగిలిన భారత రాజపుత్రుల పూర్వీకుడైన గొప్ప ప్రతాపవంతుడైన చక్రవర్తి ''పృథ్వీరాజ్ చౌహాన్'' గారు 150 రాజపుత్ర తెగలను సంఘటిత పరిచి, తమపై దండెత్తి వచ్చిన ముస్లిము, ఘోరీ మహమ్మద్‌ను ''తరైన్'' యుద్ధములో ప్రతి ధ్వనించే విజయాన్ని సాధించాడు, కానీ ఆయన దయాగుణం వలన ఘోరీ మహమ్మదును క్షమించి వెనక్కి పంపాడు.

మరుసటి సంవత్సరం (1192) లో ఘోరీ మహమ్మదు మరలా 3,00,000 మంది ముస్లిం సామ్రాజ్య వెర్రి, గుర్రపు దళంతో విశ్వాస ఘాతకంతో, అకస్మాత్తుగా రాత్రి వేళ ముట్టడించి, (మరలా యుద్ధం పగటి పూటకు మార్చే అంగీకారము జరిగినది) రాజపుత్రులందరిని చిన్నా భిన్నం చేసి, చెల్లాచెదురు చేసాడు.

పృథ్వీరాజుయొక్క ఓడిన సైన్యం మూడు గ్రూపులుగా విడిపోయి, మొదటి గుంపు కొండ ప్రాంతాలకు చేరి, చిన్న చిన్న గుంపులుగా చేరి ప్రతీకార వాంఛతో బ్రిటీషువారు వచ్చే వరకు కూడా తిరుగు బాటు చేస్తూ ఉన్నారు. స్వాతంత్ర్యం వచ్చేవరకు బ్రిటీషువారు వాళ్లను రాజ్య బహిష్కృతులుగా నే ప్రకటించారు.

రెండవ గుంపు, సంఘటితంగా కోటల్లో నే వుండి పోయింది. వీరిని ముస్లిం సైన్యం జయించ లేక పోయినవి. ముస్లిము తిరుగుబాటు దారులకి, బ్రిటిషువారికి, వీరి నుండి అనుకున్నంత ఇబ్బందిని కల్గిస్తూనే వుండిపోయారు.

మూడవ గుంపు తమకు తాము''రోమానిచావే'' (శ్రీరాముని సంతతి) అనిపించుకుంటూ అఫ్గనిస్తాను గుండా యూరప్‌కు తరలిపోయింది. ఆ సమయంలో ఇస్లాంలోని రెండు ముఖ్య కుట్రవర్గాలు షియాలు, సున్నీలు మత కల్లోలంతో కొట్టు మిట్టాడు తుండేవి. రొమానీల యాత్రసుఖంగా వుండేందుకు వారు షియాలతోను, సున్నీలతోను పరస్పర సంబంధాలు పెంచుకోక తప్పలేదు.

## సనాతన (పురాతన) హక్కు :-

వారు యూరప్‌లో మొట్ట మొదటి గ్రీకు దేశాన్ని చేరారు. అన్ని రోమాని భాషోచ్ఛారణలు స్పెయిన్ భాషతో సహా గ్రీకోచ్ఛారణను కల్గియుండుటయే దీనికి ఆధారము. యూరప్ జిప్సీలు అందరు ఒకేమార్గం ద్వారా యూరప్ చేరారు. వారు ఉత్తర ఆఫ్రికా ద్వారా లేదనటానికి, ఇంత కంటే ఆధారాలు లేవు. గ్రీకు దేశం నుండి ఒక గుంపు నేరుగా ఉత్తర బాల్టిక్ దేశాలకు తరలి వెళ్లింది. మిగిలిన వారు మధ్య యూరప్ గుండా పడమటి యూరప్‌లో విలీనమై పోయారు.

ఉత్తర బాల్టిక్ దేశాలకు తరలివెళ్లిన జిప్సీలలో ఎంతో గొప్ప జీవనానికి నోచుకున్నారు ఆ సమయంలో ఈశాన్య యూరప్‌లో, భారతదేశంలో ముస్లిం మతవాదుల దురాగతాల్లాగే ఎక్కువైనాయి.

1410లో జర్మన్లు పర్శియన్లను జయించి వారి భూమిని ఆక్రమించుకొని, ఇంకా ముందుకి అనగా లిత్వానియా పోలండ్, దేశాలు మరియు గ్రీన్ ల్యాండ్ అడవులకు విస్తరించి ట్యుటోనికిరాజులను ఎప్పటికి తలెత్తనీకుండా జయించారు. ఈ యుద్ధంలో రాజపుత్రులు కూడా శాసనములో జిప్సీలకు ఏన్నో అసాధారణ అధికారాలు ప్రకటించారు. ఈ విధంగా చేయడం ద్వారా అలెగ్జాండర్ చక్రవర్తి తన తాతముత్తాతలు పోలండు మరియు లిత్వానియా రారాజులు ప్రకంటించిన జిప్సీల హక్కులను పునరుద్ధాటించారు.

బహుశా ఈ కారణాల చేతనే మొత్తం బాల్టిక్ జిప్సీలు యూరోపియన్‌ల సంస్కృతికి ఎంతోత్వరగా, ఉన్నతంగా అలవర్చుకొని, ఇమిడిపోయారు, అయినా తమ సంస్కృతిని మరువలేదు. స్వయంవరం సంస్కృతిని భద్రపర్చుకొనినారు. ఈ స్వయంవరం పద్ధతివల్లే చర్చిలనుండి వ్యతిరేకతలు ఎదురైనవి. హింసాకాండలు జరిగాయి. క్రిష్టియన్ల వాదన ఏమిటంటే చర్చి అంగీకారంలేకుండా, వివాహం చేసుకొంటే, వారి అంగీకారం లేకుండా ఆధిపత్యాన్ని ధిక్కరించినట్లే, మరియు ఈ రకమైన స్వయంవరం వరించుట ద్వారా అసమానమైన వేశ్యవృత్తి, ఉంపుడు కత్తెలు ఎక్కువగా తయారవుతారని వారివాదన.

నా పరిశోధనలో రోమానిభాషా ఉచ్చారణకే పరిమితంకాలేదు. రోమాని భాష ఉచ్చారణ హింది మరియు రాజస్తాని (జోద్‌పురి) కి మధ్యస్తంగా ఉంటుందని నిరూపించారు. నా ముఖ్యోదేశ్యం ఏమిటంటే జిప్సీలు మరియు ఉత్తర భారత దేశంలోని ఉన్నత రణవీర జాతికి చెందిన రాజపుత్రులు ఒకే రక్తాన్నేకాక ఎన్నో సామాన్య గుణగణాలను కలిగియున్నారు.

*బంజారా హింది పత్రిక (బొంబాయి)*

# మక్కన్‌షా (బంజారా) మరియు లుబాన సిక్కులు

గురునానక్ విశ్వవిద్యాలయం, అమృత్‌సర్‌లోని శాఖ అయిన గురునానక్ స్టడీస్ ద్వారా ప్రచురిచంపబడిన పత్రిక సిక్కుల గూర్చి వ్రాసిన గ్రంథం 2 శీర్షికలు. ఫిబ్రవరి 1985 సంవత్సరములో ప్రచురించబడిన శీర్షిక ద్వారా 19వ పుటలో ఈ పుస్తకములో విద్వాన్ రచయిత లాబానా ఉన్నాడు. లుహనా లేక లభానా దుమ్‌ఖడ్ జాతీ గూర్చి పరిశోధన ద్వారా పైతెల్పిన, లభానా జాతి గూర్చి విషయములను తెలియచేయడమైనది. ఈ దేశము యొక్క బంజారా జాతి గూర్చి కూడ విశేష రూపంలో తెల్పడం జరిగినది. ఎందుకనగా లభానా లేక లుభానా బంజారా జాతిలోని ఒక ఉపశాక. లుభానా బంజారాలు తరువాత సిక్కు ధర్మము ఆచరించారు. మరియు తమ యొక్క ధైర్యము, వీరత్వము, త్యాగము, ధనబలముతో సిక్కు ఇతిహాసమును ఉజ్వలమైన భవిష్యత్తు కోసం, తమ పూర్వ ఆచార వ్యవహారములను వదలక, విరోచితమైన కార్యములను చేపట్టారు.

లుభానా సిక్కుల యొక్క త్యాగము, గురునానక్ ద్వారా నిర్మించబడిన నియమములను, ఎప్పుడూ హానికల్గించలేదు. మక్కన్ షా మరియు లుభానా పుస్తకములోని చాలా ముఖ్యమైన విషయములను తర్జుమా ద్వారా ప్రచురించటం జరుగుచున్నది. సిక్కుల

9వ గురువు యొక్క విచారణ మరియు వారియొక్క ప్రతి విషయంలోను సహాయం చేసి చరిత్రలో వీరి యొక్క ప్రత్యేకతను స్థాపన చేసినవారిలో ఒకరు మక్కన్ షా, వాస్తవములో ఎవరు ఉండిరి. మరియు బా బా, దృష్టిలో ఎలా చేరాడు.

అన్ని విషయములను గూర్చిన సమాధానము చర్చించుటకు, ప్రయత్నించుదాం. చెప్పటమేమంటే మక్కన్షా యొక్క జన్మము ఏదో ఒక తాండా పేరుగల ఊరిలో జన్మించారు. ఈ పేరుగల గ్రామములు భారతంలో చాలా ఉన్నవి. అలాగే తాండా అను శబ్దం, వాస్తవములో ''దాడా'' ఈ పంజాబ్ భాషా శబ్దంకు అనుబంధంగా ఉన్నది. దీని అర్థం ''డేరా'' అని, ఇది ఎప్పుడైన ఎత్తివేయవచ్చు. పూర్వ కాలంలో 'లుబానా' వ్యాపారం చేయు ఒక జాతి. వీరు ఒక చోటు నుండి మరియొక చోటికి వస్తువులను పంపించుటకు గాను, గుఱ్ఱములు, ఎద్దులు, బండ్లు, ఏనుగులు, ఒంటెలు కూడా ఉండేవి. భారతదేశములో ఉన్న ఎన్నో తాండా పేరుగల ఊర్లు ఉన్నవి. వారు దుమగడ్ లుభానా, గారిడి విద్యలు చేయువారు అయివుందురను అలోచన ఉన్నది.

జిల్లాలో తాండా పేరు తోటి తాండాలు లేవు. కానీ గుజరాతు రాష్ట్రములోని తాండా పేరుతో ఒక గ్రామము ఉన్నది. కాని అక్కడ పెద్దలు, మక్కన్ షా వారి పేరు కూడ ఎవ్వరు వినలేదు. రెండవది. పరిశోధన కర్తలు, కాశ్మీరంలో ముజ్ఫరాబాద్ జిల్లాలో శత్ తాండా మక్కన్ షా గారి జన్మభూమి అని తెల్పినారు. మహిమా ప్రకాశ్, మరియు మిగిలిన స్థానములను బట్టి ఈ విషయమును నమ్మ వలసియున్నది. గురు హరగోవింద్ సాహెబ్, సామ్రాట్ జహింగిర్ తోపాటు, కాశ్మీరం యాత్ర చేసి యున్నారు.

ముజ్ఫర్బాద్కు దగ్గరలో నాలూచి అను పేరుగల గ్రామములో గురు షాహెబ్ నిలచియుండిరి. వారి గుర్తుగా ఒక ఆలిషాన్ గురుద్వారాను నిర్మించడం జరిగినది, అని చెప్పటమును బట్టి గురువుగారిశక్తిని ప్రకటించుటకు గాను లుభానా మక్కన్ షా గారు. ఉధూ గురుద్వారా దర్శనం చేసియున్నారు.

మక్కన్షా గారి పూర్వీకులు చెప్పిన దానినిబట్టి 1619లో జన్మించియున్నారు. అప్పుడు గురు హరిగోవింద్సింగ్ కాశ్మీరంలో యాత్ర చేసియున్నారు. అప్పుడు వారు కేవలం 8 సం బాలుడు. అప్పుడు వారు గురువుగారిని చూచి యుండవచ్చును, మిగిలిన కొంత మంది చెప్పుట, ఏమనగా మక్కన్ షా గుజరాత్ లోని ఖాటచయావాడాలో జన్మించియుండవచ్చును. చెప్పడాన్నిబట్టి, పరిశోధనల బట్టి, ఈ విషయంను సమర్థించారు. గుజరాత్ ఖాటియావాడ్ నందు మక్కన్ షా గారు గురుసాహెబ్ యొక్క ముఖ్యమైన దూత రూపంలో సిక్కు ధర్మము ప్రచారం చేసారు. ఉత్తూ అను క్షేత్రంలో ఈ రోజు లుహాన హిందువులు ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. ముఖ్యమైన విషయం ఏమనగా వీరు ప్రముఖంగా వ్యాపార జ్యాతికి చెందినవారు. మక్కన్ షా మిగిలిన ఇతర విషయములను బట్టి చూచిన, అతడు 23-2-1676 సం. స్వర్ణనగర్లో ( జోనరసింగ్పూర్) జన్మించినాడు. నర్మదానది యొక్క పై భాగంలో జన్మించారు. వారి తండ్రి తమ్ములు. డేసుపేరియా గోత్రం లుభాన సిక్కులు.

రచయిత త్రిలోచనసింగ్ వ్రాస్తున్నది ఏమనగా మక్కన్షా, ధర్మ రక్షకుడుగాను, సత్యమును పాటించువాడై, ధైర్య సాహసములను, కష్ట సమయాలలో, వీరోచితమైన కార్యములు చేసి సిక్కు ఇతిహాసంలో మక్కన్ షా పేరు నిలిచి పోయినది. వారి ఒక భక్తుడు ఫాగా సింగ్

సియాల్‌కోట్‌జిల్లా రాజు హర్‌పాల్. బా బా మక్కన్‌షా గారి చిహ్నంగా ( గుర్తు గా) ఒక సమాధి కట్టబడియున్నది.

## మక్కన్ షా పరివారం

మక్కన్ షా ఏకైక కుమారుడు లాలాదాస్. వీరికి 3 కుమారులు, 1 కిషన్‌మల్, 2 జీత్‌మల్, 3 గిరిధారిమల్, జీత్‌మల్ జమ్ము ప్రాంతములోని రాజోరి గ్రామములో నివశించాడు. అక్కడ తన యొక్క వంశీయులు. ఇప్పుడూ ఉన్నారు. ఈ పరివారము గురుతేజ్ బహదూర్ వారి తరపున ఒక అధికార పత్రం ఇవ్వబడినది. 1947–48 ను లో భారత్ – పాక్ యుద్ధంలో జమ్ము కాశ్మీరం పై జరిగిన ఆక్రమణ ఫలస్వరూపం వల్ల ఉత్పన్నమైన అగ్ని కాండలో కాలి బూడిదై నది. తరువాత తన చిన్న కుమారునికి గిరిధారి మల్‌తోపాటు, రాజైరో అనుచోటకు పోయారు. కానీ బారు అనే పేరుగల స్థానంలో లాల్‌దాస్ మృత్యువై నారు. గిరిధారిమల్, హరిపూర్‌లోని హాజరాచేరాడు. అక్కడ తన జీవితం చివరి రోజువరగు ఉన్నాడు.

మక్కన్‌షా గారి 3వ మనువడు కిషన్‌మల్ రాజాహర్‌పాల్ తాతి రూపంలో నిలబడి పోతాడు, ఇతనికి భగవాన్‌దాస్ మరియు బిషన్‌దాస్ అను ఇద్దరు కుమారులు యుండిరి, బిషన్‌దాస్ పెద్ద కుమారుడు బాల్‌సింగ్ చాలా గొప్ప తపశ్వి. ఆతను చనిపోయిన తరువాత అతని సమాధిని ప్రజలు పూజలు జేస్తూయుండిరి. బాల్‌సింగ్ గారి తమ్ముడు, సర్దార్, గరుముఖసింగ్ వంశీయులు, ఇజన్ సింగ్, కాశీలో వుండి వేదములను, పురాణములను, గీతా మరియు గురుగ్రంధ్ సాహబ్‌ను పరిశీలించి వాటి సారములను గ్రహించి, సర్వమత సారములను పొందాడు. 1948 ను లోపాకిస్తాన్‌లో జరిగిన అల్లర్ల ఫలితంగా మొత్తం వారి వంశీజులు తమ మాతృ భూమిని వదలి భారత్‌లో శరణు కోరడమైనది.

## లుబానా వారి ప్రారంభిక ఇతిహాసం :

లుబానా జాతి భారత్ యొక్క వివిధ భాగములలో వ్యాపించి యున్నది. పంజాబ్, హరియాన, హిమాచలప్రదేశ్, జమ్ము కాశ్మీరము, రాజస్తాన్ మరియు సింధులోయ ఈ జాతి ప్రజలు సింధులోయలో ''లుభానా'' అను పేరుతో గుర్తింపబడుతారు గుజరాత్, మహారాష్ట్రంలో ఈ జాతి ప్రజలకు ''లుహానా'' అంటారు. ఉత్తర ప్రదేశ్ మరియు దక్షణములో వీరిని ''బంజారా'' లేక ''బణజారా'' పేరుతో పిలుస్తారు. ఆంధ్ర ప్రదేశ్ మరియు కర్ణాటకములో వీరిని ''లంబాడి'' లేక ''లభాన్'' అని పిలుస్తారు.

## లుభానా నాయక్ ఎలా వచ్చినది?

''జేమ్స్'' తాండా అను ప్రకారం లుభానా, రాజపుత్రులు కానీ వాణిజ్యమును, వీరి వృత్తిగా తీసుకొనుట వలన వీరియొక్క రాచరికపు పనితీరు, మార్పుచెందినది. ఈ వీరత్వము ఉన్న లుభానాలు ఎవ్వరి అధీనంలో యుండకుండ స్వతంత్రంగా యుండిపోయారు. తమ స్వాతంత్ర రక్షణకై వీరు ఎప్పుడు యుద్ధములు చేయటం జరిగేది. వీరు యుద్ధం చేయునప్పుడు బాణములను కూడ ఉపయోగించుచుండిరి. ''సర్ డేంజిల్'' ఇబ్బెట్సన్ వారి ప్రకారం, లభాణ

సబ్బద్ లూణ (ల+బ్రాణ) వ్యాపారం. ఉప్పు వ్యాపారం చేయువారు. ఎందుకనగా ఉప్పు వ్యాపారం పెద్ద మొత్తంలో చేసే వారు.

కొంతమంది చెప్పడం ఏమనగా లుభాణా పజలు, ఉత్తర భారతంలోని పిలిబిత్ నగరంలోని ''బ్రాహ్మణు లు'' అంటారు. అప్పటి రాజు భయంతో కఠినమైన జీవనంకు భయపడి, విధిలేని పరిస్థితులు, కల్పించడం జరిగినది. వీరి విధిరాత, ఈ విధంగా చెప్పడం జరిగినది.

ఒకసారి ''పిల్‌బిత్' యొక్క పేరియా రాజపుత్ర రాజు, ప్రాణాంతకమైన అనారోగ్యమునకు గురి అయినారు. అప్పుడు తన పురోహితుడు, అతనికి చెప్పినది ఏమనగా 11మంది బ్రాహ్మణ కుమారులకు, మాంసమును మరి మదువు విందు ఇచ్చి, బంగారు నాణ్యములను దక్షణ ఇచ్చిన, మీ అరోగ్యం బాగుపడగలదు. రాజు అలాగే చేసాడు. అయతే ఎప్పుడు, బ్రాహ్మణ కుమారులు తండ్రులకు ఈ విషయం తెలసినదో, వారు తమ తమ కుమారులను ఇంటి నుండి తరిమి వేశారు. రాజుగారు ఆ బ్రాహ్మణ పుత్రులకు, తన వద్ద ఆశ్రయం ఇచ్చారు.

ఈ విధంగా ఆశ్రితులైన బ్రాహ్మణ పుత్రులే లుభాణాలు. దీనినిబట్టి అర్థం ఏమనగా ఈ లుభానాలు, ఆబ్రాహ్మణ సంతతివారని చెప్తారు. ''పిల్‌జిత్'' రాజుగారి బ్రాహ్మణ విరోధులు. నీతిని ఎదురించుటకు గాను, వారు తమ జన్మ భూమిని త్యాగం చేయవలసి వచ్చినది. తమ జీవితమున్కై వీరిలో కొంత మంది, వాణిజ్యము, స్వీకరించిన, వారే లభానాలు చెప్పటంను బట్టి, చూనిన గంగానది తీరంలో నివశించారో, వారు పండితులు, జోతిష్యులు అనిపించుకొన్నారు.

వివిధ ఆధారాలను బట్టి, లుభాన కనోజ్ ప్రాంతంలో నివసించే నాయక్, రాజపుత్రలని చెప్పబడుచున్నారు, కనోజ్ నరేష్ జయచంద్రరాఠోడ్‌కు సందేహము వచ్చినది. ఫృథ్వీరాజ్ చౌహన్, రాణి సంయుక్తాను అపహరించుకొని పోయినపుడు. వీరి హస్తం ఉన్నట్లు భావిస్తారు. అందువలన మొత్తం రాజపుత్రులను తమ రాజ్యము నుండి బయట తరిమివేశారు. ఈ రాజపుత్రులు జై చంద్రను ఓడించుటకు గాను, యుద్ధమునకు సిద్ధమయ్యారు. స్వయంగా జయ చంద్రుడే రాజపుత్రుల కోట పై దాడి చేశారు. నిరవధికంగా మూడు సంవత్సరములు వరకు యుద్ధములు చేస్తూ కూడ వారిని జయించ లేకపోతాడు, ఆ తరువాత తెలుసుకోవడం ఏమనగా ఆ కోట లోహముతో కట్టడం జరిగినది. ఆకారణంగా రాజపుత్రులను లోహర్ లోబానా, లోహిమా మరియు ఇతర పేర్లతో పిలువడం జరిగినది.

సర్. హెచ్. ఎం. ఇలియట్ బంజారాలను 5 భాగములుగా విడదీశారు. అందులో ముఖ్యమైన 3 వర్గములు( తుకరియా బంజారా 36 గోత్రాలు, అధికంగా మహమ్మదీయలు వారు మురాదాబాద్ మరియు బీలాస్‌పూర్ ప్రాంతంలో ఉన్నారు.

22 గోత్రాల బంజారాలు ఎక్కువ మంది చాపలు మరియు గోనెలు అల్లుచుండిరి. వీరు పిల్‌బిత్ అనుచోట నివశించారు. లుబాణ బంజారాలు 22 గోత్రాలు వారు గోర్ బ్రాహ్మ ణోంకే వంశీయులు. (గోర్ బ్రంహణోంకీ వంశజ్) ఔరంగజేబు శాసనము ద్వారా, రీతాంబూర్ నుండి వచ్చిరి ఇచేస్పన్ పంజాబులో యున్నవారు లుబానా బంజారాలు 3 గ్రూపులుగా విభజింప బడినారు. 1 ముసలంబాణ, 2 లుదియానా లబానాలు మరియు 3 బావత్ పూర్ లబానలు.

## వంశపారంపర వృత్తిని (స్వీకరించి) చేపట్టిన వారు

ఔరంగజేబు మరియు షాజహాన్ శాసనములో లుబాణా బంజరాలు. సంపూర్ణ భారతంలో తమ వ్యాపార కేంద్రములను వ్యాపింపచేసి యుండిరి. ఫ్రెంచ్ పరదేశీయులు ''ట్రూవేరనియర్'' అతను ఒక చోట వ్రాసియున్నది. ఏమనగా లుబానా వ్యాపారుల, కాలంలో 20,000 నుండి 22,000 ఎద్దులపై తమ బిడారులను చేపట్టి ఒక గుంపుగా ప్రయాణించుచుండిరి. ప్రజలు, ఉప్పు, బియ్యం మరియు అన్నిరకముల అహార పదార్థములతో అత్యవసర ప్రదేశములలో చేరవేయుచుండిరి. దేశములో ప్రముఖమైన ఓడరేవుల వరకు ఈ ఆహార పదార్థములను చేర్చుచుండిరి. ఆ రోజులలో సూరత్ గొప్ప ఓడరేవుగా గుర్తించబడినది. ఈ తాండా పెద్దను ''నాయక్'' అని పిలుచుచుండిరి. తాండాల రక్షణ చేయుటకుగాను, ఎల్లప్పుడు 5000 మంది సైనికులు తమ యొక్క అన్ని రకముల యుద్ధ సామాగ్రిలను సిద్ధంగా వుంచుకొనేవారు.

దేశములోని అన్ని భాగములలోని విషయములు వారు గ్రహించియుండి. అప్పటి శాసనాలను బట్టి లుబానా ప్రజలకు గూఢాచారి కార్యక్రమములు కూడ చేపట్టి యుండిరి. కర్ణాటకములోని టిప్పు సుల్తాన్ బ్రిటిష్‌వారిని ఎదురించుటకు గాను తన వద్ద లుబానా( గుత్తబ్) గూఢాచారులుగా సైన్యమును ఎల్లప్పుడు తన వద్ద యంచుకొన్నారు. గట్ లుబానా ప్రజలు ''మాది దే యక్ ఆఫ్‌వెలి'' బుద్ధిమంతులని తెలుసుకొని తనకు ముందు సూచనలు ఇచ్చువారుగా వారిని చేసి తన సైన్యము యొక్క భద్రతను చేకూర్చుకున్నాడు.

## లోహాని ఆఫ్ గర్ - లోహర్ బంజారాలు

సింధు నది పడమటి నుండి, ఆఫ్ఘనిస్థాన్‌వరకు నివశించే లుబానా బంజారాలను ధర్మ పరివర్తనం చేయవలసివచ్చెను. అప్పుడు ఖడ్గం యొక్క ధారతో మహమ్మదీయ ధర్మమును ప్రచారమును అభివృద్ధి చేయుటకు అంది, పథా అను ప్రాంతములలో తుఫాను ప్రవాహములాగా మతమార్పిడి జరిగినది. ఈ లోహర్ ఆఫ్‌గన్‌ల స్థానంలో కలకత్తా నుండి మస్తక్ వరకు వ్యాపించిఉన్న భాగములలో తమ బిడారులును భాగా అభివృద్ధి పరిచారు.

## బోహారా జమాత్ బోహారా బంజారలు - గుజరాత్

గుజరాత్‌లోని ఖలియాబాద్ ప్రాంతములోని హిందూ బంజారలు, మహమ్మదీయ ధర్మమును స్వీకరించియుండిరి. తరువాత వారు హిందు మతములో చేరి ప్రఖ్యాతులైనారు. ఎందుకనగా వారు తమ హిందూ ధర్మములు వదలి, ముస్లిం ధర్మమును ఖాతరు చేయకుండా తమ స్వధర్మమైన హిందూ మతంలోనే యుండి పోయారు.

పదవులను బట్టి, స్థానాలను బట్టి,
వ్యక్తిత్వం పెరగదు, వ్యక్తిత్వాన్నిబట్టి,
ఆ పదవులకు, స్థానాలకు విలువ పెరుగుతుంది.

# లక్కీషా బంజారా
# శ్రీ గురుతేజ్ బహుదూర్ సింగ్ గారి గాథ

దేశం కోసం తన శిరసునే అమర బలిదానం చేసిన శ్రీ గురుతేజ్ బహుదూర్ సింగ్ గారి అమర గాథ – మరియు లక్కీషా బంజారాల యొక్క భారతదేశ ఇతిహాసంలో లిఖించబడిన గాథను ఇక్కడ వివరించడం జరిగినది.

తన శిరస్సును ఇచ్చి ధర్మం కొరకు, మానవత్వం కొరకు మరియు తన జన్మ స్వాతంత్ర్యమును రక్షించుకొనుటకు, అమర బలిదానం(చిరంజీవి) ఇచ్చిన, గురు శ్రీ తేజ్ బహుదూర్ యొక్క బలిదానము 13వ శతాబ్దములో కన్యాకుమారినుండి కాశ్మీరమువరకు అన్ని ప్రముఖ నగరములలో వారి స్మృతికై ప్రార్థనలు చాలా పొడవైన ప్రజా సమూహముతో సంతాపమును ప్రకటించుతూ ఊరేగింపులు చేయడం జరిగినది. ఈ ఊరేగింపులు ఒక ఉత్సవంలా చేయడం జరిగినది మరియు వారు దేశం కోసం ప్రాణ త్యాగం చేసినందున మొత్తం భారతావనిలోని ప్రజలు తమ శ్రద్ధాంజలి ఘటించారు.

సిక్కుల 9వ గురువు శ్రీ తేజబహాదూర్ గారి ముఖ్య బలిదానము దేశంలో వ్యాప్తి చెంది ఆనాటి అరాచకములు, హత్యలతో పాటు స్త్రీలపై జరుగుచున్న అత్యాచారములు, దహన కాండలు వాటిని మటు మాయం చేయుటకుగాను తాత్కాలికముగా భారతీయ ప్రజల మనస్సులలోని ఆలజడులను తొలగించి, ధైర్యమును ప్రధానం చేయుటకు గాను తను బలిఅయి అమరజ్యోతిని ప్రజలు హృదయాలలో వెలగించి అంధకారమలో నిద్రించియున్న ప్రజలను జాగృతి చేసి ప్రాణం పోసారు.

ప్రథః స్మరణీయ ఈ వీర శిఖామణిగారి చరిత్రాత్మకమైన కథలో తమ పేరును కూడా సంస్కరణీయం చేసుకొన్న లక్కీషా బంజారా గారి భక్తి కూడా ప్రశంసనీయమైనది. ఆదర్శమైనది. గురు ద్వారా శ్రీ రాకబ్ గంజ్ సాహెబ్ గారి పవిత్ర చరిత్రతో పాటు సంబంధము కలిగియున్నది. లక్కీషా బంజార ఇల్లు రాకబ్‌గంజ్ తాండా, వ్యాపార ఎద్దులతో నిండియున్న ఈ ప్రాంతం యొక్క గుర్తు ఇది.

ఔరంగ జేబు యొక్క అత్యాచారములకు, హిందువులు తత్తర పడుచుండిరి. వారి ఆత్యాచారములకు ప్రజలు దినదినము వారి ఆగ్రహమునకు గురి అగుచుండిరి. ఆనాడు చెప్పడమేమంటే వారి శాసనములో ప్రజలు ప్రతి దినము ఇంత మంది హిందువలను ఎంత కష్టపెట్టి అయిన సరె (జబర్‌దస్తి) ముస్లిములుగా మార్చమని నియమం పెట్టి యుండిరి. ఆ ప్రకారంగా బ్రాహ్మణుల జందెంలను త్రుంచి, ఒక చోట పోగువేసి సాయంత్రం సంధ్యా సమయములలో నదిలో కలిపి వేస్తుండిరట.

హిందు ధర్మమును ఆపద నుండి కాపాడుటకు గాను కాశ్మీరములోని బ్రాహ్మణుల ఒక ప్రతినిధుల సంఘం(గుంపు) సిక్కుల 9వ గురువు శ్రీ తేజ్‌బహుదూర్ గారి దర్బారులో కలసి వారు తమను రక్షించమని వారితో ప్రార్థించిరి. గురువుగారు వారితో చెప్పారు. ఏమనగా తమ రక్షణ కావలయునంటే, కేవలం ఒక వ్యక్తి ఎటువంటి వాడై యుండవలయునంటే, ఒక

గొప్ప మహాశక్తివంతుడు, తన పవిత్రమైన ఆత్మను ప్రసన్నుని చేసుకొని, తన శిరస్సును దేశమాతకై అర్పించవలసియుండును.

ఎప్పుడు గురు శిరోమణి కాశ్మీరు బ్రాహ్మణులకు ఈ మాటలు చెప్పినప్పుడు, అప్పుడు వారికి దగ్గరగా వారి సుపుత్రులు గోవింద్‌సింగ్‌జీగారు యుండిరి. వారు కొంత ఆలోచించి చెప్పారు. తండ్రిగారు ఈ కలియుగంలో తమరి కన్న మంచి గొప్పవారు ఎవరున్నారు? తమ ఆత్మను ఇచ్చేయండి అని అంటారు.

తన సుపుత్రుల యొక్క మాటను విని గురు చాలా గొప్పగా సంతోషించారు. వారు బ్రాహ్మణులతో చెప్పారు. తమరు ఔరంగజేబు దర్బారలో పోయి ఈ సందేశము అందచేయండి. ఒక వేళ మా గురువు ( రాజు) తేజ్ బహదూర్‌గారు మతం మార్పిడి చేసుకొన్నచో మే మందరం కూడ మీ ధర్మమును పాటించి ముస్లిములుగా మారిపోతాము. ( ఆఫ్ ఔరంగజేబ్ కె దర్బార్ మే మహా సందేశ్ పహుంచాదో కి యది హమారే గురు తేజ్ బహుదూర్ విధర్మి హోజాయేంగే తూ హమ్ సబ్ భీ ఆనంద్ సే ధర్మ పరివర్తన్ కర్ దేంగే'')

ఔరంగజేబు మహారాజుగారు అతని సందేశము అందిన వెంటనే, గురువుగారిని ఢిల్లీ రమ్మని ఆదేశం పంపుతారు. వారు ఢిల్లీ చేరుకొన్న వెంటనే మహారాజుగారు వారికి తన ధర్మమును వదలిపెట్టి మహామ్మదీయ ధర్మమును చేపట్టిన, ఎన్నో రకాల ఆశలను వినిపించాడు, మరియు రకరకాల భయాలను వినిపించాడు. అయితే గురువుగారు తన ధర్మమును వదలిపెట్టనన్నారు. ఈ విధంగా చెప్పగానే తన ఓటమిని అంగీకరించి, ఔరంగజేబ్ వారి శిరస్సును ఖండించుటకు ఉత్తర్వు ఇచ్చాడు.

ఈ ప్రకారంగా గురు శ్రీ తేజ్ బహాదూర్‌గారు భారతీయ ప్రజల యొక్క దుఃఖమును దూరంచేస్తూ, దానితో ధర్మము యొక్క రక్షణకై, దేశము కొరకు తను, సుద్ధపంచమి, 1732 సం. ( 11-11-1732 క్రీ.శ.) బలి అయిపోయినారు. పాదుషాగారు సిపాయిలకు ఇచ్చిన ఉత్తర్వు, ఏమనగా వారి ఖండించబడిన శిరస్సు మరియు మొండెము చాందనిచౌకలో పడిఉండవలెను, వాటిని కాకులు, గ్రద్దలు, కుక్కలు పీకి పీకి ఈడ్చుకుంటూ అపవిత్రం చేసి వారి శరీరం దుర్గంధంపాలగునట్లు చేయవలెను.

గురుజీగారి మొండెము, శిరస్సును ఎవరు దొంగలించుకొని పోకుండా ఔరంగ జేబు చాందినిచౌక్‌లో ఎక్కువ మంది సైన్యమును కాపలా వుంచాడు. గురువుగారిపై ప్రజలలో చాలా గొప్ప గౌరవము ఉండెను. వారి భక్తులు, వారి అనుయాయులు అన్నిచోట్ల విస్తరించి ఉండిరి. వారి ప్రాణములను లెక్క చేయకుండా భాయి జేతాజీగారు చాందినిచౌక్ నుండి గురువుగారి శిరస్సును హస్తగతం చేసుకొని తార్‌వాడి గ్రామం ( కర్నాల్ జిల్లా) చేరుకొని, మరియు అక్కడినుండి అనందపూర్ (గురుద్వారా) సాహెబ్ తీసుకొనిపోయి వారి పుత్రుడు గోవిందసింగ్‌గారికి స్వాధీనం చేసారు. అదే ప్రదేశములో శేషాగంజ్ పేరుతో చారిత్రాత్మకమైన గురుద్వారా నిర్మింపబడి ఉన్నది.

అదే విధంగా మరియొక అద్భుతమైన వింత జరిగినది. గురువుగారి పార్థ శరీరం చాలా భక్తి శ్రద్ధలతో ఎవరూ ఊహించని ఘటన ఈ విధంగా జరిగినది. గురువుగారి శిరస్సు సురక్షితంగా చేర్చుటకుగాను వారిపై ఉన్న భక్తి శ్రద్ధలతో భాయి జీవన్‌గారు తన పుత్రుడు

జేతాతో అన్నారు. నీవు నా శిరస్సును ఖండించి, గురుజీగారి శిరస్సును ఆనందపూర్‌లోని వారి పుత్రులకు అందించు. కాని తండ్రి శిరస్సు ఖండించుటకు పుత్రుడు సమ్మతించలేదు. అప్పుడు బహదూర్ జీవన్‌గారు తమ గురువుగారి ప్రతిష్టతను సురక్షితం చేయుటకుగాను వారు తన శిరస్సును తన చేతులతోనే ఖండించుకొన్నారు.

అప్పుడు జేతాజిగారు గురుజీగారి మరియు తన తండ్రిగారి శిరస్సులను అక్కడి నుండి చునాగడ్‌లో తన తండ్రి శిరస్సు ఉంచి, గురుజీగారి శిరస్సును ఆనందపూర్ చేర్చారు. ఇక్కడ గురుజీ గారి శిరస్సును తీసుకొనిపోయిన వారిని పట్టుకొనుటకు ఔరంగజేబు ఉత్తర్వు ఇచ్చాడు. గురువుగారి పార్థ మొండెం మైదానంలో ఉంచి దండోరా వేయించారు. ఎవరైన సరే గురువుగారి మొండెమును వచ్చి తీసుకొనిపోవచ్చును. భయంతో ఆ మొండెమును తీసుకొనిపోవుటకు ఎవ్వరు ముందుకు రాలేదు. అయితే లక్కీషా బంజారా గారు ఎలాగైన సరే ఆ మొండెమును మాయం చేయుటకు తన ప్రయత్నమును సిద్ధం చేసుకొన్నారు.

అంతే వెంటనే లక్కీషాగారు గురుజీని ధ్యానించారు.
గురు కారణ కో సున్ దుఃఖ పాయే !
ధర్మ త్రిలోకన్ కే హిత్అయే
తరే బ్రిక్ష కే గురు ధరధరాయే
దేఖా పిలోజన్ మహి జల్ భర్‌యే

లక్కీషాగారు తన మనస్సులోనే గురుజీగారి మొండెమును అక్కడ కాపలా ఉన్నవారి కన్నులు కప్పి గుప్తంగా, గౌరవప్రదంగా తీసుకొనివచ్చుటకు ఆలోచించుకొన్నాడు. చాలా మంచి పద్ధతితో అలోచించి, లక్కీషాగారు తన కుమారుని పిలిచాడు. మరియు లెక్క లేనన్ని బిడారి ఎద్దులను తోలుకొని వారిద్దరు మైదానం చేరుకున్నారు. ఎద్దుల వీపు మీద దూది మూటలు వేయబడి ఉండినవి. ఎద్దులను నిలబెట్టి ఇద్దరు గురువుగారి మొండెము వద్దపోయినారు. అదే సమయంలో చాలా ధూళితో తుఫాన్‌గాలి లేచింది. ఆ గాలికి ఎద్దులపై ఉంచిన దూది గాలిలో లేచి అక్కడ కాపలా కాస్తున్న సైనికుల కళ్లలో పడటం జరిగినది. కాపలాదారులు తమ కళ్లను మూసుకొన్నారు. అదే మంచి తరణంయని తండ్రి-కొడుకు ఇద్దరూ ఆ మొండెమును ఎత్తుకొని తమ తాండా రాకబ్ గంజ్ వచ్చేసారు. ఈ విధంగా వారు తమ సంకల్పమును నేరవేర్చుకొని, గురువుగారి శరీరము దుర్గతి పాలు కాకుండా కాపాడినారు.

ఇప్పుడు లక్కీషా బంజారా ఇంటి స్థలంపైననే ''రాకబ్ గంజ్ గురుద్వారా'' పేరుతో ఒక గొప్ప పాలరాతితో గుర్ధ్వారా నిర్మించబడి ఉన్నది. మరియు దీనిపై సిక్కు ధర్మమును తెలియపరచే జెండా ఎగురుచున్నది. ఎక్కడెక్కడైతే లక్కీషాగారు ఉంటూ వుండిరో అక్కడ బిడారి ఎద్దుల తాండా ఉంటూ ఉండేది. ప్రతి సంవత్సరం ఇక్కడ ఎంతో గొప్ప ఉత్సవాలు జరుగుతాయి. ఇక్కడ గురువుగారి పేర ఒక విద్యాలయం నడపబడుచున్నది. దీనిని స్థాపించినవారు సర్దార్ ధర్మసింహాగారు. ఈ విద్యాలయంలో విద్యతో పాటు భోజన సౌకర్యం, ఉండుటకు హాస్టలు వసతి ఉన్నవి. ఇక్కడ సంగీత విద్య కూడా నేర్పించబడుతుంది. ఇది నాల్గు సంవత్సరాల కోర్సు. ఇక్కడ అభ్యసించే విద్యార్థులకు గాను క్రొత్తస్కూలు కూడ ప్రారంభించారు. ఇక్కడ మహావిద్యాలయమును స్థాపించినవారు అధ్యక్షులు జ్ఞాని హరనామసింగ్‌జీ మరియు జ్ఞాని దయాల్‌సింహాజీగారు.

# రాకబ్‌గంజ్ గురుద్వారా

ఈ పవిత్ర స్థలం శ్రీగురుతేజ్ బహదూర్‌జీగారి శరీరం అంతిమ సంస్కారం అయినది. దీనికి పూర్వం ఈ స్థలంపై భాయి లక్కిషా బంజారాగారి ఇల్లు వుండినది. ఎప్పుడు 9వ గురువు శ్రీ తేజ్‌బహుదూర్‌సింగ్‌జీ మహారాజ్ చాందినీచౌక్ వద్ద ఢిల్లీలో బలిదాన్ అయినారో అప్పుడు ఆ పవిత్రస్థలం నుండి తన శిరస్సును అక్కడి నుండి శ్రీ ఆనందపూర్ సాహెబ్ తీసుకొని వచ్చారు. వారి పవిత్రమైన శరీర మొండెమునూ భాయి లక్కిషా బంజారా ఈ స్థానంలో తన ఇంటికి తీసుకొనివచ్చారు. వారి శరీరమును రాత్రి సమయంలో దహన సంస్కారం చేసారు. ఈ సంఘటన జరిగిన 100 సంవత్సరాల తరువాత సిక్కు సమ్మేళన, కోటి మందికిపైగా జమ అయిన సందర్భంగా జతేదార్ సర్దార్ బాదల్ సింగ్‌గారు ఢిల్లీని ముట్టడించి జయించినారు. వారు ఈ పవిత్ర స్థలముపై గురుజీగారి జ్ఞాపకార్థం ఒక సమితిని ఏర్పాటు చేసిరి. రాజుగారికి జరిగిన దహన సంస్కారము చోట ఒక గురుద్వారాను నిర్మించి, రాకబ్‌గంజ్ అని నామకరణం



క్రొత్త ఢిల్లీలోని, పార్లమెంట్ హౌస్ ప్రక్కనవున్న రాకబ్‌గంజ్ గురుద్వారా

చేసిరి. 1757లో స్వతంత సంగ్రామముకై ప్రాయశ్చిత్తం చేయబడి, సిక్కు సాంప్రదాయంతో ఈ గురుద్వారాకు నాల్గు ప్రక్కల భద్రంగా ప్రహారిగోడ కట్టించారు. 1917లో అప్పటి ఆంగ్లేయులు ఈ నాల్గు గోడలను పడగొట్టించి లోపలి భాగములో ప్రభుత్వ భవనములను కట్టించ వలయునను నిర్ణయం తీసుకొన్నారు. ఆ విధంగా నాల్గుగోడలలో ఒక దానిని పడగొట్టిరి. అప్పుడు సిక్కు జాతీయులకు వీరిపై క్రోధం ఏర్పడినది. వీరిలో ఒక వర్గం ముందుకు దూకినది. అందుకు ఆంగ్ల ప్రభుత్వం చేయునది లేక పడగొట్టబడిన గోడను తిరిగి కట్టడం జరిగినది. భాయిలక్కిషా బంజారా కాలంలో ఇక్కడ ఒక్క చిన్న గ్రామము (తాండా) ఉండినది. అది కూడ నష్టం అయినది. ఈ పవిత్రమైన నామము రాకబ్‌గంజ్ పేరుతోనే ప్రఖ్యాతి గాంచినది.

ఇప్పుడు నవీన సంపద(గుర్తు)ను జ్ఞాపకార్థం తిరిగి నిర్మించుటకై సత్‌గురుజీ(గురునానక్) యొక్క కృపవలన హరనామ్‌సింహజీసూరి ద్వారా నిర్మాణం చేయబడినది. ఇది గురుద్వారా శ్రీ రాకబ్‌గంజ్ యొక్క చారిత్రకమైన గాథ!

క్రొత్త ఢిల్లీలోని, పార్లమెంట్ హౌస్ ప్రక్కనే రాకబ్‌గంజ్ గురుద్వారా ఉన్నది. ఈ ప్రదేశములో రాకబ్‌గంజ్ అనుపేరు గల తాండా ఉండినది. ఇదే లక్కిషా బంజారా లక్షల గోవులు వుండే స్థలం. ఈ ప్రదేశమంతాను లక్కిషా బంజారాకు చెందినది. బంజారాలు ఆహార ధాన్యములను, యుద్ధ సామాగ్రులను ఒకచోట నుండి మరియొక చోటకు తీసుకొని పోయి వ్యాపారం చేస్తూ ఉండిరి.

లక్కిషా తాండా ఉన్నచోట 300 ఎకరములు ఉన్నవి. దానిని బంజారా తాండా అంటారు. ఇప్పుడు అక్కడ పార్లమెంటు హౌస్, సెంట్రల్ సెక్రెట్రియేట్ మరియు రాష్ట్రపతి భవనములు నిర్మించబడి ఉన్నవి. 24-4-1966 లో అప్పుడు అఖిల భారత బంజారా సేవా సంఘ శిబిరం జరిగినది. దాని ప్రారంభోత్సవమును మన ప్రియతమ ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధిజీగారు ప్రారంభించారు. ఇందిరా గాంధిగారు అన్నారు కదా! నాకు తెలుసు, మనదేశములో బంజారా జాతిలో చాలా గొప్ప వ్యక్తులు ఉన్నారు. వారు ఈ జాతి జీవనములో చాలా త్యాగము చేసి ఉన్నారు. నేను ఇప్పుడు ఇక్కడ, మనం నిలుచున్నచోటుకు చాలా పురాతన సంబంధము ఉన్నది. భారతంలో ఇటువంటి పౌరాణికమైన చాలా స్థలములు ఉండవచ్చును అని నేను తలంచుతాను. వాటితో మీకు సంబంధం ఉండును.

# బంజారాల చరిత్రాత్మక, ''ఏడుబావులు'' (సాత్ కువా)

''సాత్ కువా'' గుజరాత్ రాష్ట్రంలో బంజారాల యొక్క ప్రాచీన బావి మరియు పురాతనమైన కట్టడాలు ఉన్నవని, వాటిని చూచి ఎంత వరకు నిజం తెలుసుకొనవలయునని, ఉద్దేశముతో 28-6-1972లో అఖిల భారతీయ బంజారా సేవా సంఘం యొక్క ప్రతినిధులు బయలు దేరినారు. సబర్‌ఖండ్ జిల్లాలో మన పూర్వీకులు చాలా గొప్పవారు ఉండిరి. ఈ యాత్ర మన సంఘం, ప్రధాన కార్యదర్శి మరికొందరు వారిలో శ్రీ హర్జివిశ్రామ్ రాథోడ్ గారు కూడ

ఉండిరి. వీరిలో అఖిల గుజరాత్ బంజారా సేవా సంఘం యొక్క కార్యకర్తలు కూడ కలసి ఉండిరి.

ఈ సందర్భంలో బంజారా ప్రతినిధి మండల్‌లోని సర్వశ్రీ భైరాజ్ పబాజీ భట్ (బంజారా) మరియు వలజి భవాజీ భట్, బంజారాలతో పరిచయం చేసుకొన్నాము. వీరి నివాసము తమ్‌షా, పూర్వం అంబికా మిలా! జవన్‌పురా! తాలుకా ఇందర్, జిల్లా సబర్‌ఖండ్, గుజరాత్ రాష్ట్రము.

బంజారాల ప్రాచీన చరిత్రాత్మకమైన ఏడుబావులు బావనాగడ్‌లో ఉన్నవి. ఇవి ఉన్నచోటు తాలుకా ఇందర్ మరియు జిల్లా సావర్‌ఖండ్. ఈ స్థలం అహమ్మదాబాదు నుండి 70 మైళ్ళ దూరంలో ఉన్నది. ఈ బావి గూర్చిన సరియైన విషయములు వివరంగా తెలుసుకొనవలయునంటే, స్థానికులు అయిన శ్రీ సజ్జాభాయి రామసింగ్ కృపావత్‌ను కలుసుకొనగా, వారు చెప్పినది ఏమనగా బావికి పైన కప్పు ఆకారంలో కట్టబడి ఉండినది. ఇప్పటి బుద్ధిమంతులు అందులో గుప్తధనం ఉన్నదని వాటిలో కొంతభాగం పగలకొట్టినారు.

ఇంకను ఈ బావి గూర్చిన విషయములు తెలుసుకొనుటకు, సంఘ నాయకుని తీసుకొని భవనాగడ్ ప్రజలను ముగ్గురు, నలుగురిని కూడ కలవడం జరిగినది. ఆ ఊరి సర్పంచ్‌గారు చెప్పినది ఏమనగా, ఈ బావి గూర్చిన చరిత్ర అనేక విధాలుగా చెప్పుకొంటారు. ఈ బావి ఎప్పుడు కట్టినది ఎవరికి తెలియదు. ఒక పెద్ద మనిషి అతని వయస్సు 75 సం. వారు చెప్పినది ఏమనగా ఈ బావిని శ్రీ దుర్గాదాస్ పచారియా లబానా (బంజారా) డబోయి (గుజరాత్) వద్ద ప్రాచీనకాలంలో ఒక కోటను కట్టించారు. దాని అవశేషాలు ఇప్పటికియున్నవి. మక్కన్ షా లబానా గూర్చి వ్రాసిన చరిత్రలో ఈ విషయం చెప్పబడినది.



గుజరాత్‌లోని సాత్ కువా (ఏడుబావులు)

# తాండా స్టేట్ (రాజ్యం)

గుజరాత్‌రాష్ట్రంలో బంజారా రాజవంశాలు ఇప్పటికి రాజ్యమేలినాయి అని చెప్పుటకు ఉదాహరణంగా గుజరాత్‌లోని తాండా స్టేట్‌ను చెప్పుకొనవచ్చును. గుజరాతులోని తాండా స్టేట్ పాలించిన వారు రాజా విజయ సింగ్‌నాయక్‌గారు. వారి రాజభవనం ఇప్పటికి గుజరాతులో ఉన్నది. స్వాతంత్ర్యం రాక ముందువరకు ఆ రాజ్యమును శ్రీ గురువార్ సింగ్ నాయక్ పాలించారు. ఈ విషయమును ఆల్ ఇండియా బంజారా సేవ సంఘం స్టడి టీంవారు, వారి రాజభవనమును దర్శించి, ఆ రాజ కుటుంబ వారసులతో తీసిన ఒక ఫోటోను, ఆల్ ఇండియా స్టడి టీం రిపోర్టులో ప్రచురించినారు.

# లక్కీషా బంజారా - కుక్క గూర్చిన గాథ

పశ్చాత్తాపం వల్ల ఏమి జరుగును. ఎప్పుడు బబ్బర్ పోయే చక్కగా ఈ విషయం 16వ శతాబ్ధం నాటిది. లక్కీషాజీ బంజారాజాతిలో చాలముఖ్యమైన గొప్ప వ్యక్తి. తన స్నేహితుడైన ఉత్తర్‌ప్రదేశ్‌లోని సేట్ మంగీషాగారితో చాలా స్నేహం ఉండినది. వ్యాపారంలో కొంత ఆటంకములు జరుగుట వలన లక్కీషా గారికి కొంత డబ్బు ఖర్చుకై సేట్ మంగీషాగారి నుండి తీసుకొనవలసివచ్చినది.

లక్కీషా గారి వద్ద ఒక అందమైన, మంచి విశ్వాసం గల, మంచి సుగుణములు కల ప్రాణం కన్న మిన్నగా చూచుకొనే బబ్బర్ అనే పేరుగల కుక్క ఉండెను. ఈ బబ్బర్ చెప్పటానికే కుక్క కానీ చాలా చతురమైన, గ్రహించగలిగిన, బుద్ధివంతమైనది. లక్కీషా గారు తను తీసుకొన్న ఋణములకుగాను హామీగా సేట్‌మంగీషా గారి వద్ద బబ్బర్ కుక్కను ఉంచండి, అని చెప్పి మీ నుండి తీసుకొన్న ఈ ఋణము ఒక సంవత్సరంలోపు ఇస్తాను అన్నారు. ఆ తరువాత బబ్బర్‌ను వాపసు తీసుకొని పోతాను. ఈ విషయమును లక్కీషాగారు బబ్బర్ చెవిలో చెప్పినారు. బేటా(కుమారా) ఈ రోజు నుండి నీవు సేట్ మంగీషాగారి సేవ చేయవలయును. చూడూ నాకు చెడ్డ పేరు తెచ్చేవు? మంచి విశ్వాసముతో వారివద్ద ఉండవలయును.

మంగీషా సేట్‌గార్కి కుక్క యొక్క తెలివి తేటల గూర్చి ముందుగానే తెలిసి ఉండినది. అందువలన వారు లక్కీషా గారి ఈ షరతూ(హామి) ఒప్పుకొన్నాడు. తన వెంట జబ్బర్‌ను తీసుకొని పోయాడు. సమయం గడచిపోతూ వచ్చినది. గంగానది పర్వదినం వచ్చినందున సేట్ మంగీషాజీ గారు తన కుటంబ సమేతంగా గంగా స్నానాలు చేసుకొని వచ్చుటకు బయలుదేరారు. ఇంటి వద్ద సౌకర్యాలను ఇంటిలో పనిచేసే వారిని మరియు బబ్బరు కుక్కను ఇల్లు కాపలా ఉండుటకు వదలి పెట్టారు. సేట్ మంగీషాగారు లేనిది చూచుకొని, దొంగలు వచ్చి సేట్ గారి ఇంటిలో దూరి మొత్తం లూటీ చేసి వెళ్ళి పోయారు. బబ్బర్ వారిని నిరోధించుటకు చాలా గట్టిగా మొరిగాడు. కాని నౌకర్లు ఎక్కడ మేలు కుంటారు? అయినా

బబ్బురు తన ప్రయత్నమును విడిచి పెట్టలేదు. అది దొంగల వెంటపడి మొరగుతూ పోయినది. దొంగలు ధనమును ఎత్తుకొని నావఎక్కి నదిదాటి పోయినారు. బబ్బురు దొంగలు వెళ్ళిపోవుట చూచి చేయునది లేక వెనుతిరిగి ఇంటికి వచ్చినది.

రెండవ రోజు సేట్‌గారు తీర్థయాత్రలు చేసి తిరిగి ఇంటికి రాగా, ధనం దొంగలింపబడినది అని విని, అందరిని ఎలా జరిగింది. అని అడగడం మొదలుపెట్టారు. కాని నౌకర్లు ఏమియు జవాబు చెప్పకపోవుట వలన చాలా దుఃఖించారు. బబ్బురు సేట్ గారు చెప్పిన ప్రతి మాటను వింటుండెను. అది సేట్ఃగారి పంచెనోటితో పట్టుకొని అడవి వున్న ప్రక్కకు లాగుకొని పోవుచుండినది. సేట్ గారికి ఏమి అర్థం కాలేదు. చాలా సేపటికి అర్థమైన సేట్‌జీకి. బబ్బురు ఎక్కడికి లాగుచున్నది అనుకొని మంగీసేట్‌గారు నౌకర్లును మిగిలిన వారిని పిలుచుకొని కుక్క పోయే దారిని బయలుదేరారు. నది దగ్గరకు చేరి నదిలో పడివున్న నావ ఎక్కి అవతలి ఒడ్డుకు చేరినారు. బబ్బురు ఒక చోటు తన కాళ్ళ పంజాతో ఇసుకను తోడినది. అప్పుడు నౌకర్లు కూడ తోడటం మొదలు పెట్టారు. అప్పుడు పోయిన సొమ్ము అంతా అక్కడ దాచి పెట్టబడినది. పోయిన సొమ్ము అంతయు సేట్‌మంగీషాగారికి దొరకినది. కుక్క యొక్క ఈ తెలివిని చూచి అందరూ అశ్చర్యపోయినారు. సేట్ మంగీషా గారు ఇంటికి వచ్చి ఒక ఉత్తరమును లక్కిషా గారికి వ్రాసినారు. భాయి లక్కిషాగారు బబ్బురుగారు నా మొత్తం అప్పును తీర్చి వేసినారు. కానీ ఇప్పుడు నేను దీనిని మీ సేవకై వెనక్కి పంపుచున్నాను. మొత్తం జరిగినదంతా ఆ ఉత్తరంలో వ్రాసారు. సేట్‌గారు కుక్క మెడలో ఈ ఉత్తరం కట్టినారు మరియు చెవిలో చెప్పినారు. బేటా( కొడక) ఇప్పుడు నీవు నీ ఇంటికి పో, సేట్ లక్కిషాగారికి నా నమస్కారములు చెప్పవలెను.

బబ్బర్ పరిగెత్తూకుంటూ లక్కిషా తాండా చేరుకొన్నాడు. ఆ రోజు లక్కిషా గారి ఇంటిలోనే ఏదో వ్రతం జరుగుచున్నది చాలా మంది ఉన్నారు. బబ్బురును చూడగానే లక్కిషా గార్కి దుఃఖంవచ్చి కంటి నుండి రక్తం వచ్చినట్లు అయినది. మరి వారు అన్నారు, నీకు సిగ్గులేదా బబ్బర్ నీవు కుక్కగానే ఉంటివి. ఈ రోజు శ్రద్ధ లేకుండా ఇంటి దగ్గర తినుటకు గాను ఒప్పందం ప్రకారం అప్పు తీర్చకనే వాపసు ఇంటికి పరిగెత్తి వచ్చావు. బబ్బర్ నిశ్చలంగా నిలబడి వుండెను లక్కిషా తన కరవాళమును పైకి ఎత్తి వెంటనే నరికాడు. తల మొండెము వేరైనవి. తల తెగిన వెంటనే దారం కట్టిన చీటి బయట పడింది. అప్పుడు లక్కిషాగారి కన్ను దాని పైపడినది.

ఉత్తరం చదివిన వెంటనే లక్కిషాగారు ఎదలు కొట్టుకుంటూ ఏడ్వటం మొదలు పెట్టారు. కుక్క యొక్క శరీరమును, తలను రెండు చేతులతో పట్టుకొని దానిని ఎదకు హత్తు కొనుచూ నాయనా లెయ్యి బబ్బర్ అంటూ శవాన్ని రెండు చేతులతో పట్టుకొని నీవు నా పుత్రుడవు అని చాలా దుఃఖించాడు. ఈ విషయం సేట్ మంగీషాగారికి తెలిసినది. వారు కూడ చింతించారు

అబ్ పశ్చితాప్ సే క్యాయా బనతా హై !!
జబ్ బబ్బర్ గయే సిధారే !!

మంగీషా సేట్ గారి ధనం దొరకిన చోటనే బబ్బర్ యొక్క శవమును జ్ఞాపకార్థంగా నది ఒడ్డున సమాధి చేయబడినది.

ఈ సమాధి బబ్బుర్‌దే కాదు, లక్కీషా బంజారా జ్ఞాపకార్థంగా కూడ పూజింపబడుచున్నది. ఈ సమాధి ఉత్తరప్రదేశ్‌లోని, ముజఫర్ నగర్ జిల్లా, నరా గ్రామము వద్ద ఈ రోజు కూడా చూడవచ్చును. ఉత్తర ప్రదేశ్ పోయిన బంజారా జాతి ప్రజలు సమాధిని దర్శించి వారి పూర్వ చరిత్రను తలంచుకొని, ధన్యులగు చున్నారు. దీనిని దర్శించి బంజారా ఐకత్యను గూర్చి ప్రార్థించుతారు. లక్కీషాగారి పేరుపైననే దేశంలో విస్తరించియున్న బంజారాలు, వారి పేరు చెప్పుకొని గర్వించు కొంటారు.

లక్కీషా గారి కుక్క బబ్బుర్ సమాధి జీర్ణావస్థలో ఉన్నది. దానిని పునరుద్ధరించాలని ఉత్తర ప్రదేశ్ బంజారా సేవా సమాజ్ నాయకులు ఒక తీర్మానమును గావించి, అభివృద్ధి చేయ వలయునని పూనుకొన్నారు. ఈ సమాధి ముజఫర్‌నగర్ మీటర్ గేజ్ రైలు మార్గమునకు, నరా పేరుగల గ్రామమునకు తూర్పుగా ఒక కాలువ ప్రవహిస్తున్నది. దీనికి తూర్పు దిశలో సుమారు 2 కి.మీ. దూరంలో ఇది వున్నది. 1974 సం. జిల్లా బంజారా సేవా సంఘంవారు, నాయక్ లక్కీషా గారి నిజాయితి, మరియు సత్యం యొక్క పాలనచేయుటకుగాను, పుత్రుని సమానంగా పెంచుకొన్న కుక్కను సంహరించినారు. ఆ తరువాత తన కుక్క యొక్క విశ్వాసమును తెలుసుకొని, పశ్చాత్తాపం చెంది, దానిని సమాధి గావించారు. ఈ సమాధి భూమి 13 అ.చదరంలో ఉన్నది. దీనిని 14 అ.చదురముతో కాంక్రీటు, సిమెంటుతో పునర్ నిర్మించాలని తీర్మానించారు.

ఈ సమాధి చరిత్రాత్మకమైనందున బంజారాలు దీనిని దర్శించి తమ నాయకుడైన లక్కీషా బంజారాను జ్ఞాపకం చేసుకొని, అనాటి బంజారా వైభవమును జ్ఞాపకం చేసుకొంటున్నారు. ఇక్కడ ఇది గ్రామ పంచాయితి భూమి అయినందున గ్రామ పంచాయితి ద్వారా సంఘం పేర తీసుకొనటం జరిగినది. ఈ సమాధి దగ్గర బంజారా పిల్లల విద్యాభివృద్ధికిగాను ఒక స్కూలును లక్కీషానాయక్ బంజారా పేర స్థాపించుటకు గాను, ఒక శిలా ఫలకం కూడ వేశారు. మరియు లక్కీషా గారు మరియు వారి కుక్క బబ్బుర్ జ్ఞాపకార్థం ప్రతి సంవత్సరం ఇక్కడ ఉత్సవం జరపవలయునని నిశ్చయించారు. ఇది లక్కీషా బంజారా, తన పుత్ర సమానుడైన కుక్క బబ్బుర్ గారి చరిత్ర గాథ.

# ఆదమ్ లోహానా

ఆదమ్ లోహానా పేరును ఆదమ్ అని ఆగమ్ కోట్ అని కూడా చెప్పు చుండిరి. హైదరాబాద్ (సింధ్) నుండి ముప్పయి మైళ్ళ వరకు. దక్షిణం – పశ్చిమంతో లోహనా "కొండ ప్రాంతం" పై విస్తరించి యున్న ఒక గొప్ప మహిమ గల స్థానమై ఉండెను. "లోపటి సేట్‌బటిన్" ఈ స్థానం యొక్క పేరు. "అంగుమాను" అని కూడ చెప్పుచుండిరి. అప్పటి సైన్యం యొక్క "కవటర్‌మ్యాస్టర్" జనరల్ వారు పటంలో దీనికి "ఆదమామా" అనుపేరుతో చూపబడినది. ఈ ప్రాంతం యొక్క లోహానా (సర్దార్) పెద్దవారి పేరు ఆదమ్ ఉండెను. 'అఖమ్యా' అనికూడ చెప్పుచుండిరి. వారు దీనిని స్థాపించినారు. ఆదమ్ ఆ కాలంలో బ్రహ్మనాబాద్ యొక్క గవర్నరుగా ఉండెను. వారు సింహరస యొక్క నల్గురు గవర్నర్లలో ఒకరుగా ఉండిరి. వారి

యొక్క రాజ్యము తూర్పు కాశ్మీరము నుండి పశ్చిమములో మకరన్ వరకూ వ్యాపించి ఉండెను. మరియు ఉత్తరం కరదాన్ కొండలు మొదలుకొని దక్షిణంలో సముద్రం అంచువరకు ఉండెను. వారి రాజధాని, పేలోట్ ఉండెను, బక్కర్ మరియు ఖోరపూర్‌కి మధ్య శ్రీతత్ ఉండెను. నిరూన్, దేబల్, లోహానా, లఖా మరియు సామాగారి కోటలు కూడ ఆదమ్ యొక్క అధికారంలో ఉండెను. నిమ్ రోజ్ యొక్క బాదుషాతో పాటు అయిన యుద్ధంలో రాజాసింహరస్ చనిపోయాడు. వీరి తరువాత వారి యొక్క మంత్రి, వారి పేరు ఛత్‌గారు సింహాసనం ఎక్కినారు.

సింహాసనముపై ఎక్కిన వెంటనే, ఛత్‌గారు తనయొక్క అధికారమును స్థాపించుటకు ప్రారంభించారు. వారు బ్యాస్‌కు దక్షిణకొన మీద పబీయా రాజుగారిని ఒడించి, వారి యొక్క ప్రాంతమును (రాజ్యము) గెలుచుకొన్నాడు. ముల్‌తాన్ గవర్నరును కూడా వారు ఓడించారు. వారు వారి అధికారమును అంగీకరించుటకు నిరాకరించారు. ఛత్‌గారు వారి ప్రాంతముపై తన అధికారమును సంపాదించారు. దాని తరువాత వారు శివీ స్థానము యొక్క గవర్నర్‌గారిని ఓడించి, వారి స్థానంపైన కూడ తన అధిపతిని నియమించారు. వారు కొంత అశ్వస్థులు అయిన తరువాత ఛత్ గారు ఆదమ్‌గారిపై వారి దృష్టిని మళ్ళించారు. మరియు వారు, వారికి ఒక ఉత్తరం పంపించి, తన అధీనములో రావలసినదిగా చెప్పడం జరిగినది. ఆదమ్ ''మటా'' అనే వారికి మంచి స్నేహితుడు. అప్పుడు ''మటా'' ఓడిపోయారని తెలిసి వారికి ఒక ఉత్తరం వ్రాసారు. అందులో వారు తన యొక్క స్నేహంను గుర్తు చేస్తూ, వ్రాస్తూ బ్రహ్మనాబాద్ యొక్క రాజ్యములోని ఏ ఒక్క ప్రాంతంపైన అయినా సరే తన యొక్క ఇష్ట ప్రకారం ఉండవచ్చును. అని వ్రాసారు. అయితే ఈ ఉత్తరం దౌర్భాగ్యవశాత్తు మటా గారి చేతిలో పడక ముందే ''ఛత్'' గారు వారిని దారిలోనే అటకాయించి తన చేత చిక్కించు కొన్నాడు. ఆ ఉత్తరం అందని కారణంగా, హింద్ పోవలయునని, నిశ్చయం చేసుకొన్నాడు. ఛత్ గారు ఆదమ్ లోహనాగార్కి మరియొక ఉత్తరం వ్రాశారు. అందులో నీవు అనుకొంటూ ఉండవచ్చు నీవు నాకు తోడుగా ''మటా'' ఉన్నారని, అది నీ ఇష్టం, నీ ధైర్యం. దీని యొక్క పూర్వ స్థానం నీకే తెలుస్తుంది. నీవు నా చేతిలో అన్నియు పోగొట్టు కుంటావు. మరియు నీ ప్రాణం పోయేది ఖాయం – ఛత్ – నానా.

ఈ ఉత్తరం అందిన వెంటనే యుద్ధంనకు సిద్ధం అయినారు. ఈ యుద్ధం. బ్రహ్మనాబాద్‌కు దగ్గరలో జరిగినది. మరియు ఈ యుద్ధంలో రెండు ప్రక్కల చాలా నష్టం జరిగినది. ఆదమ్ యుద్ధభూమి వదలి కోటలోనికి పోయిదాకున్నాడు. ఆకోట చుట్టు ఛత్ ఒక సంవత్సరం పాటు చుట్టు ముట్టాడు. అందుకే ఆదమ్‌గారు కనోజ్ రాజుగారి సహాయం కోరినారు. అయితే వారి నుండి బదులు వచ్చేలోగానే వారు చనిపోయారు.

ఆదమ్‌గారి తరువాత వారి కుమారుడు సరబంద్ సింహాసనం ఎక్కాడు. వారు సింహాసనం, అధిష్ఠించుటకు తన యొక్క నిజసలహాదారుడైన బుద్ర్‌గారికి సరిపోలేదు. వారు సరబంద్ నుండి దూరమైనారు. ముందు ఇదే కారణం పై సరబంద్ గారికి అపజయం అయినది. ఛత్ సరబందుని తల్లితో వివాహం చేసుకొన్నాడు మరియు తన తమ్ముడి కొడుకు బిడ్డను సరబత్ గారికి ఇచ్చి పెండ్లి చేశారు. ఛత్, ఒక సంవత్సరం వరకు అక్కడ ఉండిరి. మరియు వారు 'జాట్ వారికి లోహర్ జాతి వారికి చాలా కష్టాల పాలుచేసారు. లోహాన్‌కు, ఛత్ కాలంలో హింద్ ప్రాంతంలో ఒక శక్తి వంతమైన వధశాల ఉండెను. అయితే ఛత్ రాజ్యంలో వారు వారి స్వాధీనంలో

ఉండవలసి వచ్చినది. ఎలియట్‌గారు వ్రాసినది ఏమనగా ఆకాలంలో లోహానాలు అన్ని రకాల కష్టాలను అనుభవించవలసి వచ్చినది. అయినా వారు వారియొక్క ధర్మమును, మరియు నిజాయితీని వారు వదలిపెట్టలేదు. మరియు ఒక శక్తివంతమైన వధశాలను రూపొందించారు. తిరిగి వారు కావాలనుకుంటే ప్రభుత్వ అధికారులుగాను, వ్యాపారులుగాను కూడ వారి యొక్క కార్యక్రమములు, ఒక్క సింద్ ప్రాంతంలోనే కాదు మరియు పడమర ప్రాంతం, హిందుస్తాన్ నుండి బయటికి కూడ వుండెను. మరియు వారు అఫ్ఘనిస్తాన్, బెలూచిస్తాన్, మరియు అరబ్ రాజ్యములలో కూడ విస్తరించి ఉండెను. వారు తమ వృత్తి ధర్మములను చాలా కష్టములకు ఓర్చి చేస్తూ ఉండిరి. అయినా వారు ధనము సంపాందించి, తమ దేశమునకు తిరిగి వచ్చిపోవు చుండిరి.

కొంత కాలము తరువాత ఎప్పుడైతే సింధు ప్రాంతములో మహమ్మదీ యులు వచ్చిరో అప్పుడు వారు హిందువులను దౌర్జన్యంగా మహమ్మదీయులుగా మార్చటం ప్రారంభించారు. ఆ సమయంలో కొంతమంది హిందువులు కూడ ముస్లింలుగా మార్చబడినారు. అయితే వారి నడవడికలలో ఏమియు పరివర్తన రాలేదు. మరియు వారు లోహన్ ఆఫ్ఘనులు అను పేరుతో వారు ప్రఖ్యాతి గాంచినారు. సర్ అలెగ్జాండర్ బన్స్‌గారు చెప్పిన ప్రకారం, కాబూల్. పే. 56లో లోహన్ ఆఫ్ఘనులు వ్యాపారములో మొత్తం ఏషియాలో వ్యాపించి యున్నారు. మరియు వారు తమ ఆఖరి రోజులలో తమ బంధువుతో వచ్చి ఉండిపోతారు, బర్నెస్ ఆగ్రి వ్రాస్తున్నారు. లోహనే ఆఫ్గన్‌లు యొక్క ఎజెంట్స్ ఆస్తరా నుండి కలకత్తా వరకు ప్రతి మహత్యం కల ప్రదేశములలో వీరు కనిపిస్తారు. ఎక్కడైతే ఎద్దులను అక్కడివి ఇక్కడ, ఇక్కడివి అక్కడ మార్చుకొనుచుంటారో అక్కడ లక్కీషా ఉన్నారు. కలకత్తా నుండి లక్నో, ఢిల్లీ, ఝాన్సి మరియు బొంబాయి నుండి, పాలి బహబల్ పూర్, ముల్‌తాన్, మరియు అమృత్‌సర్, జంగ్, లియా మరియు డేరాగాజి ఖాన్‌సే బహలాపురా మొత్తం అన్ని త్రోవలు డేరావన్‌దే తో కలుస్తాయి. అది డేరాఇన్ మాయిల్ ఖాన్ నుండి 30 మైళ్ళు పశ్చిమమువరకు ఉన్నది. ఈ ప్రదేశము నుండి మశహార్ త్రోవ ( రోడ్డు) గుమలనదితో పాటు గులోరి రోడ్డుకు పోతుంది. మరియు దీనినే లోహన్ ఆఫ్ఘన్ ప్రాంతం అంటారు.

డాక్టర్, హానీబర్‌గర్ ఒక విదేశి డాక్టరుగారు మహారాజ్ రంజిత్ సింగ్ గారి వద్ద ఉద్యోగం చేస్తుండేవారు. అప్పుడు వారు తమ దేశము ( యూరఫ్) నకు పోవుచుండిరి. దారిలో వారు లోహన్ అఫ్ఘన్‌లతో కలిసారు. అక్కడ డేరాగాజీ ఖాన్ అనుచోటు వారు నల్లమందు కొనుచుండిరి. దానిని వారు బేరవారా తీసుకొని పోవలయును. డాక్టరుగారు వారితో పాటు వారి వెంటపోయారు వారు డేరాబనద్ ద్వారా పోయారు. అక్కడ వారి కుటుంబీకులు ఉన్నారు.

అప్పుడు సింధులో సిక్కుల పెద్ద పోరాటం జరిగినది. అప్పుడు ఎంతో మంది లోహన హిందువులు బాబానానక్ గారి సేవకులు అయి పోయినారు( సిక్కులు) మరియు ఆ తరువాత మెల్లమెల్లగా సిక్కుల ఆచారమును పాటించుతూ సిక్కులుగా అయినారు.

1947 సం. లో భారతదేశము రెండు భాగములుగా విభజింపబడినది. అప్పుడు చాలా గొప్ప సంఖ్యలో హిందువులు మరియు సిక్కులు భారతదేశం వచ్చి యున్నారు. అలాగే వారితోపాటు ఉన్న లోహనాలు సిక్కుల పశ్చిమ పంజాబు వదలి తూర్పు పంజాబునకు వచ్చి ఉన్నారు.

# చామ్‌కౌర్ సాహేబ్ యుద్ధం (పోరాటం)

దేశరక్షణకొరకు పూర్వం బంజారాలు అతిముఖ్యమైన పాత్రనువహించారు. దీనికి ఉదాహరణ చామకౌర్‌సాహేబ్ పోరాటము ద్వారా తెలియబడుచున్నది. పూర్వము బంజారాప్రజలు తమజీవనమునకై వ్యాపారము ఒక్కటే కాకుండా, ముఖ్యంగా దేశములోని రాజులతో చేతులు కలిపి శత్రువులపై యుద్ధములు చేసి దేశమును, రాజ్యములను కాపాడినారు. ఈ ప్రకారం బంజారాలపాత్ర అతిశ్రేష్టముగా ఉండెను.

చామకౌర్ పోరాటము హిందూదేశ చరిత్రలో అతిముఖ్యమైనది. ఇందులో బంజారాప్రజలు మరియు 39మంది సిక్కువీరులు మరియు గురుగోవిందసింగ్ గారి ఇద్దరు కుమారులుకలసి సామ్రాజ్య షాహి మరియు నిరంకుశుడైన ఔరంగజేబు సైన్యమునకు విరుద్ధముగా, గురుగోవింద్‌సింగ్ నేత్రుత్వములోపోరాడి అధ్బుతములను చేసి చూపించి, చరిత్రలో ప్రఖ్యాతిగాంచినారు.

సిక్కుల 9వ గరువుగారు శ్రీ గురుతేజ్‌బహుదూర్‌సింగ్‌ల రుండము(తల)ను మొగలులు నరికి, మొండమును చాందిని చౌకులో పారవేయగా, లాఖాబంజారా, లక్కిషాబంజారా అనుబంజారా వీరులు, ఆ మొండెమును తీసుకొని వెళ్ళి, తన ఇంటిలోవున్న దూదిలో కుక్కి రాకబ్‌గుంజ్‌లో దహనసంస్కారంచేసి, సిక్కు జనము నుండి మెప్పుపొంది ఉన్నారు. ఆ విషయం అందరికి తెలుసు.

గురువుగారి దహనసంస్కారము ముగించిన తరువాత లక్కిషా లబానా (బంజారా)లో సిక్కు 10వ గురువు, గురుగోవిందసింగ్‌వారి చెంతకు పోయి, వారినిఓదార్చినారు, 9వ గురువు తేజ్‌బహుదూర్‌సింగ్ గతించిన తరువాత 10వ గురువు గురుగోవిందసింగ్‌గారి స్థితిచాలాసోచనీయంగా ఉండినది. తలలేని గరువు మొండెము ఢిల్లీలోని చాందినిచౌకులో దొర్లాడుచుండెను. రండములేని మొండెమును తీసుకోని పోవు వారసులు లేకపోయిరి. అటువంటి విచారకరమైన పరిస్థితి నెలకొని ఉండెను. ఈ విషయం తెలసిన సిక్కు 10వ గురువు శ్రీ గురుగోవిందసింగ్‌గారు దేవుని కృపఉన్నచో, అక్కడి లక్షలాది ప్రజల కష్టములను, నివారించుటకు తండ్రి అయిన తేజ్‌బహుదూర్‌సింగ్‌గారితో, ఔరంగజేబు చేతిలో తమరు ఎందుకు బలిదానం కాకుడదు అన్నారు. ఆవిధంగా కుమారుని ప్రోత్సాహముతో తేజ్‌బహుదూర్ సింగ్‌గారు ఔరంగజేబు చేతిలో చాందనిచౌకలో బలిదానమైనారు.

గురువు, సిక్కులు మరియు బంజారాలయొక్క శౌర్యమును, బలపరాక్రములను పరీక్షించారు. ఈ చామ్‌కౌర్‌సాహేబ్ పోరాటములో కొందరు సిక్కులతోపాటు బంజారావీరులు, ఒక లక్ష మందికి మించివున్న మొగలుల సైన్యముతో పోరాడినారు. వారి వీరత్వమును ప్రంపచమునకు చాటి చెప్పినారు. సయ్యద్‌మహ్మద్, లతిఫ్‌ల ప్రకారం. ఈ యుద్ధంలో కొందరే దైవాంశ సంభూతులైన ధైర్య సాహసులు. తమ యొక్క బలపరాక్రమములను ప్రదర్శించి వారిని తరిమి తరిమి కొట్టినారు. అయితే ఇక్కడ తెలియ చేయడమేమనగా, ఎవరు అంతటి వీరులు? అధునాతనమైన ఆయుధాలను పొంది, పర్వత శక్తిగల ఔరంగజేబు సైన్యముతో పోరాటం చేసిన

వీరులెవరు? అను ప్రశ్న మనముందుంచబడినది. గురు గోవిందసింగ్ సాహెబ్ మార్గము మరియు చాంకౌర్‌సాహెబ్ యుద్ధ గ్రంథములనువ్రాసినటువంటి వారు చెప్పునది ఏమనగా గురుగోవింద్‌సింగ్‌కు ఐదుగురు కుమారులు 1. భాయిదయాసింగ్ 2. ధర్మసింగ్ 3. సాహెబ్‌సింగ్ 4. మోహన్‌సింగ్ 5. హిమత్‌సింగ్, వీరితోపాటు కాశ్మీర బ్రాహ్మణులు, అరావామ్‌పుత్రుడు కృపాసింగ్, ముల్‌తాన్‌నాయక్, మాయిదాస్ (బంజారా) పుత్రులు అణిక్‌సింగ్, అజీజ్‌సింగ్ లబానానాయిక్, మయిదాస్ పుత్రులు, మున్ని పుత్రులు ధన్‌సింగ్‌లబానా, గురుదాస్‌చౌహాన్ అతని పుత్రులు, హాలంసింగ్, బాబాలక్కిషా పుత్రుడు జస్వంత్‌సింగ్, అతని తమ్ముడు సంగత్‌సింగ్, ఈయనగారి తాతగారు ధర్మదాస్ బంజారా, రావుజగత్‌సింగ్, భాయి మణిసింగ్ బహురూపియాలబానా, వారి బంధువులు మరియు ఇతర సిక్కువీరులు అమృత్‌సర్ యుద్ధంలో పోరాడి ఉన్నారు.

ఈ 40 మంది యోధులు మరియు గురువులు, వారి పిల్లలు, గురుతరబాధ్యతలను పొంది ఈ యుద్ధంలో పోరాడి వీరస్వర్గం పొందినారు. గురువులు, పిల్లలు, లబానా యోధులు ఈ యుద్ధంలో దేశం కొరకు పోరాడి వీర స్వర్గం చెందినారు. యుద్ధం గురించి చెప్పుచున్నప్పుడు, మహాడిచౌదరి అమ్మఇంటిలో మందు గుండు ఉంచుటకు, గురుగోవింద్ తరపువారు అడిగినప్పుడు. ఆ ఇంటి యజమాని చౌదరిగారు నిరాకరించినారు. అయితే ఆ ఇంటి మరిఒక ప్రక్క యజమాని ఆయిన గరిబు అను అతను సిక్కు యోధులకు ఇల్లు ఇచ్చారు. దీనిని సహించని మొదటి యజమాని, చౌదరి. ఆయింటిలోయున్న బావులన్నింటిలో విషంకలిపి, తన కుటుంబ సభ్యులను వేరేచోటికి తరలించారు. మరియు మొగల్ కమాండర్ అయిన జనరల్ సాహసఖాను, అను అతనికి ఇల్లు ఖాళీ చేయుటగూర్చి అర్జి ఇచ్చారు. ఆయితే ఆ అధికారి, ఈ చౌదరి గురువు తరపువారికి ఇల్లు ఇచ్చి, ద్రోహం చేస్తున్నాడని గ్రహించి, వానిని, వారి కుటుంబసభ్యులను, అతిహీనాతిహీనంగ అవమానపరచి, చౌదరి తరపు మహిళలను బయటికి ఈడ్చినాడు. ఈ అమానుషమైన కృత్యములను విన్నగురువులు, వారి యోధులను పంపించి, ఆ మహిళలను బంధవిముక్తులనుగావించారు. ఇందువలన మొగలుసైన్యమునకు భారినష్టంవాటిల్లినది.

ఈ విషయం తెలుసుకొన్న కమాండర్, ఇంటి యజమాని చౌదరి, మరియు వారిమహిళలను పట్టుకొనిరమ్మని, ఆజ్ఞాపించాడు, చౌదరి ఇంటిని, గురుజీ తరుపు వారు ఆక్రమించుకొన్నారనితెలిసిన కమాండర్ ఉగ్రుడైనాడు. తక్షణం తనసైన్యంలోని ముఖ్యసర్దారులను, సమావేశపరచి, పైవిషయములను చర్చించునపుడు, గురుగొవింద్‌సింగ్ ఒక పత్రమునువ్రాసి బాణముద్వారా కమాండర్ కాలిమధ్యలోవచ్చి గ్రుచుకొన్నట్లు వదిలారు. బాణమునందలి పత్రమునువిప్పి చదువగా ఈ విధంగాఉన్నది. ''నీవుప్రతివాది బలగం-అయిన కాదు. మరియు నిజమైన ముస్లింవుకూడాకాదు. అసలు నిజమైన మనిషివికూడాకాదు. సహసఖాన్, నీవు చౌదరికి ఇచ్చినమాటను నిలబెట్టలేక పోయావు. వారి ఆడవాళ్లను మానభంగం చేసినావు''. అని ఆ పత్రంలోని సారాంశం.

ఆ పత్రంచదివి భంగపడిన సహస్‌ఖాన్ మరియు అతని అనుచరులు, గురుజీ కోటను ముట్టడించుటకు, నిశ్చయించి, వెంటనే ముట్టడించవలయుననుకొని, రెండు రోజులకువాయిదా వేసుకొన్నారు. వేలాధి యోధులతో కోటచుట్టు ముట్టడి చేశారు. గురువు కాని వారి

యోధులుకాని, కోటనుండి బయటికిరానీకూడదు. అని మొగలుసైనికులు రాత్రింబవళ్లు కాపలాకాశారు. మొగలు సైన్యము ఆనాటిరాత్రి లాహోరునుండి అక్కడికి చేరుకొనవలసి యుండెను. రెండవ దినము మొగలులు, కోటలొనికిచొచ్చుకొని, గురూజీలను మరియు వారి అనుయాయులను సజీవంగాకాని, వారిశవాలనుకాని తీసుకొనివచ్చుటకు నిశ్చయించినారు.

ఈ విషయవములన్నియుతెలుసుకొన్న గురూజీగారు, చుట్టువుట్టిన మొగలుసైన్యమును ఎదరించుటకుగాను ఎనిమిది, ఎనిమిది మందితో, గ్రూపులు, గ్రూపులుగాచేసి కోటలోని ఒక్కొక్క గోడవద్ద నిలబెట్టినారు. మిగిలిన యోధులను, సమిష్టిగా(ఉమ్మడిగా)వుంచారు. అందరిని బాణములతో పోరాడవలయునని ఆజ్ఞాపించారు. దీనికి నాయకత్వము నిఘాయిసింగ్ వహించారు. గురుజీ అనుయాయులైన వీరు ప్రతి సూక్ష్మవిషయమును గురూజీగారికి చెప్పుచుండిరి. నిఘాయిసింగ్ తమ్ముడు, పినతండ్రి, చెల్లెలు కుమారుడు అందరూ గురూజీసైన్యంలో ఉండిరి. ఈ యుద్ధంజరుగుచున్నప్పుడు మొగల్ జనరల్ అయిన సహోసఖాన్, మరియు ఖాజామహ్మద్ తరఫున ఒకదూత పత్రము తెచ్చి గురూజీగారికి ఇచ్చారు. ఆదూత గురూజీగారితో ఈవిధంగా చెప్పినారు.

నన్ను నీవుచంపకపోతే, నేను ఏ షరతు లేకుండగానే నీ స్వాధీనమౌతాను. నియంత అయిన తుచ్ఛమైన మొగలుసైన్యము యొక్క సేనాధిపతికి విరోధికాను. అయితే పాపం, అజేయుడుకాని ప్రఖ్యాతిచెందిన మొగలుచక్రవర్తులు, హితంకోరినవాడు, విశ్వరక్షకుడుయని చెప్పుకొనుచున్న ఔరంగజేబుకు విరుద్ధంగా కానిపనులను పట్టుకొనుట పిచ్చివాని లక్షణము. అతను శత్రుత్వమును నిలుపుకొంటే బాగుండును, మరియు ఇందువలన కలుగు దర్మసిద్ధాంతము నుండి, విముక్తి పొందుటకు వీలుకలుగుచుండెను.

ఆజానుబాహుడైన యువకుడు, సాహేబ్‌జాదా అజిత్‌సింగ్, ఆ మొగలు దూతను ఉద్దేశించి, మేము దూతలనుసంహరించం. ఇంకేమైన ఉండినచెప్పుము. ఆయావిషయములను, సహచరులకు తెల్పుతాము. ఆరాత్రి తుఫానుగాలి రాకముందుగా, చల్లనిగాలి వచ్చినట్లుగా, ఇరువైపుల సైనికులు, అతిజాగ్రత్తగాను, శాంతముగాను ఉండిరి. అయితే మొగల జనరల్, వారి అధిక సంఖ్యలోఉన్న సైన్యమునుచూచి గర్వించుచుండిరి.

మరుసటిరోజు మొగలుసైనికులు, యుద్ధంచేయుటకు సన్నద్ధమగుచుండిరి. వందలాంటి ముఖ్యసైనికులను ముందుభాగములో ఉంచి, కోటగోడలచుట్టూ మోహరించారు. యోధులు యుద్ధ సూచన కొరకు ఎదరు చూచుచుండిరి. అల్లహోఅక్బర్ అనుశబ్దం ఆకాశమునంటుచుండెను. కోటగోడలకు నిచ్చెనల సహాయంతో ఎక్కుచుండిరి. ఇక్కడ గురూజీసైనికులు, వారిసైన్యమును తుదముట్టించుటకు, గురువు ఆజ్ఞకై ఎదురు చూచుచుండిరి, మొగలులు మనకు శత్రువులుకాదు అనుకొన్నలోపునే వాహే గూరూజీగారికి జయము కలుగవలయునను ఉద్దేశ్యముతో వాహేగురూజీ జిందాబాద్ అని ముక్తకంఠముతో చెప్పుటవలన ఆ శబ్దమునకు ఆకాశం దద్దరిల్లినది.

కోటపైనుండి వచ్చుచున్న బాణముల సముదాయము, కోటనుఎక్కుచున్న శత్రు సైన్యములను క్రిందకుకూలత్రోస్తున్నవి. ఎంతోమంది తమప్రాణములను కోల్పోవుచున్నారు.

అనేక సైనికులు గాయపడ్డారు. గురుజీసైన్యం యొక్క బాణముల ధాటికి, మొగలు సైన్యములు నరకయాతన అనుభవించి, భయపడి వందలాది మొగలు సైనికులు వెనక్కిమళ్లారు. మొగలు సైనికులలోని కొంతమంది ముఖ్యులు. ఇదివరలో ఆనందసాహేబ్‌కోటను ముట్టడిచేసిన విధంగా, మరోసారి ముట్టడించుటకు ప్రయత్నించారు. మరీ ఇంకా ఎక్కువ సంఖ్యలోసైన్యం దూసుకొనివచ్చింది. కానివారిలోకొంతమంది సైనికులు, తిరిగి ముట్టడించుటవలన అపారమైన సైనిక నష్టం జరగగలదని, యుద్ధం వెంటనే నిలుపుచేయవలయునని సూచనలు ఇచ్చారు. గురువుసైన్యములయొక్క బాణములధాటికి మొగలుసైనికులకు పూర్వకాలంలో మహాభారతయుద్ధంలోని, కర్ణుడు, అర్జునుల బాణధాటిని స్మరింపచేసినవి.

మొగలు సైన్యంయొక్క పరాభవమునకు రెచ్చిపోయిన జనరల్ సహాసఖాన్, ఎక్కువమంది సైనికులతో మరోమారు, కోటనుముట్టడించమని ఆజ్ఞాపించాడు. మొగలుసైన్యం సహసఖాన్ మరియు ఖాజామహమ్మద్ ముందుకు దుకారు. దీనిని కనిపెట్టిన గురూజీసైన్యం వారికి ఎదురు సమానులుగా నిలిచారు. ఈ యుద్ధంలో గురూజీ తానే స్వయంగా కదనరంగంలో దుకారు. సామ్రాజ్య షాహి, సహస్‌ఖాన్‌ను చంపి, ఖాజామహమ్మద్‌ను గాయపరచి తనయొక్క సాహసమును, శౌర్యమును ప్రదర్శించారు.

గురూజీయొక్క బాణము వారికి తగలి, వారిని గాయపరచి, వారి ఆయుధాలను స్వాధీనంచేసుకొన్నారు. వెంటనే ఖాజామహమ్మద్ ప్రాణభీతితో దగ్గర ఉన్న ఒకఇంటిలోదూరి ప్రాణరక్షణ చేసుకొన్నాడు. దీనినిచూచిన మొగలుసైనికులు, భయకంపితులైనారు. ఏవిధంగానైన కోటను వశపరచుకొనవలయునని, తను ఒక ఇంటిలో దాచుకొన్నప్పటికి, తన కోపాగ్ని మాత్రం వీడలేదు.

మొగలు సైన్యమును దూరంగా యుంచవలయునని బంజారాయోధులు ఒక ఉపాయమును కనుగొన్నారు. ఇద్దరు, మరియు ఐదుగురితో జట్లు జట్లుగా ఏర్పడి, కోటలోపలినుండి బాణముల వర్షం కురిపించారు. ఈవిధంగా వారియొక్క శక్తిని ప్రదర్శించడంజరిగినది. మొదటిగ్రూపునకు నాయకత్వంవహించిన భాయికృపాసింగ్, భాయిఅవిన్‌సింగ్, సింహగర్జనచేస్తూ పోరాడుచుండిరి. మొగలుసైనికులు మూగపోయినారు. సుమారుఒకగంట వీరు వీరోచితంగాపోరాడి వారి ఖడ్గములు నేలరాలేవరకు, వందలాదిసైనికులు వారి ఖడ్గములకు ఆహుతైనారు. రక్తం ఏరులైపారినది. ఈదృశ్యమునుచూచిన మొగలుసైనికులు భయభ్రాంతులైనారు. కోటను శులభముగా జయించవచ్చుననివచ్చిన మొగలుసైనికులు తమప్రాణమును అరచేత పట్టుకొనవలసివచ్చినది. ధర్మయుద్ధంనుచేసిన వీరు యుద్ధంలో వీరమరణం పొందారు. బంజారాలైన(లబాణా) అనిక్‌సింగ్, బహురూపియా, తన సోదరుడు బజ్‌కర్‌సింగ్‌లు భయంకరమైనయుద్ధంచేసి వీరస్వర్గంపొందారు. ధర్మంఅంధకారంలో మొగలుసైనికులు మునిగిపోయారు. తమకఠినమైన హృదయములు, వారిధాటికి, ఆగలేకపోయినవి.

రెండవవర్గం అయిన బంజారా(తాండా) భాయిఅజిత్‌సింగ్, లబానా, భాయిధనసింగ్ మరియు ధియాన్‌సింగ్ మొదలగువారు భయపడక తమకుడిచేతిలో ఖడ్గం, ఎడమచేతిలో డాలునుధరించి, వీరావేశముతో సింహగర్జనలుచేస్తూ శత్రువులను తమఖడ్గములతో

ముక్కలు ముక్కలుగాచేసారు. ఈభయానకమైన నరశింహుల పోరాటంచూచిన, మొగలుసైనికులు, ఆశ్చర్యముతో భయకంపితులై నారు. వారు శత్రువునోటపడకముందే తమఖడ్గములను వందలాది మొగలుసైనికుల రక్తంతో దాహం తీర్చి స్వర్గస్తులై నారు. వీరస్వర్గం పొంది చరిత్రలో అమరులైనారు.

తరువాత గురూజీగారి ప్రీతిపాత్రుడైన మఖన్‌సింగ్ తనుఒక్కడే సైన్యంలోదూకి పోరాడుతాననికోరాడు. తానుఒక్కడేచాలాసేపు మొగలుసైన్యముతో ఎదురొడ్డిపోరాడినారు. దీనినిచూచిన ఖాజామహమ్మద్, లక్షలమందిసైన్యంఉన్న ఒక్కసింగ్‌గారిని చంపుటకుచేతకాలేదా? అని అరుస్తున్నారట.

వేలసంఖ్యలో ఆయుధాలుధరించి పోరాడూతున్న వీర పరాక్రమవంతుడైన సింగ్ ముందు నిరుపయోగమైనవి. ఇతను చనిపోయేవరకు ఈ వీరుని ఎవ్వరు ఎదురించలేరు అని నిశ్చయించారు. గురుజీ సైన్యంలో ఏదోఒకశక్తి దాగిఉన్నదిఅని మొగలుసైనికులు ఆశ్చర్యపడినారు.

ఐదుగురు చొప్పున గుంపులుగలిగిన వీరి సైన్యం అదే విశ్వాసంతో శత్రు సైన్యంపైపడి చివరికి వీర స్వర్గం పొందినారు. ఆ సమయానికి గురూజీ సైన్యంలో సగం మంది సైనికులు స్వర్గస్తులై వీర మరణం పొందారు.

గురూజీ మరియొకపుత్రుడు సాహేబ్‌జాదాఅజిత్‌సింగ్ తానొక్కడే ఈ మొగలుసైన్యమును ఎదరించగలనని చెప్పినది విని, సంతోషముతో గురుజీ, కర్తవ్యనిష్టులైన ఓపుత్రుడా! ఒకయోధుని, ధర్మమేమంటే యుద్ధమును స్వాగతంపలకి, జయమునో లేక వీర స్వర్గమునోపొందుట వీరునియొక్క లక్షణం, ఆవిధంగా వీరుయుద్ధములుచేసారు. ఈవిధంగా వీరావేశముతో పోరాడి సముద్రంలాంటి మొగలు సైనికులను తుద ముట్టించి, మూడవ , వీరమరణంపొందినారు. అప్పటికి గురూజీకుమారుడు వీర స్వర్గం అలంకరించాడు. మరియొక పుత్రుడు నేనొక్కడినే శత్రుసైన్యమును తుదముట్టిస్తాను అనిఅడిగారు, వారిని అశీర్వదించి యుద్ధమునకు పంపించారు. అతని జతలో లక్కిషాబంజారా పుత్రుడు జవహారసింగ్, దీయాన్‌సింగ్, బీర్‌సింగ్, మరియు సాహేబ్‌సింగ్ యుద్ధమునకు బయలుదేరారు, వీరి యుద్ధమునుచూచుటకు స్వయంగా గురూజీ ఎత్తైన ప్రదేశములో చేరినారు. అక్కడ శత్రుసైనికుల(మొగలు) కమాండర్లు, గురూజీయొక్క కుమారుడు, ఆయన తరపువారి శౌర్యమునుచూచుటకు, తమకు అనుకూలమైన ప్రదేశమును ఎన్నుకొన్నారు.

గురూజీ కుమారుడు, వారిసహచరులు సింహగర్జనలుచేస్తూ శత్‌శ్రీఅకాల్ మరియు గురూజీకి ఫతేఅని గర్జించిరి. శత్రుసైన్యమును ఒకచోటినుండి మరిఒకచోటికి తరుముకుంటూ పోయి వారిని సంహరించారు. భాయిసంతోష్‌సింగ్ అను అతను, గురుకుమారుని పోరాటంచూచి ద్వాపరయుగంలో వీరాభిమాన్యుడు పద్మవ్యూహంలో పోరాడిన విధంగాయుండెను అని వర్ణించినారు. యుద్ధంలో సాహేబ్‌సింగ్, జవహరసింగ్(బంజారా) వారి వీరత్వమును, శక్తి సౌర్యమును ఎదుటి సైన్యంవారు ప్రసంశించినారు. వీరువందలాది శత్రుస్యైమును వధించారు. కొందరు శత్రువుల శరీరంబాణములతోను, కత్తులతోను

నిండియున్నదట, లక్కిషాబంజారా పుత్రుడు విధిముందు తలవంచవలసివచ్చినది. నవాబ్ అన్వర్‌ఖాన్ చూస్తుండగానే ఈ ఆఖరి వీరుల ఇద్దరి ఖడ్గములు ముక్కలైనవి. అప్పుడు అన్వర్ ఖాన్ వెంటనే వారిద్దరి తలలను ఖండించండి అని అరచాడు. వెంటనే గురూజీ కుమారులు ముక్కలైన ఆ కత్తితోనే అన్వర్ ఖాన్‌ను చంపి వేశారు.

14 సంవత్సరముల వయస్సున్న గురూజీ మూడవ కుమారుడు జోరావర్ సింగ్ యుద్ధమునకు సిద్ధమైనాడు. ఈ విషయం విన్న గురూజీ సంతోషించి వాయు గురూను పాటలు పాడుతూ ప్రార్థన చేశారు. చిన్న వయస్సులో ఉన్న గురూజీ కుమారుడు గొప్పవారై, యుద్ధ నైపుణ్యం కలిగిన యుద్ధ వీరులకన్న తక్కువేమియు కాదు. ఈ బాలుని వీరత్వమునకు ఎందరి కంఠములో వీరి కరవాళమునకు నెలరాలాయి. వీరు మృత్యువాత పడువరకూ ఎందరో మొగలు సర్దారులను సంహరించాడు. ధర్మము, న్యాయము కొరకు తన కుమారులను, తన సోదర బంధు–మిత్రులు ప్రాణ త్యాగము చేసినందుకు గురూజీ ''వాయిగురూ''ను ప్రార్థించాడు. సూర్యాస్తమయమునకు యుద్ధము ఆగి పోయినది.

గురూజీ సలహాదారుడైన భాయి దయాసింగ్‌జీ శత్రుకోటను ఈ రాత్రికే స్వాధీనం చేసుకొందామని సలహా ఇచ్చారు. అందుకు గురూజీ ఒప్పుకొలేదు. అంతలో మిగిలిన ఎనిమిది మంది గురూజీ వద్ద చేరి ''ఖాల్సా, వాయిగురూ''నే వారి గురువనీ వారందరు ఒప్పుకొనుటకు నిర్ణయించారు. అప్పుడే ''ఖాల్సా, వాయిగురూ'' అని ఒప్పుకొన్నారు. వారి ఆజ్ఞలను శిరసా వహించి పాలించవలయునని, అయితే ఆ కోటను వదలి పెట్టి యుద్ధమును ముందుకు సాగించాలని తీర్మానించి, గురూజీ గోవిందసింగ్‌ను మనం తక్షణం కోట ఖాలీ చేయవలయునని కోరారు. అదృష్టవశాత్తూ బ్రతికిన ఎనిమిది మందిలో భాయి ధర్మసింగ్ కుమారుడైన సంగత్‌సింగ్‌గారు, గురు హరగోవిందసింగ్‌వారి ఆశీర్వాదంతో జన్మించారు. ఇతను తన తండ్రి కూడ గురూజీగానే ఉన్నారు. బాబా లక్కిషా లభానాల తమ్ముడు, బాబా సంగత్‌సింగ్‌లను గురు స్థానంలో కుర్చుండపెట్టి గురూజీ యొక్క అధికారమును వారికి వొసంగి, గురూజీని కోట వదిలిపెట్టవలయునని చెప్పారు. ఈ విషయం తాము కోట వదలిపెట్టిన తరువాతనే శత్రువలకు తెలియవలెనని ఆజ్ఞాపించారు.

మొదట నిర్ణయించిన ప్రకారం భాయి సంగత్‌సింగ్‌గారిలాగానే, నలుగురు యోధులకు వేషం వేసి కోట నాలుగు దిక్కుల నిలిపి శత్రువులు వచ్చిన వెంటనే యుద్ధం చేయండని తెలిపినారు. గురూజీ మొదలుకొని మిగిలిన ముగ్గురు వీరులు కోట బయటకు వచ్చి, సిక్కు గురు వెళ్ళిపోవుచున్నారు పట్టుకోండి! పట్టుకొండి! అని ముందుకు పరిగెత్తారు. అదే సమయంలో మొగలు సైన్యం యొక్క బాణములు కోట వైపుకు రావటం ప్రారంభమైనది. ఆ సమయంలో ఆకాశం మేఘావృతమై, ఉరుములతోను, మెరపులతో వాతావరణం భూమిని తాకుచున్నది. ఆ మెరుపుల వెలుగులలో మొగలు సైన్యం కోటలో దూసుకొని వచ్చి చూడగ గురూజీ కూర్చొన్న స్థానంలో భాయీ సంగత్‌సింగ్‌ను చూచి గురుగోవిందసింగ్‌గారే ఉన్నారని భావించారు.

ఈ సన్నివేశమను చూచిన మొగలు సైనికులు వారి సైన్యాధిపతులకు తెలుపుటవలన నిజగురువు తన సహచరులతో కోటనుండి బయటపడుటకు అనుకూలమైనది. ఆ రోజు చీకటి పడుటవలన వారు యుద్ధమును నిలిపి మరసటి రోజు కోటలోనికి ప్రవేశించి. గురువేషంలో

ఉన్న సంగత్‌సింగ్ మరియు వారి అనుచర్యులను సంహరించిన తరువాత వారికి నిజం తెలిసి నిరాశ చెందినారు.

అయితే నిజమైన గురువు తప్పించుకొని పోయాడని, ఆశ్చర్యమును పొందారు. ఈ విధంగా ఛాంకోర్ సాహేబ్ యుద్ధం చరిత్రలో ఎక్కినది. ఈ యుద్ధంలో ఏడు మంది లబానా వీరుల శక్తి సామార్థ్యములు బంజారా సమాజమునకే గర్వకారణం. సిక్కుల గురువైన గురుగోవిందసింగ్ నాయకత్వంలో, వీరోచితంగా పోరాడి తాత్కాలిక స్థానము అలంకరించి ధర్మాన్ని రక్షించుటకై పోరాడిన విషయం గూర్చి అందరు గర్వపడవలసిన విషయం. ఈ విధంగా వీరు ఛాంకోర్ యుద్ధంలో ప్రసిద్ధిగాంచారు.

# గురుద్వారా నాందేడ్

పై విధంగా గురుగోవింద్‌సింగ్ మధ్య భారతం మరాట్‌వాడ నాందేడ్‌లో సిక్కు మతాన్ని స్థాపించారు. వారికి మధ్యభారతంలోని బంజారాలు బాగా తోడ్పడినారు. గురుగోవిందసింగ్‌గారు నాందేడ్‌లో నిర్యాణమైనారు. వారి సమాధియే ఈ నాడు నాందేడ్‌లోని గురుద్వారం. వారి సమాధి పై వారు ఉపయోగించిన ఖడ్గములను గడ్డి వామిలాగ పది ఘనపుటడుగుల (10X10X10) ఎత్తులో పరచి ఉన్నారు. నా మహారాష్ట్ర మైసూరు పర్యటన కాలంలో 1973 ఫిబ్రవరి నెలలో ఈ గురుద్వారాను దర్శించటం జరిగినది. అక్కడ బంజారా సిక్కు మఠం ఉన్నది. ప్రతి సంవత్సరం సుమారు 400 వందల మంది బంజారాలు సిక్కు మతంను స్వీకరిస్తుంటారని, బంజారా సిక్కు తెల్పి ఉన్నారు. ఆ మఠంలో బంజారా సిక్కులు సగ భాగం పైన ఉన్నారు. వారు గురువుగారి సేవను చేస్తున్నారు.

గురుగోవింద శిష్యులలో ఒకరు లోకామసంద్‌గారు వీరు మహబూబ్‌నగర్ జిల్లా కోసగిలో నిర్యాణమైనారు. వారి పేర ఒక మఠం ఉన్నది. గురులోకా మసంద్‌గారు చాలా శక్తిగలవారు. వారు ఒకనాడు కరంతోట్ గోత్రీయులు ఉన్న బంజారా తాండాను దర్శించారు. అప్పుడు ఆ కరంతోట్‌వారు లోకామసంద్‌గార్ని హేళన చేస్తూ, నీ శక్తిని ప్రదర్శించు అని, ఒక పరీక్ష పెడతారు. వారు ఒక కట్టెల కాష్టమును తయారుచేసి దానిని అంటించి లోకమసంద్‌గారిని అందులో పారవేస్తారు. ఆ మంటలలో కాలి భస్మమైన లోకమసంద్ తిరిగి ప్రత్యేక్షమై వారికి శాపమును ఇస్తారు. మీరందరు ఎన్నటికి కలసి ఉండరు. మీరు ఊరికి ఒకరిద్దరుగా చెల్లా చెదురై పోతారు. మీ అన్న తమ్ములలో ఒకరికి ఒకరు పడదు. మీరు పైకి ఒకరికొకరు అన్నతమ్ములుగా నటించినను మీరు ఎన్నటికి ఒకరుకారు అని శపించారు.

# హత్ దేస్ పణన్ - జాత్ మత్ దేస్

# 400 సంవత్సరాలనాటి చరిత్ర చెప్పిన సత్యం

400సం. పూర్వం ఎప్పుడు యుద్ధం, యుద్ధం. ఎల్లప్పుడు యుద్ధమే, రాణా ప్రతాప్‌సింగ్‌రాథోడ్‌గారి ఆధ్వర్యములో ఎల్లప్పుడు, మేవాడరాజ్యమును స్వాధీన పరచుకొనుటకు నిరంతరం యుద్ధంచేస్తుండేవారు. ఆఖరులో మొగలుసైన్యమును తుదముట్టించి, కొద్ది కొద్దిగా మేవాడరాజ్యములోని ప్రాంతములను శత్రువులబారి నుండి రక్షించి, రాణాప్రతాప్ సింగ్ రాథోడ్‌గారి ఆధీనంలో తెచ్చుకొన్నారు. అయితే చిథోడ్ రాజ్యమును(కోటను) మాత్రం శత్రువుల బారీనుండి విడిపించలేక పోయారు. ఈవిషయంలో రాణాప్రతాప్‌సింగ్‌రాథోడ్ చాలాసార్లు దుఃఖమును అనుభవించారు.

అప్పుడువారు నిస్సహాయులుగాఉండిరి. యుద్ధాలు చేసిచేసివారి శరీరం అలసిపోయిఉండినది. వారుదృఢచిత్తము కలిగినవారైఉండిరి. ఒకరోజు వారి ఆరోగ్యము ఎక్కువగా క్షీణించుటవలన రాణాప్రతాప్‌సింగ్‌రాథోడ్‌గారికి అనిపించింది, ఇకనేను చాలాకాలం జీవించలేను అని. మృత్యుశయ్యపై ఉన్న తనుతన వద్ద నిలబడిఉన్న కుటుంబసభ్యులను, దర్బారులో ఉన్నవారిని మరియు రాజపుత్రవీరులను ఒకట్రస్టుగా ఏర్పాటుచేసి, గంభీరమైన స్వరముతో చెప్పారు.

ఇప్పుడు నేను వెళ్ళుచున్నాను. నా కోరిక మాత్రంనిలబడి పోయినది, చిథోడ్ కోట కూడా నాచేతిలో వచ్చిఉంటే ఎంతో బాగుండేది. నా జీవితలక్ష్యం నెరవేర లేదు. నాకు చాలా అసంతృప్తిగాఉన్నది. అని చెప్పుచూవారికన్నులు శాశ్వతంగా మూతపడినవి. 350 సం తరువాత: విదేశి దాస్య సుఖములతో భారతదేశమువిముక్తి అయినది. దేశములో ప్రజాతంత్రం స్థాపించబడినది. మరియు ఒకరోజు "చిథోడ్ జై, మేవాడ జై, రాణాప్రతాప్‌సింగ్‌రాథోడ్ జై! అంటు గగనంమిన్నంట్టునట్లు జైజైలు ప్రకింటిచారు. వేలమంది స్త్రీలు, పురుషులు, పిల్లలు, ఎడ్లబండ్లపై ప్రజలు, దూరదూరప్రాంతములనుండి వస్తూఉండిరి. ఆరోజు ఒక చారిత్రాత్మాకమైన సమా వేశములోఒకగొప్పకార్యక్రమము చేపట్టవలసిఉండెను.

ఈ ప్రారంభోత్సవమునకు, ప్రజలుహృదయాలను చూర గొన్న వ్యక్తి శ్రీ నెహ్రూజీగారు చిథోడ్‌కోటపై కీర్తి స్తంభముపై రెపరెపలాడే భారతజాతీయ జెండానీడలో చిథోడ్ రాజపుత్రుల వంశీయుల ప్రతీకగా, వారిగౌరవమును పెంపొందించే విధంగా, ఆనాటి రాజపుత్రులు రాణాప్రతాప్‌సింగ్‌రాథోడ్ మృత్యుశయ్యపై ఉన్నప్పుడు, వారుప్రతిజ్ఞచేసిఉండిరి. ఏమనగా చిథోడ్‌కు ఎప్పటివరకు స్వాతంత్ర్యంలభించదో, అప్పటివరకూ, వారువారి యొక్క అన్నిసుఖములను త్యాగంచేస్తాము అని ప్రమాణంచేసిఉండిరి. అనగా ఈ దేశం సర్వ స్వాతంత్ర్యం అయ్యేవరకు చిథోడ్ కోటలో కాలు పెట్టమని, కఠిన నేలపై పవళిస్తామని, చుట్టుగుడి సెలలో కాపురంచేస్తామని, మూకట్లలో భోంచేస్తామని ప్రమాణంచేసి ఉండిరి. ముందువచ్చే రోజులలో రాజపుత్రులు "గథలియాలోహార్" బంజారా అను పేరుతో ప్రసిద్ధులుఅయినారు.

# గదలియా లోహార్ బంజారాలు

నాల్గువందల సంవత్సరముల పూర్వపువమాట, హల్దిఘాట్‌మైదానంలో అక్బరుపాదుషాగారి శక్తివంతమైన సైన్యంతోపోరాడి పరాజితులైన మహారాణా ప్రతాప్‌సింగ్‌రాథోడ్ ప్రమాణం చేసిఉండిరి. ఎప్పుడైతే మనం స్వాతంత్రం మరియు గౌరవమును తిరిగి సంపాదించుకోలేమో, అప్పటివరకు చిథోగడ్‌లో కాలుపెట్టము అని నిర్ధారించుకొన్నారు. మహారాణా ప్రతాప్‌సింగ్‌రాథోడ్ సైన్యము మరియు చిథోడ్ రాజ్యంలోని ప్రజలు శపథం తీసుకొనిఉండిరి. వారిలో ఇప్పటిగదలియా లోహార్ బంజారాల పూర్వీకులు కూడా ఉండిరి. ఎడ్లబండ్లనే తమ ఇల్లుగా చేసుకొని సంసారం చేస్తు గడచిన నాల్గువందల సంవత్సరములనుండి జీవనంచేస్తూవచ్చారు. వీరి పూర్వికులు చిథోడ్‌గడ్ సైన్యమునకై యుద్ధపరికరములను తయారుచేసేవారు. ఇప్పుడువారు గృహోపకరములైన పనిముట్లను, వంటపాత్రలను తయారుచేస్తారు.

ఇప్పుడువారు అధికసంఖ్యలో ఉన్న గదలియాలోహార్ బంజారాలు ఎక్కువగా రాజస్థాన్‌లోనే నివసిస్తున్నారు. వారు సంచారం చేస్తుపనిచేసేవారు ప్రస్తుతం పంజాబ్, హరియానా, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ, గుజరాత్, మహారాష్ట్ర వరకు వ్యాపించిఉన్నారు.



(గదలియా లోహారు బంజారా కుటుంబము)

మార్పు చెందుతున్న కాలమునుబట్టి వీరి పూర్వీకులు పరాధీనంచేయబడిన చిథోడ్‌కోటలో కాలుపెట్టం అని ప్రమాణంచేసిన దానితో పాటు మరి నాల్గు ప్రమాణలు చేసిఉండిరి. 1 ఏదోఒకచోట తిరుగడం. 2 బావినుండి నీళ్లతోడుటకు తాడును ఉపయోగించం. 3 రాత్రిపూట దీపం వెలిగించం. 4 మంచములపై పడుకోము, ఆశ్చర్యకరమైన విషయమేమంటే, వీరు ఇప్పటివరకు ఈ శపథములనే పాటించుచున్నారు. వీరు స్వహస్తాలతో తయారు చేయబడిన ఎద్దుల బండ్లు ఎప్పుడు ఊరిబయటనే నిలచిఉండటం చూస్తాము. ఈ ఎద్దులబండ్లు వీరి వాహనము మరియు ఇల్లు కూడాను.

మొగలుల శాసనం పోయినది, ఇంగ్లీష్‌వాళ్లు వాచ్చారు. ఐతే మాటలకు కట్టుబడిఉన్న వీరు పూర్వీకుల ప్రమాణములను పాటించుతూనే ఉండినారు. దేశం స్వాతంత్రం పొందినది. అయితే వీరు ఈ విషయములను అర్థం చేసుకోలేదా? దేశ స్వాతంత్రముతోపాటు. చిథోడ్‌గడ్ స్వాతంత్రం పొందలేదా? తర-తరాలనుండి వస్తున్న వీరి జీవన విధానం అలాగే ఉన్నది. స్వాతంత్ర్య దేశం ప్రగతిపథంలో నడుస్తున్నది. కానీ ఈ గథలియ బంజారాలు ఈ రహస్యంనుండి దూరంగానే ఉన్నారు. గ్రామాలలో విద్యుచ్ఛక్తి వచ్చింది, కాన వీరి ఎద్దులబండ్లు నిలిచియున్న ప్రాంతంలో మాత్రం దీపం వెలగదు. ఇనుమును వేడి చేయుకొలుములలోని నిప్పు మాత్రమే వీరికి వెలుగు.

అక్కడక్కడ స్కూళ్ళు తెరవటంజరిగినది, కానీ వీరిపిల్లలకుచదువు అబ్బటంలేదు. వీరికి ఇనుపకొలములు ఊదేది, ఇనుమును సుత్తులతో కొట్టేవిద్య మాత్రమే అబ్బుచుండినది. పట్టణములబయట డేరాలువేసుకొని నివసించేరోజులలో కూడ, వీరు ఆధునికయుగంలోని అభివృద్ధిని చూస్తూకూడ ముందుకు రావటం లేదు, సంతోషించటం కూడలేదు.

వీరు రాజస్థానంలోని కొన్నిప్రాంతంలలో వీరిపై ప్రభుత్వదృష్టి పడినది. అయినా వీరు ముందుకురావటంలేదు. మన ప్రధానమంత్రి పండిత్‌జవహర్‌లాల్ నెహ్రూజీగారు వీరి విషయంలో ఆలోచించారు. వారు వీరి గూర్చి, ఆశ్చర్యం చెందుతూ తనహృదయం బాధపడింది. వారు చెప్పారు ఈ బంజారాలకు తెల్పండి మీ చిథోడ్‌కోట స్వాతంత్రంపొందినది అని, వారు ఈ స్వాతంత్ర దేశములోని నాగరీకులు ఇప్పుడు వారు సంచారం చేయుటం మాని వేయవలయును. వారు సంస్థను స్థాపించారు. అఖిల భారతీయ గదియాలోహార్ సంఘం. అది, 6వ తేదిన ఏప్రిల్ 1955 సంవత్సరంలో చిథోడ్‌గడ్ కోటలో గదలియాలోహార్ అఖిల భారతీయ సమ్మేళనం జరిగినది. పండిత్ జవాహర్‌లాల్‌నెహ్రూగారి ఆధ్వర్యంలో వారు చిథోడ్ కోటలో ప్రవేశం చేసారు. మరియు జనవరి 1956లోనే చిథోడ్ కోటలో గదలియా బంజారా తాండాను కట్టుటకు ప్రారంభించారు. దీని తరువాత కాన్‌పూర్, అజ్‌మీర్, జోద్‌పూర్, బికనిర్, పాలి, నాగోర్, పుష్కర్, కృష్ణాగడ్, మేడత్, సౌజత్ మరియు బ్యావర్‌లో తాండాలను నిర్మించే కార్యక్రమం చేపట్టారు. వారికి అనిపించింది, నాల్గువందల సంవత్సరముల సంచార జీవనం తరువాత 25వేల కుటుంబీకుల జీవనం స్థిరం చేయుటకు ప్రారంభం అవుతున్నది. వారు ఈ కార్యక్రమము చేపట్టుటకు ప్రారంభం జరిగినది. కాని వారు ఈ కార్యక్రమం చేపట్టుటకు కూలి తీసుకొనకుండానే పనిచేస్తామని చెప్పి చేసారు. వీరికి ఆర్థిక సహాయం చేయబడినది, వీరికి ఋణములు ఇచ్చినారు. వారికి శ్రద్ధ కూడ ఉండినది. ఈ గదలియా లోహార్ పునర్ నివాసానికి, మొత్తం కార్యక్రమంతో పాటు, వీరు నిర్మించిన తాండాలు, భవంతులు లాగ అగుపిస్తున్నాయి.

ఈ కార్యక్రమం ప్రకారం మొదటిలో రాజస్థానలో గదలియా లోహార్ బంజారాల 600మంది కుటుంబాలకు అభివృద్ధి పరచుటకు మొదటి కార్యక్రమమం తీసుకొన్నారు. వారు మొత్తం రాజస్థాన్‌లో ఉండేవారు కాదు. మహారాష్ట్రములోని అమరావతి, కసచే నుండి కూడ వచ్చియుండిరి, రాజస్తాన్‌లోని గదలియా లోహార్‌వారు, చిథోడ్ యొక్క స్వాతంత్ర్యమును వారు అంగీకరించలేదు.

ఈ ప్రశ్న లేవటం స్వభావ సిద్ధమైనది. ఈ మొత్తం కార్యక్రమం యొక్క విఫలంనకు కారణం ఏమైఉండును? అయితే ఈ కార్యక్రమము అత్యావస్యకత అన్నిటి కన్నముందు, దాని తత్వమును, దాని యొక్క ఫలం పొందక పోవటం, రెండవది, ఏ విధంగా అయితే దీనిని(జరగకుండా) ప్రతి బంధకం చేయడం జరిగినది. అది సరియైన పద్ధతికాదు. గదలియాలోహార్ వారి తాండాలు గ్రామాల సరిహద్దుకు బయటనే నిర్మించడం జరిగినది. అందువలన పూర్వ కథయే ప్రారంభమయ్యే అవకాశములు ఉన్నవి(అందులో మార్పు ఏముంటుంది) వీరు గ్రామ ప్రజలతో కలసి పోయే అవకాశం ఉన్నటువంటి పనులు ఏమియు జరుగలేదు. మరియు వీరికి గ్రామ ప్రజలకు ఎటువంటి సంబంధంలేదు. కావున వారితో మనకు మనతో వారికి ఏమి ప్రీతిభావం ఉంటుంది, వందల సంవత్సరములనుండి గడుపుకొంటువచ్చిన జీవనమునకును, ఇప్పటి జీవితంనకు ఏమి మార్పుఉన్నది, అని వారిమనస్సులలో మెదలసాగినది. వారు కట్టిన ఇళ్ల కప్పు ఎప్పుడైన మన శిరస్సుపై పడవచ్చును.

ఈ భావంవారి చరిత్రలోనే ఇమిడిఉన్నది. వారి జానపదలలో ఈ విషయం గూర్చి పాడటం జరిగినది. అందువలననే కదా రాజ్యం వదలి,ఈ తిరుగుబోతు సంచార జీవనం జరుగుచున్నది. అది ఒకశాపమై మనపై కూర్చొనిఉన్నది. ఈ యుద్ధాలు చేసి, చేసి మన భార్యలు సతీ అయినారు. వారి శాపం మనకు తగులుతుంది అని వారు అంటున్నారు(సతీ=సతిసహగమనం) అందువల్లనే రాజస్థానంలోని గదలియా లోహార్ బంజారాలు, చిథోడ్ కోటలో నివసించుటకు ఇష్టపడలేదు. అసలు ద్వార ప్రవేశమునకు కూడ ఇష్టపడలేదు. అప్పుడుకొన్ని కట్టిన కట్టడాలను కూడ పడకొట్టారు. అప్పుడు వారి ఆశయాలు, మార్పు చెందలేదు.

ఈ గదలియాలోహార్ బంజారాలు చిన్నచిన్న గుంపులుగాఉండి జీవనం సాగిస్తుంటారు. ఈ గుంపులు వారి వారి కట్టుబాట్లలోఉండి తమ జీవనం సాగిస్తున్నారు. వారు వారి వారి పనులను, పంచుకొని పనిచేయటం ప్రారంభిస్తారు. చాలా శ్రమించి పనిచేస్తారు. ఇదే వారికి బాగా అనిపిస్తుంది. వారు తయారు చేసిన పనితనంను చూచి, వెంటనే బజారులలో అమ్ముడుపోతాయి. వీరు స్థిరత్వమైన పనులు, ప్రామాణికమైనవి కావున, విఫలం, నిరాశకు తావే ఉండదు.

ఇంకొక విషయం కూడ విచారించవలసి ఉండను, ఏవిధంగా అయితే వీరి స్థిర నివాసమునకై ఎర్పాట్లు చేసారో అదే విధంగా వీరి జీవన భుక్తికై వ్యవసాయం పరిశ్రములను స్థాపించి, జీవనోపాది కల్పించగలిగి ఉండవలెను. అప్పుడు ప్రభుత్వంవారు చేపట్టిన కార్యక్రమం సఫలమయ్యేడిది.

ఈ విధంగా గదలియా లోహార్ బంజారాల పునర్ వాసమునకై ఎర్పాటు చేసిన కార్యక్రమము విఫలమైనది. వీరి ఎడ్లబండ్ల చక్రాలు, తిరుగుతూనే ఉన్నవి. సురక్షతకు

బదులువారు నీలిఅకాశం నీడలోవారి జీవనం జరుగుచున్నది. పక్కా ఇళ్ల కన్నా వారికి సంచార జీవనమే బాగున్నట్లు భావిస్తునారు. వ్యవసాయంలో నాగలి పట్టి నడిచేకన్న వీరు లోహమును కొలిమిలో కాచి రక రకాల ఆయుధాలు, గృహోపయోగములైన వస్తువులు తయారు చేయటానికి చాలా ఇష్టపడతారు. కాని ప్రభుత్వం వీరి అభివృద్ధికై ఏదైన ఒక కార్యక్రమమును చేపట్టి వీరి అభివృద్ధికి పాటు పడదా? అవుతుంది. కాని ఎప్పుడౌతుంది??

# జంగి-భంగి

**నైజాం రాజ్యంలో బంజారాల ప్రాముఖ్యత :** మరాట్‌వాడ మరి బిరార్ ప్రాంతంలోని రాథోడ్ వంశము బంజారాలు-హైద్రాబాదు ప్రాంతంలోని జాదవ వంశము వడతియా బంజారాలు విస్తరించిఉండిరి. ఈ రెండు ప్రాంతంలోని బంజారాలు షాజహాన్ చక్రవర్తికి గౌర్నర్ యిబన హాసఫ్‌జా సైన్యములకు ఆహార పదార్థములు యుద్ధ సామాగ్రులను వారికి సమకూర్చుచుండిరి. వీరు 1630 సంవత్సరములో ఉత్తర భారతమునుండి మధ్యభారతములకు తరలివచ్చారు. రాథోడ్ గోత్రమునకు చెందిన జంగి-భంగిగారి నేత్రుత్వములో 1,80,000 వేల ఎద్దులపై తమ 'లదణి'(బిడారి) వ్యాపారమును సాగిస్తూ వచ్చారు. వీరు మొగలు సైనికులకు ఆహార ధాన్యములు మొదులుకొని అన్ని రకాల యుద్ధ సామాగ్రిని వీరికి అందించుచుండిరి. అలాగే జాదవ వంశీయులైన వడతియా గోత్రమువారు భగవాన్‌దాస్ నేత్రుత్వంలో మరియొక బిడారి వ్యాపారస్థులు వీరి సైన్యమునకు అన్ని రకాల అవసరములను సమకూర్చుచుండిరి. ఈ రాథోడ్ గోత్రమువాళ్ల హసిఫ్‌జాకు అనుకూలముగాఉండి మంచి సహకారమును అందించుచుండిరి. అందువలన వారికి షాజహాన్ చక్రవర్తిగారు ఒక తామ్రపత్రం సువర్ణ అక్షరములతో లిఖింపబడిన ఒక శాసనమును వీరికి ఇవ్వడంజరిగినది. దీనికి తోడు ప్రతి సంవత్సరం'ఖిల్లత్' అనగా బహుమానమును కూడ ఇస్తుండిరి. ఆ రాగి శాసనమునందు ఈ క్రింది విధంగా లిఖించ బడిఉన్నది

''రంజన్‌కా పాని, ఛప్పర్ కా ఘూస్।
దిన్ కా తీన్ ఖూని మాఫ్ ॥
ఔర్ జహాఁ ఆసఫ్‌ఖాన్ కా ఘోడా।
వహాఁజంగి-భంగి కా బైల్'' ॥

అర్థం : జంగి-భంగి, రాజ్యములో నిర్భయంగా ఉండవచ్చును. వారిని ఎవరూ అడ్డగించరాదు. వారి గోవులకు అధారమైన నీటివసతి గడ్డి వసతి సంపూర్ణముగా కలగి ఉంటారు. అలా అడ్డగించినవారిని వారు అవసరమైతే రోజుకు మూడు ఖూనీలు చేసినను ఎటువంటి విచారణ ఉండదు. అంతకు మించినప్పుడే విచారించివలెను. ఎక్కడైతే హాసిఫ్‌జా గఱ్ఱం ఉంటుందో అక్కడక్కడ జంగి-భంగి వారి ఎద్దులు ఉండును. అని అర్థము.

ఈ విధంగా జంగి-భంగి బంజారాలు నైజాం రాజ్యంలో అధికారంను పొంది ఉండిరి మరియు గోల్‌కొండ కోటయందు వీరి కొరకై ఒకప్రత్యేక ద్వారమును కూడా ఎర్పాటు చేసారు. ఆ ద్వారామునే బంజారా ద్వారము అని పేరు పెట్టినారు. ఇప్పటి వరకూ ఆ ద్వారమును

బంజారా ద్వారము అంటారు. ప్రస్తుత, హైద్రాబాద్‌లోని బంజార హిల్స్ అని చెప్పుకొనుచున్న కొండ ప్రాంతమంతయు వీరు తాండాలను నిర్మించుకొని తమ గోవులకు ఆహారము నీటివసతిని కలిగి ఉండిరి. అందువలనే బంజారా హిల్స్ అని పేరు నిలచిపోయినది. కానీ బంజారాలు మాత్రం లేకుండ చేసారు. ఆ ప్రాంతమంతయు ఇప్పుడు ఉన్నత శ్రేణి ప్రజలకు ఒక విలాసవంతమయిన ప్రాంతంగా తయారైయినది.

ఆ కాలంలోనే జాదవ్ వంశస్థుడైన వడతియా గోత్రంలోని ముఖ్యులు శ్రీభగవాన్‌దాస్‌గారు నవాబ్‌గారి వద్ద పోయి తాము కూడ జంగి-భంగి లాగనే ఆహార పదార్థములు మొదలుకొని యుద్ధసామాగ్రిలను అందిస్తున్నాము. కావున మాకు ఒక తామ్ర-పత్రమును ఇవ్వవలయును అని కోరారు. అందుకు నైజాం నవాబుగారు ఇచ్చుటకు అంగీకరించలేదు.

అప్పుడు భగవాన్‌దాస్‌గారు జంగి-భంగి కారణంగానే తమకు నవాబుగారు తామ్ర-పత్రం ఇవ్వలేదు అని గ్రహించి జంగి-భంగి నవాబు దర్బారునుండి కోట బయట వచ్చు సమయమును కాచి తన సైన్యముతో పోయి జంగి-భంగిలను చంపివేస్తారు.

ఇది తెలుసుకున్న భంగి కుమారులు నారాయణ భంగి వందలాది మంది తన సైన్యముతో భగవాన్‌దాస్ వడతియతో యుద్ధం చేస్తారు. అప్పుడు భగవాన్‌దాస్ సైన్యము వీరి సైన్యముకన్న ఎక్కువ ఉండుటవలన నారాయణ భంగి వారి మొత్తం సైన్యమును సంహరిస్తారు మరియు వారి వద్ద ఉన్న సువర్ణాక్షరములతో లిఖించబడిన తామ్ర-పత్రమును వారి హస్తగతం చేసుకొంటారు.

# సౌరాష్ట్రసుందరి గణగోర్
## (గణగోర్ సంగీతంలోని ఆంతర్యం)

''యారో కాయి-కాయి-రూప్ బఖణోరమా-బాయి సోరట్‌దేశే ఆయియే!

నర్మాదా ఘాటీ ప్రాంతంలో బంజారాల ఎద్దుల రణగొణధ్వనులు(రంకెలు) మరియు పై తెల్పిన జానపద గీతాల మధురిమలు, ఎల్లప్పుడూ వినిపిస్తూ ఉండేవి. ఆనాటి యుగంలో, ఈనాడు ఉన్నటువంటి సౌకర్యాలు, సాధన సంపత్తులు గల సౌకర్యములు లభించేవికాదు. అయినా బంజారాలు మరియు వారి ఎద్దులు వాణిజ్య పరమైన వ్యాపారం, మరియు సాంస్కృతిక చైతన్యం కలిగి ప్రాచీన కాలంనుండి తమ జీవితంలను సార్థకం చేసుకొంటూ వస్తున్నారు. వారు సత్యంలో కేవలం దేశంలోని మధ్యభాగము నుండివారి వృత్తి ధర్మమును మొత్తం భారతంలోకాకుండ ''పఠాన్'' పటానులు ఉండేవరకు(ఆఫ్ఘనిస్తాన్) పోవుచుండిరి, మరియు అక్కడినుండి వస్తువులను తీసుకొని వస్తుండిరి. ప్రజలు వీరి యాత్రల సహకారంతో, తీర్థ యాత్రీకులు విద్యాభ్యాసం కొరకు పోయినవారు. ధర్మమును ప్రచారం చేయువారు, సందేశములను తీసుకొని పోయేవారు వీరికి విజ్ఞానమును ధర్మమును అక్కడివారి ఉదారస్వభావమును, దేశము దృష్టితోపాటు సందేశాత్మకభావములు కలిగిఉండిరి. ఇప్పుడు ఇవన్నియు పోయినవి. స్వార్థం ''ప్రవాసియులతో మిత్రత్వం'' వాస్తవంగా నర్మదా

ఘాట్‌లో( ప్రాంతంలో) నిస్వార్థమైన మార్గమును పూర్వమునుండి కాపాడుచుండిరి. ఈ సందర్భములో మహాభారతంలోని ''అరణ్య పర్వమందు'' ''నలోపాఖ్యానం'', నందలి దృష్టాంతమును తెల్పడం జరిగినది, ధీనులైన నల ధమయంతులు, నలదమయంతితో నలుడు అన్నారు కదా! ఓ యశష్యణి( ఓపవిత్రురాలా) నేను చాలా హీనదశలో ఉన్నాను. నీవు నా మాట వినుము ఈ మోసము నాతోకాదు ఈ మార్గం చాలా కష్టంతో కూడుకున్నది. ఇది విదర్భదేశమునకు పోవుమార్గం. ఇది అవంతీపురం, వింధ్యాచల్ మరియు తపతి నదిని దాటి విదర్భకుపోతుంది అయితే కాలక్రమములో నలమహారాజు దమయంతిని ఒంటరిగా వదలిపెట్టి పోవడంవల్ల దమయంతి ఈమార్గంగుండ కాకుండ వేరే మార్గం అనగా కౌశల దేశం మార్గం పోయినది దమయంతి యొక్క ఈ దుర్గమమైన మార్గం యొక్క వర్ణణ ఈ విధంగా చేప్పడంజరిగినది.

దమయంతి సోకసముద్రములో మునిగి, గిరిదేవతలను, వనదేవతులను, నదీ దేవుతలు మొదలగువారిని స్మరణచేసుకొంటూ దీనావస్థలో, విలపిస్తూ ప్రయాణం ప్రారంభించింది. మార్గ మధ్యంలో ఆమెకు ఒక గొప్ప మహానీయుడు కనిపించాడు వారికితోడు వేదమంత్రములను పటించువారు, బ్రాహ్మణులు, వాణిజ్య యువకులు, సత్యవీరుడు అనేక మంది పదాతిదళం, వారితో పాటు ఏనుగులు, ఎద్దులు, గుఱ్ఱములు, ఒంటెలు, గాడిదలు మరియు అన్నిరకాల పశువులుకూడా ఉన్నవి.

''మహాసత్య విండ్యాటవి'' వింధ్యాచలంలోని కీకారణ్యముల మధ్య నది ఒడ్డున ప్రయాణము సాగిస్తున్న 14దేశాలకు రాజధాని ''మహిష్మతి నగరం'' చేరుకొన్నారు. అక్కడ రాజమాతగారు దమయంతిని చూసారు తమవద్ద ఉంచుకొన్నారు. దమయంతి రాజకుమారి సునందని తోడుఉండటానికి నిశ్చయించుకొని ఆమె సైరేంద్రి కార్యము చేయుటకు( అనగా రాజకుమారిని అలంకరించే పని) ఒప్పుకొని ఆమె వద్ద ఉండిపోయినది.

ఉపశ్చర్యల వర్ణనతో స్పష్టంగా అర్థమయినది ఎమంటే ఒక మార్గమైన యమునా నది దక్షిణాప్రాంతమునుండి బయలుదేరి బేతవా(నేత్రావతి)నదిని దాటి దట్టమయిన అరణ్యములు దాటి నర్మదానది ప్రవాహ ప్రాంతము మీదుగా చేరి చేంది దేశము ( దీనిని అక్కడక్కడ అనుపదేశం, అని కూడా అంటారు) చేంది దేశములోని రాజధాని మహిష్మతి వరకు పోతుంది. ఇది మరియొక వేరు ప్రముఖ మార్గం ఇది విధీశ, దశపూర్, అవంతి మీదుగా వచ్చి ఇందులో కలిసి పోతుంది. మరియు ఈ మార్గం నర్మదాతోపాటుగా సౌరాష్ట్రమువైపు వెళుతుంది. ఇది సుప్రసిద్ధమైన చరిత్రాత్మకమైన సత్యమార్గం. ఇది యమునానదికి దక్షిణ పశ్చిమ ప్రాంతములో తపతినది, విద్యారణ్యం నర్మదా, మహిష్మతి మరియు భూగృకక్షతో కలుపుతూ ఉన్నది. నలదమయంతి ప్రాచీన గాథతో ముడిపడిఉన్నది. ఇది ఇతర కథలకు కూడ సాక్ష్యంగా నిలచినది.

పురాణకాలమునుండి ''మహిష్మతి నగరం'' యొక్క పూర్వ వధువులు మరియు ఆ ప్రాంతానికి దగ్గరలో ఉండే గ్రామాల ఆడపిల్లలు ఒక విధమైన దృశ్యమును చూచినట్లుగా వారి నిశ్చలమైన మనస్సులలో ఆనందమయమైన సమయంలో వారి మనస్సులోదాగిఉన్న ప్రజలజీవితమును రంజింపచేసే జానపదాలను పాడుకుంటూ వాటిని అమరత్వం చేసినారు( మరచిపోకుండా).

సౌరాష్ట్రమునుండి(గుజరాత్)వచ్చిన ఒక చిన్న గుంపు(సిపాయిలు) మహిషమతి పట్టణములలో, నర్మదానది ప్రాంతంలో నివశించారు. ఈ గుంపునుండే ముందు ముందుగా గఱ్ఱముపై కూర్చున్న ఒక కాంతివంతుడైన(అందమైన) రాజపుత్రుడు, వారితో పాటు తోటి రాజపుత్రులు యవ్వనులైన గుజరాతి స్త్రీ–పురుషులు స్వజనులతో సహా, వారితో పాటు ఒక అలంకరించబడిఉన్న రథములో కూర్చొని ఉన్న అతి సుందరమైన అనూబాయి–సౌరాష్ట్రము యొక్క ''గణగోర్'' ఆమె యొక్క రూపమును వింద్యా పర్వత ప్రాంతములోని అన్ని దిశలు ఆశ్చర్యములో మునిగి ఉండినది.

## జానపద సంగీతంలో అనుపమానమైన సౌందర్యంలో వర్ణన

లమాణి (లంబాడి) జానపదలు ఈ ''గణగోరి'' యొక్క అనుపమానమైన సౌందర్యమును గూర్చి ఈ రోజుకూడ పాడుకుంటారు.

''యారే కయీా- కయీా రూప్ బఖణా రమా బాయి!
సోరట్ దేస్ సే ఆయి యే!
యారి అంగఢాయి మూంగని సోగలాయి రమా బాయి!
సోరట్ దేస్ సే ఆయి యే!

సోరట్ (సౌరాష్ట్రం–గుజరాతు)దేశమునుండి వచ్చిఉన్న ఓ గుణసుందరి రమాబాయి, నేను నీ రూపమును ఏ విధంగా పొగుడుదును. మీ యొక్క చేతి వ్రేళ్లు పెసరకాయల పచ్చని నలుపు విధంగా పొడవుగాను మరియు సున్నితంగాను(నాజూకుగా) ఉన్నవి. నీ యొక్క ముఖం సూర్యునికన్నా కాంతివంతంగా ఉన్నది. కన్నులు నెమలి పింఛములా ఉన్నవి. (పెద్ద, ఆకర్షనీయంగాను, కాంతి వంతంగాను ఉన్నవి)

గణగోరి యొక్క సౌందర్యము నిశ్చయంగా నభూతో నభవిష్యతి అన్నట్లుగా ఉన్నది.(భూ మండలంలోనే సౌందర్యవతిగా ఉన్నది అంటున్నారు. ఇంత గొప్ప సౌందర్యము యొక్క కారణం తోనే 'గణగోరి' గూర్చి జానపద గీతములు అమరులగుటకు వీలుపడదు. ఆరోజు ఆసుందరీమణి సాగనంపటం మరియు దాని తరువాత జరిగినసంఘటన మాత్రంతోనే, వనంలో, నివసించే ప్రజలను ఆంధోళనలో ముంచినది.

ఈ సుందరిని సాగనంపటం అనేది, అవసరం రెండుసార్లు జరిగియుండవచ్చును, మొదటిసారి అమె నవ వధువు రూపంలోను, అత్తవారింటికి పోవునపుడు, లంబాడా జానపదగీతం, రెండవసారి ఈ విధమైన దృశ్యము అయిఉండును.

సోనా రూప కా గడ గడిలా
రేసం లంబే డోర్, హే ఝూలరియేద.

(సుఖం, దుఃఖంలో) సోనే–చాంది అనగా వెండి–బంగారముతో నిండియున్న(ఘడ) కుండలు ముందున్నవి, వాటిని పొడవైన పట్టుదారంతో పేనిన తాళ్లతో కట్టబడియున్నవి. మరియు గంగా, జమునా, కావేరి మొదలగు నదుల యొక్క పవిత్ర జలములతో అవి తొణకుతున్నవి. పుత్రీ మిమ్ములను పిలుచుకొని పోవుటకు(మొదటసారి) మీ యొక్క మామగారు వచ్చి ఉన్నారు. దీవి ఉదాహరణంగా చిన్న పిల్ల అయిన పెండ్లి కుమార్తె ''గణగోర్''కథను చెపుతూంది. తండ్రిగారు ఈ ఆభరణములను తిరిగి వెనక్కి పంపించివేయండి ఇప్పడేకదా పూలమతితో

ఆట్లాడుకొనటలోనే నా హృదయంనిండలేదు ఇక్కడ ఈ సంభావన ఉంచే యోగ్యతా ఉన్నద, అయితే నాల్గవ నెలలో మామిడి చెట్లు చిగురించువేళలో మామిడి తోపులో పూలమతి ఆట్లాడుకొనుటకు పోవును ఆ తరువాత నాల్గవ నెలలోని క్రొత్త దంపతులైన కన్యలకు కలపటము జరుగుతుంది దానిని నివాడిలో''చేత్యాఅణా'' అంటారు రెండవ ప్రక్క మూడవసారి''గౌనేలో'' పెండ్లి కూతురు యొక్క బావ మరియు మరిది తీసుకొనువచ్చుటకు వెళతారు కానీ ప్రతిసారి బాలిక పెండ్లికూతురు వారిని వెనక్కి పంపమని చెపుతుంది. ఆఖరికి వెళ్ళక తప్పదు ''గౌణతేర్ రాజ'' వారి విషయంలో చెప్పడం ఎమనగా ''హడారావ్'' గారుని బ్రహ్మచారిగ ఉండిపొమ్మను. ఇప్పుడు పూలమతి ఆడుకొనవలెను అను విషయమును మరచి కొన్ని గంభీరమైన మాటలు చేప్పడం జరిగింది. ఎలా అనిపిస్తుందంటే ఈ మాటలు గణగోరి యొక్కవేరు విధంగా జ్ఞాని పలుకులు పలికింది అప్పుడు వారు ఒక సారి అత్తవారిఇంటికి పోయి తిరిగి తండ్రి ఇంటికి వచ్చి(పుత్రుడు పతికొరకు) సంతోషంతో ఉండెను. ఈ అంశములో నేను మొదటి మాటగా స్పష్టమవుతుంది. సౌరాష్ట్రదేశంలో ఈ ''హడాయే'' కులంలో వివాహమైనది. ''హడావో'' రాజ్యంలో చేరుటకుగాను యమునానది దాటి పోవలసి ఉన్నది. మరియు దాని ఒడిలో ఒక బాలుడు కూడా ఉండెను. ''నిమాడియ ఝూలరియా'' అను పాట యొక్క అంకమును ఇక్కడ పాడటం జరిగినది.

బేటి మహోరి చవతాజ్ అణసే ధనితార్ ఆయో!
హోసంలో ఘోడో లాయో!
హే ఝూలరియా దే !
పితాజి అబకో అణ ఫిర్‌హే ద!
వే ఆయి ఖోలి లేవా పునపాతి !
హే ఝులరియో ద !
బేటి మహోరి హడరావ్ కో కుమార్ హటిలే ఉ !
నీ పాచ జాయో!
హే ఝులరియో ద!
పితాజి జల్ జమునా కో కాళోపాణి దేకిన్.
డర్ లాగ.
హే ఝులరియో ద. !

''నిమాడి'' గణగోర్ (ఝూలరియ) గుంపుగా ఉన్న వీరంతా దేవకన్యలు. దీనికి రెండు కారణాలుఉన్నవి ఒకటి ఏమనగా 9వ రోజు గణగోరి వ్రతం సమాప్తం అయినప్పటిది. రెండవది పెండ్లి అయిన బిడ్డను సాగనంపేటపుడు ప్రసంగిచటం(చేప్పటం) ఇది కేవలం తన తల్లి–తండ్రికే కాదు మొత్తం ప్రజల నేత్రుత్వంలోఉండును. ఎవరైతే ఎక్కువ దూరంలో ఉన్న ''హడావ్'' అనే వంశములో వ్యాపించిన ప్రకారం ఎప్పుడు అత్తవారి ఇంటినుండి తిరిగిరాదు. ఈ విధమైన దుర్ఘటనకు స్పష్టంగా ఎదురు తిరుగేది, ఈ జానపద గీతంలో లేదు. అయితే తెల్పటం(మార్గం) ఇక్కడ అక్కడ నిండుగా ఉన్నవి. ఆ కన్య పోతు పోతు తండ్రికి ఈ విధంగా చెపుతుంది. ''జలజమునా కాలాపాణిదేకన్ డర్‌లాగ'' అనగా జమునా నదినందలి నల్లని నీటిని చూచి భయం వేస్తుంది ఈ దుర్ఘటన పాలుకావడం రణుభాయికే కాదు, ఆడపిల్లలకే కాదు, కొంత కొంత పెద్దలకు కూడా పూర్వమునుండి అదే విధంగా వస్తున్నది. గణగోరిని సాగనంపి తిరిగి ఇంటికి

వచ్చు సమయంలో మనస్సులో అందోళన కలుగుతుంది. నేను స్మశానమునుండి తిరిగి ఇంటికి వచ్చాను అని అంటారు. కుటుంబములో అయితే గణగోరి యొక్క పెద్ద అక్క పోతుందో వారి కుటుంబ సభ్యులు యొక్క మనోవేదన, రథాన్ని నడిపి ఇంటికి వచ్చినప్పుడు ఏ విధంగా ఉంటుందో ఆ రోజు కూడ ఆవిధంగానే ఉంటుంది. గణగోరి రథమును సాగనంపి ఇంటికి వచ్చే సమయంలో ఏర్పడే ఒక కన్య(కావచ్చు) ఆమె చిన్న తనంలో జతలోనే లేక స్నేహితైరాలై) అప్పుడు చాలా దుఃఖించుతుంది ఆమె దుఃఖమును చూచి(ఆమె మనస్సు మార్చటానికి) తల్లి అంటుంది. ఈ రోజు అందమైన బిడ్డ(బిందియా) లేనందున ఎంత సందడి లేకుండా నిర్మానుష్యంగా ఉన్నధి. బిడ్డ వేసుకున్న సొమ్ములు చాలా అందంగా మెరుస్తుండెను ఆమెను సాగనంపేటప్పుడు అక్కడ ప్రజలు వదలటంలేదు అయితే ఈ రోజు సొమ్ములు గూర్చిన విషయముతో మనస్సు ఆనందంగాలేదు.

**గణగోరి పూజ యొక్క వివరణ :** ఈ దుర్ఘటనకు ముందు కాని, తరువాత కాని చర్చ ఈ విధంగా చెప్పటం జరిగినది. దాని స్వరూపం ఏమైయున్నది. దీనిపై అనుమానం చెందుటకుగాను ఇంతమాత్రం సందేహం చాలు. ఎందుకనగా గణగోర్ యొక్క పూజలు గుజరాత్, నిమడ, మాలవా మరియు రాజస్తాన్‌లలోని అనేక ప్రాంతంలో చేస్తున్నారు. కాని, కోట బింది ప్రాంతంలో చేయరు. చెప్పడమేమనగా ''హడాకో'', కులంలో ''గణగోరి'' పూజలు చేయరు. ప్రజలు చెప్పుకోవటమును బట్టి ''హోడవే డుబయే గణగొరి'' కొంతమంది చెప్పటం (హడానే లేడుచి గణగొరి, ఏమనగా ఏదో ఒక నౌకా దుర్ఘటనలో హడరావ్‌తను క్రొత్తాగా పెండ్లి చేసుకొన్న పెండ్లి కుమార్తె గణగోరి, చిన్న కుమారునితో పాటు నీళ్ళలో సమాది అయినారు.(నీళ్లలో పడి చనిపోయినారు)

అత్తగారింటికి పోయినబిడ్డ సమాచారం ఏమి తెలియలేదు. అందులోనూ ఎంతో దూరం పెండ్లి చేసుకొని పోయిన బిడ్డ సమాచారం ఆ రోజులలో సంవత్సరాల కొద్ది తెలిసేది కాదు. చైత్రమాసం మళ్లీ వచ్చింది. పూల మొగ్గలలో మామిడి పిందెలు ప్రారంభమైనవి మరియు అమాయకులైన గ్రామములోని ఆడపిల్లలు మామిడితోపులో ఫుల్‌మతి ఆట ఆడుకొను సమయంలో ఒక అమ్మాయి వారితో పాటు నవ్వుతూ ఆడుకొంటూ ఉంటుంది, ఉన్నట్లుండి కనుపించకుండా పోతుంది. ఈ అమ్మాయి వారి ఊరి అమ్మాయి కాదులేక తెలసిన ప్రక్క గ్రామం అమ్మాయి కూడ కాదు, లేదా వారిలో ఎవరికి పరిచయంలేదు. ఒకరోజు వారిలో ఒకరు పెద్ద మనిషి అయిన కన్య పూల్‌మతి ఆట పూర్తి ఆయిన తరువాత ఆమె చెయ్యి పట్టుకొన్నది. ఆమెతో తన పరిచయం అడిగింది. తన ముఖంలో ఆశ్చర్యం వేసింది. వెంటనే ఆమె తన చెయ్యిని విడిపించుకొని తన నియమమును ధిక్కరించి పూల్‌మతి ఆడుకొనుటకు వచ్చినది. చేయిపట్టుకొని ఉన్న అమ్మాయి చేతినుండి తన చేయిని జారవిడపించుకొని తన దేవి రూపమును కొంత దూరం పోయి చూపించినది అప్పుడు ఆ అమ్మాయికి అభయమిస్తూ తన యొక్క వాస్తవమైన విషయమును తెల్పినది. దానితోపాటు ఈ విధంగా చెప్పినది. ''ప్రతి సంవత్సరం నాల్గవ మాసంలో మీరు(గ్రామంలోని ఆడపడచులు) కన్యలు పూల్‌మతితో ఆడుకుంటాను'' అన్నారు. అప్పుడు ఆడపిల్లలందరు మొండిపట్టు పట్టి దేవి మా పై దయయుంచి మాతో పాటు మా ఊరికిరండి మరియు మా కుటుంబీకులకు కూడ దర్శనం ఇవ్వండి ''దేవి చెప్పినది'' స్వర్గలోకంలో నా తండ్రి నాకై ఎదురు చూస్తుండవచ్చును, అందువలన ఈ

సమయంలో నేను ఇక్కడ వుండుట మంచిది కాదు. ఈ భూ భాగంలో ఎన్నో పిత్రు గృహాలు ఉండవచ్చు. అందువలన మి కుటుంబమునకు, ''బిడ్డ-అల్లుడు రూపంలో నాల్గవ మాసంలో మా యొక్క ఆహ్వానం చేయండి'', మేము ప్రతి సంవత్సరం మీ వద్దకు వస్తాము. ఆ పిల్లలు తమ ఇండ్లకు పోయి ఈ విషయం తెల్పిరి. మరియు గణగోర్ సంవత్సరం ప్రారంభమైనది. ప్రతి సంవత్సరము వసంతం వస్తుంది. వసంత పంచమి మొదలుకొని రంగపంచమి( హోలి) వరకు వసంత్సోవం సమాప్తంవరకు, చైత్రకృష్ణ పంచమికి హోలికి ముందు చలి ప్రారంభంతో మొదలౌతుంది. హోలి యొక్క చల్లని బూడిదతో పాటు గ్రామంలోని బాలికలు కొన్ని ప్రత్యేకమైన గడ్డి మొక్కలను తీసుకొని వస్తారు. ఆ గడ్డి పరకలను బిల్ పత్రంతో వుంచి గోర్(గడర్) నిమాడి భాషలోగౌర్ శబ్దం అర్థం(సఖి-సవేలి) అనగా తన ప్రియమైన స్నేహితురాలు లేక తన జతలో ఉన్న అమ్మాయిని ప్రతిష్టించబడుతుంది. తన ''గౌరీ'' తోడుగా అమ్మాయిలందరు తమ గ్రామంలో ఉన్న మామిడి తోపులో ఆడుకొనుటకు పోతారు. వారికి మామిడి కాయలు బైరానే అనిపించుతుంది. అంతలో దేవి మామిడి చిగురులతో పుల్‌మతి ఆడుకుండుంది. తిరిగి ఇళ్ళలో వెదురుతో చేసిన చిన్న చిన్న బుట్టలలో మట్టిపోసి జొన్నలు మొలకెత్తిస్తారు. దానినే గణగోరి బుట్ట అని చెపుతారు, దాని తరువాత పిండితో గణగోర్ మరియు గణయార్ రాజుల బొమ్మల తయారు చేస్తారు. వాటిని రథాలు అని చెపుతారు, వీటిని జొన్నలు మొలకెత్తిన బుట్టలలో ఉంచుతారు. అఖండ సౌభాగ్యవతి, పుత్రవతి, రమాబాయి తమ తండ్రి సూర్యునితో పాటుపిత్ప గృహమునకు వస్తుంది. మరియు తొమ్మిది రోజులు ఉండి మొత్తం తన ప్రజలతో కలసి, నవ్వుతూ మాట్లాడి పూజలు చేస్తున్న పుణ్య స్త్రీలకు శుభములను చేకూర్చి, సౌభాగ్యవతులుగా ఉండునట్లు దీవెనలు ఇచ్చి చైత్రశుక్ల తృతియనాడు ఝులరియా పాటలు పాడుకుంటూ సాగనంపుతారు. చైత్ర కృష్ణ దశమి నుండి తొమ్మిది రోజుల వరకు జరుగు ఈ వ్రతము ద్వారా నిమాడ్ యొక్క సంపూర్ణ గ్రామములో గౌణగోరి గూర్చిన పాటలు చాలా ఆహ్లాదకరంగా ఉంటుంది. రణగౌణ ధ్వనులతో వంచి గౌరవముతో బంధువులు, అల్లుడు- బిడ్డతోపాటు ''ఆమెకు సంబందించిన, అత్తమామల ఇంటినుండి వచ్చిన వారు చేసే మర్యాదలనుండి ఎవరికైన లోటు జరిగిందేమో అని జాగ్రత్తగా చూసుకుంటారు. ఈ వ్రతకాలంలో అల్లుళ్ళను చాలా సంతోష పెట్టవలెను, వారు అలగకుండా చూడవలెను. అర్థం ఎందుకనగా సూర్య భగవానుడే మనకు అల్లుడైయున్నాడు అందువలన మనం వారిని ఆనందంగా ఉన్నట్లు చూడవలయును, మనం అల్లుని రూపంలో సూర్యభగవానుని ప్రార్థించుచున్నాము. ఎనిమిదవ రోజు గణగోరితో పాటు 'ధనియా రో రాజా' ను రథంలో కూర్చోబెట్టి, దూరంవరకు తీసుకొని పోతారు మరియు తిరిగి గృహానికి చాలా వినయంతో పిలుచుకొని రావలయును. మరి ఒకరోజు ఉండి రేపు పోవుచ్చును అని నచ్చ చెప్పి ఆపుకొనవలయును. ఈ విధంగా ఈ వ్రతమును చేస్తారు.

ఇది ఎంతో ఆశ్చర్యకరమైన విషయం. మనదేశంలో ఎంతో గొప్ప సంస్కృతిని ఆచరించుచున్నాము. ఇది మన సాంస్కృతిక కార్యక్రమములలో ఒకటిగా ఆచరించబడుచున్నది. పూర్వ కాలంలో తల్లిదండ్రులు తమ బిడ్డలను ఎంత శ్రద్ధగా ''తల్లీ'' అని తరతరాల నుండి పిలువబడుచున్నది. ఆదిశక్తిని తొమ్మిది రోజుల వ్రతం పేర తమ బిడ్డగా భావించి, చాలా ప్రేమతో ఇంటిలో ఉంచుకొని కన్నీటితో సాగనంపే ఒక సాంప్రదాయమును పాటించుతూ వస్తున్నారు.

# భగవాన్ శ్రీ సేవాలాల్
# బాలబ్రహ్మచారి జీవిత చరిత్ర

జై జగదంబా దేవి, జై సేవాలాల్ మహారాజ్, జై రామారావు మహారాజ్.

రాథోడ్‌వంశం; రామావత్ గోత్రం, శ్రీ రాంజీనాయక్‌గారికి ముగ్గురు కుమారులు 1. శ్రీ భీమానాయక్, 2. శ్రీ సామనాయక్, 3. ఖీమానాయక్. వీరు తమ బిడారులను నడుపుచున్న కాలంలో ఆంధ్రప్రదేశ్, అనంతపురం జిల్లాలోని గుత్తి తాలూకా, గుత్తి కోట ప్రాంతంలోనివసించారు. శ్రీ భీమానాయక్‌గారికి మొదటి సంతానం. గుత్తి కోట-రామచంద్రకొండకు మధ్యలో ఉన్న చౌడేశ్వరీ కొండ పాదంలోని తాండా. శ్రీ భగవాన్ సేవాలాల్ మహారాజ్ 1741లో జన్మించారు.

శ్రీ భీమానాయక్‌గారి ధర్మపత్ని ధర్మణి యాడికి చాలా కాలం వరకు సంతానం కలుగలేదు. అందువలన భార్యాభర్తలు ఇద్దరు చింతాగ్రస్తులై ఉండిరి. ధర్మణియాడి ప్రతివ్రతా శిరోమణి, తన భర్త భీమానాయక్‌తో తనకు సంతాన ప్రాప్తి కలిగించమని వేడుకుంటుంది. ఆమెను ఓదార్చుతూ తన సంతాన ప్రాప్తికై ఘోర తపస్సు చేస్తారు.

ఏడు (వీరికి సాత్ భవాని) మంది దేవతలు ప్రత్యక్షమై తన కోరికను అడుగుతారు. నాకు పుత్ర బిక్ష పెట్టమని వేడుకొంటాడు. దేవి నీకు పుత్ర సంతానం ప్రాప్తిస్తుంది. కానీ, నీ మొదటి కుమారుడు సేవాలాల్‌ను 12సం వయస్సు అయిన తరువాత మాకు ఇచ్చి వేయవలయును అని తెల్పినారు. ఆవిధంగా ఒప్పుకొని తన తాండాకు వస్తారు. జరిగిన విషయం ధర్మణియాడికి తెల్పుతారు. కొద్ది రోజుల తరువాత ధర్మణియాడి గర్భం ధరిస్తుంది. 15-2-1741న సోమవారంనాడు శ్రీ సేవాలాల్ మహారాజ్‌ను జన్మనిస్తారు. ఆ తరువాత వారు తమ బిడారులతో కర్ణాటక రాష్ట్రములోని శివమొగ్గ ప్రాంతమునకు వెళ్ళిపోతారు. 6 నెలల ప్రాయంలో ఉన్నప్పుడు బాలుడు కొండమిద గుడిలో చౌడేశ్వరి మాతతో ఆడుకుంటూ వుండేవాడట. ఒకరోజు తండ్రి కనుగొనగా, మేము రోజు ఆడుకుంటాము అన్నారట. శ్రీ భీమానాయక్‌గారికి 4 కుమారులు సేవాలాల్ మహరాజ్, బద్దునాయక్, హపా నాయక్, భానా (పూరా) నాయక్.

సేవాలాల్ గోవులను కాచే టప్పుడు అన్నం వెంట తీసికొనిపోయేవాడు కాదు. ఒక వేళ తన తల్లి బలవంతంగా కట్టిచ్చిన ముద్దను గోవులకు తినిపించేవాడట. ఆకలి అయినప్పుడు బంకమట్టిని రొట్టెలుగా చేసి తినేసేవాడట. సేవాలాల్ ఎల్లప్పుడు భజన చేస్తుండేవాడు. రాళ్లను పళ్ళెములుగాను( కంచుపళ్ళెం శబ్దం) మోతుక ఆకులను తాళములుగా చేసి భజనచేసేవారట. శ్రీ సేవాలాల్ మహరాజ్ 12న వయస్సు వస్తుంది. దేవి ప్రత్యక్షమై భీమానాయక్‌ను తన మొదటి సంతానమైన శ్రీ సేవాలాల్ మహారాజ్‌ను పంపమని కోరుతుంది. కాని సేవాలాల్ దేవి వెంట పోవుటకు సమ్మతించక తన తల్లిదండ్రుల సేవ చేసుకొనవలయునని మంకు పట్టుపడతాడు. ఎంత చెప్పిన వారి వెంట పోలేదు.

చాలా కష్టాలపాలై తిండికి కూడ కరువై సేవాలాల్ మహారాజ్ తల్లిదండ్రులు రెండు రొట్టెలు కూడా దొరకకుండా ఉంటారు. మరియు వీరు కొన్ని రోజులు కొండ గడ్డిని కోసి దానిని అమ్ముకొని జీవనం చేస్తారు.

కరలరే భాయా భగతి మారి ।
కరూ కచనేరి కాయా తారి ॥
అన్ ధనేరి భరూ కొటడి ।
ఛో మీనార్ వగం కియూఁ ।
రణ, వేర్ తోజితన్ లాయూఁ ।
ఢిల్లీ ఆగ్ర నామ్ చలాయూఁ ॥
మారి భగత్ కర్‌ల సేవా భాయా

అర్థం:- ఓ సేవాదాస్, నీవు నన్ను పూజించు, నేను నిన్ను సంపదలో ముంచి వేస్తాను. నిన్ను ధన ధాన్యములతో తులతూగినట్లు చేస్తాను. ఇంతేకాదు. ఓసేవాదాస్ నేను నిన్ను ఆరు నెలల ముందే ఏమి జరిగేది ముందుగానే తెల్పుతూ ఉంటాను. ప్రతి కష్టములోను(యుద్ధం) ప్రతి సందర్భములోను నీకు విజయమును కల్పించుతాను మరియు ఢిల్లీ-ఆగ్రాల వరకు నీ పేరు వచ్చేటట్లు ఢంకా మ్రోగిస్తాను. అందుకని ఓసేవాదాస్ నీవు నన్ను శరణు వేడుకొనుము.

సేవాదాస్ దేవి యొక్క ఆదేశమును ఖాతరు చేయలేదు. అధ్యాత్మిక చింతనతో చూడగలిగితే ఇది ఒక విధంగా దేవి మరియు భక్తుని మధ్య విరోధమును కల్పించుచున్నది. అయితే ఇది అటువంటి విరోధము కాదు. సేవాదాస్ చెప్పినది ఏమనగా '' హే జగదంబా! నేను నిన్ను భక్తితో పూజించుతాను! నీ శరణు కూడ పొందుతాను, కానీ నీవు పూజలో బలికోరుతావు. అది నేను ఇవ్వలేను. హేమా నీవు ఈ భూమండల మంతటికి తల్లివి. అయితే తమరు నీ కోరికకై నీ బిడ్డలనే బలికావాలని అడిగితే దానిని నీవు ఎలా సహించగలవు? ఓ తల్లి నీవు గొప్ప గొప్ప అశురులను(రాక్షసులను) సంహరించు మహాశక్తి ప్రదాయిని అయిన నీకు ఈ చిన్న బలిపశువు(మేకపోతు) తుచ్ఛమైన దీనితో నీకు కడుపు నిండుతుందా?

ఇది నీ శక్తికి, గొప్ప శక్తిని ఇస్తుందా?

దీనిని బట్టి సేవాదాస్ బంజారాలను, హింసా మార్గం నుండి అహింసా మార్గంలో పయనించునట్లు చూడవలయునని ప్రయత్నం చేసారు. కాని వారి భక్తులు హింసామార్గం ద్వారా దేవత పేరుతో మాంసము మరియు మధువు కొరకు సేవాదాస్ నేర్పిన బాటలో నడవకుండా దేవి పేరుతో అధర్మమును చాటుతూ తమ కడుపులు నింపుకొంటున్నారు.

కాని అందుకు ఆగ్రహించిన మరియామాదేవి సేవాదాస్ తన మాటకు రానందున అతని గోవులు 3751 మరియు 6400 బిడారి వ్యాపార ఎద్దులనుచంపి వేసినది. అందులో సేవాలాల్ యొక్క ''గరసియాసాండ్'' పేరుగల,ఆవులపై వదలిన గూలి ఎద్దు కూడ ఉన్నది. ''తోళారాం'' పేరుగల గుఱ్ఱం మరియు చిన్న తమ్ముడు భానా కూడ చనిపోయాడు. పైవాటిని దేవి చంపి వేసినది, లక్షల విలువగల మొత్తం తమ ఆస్తిని నాశనం చేసింది. దేవిశాపము వలన భీమానాయక్ కుటుంబము, రెండు రొట్టెలు కూడా దొరకకుండా కష్టాలు పాలైనారు.

''మేటా కోటా'' అనుచోట దేవి ప్రత్యక్షమై సేవా భాయాచేత, ఖీరు పాయసం మరియు ''కడావ్'' అను పదార్థములతో పూజలో నైవేద్యంగా ఉంచారు. ఈ పూజలలో సేవాదాస్ చేసిన భక్తి గానములు వర్ణించుటకు సాధ్యపడనివిగా చెప్పడం జరిగినది. వారి గాన మాధుర్యంలో దేవి సంతృప్తి చెందుతుంది.

ప్రార్థన :

భాయా ఆయిరో వచన్ లీదో ।
రాత్ దన్ కాందేపర లిదే ।
జరిమరి గోరూతి జాయే ।
తోన మలక్ బయిమార్ ఆయే ।
మారి భగతి కరల సేవా భాయా

అర్థం : శ్రీ సేవాదాస్‌గారు దేవితో ఈ విధమైన కోరికలు తీసుకొన్నారు. అప్పటినుండి బంజారాలు( సబ్‌లి పూజ) సంవత్సరానికి ఒక పూజ చేస్తారు.

ఎన్ని కష్టములపాలు చేసినను శ్రీ సేవాలాల్ బాలబ్రహ్మచారి, లొంగడు. అందువలన మరియామాయాడి ఆఖరుకు విధి లేక సరసికోట(సాగర్) అను ప్రాంతములో ప్రత్యక్షమై సేవాభాయని కొన్ని కోరికలు కోరుకోమని చెపుతుంది.

ఆదిశక్తి సేవలాల్ బాలబ్రహ్మచారికి తన విశ్వరూపం చూపిస్తుంది. సూర్యచంద్రులను తన కళ్ళుగాను, మొత్తం( విశ్వము) బ్రహ్మాండమును తన శరీరంగా దర్శనమిస్తుంది. ఇది చూచిన సేవాలాల్ ఆశ్చర్య చకితుడౌతారు. ఆ తరువాత ఆమె చెప్పినదంతా వింటూవస్తాడు.

అప్పుడు శ్రీ సేవాలాల్ భగవాన్ బాలబ్రహ్మచారి ఈ క్రింద కోరికలను కోరినాడు.

1. తన తమ్ముడిని తనకు తిరిగి ఇవ్వమన్నాడు. సరే అన్నది.
2. మాకు జీవనాధరంగా ఉన్న మొత్తం 3751 గోవులను, 6,400 బిడారి ఎద్దులను తరిగి ఇవ్వమన్నాడు సరే అన్నది.
3. నా సంతతి ( మా సంతతి) వారికి 14 తరముల వరకు నీ పూజలు చేసుకొనేటట్లు వరమివ్వు అన్నారు సరే అన్నది.
4. నా నొటినుండి వచ్చిన ప్రతి వాక్కు అమలు కావలెను సరే అన్నది.
5. నేను సంవత్సరమునకు ఒకసారి మాత్రం పూజలు చేస్తాను. అది తలవూపి కాని, ఒళ్ళు విరచికాని పూజించను. మీకు రక్త తర్పణం కావలయును. నాకు అది సరిపడదు నా పూజలు మామూలు పొంగలి, పాయసం, చుర్మో, చపాతీలు నెయ్యి వేసి పూజిస్తాను, నీకు కావలసిన మాంసం, పప్పు ఎముకలను దూరంనుండే చూపిస్తారు.
6. మా బంజారాలకు ఎల్ల వేళలు ఆరోగ్యంగా, ఆహర కొరత లేకుండ, రొట్టెలు, పప్పు నెయ్యితో భోజనం దొరకునట్లు చూడవలెను. సరే అన్నది. ఆ విధంగా వరములు పొందిన తరువాత, తన చేతితో మొదటి దేవి పూజ చేయవలయునని నిశ్చయించుకొన్నారు.

అప్పుడు వారి వద్ద 4 ముంతలు బియ్యం(అనగా 12 సేర్లు) మాత్రమే ఉన్నది. జనాభా చూస్తే 10 వేల మంది పైబడి ఉన్నారు. ఈ బియ్యంతో ఇంత మంది భోజనాలు ఎలా చేసేది అన్నాడు. అప్పుడు దేవి మరియామా, నీ తల్లి ధర్మణియాడి అన్నపూర్ణ. ఒక బియ్యం మెతుకుతో వెల మంది భోజనం చేయించగలదు. నీకు ఎందుకు భయం అదే బియ్యం మిగులుతుంది. ఆ నాల్గుముంతల బియ్యం నీ తల్లికి ఇచ్చి, చుట్టు డేరా కట్టండి అని తెల్పుతుంది. అదే విధంగా తమ తల్లి చేతుల మీదుగా దేవిపూజలు చేసి మొత్తం 10వేల మందికి, అదే బియ్యంతో భోజనాలు చేయిస్తారు.

సేవాభాయ తన తల్లికి ఒకవరం ఇస్తారు. తన తల్లి ఇదివరలో దేవి చంపివేసిన తన తమ్ముని, నాకు ప్రసాదించు అని కోరియున్నది. ఆ వరం ఇప్పుడుఇస్తున్నాను, నాకు తమ్ముని ప్రసాదించు అని తల్లిని కొరుతాడు. అక్కడ అందరు ఆశ్చర్యపోతారు. ఇదేమివింత తల్లికి 80సం తండ్రికి 90సం జరుగుచున్నవి వీరికి సంతానం ఎమిటిఅని ఆశ్చర్యపోతారు. తన తల్లి శరీరం ముడతలుపడిఉంది. నవరంధ్రాలు సన్నగిల్లినవి ఈమెకు సంతానము ఏమిటి అని ఆశ్చర్య ములోఉన్నప్పుడు, సేవాలాల్ అంటారు, కామవాంఛ లేకుండా, రక్తప్రసరణ జరగకుండా, ప్రసవ వేదన లేకుండా, ఎటువంటి పురటినొప్పులు లేకుండా, తొమ్మిది నెలల తొమ్మిది రోజులకు నిండు అమావాస్యనాడు నాకు తమ్ముడు జన్మిస్తాడు అని చెప్పాడు. ఆమాట తల్లి చెవిలో పడగానే ఆమె శరీరంలో మార్పు వచ్చినది.

అది విన్న తండ్రి భీమానాయక్ ఆశ్చర్యచకితుడై అంత పెద్ద జనసంఖ్య ముందు ఏమియూ చెప్పక తన కోపమును తనలోనే అణుచుకొన్నారు. పూజలై అందరు వెళ్లిపోయారు. రెండవ రోజు ప్రొద్దుననే సేవాలాల్ మహారాజ్ ఇంటిలో కూర్చునివుండగా కోపంతో ఉన్న భీమానాయక్, ఆవులు కట్టుటకు ఉపయోగించు పలుపుతాడును చేతిలో తీసుకొని వెనకనుండి సేవాలాల్ వీపుమీద ఫెడీమని ఏడు ఎనిమిది చరిచి( కొట్టి) పెద్ద భక్తుడువచ్చాడు ముసలివాళ్లకు వరం ఇస్తాడట అని తనలోతాను తిట్టుకుంటాడు.

అప్పుడు సేవాలాల్ భగవాన్ తండ్రీ! మీరు నాకు జన్మనిచ్చారు. మీరు నన్ను కొట్టే హక్కు ఉన్నది. దానికి నెనేమి అనను. కాని మీ తప్పుకుగాను రేపుప్రొద్దున నీవుముఖం కడగుకునేటప్పుడు మీ ఎడమకనుగ్రుడ్డు మీ చేతిలోకివస్తుంది అనిఅంటారు. అదీ చూస్తాములే! నీ శక్తి ఎంతఉన్నదో అని అంటాడు. భీమానాయక్‌గారు ఉదయమునే లేచి, ఆవుదూడలను తల్లి దగ్గర వదిలి పాలు పితికి, బొగ్గుతో పళ్లు తోముకుంటాడు. ఆ తరువాత నీళ్ల చెంబు చేతిలో తీసుకొని ముఖం కడగుకునేటప్పుడు నీళ్లు కుడిచంపకు తీసుకొని, తిరిగి ఎడమ చంపపై త్రిప్పి ముఖం కడగుతాం ఆ విధంగా తన చేయి ఎడమ కన్నుపై తగలగానే ఏ మాత్రం నొప్పిలేకుండా భీమానాయక్ కనుగ్రుడ్డు చేతిలోకి వచ్చినది. అది చూచి ఆశ్చర్యపోయిన భీమానాయక్ తనరువమాలును కొడుకు పాదాలమీదఉంచి ఒంటికాళ్లపై నిలచి చేతులుజోడించి నమస్కరించారు. తండ్రి నన్ను క్షమించు అని ప్రార్థించాడు అప్పుడు సేవాలాల్ భగవాన్, తండ్రిని చూచి నేను వరం కోరినపుడు బంధుత్వంగూర్చి అడగలేదు కావున నా వాక్కునకు తిరుగులేదు. మీరు ఒంటి కన్నుతోనే ఉండవలెను, తప్పదు అన్నారు.

ఆ తరువాత సేవాలాల్ మహరాజ్ వాక్కు ప్రకారమే తల్లి భానానాయక్‌ను జన్మనిచ్చినది. రక్త ప్రసవంలేని, ప్రసవవేదన పడుకుండ తొమ్మిది నెలల తొమ్మిది రోజులు నిండు అమవాస్యనాడు ప్రసవించినది అతని పేరు పూరనాయక్ అని అంటారు.

ఈ విధంగా జరిగిన కొద్ది రోజులకు తమ బిడారులతో ప్రయాణమైనారు. శ్రీ మరియామా దేవి సేవాలాల్ మహారాజ్‌తో అన్నది. నీవు కోరుకున్న నిన్ను ఢిల్లీ పాదుషాను చేస్తానుఅని, ఆ మాటలు విన్న సేవాభాయి(నంది) ''గరస్యాసాండ్'' (అవులపై వదలిన విత్తనపు ఎద్దు) అలిగి, ముఖం త్రిప్పి కూర్చున్నదట, అప్పుడు సేవాలాల్ మహారాజ్ నందితో అడిగారు. ఎమిటి విషయమని. అప్పుడు నంది ఈ విధంగా చెప్పినదట.

''సోణలరే సేవాభాయా మారోకేణో! గోర్ ఘరేంగి ఆడం ఆయే! తాండోఘేరన్ మాసూన్ లియే! గోర్‌వట్టేరి బజనామ్ వియే! బాపూన్ ఖోడ్ ఆయే! ఫర్ హోట్ సేవాభాయా!'' ఈ విధంగా గరస్యాసాండ్(నంది) సేవాలాల్ మహారాజతో మాట్లాడినదట.

అప్పుడు సేవాలాల్ మహారాజ్ గరస్యా సాండ్‌తో ఇలా చెప్పుచున్నాడు. ''చ్యార్‌పాలి దాణా ఖోరాయు, అజీలాగతో ఖడ్ ఖోరాయు రంజనేరోపాణి పరాయు కాయివకత్ ఆయొరే గరస్యా సాండ్'' అన్ని అంటారు.

మరియామాయాడి(దేవి) ఎప్పటికప్పుడు, సేవాలాల్‌ను లొంగతీసు కొనవలయునని ఉంటోంది. కానీ సేవాలాల్ మహారాజ్ దేవి మాయలో పడరు. నిన్ను ఢిల్లిపాదుషానుచేస్తాను అని దేవిచెప్పినమాటలు విన్న గరస్యాసాండ్ సేవాలాల్ మహారాజ్‌తో నేను చెప్పినది వినుము. తెల్లటి శరీరం కలిగిన మనుష్యులు(ఇంగ్లీషువాళ్లు) అడ్డంవచ్చెదరు: తాండానంతా చుట్టు ముట్టగలరు. ''గోర్‌వటేరి'' బంజరాలకు అపకీర్తి వస్తుంది. మీ తండ్రిగారికి మాయనిమచ్చ ఏర్పడుతుంది(అపకీర్తి)వెంటనే వెనుతిరుగుము సేవాలాల్ మహారాజ్ అని నంది చెపుతుంది.

అప్పుడు గరస్యాసాండ్‌తో అంటారు. సేవాలాల్ మహారాజ్, ''నాల్గు ముంతల దాణా తినిపిస్తాను. ఇంకను కావలిస్తే మంచి రుచికరమైన గడ్డిని తినిపిస్తాను, మంచి రుచికరమైన నీరు త్రాగిస్తాను(పాణి) ఏమి కష్టం వచ్చిందయ్యె గరస్యా సాండ్'' అని సేవాలాల్ మహారాజ్ చెపుతారు.

ఆ తరువాత ఒరిస్సాదేశం గుండా తిరుగుప్రయాణంచేస్తారు. కటక్‌నది ప్రాంతంలో ఉన్నప్పుడు వీరిని దోపిడి చేయుటకు 900మంది పిండారులు వీరిని దోచుకొనుటకు వస్తారు. వీరుఉన్నది 360 కుటుంబాలవారు.

వీరిలో ముగ్గురు భగత్‌లు(శక్తి పరులు) ఉంటారు **1.** సేవాలాల్ మహారాజ్ (మరియామాదేవి ఉపాసకులు), **2.** ధర్మీసాధ్ బాలాజి భక్తులు వీరిని కంటివాళో వడితియా అంటారు. వడతియా గోత్రం, జాదవవంశం, **3.** రామచంద్రసాద్ (పూజారి), వీరు రాథోడ్ వంశస్తులు. రామావత్ గోత్రం కన్నయ్య భక్తులు (కృష్ణ భక్తులు).

పిండారులు వీరిని దోపిడిచేయుటకు వచ్చినప్పుడు. 1. రామచంద్రసాద్ పిండారులను అడ్డగించారు అనగా వారిని కదలకుండాచేస్తారు. 2 ధర్మీసాద్, ఏడు రోజులునుండి కాలుచున్న

కొండలనుఆర్పి వారు పోవుటానికి ఆటంకం లేకుండా చేస్తారు. 3 అప్పుడు కటక్‌మహానది ఉధృతుంగా ప్రవహిస్తున్నది దానిని దాటవలయును. సేవాలాల్ మహారాజ్ కటక్‌నదిలో ఒక కఱ్ఱను దించుతూ గర్జించి, నిలు అన్నాడు! వెంటనే ప్రవాహం ఆగి పైనీళ్లపైన, క్రిందనీళ్ళు క్రింద నిలబడి పోయి పొడి మార్గంగా ఏర్పడినది. ఆ విధంగా నదిని 360 కుటుంబాలవారు, తమ గోవులు అన్నియు సురక్షితంగా దాటివచ్చారట.

ఆ తరువాత భేసా రాజ్యం అంటే వడ్డెరాజులు(భే సా అనగా దున్న పోతు). భే సా తాలుకా ఉన్నది. అక్కడ సేవాభాయి గోవులు, వారి గడ్డివాములన్నియు మేసి వచ్చినవి, కానీ వారు వీరిని ఏమి చేయులేక పోయారు.

అక్కడినుండి నైజాం రాజ్యంలో ప్రవేశించారు. అప్పుడు పొలాలలో పంటలు కోసిచొప్పగూళ్ళు వేసివున్నారు. వారి 360 కుటుంబాల, లక్ష గోవుల గరస్యాసాండ్ నాయకత్వంలో మొత్తం పొలాలోవున్న కుప్పలను మేసినవట, ఆ విషయమును, రైతులు నిజాం రాజునకు విన్నవిస్తారు. నిజాం రాజు ఉగ్రుడై సైన్యమును పంపి వారిని దూరంగా తరమండి అని పంపిస్తారు వారికి అలవికాక తిరిగి నిజాం రాజుతో చెపుతారు.

అప్పుడు నిజాం రాజు వద్ద సైనిక అధికారులుగాఉన్న బంజారాలు, వీరు రాథోడ్ వంశం, డేగావత్‌గోత్రీయులు వీరిని పిలుపించి అడుగుతారు, అప్పుడు నిజాంతోవారు ఇలా అంటారు. శ్రీ సేవాలాల్ మహారాజ్, ధర్మీసాద్, రామచంద్రసాద్, వీరిని ఓడించుట ఎవరి చేతకాదు. వీరితో సంధి చేసుకొనవలయును లేక, ఎదో విధంగా చంపివేయవలయును అని, ఆలోచిస్తారు. అప్పుడు బంజారాలు అంటారు వీరికి తీపి పదార్థం అంటే చాలా ఇష్టం, వీరికి విషప్రయోగం చేసిన మిఠాయిలు పంపించండి, అవి తిన్న వీరు మరణిస్తారు.

ఈ విధంగా ఆలోచించి, తొమ్మిది గంపల నిండా విషపూరితమైన మిఠాయి పంపిస్తారు. దీనిని తీసుకొని పోయి సేవాలాల్ మహారాజ్‌కు తమకొరకై, నిజాంరాజుగారు బహుమతిగా మిఠాయిని పంపించారు అని తెల్పుతారు. అప్పుడు మరియామాదేవి ఇది విషపూరితమైనది, మొదట ఈ సైనికులకు తినిపించండి అంటూనే వారు పరిగెత్తుతారు వారిని పట్టుకొని తినిపిస్తారు. సైనికులందరు మరణిస్తారు. మొత్తం మిఠాయిలను చూచిన బంజారాల నోరూరినది. ఏమి చేయవలయును, అన్నప్పుడు దేవి సేవాలాల్ మహారాజ్‌తో నీ ఎడమకాలు బొటనవ్రేలులో తీర్థమున్నది, దానిని మిఠాయి గంపలకు ఆనించు. మొత్తం విషం విరుగుడై పోతుంది. అన్న వెంటనే, తోమ్మిది గంపలకు తన బొటనవ్రేలును అంటించి, మొత్తం మిఠాయి బంజారాలకు ఇస్తారు. వారు మొత్తం మిఠాయి తిని ఆనందించుతారు. ఈవిధంగా వీరి బిడారులు మొత్తం భారత దేశంలో తిరుగుతూ ఉంటారు.

శ్రీ భగవాన్‌సేవాలాల్‌మహారాజ్‌గారిని నిజాం నవాబు భాగ్యనగరం(హైద్రాబాద్) నకు అహ్వానించి రాజ ధర్బారులో ఆసినులను చేస్తారు. వారితో అన్ని విషయాలు చర్చించారు వారిద్దరికి స్నేహం ఏర్పడింది. నిజాంనవాబుగారు శ్రీ భగవాన్ సేవాలాల్ మహారాజ్‌గారిని తన తరుపున ఒక ఏనుగును ఖడ్గము, ఢాలు, బల్లెము, కొంత ధనరాసిని మరియు వాటితో పాటు హైద్రాబాద్‌నగరంలోని ఒక వీధిని ఇనాముగా ఇచ్చారు, ఆ వీధి ఈ రోజువరకు 'మహారాజ్‌గంజ్' అనే పేరుతో పిలువబడుచున్నది.

వీటి అన్నిటి కన్న మహత్తరమైన కార్యం, ఎప్పటికిని మరవరాని ఒక సంఘటన జరిగినది. నవాబ్‌గారు, శ్రీ భగవాన్‌సేవాలాల్‌మహారాజ్ యొక్క రేఖా చిత్రమును గీయించారు. ఈ విషయం శ్రీ భగవాన్ సేవాలాల్ మహారాజ్‌గారికి తెలిసిపోయినది. వారు ఈ విషయంలో చాలా కోపగించుకొన్నారు. వారు నవాబ్ గారితో ఈ విధంగా చెప్పారు.

రాజా! నేను గ్రహించుతాను, ఈ నారేఖా చిత్రమును గీయించుటకు చాలా శ్రద్ధ తీసుకొన్నారు. కాని ఇది భక్తులకు కష్టం కలిగించు విషయం. మీరు చేసిన ఈ పని మంచిది కాదని నేను భావిస్తాను. ఈ చిత్రపటాన్ని గూర్చి విషయం తెలియకుండ గట్టి బందోబస్తు చేయవలయును. తమరు ఈ చిత్రపటమును ముద్రించి, బంజారా ప్రజలకు చూపించి, వారి ధనములు అపహరించుటకు చేసిన ప్రయత్నం ఇది.

ఈ మాటకు నవాబ్‌గారు ఉగ్రుడైపోయాడు. అతను వెంటనే సేవాదాస్ తాండాలోని 350 కుటుంబాలను ఆక్రమణ చేస్తాడు. ఆ ఆక్రమణకు సేవాదాస్‌గారు తిరుగుదాడి చేస్తారు. నవాబ్‌గారు ఓడిపోయారు. ఆ తరువాత సేవాదాస్‌గారు ఒక సమావేశం ఏర్పాటు చేసారు. అది మధ్యప్రదేశ్‌లోని రాయపూర్ అనుచోట. అందులో ఆంగ్లేయులకు లొంగి ఏ విధమైన పరిహారము ఇవ్వకూడదని అక్కడ హాజరైన తాండా నాయకులందరికి ఆదేశించారు.

భారత్ మొత్తంలో మొదటి స్వాతంత్ర్య యుద్ధంకు సన్నద్ధమౌతున్న రోజులు. శ్రీ సేవాభాయా విద్యావిహీనులైన సమాజములో జన్మనెత్తి కూడ దేశ భవిషత్తు మీద కూడ చాలా విచారమును కలిగి ఉండిరి. దక్షిణ భారతంలో కొంత మంది పిండారి జ్యావారిలో ఏకమై దొంగతనాలు, లూటీలు చేస్తుఉండిరి. వారి గూర్చి సేవాదాస్‌గారు ఈవిధంగా అన్నారు.

కరిస్-చోరి-ఖాయిాస్-కోరీ !
ఘరే ముండియాంగ్- ఏకజ్ మోరీ !
హాత్ ఆయే- హత్ కడి !
పగే మాయిా బేడి(ఖోడా) రాం! మా ॥
డోరి డోరి హిండియే రాం !
బంగళా-కోటా-మాయం ॥

అర్థము : దొంగతనం చేసే వారు ఎప్పటికి పొట్టనిండా తినలేరు. నా మాటలను పెడచెవిని పెట్టి( బంజారా సోదరులు). దొంగతనం చేసారోవారు తిండికొరకు ఇంటింట అడుక్కుతినవలసివస్తుంది. అతని చేతులకు కాళ్లకు బేడీలు పడతాయి, అంతేకాకుండ అనేక రకాల కష్టాలను అనుభవించవలసివస్తుంది. తన బంజారా భక్తులకు శ్రీ సేవాదాస్‌గారు మత్తు పదార్థములైన, కల్లు, సారాయి కూడ త్రాగవద్దని ఆదేశించారు.

ఇక్కడినుండి సేవాదాస్‌గారి సమాజసేవ ప్రారంభమౌతుంది. బిడారి వ్యాపారంలో సేవాదాస్‌గారు సూరఖండ్ అను రాజ్యం చేరుతారు. అక్కడి నావాబులు గులాబ్‌ఖాన్, మహమ్మద్‌ఖాన్ ఆంగ్లేయుల ఏజెంట్లుగావారి శాసనాలను పాలిస్తుంటారు. శ్రీ సేవాదాస్ మహారాజ్ తాండా వారి ప్రాంతంలో చేరుట వలన నవాబ్ వారి నుండి శిస్తును కట్టవలయునని చెపుతారు. సేవదాస్‌గారు నవాబ్‌గారికి ఈవిధంగా జవాబు ఇచ్చారు. మీరు ఆంగ్లేయుల

బానిసలు(గులాం) నేను బానిసలను రాజులుగా గుర్తించను కాబట్టి నేను ఏ శిస్తులు కట్టను అన్నారు.

**సముద్రంలో మునుగుతున్న ఓడను రక్షించుట:** దీనివలన తనకు కావలసినంత ధనం లభిస్తుంది. ఇది చూచిన బంజారాలు, దేవికి బదులు సేవాలాల్ మహారాజ్ బాలబ్రహ్మచారిని తమ దేవుడుగా పూజిస్తారు. అది చూచి ఆదిశక్తి ఆగ్రహించి, శ్రీ సేవాలాల్ బ్రహ్మచారిని దేవలోకం తీసుకొనిపోవుటకు ప్రయత్నిస్తుంది. దానికి సమ్మతించడు. అప్పుడు దేవి, ఆలోచిస్తుంది. ఇతను బ్రహ్మచారిగా ఉండుటవలన మనశక్తిచాలటం లేదు. కాన వీరికి మంచి అందమైన అమ్మాయిని చూచి పెండ్లి చేయువలయును అని నిశ్చయిస్తుంది. గానీ సేవాలాల్ బాలబ్రహ్మచారి మరియామా మాటలకు లొంగడు.

**జాదుగర్ వడితియా(మాంత్రికుడు) :** ఇతను సేవాలాల్‌ను పరీక్షించుటకు, తన మనుమడిని ఆడపడచు వేషంలో తీసుకొనిపోయి, తన కోడలికి ఇంతవరకు బిడ్డలు కలుగలేదు. కాన దయవుంచి ఈమెకు పుత్ర సంతానం ఇవ్వండి అన్నాడు. అప్పుడు మీ కోరిక నేరవేరుతుంది. అని సేవాలాల్ దీవిస్తారు. అప్పుడు జాదుఘర్ వడితియా ఆట్టహాసంగా నవ్వుతు మగవానికి సంతానం ప్రసాదిస్తావ, ఏది విప్పి చూపరా అని మనుమడికి చెపుతారు. చూస్తే నిజంగానే స్త్రీరూపం ధరించి ఉంటారు. అప్పుడు వారు వారి కాళ్ల పై పడి క్షమించమని కోరుతారు. నా వాక్కుకు తిరుగు లేదు అని తెల్పుతారు. అప్పుడు జాదువడ్తియా వారికి కొంత కానుకను ఇచ్చి సత్కరిస్తాడు.

**అఖిలభారత బంజారా మహాసభ :** ఇప్పటికి సుమారు 230 సంవత్సరముల పూర్వం విదేశీయుల దురాక్రమణకు విరుద్ధంగా గోప్ప గోప్ప నాయకులు తమ సమస్యలను కూలంకషంగా చర్చించుటకుగాను విజయనగర సామ్రాజ్యములోని హంపి ప్రాంతములో పంపా సరోవరం వద్దకల పెద్దమైదాన ప్రదేశములో, ఒక మహాసభను ఏర్పాటు చేసారు. భారత దేశములోని వివిధ ప్రాంతలకు చెందిన బంజారా ప్రముఖులు హాజరైనారు. ఈ సభకు సాధుసంత్‌లు కూడ హాజరైనారు. వారిలో ప్రముఖులు మంచి భావ సంపన్నతకలిగిన శ్రీ భగవాన్ సేవాలాల్ మహరాజ్, మైసూర్ రాజ్యంలోని ఖైరాళినుండి నానూసాద్, రాముసాద్, దేబాసాద్ మరియు హైద్రాబాద్ తెలంగాణంనుండి హర్జిసాద్ మొదలగవారు హాజరైనారు.

విదేశీయుల ఆగమనముతో తమ బంజారా జనులకు జరుగుతున్న నష్టమును దౌర్జన్యముల గూర్చి బంజారాల బిడారి వ్యాపారములకు వాటిల్లుచున్న నష్టములగూర్చి వివరంగా తెలుసుకొని చర్చించటం జరిగినది. ఆ సభలో అనేక తీర్మానములను గావించారు. వాటిని అమలుపరచుటగూర్చికూడ వారు ఆ సభలో చర్చించటం జరిగినది.

తమ సమస్యలను అందరు ఐక్యముగా ఉండి ఎదురుకొనుటకు దృఢనిశ్చయమును ప్రకటించారు. వేలాదివంంది బంజారా వీరులు ఒక శక్తిగా ఏర్పడి విదేశియులను ఎదరుకొనవలయుననంటే బంజారా తాండాలను స్థాపించి. స్థిర నివాసవములు ఏర్పాటుచేయవలయునని తీర్మానించారు. అక్కడ సమావేశమైన బంజారాలు హోళి పండగ

కాలంలో అమలుపరచవలయునని నిశ్చయించారు. ఈ విధంగా రాయచూరు జిల్లాలోని ''బహుదూర్ బండ – సత్తె నిసాన్'' ఈ హోళీపండగ జరపవలయునని తీర్మానించారు.

ఈ విషయము గూర్చి భారతదేశ చరిత్రలో, ప్రాధాన్యాంశముగా ఉంచినారు. ఆంగ్లేయులు భారత మాతను ఇనపపట్టాలతో బంధిస్తున్నారని, దీనికై ప్రజలు ఎదురు తిరిగారని చెప్పటం జరిగినది. అనగా ఆ ప్రజలు ఎవరోకాదు బంజారాలే. కారణం వారి బిడారి వ్యాపారమును సాగనీయకుండా ఇంగ్లిషువారు రైళ్లు, రోడ్లు ఏర్పాటు చేస్తున్నారని దాని వలన మన వ్యాపారమునకు భంగం ఎర్పడే సమయం ఆసన్నమైనదని వారి భావన.

**బీద- గొప్ప బేధం లేదు :** తన సోదరుని కుమారుడైన జేతలాల్ యొక్క వివాహము ఒక నిరుపేద బంజారా తుకారాం ఇంటిలో ''చంకిబాయి'' తో చేయించారు. బంజారా జాతిలో బీద గొప్ప అనే తేడాలు చూపకుండునట్లు చేసారు. తరువాత వారు''జేతాభాయు'', ''చంకియాడి''లను బంజారల దేవతగా పూజిస్తున్నారు.

**లడాయి :** బంజారాలు–పంచాయితీలుపెట్టి( నసాబ్) దండగలు వేయువారి విషయంలో ఈ విధంగా అన్నారు.

గోర్ గరీబూన్ దాండన ఖాయో!
సారి పీడి నరకేమా జాయో !
ఓరి వంసేమా కోయి కోని రియేర !
పథిరి రో భాటా బణియేరే !
బంగలా కోటా మాయమ్!

**అర్థం :** బీద సాదలకు దండన ఇచ్చేరూ, వారి వంశమంతా నరకం అనుభవించేరు. వారి వంశములో దీపం వెలిగించుటకు  కూడా ఎవరు ఉండరు. నదిలోని బండరాయిలా ఉండి పోతారు. బంగాళాలు, కోటలు, మాన్యాలు ఏమి మిగలకుండా పోతాయి అని బంజారాలను ప్రభోధించారు.

**సూర్‌ఖండ్ రాజుతో యుద్ధం :** శ్రీ భగవాన్ సేవాలాల్ మహారాజ్ బాలబ్రహ్మచారి, వారి బిడారులు సూర్‌ఖండ్ రాజ్యములో ఉన్నకాలంలో సూర్‌ఖండ్ రాజు సైనికుడు రెండు బలమైన పొట్టేళ్లను మేపుతుంటాడు. ఈ పొట్టేళ్లను బంజారాలు చూస్తారు. వాటిని చూడగానే వీరి నోళ్లు ఊరుతాయి, వీటిని తస్కరించి, ఆదిశక్తి మరియు దేవతకు నైవేద్యం పెట్టవలయునని, వాటిని మరియయూమకు బలి ఇచ్చి, పూజలు జరుపుతారు. పొట్టేలు కనిపించకపోవుటచేత ఈ విషయం రాజు గారితో చెప్పుతారు. వెంటనే తాండాకు పోయి వెతకండి అంటారు. ఎక్కడ కనిపించలేదు. ఆ విషయం తెలసినరాజు ఉగ్రుడై కొంత సైన్యం ఇచ్చి వారిని చంపిరండి అని ఉత్తర్వు ఇస్తాడు. ఆ విషయం మరియామా సేవాలాల్ మహారాజ్‌తో చెప్పుతుంది. వెంటనే వీరు కూడ కరవాలములు చేతబూని యుద్ధము చేస్తారు. మొత్తం సైనికులు చంపబడతారు. ఇది విన్న సూరఖండ్ మహారాజ్ స్వయంగా 9,000 సైనికులతో యుద్ధానికి తరలి వస్తారు. ఈ విషయం కూడ మరియామా సేవాలాల్ మహారాజ్ బాలబ్రహ్మచారితో

చెప్పుతుంది. తిరిగి యుద్ధం ప్రారంభమైంది. 9,000 మందిని ఎదుర్కొనుట కష్టం. అందుకు మరియామాయాడి శ్రీసేవాలాల్‌మహారాజ్ తమ్ముడు హపానాయక్‌కు పండ్రెండు దున్నపోతుల శక్తిని ప్రసాదించి, ఖడ్గం చేతపూని మొత్తం సూర్‌ఖండ్ సైన్యమును తన కరవాలమునకు అహుతి చేస్తారు. రక్తం ఎరులై పారినదట. ఇక రాజా వక్కడే మిగిలాడు, అన్న ఆనతికై వచ్చి అన్నా! ఆజ్ఞ ఇవ్వుము, సూర్‌ఖండ్‌రాజు తల కూడ మీ పాదముల చెంతవుంచగలను అన్నాడు.

అది గ్రహించిన సూర్‌ఖండ్‌మహారాజు శ్రీసేవాలాల్‌మహారాజ్ బాలబ్రహ్మచారి పాదములపై పడి ప్రాణభిక్ష పొందారట. ఈ విధంగా బంజారాలు తమ వ్యాపారమును, బిడారులను, గోవులను కాపాడుకొంటు మొత్తం దేశంలో పర్యటిస్తూ తమ తాండాగోవులను కాపాడు కొంటు మొత్తం దేశమునే తమ తాండాగాభావించారు.

**చంకిబాయి– జేతాభాయా పెండ్లి :** సేవాభాయా తమ్ముని కుమారుడు శ్రీ జేతాబాయకు యుక్తవయస్సు వచ్చినది. తమ్ముని కుమారునకు పెండ్లి చేయ నిశ్చయించినాడు. జేతభాయకు తగుకన్య ఎక్కడయున్నది, అని ఆలోచిస్తారు, వారికి ఉమ్మితాండా, బార్ గోత్ పవార్ తుకారాం కుమార్తె వీరికి సరిపోతుంది. మంచి సౌశీల్యవతి, అందగత్తె అన్ని రకాల జేతాభాయాకు తగినజోడి అని తెల్పుతారు.

అప్పుడు ఇద్దరు పెద్ద మనుష్యలను పంపించి తుకారాంను పిలిపిస్తారు. నీ కుమార్తె చంకిబాయిని, జేతాభాయాకు ఇవ్వవలయును అని తెల్పినారు. అప్పుడు తుకారాం నేను చాలా బీదవాడిని, బిడ్డ పెండ్లిచేయించే శక్తి నా వద్ద లేదు. నేను చాలా బీదవాడను నాతో వియ్యమొందుట మీకు సరియైన జోడికాదు. అని చెప్పిన, వారు సమ్మతించక, నీకు ఆ విషయంలో చింతవలదు, అని నచ్చ చెబుతారు. ఆ తరువాత తాంబూల శాస్త్రం జరిపించారు.

ఆ తరువాత శ్రీసేవాలాల్‌మహారాజ్ బాలబ్రహ్మచారిని మరియామా దేవలోకమునకు పిలుచుకొని పోయినది. సంవత్సరాది అయిన తరువాత శ్రీరామనవమినాడు ''సాడితాణన్'' జేతాభాయను పెండ్లికొడుకును చేసి, సుమారు 400 కుటుంబాల సుమారు 3,000 మంది. ఉమ్మి తాండా బయలుదేరి వెళ్లి ఊరిబయట విడిది చేస్తారు.

ఉమ్మి తాండాలో బీదవాడైన తుకారాం, వీధివీధిన తిరిగి దుఃఖిస్తూ నా కుమార్తెకు ఊరి పెద్దలందరు కలసి వివాహం చేయించండి, నేను బీదవాడను, అని చెప్పి వేడుకొంటుండగా వారి మాటలను ఎవ్వరు లెక్కచేయరు. ఇది చూచిన మరియామాయాడి ( ఆదిశక్తి) తుకారాం అక్క అవతారమెత్తి, నెత్తి మీద మూట మోసుకొని వచ్చి తుకారాం ఇంటి ముందు నిలచి, లోపల ఉన్న చంకిబాయిని పిలుస్తూంది. చంకిబాయి ఎక్కుడున్నావు. ఇక్కడరా అని పిలచినది అప్పుడు చంకిబాయి వచ్చి చూడగా తనమేనత్తే అని భ్రమించి, ముంతతో మంచినీళ్ల తెచ్చి ఇస్తుంది. మంచి నీళ్ల త్రాగి, మీనాన్న ఎక్కడి కెళ్ళాడమ్మ, నీవు ఊరిలో పోయి తొమ్మిది మంది పెండ్లి కాని, ఆడపిల్లలను పిలుచుకొని, మీ నాన్నను పిలుచుకొని రాపో, అత్తవచ్చింది రమ్మనుపో, తొందరగా రండి అని చెప్పినది. వారు తిరిగి వచ్చెలోపు ఇల్లంతా పెండ్లి పందిరితో కళకళలాడుతోంది ఇంటి ముందు పెద్ద పెద్ద హండాలు పొయిమీద ఉంచి అన్నిరకాల వంటలు తయారువుచున్నవట అది చూచి తుకారాం అశ్చర్య పోయి నిజగాంనే తన అక్క వచ్చి ఇన్ని ఎర్పాట్లు చేసినదా అని అనుకున్నాడు.

అప్పటివరకూ ఎంత పిలిచిన పలకని తాండావారు గుంపులు గుంపులుగా వచ్చినారు. తుకారాం అక్కతో, అక్కా! వీరందరికి భోజనం ''సాగునేర్‌పాన్'' టేకు ఆకులలో వడ్డిస్తామా అంటాడు. ఎందుకు నాయనా! పెండ్లివారు ''పాంచ్‌పాడ'' రాథోడ్ వంశము రామవత్ గోత్రమువారు మనము పవార్ వంశస్తులము, మనం వారికన్న తక్కువ వారంకాము. అదిగో ఆ రూంలో ఐదువేల పళ్లెములూ, ఐదువేల చెంబులు తెచ్చి పెట్టినాను, వాటిలో వడ్డించు అన్నారు. రూంలో పోయి చూడగా అన్ని క్రొత్తగా తళతళమెరుస్తున్నవట, చాలా ఆనందముతో వాటిలో అందరికి భోజనాలు వడ్డించారు. ఆ విధంగా మొత్తం తొమ్మిది రోజులు పెండ్లి జరిగినది.

ఆ తొమ్మిది రోజులు పెండ్లి కుమార్తెకు పెండ్లిబట్టలు స్వయంగ తుకారాం అక్కరూపంలో ఉన్న ఆదిశక్తి రోజుకు మూడు జతలు ప్రకారం 27 జతల పెండ్లిబట్టలను స్వహస్తములతో తయారుచేసినదట ఈ విధంగా తొమ్మిది రోజులలో తుకారాం ఘనంగా తన కుమార్తె చంకిబాయికి పెండ్లి జేతాభాయాతో చేసి పంపించారట.

ఈ విధంగా శ్రీ సేవాలాల్‌మహారజ్ బంజారాల అవుతార పురుషుడిగా, దేవుడుగా నిలబడి అందరి కష్టములను తీరుస్తూ ఉండెను. మరియామా సేవాలాల్ మహారాజ్‌ను ఏ విధంగానైన దేవలోకమునకు తీసుకొనిపోవలయునని పట్టుపడుతుంది. అప్పుడు తన పెండ్లి విషయమును గూర్చి దేవలోకములో చర్చించవలయును అని రమ్మని పిలుస్తుంది. అప్పుడు సేవాభాయ తన పార్థ శరీరమును వదిలి ఆత్మతో పోవలయును అని తన తమ్ములను పిలపించి వేప ఆకు తెప్పించి మెత్తటి పరుపులాగ చేయండి అన్నాడు. నేను నాపార్థశరీరమును ఇక్కడ వదిలి వెళుతున్నాను మూడు రోజులకు తిరిగివస్తాను అప్పటివరకు మీరు నా శరీరమునకు కాపలఉండవలెను. ఎవ్వరు కన్నీరు పెట్టకూడదు. నా శరీరమును తాకకూడదు అట్లు తాకిన నేను శరీరంలో ప్రవేశించుటకు వీలుఉండదు కాన మీరు జాగ్రత్తాగ ఉండవలెను. అమ్మకు ఈ విషయం తెలియకూడదు అని అన్నిరాకాల ఒప్పించి తన శరీర మును వేప అకులతో పేర్చిన పరపుమీద వదలి మాతతో దేవలోకమునకు వెళ్లి పోయాడు.

అక్కడ ఆదిదేవుడు శివునితో తనవాదను వినిపిస్తాడు. నేను దేవలోకము వచ్చి సేవలు చేయుటకన్న నాకు నా తల్లిదండ్రుల సేవ చేయుటలోనే అనందమును పొందుతున్నాను. కావున నన్ను క్షమించి, పంపవలయునని కోరుతాడు. దానికి సమ్మతించి ఆది దేవుడు నీ ఇష్టమే కాని అని తెల్పుతాడు. దీనికి ఆగ్రహించిన దేవి. శ్రీ భగవాన్ సేవాలాల్ తన పార్థశరీరంలో చేరకముందే, స్త్రీవేషముతో తన తల్లి ధర్మణియాడి వద్దకు వెళ్లి నీ కుమారుడు సేవాలాల్ చనిపోయి రూయిగడ్‌లో పడిఉన్నాడు. నా కంటితో చూచి వచ్చాను అని చెపుతుంది. ఆ విషయం విన్న తల్లి కన్నీరు మున్నీరుగా ఏడ్చుతూ శ్రీ భగవాన్ సేవాలాల్ ఉన్న రూయిగడ్ వచ్చి చూస్తుంది, తన కుమారులు, బద్దుభాయా, హపాభాయా, ఎంత వద్దని చెప్పినను వినక, ఆ శరీరంపై పడిఏడుస్తూ, శరీరమును ముట్టుకొంటుంది. ఆ లోపుల తన శరీరంలో ప్రవేశించుటకు వచ్చిన శ్రీ భగవాన్ సేవాలాల్ ఆత్మ అందులో ప్రవేశింపలేక పోతుంది. తల్లి శరీరమును తాకిన వెంటనే భూమి పైనుండి 3 సార్లు పైకి ఎగిరి క్రిందపడిపోతుంది. ఈ విధంగా సేవాలాల్ ఆత్మ 12-4-1806వ సంవత్సరములో తన పార్థశరీరంలో ప్రవేశించకుండా ఉండిపోతుంది.








*1.* భారతీయ బంజారా పరిషత్ సమావేశము. *2.* మహారాష్ట్ర పొహరాదేవిలో
శ్రీ భగవాన్ సేవాలాల్ మరియు మరియామ (దేవత) దేవాలయములు.



1. గుల్బర్గాలో ధార్మిక సంస్థవారు నిర్వహించిన హోమ కార్యక్రమాలు నిర్వాహకులు జగద్గురు శ్రీ సేవాలాల్ సంగన బసవస్వామిజీ2. కుడి నుండి మూడవవారు ధార్మిక సంస్థ అధ్యక్షులు శ్రీ తారనాథ్ పవార్, రెండవవారు శ్రీ సి.ఎస్. కల్యాణ నాయక్ ప్రధాన కార్యదర్శి తదితరులు



*1973* నేను దర్శించిన శ్రీ భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి సమాధిపై
కట్టబడివున్న పురాతతనమైన గుడి

ఈ విధంగా, శ్రీ భగవాన్ సేవాలాల్ పార్థశరీరమును, రూయిగడ్‌నుండి, పోహరా దేవి తెస్తారు. గంధవు చెక్కలు తెచ్చి శరీరమును దహనం చేసినపుడు, మంటలనుండి ప్రత్యక్షమై బంజారాలకు ఉపదేశం చేశారు.

''గోర్ భాయివో'' బంజారాలు భయపడవద్దండి, మీకు అండగా నేను ఉంటాను. తాండాలను ఊరికి దూరంగా, 2 కి.మీ దూరంలో కట్టుకొండి, కోళ్లను, పందులను పెంచవద్దండి. డాక్టర్ల వద్ద పోయే పనిలేదు. నా పేరు తలచుకొని కొంత బూడిదను (భోగ్) నోటిలో వేసుకొండి. మీ సమస్త రోగములు మాయామవౌతాయి. ఈ విధంగా వారి ఆశీర్వాదమును పొందియున్నారు. ప్రతి తాండాయందు, సేవాలాల్ మహారాజ్ గుడి, ఆదిశక్తి గుడి ఉంటుంది. ఆదిశక్తి గుర్తుగా ఎర్రజండా, శ్రీ భగవాన్ సేవాలాల్ గుర్తుగా తెల్లజండా ఉంచుతారు. ఈ రెండు జెండాలు కనిపించిన కలరా కాని, ప్లేగు కాని తాండాలలో ప్రవేశించకూడదు. ఇదే శ్రీ భగవాన్ సేవాలాల్ – మరియామాయాడి గూర్చిన విషయములు.

# శ్రీ భగవాన్ సేవాలాల్ జన్మస్థలంగూర్చిన అన్వేషణ

శ్రీ భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి, మారియామదేవి సేవాభాయా సంతతివారు. శ్రీ మోహన్ మహరాజ్ చెప్పిన జీవిత చరిత్ర టేప్‌రికార్డు ద్వారా గ్రహించిన విషయంలో శ్రీ భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి బళ్ళారిజిల్లా గుత్తి ప్రాంతంలో జన్మించారని

తెలిపి ఉన్నారు. అనంతపురం జిల్లాలో ఉన్ననాకు ఆ విషయం తెలియదు. టెంకాయల వ్యాపారం చేస్తున్న యం. పోమినాయక్‌గారిని ఈ విషయం ఎంతవరకు నిజం అని నేను అన్నప్పుడు, ఆ స్థలమును చూచియున్నాను అన్నారు, కావాలంటే పోయి చూచివస్తాం రండి అన్నారు. అప్పుడు మేము అనంతపురం నుండి 15-7-97 ఉదయం 6-30 గం బయలుదేరటం జరిగినది. అనంతపురం నుండి వెళ్లి పామిడి దిగాము. పామిడినుండి గంటకల్ రూటులో కదరపల్లి తాండా వద్ద దిగి అక్కడ బంజారా నాయకులను కలిసాము. శ్రీ రామవత్ రామ్యానాయక్‌గారు, శ్రీ మూడ్ రుప్లానాయక్‌గారు మా వెంటరాగా అడవిదారిన సుమారు 1.5 కి.మీ. నడక ప్రారంభించాము. అక్కడ శ్రీ శ్రీభగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారిగారి తండ్రి శ్రీ భీమానాయక్‌వారు బిడారి దిగి . 9000వేల దామన్‌ల గోవులను కాచినారట. దామన్ అంటే ఆవులను రాత్రిపూట కట్టుటకు ఉపయోగించుతారు. దీనిని రెండు చివరలు, భూమిలో పాతిన మేకులతో కట్టివుండెను. దామన్‌కు సుమారు 15నుండి 20 అవులను కట్టివేస్తారు. అనగా ఆ తాండా సుమారు 360 కుటుంబములపైబడిఉండెను. ఒక్కొక్క ఇంటికి 1000లేక రెండువేల ఆవులు 360కుటుంబాలు, వారిలో కొంత మంది జీతగాళ్లుఉంటారు. సుమారు రెండు మూడు లక్షల గోవులన్న మాట, ఈ ప్రదేశము. గుత్తినుండి గుంతకల్లువరకు, మరియు ఉరవకొండ ప్రాంతంవరకు కొన్ని లక్షల ఎకరములు, చిన్న చిన్న గుట్టలతోను, మధ్యమధ్యలో మైదానాలుగాను ఉండుట వలన వారి గోవులను పోషించుటకు మంచి అనుకూలమైన ప్రదేశము. ఈ ప్రాంతంలో ఎల్లవేళలందు నీటికొరత లేకుండ ఉండెను. ఈ ప్రాంతముకు ఝుంరీజోల్ అని పేరు పెట్టారు.



మరియామా గుడి (పోలేరమ్మ) ఎడమ ప్రక్క నుండి ఎం. పోమ్యానాయక్, రామావత్ రమ్యానాయక్ మరియు ఎం. రూప్లానాయక్ కుడి ప్రక్క నరకబడిన ఈతచెట్లు

ఝొల్ అనగా ఈత చెట్లతోనిండిన, వాగుఝొ ప్రదేశము. ఇక్కడ కాల్‌కుండి అను నీటి మడుగుఉన్నది. ఇక్కడి నీళ్లు కొంత నల్లగా కనిపించుటవలన ''కాల్‌కుండి'' అని పేరుపెట్టారు కాల్ అనగా నలుపు అని అర్థం.

ఈ ప్రదేశంలో మరియామా (సుంకళమ్మ) గుడి, చంద్రాయని గుడి( గుట్ట) ఉన్నది. ఇక్కడ చెన్నకేశవస్వామి వెలసిఉన్నారు. మరియామా(సుంకళమ్మ) గుడిని ఆనుకొని ఒక ఈత చెట్టు ఉన్నది. అది చక్కగా ఎత్తుగా ఉండుటవలన దానిని గృహనిర్మాణమునకు ఉపయోగించుటకుగాను, గొడ్డలితో చెట్టు చుట్టు సుమారు 3 అంగుళము లోతుతో నరికి ఉన్నారు. ఆ చెట్టు నరకకూడదు. సుంకళమ్మచాలాశక్తి కలది అని అక్కడి ప్రజలు తెల్పినను అతను లెక్కచేయకుండా నరికాడు. అతను వెంటనే నోటినుండి రక్తం కక్కి చనిపోయినాడు.

అక్కడినుండి రెండు ఫర్లాంగు దూరంలో ఒక రైతు తోటలో శ్రీ భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి జన్మించిన స్థలం ఉన్నది. ఆ రోజులలో బంజారాలు ఇండ్లు కట్టేవారు కాదు. వారుఎల్లప్పుడు తమ గోవులను తోలుకొని, బిడారి వ్యాపారం చేసుకుంటూ ఒక ప్రాంతంనుండి మరియొక ప్రాంతమునకు పోవుచుండిరి. అందువలన వారు గుర్తుగా ఉండనట్లు ఇండ్లు నిర్మించేవారు కాదు. కాని భగవంతుని స్వరూపమైన శ్రీ భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి జన్మస్థలం అగుటవలన, తిరిగి ఎప్పుడైన ఆదారినవచ్చినప్పుడు, గుర్తుగా ఉండుటకుగానువారు, ఒక 10 అడుగుల ఎత్తులో చదరంగా, కాడు రాళ్ళతోనే ఒక బురుజు కట్టిఉన్నారు. ఆపైన మరియామాయాడి చిన్నగుడి కట్టియున్నారు. దానికి ఎదురుగా రాజుల కాలంలో కట్టివున్నపాతబావి ఒకటిఉన్నది. అందులో నీళ్లు ఎల్లప్పుడు సమృద్ధిగావుండెను. అందులోని నిళ్లు కొంత నలుపు యుండట వలన, కాల్‌వావడి, మొట్ వ్యావడి అని పేరు పెట్టారు. ఈ బురుజు గుత్తి కోటకును (కొండ) మరియు రామచంద్ర కొండకు మధ్యలో ఉన్నది. సుమారు ఇరు ప్రక్కల 10నుండి 15 కి.మీ. దూరంలో ఉండవచ్చును.

శ్రీ భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి పుట్టినప్పుడు తనతోపాటు వచ్చినగర్భ సంచిని అక్కడ పాతిపెట్టారట. అది వెంటనే పుట్టగా పెరిగిపోయినదట. అప్పుడు ధరమణియాడి భయపడి, తన కుమారునికి సర్ప ప్రమాదంకలగవచ్చునను భయంతో అక్కడినుండి కాల్‌కుండ్‌తలావడి అనుచోటుకు తమ మకాముమార్చుకొన్నారట. తలావడి అనగా చిన్నచెరువు అని అర్థం. భీమానాయక్ ఆవులు ఆ పొలం మొత్తంమేసి ఇక్కడ తమ దాహమును తీర్చుకొనేవట. ఈ విధంగా ఉన్న కాలంలో భీమానాయక్ ధరమణియాడి తమ దినచర్యలలోఉండి, గోవులను మేపుటకుపోయి, ఇంటికొచ్చి చూడగా సేవాభాయ కనిపించలేదు. అప్పుడు తల్లిదండ్రులు తమ బిడ్డ జాడ తెలియక పోవుటచేత అడవి అంతాగాలించుతూ చౌడమ్మకొండపైకిపోయారు. భీమనాయక్ అక్కడ సేవాభాయాను, చౌడమ్మను ఇద్దరిని ఆడుకొనటను చూశారు. అప్పుడు ఎమిటి ఈవింత అని అడుగగా మేము రోజు ఆడుకొంటాము అన్నారట, కాని భీమనాయక్ చౌడమ్మను మామయులు ఆడమనిషి అనుకొన్నాడు. ఇదిగో నాయనా నీకుమారునితీసుకోఅన్నదట, ఇంటికి తిరిగివస్తూ ఎమిటయ్యా ఈ వింత అని కుమారుని అడుగగా, రోజు నన్ను తీసుకొనిపోయి ఆడిస్తుంది అన్నాడట. అక్కడ దగ్గరలోనే కదిరప్పకొండ అని ఉన్నది. మేము ఈ ప్రాంతమంతా కాలీనడకననే రెండు రోజులుతిరిగి చూడటం జరిగినది. ఫోటోలు కూడ తీసుకొనటం జరిగినది. అక్కడనుండి గొల్ల దొడ్డి, చెర్లోపల్లి గ్రామాలు మీదుగా,



శ్రీ భగవాన్ సేవాలాల్ జన్మస్థలమైన అనంతపురం జిల్లా గుత్తి తాలుకా గోళ్ళపల్లి గ్రామ ప్రాంతంలో వెలసిన *1.* ఝుమరీ ఝోల్ *2.* (శ్రీ) భగవాన్ సేవాబాయా జన్మస్థలం *3.* కాళకుండి (బావి)





బాగల్ కోట్‌లో వెలసిన మరియామా అమ్మవారు మరియు దేవతకు సమర్పించిన యాటలు

శ్రీ భగవాన్ సేవాలాల్ జన్మస్థలమైన అనంతపురం జిల్లాలో ని గుత్తి తాలుకాలో
శ్రీ భగవాన్ సేవాలాల్ మరియు మరియామా దేవతల
మందిరములు కట్టుటకు చూపబడిన మందిరము యొక్క నమూన

శ్రీ భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి ఎందుకు ఈ బంజారలలో జన్మయెత్తాడు. అను విషయంను తలంచినప్పుడు, నా మనసులో మెదిలిన విషయం ఇది. బంజారాలు ఎప్పుడు తమ బిడారులను, ఒకచోటనుండి మరియొుక చోటుకి, మరియు బిడారులు అన్నియు గ్రామమునకు దూరంగా ఉండుటవలన వీరికి సామాన్య ప్రజలకు అందినట్లు దైవభక్తి అందుటలేదు. వీరిలోని అజ్ఞానము తొలగించి దైవభక్తిని వీరిలో ప్రేరేపించుటకు అవతరించిన అవతార పురుషుడు అని భావిస్తాను. తమ బంజారా ప్రజలకు, అనారోగ్యం సంభవించిన డాక్టరు అవసరంలేదు అన్నారు. నాపేరు తలంచుకొని, కొంత బూడిదను నోటిలో వేసుకోమన్నాడు, దీనివల్ల మీ సర్వరోగాలు నివారణకాగల వన్నారు. కోళ్ళు, పందులు పెంచవద్దన్నారు. కాని, తినవద్దండి అనలేదు. కారణం కోళ్లు, పందులను ఊరిలోను, ఇంటిలోను తిరుగాడుచుండట వలన అవి, విసర్జించిన మలమూత్రములవలన, ఈగలువాలి వాటిద్వారా, అనారోగ్యంవచ్చుటకు అవకాశము ఉన్నది. కాన, ప్లేగులాంటి మహమ్మారి వచ్చుటకు వీలులేదు. నాకు గుర్తుగా

తెల్లజండా, మరియామా గుర్తుగా ఎర్రజండా కట్టుకోండి అన్నారు. ఈ రెండింటిని దూరంనుంచి చూచినవారు ఆ ప్రాంతంలో బంజారాల బిడారులు ఉన్నవి అని గుర్తించ గలుగుతారుఅని అర్థం. ఈవిధంగా శ్రీ భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి, బంజారాలలో ఒక్కడుగా, తను కూడ ఒక సామాన్య వ్యక్తిగా మెలగి బంజారాలను భక్తి మార్గంలో నడిపించగలిగారు. ఈనాడు ప్రతి తాండాలో సేవాభాయ మఠం, మరియు గుడిని స్థాపించి ప్రతివు పూజలు చేస్తూ ఉంటారు. కాని ఈ మధ్యలో వచ్చిన కొత్త, జనరేషన్ ఈ విషయంలో శ్రద్ధ వహించటంలేదు. ఇటువంటి వారు 100కి, 5% మాత్రంఉన్నారు. కాని 5% ప్రభావం 95% బంజారాల పైబడి, వారి ఆచార వ్యవహారములను, సాంప్రదాయములను, మట్టిపాలు చేయుటకు సిద్ధమైనారు. కావున ఈ విషయం పెద్దలు, పిల్లలు, స్త్రీలు, పురుషులు, విద్యావంతులు, అవిద్యావంతులు సూక్ష్మబుద్ధితో ఆలోచించి, బంజారాల అభివృద్ధికి, వారి దైవభక్తిని, అభివృద్ధి పరచవలయునని ప్రార్థిస్తున్నాను.

కాని ప్రస్తుతం కొంత మంది బంజారాలు, క్రైస్తవ మత ప్రభావమునకు లోనగుచున్నారు. వారిసంస్కృతి, వారి ఆచార వ్యవహారములు, వారి దైవభక్తినివారు గ్రహించుట, క్రైస్తవ మత ప్రవక్తలు, ఇంటింట వచ్చి, ఉచిత బైబిలు, కరపత్రములు, ఇచ్చి వారిలో కొంతమందికి బైబిలు క్లాసులు, ట్రైనింగులు ఇచ్చి, వారి యొక్క ప్రభావమును వీరిపై, చూపుతు కొన్ని తాత్కాలిక వసతులను, పిల్లలకు విద్యా సౌకర్యములు, ఆరోగ్య సదుపాయములు కల్పించుచూతూ, ఉచితంగా బైబిలును బంజారా భాషతో ముద్రించి శులభముగా చిన్న పిల్లలు మొదలుకొని, ఆడవాళ్లవరకు బంజారా భాషలోనే బోధించి వారిని క్రైస్తవులుగా మార్చటం జరుగుచున్నది.

నేను నా చిన్నప్పుడు క్రైస్తవ మత గురువు దగ్గర విద్య నేర్చుకొన్నాను. వారు మాకు రామాయణ, భారత కథలు, బైబిలు గూర్చి, ఏసుక్రీస్తు గూర్చి, ఆదిపర్వం, కొత్త పర్వం గూర్చి తెల్పియున్నారు. క్రీస్తుతన కాలంలో అంటురోగులును బాగుచేసాడు. 5 రొట్టెముక్కలు, 5 చేప ముక్కలతో 5 వేల మందికి భోజన సదుపాయం చేసారు. సముద్రమును చీల్చి, దారిని ఏర్పాటు చేసారు అన్న ఎన్నో ఉదాహరణలు ఇస్తు! చనిపోయిన 3 రోజులకు, సమాధినుండి లేచి, అందరికి కనిపించారు.

అదే విధంగా శ్రీ భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి, సామాన్యగోవుల కాపరి ఇంటిలో జన్మించి, సామాన్య బంజారాగనే ఉండి, తనయొక్క మహాత్యములను చాటి చెప్పినారు. శ్రీ భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి అసలు రోగాలే రాకుండా చేసారు. మగ పిల్లవాడిని ఆడపిల్లగా మార్చినాడు 3 రోజులు చనిపోయి పడియున్న శవమును బ్రతికించుతాడు. 4 ముంతల బియ్యంతో 10వేల మందికి భోజనములు ఏర్పాటు చేసారు. ఒరిస్సాలోని కటక్ నది ఉధృతంగా ప్రవహిస్తూ ఉన్నది, దానిని ఆగు అని చెప్పి రెండు పాయలుగా చేసి తన బిడారిని దాటించారు. నైజాంరాజు విషప్రయోగం చేయుటకు మిఠాయి పంపిన, దానిని తన ఎడమ కాలి బొటన వ్రేలను చూపి, విషం విరుగుడుచేసారు. ఆవులుమేసి పోయిన రైతుపొలం, తిరిగి కలకలలాడునట్లు చేసారు. తాను చనిపోయిన తరువాత కాష్టంలో కాలిపోయి శ్రీ భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి ప్రత్యక్షమై బంజారాలకు బోధించారు. ఈ విధంగా తను సామాన్య మానవుడుగాఉండి ఎన్నో వింతలను, శక్తులను చూపించారు. క్రీస్తు పుట్టి 2000 సంకావస్తున్నది. శ్రీ భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి పుట్టి ఇప్పటికి, 256 సు జరుగుచున్నది. అనగా 1741లో తను జన్మించినట్లువారు చెప్పుచున్నారు.

# శ్రీ హాథీరాం బావా బాలాజీమఠ మహాత్యం

అప్పుడప్పుడు భగవంతుడు తమ భక్తుల యొక్క మహిమను చాటుటకు అసాధ్యమైన వాటిని కూడ సాధ్యంచేసి నిరూపిస్తూఉంటారు. అటువంటి కథయే తిరుపతిలోని శ్రీ హాథిరాం బావా మఠం.

కలియుగంలో స్వయం భగవంతుడు వెలసిన ప్రాంతం ఆంధ్రప్రదేశ్‌లో చిత్తూరు జిల్లాలో శేషాద్రి కొండపై వెలసిన(తిరుమలలో) శ్రీ వెంకటేశ్వర స్వామి. వీరినే బంజారాలు, బాలాజి అని పిలుస్తారు. ఉత్తర భారతంలో శ్రీ వెంకటేశ్వరస్వామిని బాలాజీ అనుపేరుతోనే ప్రఖ్యాతిగాంచినారు.

ఈ విశ్వమును సృష్టించిన భగవంతునికి కులమతాల భేదం లేదు. ఎవ్వరైతే దేవునిపై భక్తియుంచి, ఏకచిత్తంతో ప్రార్థించగలుగుతారో వారికి భగవంతుడు తప్పకుండా దర్శనం ఇస్తాడు. అయితే ఈ కలియుంగలో ఎవ్వరైతే నీతినిజాయితీగా ఉంటారో, వారినే ప్రజలు, దొంగ అని, నీతి లేనివాడని, మోసగాడని, అవిధేయుడని నిందించుతారు. మానవులు తమ అజ్ఞానము అనే ఈ కలియుగంలో నిజాయితీపరులను గుర్తించటం లేదు, మరియు వీరికి వారు ఎప్పటికిని నిజాయితి పరులగా అగుపించరు. ఈ కలియుగంలో భక్తునికి, భగవంతునికి సత్‌సంబంధమును కల్పించుటకుగాను బ్రహ్మపుత్రుడైన(కలహప్రియుడు) నారదమునికి ఒక ఆలోచన పుట్టినది. ఎలాగైన సరే బృగు మహారుషిని కలిసి అతని ద్వారా ఈ సత్‌కార్యము చేపట్టవలయునని తలంచి, బృగమహాఋషితో ఇలా చెప్పాడు. మనకు ముగ్గురు దేవతలుఉన్నారు. వారిలో ఎవరు గొప్ప. బ్రహ్మదేవుడా, ఈశ్వరుడా లేక శ్రీమన్ నారాయణుడా అని ప్రశ్నవేస్తారు. ఈ విధంగా నారదుడు తిరుపతిలో బాలాజీని కొల్‌హాపూర్‌లో శ్రీమహాలక్ష్మిని వెలసేటట్లు చేస్తారు. నారుదుని ప్రోత్సాహముతో బృగ మహఋషి ముందు బ్రహ్మలోకం చేరాడు. అక్కడ బ్రహ్మ, సరస్వతి ఏకాంతసేవలోఉన్నారు. బృగ మహాఋషిని చూడగానే బ్రహ్మదేవుడు ఉగ్రుడైపోయి ఋషిని కఠినమైన శబ్దములతో తూలనాడారు. దీనిని బృగ మహాఋషి సహించలేక పోయాడు. అక్కడినుండి ఈశ్వరుడిని దర్శించుటకు కైలాసమునకు వెళ్లాడు. అప్పుడు పార్వతి-పరమేశ్వరులు తమ నాట్య భంగిములతో పరవశులైఉన్నారు, అయిన బృగ మహాఋషి లెక్క చేయకుండా అక్కడికి వెళతారు ఈ విషయం ఈశ్వరునికి తెలసిన, తన నాట్యభంగిమలోఉంటూ వీరిని లెక్కచేయరు. అప్పుడు బృగు మహాఋషి ఈశ్వరునే నిదించి అక్కడనుండి కోపంతో బయటికి వచ్చివేస్తారు. తరువాత అక్కడినుండి వైకుంఠమునకు బయలు దేరుతారు. ఈ విశ్వంలో అతిసుందరమైనది వైకుంఠము. ఇక్కడ చేరినవారు ఆ ప్రాంతమును తిలకించి; తన్మయత్వంలో తమకుతామే మైమరిచిపోతారు. అటువంటి ప్రదేశములో శ్రీమన్ నారాయణుడు లక్ష్మిదేవితో నివాసం ఉన్నారు. మహాశక్తిపరుడైన మహఋషి బృగు వైకుంఠంలో శ్రీమహావిష్ణువు కొలువులో ప్రవేశిస్తారు. అప్పుడు శ్రీమహావిష్ణువు శేషపానుపై పవళించిఉండగా శ్రీ మహాలక్ష్మివారి పాదశేవ చేస్తుఉంటుంది. శ్రీ బృగ మహాఋషి వచ్చినదివారు గమనించరు. బృగమహాఋషికోపాగ్నితో అకస్మాత్తుగా, శ్రీమహావిష్ణువు వక్షస్థలంపై తన్నుతారు(ఎదపై) ఇది చూచిన శ్రీ మహాలక్ష్మి అగౌరముతో కృంగిపోతుంది. అప్పుడు శ్రీ మహావిష్ణువు బృగ

మహాబుషిని చూచి, మహాత్మా క్షమించుము. మీ రాకను గమనించలేక పోయాను. అని సగౌరవముగా ఆహ్వానించి, తన పాన్పు పై ఆశీనుని చేసి తన పాదములకు దెబ్బతగిలినదేమోనని, బృగు మహాబుషికాలు వత్తుతారు. ఈశ్వరునికి మూడవ కన్ను ఉన్నట్లు బృగు మహాబుషికాలిలో 3వ కన్ను (నేత్రం) ఉంటుంది. అందువలననే బృగు మహాబుషి గర్వంకలిగి ఉంటారు. ఆ మూడవ నేత్రమును తను పాదసేవ చేస్తునట్లు నటించి, చేతి వ్రేళ్లతో ఆ కన్నును చితికివేస్తాడు. అక్కడితో అతని అజ్ఞానం తొలగిపోతుంది. ఇదిచూచిన శ్రీమహాలక్ష్మి శ్రీమన్నారాయణనితో కలహించి, విష్ణులోకమును వదలి భూలోకంలోని కొల్హాపూరు చేరుకొన్నారు. ఈ వియోగం అంతా ఈ పేద బ్రాహ్మణునివలన జరిగినది. అదే విధంగా సప్తగిరి తిరుమలలో శ్రీమాహావిష్ణువు, కోల్హాపూర్లో శ్రీమహాలక్ష్మి వెలసినారు.

శ్రీనివాసుని కల్యాణము పద్మావతితో జరిగినప్పుడు విశ్వములోని దేవతలందరు హాజరైనారని తెల్పబడుచున్నది. శ్రీమాహావిష్ణువు గద్దెసాని వేషములోవచ్చి పద్మావతితో నీ కల్యాణము శ్రీనివాసునితో జరుగుతుందని చెప్పుతుంది. ఆ విధంగా వారి వివాహము కుదిరినందున, శ్రీనివాసుడు, కుబేరుని వద్దకుపోయి ఒకకోటి పద్నాల్గులక్షల రూ. లు అప్పుగా తీసుకొని దానికి బ్రహ్మదేవుని, ఈశ్వరుని సాక్షులుగాఉంచి, ఈ అప్పును శ్రీమహాలక్ష్మి, శ్రీమన్ నారాయుణుని భార్యగా స్వీకరించటం జరిగినది. ఈ వివాహమహోత్సవమునకు శ్రీశైలంనుండి వెంకటాద్రివరకు వివాహ పందిళ్ళు వేయించినట్లు తెల్పడం జరిగినది. సప్తగిరులు భూలోక వైకుంఠంగా భాసిల్లునది. అందరు దేవతలు ఈ వివాహ మహోత్సవమునకు హజరగుటవలన వైకుంఠమే ఇక్కడ వెలసినట్లు భావించారు. అప్పటినుండి ప్రతి సంవత్సరం ఇక్కడ బ్రహ్మోత్సవములు జరుపబడుచున్నవి. ఇది జరిగి క్రీ.పూ 4,000 సం పైబడి అయినది. ఇప్పటికి 5వేల 8వందల సంవత్సరములు జరుగుచున్నదని పెద్దలు చెప్పుచున్నారు. అప్పటికి చంద్రగిరిరాజులు వీరిని పూజించుచుండిరి. బాలాజీ అను పేరు ఎలా వచ్చినది. మరియు హాథీరాం బావా ఎవరు? వీరు వచ్చి సుమారు 700 సం.లు జరుగుచున్నది.

హాథీరాం బావా జననము : పూర్వం బిడారి వ్యాపార కాలంలో చిత్తూరు జిల్లాలోని తిరుమల ప్రాంతంలో ఒక తాండా వెలసినది. ఆ తాండా కొంత కాలం ఉండినది. అక్కడినుండి వేరొకచోటికి వెళ్ళిపోయారు. ఆ తాండాలోని ఒకవ్యక్తి అతని పేరు రాంజీ, వారి వెంట పోకుండ తిరుమల కొండలలోనేఉండి శ్రీరామచంద్రుని ధ్యానించుతూ అక్కడ గుహలలోనే ఉండిపోయారు. ఆ తరువాత కొంత కాలమునకు మరియొక బంజారా తాండా అదే పాత తాండా వద్ద వెలసినది. వీరికి వ్యాపారంతోపాటు గోసంపద కూడ ఉండినది. కావున వారు వారి గోవులను తిరుమల కొండలలో మేపుకొనివచ్చుటకు వెళ్లినారు. అప్పుడు ఆ కొండ గుహల చాటున రాంజీగారిని వారు కనుగొని తమ తాండాకు పిలుచుకొని వచ్చారు. వారు శ్రీరామ భక్తులు, కావున రాంజీసాద్ అని చెప్పుచుండిరి.

వీరు క్షత్రియ వర్ణం అయిన పవార్ వంశీయులు, అంగోత్ గోత్రియులు. అదే తాండాలో ఒక బంజారా అమ్మాయికి పెండ్లి చేసినారు. కొంత కాలమునకు వారికి పుత్రుడు జన్మించాడు. ఆ బాలునికి అడవి ఏనుగులు వచ్చి ఆశీర్వదించాయట. అందువలన అతనినివారు హాథిరాం అని నామకరణంచేసారు. అప్పటినుండి ఆ బాలుడు దినదినాభివృద్ధిచెంది చంద్రునివలే అభివృద్ధి చెందుతూ దైవభక్తి పారవస్యుడైనారు. అక్కడినుండి బంజారా తాండా తమ గోవులతో

వ్యాపారం జరుపుతూ దేశం మొత్తం తిరిగారు. తిరిగివారు ఉత్తరాదినుండి దక్షిణాదికి ప్రయాణం సాగిస్తూవచ్చారు. అప్పుడు ఆ బాలుడు తిరుమల కొండలలో కందమూలాదులను భుజించుతూ, అనేక సంవత్సరములు తపస్సు ఆచరించాడు. ఒకరోజు దైవభక్తిలో పారవశ్యుడై గోవిందా, గోవిందా అంటు బాలాజి స్వామి దర్శనమునకై వచ్చు భక్తులవెంట తిరుమల చేరుకొని స్వామి దర్శనం కొరకు అక్కడే ఉండిపోయాడు.

శ్రీవేంకటేశ్వరస్వామి దేవాలయం చుట్టు ప్రక్కలలోని కొండ ప్రాంతంలోనే ఉంది. బాలాజియందే ధ్యానమును లగ్నం చేసి అక్కడే తిరుగుతూ అక్కడ లభించు కంద మూలములను, అడవి పండ్లను ఆకులను భోజనంగా వాడుకొంటు 14ఏ తపస్సు చేసారు.

ఇప్పటికి పాపనాశమునకు పోవుదారిలోని శ్రీ హాథీరాం బావా సమాధి ఎదుట ఉన్న చెట్టుక్రింద తపస్సు చేశారని, ప్రతి దినము స్వామి సన్నిధానమునకు వచ్చి పూజలు చేసి బాలాజి నామమునే జపించుతూ, తీర్థయాత్రికులకు దర్శనమిస్తుండిరి. స్వామి యొక్క దేవస్థానం అర్చకులకు వీరిపై శత్రుత్వము కలిగి శ్రీహాథిరాం బావను, దైవదర్శనం చేయనీకుండా చాలా ఇబ్బందులకుగురిచేసారు.

శ్రీ వేంకటేశ్వరస్వామివారు వారి భక్తి శ్రద్ధలకు, ముగ్ధులై వారికి స్వయంగా దర్శనమిచ్చారు. వీరిని ఆషారామదాసు అని కూడ పిలిచేవారు. ఆషారామదాసు భగవంతుని దర్శనార్థం మందిర ప్రవేశం చేయుటకు రాగా, బ్రహ్మణపూజారులు, వీరిని రానికుండ చంద్రగిరి రాజుల అధికారమును ఉపయోగిస్తారు. ఎందుకనగా ఇతనిని చూడగానే ఇతను తక్కువ జాతి వాడుగా భావించి మందిర ప్రవేశం కానీకుండా చేస్తారు. అప్పుడు చేయునది లేక, మందిరం ముందు భాగములో ఒక చిన్న గుడిసెను కట్టుకొని అక్కడే నిలచిపోతారు.

హాథిరాం బావా( బాపూజి) సూర్యోదయానికి ముందుగానే లేచి కాలకృత్యములు చేసుకొని స్నానం చేసుకొని తన మనస్సులోనే శ్రీనివాసుని ప్రార్థించుకొనేవాడు. ఆ తరువాత తన స్థానంలో తాను కూర్చునేవాడు. అప్పుడప్పుడు వారు భక్తి పారవశ్యంలో మునిగి పాటలు పాడుకుంటూ రెండు చేతులతో తాళం వేస్తూ, భజనలు గంటల కొద్దిచేస్తూఉండి, ఆవేశముతో రెండు చేతులుపైకెత్తి గంటల కొద్ది, ఎగురుతూఉండేవారు( డాన్సు చేస్తు ఉండేవారు).

అప్పుడప్పుడు వారు క్రింద కూర్చుని, తన ముందు త్రికోణములోను, చదరంగాను గీతలు గీస్తూ అందులో పులిమేక, అట్ట చౌకం గీట్లు గీస్తు ఒకప్రక్కనల్ల రాళ్ళు, రెండవ ప్రక్క తెల్లరాళ్లుఉంచేవారు. వెంటనే ఆట మొదలు పెడతారు. అప్పుడప్పుడు నల్ల కంకరతో ఆడుతూ తెల్లకంకర్లను కూడ కదుపుతూ ఉండేవారు. ఈ విధంగా వారు ఆటలో నిమజ్ఞమై ఉన్నప్పుడు, అతనికి తన చుట్టూ ఎంత మంది నిలిచి చూస్తున్నది కూడ అతనికి తెలిసేది కాదు. ఆ ఆటలో ఆడుకుంటూ అప్పుడప్పుడు బాలాజీ అని గట్టిగా చెప్పేవాడు. అప్పుడు అతని చుట్టు నిల్చుని చూస్తున్నవారు అది విని. ఇతను నిజంగానే పిచ్చివాడై పోయినాడని భావించేవారు. మరియు భగవంతుడు బాలాజీ ఎమిటి, ఈ పిచ్చివానితో ఆట్లాడం ఎమిటి అని అనుకొని వెళ్లిపోయేవారు.

బాపూజీ ఉదయంనుండి సాయంత్రంవరకు తన భక్తి పారవశ్యంలో భజనలు, నాట్యములు, ఆటలతో కాలం గడచిపోతుంది. ఆతనికి ఏ విషయంలో చింతకాని, భయం కాని లేదు, ఎల్లప్పుడు రాత్రి పగలు బాలాజీ భగవానుని చింతలోనే ఉండేవాడు. భగవంతుని

దర్శనానికి వచ్చిన భక్తులువారికి, పండ్లు ఫలములను తన దగ్గర ఉంచి పోతూఉండిరి, కాని వాటిని కూడా గమనించే వాడుకాదు. భగవంతునికి సమర్పించిన మధ్యాహ్న ప్రసాదమును పెట్టుచుండిరి. వాటిని తిని ఆనందించుచుండిరి. ఎవ్వరి దగ్గర యాచించేవాడు కాదు.

బాపూజీ యొక్క నిశ్చలమైన భక్తిని చూచి, భగవంతుడు ప్రసన్నుడై, ఒకరోజు సాయంత్రపు పూజలందుకొని భగవంతుడు అతని దగ్గర పోయి కూర్చున్నాడు. అప్పుడు భగవంతుని వేషం వదలి వెల్లాడు. బాపూజితో అన్నాడు. రా ఈ రోజు నీతోఆడుకొంటాను రండి అన్నాడు.

ఏమిటి మీరు బాలాజీనా? నేను ఇతరులతో ఈ చదరంగం ఆడను. అవును నేను బాలాజీనే నన్ను ఎవ్వరు గుర్తుపట్టకుండా నావేషం మార్చుకొచ్చాను. మీరు నన్ను మోసం చేయలేరు. అలాగైతే భగవంతుడా, తమరి అసలు రూపం చూపిస్తే తప్ప నేను మీతో ఆడను. అప్పుడు బాలాజీ ప్రత్యక్షమైనారు. ఇది చూచిన బాపూజీగారికి ఆనందంతో ఆశ్రుధారలు, పొర్లుతూ వచ్చినవి, స్నేహ విశ్వాసాలతో కూడిన గంభీరమైన కంఠస్వరంతో బాపూజి అన్నాడు కదా? గోవిందా ఈవిధంగా నీ సన్నిధి చేరుటకు ఇంకా ఎన్నిరోజులు నాకు ఈ శిక్ష ? నా మీద తమరికి దయరాదా? అన్నారు. అప్పుడు శ్రీనివాసుడు నీ యొక్క భక్తికి పరవసుడినై, నీ తోటి చదరంగం ఆడటానికి వచ్చాను అన్నారు.

భక్తుడు మరియు భగవంతుడు ఇద్దరు చదరంగం ఆటలో నిమజ్ఞమై పోయారు. ఒక్కొక్కసారి భగవంతుడు గెలిచిన ఎక్కువ సార్లు భక్తుడు గెలుస్తూ ఉండిరి . ఈ విధంగా ఇద్దరు తమ ఆటలో మునిగిపోతూ ఉండిరి. అప్పట్లో భగవత్ సేవకై పూజారులు గుడిలోగంటలు మ్రోగిస్తూండిరి. ఈ గంటల మోత భగవంతుని చెవిలో పడగానే, భగవంతుడు ఆడుతూ లేచి, చాలా పొద్దు పోయినది, చాలా ఆలస్యం అవుతున్నది మళ్ళి వచ్చి ఆడుకుందాములే అని చెప్పి వెళ్ళి పోయేవారు.

ఈ విధంగా ప్రతి రోజు ఆడుకొంటూ ఉండిరి. ఒక రోజు భగవంతుడు బాలాజీ అదే పనిగా, తన కంఠహారమును అక్కడ వదలి వెళ్లి పోతారు. అది బాపూజీ ముందేపడి ఉంటుంది.

రెండవ రోజు ఉదయమున మందిరంలో స్వామి మెడలోని కంఠహారం కనిపించలేదని, సర్వత్రా అందరకి తెలిసిపోయింది. దానిని ఎవరు దొంగలించారని చర్చ ప్రారంభమైనది. ఈ విషయం తెలుసుకొన్న బాపూజీ ఆ హారమును తీసుకొని గుడి ప్రధాన పూజారికి చూపించి ఇచ్చేసారు. పూజారిగారు అన్నారు గదా! ఈ హారం నీ వద్ద ఎలా వచ్చినది. ఎమిటి, నీవు దీనిని దొంగలించావా? అప్పుడు బాపూజీ అన్నాడు కదా భగవాన్ బాలాజీ రాత్రి నా వద్ద, చదరగం ఆడటానికి వచ్చారు. అప్పుడు ఈ హారమును అక్కడ మరచిపోయివచ్చారు. నేను ఈ హరమును దొంగలించలేదు.

బాపూజీ వారితో లక్షసార్లు చెప్పినను, వారు వీరి మాటను పెడచెవిని పెట్టినారు అప్పుడు మందిరం ప్రధాన పూజారి బాపూజీకి ఒక అగ్ని పరీక్ష పెట్టుటకు నిర్ణయించారు.

బాపూజిని ఒక గదిలో బంధించి, అందులో ఒక బండెడు చెరకు గెడలను ఉంచి, చెప్పాడు కదా! నిజంగా నీవు బాలాజీయొక్క స్వచ్ఛమైన భక్తుడే అయితే ఈ గదిలోవుంచిన

మొత్తం చెరుకుగడలను నమిలి తిని నాకు చూపవలయును. లేకున్న కంఠహారమును దొంగలించిన నేరమునకు నీ మెడ ఖండించబడుతుంది.

బాపూజీని ఈ విధంగ కఠినంగా బంధించడం జరిగినది. బాపూజిగారికి తన భగవంతునిపైన పూర్తి విశ్వాసం ఉండినది. వారు నిశ్చితంగా నిద్రపోయిరి. అప్పుడు బాలాజి భగవాన్ తెల్లటి ఏనుగు రూపమును ధరించి, గదిలో ఉంచిన చెరకుగెడలను తిని వేసారు.

ఉదయంననే పూజారులంతా బాపూజిని చూడటానికి వచ్చి తలుపు తియగానే అందరు ఆశ్చర్యంలో మునిగి పోయారు. వారు తలుపు తియగానే ఒక తెల్లటి ఏనుగు వారికి ఎదురుగ బయటికి వచ్చిపోతూ వారు చూస్తూఉండగానే మాయమైనది. అప్పుడు ప్రధాన పూజారి బాపూజిగారిని అడగాడు. ఈ తెల్లటి ఏనుగు ఇక్కడికి ఎలా వచ్చినది. నాకుఏమియు తెలియదు బాలాజీ దగ్గర పోయి ఈ విషయం మీరే ఎందుకు అడగకూడదు.

ప్రధాన పూజారితో సహా అందరు వారి పాదములపైబడి మమ్ములను క్షమించుము స్వామి అని ప్రార్థించారు. అందువలన, ఏ కారణం చేత బాపూజీని బంధిగా ఉంచారో అదే స్థలములో విశాలమైన హాథిరాం బావాజీ మఠమును కట్టించారు. దీనినే బంజారాల హాథిరాంబావా మఠం అంటారు.

శ్రీ హాథిరాంబావాగారికి స్వయంబాలాజీ(శ్రీ వెంకటేశ్వరుడు)నీకు ఏమి వరం కావలయునని అడిగాడట, వారు స్వామివారితో స్వయంగా తమరే నాచెంతఉండగా, నాకు వరాలెందుకు స్వామి. కాని నా బంజారా సమాజము తమ దర్శనార్థమై వచ్చిన భక్తులకు ఈ క్రింద కోర్కెలు తీర్చవలయును 1.బంజారాలు తమ దర్శనార్థం వచ్చినపుడువారికి నా మఠం ద్వారా తొమ్మిది రోజులు వారికి వసతి భోజన సదుపాయములు కల్పించవలయును, 2. వచ్చిన వారందరికి తులసి మాలతో సత్కరించి వారి నాయుకునికి 'పాగడి' (రుమాలు) ఇచ్చి గౌరవించవలయును, 3. ఒక జత నామాలు, 4. ఒక జత నగారా బహుమతిగా ఇవ్వవలెను అని కోరగా తథాస్తు అని ఆశీర్వదించారు. ఈ విధంగా పూర్వం బాలాజీ దర్శనార్థం వచ్చునప్పుడు వారిని సత్కరించి పంపించేవారు.

మొదట బంజాం భక్తులు శ్రీ వెంకటేశ్వరస్వామివారి దర్శనార్థం పోయినపుడు మొదట హాథీరాం బావాజీ మఠంలోని బావాగారు పాచికలాడిన పీఠమును దర్శించి, నమస్కరించి, ఆ తరువాతనే బాలాజీ దర్శనమునకు పోతారు.

హాథిరాంబావాజీమఠం తిరమలలోకన్నా దిగువతిరుపతిలో చాలాపెద్దగాఉన్నది అందులో శ్రీరాములువారిమందిరం. బావాజీపీఠం ఉన్నది. ఈ రెండు మఠములను ప్రతి ఒక భారతదేశంలోని బంజారాలు దర్శనం చేసుకొనివస్తారు. వీరు తమ భక్తిశ్రద్ధలతో ముడుపులు తీసుకొనివస్తారు. ఈ ముడుపులను మూడుభాగాలుగాచేసి, ఒకభాగం బాలాజీహుండిలోను ఒకభాగం మఠంనకు ఒకభాగం దిగువ తిరుపతి మఠంనకు సమర్పిస్తున్నారు. ఇది వాస్తవమని మఠం నిర్వహిస్తున్న సాధువులుకూడ అంగీకరిస్తున్నారు. బంజారాస్త్రీలు చనిపోయినవారి ఆభరణములను స్వామివారికే సమర్పిస్తారు కానీ, వాటిని వేరేస్త్రీధరించదు అని మఠాధిపతులు చెప్పుచున్నారు.

# శ్రీ హాథీరాం బావాజీ మఠం గూర్చి వివరణ

1964 సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్‌నుండి బంజారానాయకులు సంఘము తరపున, తిరుపతి మఠాధిపతులనుకలసిన వారు శ్రీ దిప్లా చౌహాన్ హైద్రాబాదు, శ్రీ వాగ్యానాయక్ చౌహాన్, వరంగల్, శ్రీ నూన్‌సావత్ జీవలానాయక్ పవార్ గుంటూరు, వారు శ్రీ హాథీరాం బావాజీ మఠం 11వ మహాంత్‌గారిని కలసి, శ్రీ హథీరాం బావాగారి వంశ చరిత్రను ఇవ్వవలసినదిగా కోరగా, మహంత్‌గారు అది తాళ గ్రంథములలో వ్రాయబడినది. అది ఎక్కడో భద్రంగాదాచబడినది. ఇప్పుడు వెతకటం అసాధ్యం. మరి ఎప్పుడైన రండి అని చెప్పి పంపించారు. దీనిని తీయవలయునన్న మొత్తం మఠాధిపతులు ఉండవలయును, మొత్తం స్వాములు వారిని పిలిపించి దానిని తీయించే ప్రయత్నం చేస్తాను, అని అన్నారు, కాని ఆప్రయత్నం ఈనాటి వరకు జరుగలేదు. బాలాజీ దర్శనంకొరకువచ్చే, విశాల భారతంలోని బంజారాలు, ఈ మఠంలోనే నివసిస్తారు, వీరికి కావలసిన అన్ని సౌకర్యములను సమకూర్చుచుండిరి.

శ్రీ హాథీరాం బావా యే మందిరంయొక్క ప్రధాన పూజారిగాఉన్నారు. 15వ శతాబ్దం, ప్రారంభం, ఇప్పటికి ఆరువందల సంవత్సరములు కావస్తున్నది. వీరి సమాధి అకాశగంగకు పోవుదారిలో, (వేణుగోపాల స్వామి) గుడి దగ్గరలోఉన్నది. బాలాజీ దేవస్థానంలోని కుడిప్రక్క ఎత్తైన ప్రదేశంలో బావాజీగారి మఠం కట్టించి, శ్రీరాముల మందిరం, పంచముఖ హనుమాన్‌ను ప్రతిష్టించి పూజించుచున్నారు. అందుకే బంజారాలు తమ పాటలో ''శ్రీరామ్ బాలాజీ'' అంటారు. అనగా శ్రీరామచంద్రుడే బాలాజీ, వెంకటేశ్వరుడు, శ్రీనివాసుడు, ఏడుకొండలవాడు ఈ విధంగా నానా పేర్లతో పిలుచుకొనుచున్నారు.

దిగువతిరుపతిలోని గోవిందరాజస్వామిగుడి ప్రక్కలో పూల బజార్ దగ్గరయున్న శ్రీ హాథీరాంబావా మఠం చాలాపెద్దది. బాలాజి పేర బంజారాలు పాడే పాట.

బాలాజీర పహడేపర్ ఝుడ్ ఊదేరో!
ఏ ఊద చడె సరిరామే బాలాజీ
బాలాజీర పహడేపర ఝోడ్ చందనేరో!
ఏ ఛందణచడే సరిరామే బాలాజీ!
బాలాజీర పహడేపర ఝోడనాలరేరో!
ఆ నాలరచడే సరిరామే బాలాజి!
బాలాజీర పహడేపర ఝుడ కర్పూరేరో!
కర్పూర చడే సరిరామే బాలాజీ!
బాలాజీర పహడేపర ఝుడ్ హలదేరో
హలదచడే సరిరామే బాలాజీ
బాలాజీర పాడేపర ఝాడ్ కుంకుమేరో!
కుంకుమ చడే సరిరామే బాలాజీ
బాలాజీర పహడేపర ఝోడ కేలారో
కేలాచడే సరిరామే బాలాజీ. ఈ విధంగా పాటను వారు పాడిగిస్తూ పాడతారు.

శ్రీ హథీరాం బావాజీ తరువాత ప్రయాగదాస్ మహారాజ్ ప్రధాన అర్చకులైనారు. వీరుచాలా అభివృద్ధిచేసారు. జీర్ణదశనుండి అభివృద్ధి పరచారు. శ్రీ వెంకటేశ్వర దేవస్థానమునకు 300 గ్రామాలను దత్తతగా ప్రయాగదాస్‌గారు. దేవస్థానమునకు ఇచ్చారట మొత్తం సుమారు 20వేల ఎకరములు అందులో 3,500 ఎకరముల భూమిని శ్రీ హథీరాం బావా మఠమునకు ఉంచుకొని మిగిలినదంతా బాలాజీ దేవస్థానమునకు ఇచ్చారు.

భారతదేశములోని అనేక ప్రాంతములలో శ్రీ హాథిరాంబావాజీ మఠం స్థిరాస్తులుఉండి, అక్కడ మఠాధిపతుల అధీనంలోఉండి, ఇప్పుడువారి సంతతివారు అనుభవించుచున్నారు. అదే విధంగా బెంగుళూరు చామరాజపేట్, బసవనగుడి, మహాంత్ లే-ఔట్‌లోని, సుమారు ఇరవైఒక్క ఎకరములు హాథీరాం బావా మఠం భూమిని ఇతరులు ఆక్రమించుకొని అనుభవిస్తున్నారు.

మైసూరు నగరంలోని, అశోక్ రోడ్డులో మహేశ్వరి బావాజీ మఠం, త్రిపూర్ భైరవిమఠం కూడ అదేగతిలో ఉన్నది. తిరుపతి పట్టణంలోని, వందలాది ఎకరములుఉండి, అందులోని నాల్గు ఎకరములు భూమిని(స్థలం) బంజారా కాలనికిగాను ఇచ్చామని, శ్రీ అర్జునదాస్ మహారాజ్ తెల్పారు. ఆంధ్రప్రదేశ్ క్రిష్ణాజిల్లా సింగరాయ పాలెంలో బావా మఠమునకు సుమారు 360 ఎకరములు భూమిగలదు.

చిత్తూరు పట్టణంలోను, వందలాది ఎకరములు భూమి బావాజీ మఠమునకు చెందినదట. దత్తి ప్రాంతంలో దొరకిన దాఖలాలను బట్టి ఆంధ్రప్రదేశ్‌లో 1475.75 ఎకరములు, తమిళునాడు 73.96 ఎకరములు, మహారాష్ట్రములో 296.81 ఎకరములు భూమి బావామఠంనకు ఉన్నది.

ఇవికాక ఢిల్లీ ముంబాయి, బాగల్‌కోట, గుజరాత్, ఆయోధ్య, దాభా, నాసిక్, బెంగుళూరు, నీలగిరి, చెన్న పట్టణం మరి కొన్ని చోట్లు హాథీరాం బావా మఠమునకు సంబంధించినవిగా తెలస్తున్నది. తిరుపతిలోని హాథీరాంబావా మఠము మరియు అనేక ప్రాంతములలో గల ఆస్తులను అనేక మంది కృత్రిమవారసులు పుట్టుకొచ్చి కోర్టులు, కచ్చేరీలకు ఎక్కినారు. బంజారా సమాజములోనిశ్రీ హాథీరాం బావా తరువాత, కొందరు స్వార్థపరులు మఠం యొక్క ఆస్తులను వశపరచుకొనుటకు ప్రయత్నించుచున్నారు.

శ్రీబావాజీ మఠం శింగరాయపాళ్యం, మండవల్లి తాలుకా, కృష్ణా జిల్లాలో బంటుపల్లి పోవుదారిలో ఉన్నది. ఈ మఠంను భైరాగి మఠం అనికూడ పిలుస్తారు. అక్కడ ఇప్పటికి సాధువులందరికి భోజన సదుపాయములు జరుగుచున్నవి. ఈ మఠంనకు ఆస్థి 306 ఎకరముల భూమి, ఉన్నది, దీని ఆదాయంతో ఈ మఠమును నిర్వహిస్తున్నారు. ఈ మఠాధిపతి వచ్చి శ్రీ గౌతందాస్ మహారాజ్‌గారు వైడ్.నెం 26 తారీఖు 8-8-1953 మఠాధిపతి కాగిలిగినారు.

1952వ సంవత్సరమునందు ఈ మఠం 9వ మహంత్ శ్రీరామ్‌చంద్రదాస్ బావాజీ గుండె పోటువలన మరణించారు. ఆ తరువాత ఈ మఠమునకు ప్రభుత్వం ఎవ్వరిని. నియమించలేదు. దీని ఆస్థిపాస్తులు, వ్యవహారములు చూచుటకు ఎవ్వరు లేనందును 1959వ సంవత్సరములో ఆంధ్రప్రదేశ్ ఎండోమెంట్ కమీషనర్‌వారు, తాత్కాలికంగా ఎవరో ఒకరిని 1-5-1959 ఉత్తర్వు ప్రకారం నియమించినారు. వీరికి మఠం ఆస్థి పై ఏ అధికారం లేదు. ఈ

మఠముయొక్క ఆస్తులను కాపాడుట మాత్రమే అని, నియమించినారు. సుప్రీం కోర్టు తీర్పు ప్రకారం ఐ.ఆర్.11/1980 పేజి నెం. 107/జి.ఎల్.ఏ. 2ఏప్రిల్. ప్రకారం 23-9-1981 ఉత్తర ప్రదేశ్, ఫైజాబాదు జిల్లాల ఆయోధ్య హనుమాన్‌గుడి, ఆదిగురు మఠసంస్థ, శ్రీ అఖిలభారతీయ పంచారామనందియ సర్వాణి, అనువారు. హలి శ్రీమహంత్ నిర్వాశిరామేశ్వరదాస్ మహారాజ్‌గారిని ఈమఠమునకై నియమించడం జరిగినది. అందులో ఈ ఆస్థులన్నియు, మఠమునకు అప్పగించివలయునని, చెప్పబడిఉన్నది. ఆంధ్రప్రదేశ్ ధత్తి కమీషనర్, బంజారా సమాజములోని ముఖ్యులతో ఆర్.సి.నెం. సి/4/579/3 తారీఖు 23-9-83 ప్రకారం, ఫిట్‌పరసన్ అయిన కీ.శే. శ్రీ లాకావత్ నరశింగ్ నాయక్ ఎం.ఎ., ఎంఫిల్., బియిడి(ఎం.పి) మరియు భుక్యా వెంకటేశ్వర నాయక్, విన్నన్న పేట, బాణావత్ రాములునాయక్, విజయవాడ, భుక్యా సూర్యానాయక్‌వారిని నియమించడం జరిగినది. ఈ భైరాగిమఠం మహంత్ బంజారా భక్తులకు, అన్నదానం కొరకు 23-11-1932లో 66.89 ఎకరములు పాత యస్.నెం. 526డి మరియు యస్.నెం 529లో 5.31 ఎకరములు రిజిస్టరు అయినట్లు రికార్డులు చెప్పుచున్నవి.

1990లో శ్రీ లక్షిరాంనాయక్‌గారి అధ్యక్షతన ఒక కమిటిని నియమించినారు. 1990లో చెన్నారెడ్డిగారి హయాంలో ప్రస్తుతం అర్జునదాస్‌బైరాగిమహాంత్‌గారిని నియమించారు. బెంగళూరులో హాథీరాంబావా మఠమునకుగాను నారాయణ్‌దాస్‌ను మఠాధిపతిగా నియమించినారు. పూర్వీకులు, కొందరు మహాంతులు, బంజారా సాంప్రదాయం కలిగిన లంబాడి(బంజారా) మహిళాభక్తులు, చిత్ర పఠాలు ఇప్పటికి ధత్తి ప్రాంతంలోని గోడలపై గోచరించుచున్నవి. హైద్రాబాదు మహానగరంలో గల ముఖ్యదత్త ప్రదేశములోకాని, ఎక్కువ సమాచారములు హాథీరాంబావాకు సంబంధించిన వివరాలు తెలుసుకొనవచ్చును.

హాథీరాం బావా తరువాత మఠాధిపతులు.

1. శ్రీ హాథీరాంబావాజీ బాల బ్రహ్మచారి
2. శ్రీ చంద్రగిరి మహారాజ్‌వారి పుత్రులు, శ్రీ ధర్మదాస్‌గారు
3. శ్రీ గిరిధరదాస్ గారు
4. శ్రీ తులసీదాస్ గారు
5. శ్రీ సేవాదాస్ గారు
6. శ్రీ ధర్మదాస్ గారు
7. శ్రీ భగవాన్‌దాస్ గారు
8. శ్రీరాం కిశోర్‌దాస్ గారు.
9. శ్రీ ప్రయాగదాస్ గారు
10. శ్రీ హరిదాస్ గారు
11. శ్రీ భక్తరాందాస్ గారు
12. శ్రీ లక్ష్మిరాందాస్ గారు
13. శ్రీ గోవర్ధన్ దాస్ గారు
14. శ్రీ తులసీదాస్ గారు
15. శ్రీ ఆత్మారాందాస్ గారు
16. శ్రీ నారాయణదాస్ గారు
17. శ్రీ జానకిదాస్ గారు
18. శ్రీ చేతన్‌దాస్ గారు
19. శ్రీ దేవేంద్రదాస్ గారు
20. శ్రీ మహావీర్‌దాస్ గారు
21. శ్రీ అర్జునదాస్ గారు.

అఖిలభారత బంజారాసేవాసంఘం, ప్రధానకార్యదర్శి మరియు బంజారాల చరిత్ర గంథకర్త అయిన నేను. 3-12-97నుండి 7-12-97వరకు శ్రీబాలాజీ శ్రీహాథీరాం

బావాజీమఠం దర్శనార్థమై కుటుంబసమేతంగా పోయివచ్చినాము. శ్రీహాథీరాం బావాజీ కోరినవరం ప్రకారం ప్రతి బంజారామొదట మఠం దర్శించనిదే, బాలాజీని దర్శించరు. అలాగే మేము మఠంను దర్శించుటకు పోయాము. మేము ఈ మఠమును 1960నుండి దర్శించుచున్నాము. రాను రాను ఈ మఠం చాలా హీన పరిస్థితులలో దిగజారి పోయినది. మహాంత్‌లుఉన్న కలంలో ఏ కొద్దిపాటు సౌకర్యంఉండేది. ప్రస్తుతం ప్రభుత్వం ఈ మఠమును స్వాధీనపరచుకొన్న తరువాత వ్యాపారం మొదలుపెట్టారు. ఉద్యోగులు, భక్తులు ఇచ్చు ముడపులను సగం రసీదు, సగం తమ జేబులలో ఉంచు కొంటున్నారు. గట్టిగా మాట్లాడితే మాకు తెలీదయ్యా! ఎవరకు చెప్పుతారో చెప్పకొండి, మాకు ఒప్ప చెప్పిన పని మేము చేస్తున్నాము అంటారు. ఆ మఠంలో సరియైన మరుగుదొడ్లు లేవు, బంజారా భక్తులను, అక్కడఉన్న పాతబడిన, శుభ్రంచేయని, వరండాలలోను, మైదానంలోను ఉండమంటున్నారు. అసలు బంజారా లంటేనే వారికి ఒక చులకనైన భావన ఏర్పడినది. మాలాంటివారు పోయి విచారించిన సరియైన సమాధానములు లేవు. బంజారా అంటూనే ఆ పైకిపోండి అంటారు. ఆఖరుకునన్నుచూచి, మహాంత్‌కు కుడిభుజం(మేనేజరు అట) రండి అని పిలుచుకొనిపోయి పురాతనభవంతిలో పైభాగమున ఉన్నది. మా అడ్రస్సు తీసుకొని, 50 రూ ఇప్పించుకొని, ఒక రూము వాకిలి తీసాడు, అందులోనుండి గుప్పున దుర్వాసన వచ్చింది. అందులో ఏమీయులేదు, మంచములు లేవు, ఏమిస్వామి అని అడగ్గా ఇదే ఉండేది మీ ఇష్టం ఉంటే ఉండండి అని చెప్పారు. ఇచ్చిన 50రూ వాపసు తీసుకొని, గుమస్తాగార్ని అడిగాను, రూములు లేవండి అన్నారు. కాదయ్యా బంజారా మఠమును స్వాధీనం చేసుకొని అధునాథన రూములను కట్టించి బాడుగలకు ఇచ్చుకొంటూ, మేమువస్తే రూములు లేవంటారు అని దబాయించగా, ఒక్కొక్కరూము 200రూ.లుఉందండి, 500రూ.లుఇవ్వాలి అన్నారు. అలాగైతేనాకు ఇవ్వండి అని చెప్పగా, 500 రూ.లు అడ్వాన్సు తీసుకొని రూమ్ నెం. 9 ఇచ్చారు. రెండు రోజులు ఉన్నాను. తమరు ఖాళీ చేయలేదుకద సార్ అన్నారు. అదేంటయ్యా 500 రూ.లు అడ్వాన్సు తీసుకొన్నావు, లేదు సార్ డిమాండు ఎక్కువగా ఉన్నది అన్నారు. అలాగైతే వారం రోజులనుండి ఉన్నవారికి లేదా అంటే వారు ముందుగా అడ్వాన్సు బుకింగ్ చేసారు సార్ అన్నారు. డబ్బులు, తీసుకొని కూడ మఠంనుండి మమ్ములను తరముచున్నారు కదయ్యా అని చెప్పగా, ఏరోజుకు ఆరోజు తీసుకొనవలయును సార్ అన్నారు, ఈ విధంగా బంజారా మఠం పరిస్థితి ఏర్పడినది.

7-12-97న, దిగువ తిరుపతిలోని హాథీరాంబావాజీ మఠంను, దర్శించుట జరిగినది. అక్కడ సాధువులు, ఈ మఠం, ప్రయోగదాస్‌జీ మంహాత్ ఉన్నప్పుడు అన్ని అభివృద్ధి చెందినవి. గోవిందరాజస్వామిగుడి, మరియు, భక్తులు కాలిబాటన పోవు మార్గమును వేయించటం జరిగినది. అన్ని అభివృద్ధులువారి కాలంలోనే జరిగినవి, పూర్వం మొత్తం దేవస్థానం మఠం మహాంత్‌గారే నిర్వహించేవారు. పనివత్తడి ఎక్కువగుట, స్వామివారి పూజలు చేయుటకు ఆచారులను నియమించి, మఠం నిర్వహణ మాత్రం ఉంచుకొన్నారు. బంజారాలు బాలాజీ పరమ భక్తులు, ముస్లిముల తాకిడినుండి ఈ కొండను రక్షించినది కూడా బంజారాలే. ఈ కొండ చుట్టూ తమతాండాలను కట్టుకొని, స్వామివారిని కాపాడినారు. అని చెప్పారు.

శ్రీ బావాజీవారి ఆస్థులు చాలా ఉన్నవి. ఇప్పుడు బావాజీవారి సొమ్ము 500 కోట్లురూ.లు బ్యాంకునందు డిపాజిట్టు చేయబడి ఉన్నది. నీలమణులతో చేసిన హారములు

మూడుఉన్నవి. నీల మణితో పొదగబడిన గ్లాసు( కప్పు) కూడా మొత్తం బ్యాంకులో భద్రపరచి ఉన్నారు. వాటిపై వచ్చే వడ్డితోనే ఇవి అన్నియు నడిపించుచున్నారు. అని తెల్పినారు. ఈ మఠంలో ఉన్న సాధువులందరు ఉత్తరాదినుండి వచ్చినవారే, తిరుమలలోని మఠమును ప్రభుత్వ అధికారులు నిర్వర్తించుచున్నారు. సాధువులకు మాత్రం శ్రీరాముని పూజించుటకు మాత్రమే పరిమితం చేసిఉన్నారు. ఇందులో ఉన్న సాధువులను ఎవరిని అడిగినా ప్రయాగనుంచివచ్చాము అంటున్నారు. దిగువ తిరుపతి మఠం అంతయు ఉత్తరాధినుండి వచ్చినసాధువులు ఉండుటకు క్రొత్తగా వసితి కల్పించారు, వారికి మూడుపూటలు భోజన సౌకర్యములు, కల్పించుటవరకే పరిమితం చేసి ఉన్నారు. బావా మఠం నందలి రామాలయమునకు సమర్పించిన భోగ్(పూజ) ప్రసాదమును భోజన రూపంలో సాధువులకు పెట్టుచున్నారు. ఇక్కడ ఉన్న బ్రహ్మచారి ఇంద్రదేవదాస్‌ను ప్రశ్నించగా, అయ్యా మేము ఇక్కడ వచ్చిన సాధుజనమునకు రెండు పూటలు భోజనము, ఫలహారము మూడు లేక నాల్గు సార్ల టీని వీరికి కల్పిస్తాము. నాకు ఎండోమెంటువారు నెలకు 600/- రూ మాత్రమే ఇస్తున్నారు. అదే ఒక అటెండరు చేతులు ఊపుకొంటూ వచ్చి, నెలకు 4,000 రూ సంపాదించుకొంటూ న్నారు అనివాపోయాడు.

ఇక బాలాజీ దర్శనమునకు వచ్చు బంజారాలకు ఈ రెండు మఠములలోను, ఏ విధమైన సౌకర్యములు కల్పించబడుట లేదు. బంజారాలు అంటే అక్కడి సాధువులకుగానీ, ఏండోమెంటు ఉద్యోగులకు కానీ వీరిపై ఎటువంటి గౌరవము లేదు. బంజారాలు మాకు హాథీరాం బావాజీ మఠం ఉన్నది అని ఎంతో గర్వంతో వచ్చిన వారు, అక్కడి పరిస్థితులను గమనించి, ఎవ్వరికి చెప్పుకోలేని పిరస్థితులలో, ఎక్కడో ఒకచోట కాలం గడపుకొని పోదాం అని వారి మనస్సులోనేవారు తలంచుకొని పోవుచున్నారు.

శ్రీ హాథీరాంబావాజీ మఠం ద్వారా లభించుచున్న కోటాను కోట్ల రూపాయిలను, ఆదాయమును తమ ఇష్టానుసారం ఖర్చు పెట్టుచూ, దైవ దర్శనమునకై వచ్చిన, భక్తులను మురికి ప్రదేశములలోను, వాసన గుభాళించు ఇరుకు సందులలోను, ఉండమని చెప్పుచున్నారు. బావాజీ ఆదాయంతో కట్టిన వసతి గృహములను రోజుకు రెండు వందల రూపాయలు అద్దెకు ఇచ్చు కొనుచున్నారు. ఇది చాలా అన్యాయం. కనీసం డబ్బు చెల్లించగలిగిన బంజారాలకు కూడ, వసతి గృహములు లభించటంలేదు. ఎండోమెంటువారు ఆదంతయు తమ స్వంత ఆస్థులుగా చలామణి చేసుకొనుచున్నారు. ఇక మీదటైన బావాజీ మఠమునకు సంబంధించిన ఆస్థులన్నింటిని, వెంటనే, బంజారా ధార్మిక సంస్థలకు ఒప్ప చెప్పి, వారి ద్వారా బంజారాల ప్రజోపకార్యములు చేపట్టివలసిన అవసరం ఎంతైన ఉన్నది. ఎగువతిరుపతిలోను, దిగువతిరుపతిలోని శ్రీహాథీరాం బావాజీ మఠం నందుబంజారాల వసతికై ఆధునిక వసతి గృహములను నిర్మించి, పూర్వంవారికి జరుగుచున్న వసతులన్నింటిని, బంజారా ధార్మిక సంస్థద్వారా కల్పించవలయును, లేకున్న బంజారా మఠమును స్వాధీనం చేసుకొన్నట్లే, ఇతర మఠాలను కూడ ఎండోమెంటువారు స్వాధీన చేసుకొనవలయును. ఒకరికి ఒక న్యాయం, ఇంకొకరికి మరొక న్యాయమా? ఈ మఠం ఆస్తులు ఆదాయం ద్వారా, బంజారాల విద్యాభివృద్ధికి ప్రత్యేకమైన విద్యాలయాలను నిర్మించి, బంజారా లిపి ద్వారా బంజారా భాషాభివృద్ధికి పాటుపడవలయును. ఈ మఠం ఆదాయాలనుండి ప్రతి తాండాలోను బాలాజీ మందిరాలను స్థాపించి, వారిభక్తి విశ్వాసాలను అభివృద్ధి పరచవలయును.

# MEMORANDUM OF ASSOCIATION
# BANJARA DHARMIKA PARISHATH, BANGALORE.

(a) Name and Address of the Parishath : BANJARA DHARMIKA PARISHATH.

(b) Its address shall be No. 1057/A, 7th Main Road, Vijayanagar, Bangalore - 560 040.

**AIMS AND OBJECTS OF THE PARISHATH:**

1. To promote spiritual work, establishing spiritual centres, by arranging guru and gurukula ashramas, Mattadhipathis and propagators and performance of poojas and Uttsavas and to protect Banjara tradition and culture.
2. This Parishath shall have at most reverence towards the Banjara Jagadgurus, Mattadhipathis, Sadhus, Masands, Bhagaths Bawas and to their Gurukulaashramas which are promoting spiritual on all mankind and Banjara Community in particular.
3 This Parishath shall have universal spirit of common brotherhood.
4. To spread and strengthen the true message of Sages among Banjaras so as to serve the whole mankind and to inculcate humanity.
5. To arrange for imparting knowledge of Holy Hymns, sacred verses, Holy scripts etc., pertaining to Banjara Community.
6. To promote and strengthen the true spirit if Banjara Dharma and to awake Banjara Community.
7. To promote education, culture and literature and arts by establishing educational institutions, training centres, research centres and libraries, viz. Nursery, Primary, High School, Pre-University Courses, Degree Colleges, Technical and Medical Colleges and training colleges like T.C.H, B.Ed, B.P. Ed & Nurses training Institutes.
8. To reinforcement if Ethical moral value and preserve the rich heroic heritage of over Banjara Culture and develop the scientific temper, humanism and the spirit of equity and also to promote spirit of common brother hood transcending all religion in general and Banjara Community in particular, linguistic regional or sectional diversities and make the people to have compassion for natural environment and living creatures and abuse violence.

9. To make such other programmes for the self sufficiency, self reliance and well-being of the poor, under privileged and deprived women and children, disabled, physically handicapped and mentality retarded men and women.

10. To establish Hostels, Boarding Homes for the comfort of students and teachers.

11. To print and publish books if literary, cultural, religious and scientific value and to establish printing press for this object.

12. To take up the publication of Books, Journals, News Papers and other publications on any subject and sale of the same on no profit and no loss basis regarding Banjara Community.

13. Nursing and maintain Gow-Shala for unserviceable cattels and live stocks and to preserve and protect wild life.

14. To arrange for lectures, seminars, symposia and conferences for promoting spiritual philosophical, educational, cultural activities.

15. To acquire, assist or manage similar instructions which are arranged in the welfare of the people and Banjaras in particular.

16. To establish and run "Health Centres" to serve the humanity as whole.

17. To sponsor economic and social welfare schemes and project to bring about total welfare of Banjaras in collaboration with various official and non-official agencies which are functioning in India and abroad.

18. To undertake, maintain, manage or subscribe to any development works such as establishment of educational institutions, constructing hostel buildings, community halls and arrange for grant of clinics and similar scholarships to needy Banjara students activities conductive for promoting social and cultural status of Banjaras.

19. To arrange to run orphanage, Ashramas and poor feeding centres.

20. To undertake nutrition programmes in various rural-colonies for women and children.

21. To provide and arrange economic assistance to those who specially at the time of natural calamities like draught, floods, earthquakes and fire accidents and road accidents etc.,

22. To undertake all types of rural development programmes.

23. To enlighten the rural people regarding the importance if family planning, adult education to give and develop the useful education whether general or provisional. Moral. Commercial, or technical to root out illiteracy among the rural people and in addition to organise lecture classes, public speeches and to conduct family planning education agriculture, sericulture, horticulture, special environment, social forestry, history, science and technology for the benefit of villagers particularly, the depressed and back-ward classes.

24. To awaken the Banjaras and educate them regarding the bad-certificates of drinking illicit liquor on their families.

25. To undertake implementation of various socio-economic programmes in order to uplift the power of the poor among Banjaras.

26. The income of the Banjara Dharmik Parishath by what ever means will be utilised for the objects of the parishath and shall not be distributed among its members or anybody.

27. The President/General secretary is authorised to correspond with the registrar of societies, Bangalore Urban District, Bangalore.

**LIST OF SUBSCRIBERS:**

| Sl. No. | Name & Address | Designation |
|---|---|---|
| 1. | Tharanath Pawar | President |
| 2. | Lakshmana Rao | Working President |
| 3. | Ramaswamy Gor | Vice President |
| 4. | K. Rupla Naik | Vice President |
| 5. | C. S. Kalyan Naik. | General Secretary |
| 6. | C. Lakshma Naik | joint Secretary |
| 7. | Roopasingh Umaji Chavan | Treasurer |
| 8. | Susheelabai R. L. Naik | Member |
| 9. | Bheema Naik. | Member |
| 10. | Lalya Naik Sama Naik.Chauhan | Member |
| 11. | Sham. C. L. | Member |
| 12. | Dharam Singh C. Naik | Member |
| 13. | Kheera Naik | Member |
| 14. | Thanaji Rathod | Member |
| 15. | Rukmini Bai Dr. L. Rudra Naik | Member |

## BYE-LAWS OR RULES AND REGULATIONS OF THE BANJARA DHARMIKA PARISHATH.

1. It shall be termed as "BANJARA DHARMIK PARISHATH".
2. General body of the Banjara Dharmika Parishath and include Banjara Men and Women above 18 years of age duly registered as ordinary members. Life members and patrons on payment of prescribed fees and signed with registration book maintained for the purpose.
3. Chief Patrons means a member for life who has registered himself / herself as such member on payment of Rs. 10,000 and above.

3\A Patrons means a member for life who has registered himself / herself as such member on payment of Rs. 10,000 and above less than Rs.25,000/-

4. Life Member means a member for life who has registered for himself or herself as such on payment of fees of Rs.5001.
5. Ordinary Member means a member who has registered himself or herself as such on payment of fees of Rs. 101.
6. The Membership fee payable by an ordinary member, is to be paid in advance annually in the month of March of the each year. An ordinary member who fails to pay his subscription before the end of the 31st March of each year will automatically cease to be a member for that year.

## EXECUTIVE COMMITTEE OR GOVERNING BODY

(a) It shall be competent for the Banjara Dharmik Parishath to Constitute an Executive Committee Consisting of its President. One Working President 5 Vice Presidents, General Secretary, 7 Joint Secretaries, Treasurer and 35 Executive Committee members.

(b) In the event of any office of membership falling vacant due to death, resignation, removal or dismissal in the course of three years term. It shall be competent for the executive committee to fill up the vacancy by electing another member and getting it approved in the ensuring General Body Meeting if this Parishath.

(c) The Office bearer of this Parishath shall be Ex-officio Office bearer of the Executive Committee.

## MEMBERSHIP:

(1) Any Banjara of and above the age of 18 years willingly subscibing to aims and objects of Banjara Dharmik Parishath

shall be eligible to apply for being admitted as member of the Parishath in a prescribed form vide Appendix-I.

(2) Receipt of the application, the Executive Committee shall consider his request and pass an order either granting or rejecting admission,

| | |
|---|---|
| i) Ordinary Member | Rs. 101/- |
| ii) Life Member | Rs. 5,000/- |
| iii) Patron Member | Rs. 10,001/- |

iv) There shall be no limit on donation either in kind or cash.

X. (1) Borrowing Powers : The executive committee shall have powers for the benefit of the Banjara Dharmik Parishath to raise loans to the any extent on the security or otherwise of immovable properties of the special body meeting convened. for the purpose in a manner prescribed for the purpose by a majority of two third (2/3) of the members present and voting.

(2) Contribution received from rich donors, patron members, like members, well-wishers, philanthropists and ordinary members, subscriptions.

(3) Financial assistance from state of Central Govt and Foreign Governments.

(4) The funds of the Parishath shall be invested in the modes specified under the provisions of Sec.13(9) (d) read with Sec. 11(5), of the Income Tax Act 1961 as amended from time to time. The amendments to the bye-laws/rules and regulations shall be made which may prove to the repugnant ti the provisions of section 2(15), 11, 12, 13 and 80G of the Income Tax Act 1961 as amended from time to time. Further no amendment shall be carried out without the prior approval of the commissioner if Income-Tax.

REG No.712/96/97 Ph : 3300203

# BANJARA DHARMIKA PARISHATH, BANGALORE.

No. 1057/A, 7th Main Road, Vijayanagar, Bangalore - 560 040.

## APPLICATION FORM FOR MEMBERSHIP

To :
The General Secretary,
Banjara Dharmik Parishath,
BANGALORE.

1. Name : **B. CHEENIYA NAIK**
2. Father's Name/Husband Name : B. CHEENIYA NAIK
3. Permanent Address :
4. Postal Address :
5. Phone No. :
6. Age :
7. Occupation :
8. Has he been involved in any Criminal Activities :
9. Type of Membership (Ordinary/Life) :
10. Amount Receipt No. & Date :
11. Other Particulars if any :

The information furnished above are to the best of my knowledge and belief. I request that my application may kindly as considered for Membership.

Date :
Place :

(Signature of the Applicant)

For Office Use :

Sri..........................................residing at......................................
..........................................................................has applied for a membership of Banjara Dharmik Parishath and the same has been placed before the Executive Committee, held on............... Which has been passed in its resolution on this behalf vide No...... & Date............................. and resolved to accept/not to accept of his membership as ordinary/life of the Banjara Dharmik Parishath.

Place :

Date :

General Secretary,
Banjara Dharmik Parishath
Bangalore.

# మీటూ భుక్యా

మీటూ భుక్యా బంజారాలలో పేరుగాంచిన గొప్ప వ్యక్తి. ఇతను రాథోడ్ వంశస్థుడు. నెణావత్ గోత్రీయుడు. ఈయన తాండా గోవులను కాస్తూఉండేవాడు. ఇతను దైవభక్తిపరుడు. అడవిలో తాండా గోవులనుకాస్తూనే ఘోరతపస్సుచేసాడు.ఈయన తపస్సునుమెచ్చి, 12 హస్తముల ఆదిశక్తి ప్రత్యక్షమై కొన్నివరములను ప్రసాదిస్తుంది. ఈ తపస్సుకాలంలో గోవులన్నియూ ఆహారం, నీటికొరతలేకుండా ఆరోగ్యముగాఉండి, క్రూరమృగములు వీటి దరిదాపులకు రాకుండాఉన్నాయి.



మీటు భుక్యా సమాధి - గర్భగుడి పోమియానాయక్ మరియు బి. చీనియానాయక్

తనకు ఆదిశక్తి ప్రత్యక్షమైన విషయమును తాండాప్రజలకు చెపుతాడు. ఇతని మాటలను ఎవ్వరు నమ్మరు. పైగా ఎగతాళిచేస్తారు. తనశక్తిని నిరూపిస్తాను. పాడుగాటి పోయ్యిని త్రవ్వి 60మొపులు గంధంచెక్కలు తెచ్చి, మండించండి, ఒకమణగు హారతి కర్పూరం తెండి అని తెల్పుతారు.

అప్పుడు మనగోవులనుకాచి కాలం గడుపుచున్నవీనికి, శక్తిఏమిటి ప్రత్యక్షమ య్యేది ఏమిటి. పోయి తాండాచుట్టూ పడిఉన్న మానవులవ్యర్థ పదార్థమును తెచ్చి వారు ఒకపెద్దమంటను ఎర్పాటుచేసి అందులో తెచ్చివేయండి ఇప్పుడు వీనిశక్తి చూస్తాము. అని ఆతనిని హేళనచేస్తూ, మొత్తంమలీనంతెచ్చి అందులోవేస్తారు. ఆ మలీనంఅంతా మండి పొగ ఊరంతాకప్పుకొని, మంచిసువాసనలను వెదజల్లుతుంది. అంతట వారు అతని కాలుపైబడి మమ్ములను క్షమించమని వేడుకొంటారు. అప్పటినుండి మీటూ భుక్యాను తమ నాయుకుడుగా ఎంచుకొన్నారు.

శ్రీ భగవాన్ సేవాలాల్ మహారాజ్ బాలబ్రహ్మచారి జన్మ స్థలం చూచుటకు 15-7-97 పోయిన రోజుననే, మీటూ భుక్యా సమాధినికూడ దర్శించటం జరిగినది. గుంతకల్లు- గుత్తి బస్సురూటుకు, రైలు లైనుకు మధ్యలో తిమ్మాపురం వద్ద సమాధి చేయబడి ఉన్నది. మీటూ భుక్యా సమాధి అయినప్పుడు ఆ సమాధి క్రింద ధనం పాతి ఉంచినారని దొంగలు, (గుప్తధనపరిశోధకులు) ఒకరోజు మీటూ భుక్యా సమాధిని త్రొవ్వినపుడు, వారి వారసులైన నేణావత్‌తాండా(పులగుట్టపల్లితాండా)లోని వారి సంతతివారికి స్వప్నంలోవచ్చి, నాసమాధిని త్రవ్వి ధనం ఎత్తుకుకొని పోవుటకువచ్చిఉండిరి. వారు నా సమాధి త్రవ్వి ధనం దోచుకొని పోయినారు. మీకు నిదర్శనంగా సమాధికి ఒకమూలలో ఒక్కరూపాయిబంద దొరుకుతుంది చూడండి అన్నారట. వారు నామీద మంత్రము ఉపయోగించి నా నోరు కట్టిపడివేసారు అన్నారట, ఆ స్వప్నం గూర్చి తాండావారందరకి చెప్పినారు. అది ఎంతవరకు నిజమో చూచిరమ్మని పంపించారట. అప్పుడు అతనువచ్చి సమాధి చూడగా మొత్తం సమాధిని త్రవ్వి ఉన్నారట. తన స్వప్నంలో చెప్పిన రూపాయి బంద గురించి చూస్తే సమాధికి ఒకమూలలో దొరకినదట. ఆ రూపాయబందాను వారు అలాగే జాగ్రత్తగాదాచిఉంచారు.

మేము ఆ తాండా పోవుటకు గుంతకల్లువచ్చి అక్కడినుండి పులగుట్టపల్లితాండా బస్సు దొరకనందున రాత్రి 9 ది కు వేరే బస్సుఎక్కి మధ్యలోదిగి సుమారు 3 కి.మీ. కాలి నడుకన తాండాచేరుకొన్నాము. శ్రీ రూప్లానాయక్ మీటూ భుక్యా వంశీయుడు. అంతలో ఎవరోవచ్చి సేవాలాల్‌మందిరంలో భజన చేస్తున్నాము అని తెల్పగా మేముపోయి ఆ భజనలోపాల్గొన్నాము, నగారామెగిస్తూ, పళ్లెములు తాళములు వాయించుకొంటు మీటూభుక్యామీద పాటనుపాడారు. మీటూభుక్యా గొప్ప యోధుడని, ఖేరాళి తాండా ప్రక్కనుంచి వచ్చాడని, ఖేరాళితాండా అనగా, కదిరి తా ముదిగుబ్బ మండలం అడవిబ్రాహ్మణపల్లె తాండాను ''ఖేరాలి'' అంటారు.

అనగా బంజారాలు, తమ 'లదణి' వ్యాపారంను(బిడారులు), బ్రిటీషువారు ప్రారంభించిన, రోడ్లు, రైళ్ల కారణంగా, వీరి వ్యాపారం అంతాపడిపోయినది. అప్పుడు వీరు గుంపులు గుంపులుగా 'లదణి' వ్యాపారం చేసారు. అలాంటి వారిలో ఒక గ్రూపు గత్తి తాలుకా బోడిడిబండ అనుచోట, జాత్ -భుక్యార్ పంచాయితి చేసి వారి వ్యాపార లావాదేవీలను

పంచుకొని పన్నెండు తాండాలుగా విడిపోయారట. అవి 1. ఉప్పారపల్లి తాండా 2. భామట్టం తాండా 3. రోళ్లపాడు తాండా 4. ఎల్లమ్మగుట్ట తాండా 5. దొంగలగుట్ట తాండా 6. పాతర గుడి తాండా 7. మిద్దివాళో తాండా 8. చిగురగుట్ట తాండా 9. గుండాల తాండా 10. లక్ష్మి తాండా 11. ఝుర్పలార్ తాండా 12. కుంట తాండా. ఈ విధంగా పూర్వంవారి వారి 'లదణి' లను మాని తాండాలుగా విడిపోయి స్థిరనివాసము చేసుకొన్నారు.

అలాగే అడవిబ్రాహ్మణపల్లి తాండా(ఖేరాళి తాండా) లో ఒక 'లదణి' ఆగినది దానికి పెద్ద ఘట్టంస్వామేనాయక్‌గారు. ఈయనగారికి 16వేల ఎద్దులతో వ్యాపారం సాగించేవారు. వీరు కూడా తమ వ్యాపార లావాదేవీలను పంచుకొని కదిరి, పెనుకొండ ప్రాంతంలోని తాండాలుగా విడిపోయి ఉన్నారు. అలాగే మన్యాఝుర్పల ఇతను 60తాండాలకు నాయుకుడు. అనగా అతని 'లదణి' ఒకటి కొడికొండ ప్రాంతంలో తాండాలు. మంజ్యాఖోలా ఇతను 12తాండాలకు నాయకుడు. ఇతనికి ఒక గ్రూపు 'లదణి' నడిపించారు. ఈ విధంగా బంజారాలు బ్రిటీషువారి పాలనవలన కొన్ని వేల–వందల సంవత్సరాలనుండి చేసుకొని వస్తున్న వ్యాపారము పడిపోయినది. ఉన్నవారు ఏదోఒకరకంగా బ్రతుకు తెరువు ఏర్పరచకొనగలినారు. కానీ వీరిని ఆశ్రయించి జీతాలపై అధారపడి జీవించిన కుటుంబాలు ఎన్నో ఉండినవి. ఏ సంపద లేక, ఉండుటకు ఇల్లు లేక పంట పండించుటకు పొలం లేక పెట్టుబడులు లేక నీటిలోని చేపలా బయటవడినట్లు వీరి గతి అయినది.

అప్పుడు మీటూ భుక్యా చాలా కలత చెందాడు. వీరిని ఏ విధంగా బ్రతికించేది, ఇదంతయు భారతదేశమును ఆక్రమించుకొని, ప్రజలు జీవించుటయే ఒక సవాలుగా ఏర్పడినది. దీని కంతటికి కారణం అంగ్లేయులే అని తలంచి. పెండ్లికాని 60మంది యువకులైన యోధులను తాండా విడచి రమ్మన్నారు. అప్పుడు మొదట 30మంది వారి వెంట బయలు దేరారు. వారికి తన ఆశయాలన్ని బోధించారు. మరి కొద్ది రోజులుకు 30మంది యువకులు జత అయ్యారు. వీరందరిని తీసుకొని, గుత్తి కోటను బళ్ళారి కోటను, దోచటం మొదలు పెట్టాడు, తరువాత పరుగెత్తే రైళ్ళను ముట్టడించాడు, తమకు దొరికిన దంతా దోచుకొని, నిరాశ్రయులైన బంజారాలకు పంచి పెట్టాడు. బ్రిటీషువాళ్లను కొన్ని రోజులు ముప్పతిప్పలు పెట్టి మూడు చెరవులు నీళ్ల త్రాగించాడు ఒక చోట కనపడినట్లు కనపడి మాయ మయ్యేవాడట, రైలు పెట్టెలలో అయితే ఒక పెట్టెలో, కనిపించినట్లు కనిపించి మరియొక పెట్టెలో కనిపించేవారట.

ఈ విధంగా ఆంగ్లేయుల గుండెలలో గుబులు పుట్టించారు, హింది సీరియల్ ''యుగ్'' మాదిరి, వారినిఎక్కడ పడితే అక్కడ చంపటం, చేతికి అందినదంతా దోచుకొవటం చేసారు. తనతోటివారు ఒక వేళ దొరికిపోయిన తన పేరు మాత్రం చెప్పవద్దండి అన్నారట, వారిచేతులకు బేడిలువేసిన ఊడిపోయేవట. కాని వారిని పట్టుకొనిపోయి హింసించేవారట. ఎంత హింసించిన చెప్పేవారు కాదట. కాని ఒక్కడు మాత్రంవారు పెట్టే హింసలకు తట్టుకొనలేక మీటూ భుక్యా అని చెప్పడం. అక్కడినుండి తన పేరు బయటపడింది. ఒక రోజు మీటూ భుక్యా గుర్రం ఎడమకాలు ''టోఖర్ లాగిచ్'' రాయిని కొట్టుకున్నదట. అనాటినుండి తన శక్తి తగ్గి, కాలధర్మం నొందినాడు. ఈ విధంగా బంజారాలలో, భక్తిలోను, శక్తి సామర్థ్యములోను అన్ని రకాలుగా పేరు ప్రఖ్యాతులు గాంచి పూజించబడుచున్నారు.

దొంగలు త్రవ్విన తన సమాధిని తరువాత తన వంశీయులు గుఱ్ఱం పై స్వారీ చేస్తున్నట్లుగా శిల్పము చెక్కించి సమాధికి గర్భగుడిని కట్టించారు. ఆ తరువాత ఇరుప్రక్కల గోడలతో రాతి స్థంభాలు, రాతి దూలములతో సుమారైన మంటపము కట్టించారు. చుట్టు ప్రక్కల బంజారా తాండావారు. కర్నాటకనుండి బంజారాలు, గుల్బర్గ, ధార్వాడ్, రాయచూరు మరియు మొత్తం కర్ణాటకం, తెలంగాణ ప్రాంత ప్రజలు, యాటలు తెచ్చి పూజలు చేసుకొని పోతూవుంటారు. గుంతకల్లునుండి రూ 2.50 బస్సు ఛార్జి అవుతుంది. గుత్తి నుండి వచ్చువారు తిమ్మాపురం బస్సుటికెట్ తీసుకొనవలయును.

అక్కడఉన్న ఆంజనేయ స్వామి గుడివద్ద దిగి దర్శనం చేసుకొనవచ్చును. ఆంజనేయ గుడి కూడా మీటూ భుక్యా కట్టించారు. అంటారు పూర్వం అక్కడే మీటూ భుక్యా తాండా ఉండినది. అయిన చనిపోయిన తరువాత అక్కడ నుండి పోయి వేరు తాండాలుగా కట్టుకొన్నారు.

# మథుర( బృందావన్) పవిత్ర స్థలంలో బంజారాల మఠం ఉదాసిటోలా

ఔసింగపూర్ మథురా పట్టణంలో బంజారా సమాజ్‌యొక్క మహాత్ముడు. తపస్వీ బాబా యమునా నది ఒడ్డున బృందావనం దగ్గరలో కొన్ని వందల సంవత్సరముల క్రిందట ఒక చిన్న గుట్టపై నివసిస్తూ ఉండిరి. ఉదాశీబాబా తన శిష్యులతో పాటు భగవంతుని నామమును ధ్యానం చేస్తుండిరి. హిందువుల బృందావన పుణ్యస్థలం అంటుండేవారు. అక్కడ గోకుల అష్టమినాడు లక్షల మంది భక్తులు వచ్చి ఉత్సవం జరుపుచుండిరి.

ఇటువంటి పుణ్యస్థలంలో అన్ని జాతులు ప్రజలు తమ భక్తి భావనలను ప్రకటించుకొనుటకువచ్చు వారికి, వారి వారి ధర్మశాలలు మందిరాలు ఉన్నవి. అదే విధంగా ఉదాశీబాబా యొక్క తపశ్చర్య మరియు దీక్షలో పవిత్ర జమునానది ఒడ్డున ఒక చిన్న గుట్టపైన దేశంలో బంజారాల భక్తుల సౌకర్యార్థం, వారి సహకారంతో వందల మంది బంజారాలు ఉండుటకు అనుకూలమైన ఒక ధర్మశాల, ఏనుగులు నిలుచుటకు ఒక సత్రం కూడా ఉన్నది ఈ హాథీ(ఏనుగు) ఉండేచోటులో బంజారాలు కొన్ని వేల సంవత్సరములనుండి ఏనుగులను పెంచుచుండిరట.

గోకులాష్టమినాడు కూడిన హిందువులు ఊరేగింపు చేస్తారు. అలాగే బంజారాలు కూడ ఈ ఏనుగుల స్వారితో ఊరేగింపు చేస్తూ ఉండిరి . ఈ ధర్మశాల సుమారు 75 సెంట్ల భూవైశాల్యంగల స్థలంపై నిర్మించబడి ఉన్నది. ఉదాశీబాబాగారి వంశముతోపాటు వారి శిష్యులు ఈ ధర్మశాల, చరిత్రాత్మకమైన ఏనుగు శాలలను, సంరక్షిస్తువచ్చారు. ఇప్పుడు అక్కడ ఏ ఉత్సవములు ఉండవు. అందరు బ్రహ్మచారులు ఉంటారు. ఈ స్థానము ''ఉదాశిటోలా'' అను పేర ప్రసిద్ధిగాంచినది. ఇక్కడ బంజారాల యొక్క కృష్ణదేవస్థానం మరియు చరిత్ర ప్రసిద్ధి చెందిన స్థలం అయినది. ఇది తెల్పినవారు : నేత్రపాల్‌సింగ్ నేతాజీ

# శ్రీ దేవపుర హట్టి నానూసాద్ బావాజీగారు

శ్రీ నానూసాద్ బావాజీగారు 1852 సంవత్సరములో పవార్ వంశం, నూన్‌సావత్ గోత్రీయుడు. శ్రీ కీరానాయక్, ధర్మపత్ని ధసలీబాయిగారికి దేవపురతాండా చిత్రదుర్గ, తాలుకా, జిల్లా, కర్ణాటక రాజ్యంలో జన్మించారు. వీరు బాలాజీ దైవభక్తులు శ్రీ ఏడుకొండలవారిని తన జీవితంలో 65 సార్లు పాదయాత్ర చేసి దర్శనం చేసుకొని ఉన్నారు. వీరు స్వామీ దర్శనంతో పాటు కంచి, కాళహస్తి, మధురై దేవస్థానములను కూడ దర్శించి భక్తి పారవశ్యులైనారు.

ప్రతి సారి తన వెంట సుమారు 100 మందికి పైబడిన భక్తాదులను తీసుకొని పాద యాత్ర చేశారు. వీరు 108 సార్లు రైలు ప్రయాణం చేసి శ్రీ తిరుమల తిరుపతి స్వామిని దర్శించి భక్తులైనారు. వీరు శ్రీ స్వామి కృపవలన భగత్ అయి బంజారా జాతి సేవ చేసినారు. భగవంతుడు వీరి భక్తికి పారవశుడై వీరి నోటినుండి వెలువడిన ప్రతి వాక్కు ఒక శక్తిగా మారి వారు చెప్పిన ప్రతి కార్యం సఫలమగుచుండెను. ఈ విషయంను గ్రహించిన బంజారాలు వారిని తమయొక్క భగత్‌గా ఎంచి వారి ఆజ్ఞలను పాటించారు. వీరి పేర బంజారా స్త్రీలు జానపద గీతములు ఈ విధంగా పాడుకొంటారు.

''నాను సాదేన భగతాయి ఖోల ఛ!
నాను సాదేన నంగారా ఖోల ఛ!
నాను సాదేన వాజా ఖోల ఛ!
నాను సాదేన భగతాయి ఆవ ఛ!
నాను సాదేన బాలాజీ ఖోల ఛ!

శ్రీ నానుసాద్‌గారి భక్తిని, వీరు చేయుగానమును, భజనలను కీర్తించుటకు బంజారా మహిళలు పై విధంగా పాడుకొంటారు. శ్రీ వెంకటేశ్వర స్వామి సన్నిధిలోని సాధు-సంతులు వీరికి ఒక అగ్ని పరీక్షవంటిది పెట్టారు. తిరుమలలో ఉన్న ఒక కొలనులో ఏడు ఫణము(పడగలు)లుకల కాళసర్పం ఉన్న బావిలో స్నానం చేసిన నీ మహిమ మాకు అర్థమౌతుంది అని తెల్పగా శ్రీ బావాజీ నానుసాద్‌గారు, శ్రీ వెంకటేశ్వరుని ధ్యానించి అందులో స్నానమాడి వచ్చారు. ఈ విధంగా వారికి ఎన్నో పరీక్షలు పెట్టటం జరిగినది.

వీరు హోమములు చేస్తూ ఉండిరి. వీరు వృద్ధాప్యంలో స్వామి దర్శనం చేయుటకు వీలు కలుగనందున, తన తాండాలో శ్రీ బాలాజీ మందిరమును నిర్మింప చేసి నిత్య పూజలు జరుపుచుండిరి. దీనినే బంజారాలు చిన్న తిరుపతి అని కూడ అంటారు. ఈ విధంగా శ్రీ

బావాజీ నానుసాద్ మహంత్‌గా కూడ పేరు గాంచారు. వీరు సర్వ జనులకు పూజ్యులైనారు. వీరు తమ అంతిమ శ్వాసను 1977 సంవత్సరములో వదిలి దైవసన్నిధి చేరుకొన్నారు. వీరి మనమడు శ్రీ జగత్ గురు సేవాలాల్ సంగన బసవ స్వామీజీగారు.

# సంగీత సామ్రాట్- తాన్‌సేన్ బంజారా

రీవాజ్ రాజ్యమును పాలించు రాజు పేరు రాజరామచంద్రుడు. వారి రాజధాని బాదవగడ్. ఆ రాజ్యంలో తాన్‌సేన్ బంజారా ఉంటారు. ఈ బంజారా గొప్పజ్ఞాని. వీరి గురువుగారు స్వామి హరిదాస్‌గారు. తాన్‌సేన్‌గారు ప్రజాకవిగా పేరుగాంచారు. వారు ప్రజలను చైతన్య పరచుటకు గాను జానపదరూపంలో పాటలు పాడుతూ ప్రజలకు జ్ఞానభోధన చేస్తూఉంటారు. వారి పాటలను విన్న రాజభటులు, ప్రజలను రెచ్చగొట్టే పనులు చేస్తున్నారని బంది చేసి రాజదర్బారులో హాజరు పరుస్తారు. ఆ విషయమును తెలుసుకొన్న రాజపుత్ర బంజారాలు రహస్యంగా ఆయుధాలతో రాజదర్బారులో ప్రవేశిస్తారు.

రాజదర్బారులో శ్రీతాన్‌సేన్‌గారిని ప్రవేశపెట్టినారు. రాజాగారు ఏమిటి అభియోగం అని ప్రశ్నించుతారు. అప్పుడు తాన్‌సేన్‌గారు ప్రజలను రెచ్చకొట్టే విధంగా జానపదపాటలను పాడి చైతన్య వంతులను చేస్తున్నారని తెల్పుతారు. అది విని రాజాగారు తాన్‌సేన్‌తో ఆ విషయం నిజమేనా అని ప్రశ్నించుతారు. అప్పుడు తాన్‌సేన్‌గారు పాటలలోనే జవాబు ఇస్తారు. నా శిరస్సు ఖండించినా సరే నాకు సమ్మతమే. నేను ప్రజా సంక్షేమం గూర్చి ఈ విధంగానే పాడుతాను అని జవాబు ఇస్తారు. రాజారామచంద్రగారు నాలాగా అతనిలోను రాజపుత్ర రక్తం ప్రవహించు చున్నది అని గ్రహించి, తాన్‌సేన్‌గారు పాడిన పాట యొక్క మర్మమును తెలుసుకొన్న రీవా నరేష్ రాజారామచంద్రగారు తాన్‌సేన్‌గారిని రాజకవిగా గుర్తించి తన దర్బారులో ఉండవలసినదిగా ప్రార్థించుతారు. ఆవిషయం విన్న బంజారాలు సంతోషంతో వెళ్లిపోతారు. ఈవిధంగా కొద్ది రోజులు గడచిపోయినవి.

ఈ విషయం అక్బరుపాదుషాగారికి తెలస్తుంది. అక్బరు పాదుషాగారు ఒక రాజదూతను రీవాజ్ రాజారామచంద్ర దర్బారుకు పంపి, వెంటనే తాన్‌సేన్‌గారిని ఆగ్రాకు పంపించవలసినదిగా కోరినారు. రాజారామచంద్రగారు అంగీకరించకున్న తాన్‌సేన్‌గారు నచ్చచెప్పి ఆగ్రా ప్రయాణంసాగిస్తారు. బాదవగడ్‌నుండి ఆగ్రాకు తాన్‌సేన్‌గారిని పల్లకిలో సాగనంపేటప్పుడు వారిపై ఉన్న గౌరవముతో పల్లకిని కొంతదూరం మోస్తారు. రాజా రామచంద్రగారు.

తాన్‌సేన్‌గారు ఆగ్రా చేరుకొని, అక్బరు పాదుషా దర్బారులో ప్రవేశిస్తారు. రాజుగారు, తాన్‌సేన్‌ను సగర్వంగా ఆహ్వానించి మర్యాదలు గావిస్తారు. తాన్‌సేన్‌ద్వారా రాజ రామచంద్రగారి వ్యక్తిత్వం తెలుసుకొన్న అక్బరు పాదుషాగారు, రాజ రామచంద్రుల వారికి కృష్ణ జన్మాష్టమికి ఆగ్రాకు అహ్వానించారు. రాజారామచంద్రగారు వారి అహ్వానమును మన్నించి ఆగ్రాకు బయలుదేరి వెళ్లుతారు. అక్బరు పాదుషాగారు రాజారామచంద్రులను రాజ

మర్యాదలతో స్వాగతం పలికి, తనతో సమానంగా ఆశీనులు కమ్మని చెప్పుతారు. అప్పుడు రాజారామ చంద్రగారు, నాకు అంత గొప్ప ఆసనం అవసరం లేదు. నా సోదరుడు తాన్‌సేన్ ఆసనంపై కూర్చునే అనుమతి ఇవ్వండి అంటారు. తమరి ఇష్టం అంటారు. అప్పుడు వారిద్దరు కలసుకొని రాం రామీ చెప్పుకుని ఇద్దరు ఒకే ఆసనం పై కూర్చుంటారు. అక్బరు పాదుషా దర్బారులో తాన్‌సేన్‌ను నవరత్నాలు అంటారు.

అక్బరు పాదుషాగారు రాజారామచంద్రుల వారితో సంభోదిస్తూ తమరు మాకు ఒక గొప్ప కవిని పరిచయం చేయించినందులకు మాకు చాలా సంతోషంగాఉన్నది తమరు, తమకు కావలసిన ఒక కోరికను కోరుకొండి ఇస్తాను అంటారు. అప్పుడు రాజారామచంద్రగారు క్రిష్ణాష్టమి వేడకలు అయిపోయిన తరువాత కోరుకొంటాను అంటారు. అప్పుడు సరే అని తెల్పి వేడకలు జరుపుకొంటారు. ఆ తరువాత రాజదర్బారులో అక్బరు పాదుషాగారు రాజారామచంద్రరాజుగారిని తమ కోరికను కోరుకొండి అంటారు. అప్పుడు రాజారామచంద్రగారు నాకు నా సోదరుడు తాన్‌సేన్ స్వరంకన్న గొప్ప కోరిక ఏమున్నది అంటారు. అది విన్న అక్బరు పాదుషాగారు అంటే తమరు తాన్‌సేన్‌గారిని వెనక్కు పంప మంటారా అని అంటారు.

రాజారామచంద్రరాజుగారు అంటారు, తమరు రాజపుత్రులకు అల్లుడవుతారు. రాజపుత్రులు అల్లులకు ఇచ్చినది వాపసు తీసుకోరు. ఇచ్చుకొంటారే కాని పుచ్చుకోరు ఈ రాజపుత్రులు అంటారు. ఆ విషయం విన్న రాజుగారు రాజారామచంద్రగారు మొత్తం భారత సామ్రాజ్యమునే ఇవ్వమన్నా ఇచ్చేవాడిని అని దర్బారులో తెల్పుతారు. అప్పుడు రాజారామచంద్ర గారు తమ దర్బారులో తాన్‌సేన్‌గారి స్వరం వినవలయుననే కోరిక మాత్రం ఉన్నది అంటారు. తాన్‌సేన్‌గారు సంగీతంను గానం చేస్తారు. సూర్యుడు ఉదయించేది మానివేసినా, చంద్రుడు ఉదయించేది మానివేసినా నేను మాత్రం నా స్నేహితుణ్ణి మరువను అని రీవాజ్ రాజైన రాజారామచంద్రులను గూర్చి అక్బరు పాదుషా దర్బారులో గానం చేస్తారు. ఇది విన్న అక్బరు పాదుషాగారు వారి గాథ ప్రేమపదమైన స్నేహంగూర్చి ఎంతో సంతోషించుతారు.

కొద్దిరోజులకు తాన్‌సేన్‌గారి భార్య మరణిస్తుంది. ఆ దుఃఖమును భరించలేక తాన్‌సేన్ రాజదర్బారుకు పోవటం మానివేస్తారు. అది చూచిన అక్బరుపాదుషాగారు వారిని ఏవిధంగా సంతోష పరచవలయునని ఆలోచిస్తుంటారు. అప్పుడు రాజపుత్ర స్త్రీ అయిన అక్బరుపాదుషా భార్య తను స్వామి సూరదాస్ శిష్యులు గావున వారిని కొంత కాలం, వారి వద్దకు పంపించిన బాగుండునని తెల్పుతారు. అది మంచిది అనుకొని అక్బరుపాదుషాగారు తాన్‌సేన్ గారిని దర్బారుకు హాజరుకావలసినదిగా రాజభటుల ద్వారా అహ్వానం పంపుతారు. నా విషయం తెలసి కూడ రాజుగారు దర్బారుకు రమ్మనటం ఉచితంగా లేదు అంటారు. అంతలోనే అక్బరుపాదుషాగారు తన మాటను అందుకుంటారు. అది చూచి తాన్‌సేన్‌గారు ఆశ్చర్య చకితులౌతారు. తమరికి ఎక్కడ కూర్చోబెడుదును మహారాజా అనితెలుపుతారు. నాకు నీవు రోజు ఎక్కడ కూర్చొని సంగీత సాధన చేస్తారో ఆస్థానంకి తీసుకుపొండి అని తెల్పివారిద్దరు అక్కడ ఆశీనులై మాట్లాడుకొంటారు. అప్పుడు అక్బరుపాదుషాగారు మీరు విచారించకూడదు అని చెప్పగా, ఏమి తెల్పుదును మహారాజా నాగొంతుక పెగలటం లేదు. నేను ఏమి

చేయవలయును. అప్పుడు అక్బరుపాదుషాగారు తమరు కొంత కాలం విశ్రాంతికై తమగురువులు సూరదాసుగారి ఆశ్రమముకుపోవచ్చు కదా అంటారు. అది విని చాలా సంతోషించి, అలాగే నాదొక కోరిక అని అక్బరుపాదుషా గారు తెల్పి, తాను కూడ సూరదాసు, ఆశ్రమం దర్శించవలయునని ఉన్నది. కాని రాజవేషంలో కాకుండా మారువేషంలో పోవలయునని నిశ్చయిస్తారు.

అక్బరుపాదుషా, తాన్‌సేన్ గారు స్వామి సూరదాస్ బృందావనంలో ఉండుటవలన మధురకు ప్రయాణమై పోతారు. అది రాత్రీవేళ అయినందున కోట ద్వారములు మూయబడి ఉంటుంది. ద్వార పాలకునికి ద్వారం తీయమని ఉత్తర్వు ఇస్తారు. ఆతను కొట ద్వారం తీయటానికి అంగీకరించడు. అప్పుడు సైనికులు తాన్‌సేన్‌గారు బయట ప్రయాణమై పోవుచున్నాడు నీవు తాన్‌సేన్‌ను ఎరుగవా, రాజుగారును గుర్తించలేదా అని చెప్పుతారు. నేను గుర్తించాను. కానీ నా పై అధికారం లేనిది సాధ్యపడదు అని ఖచ్చితంగా తెల్పుతాడు. అంతలో అధికారి వస్తారు.. ద్వారం ఎందుకు తెరవలేదు. రాజుగారిని గుర్తించలేదా అని సైనికుడిపై కోపగించుకొంటారు. అక్బరుపాదుషా అది చూచి అధికారిని దండించుతారు. ఆ సైనికుడు పాదుషా గారిని నమస్కరించినపుడు ఎడమ చేతితో చేస్తారు. అదిచూచిన అధికారి రాజుగారిని ఎడమ చేతితో నమస్కారం చేస్తావా అని గద్దించుతాడు. అప్పుడు అక్బరుపాదుషా గారిని క్షమించమని, తనకు కుడిచేయిలేదని జవాబు ఇస్తారు. నీవు ఒక్క చేతితో ఎలా యుద్ధం చేస్తావు అని అంటారు. మీ సైనికులలో చాలా మందికి చేతులు లేవు అయిన మీ సేవలు చేస్తున్నారు అని చెపుతాడు. అతని పేరు సంషేర్‌ఖాన్. అతని రాజభక్తిని మెచ్చుకొని అక్బరుపాదుషా నీకు ఎప్పుడైన అవసరం వచ్చినపుడు నన్ను దర్శించుకొనుము అని వరమిస్తారు.

అక్బరుపాదుషాగారు అప్పుడు అధికారికి తన సైనికుడికి ఆజ్ఞ ఇవ్వు అంటారు. తమ ఆజ్ఞకన్న గొప్పదా ప్రభూ నా ఆజ్ఞ అంటారు. అయితే నీవు నీ సిపాయి దగ్గర నేర్చుకో అని చెప్పి వెళ్లిపోతారు. అలా గుర్రంపై సవారి చేస్తూ బృందావనం దగ్గరలో ఒక అంబ్రాయి( మామిడితోపు) వద్ద ఆగి ఆ వనంను చూడగానే తాన్‌సేన్ గార్కి తన చిన్నతనం గూర్చి జ్ఞాపకం వచ్చి దీర్ఘాలోచనలో పడిపోతారు. అక్బరుపాదుషా గారు పలకరించినా వినబడలేదు. ఏమిటి అంత త్వరలో పరధాన్యాంలో ఉండిపోయారు. రాజా నా చిన్నతనం గుర్తుకొచ్చింది. మీ ఊరు ఏది? మాది గ్వాలియర్‌కు దగ్గరలో ఒక చిన్న ఊరు. అలాంటప్పుడు బృందావనం ఎక్కడ? గ్వాలియార్ ఎక్కడ? మీకు గురుజీగారు ఎలా పరిచయమయ్యాడు అని ప్రశ్నిస్తారు.

అప్పుడు తాన్‌సేన్‌గారు, నేను నా చిన్నతనంలో ఇటువంటి( అంబ్రాయి) తోపును మా తండ్రిగారు కావలియుండటకు ఒప్పుకొన్నారు. మా తండ్రి తరపున నేను కాపలా ఉంటిని. ఒకనాడు స్వామి సురదాసుగారు తన శిష్యులతో గ్వాలియర్ వచ్చి దారిలో మా వనం దర్శించారు. ఆ వనం యొక్క సౌందర్యం చూచి అక్కడ కొంతసేపు విశ్రాంతి తీసుకొనవలయునని, తన శిష్యులను కూడ విశ్రాంతి తీసుకోండని చెప్పి కాసేపు ధ్యానంలో శ్రీకృష్ణుని తలంచుకొంటు గానం చేస్తారు. శిష్యులు ఆనందంగా వనంలో ఆడుకొంటు ఉంటారు. అప్పుడు ఎక్కడినుంచో ఒక సింహగర్జన వినిపిస్తుంది. అది విన్న సూరదాసు తన శిష్యులను వెంటనే చెట్లు ఎక్కండి అని

చెపుతారు. ఆ తరువాత తిరిగి చూడగా ఒక బాలుడు తనకు ఎదురుగా నిల్చునే ఉంటారు. నాయనా నీవు కూడా వెంటనే చెట్టు ఎక్కు అని చెపుతారు. బాలుడు స్వామి తమరు కూడ చెట్లు ఎక్కండి అంటారు. లేదు నీవు చిన్నబాలుడవు నీవు మొదట ఎక్కు అంటారు. నాకు చెట్లు ఎక్కటంరాదు, అయితే నా భుజంపై ఎక్కి పోదువు రా అంటారు. నేను మీ భుజము పై నుండి చెట్టు ఎక్కేలోపు సింహం నిన్ను చంపి తింటేను అని అంటారు. నాయనా నేను పెద్దవాడిని నాకు వయస్సు వచ్చినది. నీవు ఇంకా చిన్న పిల్లవాడవు నీవు చాలా అభివృద్ధిచెంది దేశసేవచేయవలయును. కావున నేను పోయిన, నీవు ఉండవలయును అని స్వామిజీ తెల్పుతారు. అప్పుడు ఆ బాలుడు అయితే స్వామీ నన్ను క్షమించుము. దీనికి కారణం నేనే అంటారు. నీవెలా అవుతావు సింహగర్జన ఎలా వస్తుంది అని అంటారు.

అయితే చూడము స్వామి అని తన నోటితో సింహగర్జన చేస్తారు. అది విన్న స్వామిజీగారు ఆశ్చర్యపోతారు. నీవు చిన్న బాలుడవు. ఇంత కఠోరమైన శబ్దం ఎలా వచ్చింది అని అంటారు. స్వామి ఇది చాలా పెద్ద మామిడి తోపు. ఒక చిన్న పిల్లవాడు దీని కాపలయున్నాడంటే ప్రజలు భయపడతారా, మొత్తం తోపునే కొల్లగొట్టరా, అందుకు ఈ శబ్దమును వినిపించి భయపెట్టినందున ఈ ప్రాంతంనకు ఎవ్వరు రారు మరియు స్వామిజీ నేను చాలా సున్నితమైన స్వరం కూడ పలుకుతాను. నాస్వరమును విన్న పక్షులు నాకు బదులు కూడ ఇస్తాయి అని చెప్పి కోయిల కూత వేస్తారు. దానికి కోవెల తిరిగి జవాబుగా కూస్తుంది. అది తన కన్నులారా చూచిన సూరదాసుగారు నాయనా నీవు నా వద్ద విద్యనేర్చుకుంటావా, నీ కుటుంబమునకు మంచి స్థానం కల్పిస్తాను. అని తెల్పగా అంతకన్న మహాభాగ్యమా స్వామి అని వారి పాదములకు నమస్కరించుతారు. సూరదాస్‌గారు మీ తండ్రి పేరేమిటి, మీది ఏ కులం అని అడుగుతారు. మా తండ్రిగారి పేరు మకరంద్‌పాండే, బంజారాబ్రహ్మణ కుటుంబము అంటే మీ తండ్రి జోతిష్య శాస్త్రవేత్త మకరంద్ పాండే గారా అని చెప్పగా, సూరదాసుగారిని తన ఇంటికి పిలుచుకొనిపోతారు.

ఆ సముయమలో తాన్‌సేన్ తండ్రి కొడకు జాతకం గూర్చిచూస్తువుంటాడు. తన కుమారుడు గొప్ప పెరు సంపాదించే యోగ్యత ఉన్నదని, తను సంగీత విద్యాభ్యాసము తన ఇంటి నుండి దూరంగాపోయి అభ్యసిస్తాడని తాన్‌సేన్ తల్లిగారితో చెప్పుతారు. ఆ మాటలకు ఆమె తన ఒక్కగానొక్క కుమారుని వదలియుండ లేనని, ఆ ఆలోచన చేయవద్దని భర్తతో చెపుతుంది.

ఆ సమయంలోనే తాన్‌సేన్, సూరదాసు గురువు శిష్యులతో తన ఇంటికి పిలుచుకొనిపోతారు. తండ్రిగారిని చూపిస్తారు. సూరదాసుగారిని వెంటనే మకరంద పాండేగారు గుర్తించి; తమ వంటి మహానుభావులు సంగీత సామ్రాటులు మా యింటిని దర్శించి మమ్ములను ధన్యులను చేసారు అంటారు. అప్పుడు సూరదాసుగారు తమ కుమారులు, తాన్‌సేన్‌గారి హృదయంలో సరస్వతి నిలయం చేసుకొని ఉన్నది. వారిని గొప్ప సంగీతకారుని చేస్తాను. బృందావనం నా ఆశ్రమమునకు పంపుము అని తెల్పుతారు. ఆ విషయం విన్న మకరందపాండే చాలా సంతోషిస్తారు. కాని తల్లి తిరస్కరిస్తుంది. తనుకుమారుని తీసుకొని పోయి , తనను ఒంటరిగా చేయవద్దని, ఏ విద్యలు నా కుమారునికి అవసరంలేదని దయచేసి వెళ్లిపొమ్మని,

నిర్మొహమాటంగా చెప్పి వేస్తుంది. అప్పుడు తాన్‌సేన్ తండ్రి సురదాసుగారితో భార్యతరపున తను క్షమాపణ కోరుచున్నానని, క్షమించమని తన కుమారుని వెంట తీసుకొని పొమ్మని, అర్థించుతారు. అలా జరగదు. తల్లి సమ్మతి లేనిది తనయునికి విద్యరాదు. మీరు, తల్లి తండ్రి ఇద్దరు ఆనందంతో పంపినసే విద్య నా గురుకులంలో లభిస్తుందని తెల్పి వెళ్ళి పోతారు.

ఆ విధంగా జరిగిన తరువాత తాన్‌సేన్ తండ్రిగారు తన భార్యను శతవిధాలా కుమారుని భవిషత్తు గూర్చి తెల్పినను ఆమె సమ్మతించదు. ఒకనాడు సూరదాసు గారు ఈశ్వరుని మందిరంలో ఈశ్వరునిని ప్రార్థించటం, అతని సంగీత పాఠవమును చూచిన తాన్‌సేన్ తల్లి సూరదాసుగారు ఆవలద్వారం వెలుపలకు వస్తుండగా, ఒక స్త్రీ నమస్కరించుతూ దారికి అడ్డుతగిలినది. అప్పుడు ఆమెను ఎవరు తల్లి మీరు? మా దారికి అడ్డంగా వంగి నమస్కరించుచున్నారు, లేవండి అని తెల్పుతారు. అప్పుడు తాన్‌సేన్ తల్లి స్వామి నా తప్పును మన్నించండి. అజ్ఞానముతో తమరిని తూలనాడినాను, అని ప్రార్థించుతుంది. నీవు నన్ను తూలనాడలేదమ్మ. ఒక తల్లి తన బిడ్డ మీద ఉన్న మమకారం ఆ విధంగా చెప్పినది. నేను క్షమించవలసినంత తప్పు మీరు ఏమి చేయలేదు అంటారు. అప్పుడు తల్లి స్వామి నాకుమారుని తమ వెంట తీసుకొని పోయి గొప్ప పేరును సంపాదించండి అంటారు. అప్పుడు సూరదాసుగారు నా గొప్పతనం ఏమీలేదమ్మ. నీ కుమారుడు గొప్ప సంగీతవిద్వాంసుడై వారి ద్వారనే నా పేరు చిరస్థాయిగా ఉండగలదు. నన్ను తలంచువారు ఎవ్వరుండరు. తాన్‌సేన్ గురువుగారు ఎవరు? అన్నప్పుడే నా పేరు సూరదాసు అని ప్రజలలో తెలుస్తుంది అంటారు.

ఇక్కడ ఒక విషయం తెలుసుకొనవలయును. తాన్‌సేన్, అక్బరుపాదుషా, అజీజ్‌ఖాన్ తో పాటు పోయి సూరదాసును దర్శించి వారి ఆశీర్వాదములను పొంది వస్తారు. తాన్‌సేన్ పుత్రుడు పేరు బిలాస్‌ఖాన్. బిడ్డకు జన్మ ఇచ్చి తల్లి చనిపోతుంది. పసిబిడ్డను అజీజ్‌ఖాన్ భార్య సంరక్షిస్తుంది. తన కుమారుని కూడ తన కన్న గొప్ప విద్వాంసుని చేయు కోరికతో బిడ్డను తన దగ్గర ఉంచి తాన్‌సేన్ సంగీతగానం చేస్తారు కానీ, బాలుడు తన ఏడ్పును మానడు. అప్పుడు తాన్‌సేన్ ఎవ్వరైన ఉన్నారా? ఈ బాలుని ఇక్కడినుండి దూరం తీసుకొని పొండి అంటారు. అప్పుడు అజీజ్‌ఖాన్ ఎందుకు అంత కోపగించు కొంటారు తాన్‌సేన్‌గారు అని అంటారు. ఈ బాలుడు నేను సంగీతం మొదలు పెట్టగానే ఏడ్పు లంఘించు కొంటాడు. ఎందుకు అని చెప్పగా, అజీజ్‌ఖాన్ పసి బిడ్డకు మీ సంగీతం ఎలా అర్థం అవుతుంది అంటారు. అది తప్పు అజీజ్‌ఖాన్ జ్ఞాని అయిన వారు తల్లి కడుపులో ఉన్నప్పుడే జ్ఞానాన్ని గ్రహించుతారు. అభిమన్యుడు తల్లి గర్భంలో ఉన్నప్పుడే పద్మవ్యూహం గూర్చి తెలుసుకొని యుద్ధం చేసారు అని చెప్పగానే అలా అయితే బాలుని భవిష్యత్తు గూర్చి తెలుసు కొనవలయునంటే, మన రాజ్యంలో ఒక ఫకీరు వచ్చి ఉన్నారు. వారు చాలా ఖచ్చితంగా చెపుతారు చాలా కఠినంగా మాట్లాడినను, విషయం మాత్రం ఖచ్చితంగా చెపుతారు అని చెప్పినారు. ఇద్దరు బయలు దేరి, ఫకీరు వద్దకు పోయి కలుస్తారు. వారు వీరి రాకను తెలుసుకొని, బాలుని భవిష్యత్తుగూర్చి తెల్పుతూ, ఈ బాలుడు గులాబిపువ్వులాగా ప్రకాశించుతాడు. మంచి పేరు, ప్రఖ్యాతులు కూడ గాంచుతారు. కానీ గులాబి పూలు ఎంత అందంగా ఉన్న అంత త్వరగా వాటి రేకులు కూడా రాలి పోతుంటవి అని చెప్పి వెళ్లిపోతారు. విషయం పూర్తిగా తెలుసుకొన్నందుకు కొంత నిరుత్సాహమే కలుగుతుంది. ఇది తాన్‌సేన్‌గారి కొంతచరిత్ర.

# ఆలిఘడ్ ప్రాంతం, పురాతన బంజారాల ఖజానా !
# అన్న స్వప్నం- ఆ స్వప్నం నిజమౌతుందా?



ఆలిఘడ్ తాలుకా ప్రాంతంలోని బోనా గ్రామములో పురాతన ఖజానా ఉన్నదని ఒక తాంబ్ర పత్రం మహిపాల్‌సింగ్ గారికి స్వప్నం ద్వారా తెలుస్తుంది. కానీ ఆ స్వప్నం నిజం అవుతుందా? అలా అయితే ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం వెంటనే నిర్ణయం తీసుకొని త్రవ్వటం మొదలు పెట్టేది. ఆ ధనము బంజారా మహిపాల్‌సింగ్‌గారికి దొరక గలదా? ఇప్పటికి అన్ని ప్రభుత్వ మరియు ప్రభుత్వ అధికారులకు ఒక చర్చినీయాంశంగా మారినది. అదే సందర్భములో దయాల్‌బాబూ బంజారా అనే గ్రామవాసి బూర్జేనాత్‌టుడలాగారు తన అనుమానమును ప్రకటించారు. అతను ప్రభుత్వ యంత్రాంగమును కూడా ముందుగా హెచ్చరిస్తూ ఇది లాఖా బంజారా దాచిన ఖజానా? బంజారా సమాజమునకే చెందుతుంది. ఖజానా యొక్క తాంబ్ర పత్రం దేనా గ్రామనివాసి అయిన మహిపాల్‌సింగ్ కుమారుడు తోలాసింహ రిటైర్డు పోలీసు. ఆగ్రామములోని తాంబ్ర పత్రం ఉన్నచోటులో చాలా రోజులనుండి పూజలు చేస్తున్నాడు. ఒకరాత్రి అతను పండుకొని ఉండగా తన స్వప్నంలో నీవు ఏచోట అయితే పూజచేస్తున్నావో ఆచోటనే భూమి లోపల తామ్ర పత్రమును పూడ్చి ఉన్నారు. ఆ తాంబ్ర పత్రంలో పూడ్చిన ధనం గూర్చిన వివరములు అందులో ఉన్నవి అని వచ్చినది. అది నీవు వెంటనే తీసుకొన్నావా నీకు మేలు జరుగుతుంది. లేకున్నచో చాలా నష్టం కలుగువచ్చును. మహిపాల్ స్వప్నం ప్రకారం భూమిని త్రవ్వి తామ్ర పత్రమును తీసుకొన్నాడు. ఆతాంబ్రపత్రంలో వ్రాసిన ప్రకారం అంతాబాగాచదివి క్షుణ్ణంగా అర్థం



ఖజానా గురించి తెలియచెప్పిన తామ్ర పత్రం

చేసుకొని, అందులో రామలాల్ లాఖా బంజారా గారు దీని కన్న పెద్ద తాంబ్ర పత్రమును రాయించి తూర్పు దిశలో(చబూతరేకి) దక్షిణమున( రియల్ బరికేపేడ్) మర్రి చెట్టు మొదలులో మూడు మూరలు, తూర్పు దిశలో లోహపు కుండలలో ధనము పాతబడి ఉన్నది. మరియు రెండవ తాంబ్ర పత్రము అక్కడినుండి తూర్పు దిశగా ఎనభై మూరల దూరంలో, ఎనిమిది మూరల లోతు క్రింద ఎడు ఆరబ్ కోట్లు అనగా 700కోట్ల రెండు లక్షల రూపాయిలు పాతి పెట్టబడి ఉన్నది. ఆ తాంబ్ర పత్రం పై వ్రాసి ఉన్న సమయం 1040 సం అని ఉన్నది.

ఈ తాంబ్ర పత్రం సంపాదించిన తరువాత మహిపాల్‌సింగ్ తన కుమారుని తీసుకొని ఆ ప్రాంతమునకు పోయి రాత్రిపూట రెండుసార్లు త్రవ్వటం జరిగినది. అప్పుడు ఆ గ్రామములో దీనిపై చర్చ జరగటం మొదలు పెట్టింది. అందరు అనుకొంటున్నారు, మహిపాల్ రాత్రిళ్ళు ఒక్కడే పోయి పనికి రాని చోట ఎందుకు త్రవ్వుతునట్లు?

దీనిపైన బైనా గ్రామములో పంచాయితి పెట్టారు. మహిపాలును పంచాయితిలో పిలిపించి, పనికిరాని స్థలంలో నీవు రాత్రి పూట పోయి ఎందుకు త్రవ్వుతున్నావు కారణం చెప్పమని గట్టి పట్టుపట్టినారు. అప్పుడు అసలు విషయం బయటపడినది. మొత్తం గ్రామమునకు ఈ విషయం తెలిసిపోవుటవలన, మహిపాల్‌సింగ్‌గారు తన వద్ద ఉన్న తాంబ్ర పత్రమును అక్కడ పెద్దలకు చూపించారు, దాని బరువు సుమారు 1 కె.జి పైన ఉన్నది.

మహిపాల్‌సింగ్ వ్రాసిన తామ్ర పత్రంలో వ్రాసినదేమంటే గ్రామము, మైనాపూర్ దగ్గరలో తామ్రపత్రం దొరకినది. దానిని శుభ్రపరచి అందులో వ్రాసిన దానిని బట్టి పైచెప్పినదంతా తెలియబడుచున్నది. అందులో ఖజానా దాచియున్న స్థలమును కూడా చూపబడిఉన్నది.

శ్రీ మహిపాల్‌గారు తమ పత్రంలో మండలాధిగారికి వ్రాసిన దేమంటే ఈ తామ్ర పత్రంనుద్దేశించి శుభ్రం చేసిఉంచాను. అందులో వ్రాసిన ప్రకారం ధనం ఎక్కడ ఉన్నది వెతకవలసినదిగా కోరుచున్నాను. అతను ఖజానా వెతకటంలో సహకరించగలనని చెప్పిఉన్నాడు.

మండలాధికారి కౌర్ శ్రీ మనోజ్ సింహ తామ్రపత్రం తమ చేతికి అందిన వెంటనే గ్రామము మరియు గ్రామ వాసులకు ఈ విషయంలో హామి ఇచ్చారు. దీని గూర్చి పూర్తిగా విచారిస్తాము. గ్రామము దగ్గరలోనే ఈ ఖజానా ఉన్నట్లుగా చెప్పబడుచున్నది. ఈ విషయంలో పురాతత్వ శాఖ వారితో సంప్రదించిన వాస్తవమును, తెలసుకొనుటకు ప్రయత్నించుచున్నారు.

అందులోని ఒక రూపాయి బరువు 11గ్రా. 664 మి.గ్రా. బరువు కలిగిఉన్నది. ఈ విధంగా ఒక అరబ్ కోటినాణ్యముల 1 లక్షా 16వేల 660 క్వింటాళ్ళు బరువు వరకు ఉండవచ్చును. ఈ ప్రకారంగా 7 అరబ్ కోట్లురెండు లక్షల రూపాయల బరువు 8,18,820 క్వింటాల్ల అవుతుంది. ఇంత సొమ్ము తీసుకొని పోవుటకు సుమారు 850 ట్రక్కులు కావలయును.

ఆ ప్రాంత ప్రజలు చెప్పకొనునది ఏమనగా, దీనిని రామలాల్ లఖన్ పేరుగల బంజారా గూర్చి చాలా చారిత్రక గాథలు ఉన్నవి. ఖోర్ మరియు టన్‌పాల్ గ్రామ ప్రాంతాలలోని ఎన్నియో బావుల కట్టడాల రాళ్లపైన కూడ వ్రాయబడి ఉన్నవి. ఇప్పుడు కొన్ని బావులు జీర్ణస్థితిలోను, పడిపోయిన స్థితిలోను ఉన్నవి.

## ఖజానా బంజారాలాది- ప్రభుత్వం దీనిని ముట్టరాదు :



దాయల్ బాబు నాయక్. లాఖా బంజారా గారు దాచిన ఖజానానం ప్రభుత్వంవారు ముట్టకూడదు. ఈఖజానా మా పూర్వికులు దాచినది, ఈ హెచ్చరిక దయాల్ బాబు బంజారా ఇస్తున్నాడు.

దయాల్‌బాబు బంజారా, నివాసి గ్రామం బుల్‌చూనాథ్‌గారు చెప్పిన, దేమనగా, తాలుకా ఖోర్ అనే గ్రామము బౌనా(బావిలో) కుండలో ఖజానా మా పూర్వీకులది. ప్రభుత్వం దీనిని ముట్టకూడదు. ఈ విధంగా అతను టెలిగ్రాం కొట్టినారు. శ్రీ రవీంద్రనాయక్‌గారికి దీని గూర్చిన వివరములు తెల్పడమైనది.

అతను చెప్పిన దేమనగా ఈ ఖజానా గూర్చి కొన్ని సంవత్సరములనుండి వెతికే ఉద్దేశ్యం ఉన్నది. అతను మొత్తం బంజారాలకు విన్నవించునది ఏమనగా ఆలిఘడ్ ప్రాంత ప్రజలు ఆలిఘడ్ గ్రామం బోనా తాలుకా ఖోర్ దగ్గర చేరి, ఈ ఖజానాయొక్క రక్షణ చేసి ప్రభుత్వమునకు విన్నవించి ఇది మా పూర్వీకులు సంపాదించినది. కావున దీనిని వెలికి తీసి బీద బంజారాలకు పంచవలయును. 'జాగో బంజారా' మాసపత్రిక **8-2-1992.**

# మన్యారఝుర్పలా-మంజ్యా ఖోలారో వేర్(యుద్ధం)

గుడి కొండారో ఘాట్-మాలిక్ మన్యా ఝుర్పలారో థాట్. మూడ్ భుక్యారి వాట్-సాటిబేటాన్, సాట్ బేటిన్‌దోనతో సవా పచ్చిస్ సుంకం చెల్లించండి, రూ. 25+6.25=31.25 అని చెప్పేవాడట.

మన్యారఝూర్పలా అనే యోధుడు గుడికొండ(ఘాట్) దారిలోనుండి, ఆదారిన పోయేవారితో తన కుమారులు 60 మందికి, 60 మంది పెండ్లి కుమార్తెలను ఇవ్వండి లేక పోయిన రూ. 31-25 సుంకం కట్టండి అని బెదరించేవాడట. ఇతను 60 తాండాలకు నాయకుడు.

మంజ్యాఖోలా దగ్గరకు, మన్యా ఝుర్పలా నలుగురు యోధులను, రాయబారం పంపుతాడు, మంజ్యాఖోలా కూడ గొప్పయుద్ధ వీరుడు. 12తాండాలకు నాయుకుడు. అతను వచ్చిన రాయబారులలో ముగ్గురి తలలు నరకి, అమ్మవారికి, నైవేద్యంగా వారి పొట్టలను చీల్చి, క్రొవ్వు తీసి, వారి తలపై కప్పి, అమ్మవారికి నైవేద్యం పెట్టి, ఒకరిని మీ మన్యారఝుర్పలాతో పోయి జరిగిన విషయ చెప్పు అని పంపిస్తారు.

అప్పుడు వారిద్దరికి యుద్ధం జరుగుతుంది. ఆ యుద్ధంలో ఒక ప్రక్క యుద్ధ నగారా మ్రోగతుంటే, ''లాకా లాపెళియా'' అనే యోధుడు, యుద్ధం చేస్తున్నాడు

''వేయిచలాయి-సిందూర్ ఝుడితి ఆయి'' అనగా తనకరవాళమును ఝులిపిస్తూంటే, శత్రువుల తలలు, నక్షత్రములు రాలుతున్నవా అన్నట్లుఉన్నదట, ఈ విధంగా బంజారాలు తమ క్షాత్రధర్మమును పాటించుతూ వచ్చారు.

# బిడారుల కాలంలో-బంజారాలు కలిసే చోటు

## 'భాదూర్ బండా-పత్తేన సాన్-మూడ్ భూక్యా ఏకజ్ మలాన్'

పూర్వం బంజారాలు బిడారి వ్యాపారం చేయునపుడు భాదూర్ బండా-పతేర్‌నసాన్ అనుచోట కలుసుకొనేవారు. బంజారాలలో మూడు గోత్రీయులు- భూక్యా గోత్రీయులు ఇక్కడ కలుసు కొనుచుండిరి. వీరు బిడారి వ్యాపారం చేస్తు పోయినపుడు, తిరిగి ఆస్థలం చేరుటకు కొన్ని సంవత్సరాల కాలం పట్టేది. వారు తమ బిడారులను, పై చోట కలసినపుడు తమ పిల్లల పెండిండ్లు చేసుకొనేవారు. చిన్న పిల్లలైతే వారికి ఆకువక్క శాస్త్రం చేసుకొని పెండ్లి ఖాయం చేసుకొనేవారు. ఈ విధంగా వారు తమ పిల్లల పెళ్ళిళ్ళు అయిన తరువాత వారు ఈ చోటికి కలసే రోజులకు తమ పిల్లలకు ఇద్దరు లేక ముగ్గురు పిల్లలు పుట్టి ఉండేవారు. అందరు ఒకచోట కలుసుకొనునాటికి, వారి పిల్లలను చూచి పుట్టెడు దుఃఖం వచ్చేది. అప్పుడు వారు ఒకరి మెడలు ఒకరు పట్టుకొని పుట్టెడు దుఃఖముతో బంజారా స్త్రీలు ''కోడతేరోఢావలో'' వారి గూర్చిన విషయాలను చెప్పుకొంటూ ఏడ్చేవారు. ఈ విధంగా బంజారాలు తమ పిల్లలను, తల్లిదండ్రులను, అన్నదమ్ములను పట్టుకొని ఏడ్చేవారు. అప్పటినుండియే బంజారాలు ఏడ్వటం మొదలుపెట్టారు. ఈ స్థలమునే వారు ''మూడ్-చూక్యార్ ఏకజ్ మలాన్'' అని అంటారు. అంటే మూడ్- భూక్యాలు కలసిన చోటు.

ఇక్కడ బంజారా స్త్రీలు కలసినపుడు వారు చేసిన నృత్యములకు తొమ్మిది మణగుల ఘుగ్గర(కాలి గజ్జలు) రాలిపోయినవట. ఇప్పటికి ఆ ప్రాంతంలో పోయి వెతికిన ఇత్తడి గజ్జలు దొరకుతాయట.

ఆ రోజులలో బంజారా నారి స్త్రీ పచ్చడి రుబ్బిన(దంచిన) రోకలిని ఈనాడు పది మంది యువకులు ఎత్తలేరట. ఆ రోకళ్లు ఇప్పటికి అక్కడ ఉన్నవట. ఇది బంజారాల గూర్చిన చిన్న ఉదాహరణ.

మత్రోమూడేరో,(ఆలోచన మూడ్ గోత్రం వారిది) పూందా పాల్ త్యారో,(అమలు పరచటం పాల్‌త్యా గోత్రం వారిది) హుంకతో కొత్రి,(కుక్కను ప్రేరేపించటం) రామావత్ గావడి (రామవత్ గోత్రం గోవులాంటివారు), ఢాల్ గొరామేరో (ఢాలు జ్యాదవ్ వంశం లోని గోరాం గోత్రం వారిది).

**దాది గుదాళి:** తన శరీరంపై ఎల్లప్పుడు ఒక మణుగు బంగారం, వజ్ర వైఢూర్యములతో పొదగబడిన ఆభరణములను ధరించి ఉండేదట.

# రాజస్థాన్ బంజారాలు-తెగలు

**సండే స్టాండర్డ్ పత్రిక 8-12-1976**

రాజస్థాన్ థార్ ఎడారిలోని ఒకగొప్ప సామెతఉంది. ''ఆట్ హటహత్తర్, నౌలాక్ తారే, ధర్తిపే దో బంజారే'' 8 గ్రహాలు, 78 ఉపగ్రహాల మధ్య కోటాను కోట్ల నక్షత్రలాలలో ఈ భూమండలం పైన ఎక్కడికెళ్ళిన ఇద్దరు బంజరాలు అగుపిస్తారు. భూమి చుట్టూ ప్రదక్షిణం చేస్తుంటారనే'' దృష్టి బంజారాలకున్నది. బంజారాలు రాజస్తాను యొక్క 23 సంచార తెగలలో ఒకరు. వీరు ఆఫ్రో-అసియా ఎడారి యొక్క తూర్పు సరిహద్దుల్లో అతి వ్యయ ప్రయాసలతో ప్రయాణిస్తుంటారు.

భారత దేశములోని ఎన్నోముఖ్య సంచార తెగలు రాజస్థాన్‌యొక్క ఉష్ణమండల ఎడారి ప్రాంతాల్లో సంచార జీవనాన్ని గడుపుతుంటారు. వారి జీవన గురించి సరియైన అవగాహన లేదు. లేని పోని అవగాహనలున్నాయి. వారు విడిగా, పట్టణాలకు దూరంగా ఎడారులలోను, గుడారాల్లో సంచార జీవనం చేస్తుంటారు.

మిలియన్ల సంవత్సరాలకు పూర్వం ఈ ఇసుక తిన్నెల ఏడారి ప్రాంతమంతయు సముద్ర కెరటాల హోరులతో, మారు మ్రోగుచుండెడిది. ఇక్కడ పెద్ద పెద్ద క్షీరజాలతో నిండి ఉండేది. అనేక జనచరాల సంచారంతో నిండి ఉండేది. ఈ ప్రాంతం ఇప్పటికి సంచార జీవనంతోనే ఉన్నది. సామాజిక శాస్త్రవేత్త ప్రకారం, సంచార జీవనం అనేది నివాస యోగ్యంకాని వాతావరణ పరిస్థితులలో, తాము ఎదుర్కొనవలసిన పరిస్థితులనుబట్టి నడవటమే. ఇది యే సంచార జాతియొక్క మహాచరిత్ర. ఒకానొకప్పుడు ఈ సంచార తెగయే, ఆ ప్రాంతము యొక్క ఆర్థిక పరిస్థితికి నిదర్శనము. వీరు గొప్ప వ్యాపారవేత్తలు, నిత్యావసర వస్తువులను చేర వేసే ఒక మహాత్ కార్యమును, ప్రమాణయోగ్యము కానీ, ప్రదేశములకు ఒక వరంగా సంతరించుకొన్నదే, ఓ విస్తారమై వ్యాపార సంస్థగా, నిర్దిష్ట రహదారులను ఏర్పరచుకొన్న అధికారిక వ్యాపార సంస్థగా, ఈ సంచార తెగ, ఒక ప్రత్యేకతను సంపాదించుకొంది. వీరి సాంఘిక-సాంస్కృతిక కార్యకలాపాలు ప్రకృతియొక్క కార్య కలాపాలతో ముడిపడిఉంది.

వారియొక్క ప్రతి సంచార మార్గము నీరు, పశుగ్రాసం పై ఆధారపడి ఉంటుంది. వీరి బిడారి మార్గము మృధువైనదిగాను. జన పశుపక్షాదులకు నీరు మేత దొరకు మార్గముల ద్వారా క్రమమైన ప్రయాణ మార్గములు ద్వారా ఆయా ప్రాంతాల అవసరములకు ఉపయోగపడు, దినసరి వస్తువులు విక్రయాలతో, వారి యోగ క్షేమము ననుసరించి. మహా గొప్ప రవాణా మార్గాలను ఏర్పరిచారు. అదే మార్గాలలో సమచారములను, చేరవేస్తూ మంచి వార్తాహరులుగా పేరుగాంచారు. ఈ నేర్పరితనమే టిప్పుసుల్తాన్‌కు ఎంతగానో ఉపయోగపడింది. అందువలననే వారు తన సైన్యములో వీరిని గూఢాచారులుగా, సైన్యాధిపతులుగా, వార్తాహరులుగా నియమించబడినారు. అయితే నవీన మోటారు వాహనాల రాకతో రవాణా సంస్థ అభివృద్ధి చెంది సమకాలీన పరిస్థితులలో పురాతనంగా వస్తున్న పశువులపై వస్తువులను చేరవేయుట ప్రస్తుత పరిస్థితులలో ఇమడలేక, తమ సాంప్రదాయాన్ని రక్షించుకొనుటకు, భద్రపరచుకొనుట కెంతో పోరాటం సాగించవలసి వచ్చింది.

వారి సమస్యకు పరిష్కారమే కరువైనది. ముఖ్యంగావారి ఎడ దయ, శాస్త్రీయ దృక్పతం లేనందువలన సమాకాలీన ప్రజలువారి ఎడల నిర్ధాక్షిణ్యంగా ప్రవర్తిస్తున్నారు. ఇందుకు కారణాలెన్నో ఉన్న. ముఖ్యంగా వారి గత చరిత్ర గురించి అవగాహనలోపమే కావచ్చును. అదే కారణంవల్ల వారి అభివృద్ధి కుంటుపడినది. వారి విస్తరణ, జనాభాగూర్చి ఎవ్వరు సరియైన పరిశోధన చేయలేదు. కేంద్ర ఉష్ణమండల పరిశోధనా సంస్థ మాత్రం కొన్నింటినే అధ్యయనంచేసింది.

వారు అధారపడే పరిస్థితులను బట్టి, రాజస్తాని సంచార తెగలు నాల్గు విభాగాలుగా గుర్తించబడినవి. మొదటి రకం తెగ పచ్చికపై అధారపడినది. రైకాలు, పరిహారాలు, బైలో చీలు మరియు సింధి, పశువుల కాపరులు. సాంకేతికంగా అసంపూర్ణ సంచారకులు. వీరు సంవత్సరములో నాల్గు నెలలు వ్యవసాయం చేసి, గడ్డి, నీరు కొరత వల్ల మిగిలిన ఎనిమిది నెలలు సంచార జీవనం గడుపుతారు. రకరకాల పెద్ద పెద్ద ఒంటెల మందలను కలిగి ఉంటారు. అలాగే గొఱ్ఱెలు, మేకల మందలు కూడ ఉంటవి. మిగిలినవారు పశువులు మాత్రమే కలిగి ఉంటారు. వారి పెంపకంలోని పశువులు వారి అవసరాలు తీర్చాక మిగిలిన వాటిని తమకు కావలసిన వస్తువులకై, వస్తు మార్పడి పద్ధతిని పాటిస్తారు.

రెండవ రకం తెగ, వారే వాణిజ్య తెగలు(వ్యాపారులు) బంజారాలు ఘట్టివాళ జోగిలు, గవారియా తెగలు, బంజారాలు చవుడు, ఉల్లిపాయలు, కొన్ని సందార్భాలలో పశువుల వ్యాపారం చేస్తారు. ఈ వ్యాపారంలో సుమారు ఐదు లేక ఆరు మాసాలు నిమజ్ఞమై ఉంటారు. గుజరాతు అంచువరకు పయనిస్తారు. గవాలియాలు ముఖ్యంగా పల్లె ప్రజల అవసరార్థం, పూసలు, గాజులు, చిన్న చిన్న ఆభరణములు(వాగ్రియా) మొదలగునవి తమ గాడిదలపై మోయించుకొని, సంచార జీవనం గడుపుతారు. గవారియావలెనే ఘట్టివాళో జోగిలు పిండి విసురు రాళ్లతో వ్యాపారం చేస్తారు. మంచి మట్టితో తయారు చేసిన పాగత్రాగు గొట్టములు కూడ వీరి వర్తకములో భాగమే. వీరిలో కొద్ది మంది వ్యవసాయం, వ్యవసాయ కూలీలుగా, పంట కాలంలో పనిచేసి, మిగిలిన కాలం మొత్తం సంచార జీవనం సాగిస్తారు.

మూడవ తెగ విషయానికొస్తే! గదలియాలోహర్లు నైపుణ్యం కలిగి ఉంటారు. కుమ్మరివాళ్లు జిప్సి తెగలవలె తమ ఇనుప బళ్లపై వర్తకము చేస్తూ, సంచార జీవనం గడుపుతారు. వారి వర్తక సమూహాలు నిర్ణయించబడిన రహదారులపైననే ప్రయాణిస్తారు. ప్రతి సమూహము ఒక నాయుకుని ముఖ్య అంటారు. ప్రతి తాండా లేక కుటుంబ సమూహము ఆ తాండా పాలన సంఘము లేక ''న్యాత్'' లేక ''న్యావో''(నసాబ్)కు లోబడి మసులుకోవాలి. నసాబ్ ప్రముఖులుంటారు. ప్రతినసాబ్ సర్వన్యాయాధికారాలను కలిగి ఉంటుంది. న్యాయ నిర్ణయము తాండా వరిపాలన ''నసాబ్'' అధీనములోనే ఉండవలెను.

నసాబ్ అనగా పంచాయితి సంస్థ బంజారాలలో ఎంతో ప్రతిష్టాత్మకమైనదిగా ఏర్పాటు గావించబడినది. ఈ వ్యవస్థ సర్వాధికారాలు, సాంఘిక, మతపరమైన భంగములకే కాకుండ, బలత్కారములు, వివాహకలహాలు, అక్రమ సంబంధాలు, భూతగాదాలు ఆర్థిక విషయములు, శిష్ఠాచారాలు,. కుల మర్యాదలు, వాణిజ్య ఒప్పందాలు, ఎగువేత మరియు వ్యాపార మార్గాల-ఒప్పందాలు. ఎగువేతకు సంభందించిన న్యాయ నిర్ణయాధికారాలన్ని ఈ నసాబ్( న్యావో) లో ఉంటాయి!

''నసాబ్'' పంచాయితీ సమావేశానికి నిర్దిష్ట కాలపరిమితి ఉండదు. కాని అవసరాన్ని బట్టి తాండాలో ఏర్పడే అత్యయిక పరిస్థితులను బట్టి ''నసాబ్'' న్యాయ నిర్ణయానికి కూర్చుంటారు. బంజారాల ''నసాబ్'' శిక్షానుజ్ఞ, బంజారాల ప్రవర్తనాస్మృతిని కాపాడు సామూహిక ఎగతాళి, అపహాస్యం, చిన్నబుచ్చుట, గర్వభంగము చేయుట, వలనవారి ప్రవర్తనల్లో మార్పువస్తుంది. నియమావళిని అతిక్రమించినవారు కొన్ని హక్కులను కోల్పోతారు. జాతి బహిష్కృతి కూడ చేస్తారు. ఒక కుమారుడు తండ్రికి పంట పొలాల్లోసహాయ పడక కాలం వెళ్లబుచ్చిన కారణంగా కూడ ఇలాంటి న్యాయ నిర్ణయం జరుగుతుంది. తాండా ముఖ్యుని(నాయకుని) చివాట్లు ఆ కుమారుని చేత మరుసటి రోజే నాగలి కట్టి పొలం దున్నిస్తుంది. నాయక్‌గారి మాటలకు అంత విలువ ఉంటుంది. బంజారా ప్రవర్తనా సంస్కృతికి భంగం కలిగించే ప్రతి విషయంలోను ''న్యావో''(నసాబ్) ఎదుట పెట్టే అవసరం లేదు. ఇలాంటి చిన్న తప్పు తాండా ముఖ్యుడే(నాయక్) సరిచేస్తూంటారు.

ఒక బంజారా అబ్బాయి, అదే తాండాకు చెందిన ఒక విధవనో లేక అదే తాండా అమ్మాయిని లేపుకుపోవడాన్ని, బంజారాలు చాలా తీవ్రంగా పరిగణిస్తారు. ఎందుకంటే వావి వరసులు తప్పిన వారితో వ్యభిచారము చాలా నేరము. బంజారా తాండాలోని సభ్యులందరు ఒక కుటుంబముగా రక్త సంబంధాలు కల్గిఉంటారు. కనుక వావి, వరుసలు ముఖ్యంగా పాటిస్తారు. ఒకే తాండావారు అందరు ఒకే రక్త సంబంధీకులు. ఈ రకమైన తప్పు చేయువారికి తాండానుండి బహిష్కరిస్తారు. ఒకవేళ తన తప్పుతెలుసుకొని క్షమాపణ కోరితే, క్షమా కార్యక్రమము చాలా గొప్పగా ఉంటుంది. తిరిగి తమ తాండా లోనికి తీసుకొనాలంటే ''ధరమ్ కా హుక్కా'' కార్యక్రమం ఏర్పాటు చేస్తారు. ఈ కార్యక్రమములో దోషి తాండా పెద్దలందరికి పాదాభివందనములు చేయాలి.

ఈ రకమైన దండనలే కాకుండ మరి ఎన్నో రకాల శిక్షలున్నాయి. అందులోనిదే ''టాకి కా దండ్''అంటారు. ఇందులోదోషికి అపహాస్యమైన రెండు పైసల జరిమానా విధిస్తారు(దండన) దీని వలన ఆ దోషి విలువ రెండు పైసలకు తగ్గిపోతుంది. ఈ విధంగా ''నసాబ్'' తీర్మానం చేసి. ఆ దోషిని, ''టాకికా ఆద్మి''(దీపిసార్ ఆధ్మి) అనగా ''రెండూ టాకాల మనిషి'' అని పేరు పడిపోతుంది. వారిని ఎవరు పిలిచినా(ఏ దిపిసారో ఆద్మీవరా) రెండు పైసలు మనిషి ఇటురా అని పిలుస్తారు.

బంజారాలలో ఉమ్మడి జవాబుదారి చాలా ఎక్కువ బలమైనది. ఇదే తమ తాండా ప్రవర్తనా నియమావళిని ఖచ్చితంగా కాపాడతుంది. అయితే తరచూ వంశ కలహానికి, జన్మవైరానికి దారి తీస్తుంది, మరియు ప్రాణ నష్టం కూడ జరుగువచ్చును. అందువలన ఇది చాలా విచారించవలసిన విషయం అందుకే ప్రభుత్వం దీనిని నివారించటానికి ఎన్నో చర్యలు చేపట్టింది.

మిగిలిన సంచార తెగల వలనే బంజారా సంచార తెగ కూడ ఆచరించ ప్రారంభమైనది. ఎందుకంటే ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక రంగాల్లో నూతనత్వం వెల్లివిరిస్తుంది. అన్ని రంగాల్లో ఆధునికం చోటు చేసుకొంటోంది, ఇలాంటి పరిస్థితులలో ప్రతి అవసరానికి ధనం ముఖ్యంగా అవసరమైనది. పురాతన వర్తక పద్ధతుల్లో అంత ధనం సంపాదించటానికి అనేక ఇబ్బందులు ఉన్నాయి. అవియునుగాక తమ సామూహిక మతతత్వ జాతర్లకు సాంప్రదాయ కుటుంబ

అవసరాలకు ముఖ్యమైన బంధుమిత్రులు విందు, వినోదాలకు ఎంతో వెచ్చించవలసివచ్చినది. శక్తికి మించిన ఖర్చులతో సతమతమయి అధిక వడ్డీలకు పెద్ద మొత్తాలలో అప్పులు చేసి, అప్పుపాలైనారు. ఒక్కొక్కరికి సుమారు 300రూ.ల నుండి 1,000 రూ.లు అప్పు ఉండడం పరిపాటి అయినది. 1976 సం.లో మాట. ఆ ప్రాంతములోని స్థానిక వడ్డీ వ్యాపారుల వద్ద తెస్తారు. అతను సుమారు 20 నుండి 25 శాతం వడ్డీ వేస్తాడు. ఇది ఏమి పెద్దగా అనిపించదు. కాని కనీస అవసరాలు తీరని మానవునికిది వేలరెట్లే.

ప్రతి బంజారా తలసరి ఆదాయం సుమారు 30 రూ.లనుండి 50 రూ.లుమాత్రమే. ఇదే వారు పశ్చిమ రాజస్థాన్‌లోని ఊరూరు తిరిగి చిన్న చిన్న వస్తువులు అమ్మి కూడ పెట్టినదే. మోటారు వాహనాలు రావటం వల్ల, వ్యాపారం దెబ్బతినటం వల్ల, పల్లె సీమలతో సాన్నిహిత్యం తెగిపోయినందున, పంచపాద్ర ఉప్పు కార్మాగారంనుండి ఉప్పు నరక్తంకూడ పడిపోయినది.

మిగిలిన ముఖ్యమైన సంచారక తెగలలో అధిక సంఖ్యను కల్గి, ఎంతో ప్రచారం కల్గి ఉన్నతచరిత్ర కలిగినవారు, గదలియా లోహార్లు వీరు తమ సంస్కృతికి కాపాడుటకు ప్రమాణాలు చేసి సంచార జీవనాన్ని విడనాడవలయునని వాగ్దానం చేశాయి. అయితే చిథోడ్ కోటను ముట్టడించి, వశపరచుకొనే అంతవరకు వారు అలాగే సాగిస్తారు.

వారి బంధుత్వము, వారి సంస్కృతి విలువలు మరియు ఆర్థిక నిర్మాణతలన్ని వారి కదలికలకు మరియు వారి కార్యకలాపాలపై ప్రభావము చూపుతాయి. వారి కదలికలు నిర్ధారిత మార్గాల్లో నిర్ధారిత కార్యక్రమాల్లో వారికనువైన ప్రదేశాలకై పరిమితమై ఉంటాయి. ఈ నిర్మిత ప్రాంతాన్ని ఛోక్లా అని కూడ అంటారు.

కమ్మరి(లోహార్) తెగకు చెందిన సంచారకులు రాజస్థాన్‌లోని ఎనిమిది మార్గాలను ఎన్నిక చేయబడినవి. అవి 1. బేవారం 2. జైపూర్ 3. సికార్ 4. కోట అటోంక్ 5. డౌస్ 6. చిథోడ్‌ఘర్ 7. కోతపూ ఆలాల్ సోట్ మరియు 8. ఉదయపూర్. గదలియా లోహార్ల కుటుంబమే ఒక స్వయం సమృద్ధి. మరియు వినియోగ శాఖ, సరాసరి 4లేక8మంది కుటుంబ సభ్యులుగల శాఖలో సగటున 2.8 మంది సంపాదనంలో నిమగ్నమై ఉంటారు. అనగా 41.1%(శాతం) మంది సంపాదనలో మునిగి ఉంటారు. ఎక్కువ మంది కమ్మరులే. సరాసరి ఒక గదలియా కుటుంబము ఆదాయం 1,078 రూ.లు ముఖ్యంగా కొలిమి పనుల వల్ల వ్యవసాయ పనిముట్లు అమ్మకము వల్లనే వస్తుంది. 90% మంది సంవవత్సరమంతా ఇదే పనిలో నిమగ్నమై ఉంటారు.3% మాత్రం ఈ పనిని 6 నెలలు చేస్తారు. 50% సొమ్ము అడ్వాన్సుగా తీసుకొంటారు. వీరిలో ఋణ భాగం మాత్రం అన్ని సంచారా జాతులకన్నా తక్కువ. సి.ఎ. జెడ్.ఆర్.ఐ అధ్యాయనం చేసిన 27.2% కుటుంబాలు మాత్రం ఋణ భారంతో బాధపడుతున్నట్లు తేలింది. అందులోను 75% కుటుంబాలు 550 రూ కంటే తక్కువ అప్పులను కల్గి ఉన్నాయి. పదవ వంతు కుటుంబాలు మాత్రమే 950 రూ మించి అప్పును కల్గి ఉండలేదు.

వర్షాకాలంలో ఈ కమ్మరులు, దగ్గరగా ఉన్న పరిసర పల్లెలలో పరిమితంగా సంచరిస్తారు. ఎందుకంటే వర్షాలకు రోడ్లు తడిసి ఉంటవి. తమ భారి వాహనాలు పోవుటకు అనుకూలముండదు. వేసవిలో వీరి పని ఎండలకు అతి వ్యయ ప్రయాసలతో కూడినది. వీరి సంచారిక కొలిమి బండ్లు రాజస్థాన్ ఎడారి ఎండలకు అధిక ఉష్ణోగ్రతను కల్గివుంటవి. ఆ దేశంలో

వ్యవసాయం ఉండదు. కనుక పనిముట్ల అవసరాలు కూడ ఉండవు. అందుకేవారు సీతాకాలం కొరకు ఎదురు చూస్తూ ఉంటారు.

సంచార జీవితం గడిపే అవసరం, పరిస్థితులు ఇప్పుడు మారిపోయినవి, శాస్త్రీయ పరిజ్ఞానం, నైపుణ్యత పెరిగినందున, పల్లె ప్రజలతో వీరి అవసరాలు సన్నగిల్లినవి. అయినా ఇంకా వారి పురాతన చేతి వృత్తులపై ఆధారపడి జీవించడం ప్రస్తుత పరిస్థితిల్లో ఇమడదు. వారి జీవనం సమకాలీన పరిస్థితులలో సృష్టి విరుద్ధంగా కనిపిస్తుంది. వీరిలో చాలా మంది విసిగి వేసారినారు. స్థిర నివాసములు ఏర్పరచుకొనవలయునన్న అభిప్రాయంలో ఉన్నట్లు తేలింది. జ.ఎ.జెడ్.ఆర్.ఐ పరిశీలనల్లో విలువైన విషయం గదిలియాలోహార్‌కు ఉన్న ఆదరణ చాలా ఎక్కువ. వీరు పల్లె ప్రజల అవసరాలు తీర్చుతారు. కనుక వీరికి ఆదరణ ఉండవచ్చు. 73% మంది వారి సంబంధాల కనుగుణంగా స్పందించారు. ఎందుకంటే పనిముట్లువారి నుండి కొనుక్కోవచ్చును లేక వారికి అమ్మవచ్చును. లేక మార్చుకొనవచ్చును. రిపేర్లు చేయించుకోవచ్చును.

సంచారిక జీవనం. అందులోను చెట్లు చేమలు తక్కువగా ఉన్న ఎడారి ప్రాంతాల్లో ఒక మహా సమస్యగా తయారైనది. అతి ఉష్ణమండలమైన రాజస్తాన్‌లో పచ్చిక, పచ్చదనం అసలే ఉండదు. అలాంటి సమయాల్లో కట్టెల కోసం ఉన్న చెట్లను నరుకుతూ, అసలే వ్యవసాయం సరిగా లేని ప్రాంతంలో సంచారికి జీవనం శాపమే కాని, సరియైనదికాదు. ఇది ఇంకా ఎడారి విస్తరణకు తోడ్పడుతుంది. సామాజిక మరియు వాతావరణ శాస్త్ర వేత్తలకు ఇది ఒక సవాలుగా తయారైనది. ఏ విధంగా ఈ తెగల వారికి స్థిరనివాసాలు ఏర్పరచాలి? వారి సాధారణ నివాసమెలా ఏర్పాటు చేయాలన్నదే ప్రశ్నార్థకంగా మిగిలినది.

అందువలన ప్రభుత్వం మొదట్లోవారి స్థిరనివాసాలేర్పరచడానికి, చేసిన ప్రయత్నాలు విఫలమైనవి. వారి సామాజిక, సాంస్కృతిక పరిజ్ఞానంలో శాస్త్రీయ పద్ధతుల్లో వారి జీవన సరళిని, అధ్యయనం చేసి, వారిలో అభివృద్ధిని సాధించాలి, వారికి స్థిర నివాసాలు ఏర్పరచాలి, రాష్ట్ర ప్రభుత్వం ప్రయోగాత్మకంగా చేపట్టిన పథకాలు విజయవంతం కాలేదు. బేవార్ మరియు కిసాన్ ఘర్‌లో భూములు పంచినా, సార్థకత లేదని, నిరూపించబడినది. సంచారిక జీవనానికి, తాండాలో నివాసానికి అలవాటు పడ్డ సంచారిక తెగలు ఇతర ప్రజలతో కలసి జీవించలేక పోయాయి. కాలనీల్లో వీరి అమాయకత్వం, వీరి ప్రత్యేకత, సంస్కృతి వారిని ఇనుమడింప చేయలేక పోయినవి. అందుకే ఈ ప్రాంతములన్ని నిరుపయోగమైనాయి. ఆర్థిక చిక్కులు, వీరిని నిచాతినీచంగా చూడబడేటట్లు చేసాయి. థార్ ఎడారిలో ఇసుకగాలి కెగరినట్లు వీరి జీవనం కూడ గాలిలోని ఇసుక రేణవుల్లాగైనాయి. వీరి జీవితాలు ఎవరికి అవసరంలేని, అర్థరహిత, అనవసర ధూళివలె తయారయ్యాయని అనడంలో అతిశయోక్తి లేదని అనిపిస్తుంది.

***ASK NOT WHAT YOUR COUNTRY (COMMUNITY) CAN DO FOR YOU***

***BUT WHAT YOU CAN DO FOR YOUR COUNTRY (COMMUNITY)***

# ఢాడి-బంజారా

**సమాజ సందేశమును అందించువారు :** బంజారా సమాజంలో ఒక జాతి ఈ విధంగా ఉన్నది. వారిని ఢాడి అంటారు. వారిని భట్ అని కూడా అంటారు. తెలుగులో భట్రాజులు ఉన్నట్లు. ఈ జాతి ప్రజలయొక్క కార్యక్రమం ఏమనగా, పాడటం పాడటం. కథలు చెప్పటం( వినిపించటం) గ్రామములో నాయకుని సందేశమును, వేరే తాండాలోని నాయుకునికి వినిపించటం, సమాజములోని పెండ్లి కాని, ఆడ,మగ పిల్లల విషయములను తెలుసుకొని, వారి వద్ద ఉంచుకొనుట, మరియు వారి వివాహములను కుదుర్చుటకు ఇటువంటి పనులు చేస్తారు.

పూర్వకాలంలో ఈనాడు ఉన్నట్లు రైళ్ళు, రోడ్లు సౌకర్యములు లేవు మరియు వేరు వేరు ప్రదేశములలో నివసించే బంధువులు, ఒకరినొకరు వెంటనే కలిసేవాళ్లు కాదు. సంవత్సరాలు పట్టేది. వెంటనే ఒకరినొకరు కలుసుకొనే అవకాశములు వీరికి ఉండేవి కావు. వారి ఇటువంటి ఇబ్బందులను దూరం చేయుటకుగాను ఢాడీలు చెరవేయుచుండిరి. సమాచారములను ఒక ప్రదేశమునుండి వేరొక ప్రదేశమునకు పోవుట, లేక ఒక తాండానుండి మరియొక తాండాకు పోయి ఒకరి సమాచారము మరియొకరికి అందించేవారు. పెండ్లికి యోగ్యులైన పిల్లల



ఢాడి బంజారా

సమాచారములను సేకరించి, వారి గోత్ర నామములను తెల్పి పెండ్లి సంబంధాలు కుదుర్చుట మొదలుకొని పెండ్లి చేయించేవరకు అన్ని బాధ్యతలు వీరు వహించుచుండిరి. అనగా ''పురోహితుడి లాగా'' ఈ ఢాడీలు చేస్తూ ఉండిరి.

బంజారా సమాజములో వివాహ సంబంధమైన కొన్ని నియమాలు ఉన్నవి. దాని యొక్క నియమం ఈరోజుకూడ ఆచరణలోఉన్నది. పెండ్లికుమార్తెవారు ఎప్పటికి వరుని చూచుటకు పోరు. వరుని సంబంధంవారే వధువును చూచుటకుపోతారు.

వరుని తరపు ప్రజలు వచ్చి వధువును చూచి, మెచ్చుకొని మాకు అమ్మాయి నచ్చినది, అన్న తరువాత సంబంధంగూర్చి మాట్లాడుతారు. తాంబూలం పుచ్చుకొనే రోజు(సగాయి) అమ్మాయి తండ్రి కాని లేక ఆమె దగ్గరి బంధువు దగ్గర పోయి వారికి తలపాగా మరియు చొక్కా(షర్టు) గుడ్డను ఇచ్చి బొట్టుపెడతారు. అది జరిగిన తరువాత సగాయిఖరారు అవుతుంది. ఈ కార్యములన్నియు ఢాడీలు ద్వారానే జరుగును. (పూర్వం) మా వివాహ సంబంధాలు ఇప్పటివి కావు. చాలా పురాతనమైనవి, ఇందులో మేము చెప్పిన ఆశయము ఒకటిఉంది. ఢాడీ జాతివారు బంజారా సమాజములోని మంచి సందేశములను సేకరించి ఇస్తువుండిరి. వీరిని రాజదూతలు అంటారు. వీరు ఎప్పుడు ఒక ప్రదేశములో ఉండరు. ఎప్పుడు తిరుగుతూ విషయాలను చేరవేస్తుంటారు. వీరు బంజారా రాజుల చరిత్రలను గానం చేస్తూ తాండాలలో వారి రుబాబు, సారంగిపై పాడి వినిపిస్తూ ఉంటారు. బంజారా గోత్రనామములు, వంశ చరిత్రలు చెప్పుతూ ఉంటారు. బంజారాల గూర్చిన ప్రతి విషయం వీరికి తెలుసును.

బొంబాయి నగరం గూర్చి వీరు పాడిన పాట ఇది :–

పేలి భాగ్ బొంబాయిరో అంగ్ ఆవచ!
బోరిబందరేతి గాడి హోరే జావచ! ధూమ్ ॥

అరే సముద్రేర్ కన్ ఏకదేవల్ భందోచ।
తీన్‌సే సాట్ జహాజే పాణిమా హుబీచ !
రాతదన్ దీవా బత్తిసే జోర్ చాలచ!
బోరి బందరేతి గాఢీ హోరీ జావచ ॥ ధూమ్ ॥

అరే బందరెమ మాచళిరో జోర్ వేరోచ।
దేఖతాణి జీవ్ గర్ గర్ ఫరచ।
అన్ లాక్ లాఖా రుపియారో వ్యవహార్ వేరోచ।
బోరి బందరేతి గాఢీ హోరే జావచ ॥ ధూమ్ ॥

అరే నాయక్ నగరేతి గోర్ బంజారా పత్రికా నికాల్‌రేచ !
తాండే తాండేరో గ్గోర్ పత్రికా మంగారేచ !
వాచతాణీన్ గోరూర్ ఆంఖి ఉగాడ్‌రేచ।
రణజిత్, చంద్రకళా ఆచోమార్గ బతారేచ ॥

బోరిబందరేతి గాఢీ హరేజావచ ॥ ధూమ్॥
అరే ముంబాదేవి యాడిన సత్ ఆవరోచ।

ఈ విధంగావారు, ఎక్కడకెళ్ళిన అక్కడే పాటలు అల్లుకొని గానము చేస్తూ ప్రజల మనస్సులను రంజింపచేస్తారు. గ్రామమువారు, అందరు కలసి వారకి ఇచ్చే సంభావనలను తీసుకొని వాటిపై ఆధారపడియే పూర్వంనుండి వీరు జీవించేవారు.

# రెండవ అంతర్జాతీయ రోమా వేడుకలు (1983 చండీఘర్)

1000 సంవత్సరముల తరువాత రెండవ సారి రోమా( జి ప్సీలు) తమ జన్మభూమి, పుణ్య భూమి అయిన భారతదేశనికి వచ్చి తమ మాతృమూర్తి మరియు మహారాణి (ఠాకరాణి) శ్రీమతి ఇందిరా గాంధిని కలుసుకొన్నారు. పాశ్చాత్య దేశాలనుండి రెండవ అంతర్జాతీయ రోమా (1983–ఛండీఘర్) వేడుకలకు విచ్చేసిన, ప్రపంచ జిప్సీల ప్రతినిధులు తమ మాతృభూమిని మాతృభూమినేలే ప్రధానమంత్రిని గురించి, నివాళులర్పిస్తూ, తమ పుణ్యభూమి మీద ఉన్న ప్రేమానురాగాలను వ్యక్తిపరచిన వైనమిది.

ఎన్నో శతాబ్దల తరువాత ప్రపంచ నలుమూలలనుండి సంచార జీవనము గడపి తిరిగి తమ మాతృభూమికి వచ్చేసి ,1976 ఇదే ఛండీఘర్‌లో తమ అంతర్జాతీయ మొదటి రోమా పండుగ ప్రారంభించడమనేది రోమా చరిత్రలోనే ప్రప్రథమధ్యాయమయింది. రాజస్తాన్ మరియు పంజాబులో పుట్టినటువంటి రాజపుత్రుల వంశం, విధిరాతకు గురియై చిన్నాభిన్నమై స్థిర నివాసాలు కోల్పోయి, సంచార జీవితం గడిపే స్థితికి దిగజారిందంటే ఎవరైన ఊహించవచ్చు వారు ఎన్ని భాదలకు గురి అయిఉంటారో. ఎక్కడైతే వారు వెళ్ళారో అక్కడ హింసించబడి, స్థిర నివాసానికి అనుమతించబడక, తిరుగుబోతులుగా, దేశ దిమ్మరిగా, పొగరుబోతులుగా, గజదొంగలుగా ముద్రలు మోపబడినారు.

పశ్చిమోత్తర భారతాన మహమ్మదీయుల దండయాత్రలకు బలి అయి 15 మిలియన్ల( ఒకటిన్నర కోటి) ప్రస్తుతం3 కోట్ల రోమాలు విధివంచితులై అసాధారణమైన చరిత్రను సృష్టించామని గర్వపడ్డారు. సంస్కారవంతులమనుకొనే మధ్య ఆశియావాసులు, తూర్పు ఐరోప( బాల్కనులు) మరియు పశ్చిమ ఐరోప వాసులు ప్రపంచములోకెల్ల పురాతన ప్రజా స్వామ్య దేశమయిన ఇంగ్లాడుకూడ నిన్నమొన్నటివరకు రోమాలకు పౌర సత్వమే ఇవ్వలేదు. ఐక్యరాజ్య సమితి యొక్క(సబ్ కమీషన్ ఆన్ జిప్సీస్ ప్రివెన్షన్ మరియు ప్రొటెక్షన్ ఆఫ్ మైనారిటీస్ 1977) తీర్మానం కూడా ఖాతరు చేయక ఇప్పటికి ఎన్నో పశ్చిమదేశాలు రోమాలకు పౌరసత్వం ఇవ్వలేదు.

భారతదేశం, తన రోమా ముద్దు బిడ్డల కోసం ఎంతో శ్రమించి ఎ. రా. సి. లో ఈ తీర్మానాన్ని గావించినది. 15 మిలియన్ల జనాభా కల్గిన రోమాలు ఇప్పటికి ఏ దేశంలో కూడ ఇప్పటివరకు పౌరహక్కుల్ని పొందకుండా ఉన్నారంటే దాన్ని మించిన మానవోపద్రవం, ఇంకొక్కటి ఉండదు కాబోలు. జవహర్ లాల్ నెహ్రూ యొక్క ప్రాణ స్నేహితుడైన యుగోస్లోవియాధినేత కి. శే. మార్షల్ టిటో కూడ మొట్టమొదటివాడు. యుగోస్లోవియాలో రోమాలకు పౌరసత్వాన్ని ఇచ్చినాడు.

హిట్లరు మహాశయుడి రాజకీయ నిర్బంధితుల శిబిరాల్లో, 6,00,000(ఆరు లక్షలు) మంది రోమాలను ఇతర జాతులతోసహా ఊచకోత కోయబడ్డారు. జ్యూమతస్థులకు ఇస్రాయేలు లాగా, రోమాలకు తమదంటూ ఒక దేశంలేని దురదృష్ట జాతకులుగా పరిగణించబడి, యుద్ధ నష్ట పరిహారము కూడ చెల్లించబడలేదు.

1000 సంవత్సరాల తరువాత, అనిశ్చితమై, స్వదేశంలేని రోమాలు ''ప్రపంచ రోమాని యూనియన్''(ప్రపంచ రోమానో ఏగిపే' గుర్తించబడి 71 వేర్వేరు దేశాల రోమాణి ఆర్గనైజేషన్లకు, ప్రపంచ రెండవ రోమాణి కాంగ్రెస్ (1978) తర్వాత 1979లో ఐ.రా.స. **1979**నుండి రాజ్యాధికారం లేని దేశం హోదానిచ్చింది.



అంతర్జాతీయ రోమా జిప్సీ వేడుకలు *1983*, ఛండీఘర్



రోమా బంజారా ( జిప్సీ) లతో ప్రియతమ ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీగారు

మరొక చారిత్రాత్మకమైన సంఘటన ''రెండవ అంతర్జాతీయ రోమా వేడుకలు'' చండీఘర్‌కూడ మరోమైలురాయి. ఇది మొదటి అంతర్జాతీయ రోమా వేడుకకంటే ఎంతో గొప్పది, ప్రాముఖ్యత కల్గినటువంటిది. ఎందువలన నంటే భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి గారు ఎంతో ఉత్సాహంతో సహృద్భావంతో ఇందులో పాల్గొన్నారు. శతాబ్దాల ప్రపంచ సంచార జీవితం తర్వాతే రోమాణీలు తమ మాతృమూర్తిని ''ఠాక్రాణి''(రాణి) ని మరియు తమయొక్క నాయకురాలిని వెతుకున్నారు. ఎందుకంటేవారు తమ మాతృదేశాన్ని, నేత్రుత్వం వహించే వ్యక్తిని వెతుకుతూ ఉండిరి. వారికి ఇప్పుడు మంచి రోజులొచ్చాయి. వారి విధిరాత మారింది, మొట్టమొదటిసారి ,వారి చరిత్రపుటల్లో మొదటి ఆకు(పేజి) తిప్పబడింది. మొదటి మొగ్గతో దిగబడి ఉజ్వల భవిషత్తుకు వెలుగు చూపింది.

శ్రీమతి ఇందిరాగాంధి మరియు ఆమె నేత్రుత్వం వహించే దేశం చేయవల్సిన పని ఎంతోఉంది. రోమాలకు వారు నివశించే దేశాల్లో, హక్కులు లభించేటట్లు చేయాలి. వారు కోరేది కూడా అదే! పౌరహక్కులే కానీ! స్వరాజ్యం కాదు. వారి సంస్కృతి సంగీతము మరియు భాషమొత్తంగా భారతావనినుండి తీసుకొని పోబడి ఎంతో భద్రంగా దాచబడింది. ఎంతో విలువైన వారసత్వపు ఈ సంస్కృతిని ఇన్నేళ్లు తమ కంటూ ఏ దేశం కానీ, భౌగోళిక ప్రదేశం కానీ లేక అష్టకష్టాల పాలౌతూ, కాపాడు కుంటూవచ్చారు. ఈ సంస్కృతిని, భాషను కాపాడుట, భారత ప్రభత్వము మరియు ప్రపంచ రోమా భూవైశాల్యంగల యూనియను రెండును ట్రస్టులుగా ఉండి జర్మన్ ప్రభుత్వంనుండి యుద్ధ నష్టపరిహారం సాధించి పెట్టాలి. ఈ మొత్తాన్ని రోమా సమాజాభివృద్ధికి ఉపయోగించాలి. రోమా సంస్కృతి సంగీతం మరియు భాషను యునెస్కో(UNESCO) ద్వారా అభివృద్ధి పరచాలి.

మరొక ముఖ్యమైన విషయం ఎమిటంటే ఈ రెండవ అంతర్జాతీయ రోమా వేడుక 1983 ఎన్నో తరాల క్రిందట విడిపోయిన భారత బంజారా సోదర, సోదరీమణులతోను కలిపింది. ఈ విషయంలో బొంబాయి, బంజారా సేవా సంఘము మరియు బంజారా మాసపత్రిక ఇండియన్ ఇన్‌స్టట్యూట్ ఆఫ్ రోమాణి స్టడీస్‌కి, ఎంతో రుణపడి ఉన్నారు. ఎంతోమంది భారతీయ బంజారా ప్రముఖులు ఈ వేడుకల్లోనే కాకుండ, రెండవ మరియు మూడవ రోమాణి కాంగ్రెసు జనివా(స్విర్జర్లాండు) మరియు కొంటిగాంగ్(పశ్చిమ జర్మన్)లో పాల్గొన్నారు. 33మంది కల్గిన బంజారా సాంస్కృతి దళం బొంబాయి చిక్కవాడి తాండానుండి చండీఘర్‌లో జరిగిన రెండవ అంతర్జాతీయ రోమా వేడుకల్లో శ్రీ రంజిత్‌నాయక్, ఆధ్వర్యంలో తమ రంగు రంగుల సాంప్రదాయ దుస్తుల్లో పాల్గొన్నారు. ఈ వేడుకల్లో బొంబాయి బంజారాలు ప్రముఖ పాత్రను వహించారు. భారతదేశంలో బంజారాలు బరువెక్కిన హృదయాలలో కన్నీటి పర్యంతం, ఆనందంతో పొగొట్టుకొన్న తమ రోమా సొదరీ, సోదరులను తిరిగి కల్సుకున్నారు. హా జరైన మొత్తం రోమా ప్రతినిధులు ఏక కంఠతో గొంతెత్తి '' హమరోరత్ తాయి (రక్తం) తమారో రక్తసి ఏక్'' మీ రక్తం మరియు మా రక్తం ఒక్కటే అని ఆనందంతో అరచారు. మనమందరం రాజపుత్రలం క్షత్రియ యుద్ధ వీరులం మన సంస్కృతి ఒక్కటే, మనంమందరం ఒక్కటే అని ఏకగళంతో ఆనందంతో గొంతు కలిపారు. పుత్రులం, క్షత్రియ యుద్ధ వీరుల వంశస్థులం అని ఆనందంతో గొంతు కలిపారు.

తమ బంజారా సాంప్రదాయ దుస్తులతోరంగు రంగుల బంజారాలు ఈ వేడుకల్లో పాల్గొని అందరి మన్ననలు పొందారు. అందుకే ఈ రెండవ అంతర్జాతీయ రోమ వేడుకలు చరిత్రలోనే ఒక ముఖ్య సంఘటన అయింది. 5 కోట్ల భారతీయ బంజారాల 3 కోట్ల రోమాణీల పోరాటంలో వెన్నంటి ఉంటామని ప్రతిజ్ఞ చేశారు. వారితోనే ఉండి వారి కార్య క్రమాలన్నింటిలోనూ మన వారి చర్చలన్నింటిలోనూ, వారి సర్వోన్నతికి తోడ్పడుతామని నొక్కి వక్కాణించారు.

భారత బంజారాలు ఆర్థికంగా, సామాజికంగా మరియు విద్యా పరంగా ఎంతో వెనుకబడి ఉన్నారు. అంతేకాక వారి దైనందిన జీవితాలలో కూడా ఎన్నో సమస్యలు ఎదుర్కొను చున్నారు. వీటన్నింటిని అధిగమించి, అందరి అభివృద్ధి కోసం ఇంకా ఎంతో చేయవలసి ఉంది. ఎందుకంటే వారి చరిత్ర సాధారణ చరిత్ర కాదు. 2000 సంనాటి గొప్పచరిత్ర, గొప్ప సాంప్రదాయక సమూహంతో కూడిన సంస్కృతి, అందువల్ల వాళ్ల కష్టాలు తీర్చుకొనేందుకు సామూహికంగా శ్రమించి తప్పక విజయం సాధించుకుంటారు.

భారతదేశ బంజారాలు రోమాణి వలెకాక తమ జన్మభూమి అయిన భారతావనిలోనే ఉన్నారు. ప్రజాస్వామ్య ప్రాతిపదిక మీద ఎన్నుకోబడ్డ ప్రభుత్వము, ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి ఆమె నేత్రుత్వములో ఎన్నుకోబడిన ప్రతినిధులు, గ్రామ పంచాయత్ మొదలు పార్లమెంటు వరకూఉన్నారు. వారికి మొట్ట మొదట పౌరసత్వపు హక్కులను, ప్రజాస్వామ్యాన్ని సాధించి పెట్టటమే మా ధ్యేయం. అందువల్లే స్వతంత్ర రాజ్యములో ఎంతో ప్రగతి సాధించాము, ఎన్నో ప్రత్యేక హక్కులనూ కల్గియున్నాము.

మా యొక్క ముఖ్యమైన చింత ఒకటే, అదే మా సోదరి, సోదరులు రోమాణిలు ప్రపంచమంతా విస్తరించిఉన్నా, ఇంకా మైనార్టిలుగానే ఉన్నారు. వారికి మొట్ట మొదట పౌరసత్వపు హక్కులను, ప్రజాస్వామ్యాన్ని సాధించి పెట్టటమే మా ధ్యేయం. అందువల్లే మేము భారత బంజారాలు మా రోమా సోదరుల కోసం, బంజారా పత్రిక ద్వారా ప్రతిజ్ఞ చేస్తూన్నాము. మేము సమిష్టిగా ఉద్యమించి పనిచేస్తాం.

1. ప్రపంచ రోమాణి ఎకివే( ఐక్యమత్యం కొరకు)
2. రోమా బంజారా సౌభ్రాతృత్వం కొరకు.
3. ప్రపంచమంతా విస్తరించి నా ఇంకా మైనార్టిగానేఉన్న రోమా పౌరహక్కులకు.
4. రోమా బంజారాల సంగీత, భాషను భద్రపరచుట కొరకు మరియు పరస్పరం ఇచ్చి పుచ్చు కోవడం ద్వారా, పరిశీలన ద్వారా వీటిని అభివృద్ధి పరచుకొనుట కొరకు.
5. అంతర్జాతీయ ఉప్రేరోమా( రోమా మేలు కొలుపు)
6. తేత్రైలే-ఓ-బారోథాన్-ఇండియా మా జన్మభూమి, పుణ్యభూమి ఇండియా పదికాలాలు వర్ధిల్లి ఉండుట కొరకు.
7. తేత్రైలే-ఓ-రోమా-బంజారా బ్రదర్ హుడ్. రోమా బంజారాలు సౌభాత్రుత్వం పదికాలాల పాటు వర్ధిల్లడం కొరకు.
8. ఆచ్ దేవ్ లెస్సా-తూకే-శాంతి మాసా. దేవునిక్రుప సదా మీపై ఉండుగాక-మీకు సదా మంచి జరుగుగాక

# ద్వితీయ అంతర్జాతీయ రోమా వేడుకులు - ఒక చారిత్రాత్మక

**సంఘటన :** ద్వితీయ అంతర్జాతీయ రోమా పండుగ చండీఘర్ 29 అక్టోబరు 1983. సందర్భముగా భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధిగారు, తను ఈ వేడుకులకు రావటానికి కారణాలు వివరిస్తూ తను రోమాలతో బాంధవ్యాలుండటం వలన, తను ఈ రోజు ఇక్కడ హజరైనానని సగర్వంగా చెప్పారు. రోమా ప్రముఖులు ఇక్కడికి రావటానికి కారణం తమకు ఈ దేశంలో ఉన్న ఎంతో లోతుగా పాతుకు పోయిన సంబంధాలను పదిలపరుచ్కోవటానికన్నారు. వారు ఈ దేశంలో ఎంతో గంభీరమైన బాధకు గురియై ఉన్నరాని, అయినా కూడ మానవతాత్మవిజయోత్సాహం వారిపై ఎప్పుడు ఉంటుందన్నారు.

ఎన్నో దేశాల సంస్కృతులను జీర్ణించుకొని, కూడ భారతావని లక్షణాలను దాచుకొన్నారని అదే లక్షణం వారిని ఇక్కడ ఈ ద్వితీయ అంతర్జాతీయ రోమావేడుకలు జరుపు కొనుటకు చాలా సముచితంగా ఉందన్నారు.

యుగోస్లోవియా యొక్క రోమాణి యూనియన్ ప్రసిడెంటు శ్రీసైత్ బాలిక్ మాట్లాడుతూ ఈ వేడుకలు తమ జన్మభూమి భారతదేశానికి, ప్రపంచదేశాల్లో స్థిరపడ్డ రోమాణిలకు మధ్య స్నేహము సౌభ్రాతృత్వము,అభివృద్ధి చెందటానికి ఒక వంతెన వలె ఉపయోగపడిందన్నారు. ఈ వేడుక తెగిపోయిన భాందవ్యాలను పునర్మితం చేసి ప్రేమాభిమానమును పెంచి, తమ నిజమైన జన్మభూమి గురించి స్ఫూర్తిని తెచ్చిందని అన్నారు.

తాము తమ మాతృభూమినుండి విడిపోయి శతాబ్దాలైనను. ఈ విషయాన్ని తాము ఇంకా మరువకుండా ఉన్నందుకు తామెంతో గర్వపడాలని అన్నారు. ఆయన రోమా పతకాన్ని శ్రీమతి ఇందిరాగాంధికి సమర్పించారు. ఆమే తిరిగి భారతీయ జాతీయ పతకాన్ని ఆయనకు ప్రధానం చేశారు. ఇంకా ఎంతో మంది మా ప్రతినిధులు అమెకు బహుమతులు ఇచ్చారు. ప్రపంచములోని పలు ప్రాంతాలనుండి ఏతెంచిన రోమా ప్రతినిధులు అధికారికంగా రోమాణి భాషను ఇండో ఆర్య భాషగా గుర్తించాలని శ్రీమతి ఇందిరాగాంధిని అర్థించారు. అలాగే ఈ భాషను భారత రాజ్యాంగంలో స్థానం కల్పించాలన్నారు.

ఫ్రాన్సు దేశమునుండి వచ్చిన రోమా స్కాలరు డా వానియా డిగిల్లా కోలచో నోవస్కి శాస్త్రీయంగా తాము భారతదేశమునుండి వచ్చినట్లు నిరూపించారు. కాని రాజకీయంగా తమని ఎవరూ గుర్తించలేదని వాపోయారు. రోమాణి భాష జోద్‌పూరి ఉచ్ఛారణను కల్గి ఉందని పంజాబి మరియు సింధీల కలయికేనని గత 800 సంవత్సరాల మునుపువరకూ మాట్లాడేవారని. ఆ సమయంలో రాజపుత్రులు మరియు జాట్‌లు, మహమ్మదీయుల దండయాత్రల వల్ల దేశము వదలి వెళ్లారని అన్నారు.

> అజ్ఞానం : చరిత్ర చూస్తే ప్రతి సంస్కరణ వెనుక ఒక గొప్ప ఉద్యమము కనిపిస్తుంది. ఏ గొప్ప మార్పుకైన ప్రజా ఉద్యమము అవసరమే, ఉద్యమాలు ప్రమాదమని భయపడేవారు చరిత్ర జ్ఞానం బొత్తిగా లేనివారే.- పి. కు. ల్.

# పట్టణవాసులై, విద్యావంతులైన బంజారాలు తమ పిల్లలకు భాష నేర్పించటంలేదు ఎందుకు? బంజారా భాషా మాట్లాడటంలో విద్యావంతులలో సిగ్గెందుకు చోటు చేసుకొంటున్నది?

ఎంతో కాలంనుండి ఈ విషయం గూర్చి నా మనస్సులో చాలా ఆవేదన ఏర్పడినది. ఎప్పుడైతే ఈ ఆవేదన ఏర్పడిందో, తోటి బంజారాలకు తెలియ పరచటం నావిధిగా భావించి, ఈ విషయం గూర్చి ఇక్కడ వ్రాయటం జరిగినది. మన జీవితంలో వచ్చే మార్పులు, విద్యావంతులలోను, రాబోయే తరాల బంజారాల భావి జీవితం పై కూడ, ప్రభావం ఏర్పడే అవకాశం ఉన్నది. నేను వ్రాసిన ఈ బంజారాల చరిత్ర బంజారా భాషయొక్క ప్రాముఖ్యత గూర్చి, దీని లిపి గూర్చి కూడ చాలా వివరంగా తెలియపరచటం జరిగినది. కనీసం ఈ చరిత్ర ద్వారా అయిన తమ తప్పులను తెలుసుకొంటారని భావిస్తాను.

నేను కొన్ని సంవత్సరములనుండి ఈ విషయం గూర్చి చూస్తూ వస్తున్నాను. బంజారా విద్యావంతులు, ముఖ్యంగా దూరప్రాంతంలో ఉద్యోగము చేయుచున్నవారు. తమ కుటుంబ సభ్యులతో కూడ భాష మాట్లాడుటకు సంసయిస్తున్నారు. ముఖ్యంగా, గ్రామాలలో, పట్టణాలలో నివశించుచున్న బంజారా సోదరులు తమ ఇంటిలో, కుటుంబ సభ్యులతో తమ మాతృభాష అయిన ''గోర్ బోలి'' మాట్లాడరు. ఈ విషయంలో చాలామంది బంజారా సోదరులకు ఈ విధమైన అనుభవం కలిగి ఉండవచ్చును. ఆంధ్రప్రదేశ్‌లోని పట్టణాలలో నివశించే బంజారా సోదరులు, తమ మాతృభాషకు బదులు తెలుగు మాట్లాడుచున్నారు. అలాగే, మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాలలోని పట్టణవాసులైన బంజారా సోదరులు, మరాఠి, కన్నడము మాట్లాడుటను తమరు గ్రహించే ఉంటారు. ఇటువంటి బంజారా సోదరుల పిల్లలు కూడా మాతృభాషలో మాట్లాడటం లేదు. అటువంటప్పుడు వారు మాతృభాషను ఎలా మాట్లాడగలరు. ఈ విధంగా ఎంతోమంది బంజారాలు తమ మాతృభాషను మరచి పోతున్నారు.

నేను ఈ విషయంలో ముందుగా ఒక మాట తెలియచేయదలిచాను. మన రాష్ట్రభాషను మాట్లాడినను పరవాలేదు. కానీ మాతృభాష అనేది, అన్ని భాషలకు తల్లివంటిది. మనతల్లిని మనము మరచిన, మనలో మానవత్వం ఎక్కడ ఉన్నది. పుట్టినప్పటినుండి మాతృభాషయే జ్ఞానమును కలిగిస్తుంది. మన సంస్కృతిని నిలబెట్టుతుంది, మనకు రాష్ట్రభాష, దేశభాషలు చాలా ముఖ్యము. కానీ దానితోపాటు ఏకష్టము లేకుండ మనకు పుట్టుకతోనే మాతృభాష అలవడుతుంది. భాషాజ్ఞానం సంపాదించుటకుగాను, మనతోటివారికి ఒకభాషవచ్చిన, మనకు రెండు భాషలు వస్తాయి. బంజారా భాషకు హిందీ, పాళీ భాషలు మూలమై ఉన్నవి. దీనివలన దేశ భాష అయిన హిందీ సులభంగా వస్తుంది. మరియు ఉత్తరాది భాషలన్నియు బంజారా భాషతో సంబంధము కలిగి ఉన్నవి. అందువలన రాష్ట్రభాషతో పాటు

మన మాతృభాషపై కూడ గౌరవం ఉంచవలెను. ఏ సమాజము, ఏదేశములో అయితే మనం జీవించి ఉన్నామో, ఆ సమాజమును, ఆ దేశము యొక్క గౌరవమును మనం పెంచవలసి ఉన్నది.

పట్టణాలలో నివశించే విద్యావంతులైన బంజారా సోదరులు, తమ ఇండ్లలో ''గోర్‌బోలి'' ఎందుకు ఉపయోగింజటంలేదు అని చెప్పటం కొంత కష్టమైన విషయమే. ఒక వేళ ఇటువంటి బంజారా సోదరులను కలసినప్పుడు, ఎందుకు మన భాషను పిల్లలకు నేర్పించటంలేదు అని ప్రశ్నించిన, మనకు ఎక్కువ భాగం ఇటువంటి సమాధాములే వస్తాయి.

1. పిల్లలు చదువులో ''గోర్‌బోలి'' యొక్క మహత్యం ఏమిలేదని.
2. పిల్లలు పక్కింటి పిల్లలతో మాట్లాడినప్పుడు, ఆటలాడుతున్నప్పుడు వారి పిల్లలకు మన మాటలు రావు కదా?
3. పిల్లలు బడికిపోయినప్పుడు భాష బాగా మాట్లాడుతారని, ఇటువంటివే కొన్ని సమాధానములు చెప్పగలరు.

నేను ఇటువంటి బంజారా సోదరులకు కొన్ని ప్రశ్నలు వేయదలచాను.

1. బంజారా భాషను తమ ఇండ్లలో మాట్లాడే పిల్లలు, విద్యలో వెనుకపడి ఉన్నారా?
2. బంజారా భాష మాట్లాడే పిల్లలు, ఇతర భాష మాట్లాడే పిల్లలతో ఆడుకొనట లేదా?
3. బంజారా భాష మాట్లాడే పిల్లలు, ఇతర భాషలు మాట్లాడే సోదర పిల్లలతో అవమానించబడినారా? మన పిల్లలకు పుట్టుకతోనే రెండు భాషలు వస్తున్నవి. మిగిలిన సమాజం పిల్లలకు ఒక్క భాష మాత్రమే వస్తుంది. వీటన్నింటికి సమాధానము దొరకనప్పుడు, మన ''గోర్‌బోలి'' భాషని మన నిజజీవితంలో మాట్లాడేటప్పుడు ఎందుకు భాద? లేక అవమానమా? నాకు అనిపిస్తుంది. వారు భాష మాట్లాడుటకే శంఖిస్తారు. వారు మేము సుగాలీ (బంజారా) అనుటకే సిగ్గు వేస్తుందేమో?

వారిలో వారికే నేను బంజారా అని చెప్పుకొనటంలో గర్వం రాదనుకొంటాను. నిజం ఏమిటో వారికే తెలియాలి. మనయొక్క నిజ జీవితంలో మాట్లాడే భాష, ఆ భాషలో మన సమాజంయొక్క సంస్కృతి, దాని సర్వ అంగములు కలికి, ఆదర్శవంతమైన గొప్పతనం దాగి ఉన్నది. భాషలో ఒక మహాశక్తి వంతమైన మహత్యం దాగి ఉన్నది. అది మొత్తంను ప్రకాశింప చేస్తుంది. దీని ద్వారా జాతీయ ప్రేమను కలుగజేస్తుంది. నిజ జీవితంలో తమ మాతృభాషలోని, రస మాధుర్యమును చవిచూస్తారు. తమయొక్క మాతృభాషను తెలుసుకొన్నవారు, వారి వ్యక్తిత్వంలో కూడ ధృడ సంకల్పం కలిగి ఉంటారు. వారు అందులోని మంచి భావములను గ్రహించి, గుణవంతులుగా ఉంటారు. మాతృభాషను కాకుండ ఇతర భాషలను నేర్చుకొనవలయు నంటే, ఆ భాషను నేర్పించుటకు బోధకులు కావలసి ఉంటారు. ఎటువంటి బోధనా అవసరం లేకుండా లభించునదే మాతృభాష. మాతృభాష వ్యక్తిత్వమును పెంచి, సమాజములోని వాస్తవములను, సాంస్కృతిక సౌందర్యమును మరియు విశేషణమైన సృష్టియొక్క మూలములను తెలియపరుస్తుంది. ఇన్ని గుణములు కలిగిన భాషను, వ్యక్తిగతంగా లేక ఇతర సమాజమునకు వెరచి, జీవితంలోని సంఘటనలను పెద్దగా చేసి వాటియొక్క మహత్యమును నిలబెట్టుతుంది.

మన జీవిత పర్యంతం ఒక విషయమును తెలుసుకొనవలెను. వేరు సమాజము యొక్క ఆదర్శమును బట్టి, మన ఆదర్శనమును, ముడిపెట్టకూడదు. వేరు సమాజము యొక్క భగవంతుల్ని బట్టి, మన భగవంతుల్ని ఎన్నటికీ పోల్చకూడదు. ప్రతివారి ఆదర్శవంతమైన వివిధ గుణములు కలిగి ఉంటుంది.

ఆ విధంగా ఎన్నటికిని భావించరాదు. ఎల్లప్పుడు ఇతర సమాజము యొక్క గుణగణాలను పొగుడుకుంటూ, మన ఆదర్శములను ఇతరుల దృష్టితో చూడరాదు. ఇదే శక కారణం, మనలను మనం కించపరచుకొన్నట్లు, అర్థం చేసుకో, ఏదైన ఒక ప్రత్యేకమైన పరిస్థితిలో భాధ్యత వహించి, ఏ వ్యక్తి అయిన ఏదైన కార్యక్రమము చేపట్టిన, మనం వారి వారి దృష్టితో వివిధములైన పనులను నిర్వహించుకుంటూ ఉండవలెను. ఈ విషయం మన మనస్సులో ఒక్కసారి కూడ తలెత్తకూడదు. దాని ఫలితం ఏదైన కావచ్చు. వాటి ద్వారా నిర్మాణమయ్యే ఉద్దేశం కూడ వేరు వేరుగా ఉండవచ్చును.

మనం పై భావనలను ఎన్నడు గుర్తించకూడదు. ఎందుకనగా మనం మనమే! జన్మతోనో, కులంతోనోగాని ఎవ్వరు హీనులు కారు. అయితే ఎవ్వరైన హీనులైనారంటే, వారు చేసే చెడు పనులవలన; మనం, మనంచేయు పనులను మంచి మార్గములో ఉంచినట్లు అయిన, ఎవరు మనలను నీచులంటారు. ఒకవేళ మనం, మనఆచారములను మంచిగా ఉంచినట్లు అయిన, ఏమనిషి అయినా సరే, మనగుణములనే ఆదర్వంగా తీసుకొంటాడు. ఈనాడు ఎశరున ఆదర్వంగా మారుతాడంటే, మనం చేపట్టిన మంచి ఆచరణలతోనే మారుతాడు. మనం మంచి పనులను చేపట్టిన, మనంకూడ ఆదర్శవంతులౌతాము. మనకు తోడు మన సమాజమును ఎవ్వరైనా సరే! ఎందుకు గౌరవిస్తారు. మనము ఈ విషయంలో జాగ్రత్త వహించవలెను. మన సమాజము యొక్క గౌరవము, మన ప్రవర్తనపై కూడ ఆధారపడి ఉన్నది. దీనిని బట్టియే ఎక్కువ, తక్కువ అనే భావన ఏర్పడుతుంది. మనలో ఈ భావన ఎన్నటికీ ఉండకూడదు. ఎందుకనగా ఎవరో వచ్చి ఈ సమాజమును బాగు పరుస్తారు అనుకోవటం అవివేకమౌతుంది. స్వయంగా చేయవలెను. బంజారా సమాజములోని ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీ చేపట్టవలయును.

అపద్ధపు గౌరవమును మెడకు తగిలించుకొని, మేము గొప్పింటివారమని, చెప్పుకొనుటవలన, తమకు తాము అగౌరవ పరచుకోవటం జరుగుతుంది. తప్పుడు ప్రతిష్టను మెడుకు తగిలించుకొన్నవారు, ఈనాటి వరకు అభివృద్ధి కాలేదు. కాబోరు కూడ. ఏనాటికైన అపద్ధం అపద్ధంగానే నిలచిపోయి, ఉన్న గౌరవం కూడా లేకుండా పోతుంది. సత్యమును ఎప్పటికి దాచుకోలేము. దాగబడదు కూడా! సత్యం ఎప్పుడు సత్యంగానే ఉంటుంది. విపరీతమై అపద్ధం, ఇసుకతో కట్టిన ఇల్లులాంటిదే? తప్పుడు గౌరవ సంపాదనకు పోయి, వారు నిజమైన తన భాషను మరచిపోతున్నారు. సోవియట్ రష్యాలాంటి దేశములో, సైబేరియాలో వ్యాపించి ఉన్న సుమారు 10,000 జనాభా కూడా లేని ఒకచోట కూడ నిలకడగా ఉండని, సంచార జాతి వారి భాషకు ''లిపిని'' తయారుచేసి, వారికి విద్యను వారి మాతృభాషలోనే నేర్పుచూ, వారి భాషను జీవింప చేసారు.

అయితే భారత దేశంలో 6 నుండి 7 కోట్ల జనసంఖ్య ఉండి స్థిరనివాసములు ఎర్పరుచుకున్న బంజారాలకు లిపిని తయారు చేయించి, ఎందుకు భోధించటం లేదు? కావున

మనం కూడా మన బంజారా భాష ''లిపి'' గూర్చి, వారి నిజ జీవితంలో వాడబడుచున్న భాషను, జీవింపచేయుటకుగాను, ఎందుకు ప్రయత్నం చేయకూడదు? మొన్నకు మొన్న పడమటి కనుమలలో నివసిస్తున్న 20 లక్షలకన్న తక్కువ ఉన్న కొంకిణీలకు కొంకిణ భాషను గుర్తించి వారి ''లిపి''ని తయారు చేయించి, వారి భాషలో విద్యను బోధించుటకు భారత ప్రభుత్వం ఒక కార్యక్రమమును చేపట్టినది. బంజారా భాషాభివృద్ధికై, వారి విద్యాభివృద్ధికై భారత ప్రభుత్వము ఎందుకు ప్రయత్నం చేయుటలేదు?

మన నిజమైన ''గోర్‌బోలి'' పై మనమందరము శ్రద్ధ వహించవలెను. మనం బంజారాలై ఉండి, మనకు పుట్టిన బిడ్డలకు మన భాషను నేర్పించకున్న మన ముందొస్తున్న తరాలవారికి ద్రోహం తలపెట్టినవారమోతాము. ఈనాడు పట్టణంలలో నివసించుచున్న బంజారా సాదరులు మాత్రమే బంజారా భాషను మాట్లాడుటకు శంకిస్తున్నారు. ఇదే జబ్బు తాండాలలో నివసించేవారిపై కూడ ప్రభావించిన (వ్యాప్తిచెందిన) జాతి భవిష్యత్తు ఏవౌతుంది? యుగయుగాలనుండి మన పూర్వీకులు కాపాడుకొంటు వచ్చిన ఈ భాషను భారతదేశంలో దాని నామ రూపాలు కూడ మిగలకుండ పోవచ్చుదు. ఈ విధంగా బంజారా భాష రూపు మాసిపోయిన బంజారా జాతి హీన జాతిగా మిగిలిపోతుంది.

అందుకనే నేను మొత్తం బంజారా సోదరలను, సోదరీయులను ప్రార్థించుదని ఏమనగా వారు తమ మాతృభాషపై గౌరవముంచి నిజ జీవితంలో తాము, తమ పిల్లలకు బంజారా భాషలోనే మాట్లాడుకొంటు వారిని కూడ భాష మరచిపోకుండ చేయవలెను. మన సమాజములోని రాజకీయ నాయకులు కూడ ఈ విషయమును మరచిపోరాదు. వారు కూడ ఈ వియములో శ్రద్ధ వహించవలెను. మరియు వారిని కోరినది ఏమనగా ఈ భాషా విషయములో ప్రభుత్వముతో సంద్రించి అతి త్వరలో బంజారా భాషను కేంద్రస్థాయిలో గుర్తింప చేయించి, రాష్ట్రస్థాయిలో కూడ తమ తమ రాష్ట్రాలలో బంజారా భాషలో పాఠ్య పుస్తకములను తయారు చేయించి బోధకులను నియమింపచేసి దీ అభివృద్ధికి పాటుపడవలెను. ఈ విషయములో బంజారా సోదర సోదరీలను మన ప్రజా నాయకులపై వత్తిడి తేవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

# భారతదేశం-రిజర్వేషన్‌లు

భారత రాజ్యంగంలో డాక్టర్ అంబేడ్కర్‌గారు, తన చిన్న నాటినుండి అనుభవించిన అనుభవములను, భారతీయ ప్రజల మనస్తత్వములను తెలుసుకొన్నవాడు కనుక వెనుబడిన భారతదేశ జనాభాను అభివృద్ధి పరచువవలయునన్న వీరికి కొన్ని ప్రత్యేకమైన సదుపాయములు కల్పించిన కాని, అభివృద్ధి చెందటం కష్టం అని భావించిన తరువాతనే రిజర్వేషన్‌ల గూర్చి అప్పటి రాజకీయ నాయుకులతో పోట్లాడి, వారిని ఒప్పించి ఈ రిజర్వేషన్‌లను కల్పించారు.

ఈ రిజర్వేషన్‌లను కూడ తప్పుడు త్రోవలో నడిపించే రాజకీయ నాయకులు ఉన్నారని గ్రహించలేకపోయినారు. రిజర్వేషన్ అనేది ఒక ప్రత్యేకమయిన సౌకర్యం. ఈ సౌకర్యమును పొందగలిగే అర్హత, ఎవరైతే విద్యా విజ్ఞానం లేకుండా, రాజకీయ చైతన్యం లేకుండా, ఆర్థిక స్థోమతలేకుండా ఉంటారో, వారికి పై మూడు సౌకర్యములు లభించుటకు గాను

కల్పించిన ఒక నిభందన. ఎలా అంటే భారతదేశంలోని అన్ని కులాలలోను, మతాలలోను, పై మూడు సౌకర్యములు లేని ప్రజలు కోట్ల సంఖ్యలో ఉన్నారు. అలాగైతే ఈ రిజర్వేషన్‌లు ఎలా పాటించేది. అని గ్రహించిన రాజకీయ పెద్దలు వీటిని నాల్గు గ్రూపులుగా విడదీసారు.(1) ఆర్థికంగాను, రాజకీయంగాను, విద్యాపరంగానుఉన్న వారిని ఒక గ్రూపుచేసి వీరిని, ఓ.సి లేక అభివృద్ధిచెందిన వర్గం అని, రెండవది ఆర్థికంగాను, రాజకీయంగాను, మరియు విద్యాపరంగా కొంతవరకు అభివృద్ధి చెందినవారిని బి.సి. అనగా వెనుకబడిన జాతులుగాను వర్గీకరించినారు. గ్రామాలలోను, మైదాన ప్రదేశములలో అనగా పల్లె ప్రాంతాలలోనివశిస్తూ, అంటారానివారుగాఉంటూ, విద్యాపరంగాను, ఆర్థికంగాను, రాజకీయంగాను ఏ మాత్రం అభివృద్ధి చెందనివారిని, యస్.సిలుగా అనగా షెడ్యూలు కులాలుగా గుర్తించారు. ఇక నాల్గవది. ఆఖరుది అయిన వర్గం వీరు అంటరానివారు కాకుండ, గ్రామములకు దూరంగాను. అడవులలో జీవిస్తూ విద్యాపరంగాను, ఆర్థికంగాను రాజకీయంగాను పూర్తిగా వెనుకపడినవారు. వీరిని షెడ్యూల్డు తెగలుగా గుర్తించి కేంద్ర ప్రభుత్వం. రాష్ట్ర ప్రభుత్వములు ప్రత్యేకమైన సౌకర్యములను కలుగచేస్తూ వారిని అన్ని విధాలుగా అభివృద్ధి చేయువలయునని శాసనం చేసి ఉన్నారు.

కాని జరుగుచున్నది ఏమిటి? రిజర్వేషన్ అను పేరుతో అభివృద్ధి చెందని వారిని, ఇంకాఅభివృద్ధికి దూరంగానే ఉంచుతున్నారు. వీరికి రిజర్వేషన్లు పెట్టి ప్రభుత్వమును పాడు చేస్తూన్నారని చాలా మంది విద్యావంతులు,ఆర్థికవేత్తలు రాజకీయ నాయకులు వాదిస్తూ వారి అభివృద్ధికి ఎన్నో ఆటంకాలు కలిపిస్తూన్నారు. అసలు హరిజన, గిరిజన, వెనుకబడినవారిలోనే బీదవాళ్లు ఉన్నరా, బ్రహ్మణులలో ఎంత మంది లేరు, వైశ్యులలో ఎంత మంది లేరు, మిగిలిన వారిలో ఎంత మంది లేరు అని వాదిస్తున్నారు. అనగా బ్రాహ్మణులలో నూటికి ఎంత మంది, విద్యలేనివారున్నారు. ఆర్థిక సంపదలేనివారున్నారు. రాజకీయ చైతన్యంలేనివారున్నారు. వారిలో వారి జనసంఖ్యను బట్టి 20% ఉండవచ్చును. అలాగే వైశ్యులు, అలాగే అభివృద్ధి చెందిన కులములు వారికన్నా 40% ఉండవచ్చును. ఇక వెనుకబడిన వారిలో సుమారు 70% వరకు ఉండవచ్చును, హారిజనులలో 100కి 95%, గిరిజనులలో 100కి 98% ఉన్నారు. అభివృద్ధి చెందినవారి జనసంఖ్య దేశ జనాభాలో 10 నుండి 15% ఉండవచ్చును. 10లేక 12 కోట్లు మంది. ఇక వెనుకబడిన వారి జనాభా 50 కోట్లు. దేశ జనాభాలో సగం కాని అంత కన్న తక్కువ కాని ఉండవచ్చును. ఇక హరిజనులు, సుమారు 10నుండి 18 కోట్లు గిరిజనులు, 12 నుండి 15 కోట్లు పైబడి ఉండవచ్చును.( గిరిజన) వీరి జనాభాను భారతదేశంలో ఇంత వరకు సరిగా లెక్క కట్టనేలేదు. తూర్పు భారతంలోని జనాభానంతా గిరిజన రాష్ట్రాలుగా గుర్తించినను, కేంద్ర ప్రభుత్వం వీరికి 7-1/2 % రిజర్వేషన్ మాత్రమే పాటించుచున్నది.

| వర్గములు | శాతం | జనాభా |
|---|---|---|
| ఒ.సి అభివృద్ధి చెందినవారు | 10 నుండి 15 | సుమారు 12 కోట్లు |
| బి. సి. వెనుకబడినవారు | 45 నుండి 50 | సుమారు 50 కోట్లు |
| యస్. సి. షెడ్యూలు కులాలు | 15 నుండి 18 | సుమారు 18 కోట్లు |
| యస్.టి. షెడ్యూలు తెగలు ( గిరిజనులు) | 12 నుండి 15 | సుమారు 15 కోట్లు |

ఇక రిజర్వేషన్ గూర్చి చర్చించుదాము

| వర్గములు | రిజర్వేషన్‌శాతం | జనాభా |
|---|---|---|
| ఒ. సి అభివృద్ధి చెందినవారు | 50 | 12 కోట్లు మంది |
| బి.సి. వెనుకపడినవారు | 27 | 50 కోట్ల మంది |
| యస్. సి. షెడ్యూలు కులాలవారు | 16 | 18 కోట్లు |
| యస్. టి. షెడ్యూలు తెగలు | 7.5 | 15 కోట్లు |

దీనిని బట్టి చూచిన అభివృద్ధి చెందినవారు 50% పైబడి రిజర్వేషన్ తమ హస్తగతం చేసుకొని 90% జనాభాకు 50% అభివృద్ధి పంచుతున్నారు. ఇందులోను పెద్ద చేప చిన్న చేపని తిన్నట్లు ఆ రిజర్వేన్లు కూడా వున్నావారే అనుభవిస్తున్నారని అర్థమగుచున్నది. ఈ విధంగా అనుభవిస్తున్నదే కాకుండా రిజర్వేషన్‌ల పేరుతో ప్రజలలో ధురభిప్రాయమును కలుగచేస్తున్నారు. హరిజన గిరిజన, వెనుకబడిన వర్గాలకు రిజర్వేషన్‌లు కల్పించుట వలన తమకు విద్యవున్నను సరియైన స్థానము పొందలేకుండా పోతున్నామని, రిజర్వేషన్ కల్పించుట వలన అసమర్థులకుస్థానము కల్పించబడుచున్నది. అనుఅభిప్రాయము ప్రతియొక్కరిలోనూ కలుగునట్లుగా ప్రచారం చేయబడుచున్నది. ఈ విధమైన అభిప్రాయము ఎన్ని యుగాలుగా ఉన్నను, దేశాభివృద్ధి జరగదు, దేశభివృద్ధితో మా కేమిటి పని అని చెప్పువారి సంఖ్యయే ఎక్కువగా వున్నది.

రిజర్వేషన్ ఎవరికి ఉండాలి? ఒక బండికి కట్టిన రెండు ఎద్దులు సమానమై రెండూ ఒకే బరువుతో ముందుకు అడుగువేస్తవి. వాటిలోనే ఒకటి బలమైనది, రెండవది బలహీనమైనది. బలవంతమైనది త్వరత్వరగా పోవుటకు ప్రయత్నిస్తుంది. బలహీనమై నది మెల్లగా తన శక్తి కొలది ప్రాయాణము చేస్తుంది. కాని బండిని తోలు రైతు మాత్రం వాటిని నియత్రించి రెండూ సమానంగా పోవుటకే ప్రయత్నించుతాడు. పరిగెత్తే ఎద్దు ముక్కుత్రాడును గట్టిగా పట్టుకొని మెల్లగా పోవు ఎద్దును స్వేచ్ఛగా వదిలి తోలుకుంటూ తన ప్రయాణమును సాగిస్తారు. అదే విధంగా ప్రభుత్వం కూడా రిజర్వేషన్లలను నియంత్రించవలెయును. కాని ఇక్కడ అలా జరగటంలేదు. బలమైన ఎద్దును స్వేచ్ఛగా వదిలి బలహీనమైన ఎద్దును ముక్కుతాడు పట్టి నడక సాగించకుండా చేస్తున్నారు. రిజర్వేషన్ పేరుతో వీరిని అభివృద్ధి కానీకుండా చేస్తున్నారు. కావున ఈ రిజర్వేషన్లు పై నుండి క్రిందికి బిగించవలయును.

| జనాభా ప్రాతిపదికపై | రిజర్వేషన్లు |
|---|---|
| మొదటి ఛాన్సు -----గిరిజనులకు | పూర్తి స్వేచ్ఛ ఇవ్వవలెను |
| రెండవ ఛాన్సు -------హరిజనులకు | పూర్తి స్వేచ్ఛ ఇవ్వవలెను |
| మూడవ ఛాన్సు -----వెనుక బడిన వారికి | 27% |
| నాల్గవ ఛాన్సు -------అభివృద్ధి చెందిన వారికి | 12% |

న్యాయబద్ధంగా చేయవలయునంటే పై పద్ధతిని, పాటించ వలసివున్నది. అలా జరగని నాడు ఈ రిజర్వేషన్ పద్ధతిని ఈ భూగ్రహం కనిపించకుండపోవు వరకు ఈ రిజర్వేషన్లను అమలుపరిచినను ఈ దేశం అభివృద్ధి చెందదు. అభివృద్ధి చెందే అవకాశం కూడాలేదు. ఉదా:

మీ ముందు కొన్ని సత్యములను ఉంచుతున్నాను. తమరే గ్రహించండి. ఈనాడు దిన పత్రిక 1-8-97లో అనంతపురం ఎడిషన్ నందు అనంతపురం జిల్లా ఉపాది కల్పనా శాఖాధికారి (ఎమ్ప్లాయిమెంట్ ఆఫీసర్) ప్రకటించిన ప్రకారము అనంతపురం జిల్లాలోని నిరుద్యోగుల సంఖ్య 1,26,000 మంది, పట్టణ ప్రాంతాలలో 45,000మంది, స్త్రీలు పట్టణ ప్రాంతాలవారు 17,000మంది, గ్రామీణ ప్రాంతాలవారు 10,000మంది. మొత్తం నిరుద్యోగులను క్రింది విధంగా విభజించారు.

| వర్గములు | నిరుద్యోగులు |
|---|---|
| 1. వికలాంగులు | సుమారు 2,000వేల మంది |
| 2. ఒ.సి అభివృద్ధి చెందినవారు | 63,000 మంది |
| 3. యస్. సిలు (షెడ్యూలు జాతులు) | 16,000 మంది |
| 4. యస్. టి. లు (గిరిజనులు) | 49,000 మంది |
| 5. బి.సి.లు ఏ గ్రూప్ | 16,000 మంది |
| 6. బి.సి. బి గ్రూప్ | 18,000 మంది |
| 7. బి.సి.సి. గ్రూప్ | 800 మంది |
| 8. బి.సి.డి. గ్రూప్ | సుమారు 6,000 మంది |

పై నిరుద్యోగుల సంఖ్యను బట్టి చూసిన అందరికన్నా ఎక్కువ గిరిజనులు 49,000మంది ఒక అనంతపురం జిల్లాలో నిరుద్యోగులుగా వున్నారు. దీనిని బట్టి అనంతపురం జిల్లా గిరిజనుల సంఖ్య ఎంత వుండవలెయును. గిరిజనులలో ఎక్కువ మంది సుగాలీలు. రెండవది ఎరికిల, తప్ప మిగిలిన కులాల గిరిజనులు అనంతపురం జిల్లాలో లేరు. చాలా అరుదు. అనంతపురం జిల్లాలో ప్రభుత్వంవారు సేకరించిన జనాభా లెక్క 1990 ప్రకారం1,11,000 మంది మాత్రం గిరిజనులున్నారు. జిల్లా గిరిజన శాఖవారు ఈ జిల్లాలో గిరిజనులు 1 లక్షా 11 వేలు మాత్రమేయని జనాభా లెక్కల ప్రకారం అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టినారు. అనంతపురం జిల్లాలో అఖిల భారత బంజారా సేవా సంఘం తరపున సేకరించిన మండల వారి తాండాలను బట్టి మొత్తం 65 మండలాలకుగాను సుమారు 500 తాండాలు వున్నవి. ఒక్క హిందూపురం పార్లమెంటులో 340 తాండాలపైన, అనంతపురం పార్లమెంటులో 137 తాండాలు ఇవి కాకుండా కొంతమంది పట్టణాలలో గ్రామాలలో కూడ నివసిస్తున్నారు. అనంతపురం జిల్లాలో ఒక చిన్న తాండా అంటే 50 కుటుంబాలకు తక్కువ లేకుండా సుమారు 100 నుండి 500 కుటుంబాల వరకు, కొన్ని తాండాలైతే 1000కుటుంబాలు దాటియున్నవి. ఇవి అన్నియు గ్రామాలకు దూరంగానే ప్రత్యేకంగా కట్టబడియున్నవి. దీనిని బట్టి చూచిన ఏది నిజమైనదో తెలుస్తుంది. ప్రభుత్వ అధికారి ప్రకటించిన 49,000 గిరిజన నిరుద్యోగులా లేక ప్రభుత్వం వారు సేకరించిన జనాభా లెక్క 1,11,000 వేలా? ఏది సత్యం? ఇది ప్రజలే నిర్ణయించవలెను. (అలాకాకున్న గిరిజనేతరులు గిరిజనులుగా దొంగ కులం సర్టిఫికేట్‌లు తెచ్చి రిజిస్టరు చేయించుకొని వుండవచ్చును. ఈ విధంగా కూడ వాస్తవంగా గిరిజనులను మోసము చేస్తున్నారు.

ఇక ఆర్థిక విషయుములు చూస్తే ప్రభుత్వ అధికారులు వీరిని గూర్చి పట్టించుకోవటంలేదు అనుసత్యమును తెలియపరుస్తున్నాను. అనంతపురం జిల్లా కలైరువారు

ఈనాడు దిన పత్రిక 27-3-97న మొత్తం అనంతపురం జిల్లాలోని, 218 బ్యాంకుల ద్వారా 1997 -98 సంవత్సరమునకుగాను 304.5 కోట్ల రూపాయలు అప్పుగాను మరియు గ్రాంట్‌లుగాను సబ్సిడీ క్రింద ఇస్తున్నట్లుగా ప్రకటించినారు. వాటి వివరములు క్రింద విధంగా వున్నవి.

| | కోట్లలలో | గిరిజనులకు 6% పాటించిన లభించు ఆర్థిక సహాయం |
|---|---|---|
| 1. వ్యవసాయ అప్పు క్రింద చిన్నతరహ నీటి పారుదల, భూమి అభివృద్ధి, వ్యవసాయ పనిముట్లు, చెట్ల పెంపకము పండ్ల తోటల పెంపకము, పశుపోషణ, కోళ్ళ పెంపకం పథకాలకు. ముఖ్యమైన కార్యక్రమాలకు 76.2% ఎక్కువ | 177.04 | 10.64 కోట్లు |
| 2. 1996-97 క్రాపు లోన్ | 108.33 | 6.5 కోట్లు |
| 3. 1997-98 క్రాపు లోన్ | 129.08 | 7.95 కోట్లు |
| 4. ముఖ్యమైన ప్రోగ్రాములకు | 189.08 | 11.38 కోట్లు |
| 5. 1997-98 ఫారం మెషినరీలకొరకు | | |
| ఎ) ట్రాక్టరు కొనుగోలుకుకాను 514 ట్రాక్టర్లుకుగాను = | 11.15 కోట్లు | 30 ట్రాక్టర్లు |
| బి) వ్యవసాయ ట్రాక్టర్లు192 గాను | 4.17 | 0.2502 |
| మొత్తం ట్రాక్టర్లు 706=15.32 కోట్లు | | 12 ట్రాక్టర్లు |
| 6. చిన్న నీటి పారుదలకు బోరు బావులు పంపుసెట్లు ఐ.పి.సెట్లు డ్రిప్ పద్ధతి, స్ప్రింక్లర్ మొదలగున్నవి | 18.82 | 1.13 కోట్లు |
| 7. గ్రామీణ కుటీర పరిశ్రమలు, స్వయం ఉపాది కల్పన మరియు ముఖ్యమైన కార్యక్రమాలకు 97-98 సంవత్సరమునకు సర్ప్లస్ 35% | 22.44 | 1.35 కోట్లు |
| మొత్తం | 706 ట్రాక్టర్లకు 6% ఎస్.టి. : | 42 ట్రాక్టర్లు |
| 8. పి. యం. ఆర్.వై స్కీములు | 2,200యూనిట్‌లు | 132 యూనిట్‌లు |
| 9. సి. యం.ఆర్. పై స్కీము సొమ్ము సమకూర్చునది. | 3,150 యూనిట్ 31.5 కోట్లు | 189 యూనిట్‌లు 1.89 కోట్లు |
| 10. ఐ. ఆర్. డి. పి. క్రింద పై స్కీములకు | 20.97 కోట్లు | 1.26 కోట్లు |

సబ్సిడి మొత్తం, ఇది కాకండా ఐ.ఆర్.డి.పి. పథకము - కింద మొత్తం 6,250 యూనిట్లకుగాను 4,400 లక్షలు అనగా 42 యూనిట్లుకుగాను 4,400 లక్షలు అనగా 44 కోట్లు ఖర్చుచేయుటకు నిశ్చయించినారు. యస్.సి. కార్పొరేషన్ ద్వారా 1,680 యూనిట్లకు గాను 1.4335 కోట్లు కేటాయించారు. అందులో గిరిజనుల గూర్చి ఒక్క మాట కూడ ప్రస్తావించలేదు. దీనిని పురస్కరించుకొని సంఘం ఎల్. నం. పిడి/517/ఎటి/ 97 తారీఖు 28-3-97న జిల్లా కలెక్టరువారికి ఉత్తరము పంపగా ఇంతవరకు ఎటువంటి చర్య తీసుకొనలేదు. ఈ ఉత్తరము కాపి జిల్లా గిరిజన శాఖ అధికారి అనంతపురం వారికి , డైరెక్టర్ హైదరాబాదు వారికి పంపించడం జరిగినది. ఈ ఉత్తరమునకు సమాధానమన్నట్లు ఈ నాడు దిన పత్రిక 29-4-97న 30 కోట్లతో జన్మ భూమి ప్రణాళిక అను హెడ్డింగ్‌లో గిరిజనాభివృద్ధి పథకము క్రింద 674 మంది లభ్యదారులకు 7.91 లక్షలు ఆర్థిక సహాయము చేస్తున్నారు అని ప్రకటించడం జరిగినది. ఒక్కొక్క లబ్ధిదారుడు పొందినది 791/ 674= 1,173 రూపాయలు అనగా ఈ మొత్తంతో ఎటువంటి స్కీం అభివృద్ధి పరుస్తారు?

కలెక్టరు వారి ఉత్తరం కాపి గిరిజన శాఖవారికి పంపడం జరిగినది కదా వారి నుండి ఎటువంటి సమాధానము లేదు. ఈ ఉత్తరమును పురస్కరించుకొని లెటర్ నం. ఎపి/ 519 / ఎటిపి /79 తారీకు 16-4-97న జిల్లా కలెక్టరు వారికి , గిరిజన శాఖ అధికారికి అనంతపురంలోని నిరుపేదలైన సుగాలీల జీవనోపాదిగాను ఒక్కొక్కరికి రెండు పాడి పశువులను పై తెల్పిన స్కీములో ఏదేనినైన వర్తింపచేసి, లేక బ్యాంకు ద్వారా ఋణములను మంజూరు చేయించి వారిని ఆర్థిక రేఖ దిగువస్థాయి నుండి విముక్తి చేయవలయునని కోరడమైనది. లబ్ధిదారులు ఎన్ని సార్లు ఆఫీసర్‌వారిని కలిసినను సరియైన సమాధానము ఇవ్వలేదు. జిల్లాలో ప్రత్యేక గిరిజన శాఖ ఉన్నను, గిరిజన కార్పొరేషన్ వున్నను వీరిని ఏమి అభివృద్ధి పరచుచున్నారు. 500 సుగాలీ తాండాలను ఇతర గిరిజనులను దృష్టిలోవుంచుకొని, ఒక్క తాండాకు ఒక్క లబ్ధిదారుడు, ఒక సంవత్సరములో అభివృద్ధి పరచవలెనన్న ఒక్కొక్కస్కీం సుమారు 10 నుండి 20 వేలు అనుకున్నను సుగాలీలు+ఎరికల గిరిజనులనుదృష్టిలో వుంచుకొని స్కీంలు తయారు చేసిన కోట్ల రూపాయలగును. కాని వారు ప్రభుత్వమునకు పంపిచే స్కీంలు 10 నుండి 20 లక్షల లోపు వుంటుంది. ఈ విధంగా వారిని ఆర్థికాభివృద్ధి నుండి వెనుకకు నెట్టివేయడం జరుగుచున్నది. నేను స్వయంగా గిరిజన శాఖ అధికారి వారిని కలసి కలెక్టరు వారికి పంపిన ఉత్తరంపై ఏదైనా చర్య తీసుకొన్నారా అని అడగగ, అసలు ఆ ఉత్తరం రాలేదు అని అన్నారు. ఒక కాపీ పంపండి అన్నారు. ప్రత్యేకంగా జిల్లా గిరిజన శాఖ అధికారి, వారు జిల్లా కలెక్టరుగారికి పి.ఎ హోదాలో వుంటారు. కలెక్టరు వారికి పంపిన ఉత్తరములు స్వయంగా జిల్లా కలెక్టరువారు చూడరుకదా? ఆ విషయమును సంబంధిత అధికారి వారు వారికి విషయము తెలియపరచవలెను. అసలు అర్జీనే ( ఉత్తరం) అందనేలేదంటే చేయవలిసినది ఏమున్నది. ఈ విధంగా బంజారాలు విద్యాపరంగాను, ఆర్థిక పరంగాను , రాజకీయ పరంగాను రోజురోజుకు వెనుక పడిపోవు చున్నారు. ఈ విషయంలో ప్రజలు ఎంత త్వరగా మేలుకొంటారో అంత త్వరగా అభివృద్ధి చెందవచ్చును. లేకున్న ప్రపంచములోనే బంజారాలు హీన జాతిగా చరిత్రలో నిలిచిపోతారు.

| నీలో దీపం వెలిగించు, నీవే వెలుగై వ్యాపించు! |
|---|

# బంజారాలు- రిజర్వేషన్

భారతదేశంలో బంజారాలు 44 పేర్లతో పిలువబడి సుమారు 20 నుండి 23 రాష్ట్రలలో విస్తరించియున్నారు. కన్యాకుమారి నుండి కాశ్మీరము, అరేబియా సముద్రము నుండి బంగాళాఖాతము వరకు మొత్తం దేశంలో 6 నుండి 7 కోట్ల జనాభా కలిగియున్నారు. వీరు ఎక్కడవున్నా గ్రామాలకు పట్టణాలకు, పల్లెలకు దూరంగా తమ స్వంత తాండాలను స్థాపించుకొని ఒకేభాష, ఒకే ఆచార వ్యవహారములను, సంస్కృతిని, దుస్తులను కలిగి కొన్ని యుగాల నుండి భారత జాతిలో లీనమైయున్నారు. 6 శతాబ్దము నుండి 11 శతాబ్దము వరకు ఆరు వందల సంవత్సరాలు రాజపుత్ర యుగమును స్థాపించారు. పశ్చిమమున కాబూలువరకు తూర్పు బెంగాలు వరకు, ఉత్తరమున బిహారు హిమాలయములవరకు పశ్చిమమున అరేబియా సముద్రము అంచు నుండి దక్షిణమున మహారాష్ట్రమువరకు వున్న ప్రాంతమంతయు రాజపుత్ర యుగములో కలిసియున్న ప్రదేశాలే. 11వ శతాబ్దములో విడిపోయిన ఈ రాజపుత్ర గ్రూప్‌లు, రోమా బంజారాలు, భారతీయ బంజారాలు, రాజస్థానీ రాజ పుత్రులు పంజాబు ప్రాంత రాజపుత్రులుగా విడిపోయారు. కాల క్రమేణ బంజారాలు తమ జీవనార్థమై వ్యాపారమును వృత్తిగా స్వీకరించి మొత్తం భారతం తమ వ్యాపారమును విస్తరింపజేసారు. ఎప్పుడైతే ఇంగ్లీషు వారి దోపిడి పాలన ప్రారంభమైనదో దేశ సంపదను కొల్లగొట్టుటకై రెళ్ళు, రోడ్లు ప్రారంభించారో వీరి వృత్తి పడిపోయినది.

ఈ కారణంగా స్థాన బలములేని బంజారాలు దేశం మొత్తంలోని బంజారాలు తమ ఒకే చోటును చేరుకోలేక ఎక్కడివారఅక్కడే వారి వారి అనుకూలమును బట్టి స్థిర నివాసములను ఏర్పాటు చేసుకున్నారు. వారి జీవమునకై ఆధారమైన అడవి ప్రాంతములను ఎన్నుకున్నారు. వారి పశుసంపదకు అనుకూలముగా అడవి కట్టెలు తెచ్చి పట్టణములలో అమ్ముకొని జీవించుటకు మరియు రకరకాల వృత్తులను చేపట్టి మొత్తం భారతంలో 44 పేర్లతో పిలువబడుచున్నారు. దేశ జనాభాలో 6 నుండి 7 కోట్ల జనాభా అంటే ఒక పెద్ద రాష్ట్ర జనాభాకు సమానమన్న మాట. భారతదేశ జనాభాలో 15వ వంతు అనగా భారతదేశ సంపదలో 15వ వాటాకు వారసులన్న మాట. ఒక భాషా రాష్ట్రము ఏర్పడుటకు ఏఏ అర్హతలు వుండవలయునో అన్ని అర్హతలు వీరికి ఉన్నవి. కాని ఒక చోట చేరుటకు వీలులేని విధంగా ఉండిపోయారు. వారు ఎక్కడవున్న భారతదేశమైన తమ మాతృ భూమిపైననే కదా ఉన్నారు. అయితే వీరి గూర్చి ప్రభు త్వం ఎందుకు ఆలోచించడంలేదు. బంజారాలు ఒక కులంకాదు. వీరు ఒక వర్గమునకు చెందినవారు. మతపరంగా ఏర్పడిన పాకిస్తాన్, బంగ్లాదేశ్ కాకుండా భారత దేశంలో నివసించుచున్న ముస్లిమ్ సోదరులను మైనార్టీగా గుర్తించి ప్రభుత్వము సౌకర్యములను సమకూర్చుచున్నదో అదే విధంగా ఒక రాష్ట్ర స్థాపనకు అరహతయున్నను బంజారా రాష్ట్ర స్థాపన చేయలేకపోవుచున్నారో అలాగే బంజారాలను కూడ అతి గొప్ప జన సంఖ్యగల మైనార్టీ ప్రజలుగా గుర్తించి ఒక భాషా రాష్ట్రమునకు ఏఏ అరహతలు ఉండవలెయునో అవి అన్నియు వీరికి కల్పించవలెను.

1. బంజారా భాషలో విద్యా బోధన

2. బంజారా భాషలో రేడియో సౌకర్యము

3. బంజారా భాషలో టి. వి. కార్యక్రమములు

4. బంజారా భాషలో ప్రచార కార్యక్రమములు

5. బంజారాలకు కేంద్ర స్థాయిలోనూ, రాష్ట్రస్థాయిలోనూ విశ్వవిద్యాలయముల స్థాపన

6. బంజారా భాషలో టీచర్ ట్రైనింగ్ కార్యక్రమాలు

7. బంజారా భాషా పండితులను ఒకచోట చేర్చి వారిచేత ప్రభుత్వ హోదాలో అన్ని భాషా రాష్ట్రాలకు కల్పించుచున్నట్లే వీరికి ఒక బంజారా విద్యా పీఠమును స్థాపించి భాషాభివృద్ధి చేపట్టవలెను.

8. బంజారా ధార్మిక మఠాధిపతులతో ఒక ఎండోమెంట్ బోర్డును స్థాపించుట.

భాషా రాష్ట్రాలకు జనాభా ప్రాతిపదికన ఏ విధంగా ధనం కేటాయించుచున్నారో అదే విధంగా వీరి జనాభా ప్రాతిపదికన ధనం కెటాయించి పై కార్యక్రమములను చేపట్టవలెను. కొందరు బంజారా విద్యావంతుల వాదన ఏమనగా బంజారాలను మొత్తం దేశంలో గిరిజన జాబితాలో చేర్చవలెయునని కాని 50 సంవత్సరముల స్వాతంత్ర్యము గడచిపోయినను వీరిని గిరిజనులుగా గుర్తించడం లేదు. ఒక్కొక్క రాష్ట్రములో ఒక్కొక్క వర్గములో పిలువబడు చున్నారు. ఒక వేళ గిరిజనులుగా గుర్తించారనుకొందము మొత్తం గిరిజనులతో పాటు వీరికి కూడ రిజర్వేషన్ వస్తుంది. అందులో వీరి వాట ఎంత? ఒకవేళ10% కేంద్ర ప్రభుత్వం గిరిజనుల రిజర్వేషన్ ప్రకటించినది అనుకొందము. అందులో వీరి వాట 1 లేక 2 శాతం మాత్రమే వుంటుంది. అదే జనాభా ప్రాతిపదకన అయితే 6 నుండి 7 శాతం వరకు ఉంటుంది. కావున బంజారాల అభివృద్ధిని కాంక్షించేవారు స్థూలమైన ( బేసిక్) విషయము వదలి పెట్టి గాలిమేడలు కట్టిన ఆ గాలి మేడలు ఎప్పటికైనా పడిపోవలిసినదే కాని అభివృద్ధి మాత్రం జరగదు. కావున రిజర్వేషన్ కన్న జనాభా ప్రాతిపదికన, ఒక భాషా రాష్ట్రమునకై ఎంతైతే ఖర్చుచేస్తున్నారో అది చేసిన అతి త్వరలో అభివృద్ధి చెందవచ్చును.

బంజారాల భాషాభావృద్ధి చెందుతుంది. భారతదేశంలో వారు కూడ అతి త్వరలో అభివృద్ధి చెందుతారు అలాకాకుండా ఇప్పుడు పాటించుచున్న రిజర్వేషన్లు, కార్యక్రమములు కొన్ని శతాబ్దాల వరకు, కొన్ని వందల తరాల వరకు పాటించినకూడ అభివృద్ధి చెందరు. ''అంగజాజేన్ ధాన్, పాచ ఆవజేన్ మాాంఢ్'' అనే సామెత నిజం అనిపిస్తుంది. ముందు వరుసలో వున్నవారికి అన్నం వెనుకబడినవారికి గంజి అనే సామెత నిజమౌతుంది. కావున బంజారాల అభివృద్ధిని కాంక్షిచే బంజారా సోదరులు విద్యావంతులు, రాజకీయ చతురులు ఈ సత్యమును గ్రహించి మన దేశ అభివృద్ధికి, మన రాష్ట్ర అభివృద్ధికి, మన బంజారా జాతి అభివృద్ధికి పాటు పడవలయునని ప్రార్థిస్తున్నాను.



*1.* బంజారా స్త్రీ దుస్తులు. *2.* నవీన దుస్తులతో బంజారా స్త్రీ

*3.* బంజారా స్త్రీ ధరించు ఛాంటియా వెనుక భాగము యొక్క అలంకరణ

## రెండవ అధ్యాయము

# బంజారా సంస్కృతి

## బంజారా స్త్రీలు - దుస్తులు - ఆభరణాలు

శిల్పి తన శిల్పం యొక్క అందాన్ని ఎలా ఆస్వాదిస్తాడో, అదే విధంగా బంజారా పురుషుడు తమ స్త్రీల అందాలను ఆస్వాదిస్తారు. బంజారా స్త్రీలు ఎందుకు ఈ విధమైన దుస్తులు వేసుకుంటారు. వీరు క్షత్రియవంశస్తులు, రాజపుత్ర స్త్రీలు వేసుకొనే దుస్తులు. అనగా చాలా విలువైనవి. వజ్రవైఢూర్యాలతో పొదగబడినవి. కానీ కాలక్రమేణ వారి ఆర్థికపరిస్థితులు తారుమారైనవి, రాజ్యాలు పోయినవి. అడవుల పాలై, తినుటకు తిండే కరువైనది. ఇక గుడ్డల గురించి చెప్పవలసిన పని లేదు. వీరు ముఖ్యంగా 3రకాల దుస్తులను ధరిస్తారు.

| 1. ఛాంటియా | 2. కాఁచలీ | 3. ఫేటియా |
|---|---|---|
| పైట. | రవిక | లంగా |

1. ఛాంటియా అనగా ఎర్ర రంగులోఉన్న రెండున్నర మీటర్ల పొడవు $1\frac{1}{2}$ మీటర్లు వెడల్పుఉన్న గుడ్డ. దీనికి రెండు ప్రక్కల లామణ్ 4 అం.ల వెడల్పుతో నలుపు, ఎరుపు గుడ్డలను జాయింట్ చేసి వాటి రెండు అంచులకు పాటో అని తెల్లటి గుడ్డ $\frac{1}{2}$ అం. వెడల్పున అతికించుతారు. దానిని ప్రతి $\frac{1}{2}$ అం. కత్తిరించి దానిని త్రికోణంలో ఉండునట్లు కట్టమోడేరో అని పేరుతో ఎంబ్రయిడరి చేస్తారు. నలుపు, ఎరుపు జాయింట్ కనిపించకుండ రకరకాల దారాలతో రేలో అను ఎంబ్రయిడరి చేస్తారు. మధ్య మధ్యలో చిన్నటి గాజు ముక్కలు తళ తళ మెరుస్తున్నట్టుగా 6అం. దూరం ఒకటి జాయింట్ చేస్తారు. ఈ లామణ్ మధ్యలో ప్రతి ఆరు అంగుళాలకు రకరకాల దారములతో అనగా పట్టుదారములతో రకరకాల పేర్లతో, మాకి, ఝులో, రేలే అను పేర్లతో ఎంబ్రయిడరి చేస్తారు.

ఈ ఛాంటియాకు తలపైనుండి రెండు భుజముల పై వ్రేలాడునట్లుగా ఘుంగటో అని తయారు చేస్తారు. ఇది సుమారు 6 అంగుళముల వెడల్పు ఒక మీటరు పొడవులో ఉండును. ఇది చాలా అందంగా అలంకరిస్తారు. దీనిని రెండు లేక మూడు పొరలు గుడ్డలతో కుడతారు. రకరకాల పట్టుదారముతో రకరకాలుగా కాచే, వేలే, గాద్రె, పతడి, ఘుగ్రా, ఫుందా పేర్లతో పొరి, పొర అల్లిక చేస్తారు. ఈ ఆరు అంగుళముల వెడల్పుఉన్న మందపాటి గుడ్డపై 3లేక 4రకముల గుడ్డలను జాయింట్ చేస్తారు. ప్రతి అంగుళం వరుసలో అద్దములను 1అంగుళము దూరంలో వరుసలు వరుసలుగా అల్లి పై తెల్పిన పేర్లతో ఎంబ్రయిడరి చేస్తారు. ఘుంగటో ముందుభాగములో వెండి బిళ్ళలు వరుసగా ఒక దాని ప్రక్కనవొకటి కుడతారు. అలా కుట్టిన ఘుంగటోను రూపేర్ (చౌలే) ఘుంగట్ అంటారు. వెండి గజ్జలు వేసి కుట్టిన వాటిని రూపేర్ ఘగరార్ ఘుంగటో అంటారు. ఇది చాలా అందంగాను, ఆకర్షణీయంగానూ ఉండును.

ఇక ఛాంటియా మధ్యభాగములో చాంద్ పేరుతో పట్టు దారములతో పెద్ద పెద్ద కుచ్చులుగా (ఫుందా) కుడతారు. వాటికి గవ్వలతో జత చేసి ఝుంఢీలు మరియు రకరకాల ఆకర్షణ కలిగిన పట్టుదారములతో చాలా అందంగా ఫూల్యా అని ఎంబ్రయిడరి చేస్తారు. ఇవి

ఛాంటియా వెనుక భాగములో పూల కుచ్చులుగా వ్రేలాడుతుంటాయి. ఛాంటియా ముందు భాగంలో ఘుంగటోమొస్తరు చేడాలా అని అద్దాలతో చేసిన ఎంబ్రాయిడరి కలిగిన పట్టిని జాయింట్ చేస్తారు.

ఈ ఛాంటియా అనేది రెండు పొరల గుడ్డతో తయారుచేస్తారు. లోపలి భాగములో ఎరుపు రంగులోఉన్న సామాన్యమైన నేతగుడ్డ, పై పొర ఖరీదైన సిల్కు వస్త్రము లేక పట్టు గుడ్డలు జత కలిపి తయారుచేస్తారు.

ఈ లామణ్ ఘుంగటో, ఛేడలో అనునవి వారికి తీరిక సమయములలో సంవత్సరం పొడవున తయారు చేస్తూఉంటారు. ఎప్పుడు వారికి అవసరమో అప్పుడు పై మూడు గుడ్డలు తెప్పించి వాటికి జాయింట్ చేస్తారు. అప్పుడు ఆ గుంఘుటోతో ఛాంటియా తయారవుతుంది. ఈ ఘుంగటోతో, ఛాంటియాను పెండిండ్లలోను, పెండ్లికూతుళ్ళకు పెండ్లి గుడ్డల క్రింద ఒక్కొక్కరికి 4లేక 5జతల వరకు తల్లి దండ్రులు వారి వారి స్థోమతను బట్టి సమకూర్చుతారు. ఇవి కాకుండా ప్రతిదినము వాడుకకు మామూలు ఛాంటీయాలు వాడుతారు. వాటికి ఒక ఘుంగటో మాత్రం ఉండదు. మిగిలిన ఎంబ్రాయిడరి పనులన్నియు చేసి ఉంటారు.

వీరు ఛాంటియాను ముందు భాగంలో ఎడమ ప్రక్క వెడల్పును కుచ్చి, పైన ఘుంఘుటో వ్రేలాడ తీసుకొని కొంగును కుడిపై భుజంనుండి ఎదమీదుగా ఎడమ ప్రక్క బిగించుకొంటారు. దీనినే వారు ఆడోఛేడా అంటారు. అనగా తనముందు భాగమును ఛేడాలా అందంగాకనిపించిన వారు గంభీరంగా కనపడుతారు.

కాంచలీ : దీనికి నాల్గు భాగములు 1) భుజాలకు ఖడపా, ఖవ్‌య్యా 2) ఎదలకు ప్రక్కలకు పాటా అని 3) ఎదలపై థన్‌థన్యా 4) పేటి అని విభజించినారు.
కాంచలీ రెండు భుజములు మరియు ప్రక్క భాగాలకు పాటా అని నలుపు, ఎరుపు, పసుపు రంగులలో 4 అం. వెడల్పుతో వేరువేరు గుడ్డలను తీసుకొని జాయింట్ చేస్తారు. ఈ జాయింట్ కనిపించకుండా. వేలే అను ఎంబ్రాయిడరి చేస్తారు. వాటిని వారి వారి చేతి కొలతలను, ప్రక్కలను పట్టి కటింగ్‌చేసి మొదట జాకెట్ ఆకారంను తయారు చేసుకొంటారు. ఆ తరువాత వాటి అతుకులు అన్ని కనిపించకుండా $\frac{1}{2}$ అం. వెడల్పు తెల్ల గుడ్డను జాయింట్ చేసి కోణాకారంలో కట్ట మోడెరో అను ఎంబ్రాయిడరి చేస్తారు. ఆ తరువాత వాటి మధ్య మధ్యలో రేల్లో, మాకి, గాద్రే, పారా, పారి, ఫూందా అను పేర్లతో పట్టుదారములతో చాలా అందంగా ఎంబ్రాయిడరి చేస్తారు.

ఛాతి : స్త్రీ ఎద భాగమునకు అందమైన రకరకాల పట్టులేక సిల్కు గుడ్డలను కొలతల ప్రకారం రెండు పొరలతో, లోపల సామాన్య గుడ్డను పైన విలువైన గుడ్డ పెట్టి కుట్టడం జరుగుతుంది. ఈ విధంగా రైక ఆకారం ముందు భాగమునకు మాత్రమే దీనిని కుడుతారు, వెనక భాగములను, భుజాల పై భాగమున, నడుము పై భాగము డోరే అను మందపాటి దారం కాడలతో కుడతారు. మరియు కాంచలీ అంచు భాగములను పతడి అను పేరుతో భద్రంగా అంచులు, ఎంబ్రాయిడరి చేస్తారు.

ఖవ్‌య్యా థన్‌థనియా : రెండు ఎదలకు (స్తనములకు), రెండు భుజములకు ఖవ్‌య్యా జోడించి చాలా అందంగా, 4" వెడల్పు, 6"పొడవుతో రెండు పొరల గుడ్డలతో చాలా అందంగా

చిన్న చిన్న అద్దం ముక్కలను చాలా నైసుగా ఎంబ్రయిడరి చేస్తారు. వీటి మధ్యలోను అంచులకు పారా, పారి, వెండి గజ్జులు, ఫుందా (కుచ్చులు), అల్లికలతో మంచి సిల్కు లేక పట్టుదారములను తీసుకొని అందంగా ఎంబ్రయిడరి చేస్తారు. వీటిని రెండు చెతులకు, రెండు స్థనాలపైన మరియు మధ్యలో బొడ్డు భాగం కనిపించకుండ పేటి, పేసోటేకో అను కుట్టుపద్ధతితో జాయింట్ చేస్తారు. ఆ కుట్టు కనిపించకుండా వాటిపై తిరిగి ఎంబ్రయిడరి చేస్తారు.

పై తెల్పిన రకరకాల ఆకారములతో వారికి తీరికఉన్న కాలంలో ఒక్కొక్కటి తయారుచేసుకొని ఉంచుకొంటారు. ఇవి అన్నియు వారికి కావలసినప్పుడు విలువైన గుడ్డను తెప్పించు కొన్న తరువాత దాని, పూర్తి ఆకారము తయారు చేసుకొంటారు. ఈ విధంగా కాళి(జాకెట్) తయారు చేసుకొంటారు.

**ఫేటియా(లంగా):** ఇది కూడా ఐదు భాగములు. 1)లేపో 2) ఫేరో 3) సాడి(లంగా) 4) లామణ్ 5) సడకే.

**లేపో :** ఇది సుమారు 4 అం. వెడల్పుతో మందంగా లోపల మూడు నాల్గు పొరల గుడ్డలు వేసికుడతారు. మొదట దీని అంచులను ఖిలే అను ఎంబ్రయిడరి చేస్తారు. దీనిపై భాగమున ఎరుపు, నలుపు, పసుపు, ఆకుపచ్చ 3 లేక 4 అం.గుడ్డలను $1\frac{1}{2}$అం. లేక 2 అం.వెడల్పుతో కత్తిరించ్చి ప్రతి అంచును ఒకదానితో ఒకటి జాయింట్ చేస్తారు. ఆ అంచులు కనిపించకుండా వేలే అను ఎంబ్రయిడరి చేస్తారు. మరియు అడ్డంగా రకరకాల పట్టుదారాలతో గాడ్రే, బక్యా అను ఎంబ్రయిడరి చేస్తారు. మరియు మొత్తం వాటిని చిన్న చిన్న అద్దాలతో వరసలు వరసలుగా అద్దాలను ఖిలే అను ఎంబ్రయిడరి చేస్తారు. ఆ తరువాత పతడి, ఝూండా అనువాటిని అల్లిక చేస్తారు. ఇది నడుముకు కట్టునది కావున దీనికి సడక్ అను మందపాటి లాడాను జాయింట్ చేసి దానిని, గవ్వలతో, ఝూండీలతో చాలా అందంగా ఉండునట్లు కుడతారు.

**బోరో :** ఇది నడుముకు క్రింద భాగములో నలుపు, ఎరుపు రంగు గుడ్డలలో రెండు పొరలతో 6 అం.వెడల్పుతో రెండింటిని జాయింట్ చేసి, జాయింట్ కనిపించకుండా, ఫేరో, ఖిలే, బక్యా మాకి అను పేర్లతో ఎంబ్రయిడరి చేస్తారు. ఎరుపు నలుపు గుడ్డల అంచులకు తెల్లగుడ్డ 3/4అం. వెడల్పుతో కాపా అని జాయింట్ చేసి దానిని అందమైన కోణాకారంలో కట్టా మోడేరో అంటారు. దీనిపై అద్దాలు, ఝూండి, పతడి మొదలైన పేర్లతో ఎంబ్రయిడరి ద్వారా అందంగా తయారు చేస్తారు.

**సాడి(లంగా గుడ్డ):** ఇది కూడ రెండు పొరలతోను 3నుండి 4మీటర్ల పొడవులో వారి వారి ఎత్తును బట్టి 3లేక 3-1/2అడుగల వెడల్పుతోను ఎర్రని ముతక గుడ్డపైన రకరకాల రంగుల పూలతో సిల్కు, పట్టు లేక మామూలు నాణ్యమైన గుడ్డను తీసుకొని జోడనోలేక చీణే భాండేరో అనగా లంగ మడతల లాగాచేసి పేసోటెకో అనుకుట్టు పద్ధతిలో దీనిని కుట్టిదానిపైన రంగు దారాలతో ఎంబ్రయిడరి చేస్తారు.

**ఆఖరుది లామణ్ :** ఇది లంగా అంచులో 3అంగుళముల వెడల్పుతో ఎరుపు నలుపు గుడ్డ జాయింట్ చేసి క్రింద భాగంలో సామాన్యమైన గుడ్డను ఉంచి కుడతారు. ఇందులో తెల్లగుడ్డ పై అంచుకు, క్రింద అంచుకు ఎదురు బెదురుగా కుట్టి దానిని కాపాభాండేరో అనుచు, అందంగా కోణాకారంతో అలంకరిస్తారు. రెండు అంచులను ఖిలేమోడెరో అను ఎంబ్రయిడరి చేస్తారు.

మధ్యలో షేరో, రెలో, మాకి అని ఎంబ్రయిడరి చేస్తారు. 3లేక 4అంగుళాల దూరంలో చిన్న చిన్న అద్దాలను మొత్తం లామణకు కుడతారు. దీని అంచులకు ఫూందా అని పట్టుదారం వేస్తుతో చిన్న చిన్న కుచ్చులుగా కుట్టి రెండు లేక 3 అంగళముల దూరంలో వ్రేలాడుతున్నట్లుగా కుడతారు. ఈ విధంగా 4రకాల పనులు అయిన తరువాత వారు వారికి నచ్చిన రంగులో లంగా గుడ్డలు తీసుకొని వాటినన్నింటిని ఒకదాని తరువాత ఒకటి కుట్టుకుంటూ, వాటి కుట్లు కనిపించకుండా వాటి మీద తిరిగి ఎంబ్రయిడరి అల్లికలు చేసుకొంటూ మొత్తం(లంగాను) ఫేటియాను తరూారు చేస్తారు.

ఈ విధంగా బంజారా స్త్రీ తనకు కావలసిన ఛాంటియా, కాలీ, ఫేటియాలను తమకు తీరిక ఉన్న సమయంలో ఒక్క నిమిషంకూడ ఊరకే కూర్చోకుండా వీటిపై తమ మనస్సు నంతా ఒకేచోట లగ్నంచేసి తన మనసులో కదిలిన ఆలోచనతో ఒకరిని మించిన ఒకరు, తమ దుస్తుల పైన నైపుణ్యమును ప్రదర్శించి వాటిని కుట్టుకుంటూ ఉంటారు.

ఈ విధంగా వారు రెండు మూడు రకాల దుస్తులను కుట్టుకుంటూ ఉంటారు. ఒకటి పెళ్ళి పేరంటాలకు పోవు డ్రస్సు. రెండు ఎక్కడికైన దూర ప్రయాణం చేయునపుడు కావలసిన డ్రస్సు. మూడు ప్రతి రోజు పనిపాటలలో మునిగి తేలుతున్నప్పడు ఉపయోగించే డ్రస్సు. ఇది వారు ధరించే వస్త్రముల గూర్చి.

## ఇక వారు ధరించే ఆభరణములు:

1) ఘూర్య : ఇది బంగారంతో చంద్రుని ఆకారంలో $\frac{1}{2}$ తులం నుండి ఒక తులంవరకు రకరకాల డిజైనులతో తయారు చేసుకొని ఉంటారు.

2) కన్యా : ఇది చెవులకు ధరించుతారు. పూర్వం బంగారం. ఇపుడు వెండితో రింగు తయారు చేసి వాటికి వ్రేలాడు చుండునట్లుగా గొలుసులు కలిగి క్రింద భాగంలో వెండి గజ్జలు అమరుస్తారు.

3) మెడలో : ముఖ్యంగా హాంసలి అంటారు. ఇది వెండితో తయారు చేసినది. సుమారు 3/4 కే.జి. నుండి 1 కే.జి. బరువుగలిగి గుండ్రంగా కడియం మాదిరిగా ఉండి ఎద భాగములో రెండింటిని కలుపుటకు కొక్కెము, ఆ కొక్కెమునకు ఇరు ప్రక్కల 2లేక 3అంగుళముల దూరం వరకు వెండి తీగను భద్రంగా అలంకారంగా చుట్టి ఉంటారు. మరియు దానికి త్రికోణకారంలో వెడల్పుగా బిళ్లలు వ్రేలాడదీసి, వాటికి క్రింద వ్రేలాడుతున్నట్లుగా వెండి గొలుసులు గజ్జలు కలిగి ఉంటాయి.

మరియు మెడలో రంగు రంగుల పగడములతో మధ్యమధ్యలో వెండి బిళ్లలు కలిగి ఉండి ఎద క్రింద భాగమువరకు వ్రేలాడుతూఉండును. ఈ దండలు కనీసం రెండు మూడు రకాలు ధరించి ఉంటారు.

చేతి వ్రేళ్లకు బొటన వ్రేలుకు వెండి బిళ్లలతో తయారు చేయించిన రకరకాల డిజైనులతో ఐదు వ్రేళ్లకు ఉంగరములు ధరిస్తారు.

కాలివ్రేళ్లకు పూలియా, వించువా, చటికి అని రకరకాల పేర్లతో అన్ని వ్రేళ్లకు ఉంగరం తొడిగి ఉంటారు. మరియు కాళ్లకు వెండి గజ్జలు, తుంకాయ గొలుసులు, వెండి కడియం

తొడిగి ఉంటారు. ఇది రాయలసీమ ప్రాంతంలోని సుగాలీలు వేసుకొను సొమ్ములు, తెలంగాణంలో కాళ్లకు వెండివి కాకుండ కంచు, ఇత్తడితో తయారు చేసి ఘూంజరీయా, కస్సే బోదలు అనునవి తొడుగుతారు.



ఆభరణములు ధరించిన బంజారా స్త్రీ

బంజారా స్త్రీ హిందూ స్త్రీలాగా జడ వెనుక దువ్వరు. ఎందుకనగా స్త్రీయొక్క అందం ఆమె చెంపల మీద, చేతుల ద్వారానే ఆకర్షించబడుతుంది. పూర్వం మహమ్మదీయుల కాలంలో స్త్రీలను చాలా హింశించేవారు. వారి బారినుండి తప్పించుకొనుటకు బంజారాలు ఒక పద్ధతిని కనిపెట్టారు. దానినే బంజారా స్త్రీ ఈనాటివరకు అవలంభించుచున్నది. మొత్తం తలవెంట్రుకలను 5 భాగములుగా చేస్తారు. 1) చోటి 2) చోట్లాకు రెండు సన్నవి జడలు వీటికి వెండి గజ్జలు కూడ అల్లుకుంటారు. 3) చెంప ముందు భాగములు 4) మూలో సన్నని జడ

వెనక భాగము. అనగా తన చెంపలు కనుపించకుండ తన వెంట్రుకలతో కప్పుకొనుట. అలా కప్పుకొనుటకు ఎలా సాధ్యపడుతుంది. అందుకని వాటిని బరువు ఉండేటందుకు ఘుగరి, టోప్లి అను వెండితో తయారు చేయబడిన ఆభరణం వాటిని తమ చంప భాగంలోని వెంట్రుకలకు వెడల్పుగా దువ్వి, వెంట్రుకలు చెల్లా చెదరుకాకుండ కొద్ది వెంట్రుకలతో సన్నని జడలల్లి చెంపదగ్గరనుండి కొన్ని వెంట్రుకలను తీసి ఆ సన్నని జడకు కలిపి, ఉన్నవాటిని జడలో కలిపి రెండు ప్రక్కల అల్లుతారు. ఛోటి అనగా తలపై సుడి మధ్యభాగంలో ఉన్న కొన్ని వెంట్రుకలను తీసుకొని జడ అల్లించుకొని దానితో రెండు చెంపమధ్యభాగంలోనుండి వచ్చిన రెండు జడలు కలిపి కొప్పు జడతో మొత్తం ఒక జడగా తయారుచేస్తారు. ఈ విధంగా చిన్న పెద్ద ముసలి వాళ్లు అందరు వేసుకొంటారు. బంజారా స్త్రీలలో గమనించవలసిన విషయం ఒకటి ఉన్నది. బంజారా స్త్రీలకు జడలే, ముత్తైదువు వేసుకొనే ఆభరణం. అనగా పెండ్లి అయిన వారికి, భర్త జీవించినవారికి జడకు ఎదురుగా గుండ్రంగాను ఎత్తుగా వెండితో చేయబడిన ఘుగరికి ఎర్రటి గురిగింజను మధ్యలో పొదిగి ఉన్నది. మరియు రెండు టోప్లిలు రెండు ప్రక్కల వ్రేలాడుతున్న ఆమే ముత్తైదువు అని అర్థం. భర్త చనిపాయిన, పెండ్లికాని ఆడపిల్లలకు ఈ ఘుగరి ఉండదు. వెండితో చేసిన రెండు టోప్లిలు మాత్రం క్రింద వ్రేలాడుతూ ఉంటవి, వాటికి వెండి గొలుసులతో గజ్జెలు క్రింద వ్రేలాడుతూ ఉంటవి. ముత్తైదువులకు ఘుగరి, టోప్లిలు ఉంటవి, పెండ్లి కాని,



మథుర బంజారా

భర్త పోయిన ఆడవాళ్లకు టోప్లిలు మాత్రమే ఉండును. మహారాష్ట్రములోని, విదర్భ మరియు ఖందేష్ భాగంలోని బంజారా స్త్రీలు, తమ జడలలో ఆయుధాలను ధరించారు. విదర్భ ప్రాంత స్త్రీలు, జడ కొప్పులో పదునైన రెండు కత్తులను ధరించారు, అవి ఇప్పుడు కొమ్ము కుప్పలు లేక రెండు పుల్లలను ఉంచుకొంటారు.

ఖందేష్ భాగములోని స్త్రీలు, తలపై భాగమున ఒకటింకాలు మూర పొడవైన కొనలో లావుగా గుండ్రంగా ఉండునట్లు ఇనుపరాడును ధరించేవారు. ఇప్పుడు అది పొడుగాటి కట్టె ముక్క అయినది. పూర్వం ఆపద సమయంలో వాటిని ఉపయోగించేవారు.

ఈ జడలకు పై భాగమున కంటి దగ్గరనుండి చెవిపైవరకు వెండితో తయారు చేసిన గొలుసుల పట్టీ, వాటికి గజ్జలు వ్రేలాడుతుంటవి. వాటిని ఆడ్‌కాంట్ అంటారు. మన ఆడవాళ్ళు మాటీలు అంటారు. వాటిని ధరిస్తున్నారు.

మరియు నొసట కనిపించకుండ తల సెంటరు పాపిటినుండి వెండితో, బంగారంతో చేసిన టీక్లి (నేక్లీసు) వ్రేలాడుతుంది. బంజారా స్త్రీతన చేతుల ద్వారా వచ్చే అందమును బలియా అను వాటితో కప్పుకొంటారు. ఇవి రెండు రకములు 1) చూడేర్‌బలియా. 2) బలియా. చూడేర్ బలియా అనగా పెండ్లి అయిన ముత్తైదువ తన మోజేతికి పైన ధరించినది. పెండ్లి కాని వారు భర్తలేనివారు పెండ్లి అయినవారు మోచేతికి కిందచేతినిండా బల్యా ధరించుతారు. వీటికి ముందు భాగంలో మణికట్టు దగ్గర బోదులు, లేక కోల్‌డా అనగా వెండి కడియం వేసుకొంటారు.

వీరు వారి అందమును ప్రదర్శించుటకు మోజేతి దగ్గర మందంగా లావుగా కసోటియా అని వేసుకొంటారు. ఇది రంగు రంగుల దారంతో సీసంతోపోసిన గజరా అనువాటిని, కుట్టి వాటికి ఇరుప్రక్కల గవ్వలను కుట్టి క్రిందికి సుమారు ఒక అడుగు పొడవు వ్రేలాడుతూ

ఆంటి ధరించిన విదర్భ స్త్రీ, హాతోటి ధరించన ఖందేష్ స్త్రీ

పూలకుచ్చులుగా అందంగా ఉంటవి. ఇవి వారు పెండ్లిండ్లలలోను వేరు గ్రామాలకు ప్రయాణమై పోయినప్పుడు వేసుకొని ఉంటారు.

ఈ విధంగా ప్రతి బంజారా స్త్రీ సుమారు 14 కేజీలవరకు బరువు మోసుకొని ఎటువంటి ఇబ్బందిని శ్రమను కనిపించ కుండ ధరించి ఉందురు.

ఇంత భద్రముగా తన అందమును దాచి ఉంచినను ఇంగ్లీషువాళ్ల వచ్చిన తరువాత వారు కూడ బంజారా స్త్రీలను చెరపట్టటం జరిగినది. వారినుండి కాపాడుటకు బంజారా స్త్రీలు, మఖమునకు ఇరుప్రక్కల నొసటి దగ్గర, గడ్డమునకు చిన్నచిన్న చుక్కలుగా పచ్చపొడిపించుకొనుట జరిగినది. చేతులకు కాళ్లకు కూడ పచ్చపొడిపించటం జరిగినది. ఎందుకనగా ఇంగ్లీషువారికి పచ్చ అంటే గిట్టదు. ఈ విధంగా బంజారా స్త్రీలు కొన్ని శతాబ్దాలనుండి తమ గౌరవమును కాపాడుకొంటూ వచ్చినారు.

# బిడ్డ జననం

**1. శ్రీమంతం :** బంజారా స్త్రీ గర్భందాల్చిన అయిదారు నెలల తరువాత శ్రీమంతం చేస్తారు. అప్పుడువారి తల్లిదండ్రులు, అక్క చెల్లిండ్లు అన్నదమ్ములు వారివారి యోగ్యతను బట్టి వంటను చేసి, గుడ్డలు, పిండి వంటలు తెచ్చి, శ్రీమంతం చేస్తారు. అప్పుడు వారు బంజారా శ్రీమంతం పాటలు పాడుతారు.

బంజారా స్త్రీ ప్రసవించినప్పుడు కాళ్ల చేతులు మీద కూర్చోనే ప్రసవిస్తారు. కాన్పు అవుతున్నప్పుడు బిడ్డ త్వరగా వచ్చుటకు వీపుమీద ఒత్తడి ఇస్తు ఉంటారు. అలా చేసిన కాన్పు త్వరగా అవుతుందంటారు.

బిడ్డ కాన్పు అయిన వెంటనే బొడ్డు కోసి, బిడ్డకు స్నానం చేయిస్తారు. తల్లికి కూడ వేడివేడి నీళ్లతో స్నానం చేయిస్తారు. తల్లికి నాల్గు ఐదురోజులవరకు కారం తగలకుండ వేడివేడి అన్నం నెయ్యి బెల్లం మాత్రం ఆహారంగాయిస్తారు. ఆ తరువాత తల మాంసం, మంచి భోజనంయిస్తారు. ప్రతి రోజు బాలెంతమసాలాలు తెచ్చి, నేతితో బెల్లంను కరిగించి, అందులో మసాల పొడివేసి కాడో చేస్తారు. ఈ కాడో త్రాగటానికి అనుకూల ముండుటకుగాను, ముందుగా వేడి చేసిన కొద్ది నీళ్ల పోస్తారు. వెంటనే అది పలుచనై త్రాగడానికి అనుకూలంగా ఉంటుంది. దీని వలన పాలుబాగా ఉత్పత్తి అవుతుంది. బాలెంత స్త్రీ వెంటనే కోలుకోవటానికి వీలు అవుతుంది.

**2. వేకళ్ళోరో :** బిడ్డ జన్మ ఇచ్చిన తరువాత ఈ కార్య క్రమం చేస్తారు. అదే రోజు కాని రెండవ రోజు కాని ఇంటి దేవతలకు పూజ చేస్తారు. వంట చేసే పొయ్యి వీరికి పూజా స్థలం. దీపారాధన చేసి కొబ్బరికాయ కొట్టి దేవునికి పొంగలి, నెయ్యినైవేద్యం పెడతారు. ఈ కార్య క్రమం పొడవున బంజారా కాన్పుకు సంబందించిన పాటలు పాడుకొంటూ ఉంటారు.

ఆ కార్యక్రమమునకు బిడ్డ తల్లులు, క్రొత్తగా పెండ్లయినవారు, బిడ్డలు కాని వారు అందరు వస్తారు. వారందరికి గట్టి బియ్యం పాయసంలో మధ్యన కుదురు చేసి(గుంత) దాని

నిండా నెయ్యి, బెల్లం ఉండను వేసి అందరికి పంచి పెడతారు. అక్కడ వచ్చిన తల్లులందరు బిడ్డ తల్లి ఆరోగ్యంగా యుండవలయునని దేవతలను మ్రొక్కుకుంటారు.

**3.** దళవాధోకాయేరో : కాన్పు అయిన 7 రోజులకు ఒక కార్యక్రమం చేస్తారు. దానిని వారు దళ వాధోకాయేరో అంటారు. దానికి సంబంధించిన బంజారా పాటలు పాడుకొంటు ఈ కార్యక్రమం ముగిస్తారు. అనగా, కాన్పు అయిన స్త్రీకి మూడు చెంబుల నిండా నీరు నింపుతారు. మొదటి చెంబులో బొగ్గునీరు. 2వ చెంబులో నీరు పోసి పసుపు వేసి నీటితో నింపుతారు. చెంబులకు బొట్టు పెట్టి కంఠమునకు వెంట్రుకలను తాడులాగా పేని దానికి గవ్వను తొడిగి కడతారు. ఆ విధంగా మూడు చెంబులను ఒకదాని మీద ఒకటి ఉంచుతారు. ఈ కార్యక్రమములో కూడ దానికి సంబంధించిన బంజారా పాటలు, పాడతూ కార్య క్రమం చేస్తారు.

తరువాత ఇంటి ముందు కొంత దూరంలో ఒక చిన్న గుంత త్రవ్వి దాని నిండా నీరు పోసి, అందులో డబ్బు రూకలు ఒక రూపాయి లేక అర్ధ రూపాయ వేస్తారు. ఆవిధంగా తయారు చేసిన గుంత దగ్గరకు కాన్పుఅయిన స్త్రీ నెత్తి మీద ఈ మూడు చెంబులను పెట్టుకొని కొడవలి నడుములో చెక్కి ఉంటారు. ఆ విధంగా గుంత వద్ద వచ్చిన బాలెంత ఎడమకాలి బొటన వ్రేలును గుంతలోని నీటిలో ఎడుసార్లుముంచి తీస్తారు. ఆ తరువాత ఆ గుంతను మట్టితో పూడ్చి వేసి, చెంబులు అలాగే నెత్తి మీదే ఉంచుకొని, ఇంటి వాకిలి ముందు వస్తూనే కొడవలితో ఏడుగీట్లు గీచి, కుడికాలు ముందుంచి ఇంటిలోనికి పిలుచుకొనివస్తారు. ఆ తరువాత బియ్యం పిండి, బెల్లము, నెయ్యి కలిపిన పిండిని, అక్కడ వచ్చిన ఆడవారికి పిల్లలందరికి పంచిపెడతారు.

**4.** దాగ్‌దేరో : బిడ్డ పుట్టిన ఒక నెల రోజులకు పిల్లలకు ఎటువంటి అపాయములు సంభవించకుండా ఉండుటకు, ఆముదపు దీపం మీద సూది మొనకాల్చి బొడ్డుచుట్టు మరియు రెండు ప్రక్కల వాతలు వేస్తారు.

**5.** ఝూలీరో నొక్తా : బిడ్డను ఉయ్యాలలో పెట్టే శాస్త్రంను ఝూలీరో నొక్తా అందురు. అప్పుడు కూడ ముత్తైదువులను పిలిచి ఇంటి దేవతలను పూజించి. బంజారా ఉయ్యాల పాటలు పాడుకుంటూ బిడ్డను ఉయ్యాలలో వుంచి ఊపుతారు. ఈ కార్యక్రమమునకు వచ్చిన ముత్తయిదువులందరికి దైవ ప్రసాదముతో పాటు తాంబూలం ఇచ్చి పంపుతారు.

**6.** ఫగల్యా ఫాడేరో నొక్తా : బాలుడు లేదా బాలిక నడక ప్రారంభించే ముందు పగల్యార్ ఘుగరి అని శాస్త్రం చేస్తారు. అప్పుడు కూడ బంజారా స్త్రీలందరిని పిలిచి, గుగ్గిళ్ల అనగా ఏదో ఒక రకం వండి, బిడ్డకు రెండు ప్రక్కల చేతులు పట్టుకొని పాటలు పాడుకొంటు బిడ్డ నడిచే దారి పొడవున గుగ్గిళ్లు చల్లుకుంటూ బంజారా పాటలు పాడుతూ నడిపిస్తారు. ఆ తరువాత వచ్చిన వారందరికి పసుపు, కుంకుమ, ఆకువక్కలు, గుగ్గిళ్ల పంచిపెడతారు.

మగ పిల్లలయితే మామూలు గుడ్డలను ధరించుతారు. నిక్కరు. చొక్కాలు వేసుకొంటారు. బంజారా ఆడ పిల్లలయితే లంగా ఓణి మాత్రమే వేసుకొంటారు. ఆడ పిల్లలు 10లేక 12 సం.లు వయస్సు అయ్యేవరకు కాళీ వేసుకోరు( జాకెట్టు) అనగా బాలిక శరీరంలో మార్పులు సంభవించే వరకు జాకెట్ వేసుకోరు. దీనికి కూడ ఒక శాస్త్రం చేస్తారు.

# వివాహం

**కాళీపెరా ఏరో నొక్తా:** అనగా ఆ అమ్మాయి రజస్వరాలు అయ్యే ముందుగా ఈ కార్యక్రమం చేస్తారు. అప్పటినుండి అమ్మాయి జాకెట్ తొడగటం మొదలు పెడుతుంది. బంజారా అమ్మాయి(ఛోరి) పెండ్లి కాని వారు జడలకు టోప్లి మాత్రం వేసుకొంటారు. కాళ్లకు గొలుసులు వేసుకొంటారు. తెలంగాణా ప్రాంతంలో పెండ్లి కాని పిల్లలయితే కాళ్లకు గజ్జెలు కట్టుకొంటారు. ఇవి పెండ్లి అయ్యే వరకు పర్మనెంట్‌గా వేస్తారు. మోచేతికి బల్యా( గాజులు) వేసుకొంటారు.

**1. పెండ్లి కార్యం :** బంజారాలు తమయుక్త వయస్సు వచ్చిన పిల్లలకు పెండిండ్లు చేయవలయునన్న, మగ పెండ్లివారు ఆడ పెండ్లి వారింటికి పోయి తమ వంశనామ, గోత్రములను తెలుసుకొని, పెండ్లి సంబంధాలు కుదుర్చుకుంటారు. వారి కుటుంబ పరిస్థితులు, ఆస్తి పాస్తులు చూచుకొని ఎవరికి వారు నచ్చిన తరువాత, ఖాయం చేసుకొనే ముందు దగ్గరలో ఉన్న బ్రాహ్మణులు వద్దపోయి వారివారి జాతకాలు సరిపోయిన మాత్రమే ఒప్పుకొంటారు. ఈ విధంగా కొద్ది రోజులువారు వీరింటికి, వీరు, వారింటికి రాక పోకలు చేసిన తరువాత ఒక రోజు ఆకువక్కల శాస్త్రం చేస్తారు.

**2. సగాయిర్ నొక్తా :** తాంబూలాలు పుచ్చుకొనుట దీనినేవారు సగాయి అంటారు. అనగా ఈ కార్యక్రమం చేయుటకుగాను మగ పెళ్లివారు, ఆ తాండా పెద్దలను, వారికి అనుకూలమున్న వారిని ఆడపెళ్లి వారింటికి పిలుచుకొని పోతారు.

పెళ్లి కొడకువారు. తాండా యొక్క కుటుంబ సంఖ్యను బట్టి, బెల్లం, ఒకటి లేక రెండు మణువులు, కొన్ని ఎండు కొబ్బరి గెన్నెలు, ఆకులు, వక్కలు, హుక్క( బీడీలు, సిగరెట్లు) కల్లు సారాయి పంచవలసి ఉంటుంది.

ఈ సగాయి ఒక్కరిదే కాకుండ ఆ రోజు ఎంతమంది పెళ్ళివారు ఉంటే వారందరు కలువవచ్చును. వీళ్ళంతా తాండాకు సమీపంలో ఒకమంచి ప్రదేశమును ఎన్నుకొని, అందరు గుండ్రంగా కూర్చొని, ఆ తాండా నాయకుడో లేక అక్కడ వచ్చిన పెద్దలు వారిని ఆ కార్యక్రమం చేయుటకు ఒప్పిస్తారు. ఆ పెద్దలు అందరికి రాంరాం చేసుకొంటారు. ముందుగా ప్రతి ఒక్కరు లేచి, ఎదురెదురుగా ఒకరి భుజమును మరివక్కరు కుడి, ఎడమ ఎదలను స్పర్శిస్తూ, రాం రామ్, అని చెప్పుకుంటూ రాం రామి చేస్తారు. అందరు శ్రీరాముని తలంచుకొంటారు. పచ్చారేరో అంటారు. అనగా ఆ సభను ఉద్దేశించి ఇలా అంటారు.

**సగాఈర్ పచ్చార్ :** పంచోమని రాజా! రాజ్ భోజురి సభా !

పచారేలాక్, అన్ పచారే సవాలాక్! భాయిన్, సగా సేన్ ఆఛ్ ఛకాయ్.

కా కోటిమాయి గంగా నాయక్! కాయికీ, కాళ్ కోవల్. మోతిమాయి భరారో రాం !

మత్ ఛోడ్ సగాసేణ్ నాయక్! గడకాంకర హాథి పెరోదాళ్, మోతీ మాయిరోలాల్ !

తెలంగాణేతి ఆయి హాథీ! ఊపర్ ఛ లాల్ మోతీ, జగత్ మండో భండార్. సూరత్ !

ఉంచే గడేరో కాంటో మాయిఛ! దుదాణో దూద్‌కు మండజా.. మల్‌న్యాసగాసేణ్ !

కాగదేరి గంటడిమా ఛ కస్తూరి, సబ్‌జాతేన్ ఆయిఛ్‌కాఁయి నాయక్. సగామోతి

కరమత్ మోసం. హోటోపరన్ భాటాఫేక్ మత్ !

ఘోడేర్ దోయికాన్ బరోబర్! సగాసేణ్ దోయి బరోబర్ !

హరీ టోపి, దోళోఝుండా దూర్‌దేశేతి ఆయో మారో !

సగాసేణ్ ! సేవారుఛోకాయి నాయక్ !

అర్థము : బంజారాలు తమ పిల్లలకు ఆకు వక్క శాస్త్రం చేయునప్పుడు ఇరుప్రక్కల బంధువులు, ఊరి బయట సమావేశమై సగాయి కార్యమునకు పూనుకొనే ముందు ఆ సమావేశములో కూర్చున్న తాండా పెద్దతో పెండ్లి కుమారుని వైపు పెద్ద, ముందు జాగ్రత్తగా, ఈ విధంగా హెచ్చరిక చేస్తారు.

పంఛోమని రాజా! ఇక్కడ ఆసీనులైన రాజులారా, మనము, మన పూర్వీకుడైన రాజభోజులవారి ఆస్థానంలో కూర్చునట్లుగా భావించవలయును. నేను గుర్తించినవారు లక్ష నమస్కారములుగా భావించండి. నేను గుర్తించినవారు ఒకటింకాల్ లక్ష నమస్కారములుగా భావించండి, నన్ను తప్పు పట్టవద్దండి. ఇక్కడ ఆసీసులైన నా సోదరులు నా బంధువులు అంతా క్షేమమేనా, గద్దే పై ఆసీసులైన గంగానాయక్‌గారు( రాజా) అని చెప్పుచున్నాడు. ఏమి చెప్పినది. మీ నల్ల కోవెల అనగా మీ అమ్మాయి అని అర్థము. ముత్యము చిప్పలలో దాగి ఉన్నాడు రాముడు. మనదైవము మన బంధుత్వమును వదలి పెట్ట వద్దండి నాయక్‌గారు. ఎంతో గొప్పదైన మన సాంప్రదాయం ఏనుగు అంత పెద్దది. ముత్యములలోదాగి ఉన్న ఎరుపురంగువంటిది. తెలంగాణములాంటి దూర ప్రాంతమునుండి వచ్చాము. అందులో దాగి ఉన్నది ఎర్రటి ముత్యము. అనగా తమ వరుడు చాల గొప్పవాడు. జగత్‌మండో బండార్ ఈ జగత్ అంతయు సిరిసంపదులతోనిండి ఉన్నది, అంటే మీ అమ్మాయి ఒక్కరే కాదు. ఈ జగత్‌లో సూరత్‌లాంటి రాజ్యములను వదలిపెట్టి వచ్చినాము. మన బంధుత్వము పాలు నీళ్ల కలసి పోయినట్లు ఉండవలెను, పచ్చని టోపి పెట్టినాము. మనము పచ్చగా ఉండవలెను నాయక్‌గారు. కాగితం పొట్లంలో కస్తూరి తెచ్చాం. అన్ని గోత్రములవారికి అందినదా, మంచిగా ఉన్నదా నాయక్‌గారు! బంధుత్వంలో మాతో మోసం చేయవద్దు. వెను తిరిగి రాయిని విసరబోకండి. గుఱ్ఱమునకు రెండు చెవులు సమానముగా ఉండును. అలాగే మన బంధుత్వముకూడా సమానంగా ఉండవలెను. పచ్చని టోపి పెట్టినాము మనము పచ్చగా ఉండవలెను. దూర దేశమునుండి వచ్చాము. ధోళోచూంగా అనగా తెల్లజండా చూపవలెను. కావున మనము ఇప్పుడు రాజీ మార్గమున పోవలయును. బంధువులారా అందరు క్షేమముగానే ఉన్నారు కదా నాయక్‌గారు.

ఇందులో రాజులు, రాజ్యాలు, దూర ప్రాంతము, ముత్యమును, రాముడు ఎనుగులు, గుఱ్ఱములు, పచ్చదనం, తెల్లజెండా లాంటి వివరములు తెల్పడం జరిగినది. ఇవి అన్నియు క్షత్రియ వర్ణమునకు నిదర్శనములు.

ఆ తరువాత ఇరు ప్రక్కల ఇద్దరు లేక ముగ్గరు లేచి బామనేన్ పుచ్ఛయెక అంటారు. అనగా వారి నామ నక్షత్రములు సరిగాఉన్నవో లేవో తెలుసుకొని రండి అంటారు. వారు

సభనుండి బయటికి పోయివచ్చి సభకు చెబుతారు. పెళ్ళికొడుకు గుఱ్ఱం, పెళ్ళి కుమార్తె గోమాత అంటారు. అప్పుడువారు. గుఱ్ఱం ఛాత్రమునకు, గోమాత శాంతమునకు గుర్తులు కావున ఇద్దరి ఈడు జోడు సరిపోయినది అని ఒకరినొకరు తెలుసుకొంటారు. ఈ బంధుత్వం మంచిదే అని నిర్ధారణ చేసి, పెండ్లి కొడుకు, పెండ్లి కూతురు వారిని తెలుసుకొని ''సాకేర్ రపియా'' ఒక రూపాయ నాణ్యమును పెండ్లి కొడుకు తండ్రినుండి పెండ్లి కూతురు తండ్రికి ఇస్తారు. దీనితో సగం పెండ్లి నిర్ధారణ అవుతుంది. ఆ తరువాత ఇద్దరు, ముగ్గురిని పిలిచి, వారు తెచ్చిన బెల్లం ఐదు ఉంటలను రెండు చేతులలో పట్టుకొని సభలో వంగినడుస్తు లో? గోళలో! అని చెప్పినపుడు ''ఆంగ్‌దే'' ముందు ఇవ్వండి అని చెప్పి పూర్తి రౌండు చేసిన తరువాత మొదటి వ్యక్తి వద్ద పోయినప్పుడు వారివారి దేవుళ్లకు ముందు ఇవ్వండి అంటారు. అప్పుడు ఇరుప్రక్కల దేవతలకు ఇచ్చిన తరువాత, తిరిగి రెండవ రౌండ్ లో ''గోళలో-ఆంగదే'' (ముందుకు ఇవ్వండి) అని చెప్పుచూ తిరుగుతారు. మొదటి వ్యక్తి దగ్గర వచ్చినపుడు తాను ఫలాన పెద్ద మనిషికివ్వండి అంటారు. ఆవిధంగా మొదటి పెద్ద వారందరికి ఇచ్చిన తరువాత అక్కడవున్న వారందరికి మొత్తం పంచిపెడతారు. ఆ తరువాత చివరి రౌండు తిరుగుతారు. అప్పుడుదానిని తాండా పెద్దకు ఇస్తారు. ఆ తరువాత రెండు కొబ్బరి గిన్నెలు కొంతమందికి ఇస్తారు.

రెండవది ఆకువక్కలు తీసుకొని మొదట తిరిగిన విధంగా ''లో? పాన్‌లో!'' అన్నప్పుడు ''ఆంగ్‌దే'' అని చెప్పుతారు, అలాగే వక్కలు, మొదట దేవతలకు, తరువాత తాండా పెద్దలకు ఆ విధంగా అక్కడ వచ్చిన వారందిరకి పంచి పెడతారు.

మూడవ రౌండ్ ''హుక్కా'' చేతిలో పట్టుకొని వంగుతూ ''లో? హుక్కాలో!'' అంటు తిరుగుతారు. ఆంగ్‌దే అంటారు. మొదటి వ్యక్తి వద్ద వచ్చినప్పుడు అతను ఎవ్వరికి ఇమ్మంటేవారికి ఇస్తారు.

నాల్గవ రౌండు రంగు చల్లటం, వసంతం ఇది అందరికి పంచిపెట్టాలి. ప్రతి వారు గుర్తుగా పంచకో! టవల్‌కో! రుమాల్ పైననో! చల్లుకొవాలి. ఆ తరువాత అక్కడ తెచ్చిన, కల్లుగాని, సారాయి కానీ, చిన్న పిల్లలకు తప్ప తాగే వారందరికి పంచి పెడతారు. ఈ విధంగా ఈ ''సగాయి నొక్తా '' పూర్తి చేస్తారు. అప్పటినుండి సంబంధం కుదిరినట్లు భావిస్తారు.

బంజారాలకు మంచి రోజులంటూ ఏమి ఉండవు. వీరు సంవత్సరంలో రెండు పర్యాయములు మాత్రమే పెండ్లి ముహూర్తాలు పెట్టుకుంటారు. 1) ఉగాది పండుగ అయిన మొదటి వారం లేక రెండవ వారంలో, లేక మొలకల పౌర్ణమి రోజులు అనగా జూన్ జులై నెలలో ముహూర్తాలు పెట్టుకొంటారు.

పెండ్లి ముహూర్తం ఎప్పుడు పెట్టుకొనేది మగపెండ్లివారు ఆడపెండ్లివారికిముందుగా తెలియ పరుస్తారు. వీరికి మంచి రోజులు వారంలో ఆదివారం కాని, బుధవారం కాని చేస్తారు.

వియార్ నొక్తా : ఆదివారం రోజు వీరు పెండ్లి కుమారుని ఇంట ''సాడితానేరో'' అను కార్య క్రమం చేపడతారు. ఆ రోజు పెండ్లి కొడుకు తరపు ఆడవాళ్లు కుంకుమ బొట్టు తీసుకొని ప్రతి ఇంటికిపోయి ఈ రోజు మా ఇంట ''సాడీ తాణేర్ నొక్తా'' చేస్తున్నాం అందరు రండి అని పిలిచివస్తారు. రాత్రి 8 లేక 9 గం తరువాత ఈ కార్యక్రమం మొదలుపెడతారు. అంతకు ముందే ఇంటిముందు పెండ్లి పందిరి వేస్తారు. ఇంటి ముందు అంతా కల్లాపు చల్లుతారు.

ఇంటి వాకిటిలో ముగ్గువేసి ఆ ముగ్గు మధ్యలో ఒక చెట్టుకొమ్మ ''ధోబనేర్‌డోళా'' పోతుపచ్చార చెట్టు కొమ్మను తెచ్చి దానిని అలంకరించి, ఒక కంబళి మధ్యలో దీనిని ఉంచి తాడుతో కడుతారు ఆ పైన కళశం ఒక దానిపై ఒకటి వరుసగా రెండుచెంబులను ఉంచుతారు మొదటి చెంబులో పానకం ఒక రూపాయి బిళ్ల, రెండవ చెంబులో జిలకర, బెల్లం,వేసి వాటికి పసుపు కుంకుములతో అలంకరించి, వెంట్రుకలతో పేనిన దారములనువాటి కంఠములకు చుట్టి, ఒక దానిపై ఒకటి ఉంచి, ఆ కొమ్మకు గట్టిగా బిగించి వాటి ముఖము పెండ్లి కుమార్తె ఊరివైపు చూస్తూన్నట్టు కడతారు. ఆ తరువాత గొంగళిని నాల్గు ప్రక్కల తాడుతో డేరాకట్టినట్లు నాల్గు ప్రక్కలకట్టి నిట్టనిలువుగా ఉండునట్లు నిలపెడతారు.

దాని క్రింద ముగ్గువేసి మధ్యలో ఒక రూపాయి బిళ్లఉంచి, దానిపై ప్రత్యేకంగా తయారు చేయబడిన చుట్టను పూల్యార్ గాలా ఉంచి ఆ పైన కొత్త కుండను పానకంతో నింపుతారు. ఆ విధంగా ఒకటి పెద్దది, ఒకటి చిన్నది, రెండు పానకం కడవలు ఉంచుతారు. ఎంబ్రాయిడరి చేసిన పూసలు, అద్దములు, గవ్వలు, కుచ్చులతో తయారు చేసిన గోన్నోను కప్పుతారు. పానకంలో బెల్లం, సొంటి, మిరియాలు, యాలక్కులు, గసాలు, పొడి చేసి వేస్తారు. ఆ తరువాత రెండు రకాల కార్యములు చేస్తారు. దీనినే వడుగు చేస్తాము అంటారు. అనగా భూక్యావారైతే బియ్యంను పిండి చేసి దానితో పాయసం చేస్తారు. ''మోయి భూంజేరో'' అని బియ్యంపిండి, బెల్లం, నెయ్యితో వండుతారు.

జాత్‌వారైతే వడుగు చేయుటకు రెండు మేకపోతులను కోసి, దాని మాంసమును, ఉప్పులేకుండా వండుతారు. పాయసం, కూడ(పొంగలి) చేస్తారు. ఆ తరువాత పెండ్లి కుమారుని. అతని జతకు రెండవ పెండ్లి కుమారుని, తమ్ముడిని కాని, తమ ఇంటిలో పెండ్లి వయస్సు వచ్చిన అన్న కుమారులనుగాని జతగా కూర్చోబెట్టి, పొంగలి, ఉప్పులేకుండ వండిన మాంసం పప్పుఎముకలు, 7 చొప్పున ఉంచి, కొబ్బరికాయ దేవతలకు కొట్టి పూజిస్తారు. (ధబకార్) ఆ తరువాత ఆముదం దీపంతో సూది మొన కాలుస్తూ ఏడుసార్లు పెండ్లి మంత్రం పటిస్తూ, మూడు మూడు వాతలు, కుడి మోచేతి భుజంపైన వేస్తారు. దీనిని 'గోసాయిర్ దాగ్'' అంటారు. ఈ విధంగా ఇద్దరికి వేస్తారు, చెవులు కుడతారు.

వదాయిర్ మంత్రం

| | |
|---|---|
| కోళిఆవ! | –కోళిజావ ! |
| ధోళోఘోడో! | –హంసలో ! |
| కోవలి! | –కటార్ఛ ! |
| తల్లి అతర! | –ఢాల్ఛ ! |
| ముంగే అతరా! | –వేర్ఛ ! |
| గోసాయి బావా! | –సదా సదా ! |

దీని తార్పర్యం నువ్వు సుక్షత్రియుడవు, ఆహారం కొరకు ప్రయాస పడవద్దు. తెల్లటి గుఱ్ఱమనే నీ కోరికల మనసును–కళ్ళెం వేస్తున్నాము. నీ చేతిలో ఖడ్గం పెడుతున్నాం. యుద్ధము పెసర గింజగాను. డాలును నువ్వుగింజలాగా భావింజి, ఈ సూది మొనతో వేసిన వాతకన్న చురుకైనది

కాదు యుద్ధం. ఈ యుద్ధం నీ కర్తవ్యమును నీవు నిర్వర్తించు, గోసాయి బావా (గురునానక్) నిన్ను సదా కాపాడు కుంటారు.

పెండ్లి కుమారినిపై వరుస కలిగినవారు ఏడుసార్లు బియ్యం దిగదీస్తారు. అక్షింతలు వేస్తారు. అయిన తరువాత అక్కడవచ్చిన పెద్దలందరి కాళ్లు మ్రొక్కుకుంటూ(ఆడ మొగ తేడాలేకుండ) తాంబూలమును పంచిపెట్టి, పాయసంతోపాటు-అప్పుడు వండిన మాంసపు ముక్కలను అందరికి పంచి పెడతారు. అంతటితో ఆ కార్యక్రమమును ముగించుతారు.

రెండవ రోజు సోమవారం ప్రొద్దుననే పెండ్లి కొడుకును స్నానం చేయించి వంటినిండా గంధం పూసి, పెండ్లి బట్టలు వేసుకొంటారు. ఫుల్‌షర్టు, ఫుల్‌పంచ, క్రిందికి పాదములవరకు, నడుమునకు ఎంబ్రయిడరి చేసిన 4 అంగళముల వెడల్పుతో(గాది) బిగిస్తారు. దానికి(కటారి) పిడిబాకు, అది కనవడకుండ పసుపు గుడ్డ కుట్టి తొడిగి నడుముకు చెక్కుతారు. తల వెంట్రుకలు కనుపించకుండ ఎర్రగుడ్డను మొదట చుట్టి, ఆ తరువాత తల పాగాను అందంగా చుట్టుతారు. ఇది మొత్తం వెనుకభాగం కనిపించకుండ పెద్ద దుప్పటి అనగా(పచ్చరము) లేక ఎఱ్ఱని ఉలన్ దుప్పటిని, తలపాగానుండి క్రింద పాదములవరకు రెండు భుజములనుండి రెండు మోచేతులవరకు కప్పిఉండవలయును. ఎడమ ప్రక్క భుజమునకు తాంబూలం సంచి ''వియార్ కొతళి'' వ్రేలాడుతుండవలెను. చేతిలో హుక్కా, లేక కత్తి పట్టుకొని ఉండవలెను. ఈ విధంగా తయారు చేసిన తరువాత పెండ్లి కుమార్తెకై తెచ్చిన నలుగు చీర(సవలేరర్ సాడి)ను నాల్గు అంచులు పట్టుకొని, దాని క్రిందగా, ఇంటి నుంచి బయటికి తీసుకొని వస్తారు. రాత్రి తయారు చేసిన పెండ్లి మంటపం దగ్గరకు తీసుకుని వస్తారు. పానకమును ఐదు చెంబులలో ఉంచి దేవతలకు ప్రార్థింపచేయిస్తారు. మొదట సూర్య భగవానుని, ఆ తరువాత ఇంటి దేవుళ్లను తాండాలోఉన్న సేవా భాయగుడికిపోయి, అందరు దేవతను పూజించివస్తారు. ఈ విధంగా అయిన తరువాత ఆ పానకం మొదట ఆ ఊరినాయకునికి, కార్యదర్శి, డవో మరియు పెండ్లి కుమార్తె తరుపున వచ్చిన వారికి యిచ్చి మొత్తం పానకం అందరికి పంచి పెడతారు. ఆ రోజు మొత్తం ఊరికి పెండ్లి భోజనాలు పెడతారు. ఈ విధంగా పెండ్లి కుమారుని వెంట, ఎల్లప్పుడూ(లేరియా) తోడి పెండ్లి కొడుకు హుక్కా పట్టుకొని వెంట ఉండవలెను. ఈ కార్యక్రమం అయిన తరువాత పెండ్లి కొడుకుతోపాటు, తోడి పెండ్లి కొడుకును ఊరి బయట తీసుకొని పోయి, పెండ్లి కుమారుడు కప్పుకున్న దుప్పటి పరచి, రూపాయి బిళ్లను దుప్పటికి తాకకుండా, చేతికి అందినంత దూరంలో ఉంచి, గురునానక్‌ను, మ్రొక్కుకొని, ఇరుప్రకలనుండి దుప్పటిని మడత పెట్టుకుంటూ వచ్చి, ఆ రూపాయ బిళ్లను తీసుకొని, పెండ్లి కుమారుడి తలపాగాలో కడతారు. అప్పుడు పెండ్లి కొడుకు కప్పుకున్న దుప్పటిని, రెండు భుజముల చంకలను చుట్టి ఎడమచేతి కొనముందు ఉండునట్లు కుడి చేతి కొన వెనక ఉండునట్లు ఉంచి, పెండ్లి కుమార్తె ఇంటికి బయలు దేరుతారు.

పెండ్లి కుమార్తె ఊరు చేరుకున్న తరువాత వెంట పెట్టుకొచ్చిన చాప, దుప్పట్లు పరచి ఊరు బయట ఉన్న గుడి దగ్గరో లేక, చెట్టు క్రిందనోకూర్చొని, వెంట వచ్చిన వారితో పెండ్లి కొడుకువచ్చారు అని తాండా నాయకునికి, కబురు పంపుతారు. ఈ విషయము తెలుసుకొన్నప్పటినుండి, పెండ్లి కూతురు, కూనిరాగాలు తీస్తూ ఎడుస్తూ ఉంటుంది. పెండ్లి కుమార్తెకు సంబంధించినవారు. ఆ రాత్రి వీరికి భోజనాలు తెచ్చి పెడతారు.

ఆ రోజు పెండ్లి కుమార్తె ఆడవారు పసుపు, కుంకమ తీసుకొని ఇంటింటికి పోయి, పెండ్లి కుమారుడు వచ్చి ఉన్నాడు, అతనిని ఇంటికి పిలుచుకొని వస్తాం రండి అని పిలుస్తారు. భోజనములు అయిన తరువాత ముత్తైదువులందరు, పాటలు పాడుకొంటు పెండ్లి కుమారుడు విడది చేసిన చోటు చేరుతారు. పెండ్లి కుమారుని ఇంటివారు పంపించిన ''ఆటో'' అనగా బియ్యం పిండి, నెయ్యి, బెల్లంతో కలిపిన పిండిని అక్కడ వచ్చినవారందరికి పంచి పెడతారు. పెండ్లి కుమారుని వెంట పాటలు పాడుకుంటూ, పెండ్లి కుమార్తె ఇంటికి పిలుచుకొని వస్తారు. అక్కడవారు, పొంగలి నైవేద్యం చేసి వారి ఇంటి దేవతలను పూజించి, పెండ్లి కుమారునికి పసుపు బియ్యంతో ఏడుసార్లు అందరు జతలు జతలుగా అక్షింతలు చల్లి, హారతి ఇచ్చి ఇంటిలోనికి తీసుకు వెళతారు. ఆ తరువాత పెండ్లి కుమారుడు అందరికి తాంబూలం పంచి పెట్టి అందరి కాళ్లకు మ్రొక్కుతాడు. మగావాళ్లకైతే హుక్కా అందించి కాళ్లకు నమస్కారం చేయవలయును. ఈ కార్యక్రమములో పెండ్లి కొడుకు హుక్కా అందించినప్పుడు ఆ వ్యక్తి ఇతరులతో కావలసిగా వ్యవహారంపెట్టుకొని ఆలస్యం చేస్తుంటారు. అతను తీసుకొనే అంతవరకు అతనిముందువంగి హుక్కా చేతిలో పట్టుకొనే ఉండవలెను. అక్కడ ఉన్నవారు ఇకచాలు, పెండ్లి కుమారుడు చాలా సేపటినుండి నీ కొరకు హుక్కా పట్టుకొనిఉన్నాడు, అని తెల్పినప్పుడు అతను ప్రక్కవారితో ''లో ? హుకా లో!'' అని చెప్పిన ''ల! హుక్కాల'' అని బదులు చెప్పినపుడే అతను తీసుకొంటాడు. లేకున్నలేదు. ఇది వారి సాంప్రదాయం ఆ తరువాత పెండ్లి కుమారుడు లేచి నిలబడతాడు.

పెండ్లి కుమారుడు పెండ్లి అయి, తన ఇంటికి వచ్చే వరకు తన చంకలో తాంబూలం సంచి(వియార్ కోతళి), నెత్తిన రుమాలు(పాగడి), దుప్పటి (ఖోళో) కప్పుకొని, చేతిలో హుక్కా పట్టుకొనే ఉండాలి. పెండ్లి కుమార్తె ఇంటికి ఎవరు వచ్చినా చిన్న పెద్ద, ఆడ, మగ తేడాలేకుండా వచ్చిన వెంటనే లేచి నిలబడవలెను. అట్లు చేయని ఎడల అలిగి పెండ్లి పందిరి దగ్గర కూడ రారు. మేమంటే అంత లెక్కలేదా అని తప్పు పడతారు.

ఆడ పెండ్లివారి ఇంటిలో జరగవలసిన కార్యక్రమములు :

*1. టికేర్ నొక్తా :(బొట్టు పెట్టు కార్యక్రమము)*
*2. వియార్ నొక్తా : (పెండ్లి కార్యక్రమము)*
*3. చూడేర్ నొక్తా : (ముత్తైదు కార్యక్రమము)*
*4. గోటేర్ నొక్తా పెద్దలను పూజించుట :*
*5. నవలేరిన్ ఒలాయేరో నొక్తా : పెండ్లి కుమార్తెను అత్తవారింటికి సాగనంపే కార్యక్రమము.*

బంజారాల పెండ్లి కావలయునంటే పై ఐదు కార్యక్రమములు, ఐదు రోజులలో కాని, వారం రోజులలో కాని రెండు వారాలు కాని, మూడు నెలలవరకు చేయవచ్చును. అనగా పెండ్లికువార్తెవారి ఆర్థికస్థోమతను బట్టి, వెంటవెంటనే కార్యములు ముగించి పెండ్లి చేయవచ్చును, లేకున్న పెండ్లి కువారునికి అరణం తినిపిస్తూ, నిదానంగా వారి వారి అనుకూలములను బట్టి పెండ్లి కార్యక్రమములు చేసి, పెండ్లి పూర్తి చేయువచ్చును.

ఈ పెండ్లి రోజులలో ప్రతి రోజు పెండ్లి కుమారునకు తెల్లవారు జామున 5 గంటలకే వేడి నీళ్ళ స్నానం చేయిస్తారు. వెంటనే వేడివేడి అన్నంలో నెయ్యి, బెల్లం వేసి భోజనం చేయిస్తారు.

మరి 9లేక 10 గంటలకు భోజనం, 3గంటలకు ఏదైన ఒక వంట చేసి మధ్యాహ్న భోజనం, రాత్రి 8గంటలకు తిరిగి భోజనం. వీరు యెుక్కువగా, మాంసం రొట్టెలు వాడుతారు. మరియు చిరుతిండ్లు నేతితో వండిన అరిసెలు, కర్జికాయలు, చుర్మో, చలిపిండి మొదలైనవి. కొంత మంది నేతి డబ్బాలలో ఎండు కొబ్బరి గిన్నెలు నాన బెట్టి ప్రతిరోజూ ఒక కొబ్బరి గిన్నె, బెల్లం ఇస్తారు. ఈ విధంగా పెండ్లి కుమారుని, వారి అత్తమామలు చూస్తారు. బంజారాల పెండ్లిండ్లలో ప్రతి కార్యక్రమం చేపట్టుటకుగాను డబ్బులు ఇస్తూ ఉండవలెను. లేకున్న చేయరు. ప్రతి పనికి డబ్బు కేటాయించి ఉంటారు. దాని ప్రకారం పెండ్లి కొడుకువారు ఇస్తూ ఉండవలయును.

**1. టికేరోనొక్తా :** ఈ కార్యక్రమమునకు గాను పెండ్లి కుమారుడు, తోడిపెండ్లి కుమారునితో పాటు, బావమరదులుకాని, స్నేహితులు కాని, ప్రొద్దుననుండి తాంబూలము, హుక్కా పట్టుకొని ప్రతి ఇంటికి పోయి వారిని ''టికేరోనొక్తా'' ముత్తైదు బొట్టుపెట్టు కార్యక్రమము ఉన్నది రాత్రికి అందరు రావలయునని ఆహ్వానించివస్తారు.

ఆ రాత్రి తాండా, పెద్దలు, ముత్తైదువులువచ్చి, ఈ కార్యక్రమమును చేస్తారు. ఆడవాళ్లు పెండ్లి కుమార్తెకు ఢావలో నేర్పిస్తారు. అనగా పెండ్లి అయి నీవు అత్తవారింటికి పోవుచున్నావు. ఇక్కడ మీ తల్లిదండ్రులను, అన్నతమ్ములను, అక్క చెల్లెండ్లను, నీ బంధువులను నీ తాండాను గౌరవించి, నడచుకొనవలయును, అక్కడ మీ అత్త మామలను, బావ మరదులను, తోడి కోడళ్ళను, ఆడబిడ్డలను, మీవారి అందరిని, గౌరవించి నడుచుకొనవలయును, నీ పుట్టినింటికి, నీకు జన్మఇచ్చిన ఈ తాండాకు పేరు తెచ్చు విధంగా నడచు కొనుము, అని పాటలు పాడుకొంటూ నేర్పిస్తారు. ఈ విధంగా ఆడవాళ్లు పాటలు, పాడుకొంటు, తమాషాలు చేసుకొంటూ, బంజారా డ్యాన్సులు చేసుకొంటు ఉంటారు. మగవాళ్లు పెండ్లి పందిరి క్రింద కంబళి కాని, దుప్పటిగాని, తెచ్చిఒక డేరాలాగ ఏర్పరచి, నాల్గు పంచలను, తాడుతో నాల్గు ప్రక్కల కడతారు దాని క్రింద ముగ్గువేసి, రెండు క్రొత్త కుండలు తెచ్చి క్రింద గాలా (కుదురు) బాగా ఎంబ్రయిడరి చేసి అల్లినదిఉంచి, దాని పై కుండలను ఉంచి, పానకం చేస్తారు. బెల్లం, సొంటి, మిరియాలు, గసాలు, యాలకులు, సోంపు అన్ని పొడిచేసి, పానకం తీసిన కుండలో ఉంచి పూల్ల్యా, గొన్నో(అందంగా అలంకరించిన గుడ్డ) కప్పుతారు. రెండవ కుండలో నీళ్లు నింపి, పూల్ల్యా గోన్నో కప్పుతారు. అందరికి తాంబూలము ఇచ్చిన అంతటితో రాత్రి కార్యక్రమము ముగిస్తుంది.

రెండవ రోజు ప్రొద్దున తాండా పెద్దలు జమ అవుతారు. పెండ్లి కుమార్తెకు స్నానం చేయించి, ఇంటి ముందు పానకం ఉంచిన డేరా వద్ద కూర్చోబెడతారు. ఒక పళ్లెములో తాంబూలము కుంకుమ, పసుపు అన్ని తెచ్చి పెట్టి, ముఖమునకు పసుపు వ్రాసి, పెండ్లి కొడుకును కూర్చోబెట్టి, బావమరదిచే కాళ్లు కడిగిస్తారు. ఆ తరువాత, అన్నా లేక తమ్మునిచే పెండ్లి కుమార్తెకు బొట్టు పెట్టిస్తారు. అదే బంజారా స్త్రీ పెట్టుకొనే ముత్తైదువ బొట్టు, ఆ తరువాత ఎప్పుడు బొట్టు పెట్టుకోరు.

ఆ తరువాత రాత్రి తీసిన పానకమును, ఐదు చెంబులలో పోసి ముందుగా సూర్యభగవానుని, పూజించి ఆ తరువాత ఇంటి దేవతలను తాండాలోని గుడి దగ్గరపోయి పానకం పెట్టి దేవుని మ్రొక్కుకొని వస్తారు. ఈ విధంగా పూజించిన తరువాత, అక్కడ ఉన్న

వారందరికి పంచి పెడతారు. ఆ తరువాత, ''టేలో''చేస్తారు. అనగా పెండ్లి కుమార్తె ఇంట, విందు భోజనం చేయిస్తారు. ఈ భోజనములు చేయునపుడు ఒక పెద్ద పళ్లెమును తెచ్చి, పెండ్లి కొడుకుతోపాటు ఐదుమంది, పెండ్లి కుమార్తెతోపాటు ఐదుమంది కూర్చొని, ఒకే పళ్లెములో అందరు భోజనం చేయవలయును, ఇది వారి ఆచారము. అందరు సమానకులస్తులే కావున, వారు వ్యతిరేక భావమును చూపకుండా వుండుటకు ఈ విధంగా ఏర్పాటు చేసిఉన్నారు. ఆ కార్యక్రమము అయిన తరువాత పెండ్లి కుమార్తె అందరిని, తన రెండు చేతులతో, తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, తాండా పెద్దలను పట్టుకొని, తన ముఖము, మెడ అంతా కప్పుకొని పాటలరూపంలో ఏడుస్తూ వారిని ప్రార్థిస్తుంది. పెండ్లి కుమారుడు అందరికి తాంబూలం పంచుతూ వారికాళ్లకు మొక్కుకుంటూ కావలసినవారికి(మొగవాళ్లకు) హుక్కా అందిస్తూ వారికి పాదనమస్కారములు చేస్తారు. అంతటితో ఆ కార్యక్రమము పూర్తి అవుతుంది.

ఈ టికేరోనొక్తా ముఖ్య ఉద్దేశం. బంజారా స్త్రీతమ నొసటన బొట్టు పెట్టుకోరు, అయితే పెండ్లి అయిన తరువాత పుణ్యస్త్రీగా ఉండుటకు గాను, తన సోదరుని ద్వారా తిలకమును పెట్టిస్తారు. ఈ రోజునుండి ఆమె పుణ్యస్త్రీగా గుర్తించబడుతుంది.

## ఘోటారో పచ్చార్ :

ఏ నాయక్, పచారేలాక్, ఆన్ పచారే సవాలాక్!
ఏ నాయక్, చందణెరో సోటాతి గస్సన్ కాడే ఘోటా!
పచ్చాస్ మాటీన్, సవాసోలోటా! వేతడూ హుబో ఆ నేతిలో నాయక్,
మోటోమనసేతి!

**అర్థం :** తాండానాయక్‌గారు, హుూం కొట్టినవారికి లక్ష సమస్కారములు, గుర్తించనివారికి ఒక్కటిన్‌కాల్ లక్ష నమస్కారములు, సొంటీ, మిరియములు, యాలకలు,లవంగాలు, గస గసాలు అన్ని సుగంధ ద్రవ్యములను, చందనం రోకలితో నూరి చాలా రుచికరమైన పానకం చేసి ఉన్నాము. యాభై మందికిగాను, నూట ఇరవైఐదు చెంబుల పానకం తయారుచేసి ఉంచినాము. పెండ్లి కుమారుడు పానకం పంచుటకు సిద్ధంగా నిలబడి ఉన్నాడు. గొప్ప మనస్సుతో త్రాగి, మమ్ములను ఆనందింప చేయండి నాయక్‌గారు.

## భోజన సమయంలోని పచ్చార్ :

ఏ నాయక్! పచారేలాక్। ఆన్‌పచారే సవాలాక్।
ఫాంగేర్ భాజీ, తుంబడి ఘూలన్, దాళ్‌రాందే!
ఫుల్ వాణిధాన్,। చంపా వణ్ణి దాళ్,। మోతివణ్ని ఘీ,।
కడకడియాస్‌హండా,। అన్నేర్ రాసపడి, కొడ్చి కాడి వాట్।
ఫేరా బేటే సాట్, ఘూటాఫేరే, సగతాఫేరో,
అన్ బక్షిస్ కర్లోనాయక్!

**అర్థం :** ఓ తాండానాయక్‌గారు, నేను గుర్తించినవారికి లక్ష సమస్కారములు, గుర్తించనివారు ఒకటింకాల్ లక్ష నమస్కారములుగా భావించండి, ఫాంగ్ అను ఆకుకూర, సొరకాయలు వేసి పప్పు(సాంబారు) చేసినాము, మల్లె పువ్వులాంటి అన్నం. చాలా మధురమైన రుచిగల పప్పు,

ముత్యములా మెరసిపోతున్న ఆవునెయ్యి, చాలా విలువైన పదార్థములను వేసి వండిన పాయసం అండాలతో నింపబడి ఉన్నది. అన్నం వండి రాసి పోసినాము. వడ్డించుటకు గరిట దారిచూపుచున్నది. బంతిలో అర్వైమంది కూర్చొని ఉన్నారు. ముందుపానకం పంచినాము, హుక్కా అందించినాము. అన్నం భుజించండి నాయక్‌గారు.

**తాంబూలము పచ్చార్:**

ఏ నాయక్, కాచి సపారీ, పక్కే పాన్,
నవనారి బడితి సారంగీ, రంగ్‌మారి హాథీ చున్నో,
ఫర్కో కాచ్చా పాకో లూంగథ బడిమూంగ్, వేతడూ
హుబో ఆనేతి లో? నాయక్!

**అర్థం :** ఓ నాయక్‌గారు. పచ్చి వక్కలు, చాలా మంచివైన తమలపాకులు. అక్కడ ఢాడీలు సారంగి మోగిస్తున్నారు. మిమ్ములను ఆనందింపు చేయుటకు, నోరు ఊరుటకు, ఫండిన లవంగాలు, యాలకులు, సుగంధ ద్రవ్యములు, ఏనుగు దంతములాంటి తెల్లటి సున్నము, అన్నియు ఉన్నవి. పెండ్లి కుమారుడు తమకు అందించుటకు సిద్ధంగాఉన్నాడు. వాటిని తీసుకొని మమ్ములను ఆనందింప చేయండి నాయక్‌గారు.

**హుక్కార్ పచ్చార్ :**

''హేట్‌గరి, ఉంపర్ థమ్, థంయేపర్ అఘేరి, అఘేరిమ కస్తూరి.
కస్తూరి మా లాల్! లో? నాయక్ హుక్కా''

**అర్థం :** అనగా క్రింద బంగారురేకులో పూసిన దొప్ప, ఆ పై వెండి రెకులో కప్పిన స్థంభం, స్థంభము పై మట్టితోచేసి, బంగారు రేకు కప్పిన చుల్లడ్, అందులో కస్తూరి ఉంచినాము. ఆ పై ఎర్రటి నిప్పు కణం! ఉంచినాము. పెండ్లి కుమారుడు సిద్ధంగా ఉన్నాడు తీసుకొనండి నాయక్‌గారు. అని సగౌరంగా చెప్పటం.

**2. వియారో నొక్తా :** ఈ కార్యక్రమమును చేపట్టిన రోజు ప్రొద్దుననే, పెండ్లి కొడుకు తన తోటి లేరియాను వెంట పెట్టుకొని, ప్రతి ఇంటికి పోయి తాంబూలం పంచి, హుక్కా ఇచ్చి వారి కాళ్లకు నమస్కారం చేసి ఈ రోజు రాత్రికి, నా పెండ్లి కార్యక్రమము ఉన్నది మీరంతా రావలయునని ఆహ్వానించి వస్తారు.

ఈ కార్యక్రమము చేపట్టుటకు, నాల్గు దంతులు ఆర్‌మాని కుండలు(వీయార్ హాండి) మరియు రెండు క్రొత్త బానలు, క్రొత్త కడవలు, మూకట్లు, దుత్తలు, ముంతలు, చిన్నచిన్న బోలీలు(చిన్న ముంతలు) అన్ని రంగరించినవి ముందుగా తెచ్చి పెడతారు. ఆ తరువాత జిల్లెడు చెట్టు కొమ్మల మోపులు, సావధాన చేయుటకు, తొమ్మిది రకాల కట్టెలు, నవధాన్యం, పచ్చిదారం పసుపు, కొబ్బరి గిన్నెలు, ఎర్రటి గుడ్డలు, సూదులు, మేండలేర్‌పాకా(అడవికాయి), మేదిపట్టి (గోరింటాకు) అన్ని ముందుగా సమకూర్చువలెను. ఈ కార్యక్రమం చేపట్టుటకు రెండు రోకళ్లు, కాగోటి(అన్నం వార్చుటకు చెక్కతో చేసిన, పెద్ద పళ్లెంలాంటిది) జమ చేసి ఉంచుతారు.

పెండ్లిపందిరిలో ముందుగానే కల్లాపుచల్లి, ముగ్గులు వేసి ఉంచుతారు. రాత్రి 8నుండి 9 గం.ల ప్రాంతంలో ఆర్‌మణి కుండలు కూర్చోబెట్టుటకు నాల్గు ప్రక్కలు నాల్గు గుంతలు త్రవ్వుతారు. మధ్యలో పెండ్లి కుమారుడు పెండ్లి కూతురుని కూర్చోబెట్టేందుకు ఎదురుగా రెండు గుంతలు కొద్ది దూరంలో త్రవ్వుతారు, ఆ గుంతలలో పసుపు కుంకుమ వేసి, ఒక్కొక్క రూపాయి బిళ్ల వేస్తారు. ఈ విధంగా త్రవ్విన గుంతల పైన ఆరమణి కుండలు కూర్చోబెడతారు. మొదట బాన, దానిపైన కుండ, దానిపైన చిన్న కుండ(పాట్యా) ఆపైన దుత్త దాని పైన ముంత, ఆ పైన చిన్న ముంత, దాని పై మూత ఈ విధంగా ఒక దానిపైన ఒకటి పేర్చి, నాల్గు ప్రక్కల జిల్లెడు కొమ్మలు కప్పి, తాడుతో భద్రంగా కడుతారు.

తరువాత రెండు రోకళ్ల తెచ్చి వాటి పొన్నులకు పచ్చిదారంతో పసుపు కొమ్ముతాడు కట్టివాటిని గుంతలో పూడ్చుతారు. పెండ్లి కుమారునికి, పెండ్లి కూతురుకు మేదిపట్టి (గోరింటాకు ఎండిన కాయలు తెచ్చి వాటిని విసరి పొడి చేసి) తెచ్చి ఇద్దరిని వంటినిండా పట్టించి, కాగోటిపై కూర్చోబెడుతారు. వారిని కూర్చోబెట్టిన తరువాత వారి ఎదురుగా చిన్న చిన్న ముంతలను ఉంచి, అందులో చుర్మో అనుదానినివేసి, వాటి చుట్టు పచ్చిదారమును, పెండ్లి కుమారుని, చేతికి, మెడచుట్టు, ఏడుసార్ల చుట్టి, మంత్రాలు చదువుకొంటూ, పాటలుపాడుకొంటూ చేస్తారు. ఈ విధంగా చుట్టినదారములను తీసి, వాటిని పసుపు వ్రాసి, పెండ్లి కుమార్తె చేత ఏడు ముడులు వేయిస్తారు. ఈవిధంగా, కుడి చేతికి, మెడలో వేస్తారు. అదే విధంగా పెండ్లి కుమార్తెకు కూడ, చేతి చుట్టు ఏడుసార్లు మంత్రాలు చదువుకొంటూ పెండ్లి పాటలు పాడుకొంటూ చుట్టి పసుపు వ్రాసి, పెండ్లి కొడుకు చేత, పెండ్లి కుమార్తె మెడలోను, కుడి చేతికి ఏడు ముడులు వేయిస్తారు. ఇది అయిన తరువాత ఖాసడా కట్టిస్తారు. అనగా ఎర్ర గుడ్డ తీసుకొని అందులో ఏడు సూదులను కుచ్చి మేండలేర్‌పాక(కాయ) గుడ్డ తడిపి, పెండ్లి కొడుకు చేత పెండ్లి కుమార్తె రెండు కాళ్ళ పాదములకు కడతారు. అదే విధంగా పెండ్లి కుమార్తె పెండ్లి కొడుకు పాదాలకు కడతారు. ఈ కార్యక్రమము అయిన తరువాత పెండ్లి కొడుకు, పెండ్లి కూతురు ఇద్దరు కొంగులు ముడి వేసుకొని, ఒకరి వెంట ఒకరు, ఆరమణి కుండల మధ్యలో రోకళ్ల పాతిన వాటి చుట్టు(సాత్ పేరా) ఏడు ప్రదక్షణలు చేస్తారు. (దీనినే సాత్‌పేరా పరన్‌వియా కిదో అంటారు) ఈ లోపు సాదువేషమును వేసుకొని, హోమమును తయారు చేసి, అందులో తొమ్మిది రకాల కట్టెలను తెచ్చి హోమం వెలిగించి, మంత్రాలు చదువుతూ నవధాన్యాలను, అందరి పేర్లను ఉచ్చరిస్తూ, సావధానా సావధానా! అని వేస్తుఉంటారు.

ఈ సావధాన జరుగుతుండగా చిన్న ముంతలలో ఉంచిన, చుర్మోను ( బియ్యపు రొట్టె, బెల్లం, నెయ్యి) తీసి, ''కోళియా ఖోరా ఏరో'' అనగా ఆ పదార్థమును, పెండ్లి కుమారునికి పెండ్లి కూతురు, పెండ్లి కూతురుకి పెండ్లి కుమారుడు తినిపిస్తారు. ఆ తరువాత ఇద్దరికి తాంబూలం ఇచ్చి ఇద్దరు నమిలిన తరువాత ఒకరి తాంబూలంను మరివొకరికి నోటినుండి తీసి తినిపిస్తారు. ఈ విధంగా, కార్యక్రమమం అయిన తరువాత, పెండ్లి కుమారుని, పెండ్లి కూతుర్ని ''కాగోటి పై'' కూర్చోబెట్టి, క్రొత్త బానలలోని చల్లని నీళ్లతో పాటలు పాడుకొంటూ స్నానాలు చేయిస్తారు. ఈ విధంగా ఇద్దరి స్నానాలు చేయించిన తరువాత ఇద్దరిని తడి బట్టలతోనే ఒకేచోటనే పడుకోబెడతారు. ఇంతటితో ఈ రాత్రి ''వియాభాందేరో'' కార్యక్రమము ముగిస్తుంది.

రెండవ రోజు సాయింత్రం 3గంటల ప్రాంతంలో తాండాలోని వారందరు కలసి, రాత్రి జరిగిన కార్యక్రమము వద్ద వచ్చి, పెండ్లి కొడుకును, పెండ్లి కుమార్తెను కూర్చోబెట్టి, రాత్రి కట్టిన పచ్చిదారం ఏడుముడులను నిదానంగా విప్పదీయిస్తారు. పెండ్లి కుమారుడు పెండ్లి కుమార్తెకు కట్టిన ముడులు విప్పవలయును, అదే విధంగా పెండ్లి కుమార్తె పెండ్లి కుమారునికి కట్టిన ముడులు విప్పవలెను. ఈ ముడులు విప్పేటప్పుడు దీని గూర్చిన బంజారా పాటలు పాడుకుంటూ విప్పిస్తారు. ముళ్లు విప్పిన తరువాత, రాత్రి పాదాలకు కట్టిన ''ఖాసడా'' ను పెండ్లి కుమారుడు పెండ్లి కూతురు కాళ్లకుకట్టినవి విప్పుతాడు. అలాగే పెండ్లి కూతురు పెండ్లికుమారుని పాదములకు కట్టినవి విప్పుతారు. ఈ కార్యక్రమములో కూడ దీనికి సంబంధించిన పాటలు పాడుతారు.

ఈ రెండు కార్యక్రమములు అయిన తరువాత ఇద్దరిని కూర్చోబెట్టి, క్రొత్త బానలలోనింపిన చల్లని నీళ్లతో స్నానం చేయిస్తారు. ప్రతి ఒక్కరు పెండ్లికుమారుని తలకు నెయ్యి వ్రాసి ఒళ్లు రుద్ది, స్నానం చేయించేటప్పుడు పెండ్లి కొడుకు అత్తగారు, ''చొట్టిర్‌పాని పీయరో'' అంటారు. అనగా అత్తపెండ్లికొడుకు తలజుట్టు పై నీరు పోసి ఆ నీటిని, ఏడుసార్లు త్రాగవలయును, దీనినే ''చొట్టిర్‌పాణి పీయేరో'' అంటారు. ఈ విధంగా పెండ్లి కొడుకు సంబంధించిన బంధువులందరు స్నానం చేయిస్తారు. అలాగే పెండ్లి కుమార్తెకు స్నానం చేయిస్తారు. ఈ స్నానం చేయించేటప్పుడు చాలా తమాషలు చేస్తారు. స్నానం చేయిస్తు ఉంటూనే పెండ్లికొడుకును గబుక్కున వెనక్కిలాగేస్తారు. ఇది గ్రహించిన పెండ్లి కొడుకు ముందుగానే జాగ్రత్త వహించిఉంటారు. ఒకవేళగబుక్కున వెనక్కి పడినచాలా హేళనచేస్తారు. ఇది అవుతూనే, పెండ్లి కొడుకు బావమరదులు, పెండ్లి కొడుకును, కాగోటిపై నిల్చోబెట్టి, చేతిలో మూకటి పట్టుకొని అతని కాలుక్రింద చూపుతూ ముందుకు, వెనకకు తీస్తూఉంటారు. ఆ ముకటిని, పెండ్లి కొడుకు గబుక్కున కాళ్లతోతొక్కవలెను. అట్లు తొక్కేటప్పుడు అతనికి అందనీయకుండ తమాషా చేస్తారు. ఈ కార్యక్రమము అయిన తరువాత రోకలిబండ తీసుకొని అత్తగారు, రోకలి బండ చూపుతూ నా కుమార్తెకు బూతులు తిడతావా, కొడతావా అని, రోకలి బండ తీసుకొని జతాయిస్తోంది. ఇట్లు వరస అయిన వారు చేస్తారు.

ఆ తరువాత తడి బట్టలను మార్పించి, కొత్త బట్టలు, తొడిగించి, ఇద్దరిని ఎదురుబెదురుగా కూర్చోపెట్టి, ''మాండ్, రమాడేరో'' అను కార్యక్రమమును చేస్తారు. పెద్ద పళ్లంలో గంజి అంతా పోసి, అందులో రూపాయబిళ్ల, గవ్వ, ఉగరం పట్టుకొని, ఇద్దరిచేతులను పాత్రలోఉంచి పైనుండి వేస్తారు. అందులో విలువైనది ఎవరు ఎక్కువ సార్లు తీస్తారో వారే గెలుపుపొందినట్లు. ఆ తరువాత ఒక కంచు పళ్ళెమును తీసుకొని, ఆ పాత్రలో బొర్లించి, పెండ్లి కొడుకు, పెండ్లి కూతురు పై విసురుగా తోస్తారు. అదే విధంగా పెండ్లి కూతురు పెండ్లి కుమారునివైపు త్రోస్తుంది. అందులోని గంజి ఒకరిపై ఒకరికి చల్లబడుతుంది. అది అయిన వెంటనే, ఇద్దరిలో గబుక్కున ముందు ఎవరు తీస్తారో అని పోటి పెడతారు. ఆ టైములో వరస అయినవారు, పెండ్లి కూతురు వదలిన తడి గుడ్డలను పెండ్లి కొడుకు పంచకో దుప్పటికో కట్టి ఉంటారు. వారు లేచిన వెంటనే అవికూడ పైకి లేస్తాయి. ఈ విధంగా బంజారాలు రెండవ కార్య క్రమము ''వియారో నొక్తా'' పూర్తి చేస్తారు.

**3. చూడేరో నొక్తా:** (ముత్తైదు కార్యక్రమము) బంజారాలు తాళిబొట్టు కట్టుకోరు; వీరి తాళి, చూడరో బల్ల్యా, ఘుగరి, అనగా ఈ కార్యక్రమము చేయుముందు, పెండ్లి కుమారుడు తోడి పెండ్లి కొడుకు ప్రతి ఇంటికి పోయి, తాంబూలము, హుక్కా ప్రతి ఇంటికిఇచ్చి ఈ రోజా సాయంత్రం 'చూడరో నొక్తా' ఉన్నది మీరందరు రావలయును అను పిలిచివస్తారు.

ఈ కార్యక్రమము సాయంత్రం 3 లేక 4 గంటల సండి ముత్తైదువులు వచ్చి చేస్తారు. ఈ కార్యక్రమమునకు ఎండు కొబ్బరి మరియు బెల్లం పంచిపెడతారు. తాండాలోని కుటుంబాల సంఖ్యను బట్టి, ఒకమణుగు లేక కొన్ని ధడియముల కొబ్బరి గిన్నెలు పెండ్లి కొడుకువారు తెచ్చిఇవ్వవలెను.

ముత్తైదువులందరు పెండ్లి కుమార్తె ఇంట చేరి, పాటలు పాడుకుంటూ పెండ్లి కుమార్తెను కూర్చోబెట్టి తల దువ్వి తాళిబొట్టు అయిన ఘుగరి(చోట్లా)ని టోప్లితో పాటు కుచ్చుగా కట్టి, రెండు చంపలకు రెండు జడలు అల్లి వాటిని చోటితో కలిపి మూళో(జడ) అల్లుతారు. ఈ విధంగా అల్లు చున్నప్పుడు పెండ్లి కూతురు పాటలు పాడుతూ తన దుఃఖమును ప్రకటిస్తూ ఉంటుంది. ఆ తరువాత మోచేతికిపైన చూడేర్ బల్ల్యా (దంతపుగాజులు) ను రెండు చేతులకు తొడుగుతారు ఈ కార్యమును చేస్తున్నప్పుడు పెండ్లి కుమార్తె ప్రతిఘటన చేస్తు ఉంటుంది. అయిన ముత్తైదువులు ఆమెను సంజాయిస్తూ ఈ కార్యక్రమమును పూర్తి చేస్తారు. అక్కడ చేరిన పిల్లలకు పెద్దలకు అందరికి ఎండు కొబ్బరి ముక్కలు చేసి బెల్లం పంచి పెడతారు. ప్రతి ఇంటికి ఒక కొబ్బరి గిన్నె ఒక ఉంట బెల్లం పంచిపెడుతారు. పెళ్లి కుమార్తె అందరి మెడలు రెండు చేతులలో కౌగలించుకొని పాటలు పాడుతు ఏడుస్తూ తన దుఃఖమును ప్రకటిస్తుంది. పెండ్లి కుమారుడు అందరికి తాంబూలం పంచి పెట్టి అందరికి పాదనమస్కారములు చేస్తారు. పెద్దలకు తాంబూలంతో పాటు హుక్కా ఇచ్చి వారి ఆశీర్వాదం తీసుకొంటారు. ఇంతటితో ఈ చూడేరో నొక్తా పూర్తి అవుతుంది. అనాటినుండి పెండ్లి కువార్తె వుత్తైదువుగా పరిగణించబడుతుంది.

**4. గోట్ :** పెద్దలను పూజించుట. పెండ్లి కుమార్తెను అత్త వారింటికి సాగనంపే ముందు రోజు గోట్ చేస్తారు. ఈ కార్యక్రమమునకు కూడ, పెండ్లి కొడుకు తాంబూలం సంచిలో వేసుకోని హుక్కా చేతిలో పట్టుకొని తాండాలోని ప్రతి ఇంటికి పోయి ఈ రోజా సాయంత్రము గోట్‌చేస్తాము మీ రంతా రండి అని చెప్పుచూ, వారికి తాంబూలం ఇచ్చి, పాదనమస్కారం చేసి వారి అశీర్వాదం పొందుతారు. మగవాళ్లు ఉంటేవారికి హుక్కా ఇచ్చి పాదనమస్కారం చేసి అశీర్వాదం పొందుతారు. ఈ కార్య క్రమమునకు అయ్యే ఖర్చు, అనగా మేకపోతు ఖరీదు, ఆ రోజు భోజన ఏర్పాట్లు అన్ని ఖర్చులు, త్రాగుడు ఖర్చు , అంతా పెండ్లి కోడుకువారే భరించవలయును. గోట్ అనగా పెండ్లి కుమార్తెను అత్తవారింటికి సాగనంపే ముందు రోజు. ఇంటి ముందు కల్లాపు చల్లి, ముగ్గు వేసి, పెండ్లి కుమారుడు తలపాగ లోకట్టిన రూపాయి బిళ్లను, వుంచి, దానికి బొట్లు పెట్టి, దీపం వెలిగించి, తాంబూలం, టెంకాయ పెట్టి, ఒక మేకపోతును, అక్కడ నరికి, పూజిస్తారు. తరువాత, దాని మాంసమును, ఒకేచోటవండి అందరికి, పిలిచి భోజనం పెట్టవచ్చు లేక, దానిని భాగాలుగా చేసి ప్రతియింటికి పంచి పెడతారు. ఇది పెండ్లికొడుకువారు చేయవలసిన కార్యక్రమము. ఇదే ఒక సాంప్రదాయంగా వచ్చినది.

**5. నవలేరిన్ వళాఏరో నొక్తా :** పెండ్లి కుమార్తెను అత్తవారింటికి, సాగనంపు కార్యక్రమము, ఆ రోజు పెండ్లి ఇంటి ఆడవారు పసుపు కుంకుమతో ప్రతిఇంటికి పోయి, నవలేరిన భార్కాడను రండి అని పిలిచివస్తారు. ఆ రోజు పెండ్లివారింటిలోవిందు భోజనము ఉంటుంది. దీనినే వియార్టేళో అంటారు.

తాండాలోని అందరు, చిన్న పెద్ద అందరు జమ అయి, పెండ్లి కూతుర్ని తయారుచేసి ''నవలేరిన్ వేస్'' పెరాన్'' అనగా పెండ్లికై పెండ్లికుమార్తెకు తయారు చేసిన ప్రత్యేక డ్రస్సు తొడిగి, ఆమెను పాటలు పాడుకొంటూ తన ఇంటినుంచి, బయటకితీస్తారు. ఈ కార్యక్రమములో పెండ్లి కుమార్తె కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ ఎంత మంది పట్టిబయటికి లాగిన, ఇంటినుండి రాదు, తన వాకిటి గుమ్మమును పట్టుకొని వ్రేలాడుతుంది కాని, తన చేతులతో గుమ్మమును విడిచి పెట్టదు. బలవంతంగా రెండు చేతులను విడిపించి బయట తీస్తారు. ముత్తైదువులందరు ఈ కార్యక్రమములో పెండ్లికి సంబంధించిన పాటలు పాడుతూ ఉంటారు. ఈ విధంగా బయట తీసిన తరువాత, పెండ్లి కుతూరును, అలంకరించిన ఎద్దుపై నిలుచోబెడతారు.

దీనిని హవేలి అంటారు. పెండ్లి కుమార్తెకు తన తల్లి దండ్రులు ఇచ్చిన పెండ్లి బట్టలు, నాల్గు లేక ఐదు జతలు, గూణ్లో ఉంచి, భోజన పళ్లెం, చెంబు మరి ఇతర సామానులు( గూణ) సంచిలో ఉంచి ఎద్దుపై వేస్తారు. ఆ తరువాత పెండ్లి కుమార్తెను, ఎద్దుపై ఎక్కించి, నిలబడి రెండు చేతులు పైకెత్తి పాటలు పాడుకుంటూ హవేలి చేస్తుంది. ఆ హవేలీలు, తన తాండా గూర్చి, తాండా నాయకుని గూర్చి, తాండా ప్రజల గూర్చి, వారి సంపద గూర్చి, నా తల్లిదండ్రులను బాగా చూచుకొండి, ఈ దినముతో ఈ తాండా ఋణం తీరిపోయినది, మీ అందరికి సేవ చేసే భాగ్యం లేక పోయింది. నన్ను మరచిపోకండి. నన్ను మీ మనస్సులలో దాచుకోండి అను పాడుకొంటు, నాల్గు దిక్కులు తిరిగి అందరిని ప్రార్థించుతుంది.

**పెండ్లి కుమార్తె ప్రతిజ్ఞ:** వివిధ రకాలైన కరుణ, దయ, హృదయ విదారకమైన విషయములను తెలుపుతూ చేసే ''ఢావళో'' పాడిన పాటలలో ప్రతిబింబించ గలదు. అత్తవారియింటికి సాగనంపేటప్పుడు, వధువు మనస్సులో ఆనందము దాగి వుంటుంది. ఊరు (తాండా) పోయినప్పుడు ఆ తాండాలో తన గూర్చి చర్చ ఎలాగుంటుందో, మరియు తన పుట్టిన తాండా విడిచిపెట్టే సమయంలో మనస్సు వియోగమును పొందుతుంది. ఇటువంటి సందర్భములో పెండ్లికుమార్తె తన తాండా ప్రజలతో ప్రతిజ్ఞ చేస్తుంది.

''రాంగో నవజూ-నవియూం
రూపో తపజూం తపియూం
సూఈరే నాకే మాయీంతి నికల్యూ
తోబి తమారే ఆకీమా కొని ఆయె దూ
మర్నాయేకే బాపు - హి-హో

నేను సీసముతో సమానముగా కోమలంగా (మెత్తగా) ఉండి నా అత్త మామగారి ఇంటిలో పెద్దలయొక్క ఆజ్ఞలను పాటించుతాను. వెండి ఎలా కంసాలి చేతిలో వేడిని తట్టుకొని ఆభరణములు చేయుటకు వీలు కలగిస్తోందో అదే ప్రకారం కఠినమైన పరిస్థితులను ఎదుర్కొని

పనిచేస్తాను. సూదిలోని దారంలాగా వారి ఆజ్ఞలను పాటిస్తాను. అత్తమామలు, తల్లిదండ్రులు, పుట్టిన తాండాకు చెడ్డపేరు తెచ్చేయంత పనిని నేను ఎన్నడు చేయను అని ప్రతిజ్ఞ చేస్తున్నాను.



పెండ్లి కుమార్తె ఎద్దుపై (దేజు) నిలుచుని ప్రతిజ్ఞ చేయుట

ఇది అయిన తరువాత ఎద్దు మీద నుంచి క్రింద దిగిన తరువాత, తన రెండు చేతులను తాండా నాయకుని మెడను కౌగిలించుకొని, తన తీపి గుర్తులను చెప్పి ఏడుస్తుంది. అదే విధంగా, తల్లిదండ్రులను, అన్నదమ్ములను, వదినెలను, అక్క చెల్లెళ్లను, పెద్దనాన్న, చిన్నాన్నగార్లను, పెద్దమ్మ, పిన్నమ్మగార్లను వరస బెట్టి అందరిని తన చేతులలో వారి మెడలను కౌగలించుకొని, పాటలు పాడుతూ ఏడుస్తుంది. ఈ విధంగా పెండ్లి కుమార్తె అందరిని ప్రార్థించు సమయములో, వచ్చిన చిన్న పెద్దలందరకు పెండ్లి కుమారుడు తాంబూలము హుక్కా ఇస్తూ వారి పాదములను నమస్కరించి, ఆశీర్వాదం తీసుకొంటారు.

ఈ కార్యక్రమము అయిన తరువాత పెండ్లి కుమార్తెకు ఇచ్చినగుడ్డలు( గూణ్) సంచి కాని, పెట్టెకాని, క్రింద చాప పరచి, మధ్యలో పెట్టెఉంచి, పెండ్లి కొడుకు తూర్పు ముఖంగాను, పెండ్లి కుమార్తెను పడమర ముఖంగాను కూర్చోబెడుతారు.

తరువాత వచ్చినవారందరు భోజనాలు చేస్తారు. పెండ్లి కుమారునితో పాటు ఐదు మంది, పెండ్లి కుమార్తెతో పాటు ఐదు మంది కూర్చోని, ఒకే పళ్లెములో భోజనం చేస్తారు. ఈ విధంగా భోజనము అయిన తరువాత, పెండ్లి కుమారుని తాండా దూరమును బట్టి ప్రయాణం కడతారు. పెండ్లి కుమారునికి, పెండ్లి కుమార్తెకు కట్న కానుకలు ప్రతి ఇంటివారు చదివిస్తారు.

**పెండ్లి కుమారుని ఇంటిలోని కార్యక్రమములు:** ఇక పెండ్లి ప్రయాణం, వారివారి అనుకూలమును బట్టి ఎద్దుల బండ్లు కడతారు, లేక బస్సుల ప్రయాణం. ఈ విధంగా ప్రయాణమైన పెండ్లివారు, వారి తాండా చేరిన వెంటనే ఊరి బయటగాని, గుడి దగ్గరకాని చేరి, చాపలు పరచి, గూణ మధ్యలో పెట్టి చెరి ఒకప్రక్క పెండ్లి కుమార్తెను రెండవ ప్రక్క పెండ్లి కుమారుని కూర్చోపెడుతారు.

**ఘరేమాలేరో నొక్తా:** పెండ్లి కుమారుని ఇంటివారికి తాంగడి వస్తుందని ముందుగా తెలిసిఉంటుంది కావున వచ్చిన వారికి భోజనాలు చేయించి, తాండావారిని, ఇంటింటికి పోయి 'తాంగడి అయిచ ఘరేన్ బలలామా ఆవో', అని పెండ్లివారు వచ్చిఉన్నారు, ఇంటికి పిలుచుకొని వస్తాం రండి అని పిలుస్తారు. అప్పటికే చాలామంది అక్కడ చేరిఉంటారు. పెండ్లికుమారుని ఇంటినుండి పళ్ళెంలో కళశం పసుపు కుంకుమ, తాంబూలం దీపం ఉంచుకొని పాటలు పాడుకుంటూ పెండ్లివారి విడిది దగ్గర వస్తారు.

అందరు వచ్చిన తరువాత పెండ్లికుమార్తె ఇంటివారు పంపించిన చుర్మో అను పదార్థమును( బియ్యం పిండితో రొట్టెలు చేసి, బెల్లం, నెతితో చూర్ణం చేసినది) అందరికి పంచి పెడతారు. ఈ కార్యక్రమము అయిన తరువాత పెండ్లి కొడుకును, పెండ్లి కూతురిని,మధ్యలోఉంచుకొని, పాటలు పాడుకొంటువస్తారు. ఈ పాటలలో పెండ్లి కుమార్తెకు వ్యతిరేకముగా పెండ్లి పాటలు పాడుతారు. అనగా, తన తల్లి దండ్రులను, అన్నదమ్ములను, అక్కచెల్లెలను కించపరస్తూ నీ అత్త మామల ఇంటిలో సుఖం పొందుటకు వచ్చావు అని వీరిని పొగుడుచూ పాడుతారు. ఈ పాటలు మంచిహాస్యాన్ని, ఆహ్లాదాన్ని, ఆనందాన్నికలుగచేస్తూ చాలా వినసొంపుగాఉంటవి.

ఇంటి వద్ద తీసుకొనివచ్చిన తరువాత ఇంటిలో పాయసం చేసి, దేవుని నైవేద్యం పెట్టి కొబ్బరి కాయనుకొట్టి, దీపంతో ఇంటిలోనికి అహ్వానిస్తారు. అప్పుడు వీరికి, ఇంటిగుమ్మం ముందు, నిల్చోబెట్టి జతలు జతలుగా వచ్చి, అక్షింతలు ఏడుసార్లు చల్లుతారు. వీరు చల్లినందుకు డబ్బు ఇవ్వవలెను.

గుమ్మంలోవచ్చిన తరువాత వదినెలు, అక్కచెల్లెళ్ళు లోపలకి రానియకుండా అడ్డుపడతారు. వారికి డబ్బులు ఇవ్వవలయును. ఈ విధంగా పెండ్లి కుమార్తెను, పెండ్లి కొడుకును ఇంట్లోకి తీసుకు వస్తారు. వచ్చినవారికి, వండిన పాయసం, తాంబూలం పంచిపెడతారు. పెద్దలకు హుక్కా ఇచ్చి అందరి ఆశీర్వాదం తీసుకొంటారు. పెండ్లి కుమార్తె మాత్రం ఘుంగటో ఒక మూరడు ముందుకు తీసిఉంటుంది. ఎవరికి తన ముఖం కనపడకుండా

తీసి ఉంటుంది. ఇది సుమారు 15 నుండి 1 నెలరోజులవరకు తీసిఉంటారు. అలా తీసినందుకు ''ఘుంగటాలి నవలేరి'' అంటారు. అనగా క్రొత్త పెండ్లి కూతురు అని అర్థము.

దాంతళియా దేరోనొక్తా: ఇక రెండవ రోజు పెండ్లి కొడుకు వారింట్లో 'టేళో' చేస్తారు. అనగా విందుఉంటుంది. ప్రొద్దుననే పెండ్లి కొడుకు లేచి, తనకు ముసుగు ఉన్నదుప్పటిని తీసివేసి, దగ్గరలోఉన్న వంకకు పోయి కానిగ కొమ్మలను, ఆరు అంగుళముల పొడువుతో పండ్లు తోమేపుల్లలు( దాంతిలియా) కొట్టుకొని వచ్చి పెండ్లి కుమార్తెకు ఇస్తారు. ఈ దాంతలియాను పెండ్లి కుమార్తెవారి తోడికోడలు, ఆడ బిడ్డలను తీసుకొని ఇంటింటికిపోయి ఇచ్చి, వారి ఆశీర్వాదం తీసుకొని, మా పెండ్లి సంబంధముగా మా ఇంటిలో 'టేళో' చేస్తున్నారు రండి అని ఊరు మొత్తం పిలిచి వస్తారు. ఆ విధంగా అయిన తరువాత అందరు వచ్చి భోజనాలు చేసి, తాంబూలంపుచ్చుకొని, వెళ్లి పోతారు.

తాంగడి ఖోళేరో నొక్తా : తిరిగి సాయంత్రం 3 గంటల ప్రాంతంలో అత్తగారు ఇంటింటికి పోయి, మా కోడలు తెచ్చిన పెండ్లి బట్టలు చూద్దురు రండి అనిపిలిచి వస్తారు. దీనిని ''తాంగడి ఖోళేరో'' అంటారు. వారందరు వచ్చి వారు ఇచ్చిన బట్టలను, వాటిపై చేసిన పనితనమును, వాటి నాణ్యతను చూచి మెచ్చుకొంటూ, మీ అత్తగార్కి, ఆడ బిడ్డలకు ఏమి ఇచ్చారు, అని అడుగుతారు. అత్తగార్కి ఒక డ్రస్సు, ఆడ బిడ్డలకు ఒక డ్రస్సు ఇచ్చినారు అని వారికి చూపిస్తుంది. ఆ తరువాత పెండ్లి కుమార్తె వారి కాళ్లు వత్తి, తన కుడి చెంగును, తన చేతులలో తీసుకొని, వారి పాదాలను స్పర్శిస్తూ మొక్కుకొంటు వారి ఆశీర్వాదమును తీసుకొంటారు. ఈ విధంగా బంజారాల పెండ్లి కార్యక్రమము ముగిస్తుంది.

వేతడు నవలేరీన భేళేరో నొక్తా (గర్భదానము) పెండ్లి కార్యక్రమములు అయిన తరువాత పెండ్లివారింట వచ్చినవారందరు తమ ఊళ్ళకు వెళ్ళిన తరువాత ఒక మంచి రోజు చూచి ఈ కార్యక్రమమును చేపడతారు. పెండ్లి కుమారుని ఇంటి ముత్తైదువులు ఇంటింటికిపోయి ఈ రోజు గర్భదాన కార్యక్రమమున్నది మీరంతా రండి అని ఆడవాళ్ళను పిలిచి వస్తారు. అందరు వచ్చిన తరువాత బంజారా గర్భదాన కార్యక్రమము పాటలు పాడి వారిని ఒక ఇంటిలో పంపించి వారిచ్చిన తాంబూలములను స్వీకరించి తమ తమ ఇండ్లకు వెళ్ళిపోతారు. ఇక్కడితో బంజారాల పెండ్లి కార్యక్రమము పూర్తి అవుతుంది. ఆ తరువాత కొద్ది రోజులకు, క్రొత్త పెండ్లికొడుకు, క్రొత్త పెండ్లి కూతురు అత్తమామలను, తల్లి దండ్రులను చూచివస్తారు.

పెంపుడు కొడుకు( జాంగడ్) వివాహం అయితే ఈ మొత్తం కార్యక్రమములు ఒకటి రెండు రోజులలో ముగించుకొని వస్తారు.

## పెండ్లి కార్యక్రమాలలో బంజారాలు పాటించే రెండు ముఖ్యాంశాలు :

1) మొదటి శాస్త్రము : పెండ్లి కుమారుని చేసి, బయటకు తీసుకొని వచ్చే సమయంలో, పెండ్లి కుమార్తెకు ఇచ్చే నలుగు చీర( నవలేరిర్ సాడి) క్రిందగా ఇంటి నుండి బయట తీసుకొని రావలయును, ఎందుకనగా, పెండ్లి కుమారుని వెన్నంటు కొని ఉండు, తోడపెండ్లి కొడుకు ఢాడీ ఉండేవారు ఢాడి అనగా భట్రాజు అని అర్థము.

ఒకరోజు పెండ్లి కుమార్తె దూరంనుండి మంచి నీళ్లు మోసుకొని వచ్చేటప్పుడు. కడవ మీద కడవ, మూడింటిని నెత్తిమీద మోసుకొనివస్తూంది. అది ఢాడి, తోడి పెండ్లికొడుకు(లేరియా) చూస్తాడు. అయ్యో పాపం, కడవ మీద కడవ మూడు కడవలు మోసుకొస్తున్నది కదా,చేయి అందటం లేదు. ఎలాదించుతుంది పాపం అని, వాటిని అందుకొంటారు. ఇది పెండ్లి కొడుకు చూస్తాడు. పెండ్లి కొడుక్కు కోపం వస్తుంది. తన భార్యను ముట్టుకొన్నాడే అని, అప్పుడు బహిర్ భూమికి వెళదాం రా అని పిలిచాడు, నీళ్లచెంబు పట్టుకొని, దూరంగా పోతారు. అక్కడ లేరియాను తన వద్దఉన్న కత్తితో పొడిచి, చంపివేస్తాడు.

ఇంటికి వస్తాడు. లేరియా భార్యకు ఈ విషయం తెలుస్తుంది. ఆవేం తాండానాయకునితో పంచాయితీ పెట్టిస్తారు. అప్పుడు తాండా పెద్దలంతా కలిసి పంచాయితి చేస్తారు. అమ్మా ! తప్పు అయినది. పెండ్లికి వచ్చిన వారిని, పెండ్లి చేయించక పోతే పెండ్లి కూతురు గతి ఏమౌతుంది, చనిపోయినవాడు తిరిగివస్తాడా, నీవే దీనిని క్షమించవలయును, నీ భర్తను చంపి, నిన్ను విధవరాలిని చేసినపాపానికి, ఇప్పటినుండి నీవు కట్టుకొన్న చీర క్రిందినుండి, పెండ్లికొడుకును ఇంటినుండి తీస్తాము. ఆ చీరనే పెండ్లి కుమార్తెకు కట్టిస్తాము. ఇప్పటినుండి జరిగే ప్రతి పెండ్లికి ఒక రూపాయి దండన తీస్తాము. ఆ రూపాయి బిళ్లనే, తలపాగాలో కట్టిస్తాము అని, ఆమెతో చెప్పి ఒప్పిస్తారు.

మరియు ప్రతి పెండ్లిలోను, నీ భర్త చనిపోయిన దినం చేయిస్తాము అని సమాధాన పరుస్తారు. దానినే గోట్ అంటారు.

**2.** రెండవ శాస్త్రము : పెండ్లి కుమార్తెను, ఇంటినుంచి బయటకు తీసుకొనివెళ్లి, ఎద్దుపై నిలుచోబెట్టి, హవేళిచేయిస్తారు. అనగా, పెండ్లి కుమార్తె ఎద్దుపై ఎక్కి తన మనస్సులోఉన్న బాధలను, తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్క చెళ్ళెండ్లు, తమ తాండా గురించి, తలచుకొంటూ, ఏడ్చుకొంటూ పాటలు పాడుతుంది. ఆ కార్యక్రమము అయిన తరువాత, తన తల్లి దండ్రులు ఇచ్చిన గుడ్డలు, సొమ్ములు, వస్తువులు, అన్ని ఒక సంచిలో ఉంచుతారు( లత్తార్ తాంగడి అంటారు) ఇది ఒక ఎద్దు మోసే అంత ఉంటుంది అని భావన. ఆ విధంగా పూర్వం ఇచ్చేవారు.

దానిని మధ్యలోఉంచి, పెండ్లి కూతురు పడమర ముఖంగాను, పెండ్లి కుమారున్ని తూర్పు ముఖంగాను కూర్చో బెడుతారు. దీని గూర్చివారు ఈ విధంగా చెపుతారు. ఒక పెద్దమర్రి చెట్టుఉంటుంది. ఆ చెట్టు క్రిందగా ఆ ఊరి ఆడవారు, బావినుండి మంచి నీళ్లు తెచ్చేవారు. ఆ చెట్టు క్రిందనుంచి వచ్చేటప్పుడు మర్రి ఊడలు తగిలి కడవలన్నియు పగిలి పోతుండేవి. కాని దానిని ఎవరు పట్టించుకొనేవారు కాదు. ఆ విధంగా పగిలిన కుండ పెంకులు, పెద్ద దిబ్బలాగా పేరుకొనిపోయిఉన్నాయి.

ఇది పెండ్లి కొడుకు బయటకు వెళ్లినప్పుడు చూస్తాడు. ఈ తాండావారి కేమి తెలియదా, ఈ విషయమును ఎవరు పట్టించుకొనలేదే, పాపం ఆడవారు ఈ మర్రి ఊడలు తగిలి నీళ్ల కడవలన్నియు పగల గొట్టుకుంటున్నారు. అని తలచి, గొడ్డలి తీసుకొని పోయి, ఆదారికి అడ్డమున్న ఊడలన్నింటిని నరికి వేస్తాడు. అది తెలుసుకొన్న తాండా నాయకులు, మా తాండా నాయకుని నీవు నరికినావు. ఆ పంచాయితి తీర్చేవరకు మిమ్ములను ఇక్కడినుంచి పంపించేది లేదు అని తప్పుపట్టి గట్టిగా కూర్చుంటారు.

ఆ విధంగా కొన్ని రోజులు జరుగుతుంది, పెండ్లికొడుకు చుట్టు ప్రక్కల తాండాలకు పోయి పంచాయితి చేయండి అని, ఎంత మొరపెట్టుకొన్న, వారు అదే సమాధానం చెపుతున్నారట. అప్పుడు పెండ్లి కుమార్తె తనకు ఇచ్చిన ఎద్దు(దేజు)తో మొరపెట్టుకొన్నదట, అయ్యా వీరు మమ్ములను సాగనంపేటట్లులేదు, నీవే ఏదైన మాకు ఒక మార్గం చూపవలెను.

అప్పుడు ఆ ఎద్దు నీ భర్తతో ఈ విధంగా చెప్పు, మీ తాండా నాయకుడు, ప్రతి ఆడవారితోను, చెతురాడుతున్నాడు, తల్లితోను, చెల్లితోను, భార్యతోను, అందరితోను చెతురాడుతున్నాడు. అందుకు మీ తాండా నాయకుని నరికినాను అని చెప్పమనెను. అప్పుడు పెండ్లికుమారుడు అదే విధంగా తాండా పెద్దలతో చెపుతారు. అప్పుడు తాండా పెద్దలు, తమ నాయకునిదే తప్పని, మమ్ములను క్షమించమని, ఐదు రూపాయలు, తప్పుచెల్లించి, వారిని అత్తవారింటికి సాగనంపుతారు. ఈ విధంగా వారు పూర్వం జరిగిన వాస్తవములను, ఒక సాంప్రదాయంగా పాటించుతున్నారు.

ఈ రెండు కార్యక్రమముల ముఖ్య ఉద్దేశ్యం : 1) భర్త తన భార్య పై ఎవ్వరైన కన్ను వేశారని తెలిస్తే! లేరియాకు జరిగిన శాస్తి జరుగుతుందని హెచ్చరించటం. 2) భార్య ఉండి పరస్త్రీలతో పరాచకాలు ఆడిన, తాండా తరపున, నీకు పెండ్లికుమారునికి ఈ విధమైన దండన ఉంటుందని, తెలియ చెప్పటం, ఇది వాటి భావం(నీతి).

## బంజారాలు - వితంతు వివాహాలు

బంజారాలలో వితంతు వివాహములు, పూర్వమునుండి యే ఆచరణలో ఉన్నవి. దీనిని వారు, భాంగ్ కరేర్ లేక ''సుకో ఆటోచటా ఏరో'' అని అంటారు. అనగా బంజారాలు విధవరాలును తిరిగి మారు పెండ్లి చేస్తారు. పూర్వం తరచు యుద్ధములు జరుగుచుండి నందున పెండ్లి అయిన భార్యలు తమ భర్తలు యుద్ధములలో చనిపోయిన, భర్త పై భక్తిఉన్న స్త్రీ భర్తతో పాటు సతిసహగమనుము చేసేవారు. వారిని 'సత్తి' అంటారు. అటువంటి సతీ అయిన స్త్రీలు, బంజారాలలోని, ప్రతి వంశములలో కోకొల్లలుగా ఉన్నారు. వారిని ఇప్పటివరకు బంజారాలు తమ తమ కుటుంబములలో పూజిస్తున్నారు.

వయస్సులో ఉన్న స్త్రీ భర్తను కోల్పోయిన, తన జీవితం చాలా దుర్భరమౌతుంది. తమ పిల్లలు అనాథలౌతారు. అందువలన బంజారాలలో వితంతు వివాహ సాంప్రదాయం పూర్వంనుండి అమలలో ఉన్నది.

ఎక్కువగా బంజారాలు తమ కుటుంబములోని స్త్రీ వితంతువునే వీరు పెండ్లి చేస్తారు. బంజారాలలో మరది వదినను వివాహమాడవచ్చును. కాని అన్న తమ్ముని భార్యను వివాహమాడకూడదు. కాని హిందూ సాంప్రదాయం ప్రకారం వదిన తల్లి అంటారు. తమ్ముని భార్య మరదలు అంటారు. బంజారాలలో ఆ వరసకాదు. తమ్ముని భార్య బిడ్డతో సమానము. కావున బిడ్డను పెండ్లి చేసుకొనరు. ఈ సాంప్రదాయం యుగ యుగాలనుండి వస్తున్నది.

ఉదాహరణ: శ్రీరామ చంద్రుడు అరణ్యవాసకాలంలో, మారీచుడు మాయ లేడి రూపంలో వచ్చి అగుపించగానే, సీతాదేవి ఆ లేడిని చూచి, ఆ బంగారు లేడి(జింక) చర్మమును నాకు

తెచ్చిపెట్టండి అని కోరింది. ఆమె కోర్కె మేరకు శ్రీరామచంద్రుడు, జింక చర్మము కొరకు దానిని వెంటాడుతూ పోతారు. ఆ మాయ లేడి అయిన మారీచుడు, శ్రీరాముని దూరంగా తీసుకొని వెళ్లుతుంది. అప్పుడు శ్రీరామచంద్రుడు వేసారి, ఆ మాయ లేడి పై బాణం వదులుతారు. ఆమాయ లేడి అయిన మారీచుడు శ్రీరామచంద్రుని బాణమునకు హా లక్ష్మణా! అని చెప్పి ప్రాణాలు వదిలాడు. ఆ శబ్దము, సీతాదేవికి, లక్ష్మణునికి వినిపిస్తుంది. అది విన్న సీతామాయి వెంటనే లక్ష్మణునితో, మీ అన్నగారు ఆపదలో ఉన్నారు. వెంటనే వెళ్లి రక్షించుము అని చెపుతుంది. శ్రీరామచంద్రుడు తనకు ఒప్పించిన భాద్యతను గుర్తు చేస్తూ, తల్లి తమరు తొందర పడకండి, అన్నగానికి ఏ అపదరాదు, ఇది అంతా ఈ ప్రాంతంలోని రాక్షసుల మాయ అని ఎన్ని విధాలుగా చెప్పినను, సీతాదేవి ఒప్పుకొనకుండా, లక్ష్మణుని, నిందించుతుంది. నీవు మోసగాడివి, నన్ను మోహించు దురుద్దేశ్యముతో నీవు, మీ అన్న ఆపదలోఉన్న, పోకుండా ఉన్నావు. ఇది అంతా నీ భ్రమ నీకు నేనుదక్కను అని చెపుతుంది. దీనిని బట్టి వదిన మరదిని పెండ్లి చేసుకొనవచ్చును, లేక తమ్ముడు అన్న భార్యను పెండ్లి చేసుకొనవచ్చు అని అర్థమగుచున్నది.

రెండవ ఉదాహరణ : శ్రీరామచంద్రునికి హనుమంతుని ద్వారా, సుగ్రీవ మహారాజుతో పరిచయమైనది. సీతామాతను అన్వేషించుటకుగాను వారి సహాయమును కోరుతారు. అప్పుడు సుగ్రీవుడు తన అన్న గారైన ''వాలి'' నుండి రక్షించుకొనుటకు, ''వృష్యముఖ పర్వతము'' చేరుకొన్నాడు అక్కడకు వాలి రాలేడు. ఈ విధంగా వాలి సుగ్రీవుల గూర్చిన. విషయములు తెలుసుకొన్న, శ్రీరామచంద్రుడు, వాలిని సంహరించి, కిష్కిందకు రాజును చేస్తానని మాట ఇచ్చారు. అప్పుడు వాలిసుగ్రీవుల యుద్ధం జరుగుతుంది. వాలిని సంహరించుట చాలా కష్టం కావున శ్రీరామచంద్రుడు చెట్టుమాటునుండి బాణమును వదిలి వాలిని సంహరిస్తాడు. అప్పుడు వాలి శ్రీరామచంద్రుతోనన్ను అన్యాయంగా చంపావు, నీకు కావలయునంటే, సీతాదేవిని క్షణములో, రావణాసురుడి చరనుండి విడిపించుకొని వస్తును కదా? నా భార్య పిల్లలను అనాధలను చేసావు అన్నాడు.

అందుకు కాదు ''వాలి'' నీవు నీ సోదరుని అడవిపాలు చేసి అతని భార్యను చెరపట్టినావు. నీవు తమ్ముని భార్య అని కూడా చూడకుండా ఆమెతో నీ కామవాంఛ తీర్చుకొంటున్నావు. బిడ్డతో సమానమైన నీ తమ్ముని భార్యను చెరపట్టావు అంటారు. తన తప్పును తెలుసుకొన్న వాలి శ్రీరామచంద్రునికి నమస్కరించి తనువు చాలిస్తాడు. ఆ తరువాత అంగదుడిని యువరాజగా చేసి, సుగ్రీవుడు వదిన తారను పెండ్లాడి, పట్టపు రాణిని చేస్తాడు.

ఇది యుగాలునుండి వస్తున్న సాంప్రదాయం అందువలన బంజారాలు, వదినను పెండ్లి ఆడి, అన్నగారి బిడ్డలుగా భావించివారి సంరక్షణ భారము తీసుకొంటారు. పిల్లలు కూడ తన పినతండ్రినే తండ్రిగా భావించి వారు చెప్పినట్లుగా నడచుకొని, తన సంసార సుఖములను ఫలప్రదం చేసుకొంటారు. కాని మరదలిని మాత్రం చేసుకోరు. ఒకవేళ కామాందుడై మరదలితో సంబంధం ఉంచుకొన్న అటువంటివాడిని హేళనగా ''ఏ బోడించోద్దు'' అని పిలుస్తారు. బోడి అనగా మరదల అని అర్థం.

వితంతు వివాహమును బంజారాలు మామూలు పెండ్లి పద్ధతులలో పాటించరు. వివాహము చేసుకొనుటకు ఒప్పుకొన్న వారిని ఒక చోట కలుపుతారు. అనగా వితంతు స్త్రీని,

ముత్తయిదువను చేస్తారు. అనగా ''ఘుగరి, చూడో'' వేస్తారు. పెండ్లిలో వేసే బట్టలతో అలంకరిస్తారు. వారిద్దరిని, ఒకచోట కలిపి పెండ్లిపాటలు పాడుకొంటు బియ్యం పిండి, నెయ్యి, బెల్లంతో కలిపిన పిండిని ఒకరు ఇంకొరికి తినిపిస్తారు. అనగా భార్య భర్తకు, భర్త భార్యకు తినిపిస్తారు. ఆ విధంగా తినిపించిన వారి పెండ్లి అయిపోయినట్లే, మిగిలిన పిండిని అక్కడ వచ్చిన వారందరికి పంచి పెడతారు. దీనినే బంజారా, ''భాంగ్ కర్‌న్ ఘాలేరో'' అంటారు.

ఇక ఇటువంటి సంబంధములు లేనివారు, తమకు నచ్చిన, వరునితో పెండ్లి చేసుకొనవచ్చును. తాండా ప్రజలకు మా ఇద్దరికి ఇష్టమున్నది. మేము పెండ్లి చేసుకొంటాము అని చెప్పిన, వారి పరిస్థితులను గమనించి, అన్ని ఆలోచించి, వారికి సంబంధంచిన ఇబ్బందులను తొలగించుకొన్న, లేక తొలగించి వారికి పెండ్లి చేస్తారు. అప్పటినుండి వారు జీవితాంతం భార్యా భర్తలుగానే జీవించుతారు. వీరికి పుట్టిన బిడ్డలు అందరితో పాటు సమాన హక్కులు కలిగి ఉంటారు. ఎటువంటి భేదాభిప్రాయములు ఉండవు. వారి జీవితం మంచిగా సాగిపోతుంది.

# బంజారాలు - అశుభ కార్యక్రమములు

బంజారాలు-అశుభకార్యక్రమాలు హిందూ సాంప్రదాయమునే పాటిస్తారు. తండాలో ఎవరైన నిర్యాణం చెందారని తెలిసిన వెంటనే భోజనములు చేయటం మానేస్తారు. అప్పుడు వండిన అన్నం మంచి నీళ్లతో కూడ పార పోస్తారు. వెంటనే క్రొత్త నీరు. తరువాత వండిన అన్నం మాత్రమే భోజనం చేస్తారు.

తాండాలో ఫలానా మనిషి, స్త్రీ కాని, పురుషుడు కాని చనిపోయాడు అంటూనే తాండా ప్రజలందరు అక్కడ గుమిగూడుతారు. నిర్యాణం చెందిన ఇంటివారిని ఊరడించి వేదాంతమును వెల్లి విరుస్తారు. అందురు ఒకనాడు పోవలసినదే, కొద్ది రోజులు ఈ భూమి పైన సంత చేసుకొనుటకు వచ్చిన వారమే అంటువారిని మనస్తాపమునుండి నివారింప చేస్తారు. హిందు సంప్రదాయం ప్రకారమే కాష్టములనుకడుతారు. చనిపోయిన వ్యక్తిని, స్నానం చేయిస్తారు. జుట్టుకు నెయ్యి అంటించి బాగా చల్ల నీళ్లతో రుద్ది రుద్ది ప్రతి ఒక్కరు బంధువులు స్నానం చేయిస్తారు. ఆ తరువాత నోటిలో నెయ్యి బెల్లం వేస్తారు. అదే స్త్రీ అయితే నొసట బొట్టు పెట్టి, తలలో పూలు పెట్టి అలంకరిస్తారు. అందరూ పాదాలకు నమస్కారం చేస్తారు. ఈవిధంగా చేసిన తరువాత అందరు కలసి కాష్టముపై పడుకోబెట్టి, క్రొత్త వస్త్రములను కప్పి, తల నుండి కాళ్లవరకు త్రాళ్లతో భద్రంగా బిగిస్తారు.

క్రొత్త కుండలో నిప్పు ఉంచుకొని ఇక స్మశాన వాటికకు బయలుదేరుతారు. బంజారాలు క్షత్రియ వర్ణం కాబట్టి వారు దహన సంస్కారమును చేస్తారు. ఎవరైన భక్తులు, గొప్పవారు ఉన్న తమ కుటుంబ సభ్యుల కోరిక మేరకు సమాధి చేస్తారు. బంజారాలు సమాధిలో ఉంచేముందు కాని, కాష్టముపై ఉంచే ముందు పెద్ద కుమారుని చేత తల కొరివి పెట్టిస్తారు. కాష్టము పైన అయితే ఉత్తరం తల ఉంచి, దహన సంస్కారం చేస్తారు. అదే సమాధిలో ఉంచినట్లు అయిన బోర్ల పండవేసి ఉత్తర ముఖంగా తలచేసి సమాధి చేస్తారు. ఈ విధంగా నిర్యాణ సంస్కారములు చేసిన తరువాత దగ్గరలోఉన్న బావిలో కాని, వంకలో కాని కాళ్లు, చేతులు

కడుక్కొని అందరు కలసి, గుంపుగా బయలుదేరి ఇంటికి వస్తారు. వచ్చేటప్పుడు అందరు తలా ఒక ఆకు గోళ్ళతో గిల్లుకొని, కంప ముండ్లను విరచుకొని వస్తారు.

అందరు, నిర్యాణమైన ఇంటి వద్ద వచ్చి అర్థచంద్రాకారంగా కూర్చుంటారు. అప్పుడు ఒక కడవలోని నీళ్ల ముంచుకొని చెంబుతో అందరి ఎడమ చేతిని తడుపుకొంటూ వస్తారు. ఇది అయిన తరువాత అక్కడవచ్చిన పెద్దలు ఆ కుటుంబ సభ్యులు దుఃఖమును నివారిస్తూ ఆ ఇంటి యజమానుని గాని, యజమానురాలుని గాని గతించి ఉన్న ఆ కుటుంబ సభ్యులు ఎలా నడచుకొనవలయునో బోధిస్తారు. ఒక వేళ యజమానుడు చనిపోయిన, పెద్ద కుమారుడు ఉన్న ఆతనికి ఇంటి బాధ్యత గూర్చి తల్లి, తమ్ముళ్ళు, మరదళ్ళు, చెల్లెళ్ళు, పిల్లల గూర్చి వారి ఆలన పాలన గూర్చి బోధించుతారు. యజమానురాలు పోయిన, భర్తను తన పిల్లలు గూర్చి వారి ఆలన పాలన గూర్చి వారిని జాగ్రత్తగా కాపాడవలయునని, ప్రభోదిస్తారు. ఈ బోధనలు అన్ని అయిపోయిన తరువాత అందరికి మధు తెప్పించిపోస్తారు. మధుపానమును అందరు తాగి వారిని ఓదార్చివెళ్లిపోతారు.

మూడవరోజు బంజారాలు చనిపోయిన వ్యక్తికి దినం చేస్తారు. ఆ రోజు తాండా మొత్తం కలసి ఈ కార్యక్రమమును చేపట్టువలయును. అనగా దినం చేయుటకు ఒక యాట (మేకపోతు లేక పొట్టేలు) తీసుకొంటారు. బియ్యం, బెల్లం, మరియు బియ్యం రొట్టెలు చేయుటకు, పిండి మొత్తం తయారు చేసుకొని, మాంసం వండుటకు మసాల తయారు చేసుకొని, తాండాకు దూరంగా స్మశానవాటికకు అనుకూలమైన ప్రదేశములో బావి గాని లేదా నీళ్ల లభించుచోటు గాని చూచుకొని అక్కడికి వెళ్లిపోతారు. ఒక చెంబుతో పాలు కూడ తీసుకొని పోతారు. తాంబూలం, కొబ్బరి కాయలు, అగరవత్తులు మొదలైనవి తీసుకొని వెళతారు.

ఆ విధంగా అన్ని వస్తువులు తీసుకొనిపోయి అందరు బావి దగ్గరకు చేరుకొంటారు. కొంత మంది యాటను కోసి దాని మాంసంతో సలోయి చేస్తారు. అనగా యాటలు మొత్తం అక్కడ వండుతారు. బియ్యం పిండితో రొట్టెలు తయారుచేసి బెల్లం నెయ్యి కలిపి, చుర్మో తయారు చేస్తారు. బియ్యంతో పాయసం కూడ చేస్తారు. ఈవిధంగా వంటలన్నియు అయిన తరువాత కుటుంబ సభ్యులలో పెద్దవాడైన వారు కాష్ఠము దగ్గర రాలేక సమాధి వద్దకు పోయి, అక్కడ తాంబూలము, అగరవత్తులు వెలిగించి, చేసిన మొత్తం నైవేద్యములను అక్కడ సమర్పించి, కొబ్బరి కాయకొట్టి, సమాధిపై పాలు పోసి, పూజించి వస్తారు. ఈ పూజ అయి పోయిన తరువాత అందరు బావి దగ్గర వచ్చి, అందరికి చుర్మో ముద్దలు పంచిపెడతారు. పాయసం పంచి పెడతారు. ఆ తరువాత మాసం కూడ పంచి పెడతారు.

దినంలో కలవటానికి వచ్చిన బంధువులు, తాండావారు అందరు, నిర్యాణం చెందిన కుటుంబ సభ్యులు మగవాళ్లకు, ఒక గ్లాసు మధువు, మాంసపు ముక్కలను అందించి తమ సంతాపమును ప్రకటిస్తారు. ఈ విధంగా అక్కడకు వచ్చిన ప్రతి ఒక్కరు ఈ విధంగావారికి అందించుతారు. ఇది అయిపోయిన తరువాత కుండలు అక్కడే పారవేసి ఇండ్లకు వచ్చేస్తారు. అంతటితో మూడవ రోజు కర్మకాండ అయిపోతుంది.

బంజారాలలోపునర్జన్మ సిద్ధాంతం బాగా ప్రచారంలో ఉన్నది. వారు తమ నిర్యాణమైన వ్యక్తి తిరిగి ఏ జన్మను ఎత్తినది తెలుసుకొంటారు. 12వ రోజు కర్మకాండ అయిన వెంటనే ఇంటివారు. తమ ఇల్లు బాగా శుభ్రం చేసుకొని, ఇంటి ముందు కళ్లాపు చల్లి, ముగ్గులు వేసి

పెడతారు. ఒక కుండలో అన్నం బాగా మెత్తగా ఉడికించి, క్రొత్త మూకటి తెచ్చి అందులో ఆ మెత్తటి అన్నమును పోసి, దానిపై భాగమున అన్నమును పాలిష్ బండలాగ నున్నగా ఉన్నట్లు తయారు చేస్తారు. ఈ విధంగా చేసిన, తరువాత ఇంటివాకటి కుడిభాగంలో ముగ్గువేసి, ఆవు పేడతో కుదురుచేసి, కుంకుమ పసుపు దాని పై వేసి, ఆ మూకటిని ఆ పేడపై గట్టిగా కదలకుండ కూర్చోబెట్టి, ఆపై గంపను మూసివేస్తారు. సాయంత్రం మూసిన ఆ గంపను, ఉదయం తీస్తారు. ఆ మూకటిలోని అన్నము పై గుర్తులు కనిపిస్తాయి. మనిషి జన్మ ఎత్తిన, పాదం గుర్తు మరి ఏ జన్మనెత్తిన వాటి పాదములు గుర్తులు కనిపించుతవి అనగా పాము, ఆవు, మేక, గొఱ్ఱె, కుక్క పిల్లి, పక్షులు మొదలైనవాటి కాలి పాదములు గుర్తులు కనిపించుతాయి. ఈ గుర్తులను బట్టి వారు ఏ జన్మను ధరించినది చెపుతారు. ఉదాహరణకు మా తాతగారైన కి.శే.శ్రీవసరాంనాయక్ గారు సర్పము జన్మ ఎత్తినారంటారు. అందుకు మా ఇంటిలో పాము రెండు మూడు సార్లు(నాగుపాము) ప్రవేశించిన మేము చంపలేదు. విష సర్పముకావున వేరే వారి చేత చంపించి, దాని నోటిలో పాలు, రాగి నాణ్యం వేసి, దహన సంస్కారము చేయడం జరిగినది. ఈ విధంగా బంజారాలు, పునర్జన్మగూర్చి తెల్సుకుంటారు.



భర్త చనిపోయిన స్త్రీ [illegible] (విధవరాలు)

భర్త చనిపోయిన భార్యకు 3వ రోజు ముత్తైదుతనం తీసి వేస్తాము. ఆ రోజు ముత్తైదువులందరు కలసి స్నానం చేయించి, జడలుఅల్లి నోసటకుంకమ బొట్టు పెట్టి పూలతో అలంకరించుతారు. ఆ తరువాత వితంతవులు వచ్చి ఆమె ''ఘుగరి'' తీసి వేస్తారు. ''చూడ్ర్ బలియా'' పగలకొడతారు. ఆ సమయంలో ఆమె నివారించుటకు చాలా ప్రయత్నం చేస్తుంది. అయిన వాటిని బలవంతంగా తొలగించుతారు. ఆ రోజునుండి ఆమె విధవరాలుగా ప్రకటించబడి, ముత్తైదువులు వేసుకునే ఏ ఆభరణంగాని, దుస్తులను కాని వేసుకోదు. తలకు ''ఘుగరి'' కి బదులు చోట్లా, సాధారణమైన కాలీ( జ్యాకెట్టు) సాధారణమై పేటియా( లంగా) మరియు సాధారణమైన ''ఛాంటియా''(పైట) వేసుకొంటారు.

ఈ విధంగా విధవరాలైన స్త్రీ దుస్తులు ఉండిపోతాయి. బంజారాలలో పెండ్లి కాని యుక్త వయస్సులైన, మగవారు, ఆడవారు చనిపోయిన, దహన సంస్కారం చేయరు మరియు దినం కూడ చేయరు. వారిని భూస్థాపితం మాత్రం చేస్తారు. ఇవి బంజారాలు పాటించే నిర్యాణ కార్యక్రమములు.

# బంజారాలు ఏ ప్రాంతమునకు చెందినా! అభిమానవంతులు

మూడ్. పోమియా నాయక్, కొబ్బరి బొండాలు అమ్ముట, మున్సిపల్ కాంప్లెక్స్ దగ్గర, సాయినగర్, అనంతపురం. ఇతని తండ్రి లక్ష్మానాయక్.యమ్., నాగుల గుడ్డం తాండ. ఈ వ్యక్తి విద్యలేకున్నను జాతి మీద చాలా అభిమానము కలిగి, తను చేయుచున్న కొబ్బరి బొండాల వ్యాపారంతోనే, అందరిని పరిచయం చేసుకొని, బంజారా జాతి గూర్చిన వివరములను, తను కలసిన ప్రతి వ్యక్తిని అడిగి తెలుసుకొంటారు. తనకు తెలసిన విషయములను వారికి తెలియపరుస్తాడు. 7సం. క్రితం యాత్ర రూపములో తమిళనాడులోని గొప్ప గొప్ప దేవాలయములను దర్శించి, అనగా కన్యాకుమారి, రామేశ్వరమును దర్శించి, వెనుక తిరిగి అడవి మార్గమున వస్తున్నప్పుడు అన్నము లేక ఆకలితో ఉన్నప్పుడు, కొండలలో దూరముగా ఒకగ్రామము కనిపించినది. అతడు తన స్నేహితులకు చెప్పి, కొంత దూరములో ఏదో గ్రామము ఉన్నది. వారిని అడిగి బియ్యం పాత్రలు తీసుకొనివస్తాను అని పోయినాడట. అది ఒక బంజారా తాండా. అక్కడ వారిని పరిచయం చేసుకొని, కావలసిన పదార్థములు, పాత్రలు తెచ్చి స్నేహితులకు అన్నపానీయములు గావించి, మా బంజారాలు ఉన్నారు, నేను వారితో పరిచయం చేసుకొని వస్తాను అని పోయినాడు.

అక్కడ గోవులను కాయుచున్న ఒక బంజారా కనిపించి, తన ఇంటికి పిలుచుకొని పోయాడట. తనకోడలుతో( తమిళములో) అన్నం పెట్టమన్నాడట. ఆమె మామకు కంచు పళ్లెములోను, ఇతనికి మూకటి, ముంతలో అన్న పానీయములు వడ్డించినది. నాయనా నీకు మూకటిలో భోజనం పెట్టినందునకు మనస్సు చిన్నపుచ్చుకొన్నావా. నీవు మాంసాహారివి అని తెల్పినందున ఈ విధంగా పెట్టినాము. మేము శివభక్తులము, మాంసాహారులము కాము. మా స్త్రీలు మెడలో శివలింగము ధరించిఉంటారు అని తెల్పినాడు.

ఈ విధంగా చెప్పిన తరువాత, ఆముసలి బంజారా తనకు తెలసిన కొన్ని విషయము తెల్పినాడు. ఆందులో భూమి మొట్ట మొదట పుట్టక, భగవంతుని సృష్టి, స్త్రీలు, పురుషులు పుట్టుక, ఆ తరువాత వాలి, సుగ్రీవుల పుట్టక, వాలి సుగ్రీవులు యుద్ధములు చేయుట, శ్రీరామచంద్రుడు వాలిని సంహరించుట మొదలగునవి.

బంజారా స్త్రీలు, తమ జ్యాకెట్లను ముందు భాగముననే ధరించుకొంటారని, బంజారాలు (గోర్‌వట్) సూర్య వంశమువారని, అందువలన బంజారాలు ఎంత ఎండఉన్నను వట్టి కాళ్లతోనే ప్రయాణం చేస్తారని, వారి స్త్రీలు వంగి పనిచేయునప్పుడు, వీపు మీద గుడ్డ లెకున్నను ఎండ వేడి వారికి ఎక్కువ తగలదని చాలా విషయములు అతని ద్వారా తెలుసుకొన్నానని తెల్పినాడు. బంజారాలు, ఏ ప్రాంతములో ఉన్నను, ఏ భాషా రాష్ట్రములో ఉన్నను, ఆఖరికి తమ గోర్‌భాయి కనిపించుతూనే, ఎక్కడలేని అప్యాయతతో పలకరించి, తమ సొంత ఇంటి వానిగా చూచుకొంటారని, ఆ విధంగా తనను చూచినారని తెల్పినాడు.

ఇతను స్వశక్తి మీద తన జీవితం పోషించుకొంటూ వచ్చాడు. ఇతని మొదటి వ్యాపారము ఇంటింటికి చెరుకులు మోసుకొని పోయి అమ్ముట. దాని యందు విసుగు చెంది, చెఱవులకు పోయి పచ్చి చేపలు తెచ్చి అమ్ముట, తనకు చెరువులోని నీటి తేలు కుట్టుటవలన ఆ వృత్తిని మాని, చెరువులలో పండు దోసకాయలు తెచ్చి అమ్ముట. ఇలాగే కాలం గడుపుచున్న సమయములో ఒక స్నేహితుని ద్వారా కొబ్బరి బొండాల వ్యాపారం సాగించుచున్నాడు. బంజారా భాషలో పాటలు పాడుతాడు.

# బంజారాల-కొన్ని సదాచారములు

బంజారాల సంబంధము రాజపుత్రులతో ప్రారంభమౌతుంది. లేదా హిందూ సాంప్రదాయంతోకావచ్చు. ఈ విషయంలో ఏ మాత్రం సందేహములేదు. ఎందుకనగా ఈ సమాజంలో పాటించబడుచున్న కార్యక్రమములు, ధార్మిక విచారంగాని, వారు పాటించుచున్న పద్ధతులు, విశ్వాసపూరితమైన, ఆర్యసంస్కృతి విషయాలను బట్టి అర్థం అవుతుంది. ఈ ప్రజలు సంచారా జాతి(వ్యాపార కాలంలో) జీవనం సాగిస్తున్నప్పుడు కూడ వారు తమ ధర్మములను విడకుండా వాటిని పాటిస్తూవచ్చారు. వారు ఇప్పుడు కూడ అవే పాటించుచ్చునారు. నేను ఈ చిన్న వ్యాసం ద్వారా మన ఆంధ్రప్రదేశ్‌లో నివశించుచున్న బంజారాలలో పాటించుచున్న పూర్వ ఆచారములు గూర్చి తెల్పుచున్నాను.

**1. నాయక్‌పరంపర :** ఒకటి లేక కొన్ని తాండాలను కలుపుకొంటూ ఒక నాయక్‌ను (రాజు) ఎన్నుకొంటారు. వారు ఆ తాండాలో కాని, ఆ ప్రాంత, తాండాలలో ఏదేని భక్తి భావములు కలిగిన సంతానంనుండి వచ్చిఉండి జ్ఞాని అయిఉండి ప్రజలపై గౌరవము, వారిని అభివృద్ధి పరచే స్వభావం కలిగిప్రజల విశ్వాసమును పొంది యుండవలెను. వారిని తాండా లేక తాండాలనాయకుడుగా ఎన్ను కొన్నపుడు బంజారా గురువుల ద్వారా ఒక ఉత్సవమును ఏర్పాటు చేసి ''నాయకత్వ హోదాను'' కల్పించుతారు.

''నాయక్'' ను ఎన్నుకునే ఉత్సవానికి తాండాలోని పురుషులంతా ఒకచోట సమావేశమవుతారు. గురువు గారు నాయక్‌ను ఎన్నుకొనుచున్న వ్యక్తిని, ''పాగడి'' తలపాగా కడుతారు. ఆ తరువాత వచ్చి వారందరికి విందు చేస్తారు. తాంబూలం, హుక్కా ఇస్తారు. తాండా యొక్క శుభములను కోరువ్యక్తి కనుక ''నాయక్'' అందరి సుఖ- దుఃఖములలో పాల్గొంటూ ఉంటారు. వారిలో వారికి వచ్చే పొట్లాటలను విచారించి న్యాయమును చేస్తూ, తప్పు చేసిన వారిని దండించుతూ, ఇటువంటివి ఇక మీద జరగకూడదు అని శాసించుతూఉంటారు.

**2. అతిథులను ఆదరించుట :** తన తాండాకు వచ్చే అతిథులను అనగా గురువులు, ఢాడీలు, డాలియా మరియు రాజకీయ అధికారులను, సగౌరవంగా ఆహ్వానించి అతిథి మర్యాదలు చేస్తు ఉంటారు. వారు వచ్చిన విషయములను తాండా ప్రజలకు తెలియ పరస్తూ వారిద్వారా తాండాకు జరిగే మేలుగూర్చి, అధ్యాత్మిక విచారణ, దైవభక్తి, జ్ఞానభోద, ప్రజలకు ఆహ్లాదములు కలిగించే సాంస్కృతిక కార్యక్రమములు, ఢాడిలు పాడే భజనలు, గోత్రనామములు, పూర్వంవీరు ఏలిన రాజ్యాలు, రాజుల పరాక్రమములు గూర్చి వారుగాన రూపంలో పాడి ప్రజలను ఆనందపరచుతుంటారు. రాత్రిపూట ఈ కార్య క్రమములన్నియు జరుగుచుంటవి. వచ్చిన అతిథులను ఆదరించి, వారి స్నాన పానాలు, భోజన సౌకర్యములు చేస్తారు. వారికై మాంసాహార భోజనములు ఏర్పాట్లు చేస్తారు. (మేక- గొఱ్ఱె- కోళ్లు) ఎందుకనగా వారు వచ్చే అతిథిని, దైవంతో సమానంగా భావిస్తారు. వారిని ఆనంద పరుచుటలో ఏలోటు రానీయకుండ చూస్తారు. అతిథి కూడ తిరిగిపోయేటప్పుడు ఇంటిలోని ఆడవారికి ఆశీర్వదంచి, వారి యోగ్యానుసారం డబ్బులు ఇస్తారు. ఆ విధంగా ఇచ్చిన దానిని, 'హాత్‌ఘాలేరో' అని అంటారు. అప్పుడువారు అందరి సమ్మతిని తీసుకొని బయలు దేరినపుడు వారు తమ దుఃఖమును ప్రకటించుతూ కంటినిండా నీరు తెచ్చుకుంటారు.

**3. స్త్రీలలో క్రమశిక్షణ :** సంచార జీవితంలో స్త్రీలకు స్కూలు విద్య, జీవితంలో లభించదు. అయినా తమ స్వతంత్ర జీవనం గడుపుట ప్రారంభించుటకు సంచార జీవితమును వదలి, స్థిరనివాసం ఏర్పడిన ఈ రోజులలో స్కూలు విద్యను అభ్యసించటం ప్రారంభించారు. తల్లినుండి బిడ్డకు సంసారం ఎలా నడపాలి అను శిక్షణలభిస్తుంది. రొట్టెలు చేయటం(వంటల వండటం) పిండివిసరటం, దంచటం, ఇంటిలో అన్ని రకాల పనులు చేయటం మొదలగునవి. ఈ కాలంలో పెండ్లి కాని అమ్మాయిలు రొట్టెలు చేయటంలోను, వంటలు చేయటంలోను మంచి ప్రావీణ్యతను సంపాదించుకొంటారు.బంజారా స్త్రీలు వంటలు వండటంలో చాలా జాగ్రత్తగా చేస్తారు. ఏ పదార్థము దుర్వినియోగం కాకుండా చూస్తారు. తల్లి ద్వారా బిడ్డకు ఎటువంటి జ్ఞానం లభిస్తుందో, వాటిలో క్రొత్తగా పెండ్లి అయిన కూతురు, అత్తవారింటిలో ఎలా నడుచుకొనవలయునో ఆ పద్ధతులన్నింటిని నేర్పించుతుంది. వారిని గౌరవించే విధానం గూర్చి నేర్పించుతుంది. వారిని గౌరవించటమే వారి ముఖ్య కర్తవ్యముగా బోధించడం జరుగుతుంది. అత్తమామలకు సేవచేయటం, భర్త అన్న వదినలను(బావా-తోడు కోడలు) ఎలా గౌరవించాలి, మరదళ్ళను, ఆడ బిడ్డలను ఎలా చూచుకొనవలయును అను విషయములను నేర్పించుతూ, ఆదర్శ గృహిణి ఎలా జీవనం సాగించవలయును అను విషయములను తల్లి బిడ్డకు నేర్పించుతుంది. తీరిక సమయములలో తమ గుడ్డలు ఎలా కుట్టుకొనవలసినది అన్నియు నేర్పించుతుంది. ఒక

సంవత్సరంవరకు 'గుంఘట్' తలపై ముసుగు తీయకుండా ఉండవలయును అని నెర్పించుతుంది. శరీరంను ఆరోగ్యంగా ఉంచుతూ శీలవతిగా ఎలా నడుచుకొనవలెయునో నేర్పించుతుంది. ఇంటి గుట్టు ఎప్పుడు బయట పెట్టకూడదు అని బోధించుతుంది. పారంపరికమైన ఆచారములను పాటించుతూ, వాటికి భయపడి పరిగెత్తిరాకూడదు, ఈ విధంగా తల్లిదండ్రుల ద్వారా వారు నేర్చుకొంటారు. అలా నడవకున్న నిన్ను వారు చెడు ప్రవర్తనగల ఆడది అని భావిస్తారు, అత్తమామలకి ప్రతి దినం సేవ చేయవలయును మరియు వారిద్దరి ఆశీర్వాదం పొందుచుండవలయును, ఆవిధంగా సేవచేయటం ఒక వరంగా భావించవలయును.

ఇంటిలోని వంట వార్పులను చేసుకొన్న తరువాత కుట్టుపని చేసుకొనవలయును, విరామ సమయంలో ఆడబిడ్డలతో, మరదులతో, పిల్లలతో కలసిమెలసి వారి ఆనందమును పంచుకొనవలయును. ఇంటిలోని పెద్దలు పండుకొనే ఏర్పాట్లు చేయవలయును, ఈ ఏర్పాట్లు, ఆడబిడ్డలు చిన్న కోడలు( మరదలు) కూడ చేస్తారు. పడుకునే ముందు అత్త, మామగార్ల కాళ్లు పట్టి వారినుండి ఆశీర్వాదం తీసుకొని పండుకొనవలయును. అత్తగారి ఆజ్ఞను తీసుకొని తల్లి దండ్రులు ఇంటికి పోవలెను.

**వివాహం లేక అంతిమ సంస్కారం :** ఈ రెండు విషయములలో బంజారా ప్రజలు తమ విరోధములను మరచి పోయి అందరు ఒకటిగా కలసిపోతారు. ఏ ఇంటిలోనో ఏవరైన చనిపోయిఉంటే, ఆ ఇంటిలోని వారందరికి భోజనం ఏర్పాట్లు చేసి వారిని భోజనం చేయించి, తాపించటం చేస్తారు.

**4. వేరు పటడం :** ఎప్పుడైతే కుటుంబములోని కుమారులు కుమార్తెలు వివాహం అయిపోతుందో, అప్పుడు కొన్ని అనివార్య కారణాలవల్ల ఇంటి పెద్ద తనుసంపాదించిన ఆస్తినంతా పిల్లలకు పంచి ఇవ్వవలసి వచ్చినప్పుడు, తన కుమార్తెలలో పెండ్లి కానివారు నిలబడిపోయిన, వారి పెండ్లి చేయవలసి వస్తుంది. అప్పుడు ఆమె పెండ్లి ఖర్చు ప్రక్కకు తీసి వేస్తారు. తల్లి తండ్రియొక్క ఒక వాటాతీయడం జరుగుతుంది. వారి చిన్న కుమారుడి వాటాతో పాటు పంచడం జరుగుతుంది. ఎందుకనగా వారు చిన్న కుమారుని దగ్గర ఉండుటకే ఇష్టపడతారు. చిన్న కుమారుడి మంచి చెడ్డలు, సక్రమమైన మార్గంలో జీవించుటకు ఈ విధమైన ఏర్పాట్లు చేయటం జరుగుతుంది. తల్లి దండ్రులు నిర్యాణమైన తరువాత వారి వాటా చిన్న కుమారుడే తీసుకొంటారు. కానీ ఈ రోజులలో తల్లిదండ్రులు వారిని ఎవరు బాగా చూస్తారు అను అభిప్రాయండుంటుందోవారి వాటా పంచి ఇస్తారు.

## సుఖాలు

''ఒక కష్టం తరువాత వచ్చే సుఖమే నిజమైన సుఖము,
నిజమైన సుఖాలన్నీ కష్టాలకు అవతలితీరాన వుంటాయి,
నిజమైన సుఖాలు అనుభవించాలంటే ముందుగా కష్టపడాలి,
కృత్రిమమైన సుఖాలు అనుభవిస్తే తరువాత నరకం అనుభవించక తప్పదు.''

# చారిత్రాత్మకమైన బంజారా గురు సమ్మేళనం (గుల్బర్గా)

గుల్బర్గా జిల్లా మరియు దాని పరిసర తాలుకాలు అత్యంత ప్రాచీనమైన పౌరాణికము, ఇతిహాసము, సంస్కృతితో దక్షిణ భారతంలో చరిత్రకెక్కినది. దీనికి సుమారు 2,000 సం.ల ప్రభావము కలిగి ఉన్నది. గుల్బర్గా దక్షిణ భారతములోని ప్రసిద్ధి చెందిన రాజవంశాలు, రాజధానులు, పురాతన కట్టడాలు, మందిరాలు, మసీదులు దానియొక్క చరిత్రను చాటి చెప్పుచున్నది. అటువంటి ప్రాంతములో సాహసవంతులైన గోర్‌మాటి బంజారాలు స్థానికంగా స్థిరపడివారి యొక్క వ్యాపారమును దక్షిణ భారతం అంతటిలో విస్తరింపచేసారు ఈ ప్రాంతములు దర్శించుట విదేశి యాత్రికులను ఆకర్షింపచేస్తున్నది.

పురాతన కాలంనుండి గుల్బర్గా మరియు పరిసరాలలో బంజారాలు వ్యాపార కేంద్రంగా చేసుకొని, బీజాపూర్, మరాట్‌వాడాలకు యుద్ధ సామాగ్రితో పాటు ఆహార పదార్థములను కూడా సరఫరా చేసారు. మరియు అక్కడ మైసూరు రాజ్యం హైదర్ ఆలి, టిప్పు సుల్తాన్‌లకు శ్రీరంగ పట్టణం, హైద్రాబాదు రాజ్యాలకు కూడ తమ వ్యాపారం విస్తరింపచేసారు.

వేరు వేరు విశిష్టతలను కల్గిఉన్న గుల్బర్గా పట్టణములో బంజారాల, స్వాతంత్ర్య సర్ణోత్సవము పురస్కరించుకొని 1997 సం. ఆగస్టు 15వ తారీఖున బంజారా ధార్మక పరిషత్ ఆధ్వర్యంలో బంజారా గురు సమ్మేళనము శాస్త్రోక్తముగా, అతి వైభవముగా బంజారా గురుసమ్మేళమును శ్రీ సేవాలాల్ మరియామాదేవస్థానం ఆవరణంలో ఏర్పాట్లు చేసారు. భక్తి భావములు కలిగిఉన్న ఈ గురు సమ్మేళనమునకు ఎక్కువ సంఖ్యలో గుల్బర్గా మరియు రాయచూర్, బిజాపూర్, బీదర్ జిల్లాలనుండి దూరదూర ప్రాంతలానుండి బెంగుళూరు, మైసూర్ మొదలైన గోర్‌మాటీలు వచ్చారు. ఈ రాష్ట్రములో జరిగిన ఈ సమ్మేళనమునకు ఆహ్వానించబడిన బంజారా ధార్మిక గురువులు, సాదు సంతులు, పూజారులు వేదికను అలంకరించారు. విశేషమేమనగా ఆహ్వానితులలో తిరుమల తిరుపతి దేవస్థానం శ్రీ హాథీరాంబావా మఠం మహంత్‌గారైన శ్రీ అర్జునదాస్ బైరాగి, చక్రవర్తి మహరాజ్ స్వాములవారు కూడా ఈ సమ్మేళనమునకు హజరైనారు. ఈ గురుసమ్మేళనముకై క్రొత్తగా తయారు చేసిన షామియానాతో విశాలమైన మంటపమును ఏర్పాట్లు చేసినారు. ఈ మంటపములో బంజారా భక్తులను ఆహ్వానించినారు. ఎక్కువ సంఖ్యలో మహిళాలు హాజరై, గురువులకు వారి భక్తి విశ్వాసమును ప్రకటించారు.

గురువుగారి పాద పూజలు చేయుటకే ఎక్కువ సమయమును పెట్టించారు. బంజారా భక్తులు ఈ గురు సమ్మేళనం యొక్క ఫలమును, సార్థకం చేసుకొన్నారు. దేశములోనే ప్రథమముగా ఏర్పాట్లు చేసిన ఈగురు సమ్మేళనము బంజారా చరిత్రలోనే అపురూపము. హృదయపూర్వకముగా బంజారాలు, పట్టణ మండలి బంజారేతరులు చాలా కుతూహలంగా హెచ్చు సంఖ్యలో హాజరైనారు. గురువులు భోగ్ కార్యక్రమములో ప్రధానంగా శ్రీ సేవాలాల్

సంగమ బసవస్వామి మొట్టమొదట మంత్రోచ్ఛారణం చేసారు. హోమము చుట్టు గురువులందరు కూర్చొని, నెయ్యి మరియు హోమ పదార్థములు, కర్పూరము, సాంబ్రాణి మొదలగువాటిని సమర్పించారు. యజ్ఞం చేయుచున్న హోమ గుండంలోని అగ్నిదేవుడు ఆకాశమును ఏకం చేస్తున్నట్లుగా కన్పించారు. తరువాత గురువులు ఒక్కొక్కరు మంత్రములు చదువుచూ, ప్రార్థనలు(వీంతి) చేసినారు. శ్రీగురు సేవాలాల్, మరియామా(జగదంబా)లకు మంగళహారతులను ఇచ్చి గురుసమ్మేళనము ప్రారంభమైనది. తరువాత వీరేంద్ర లక్ష్మణ చౌహాన్ మరియు నవశీఢాడిగారు ప్రార్థనలు, భజనలు చేసారు. గురుసమ్మేళన ప్రారంభత్సవమును శ్రీ సేవాలాల్ సంగన బసవస్వామి తమ అమృతహస్తంతో ప్రారంభించారు. పరమ పూజ్య శ్రీమహంతా అర్జునదాస్ బైరాగి చక్రవర్తి మహారాజ్, తిరుమల తిరుపతి దేవస్థాన, హాథీరాం మఠంవారు గురు సమ్మేళనమునకు అధ్యక్షత వహించారు.

సత్య భాషణను బంజారా ధార్మిక పరిషత్ అధ్యక్షులు శ్రీ తారానాథ్ పవార్ చేసారు. పరిచయములను ప్రొఫెసర్ శ్రీ కె.యల్. నాయక్‌గారు గుల్‌బర్గా పట్టణ ఇతిహాసంలో జరుగుతున్న ప్రప్రథమ బంజారా గురు సమ్మేళనము ప్రస్తుత సంధిగ్ధ పరిస్థితులలో చాలా అత్యవసరమని చెప్పుచూ వేదికను అలంకరించిన పెద్దలందరిని పరిచయం చేసారు.

**బంజారాల గురు పరంపరా :** బంజారా, లంబాణి, లంబాడీల గురుపరం పరలు చాలా పురాతనమైనవి. ఈ సమాజంలో ప్రతి శుభకార్యక్రమముగురువు ఆశీర్వాదముతో, గురుపూజలతో జరుగును. ప్రతి ఒక్క బంజారా ప్రథమ పిలుపు మరియు ఉభయ కుశలోపరి, క్షేమ సమాచారములను ''యా గరు భగవాన్, యా గరు, గరుతూ, ఆచో రకాడేస్, ''అని ప్రార్థనలు మొదలు పెడతారు. బంజారాల దినచర్యలలో ఈ విధమైతే, శుభాకార్యములలో పెండ్లి, వడుగు(వదాయి) పండుగ సమయాలలో గురుపూజలు, గురు వందనములతో ప్రారంభించుతారు. మొదట గురుపూజ చేసి, గురువు కానుకను చెల్లించి (గరూర్ రపియా) మిగిలిన కార్యక్రమములు జరుపబడును. పండుగ సమయంలో ''గరూర్ శీణ్ణీ చడా ఏరో'' అనగా దేవునికి నైవేద్యమును(తీపి పదార్థం) ఉంచి పూజిస్తారు.

''గరూర్ భోగ్'' సాంప్రదాయంగా ప్రాచీన కాలంనుండి బంజారా ప్రజలలో వస్తున్న ఒక యజ్ఞం వంటిది. అందులో ''ఓ గురుభోగేమా'' కన్నయ్య(గోపాల కృష్ణుడు) రామ్ సీతా లక్ష్మణేర్ భోగ్‌లాగ రోఛ ''భాయిన్, సగానే'', ''ఆవ్'' అని పిలుస్తారు. అనగా పూజ జరుగుచున్నది. అన్న-తమ్ముళ్ళు, బంధువులు అందరు రండి అని అర్థము, ఈ విధంగా, బాలాజి భోగ్, కంకాళీర్ భోగ్, పూజిస్తున్నాము రండి అని పిలుస్తారు ఆ విధంగా దేవతలను పూజిస్తారు.

దీనిని బట్టి అర్థమైనది ఏమంటే బంజారా సమాజములో మొట్టమొదటి పూజను గురువులకు చెల్లించటం పరిపాటు. ఈ సమాజములో అతిప్రాచీనకాలంనుండి, ఇప్పటివరకు ఆచరిస్తూనే వస్తున్నారు. అనగా సుమారు 40-50 సంవత్సరములకు పూర్వం బంజారా సమాజములో గురువుల ద్వారా పూజలు ఆచరించేవారు. మా చిన్నతనములో తాండాలకు గురువులు వారితో పాటు ఇద్దరు, ముగ్గురు శిష్యులు వస్తుండిరి. వారు ఈ ప్రకారం తాండాలకూ వస్తూ. ఆ తాండా నాయకులకు ఒకటి రెండు రోజులకు ముందే తెల్పిన తాండా జనులు తమ ఇండ్లను శుభ్రపరచి, వారికై సౌకర్యములు కలిగించి తరువాత గురువువారి శిష్యులను భక్తి

భావముతో గౌరవంగా అహ్వానిస్తూ ఉండిరి. ఆ సమయంలో బంజారా భక్తి పాటలు పాడుకొంటూ, నగారా మ్రోగిస్తు, కంచు పళ్లెములు చేతులతో మ్రోగిస్తూ, తాళములు, ఇతర వాద్యములతో వారిని తాండాలోనికి ఆహ్వానించుకొని వస్తుండిరి. అలా వచ్చిన గురువులు రాత్రిపూట వారు నీతి భోదనలు, దైవప్రార్థనలు, నీతి కథలు చెప్పుచుండిరి. ఆ సమయములలో కూడ నగారా, పళ్లెములు, తాళములు మ్రోగిస్తూ భజనలు, ప్రార్థనలు, వీర గాథలు, చెప్పుచుండిరి. ఈ విధంగా ప్రతి తాండా ఒకటి, రెండు రోజులుండి మిగిలిన తాండాలకు పోవుచుండిరి.

గురువులు ఉన్నన్ని రోజులు తాండా ప్రజలు వారిని భక్తి భావముతోఉండి మధ్యపానం, మాంసాహారం చేయకుండా నిష్ఠతోఉంటారు.

ఈ విధంగా గురుపరంపరలు అభివృద్ధి చెందుచుండెను. బంజారా ప్రజలలో 40-50 సం తరువాత ఇవి అన్నియు మాయమైనవి. దీని కారణమును ఆలోచించవలసి ఉన్నది. దీనికి కారణం, కాలం మార్పు ఒక్కటైతే, సమాజంలో వచ్చిన మార్పులు మరొకటి, దానికి తోడు ప్రజలలో బీదరికం మరియు దారిద్ర్యం, నిరాశ, నిస్పృహలే కారణములు. కారణములు ఏమైనప్పటికిని బంజారా సమాజంలో గురు పరంపరలు, హీనదశకు రాకుండా ఉండిఉన్న బాగుండేది.

ఆదికాలం నుండి బంజారాల సమాజములో గురుపరంపరలను కాపాడుకొంటూ వచ్చి ఏవో కారణాల వలన మధ్యలో కొంతవరకు ఆటంకంకలిగిన, ఎంతో కాలం ఈ విధంగా ఉండకూడదు. దీనిని గురించి బుద్ధివంతులైన మనము ఆలోచించవలయును. చింతించవలయును. గురుపరంపరను మొదటినుండి ఆచరిస్తూ వచ్చినా కొన్ని ధర్మాలు మేల్కొని, సంఘటితమై వారివారి సమాజపు రూపురేకలను, సరిదిద్దుకొని ఎంతో అభివృద్ధి చెందుచున్నారు. గురుపరంపరలను, ఉపయోగించకుండా, మన బంజారాలు చేతులు ముడుచుకొని కూర్చున్నారు ఎందుకు?

పూర్వం మనలో రాంజీసాద్, లోకామసంద్, టేపా మసంద్, హాథీరాం బావా, అనువారు, ప్రయాగ మహారాజ్( హాథీరాం మఠం) లింగామసంద్, ఉకామసంద్, శామాల్యమ సంద్, రత్నామసంద్, దూదమసంద్, సామామసంద్, మూనామసంద్ అను మఠాధిపతులు, బాణా భగత్, డేసామళాణా భగత్, చంపా భగత్, జెరామ్యా భగత్, భాయా భగత్, హాంజీసాద్ భగత్ వీరంతా మంచి పేరు సంపాదించారు.

ఈ మధ్యకాలంలో అంటే 18వ శతాబ్దంలో గురు సేవాలాల్, నేను ఈశ్వర్‌లాల్ సాద్(మహారాష్ట్ర) మరియు ఇప్పటి శ్రీహాథీరాం బావా మఠం, యొక్క పరమ పూజ్య శ్రీ అర్జునదాస్ బైరాగి చక్రవర్తి, పరమపూజ్య శ్రీసేవాలాల్ దేవస్థాన శ్రీ బైరాగి రామారావు మహారాజ్ పోహరాదేవి. (మహారాష్ట్ర)పరమ పూజ్య శ్రీ సేవాలాల్ సంగన బసవస్వామీజీ, సేవాలాల్ మఠం చెన్నగిరి; పరమ పూజ్య శ్రీ పర్వతలింగ పరమేశ్వర మహారాజ్, సోమలగుట్ట, చెడసూర్, పరమ పూజ్య శ్రీ ముద్దలింగేశ్వర హనుమప్ప స్వామి కల్లహళ్లి, కనకపుర, పరమ పూజ్య శ్రీ జయసింగ్ మహారాజ్ మతిగళ నాగని, పరమ పూజ్య శ్రీ బలిరాం మహారాజ్ గొబ్బర వాడి, పరమపూజ్య శ్రీ హావానేశ్వర మహారాజ్, గుబ్బరవాడి, పరమ పూజ్య శ్రీ బద్దూసింగ్

మహారాజ్, హరనగరే, పరమ పూజ్య శివాజీ మహారాజ్ బీజాపూర్, పరప పూజ్య శ్రీ ఝూంప్రసాద్ హుణసగి, పరమపూజ్య శ్రీ సిద్ధలింగన దేవరం, చిత్తరిగి మహాంత్ మఠము, ఇళకల్ బాదామి, సురగొండన కొప్ప పరమపూజ్య శ్రీ మహాంత్‌సింగ్ మహారాజ్ మరియు పరమ పూజ్య శ్రీ చన్నప్ప మాస్టర్, సన్యాసి, మాతా పరమేశ్వరి( ధోళి) మొదలగువారు తమ తనువును మనస్సు, సర్వస్వమును ధారపోసి బంజారా సమాజమునకు అర్పించారు.

ఇప్పుడు పైతెల్పిన వారందరికి మన అందరి సహాకారం మరియు సహాయం కావలయును. ఇప్పుడు మనము గడిచిపోయిన గురుపరంపరలు వ్యాప్తి చెందిచుటకు, జిల్లాలు మరియు తాలుకాలలో గురు మఠములను స్థాపించుటకు సహకరించవలయును. ఇందుమూలంగా మన ప్రజలలో ఐకమత్యము, న్యాయం, ధర్మం మొదలగు మానవాభివృద్ధికి తోడ్పడునట్టుగా, బంజారా సమాజమును నైతికంగాను, సామాజికంగాను, సాంస్కృతికంగాను అభివృద్ధి పరచుటకు తోడ్పడవలెను.

ఎప్పుడైతే ప్రజలలో నైతిక భావము తగ్గునో మానవ సమాజము అధోగతి పాలౌను. అలాంటప్పుడు భగవంతుడు యుగపురుషులను, సాధు సంతులను, ఋషులను మానవ రూపంలో భూమి పైకి పంపిన జనకళ్యాణం కలుగును. ఈ రూపంలోనే ప్రస్తుతం సాధుసంతుల ద్వారా ఇప్పటి ప్రజలను సన్మార్గములో నడిపించుటకు మనము చేయవలసిన ముఖ్యకర్తవ్యము.

అదే విధంగా బంజారా సమాజములోని ప్రజలను దైవభక్తిని ప్రేరేపించుటకు, మన బంజారా సమాజములోని పెద్దలందరు ఈ విషయమును గ్రహించి, అందరు సహకరించిన ఎడల, ఎటువంటి ఇబ్బందులనైనను ఎదిరించి, బంజారాల నైతిక, ధార్మిక విలువలను కాపాడుటకు కొన్ని నెలల ముందు బంజారా ధార్మిక పరిషత్తులను వేదికలను, సాంఘిక పరంగా రిజిస్టరు చేయించడం జరిగినది. ఈ సందర్భమును ప్రజలకు తెలియపరచుటకుగాను చాలా సంతోషించుచున్నాము. కొందరు సభ్యులతో ప్రారంభమైన ఈ ధార్మిక పరిషత్తును రాష్ట్రము మరియు దేశమంతటను వ్యాపింపచేయుటకు రాష్ట్రాలవారి సభ్యులను చేర్చుకొనటం జరుగును. ఈ సంస్థరాజకీయ సంబంధమైనది కాదు, కేవలం బంజారాల ధర్మం, సంస్కృతి, కళ, సాహిత్యం, భాష, లిపి మొదలగువాటిని అభివృద్ధి పరచుటకు ఈ సంస్థ పాటుపడును. మరియు తిరుమల తిరుపతి దేవస్థానములోని, హాథీరాంబావా మఠము బంజారా సమాజమునకు చెందినది. దానిని అభివృద్ధిపరచుటకు పాటుపడవలయును. వేరు సమాజములు నడుపుచున్న విధంగా, బంజారా సమాజములోని జగత్ గురువులు, మఠాధిపతులు, సాధుసంతులు, బంజారా ధర్మం, సాహితి, సంస్కృతి, కళ భాషభివృద్ధికి వాటిపై ప్రతి ఒక్కరు ఈ విషయం గూర్చి బంజారాలకు తెలియపరచవలెను. బంజారా సమాజమును, ధార్మిక పునాదులపై నిర్మించవలయును. మహారాష్ట్రమునకు చెందిన పోహరాదేవి భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి మఠం ఎలాగైతే జగత్ విఖ్యాతి గాంచినదో. అదేమాదిరిగా కర్ణాటకలోను, ఆంధ్రప్రదేశ్‌లోను దర్శనీయులైన జగత్‌గురువులను ఏర్పరచుకొనవలయును.

అందుకొరకే చిత్రదుర్గములో గల జగత్ గురు సేవాలాల్ మఠం వారు చెన్నగిరి తాలూకాలోని, శాంతి సాగర్‌కు దగ్గరలోఉన్న ప్రభుత్వాధీనంలోఉన్న సుమారు 200ఎకర ములుగల భూమిని మఠం ఉపయోగంకొరకు అడగటం జరిగినది. అందుకు

ప్రభుత్వం కేవలం 40 ఎకరములు మంజూరు చేయటం జరిగినది. ఇందులో మొత్తం దేశం కొరకు బంజారా జగత్‌గురువులకు మఠమును, ఉద్యానవనములను, ధార్మిక, సామాజిక కార్యముల కొరకై ఉపయోగించవలయును. అందరి హితము కొరకు చిత్రదుర్గ మఠం జగత్‌గురువులు శ్రీమురుగ రాజేంద్ర స్వాములవారైన శ్రీ సేవాలాల్ సంగన బసవస్వామిని స్థాపించుటకు సువిశాలమైన మనోభావములు కలిగిఉన్నారు. శ్రీయుతులు బంజారా జనోద్ధారణకై పునర్జన్మవెత్తివచ్చిన వారుగా అగుపించుచున్నారు.

రాష్ట్రాలలో గల బంజారా ధార్మిక శ్రేయస్సు కోరి, చతురతతో వాటి అభివృద్ధికి అన్ని రాష్ట్రలలో యోగ్యులైన గురువులను ఎన్నుకొనుట ఎంతో అవసరము. అదియు బంజారా గురు సమ్మేళనములలోనే నిర్ధారించవలయును. అదే విధంగా ఆంధ్రప్రదేశ్‌లోని అనంతపురం జిల్లా గుత్తితాలుకాలో ''ఝుమరీ రెఝాల్'' ప్రాంతంలోని శ్రీ భగవాన్ సేవాలాల్ బాలబ్రహ్మచారి జన్మించిన స్థలంలోపై చెప్పినట్లుగానే ఒక బంజారా మఠమును శ్రీ జగత్‌గురు పోహరా దేవి, సేవాలాల్ మఠం అధిపతి శ్రీ రామారావు మహారాజ్‌గారి ఆధిపత్యంలో ఇక్కడ ఒక ధార్మిక సంస్థను స్థాపించి, దాని అభివృద్ధికి ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, మహారాష్ట్ర బంజారాలు పూనుకొని ఇటు ప్రజల ద్వారాను, ప్రభుత్వం ద్వారాను సహాయములను పొంది ఇక్కడ కూడ ఒక సేవాలాల్ మహారాజ్ మఠం స్థాపించి, ధార్మిక, సాంస్కృతిక, సాంఘిక, వైజ్ఞానిక, కళ మొదలైన సంస్థలను స్థాపించి, మొత్తం భారతంలోని బంజారాల నైతిక ధర్మమును అభివృద్ధిపరచుటకు ఒక మార్గమును కనుగొనవలయును అని ఆశించుతాను. అన్ని సమాజములతో పాటు, బంజారా సమాజం కూడ తనదైన ధార్మిక నిలయములను నిర్మించి, భద్రమైన పునాదులపై నిర్మింపచేసి దానియొక్క ఉపయోగములను బంజారా ప్రజలతో పాటు సమస్త జనులు లాభమును పొందవలయునని నా అభిప్రాయం.

# బంజారాల దేవతలు–పండుగలు

## దశరా పండుగ–దశరావ్

దశరా చూడటానికి ఒక పండుగలాగా అనిపిస్తుంది. కాని దశరాలో ఎన్నో విషయాలుకలసి ఉన్నవి. ఎలాగనగా గ్రామములోని నదిఒడ్డున ఇసుక దిబ్బ జమ అవుతుంది. రెండవ సంవత్సరం దానిపై ఒక పొర ఏర్పడుతుంది. అలాగే మూడవ సంవత్సరం ఈ విధంగా పొరల మీద పొరలుగా ఏర్పడి ఒక గడ్డలాగా ఏర్పడుతుంది. ఇదే విధంగానే దశరాపండుగలో అనేకమైన కథలుదాగి ఉన్నవి. ఈ అన్ని కథలు పరాక్రమములను మరియు వారివారి విజయములు గూర్చి తెల్పడం జరిగినది. విజయము యొక్క అర్థం, జయించుట. అందువలన దశరా యొక్క మరియొక పేరు విజయదశమి అని కూడ అంటారు. ఇది ఆశ్వీజం నెలలో వస్తుంది, అనగా సెప్టెంబరు లేక అక్టోబరు నెలలో వస్తుంది. నవరాత్రులు అయిన పదవ రోజు ఈ పండుగను చేసుకొంటారు.

చెప్పటం ఏమనగా ఒకసారి రాజారఘుగారు మొత్తం ప్రపంచమును జయించి, జగత్‌జిత్ పేరుగల ఒక యక్షరాజుకు, మొత్తం భూమండలమును దానం క్రింద ఇచ్చి వేసారు. ఒక రాగ్గిపైసా కూడ వారు తనదగ్గర ఉంచుకోలేదు. ఎప్పుడు వారు తమసర్వస్వమును దానం క్రింద ఇచ్చి వేసారో అప్పుడు ఒక ఋషీశ్వరుడు రాజారఘు దర్బారులోనికి వచ్చారు. శిష్యుడు అప్పటికి తన విద్యను పూర్తి చేసుకొని ఉన్నాడు. వారు గురుదక్షిణగా, గురువు గారికి పద్నాల్గు కోట్ల రూపాయలు దక్షిణ క్రింద ఇవ్వవలయునని అన్నాడు. కాని రాజారఘు వద్ద ఒక చిల్లిగవ్వకూడా లేకుండా ఉండెను. ఇంటికి వచ్చిన ఋషికుమారుని, వారు వట్టి చేతులతో పంపటం ఇష్టంలేకుండా ఉండెను. అందుకను రాజారఘు స్వర్గలోకం పై దండెత్తినారు. వారికి స్వర్గలోకంలో విజయం లభించినది. వారు జయించిన ధనమంతయు తెచ్చి ఋషి కుమారుల ముందుఉంచారు.

ఋషి కుమారుడు చెప్పారు!

రాజుగారు! ఇంత ధనం తీసుకొని నేను ఏమి చేయుదును. నాకు మాత్రం గురుదక్షిణ కొరకు కేవలం పద్నాల్గు కోట్ల రూపాయలు మాత్రం కావలయును. దీని కంటే ఎక్కువ ఒకపైసాకూడ అవసరం లేదు.

అప్పుడు రాజారఘుగారు అన్నారు!

కాని నేను ఈ మొత్తం ధనమును తమరికి ఇచ్చుటకే నిశ్చయించుకొన్నాను. దానం క్రింద ఇచ్చియున్న ధనములో ఒకపైసా కూడ నేను నావద్ద ఉంచుకోలేను.

ఋషి కుమారుడు పద్నాల్గు కోట్ల రూపాయలు తీసుకొని వెళ్లి పోయాడు. రాజా రఘుగారు మిగిలియున్న రూపాయలను తీసుకొని నగరమునకు బయట ఒక మైదానములో పంపించి, ఒక చాటతో మొత్తం బీదలకు మరియు అంగహీనులకు ఇచ్చివేసారు.

రాజారఘుగారు స్వర్గములోకమును విజయదశమినాడు జయించిఉండెను. ఆ విజయము యొక్క జ్ఞాపకార్థంగా విజయదశమి పండుగును జరుపుకొనుచున్నారు. ఈ రోజులలో కూడ గ్రామ ప్రజలు, దశరా రోజుననే గ్రామ సరిహద్దును దాటి, ఒక మైదానంలో చేరుకొంటారు. అక్కడినుండి జమ్మిచెట్టు ఆకులను తీసుకొనివస్తారు. దీనిని రాజారఘుగారు పోసిన ధనరాసిని లూటిచేసిన ఒకే జ్ఞాపకార్థం.

కాలం గడచిన కొంత కాలమునకు రాజారఘుగారి కులంలోనే శ్రీరామచంద్రుడు జన్మించారు. వారు కూడ దశమి రోజుననే రావణునిపై విజయమును పొందారు. అందువలన శ్రీరాముని జ్ఞాపకార్థం కూడ విజయదశమి పండుగ చేయుచున్నారు. ఈ రోజులలో కూడ దశరా సందర్భములో, రావణుడు, మేఘనాథుడు, కుంభకర్ణుడువారి దిష్టి బొమ్మలను తగలబెట్టుచున్నారు. ఇది శ్రీరాముని విజయమును జ్ఞాపకం చేస్తున్నది.

దశరా రోజుకు పంటలు వేసి నాల్గవ మాసం పూర్తి అయి ఉంటుంది. వర్షముల కారణంగా అక్కడక్కడ మిగిలిఉన్న పనులను దశరాపండుగనుండి తిరిగి ప్రారంభిస్తారు. పూర్వకాలంలో రాజులు, శత్రువులను జయించుటకు యుద్ధమును ప్రకటించుచుండిరి. వ్యాపారస్తులు, తమ ఎడ్లబండ్లను నింపుకొని వ్యాపారమునకై ప్రయాణించుచుండిరి. దాని

జ్ఞాపకార్థంగా ఈ రోజులలో కూడ మొత్తం భారతంలో దశరా దినములో తమ తమ శక్తిని ప్రదర్శించుటకు వినోదముగా రకరకాల ప్రదర్శనలను చేస్తుంటారు. కత్తి యుద్ధం, ముష్టియుద్ధం, కుస్తీలు, గుఱ్ఱం పందెములు మొదలైనవి చేస్తుంటారు.

ఈ విధంగా దశరా నిజంగానే విజయమునకు గుర్తుగా చేసుకొంటారు. మన పూర్వీకుల మాదిరిగానే మనం కూడ మనస్సులో స్థానం చేసుకొని ఉన్న లోభము మరియు అహంకారమును పాగొట్టుకొని, ఆ విధంగానే మన విరోధుల మనస్సులు కూడ విజయము సంపాదించవలయునని ప్రార్థించుదము. జమ్మి ఆకులను లూటి చేసే బదులు, రండి మనం కూడ పుష్పములను పంచుదాము. గ్రామ హద్దులను దాటి పోయే బదులు, రండి మనమంతా విజయదశమి రోజునుండి చేయిచేయి కలిపి ఒక అడగు ముందుకు వేసి గ్రామ అభివృద్ధికి దేశాభివృద్ధికి పాటు పడదాం.

**బంజారాల–దశరావ్ :** బంజారాలు దశరా పండుగ బదులు, దశరావ్ పండుగ ఎక్కువ చేస్తారు. వీరు ఎక్కువగా శక్తి పూజలు చేస్తారు. కావున ఈ పండుగలో శక్తిని కూర్చుండబెట్టి పూజలు చేస్తారు. ఈ పండుగ చేయుటగు వీరికి తిథి, నక్షత్రములు అవసరం లేదు. వీరు తలచుకొన్నప్పుడు అనగా గ్రామం మొత్తం మాట్లాడుకొని వారికి అనుకూలమున్నప్పుడు ఈ పండుగను చేసుకొంటారు. వారు పండుగ చేసుకొనే ముందు అనగా 15 రోజులు ముందుగానే తమకు సంబంధించిన బంధువులందరిని పిలిచి వస్తారు. ఫలానా మంగళవారం నాడు దశరావ్ చేస్తున్నాము, తప్పుకుండా రావలయునని పిలిచివస్తారు. ఈ పండగకు, అన్నదమ్ములు, దూర ప్రాంతంలోఉన్నవారు, అత్తమామలు, బావమరదులు, చెల్లెండ్లవారి భర్తలు, బిడ్డలు, అల్లుళ్ళు, తల్లి తరుపు బంధువులు, తండ్రి తరపున బంధువులు, వారికి సంబంధిచిన ప్రతిబంధువును పిలుస్తారు. ఆపండగకు కావలసిన యాటలు, గొర్రె, పొట్టేలు, మేకపోతులు ముందుగానే కొంటారు లేక వారు సొంతంగానే రెండు మూడు సంవత్సరములనుండి తమ మేకలలో గొర్రెలలో సాకుకొన్నవి ఉంటవి. ఆ పండుగకు కావలసిన క్రొత్త బట్టలు, చిల్లర సరకులు అన్నియు ముందుగా జమచేసిఉంటారు. ఒక్కొక్క ఇంటికి సుమారు 5నుండి 10లేక 15,20మందివరకు బంధువులు వచ్చి ఉంటారు.

వీరు శక్తి పూజలు ఏవి చేసినను ఒక మంగళవారం రోజు మాత్రమే చేస్తారు. ఈ పండుగ రెండు మూడు రోజులు కూడ జరుగుతుంది. ఆ పండుగకు బంధువులు చాలామంది వచ్చిఉంటారు. కావున ఆ రోజులలో తాండాలలో జాతర జరిగినట్లు, మిఠాయి అంగళ్ళు, ఆడవాళ్లకు సంబంధించిన రకరకాల వస్తువుల అంగళ్ళు, పండ్ల అంగళ్లు కాఫి హోటళ్లు మరియు చిరుతిండ్లుకు సంబంధించిన అంగళ్లు అనేకం వెలుస్తాయి. కొన్ని ఊర్లలో సుమారు వారం రోజులు కూడ ఉంటవి.

ప్రతి ఇంటకి రెండు లేకు మూడు యాటలు కోస్తారు. మంగళవారం మధ్యాహ్నం నుండి పూజలు ప్రారంభిస్తారు. మొత్తం ఇండ్లకు సున్నం కొడతారు. పూరిండ్లు ఉన్న ఎర్రమట్టితో అలికి, మధ్య మధ్యలో సున్నం పట్టీలు తీసిఉంటారు. మొత్తం ఇండ్ల సామానులు శుభ్రం చేస్తారు. అందరు స్నానాలు చేసి క్రొత్త బట్టలు ధరించుతారు. తమ ఇండ్లను పేడతో శుభ్రంగా అలికి, ఇంటిముందు రకరకాల ముగ్గులు వేస్తారు.

ఇంటి వాకిలి కుడిపంచ దగ్గర తమతమ దేవతలను ప్రతిష్ఠించుతారు. జండాలు కడతారు. ఒక్కొక్క వంశంవారు ఒక్కొక్క దేవతను పూజిస్తారు, కాళి, కంకాళి, తొలజ, దండమారి( గుడి పూజ) మరియామా, ఈ విధంగా చాలా పేర్లతోవారు కొలుస్తారు. దేవతలను ప్రతిష్ఠించేటప్పుడు, గోనెసంచితో చేసిన ఒక మడతను అక్కడ ఉంచి, దానికి ''కటారి'' (పిడిబాకు) ఆనించి పూజిస్తారు. ఇది ప్రతి ఇంటిలోఉంటుంది. అది చూచుటకు ముందు భాగంలో వెడల్పుగా కొద్దిగా పదునైనదిగా ఉండి, పిడికిలిలో పట్టుకొనుటకు వెనక ''యూ'' ఆకారంలో ఇనుపకడ్డీలు ఉండి, వ్రేళ్లతో గట్టిగా పట్టుకొనుటకు చేసి ఉంటారు. దానిని, నిలువుగా ఆనించి, బొట్టు పెడతారు. ముగ్గు వేసిన మధ్యలో దీపం, తాంబూలం, కొబ్బరికాయలు అన్ని ఉంచుతారు. ఈ విధంగా అన్ని ఏర్పాట్లు చేసుకొన్న తరువాత యాటలు తీసుకొనివస్తారు.

ఈ యాటలు, తమ తమ అన్న దమ్ములందరు కలసి ఒకే చోట చేస్తారు. అనగా 3లేక 5కుటుంబాలవారు, ఇంకా ఎక్కువ కుటుంబాలవారు కూడ తమ పూర్వీకుల ఇండ్లముందు చేస్తారు. బంజారాలు క్షత్రియ వర్ణం కావున వీరు యాటలను నరకుటయే వీరికి ఇష్టము. దీనికి ముందు అందరు చుట్టు నిలబడి తమయొక్క కోరికలను చెప్పుకుంటూ మ్రొక్కుతు పసుపు కుంకుమ బొట్టుపెట్టి వాటిపై నీళ్ళు చల్లుతారు. అది తన ఒళ్లు జలదరించిన దేవత కరుణించినది అంటారు. కొన్ని నీళ్ల చల్లకనే జలదరించిన వారు ''సూక్‌ధడి దీనిచ'' అంటారు. జలదిరించుటకు మునుపు వారు ''ధడి ధడి దీనిచ'' అంటారు. అప్పుడు యాటలను బలిఇచ్చి, వాటి తలలను దేవత దగ్గర ఉంచుతారు. ఆ తలను కూడ వరం అడుగుతారు. అది కూడ నోరు తెరచిన, దేవత కరుణించినది అంటారు. ఈ విధంగా మొత్తం యాటలను, తాండా మొత్తం, వారి ఇండ్ల ముందు పూజలు చేస్తారు. నైవేద్యంగా పప్పు ఎముకలు, కొన్ని పొట్ట ప్రేగులు, ఊపిరితిత్తులు, కొంత మాంసం మొత్తం కలిపి ''ఫెరేర్‌బోటి'' అని వండుతారు. దీనిలో ఏ మసాల వేయరు. కొంత ఉప్పు, కారం, పసుపు మాత్రం వేస్తారు. మరియు పాయసం బియ్యంతో పాలు నెయ్యి వేసివండుతారు. మొత్తం వంట అయిన తరువాత అక్కడ పూజచేయుటకు వచ్చిన వారంతా, పాయసం వండిన మాంసంతో పాటు పప్పు ఎముకలు, కాల్చిన కాలేయం దేవతకు నైవేద్యంగా ఉంచుతారు. వారి వారి మొక్కుబడి ప్రకారం, కొబ్బరికాయలు, తాంబూలం సాంబ్రాణి మొదలైనవి తెచ్చి పెడతారు. పొయ్యిలో కాల్చిన అగ్గి నిప్పులను ముందు పోస్తారు.

ఈ విధంగా పూజకు సిద్ధం అయిన తరువాత అందరు అర్థచంద్రాకారంగా, మగవారు, ఆడవారు, పిల్లలు వచ్చిన బంధువులు అందరు జమ అయి పూజిస్తారు. కొబ్బరికాయలను కొట్టి, అక్కడ ఉంచిన, మాంసం ముక్కలు, పాయసం తీసుకొని, చేతిలో నెయ్యి తీసుకొని, వాటిని అగ్గిలో ఉంచుతూ పైనుండి నేతిని పోస్తారు. ఈ విధంగా మూడుసార్లు పూజిస్తారు. ఆ తరువాత చెంబులోఉన్న నీళ్లను కుడిప్రక్క మూడుసార్లు, ఎడమ ప్రక్క రెండు సార్లు చేతితో వదులుతారు. ఇది అయిన తరువాత పూజారితోపాటు అందరు నిలబడి ''వింతి'' అనగా ప్రార్థన చేస్తారు. తమ తమ కష్టసుఖములను చెప్పుకుంటు, తమ గృహము, మనుష్యులు. గోవులు, చిన్న జీవాలు, పంట పొలాల గూర్చి, తమ వ్యాపారం గూర్చి తమ పెద్దల గూర్చి తాండా గూర్చి అన్నింటిని చెప్పుకొంటూ ప్రార్థించి ఆఖరులో అందరూ కలసి రెండు చేతులు జోడించి ''యామారి యాడి సాయబణి, సాయివేస్'' అని వంగి తమ చేతులను నేలకు ఆనించుతూ మూడుసార్లు మ్రొక్కుకుంటారు. ఆ తరువాత అందరు వరసగా కూర్చున్న,

అందరికి అక్కడ ఉంచిఉన్న ప్రసాదం పాయసం , మాంసపు ముక్కలు, కాల్చిన కాలేయముక్కలు, పంచి ప్రసాదం కళ్లకు అద్దుకొని తింటారు. అక్కడితో పూజా కార్యక్రమము అయిపోతుంది.

ఆ తరువాత ప్రతి ఇంటిలోను అన్నం, రొట్టెలు, మాంసం వండుకొని సంతృప్తిగా భోజనం చేస్తారు. పెద్దలు, మధ్యపానం కూడ చేస్తారు. ఆవిధంగా అందరి భోజనములు అయిన తరువాత తాండా మొత్తం ఎవరి ఇంటి ముందు వారు, మంచి వెన్నెలలో ఆడవారు పాటలు పాడుకొంటూ ఆనందంగా డ్యాన్సులు చేస్తు ఆనందించుకుంటారు. మగవాళ్లు ఆ పూజ స్థలంలో భోగి మంటలు వేసి, నగారా, తాళములు, కంచు పళ్లెములు తీసుకొని దేవిని గూర్చిన పాటలు పాడి ప్రార్థించుతారు. అలాగే మొత్తం రాత్రి తెల్లవారేవరకు తాండామొత్తం ఆనందోత్సాహాలతో పాటలు, డ్యాన్సులు, తమ పూర్వికుల చరిత్రలను గానం చేస్తూ ఆనందించుతారు. ఈ విధంగా ఆ రాత్రి గడచి పోతుంది.

రెండవ రోజువారు తిరిగి భోజన కార్యక్రమములు మొదలు పెడతారు. ఆడవారు ఇంటిలో భోజన సౌకర్యములు ఏర్పాట్లు చేస్తుంటే మగవారు తమఇంటి పనులు చేసుకొంటూ, తమకు సంబంధించిన, బంధువులను, స్నేహితులను పిలుచుకొనివచ్చి వారికి భోజన సౌకర్యంతో పాటు, మధుపానం చేయిస్తూ వారి కుటుంబ సమస్యలు మాట్లాడుకుంటు, పెండ్లి కావలసిన పిల్లలుఉన్నవారి బంధుత్వం గూర్చి మాట్లాడుకుంటూ వారి సంబంధాలను కుదుర్చుకొంటూ ఉంటారు. ఆడవారు కూడ ఇంటింటికి పోయి వారికి కావలసిన వారిని, స్నేహితురాళ్ళను పిలుచుకొనివచ్చి వారికి భోజన ఎర్పాట్లు చేస్తారు. ఈ భోజనాలు ముగించిన తరువాత కొంత మంది స్వర్గస్తులైన తమ తల్లిదండ్రులను పూజించుటకుగాను పూజా కార్యక్రమములు చేపట్టుతారు( గోట్). మరి కొంత మంది మంత్రాలమ్మ, మరి కొంత మంది దేవతలను పూజించుటకు కార్యక్రమములు మొదలు పెడతారు. ఈ రోజు కూడ వీరు మంగళవారం( ముందు రోజు) పూజా కార్యక్రమంలాగానే యాటలు కొట్టి పాయసం నైవేద్యం పెట్టి పై విధంగానే పూజా కార్యక్రమం చేస్తారు. ఇక సాయంత్రం తాండాలోని ఆడవారంతా, తమ తమ పిల్లలతో, బంధువులతో పాటు తాండాలో ఏర్పాట్లు చేసిన మిఠాయి కొట్లు మరి ఇతరములైన వాటిని వారు, వారిపిల్లలు, వారి బంధువులకు కొనిపెట్టుట వారికి వీరు, వీరికి వారు కొని పెట్టుట మొదలైన కార్యక్రమములు సాగిస్తారు. ఆ రాత్రి కూడ అదే విధంగా భోజనాలు, మధుపానం చేసి ఆనందించుతారు. కొన్ని తాండాలలో ఈ రోజులలో కొంత మంది యువకులు రామాయణ, భారతంలోని కొన్ని నాటకములు, చెంచునాటకములు ప్రదర్శించి ప్రజలను రంజింప చేస్తారు. కొన్ని సాంస్కృతిక కార్యక్రమాలు కూడ చేపడుతారు. కోలాటం, జడ కోలాటం కూడ చేస్తారు.

ఇక మూడవ రోజు వచ్చిన బంధువులు ఒక్కొక్కరు బయలు దేరి వారి గ్రామములకు చేరుకొంటారు. ఇతర తాండా ప్రజలు, వారి వారి బంధువుల గూర్చి ఆ రెండు రోజులు సాగిన కాల గమనమును గూర్చి, మాట్లాడుకొంటూ నిన్న ఇల్లు సందడిగా ఉండెను, ఈ రోజు ఇల్లు అంతా నిశ్శబ్దంగా ఉన్నది అని తలంచుకొంటూ ఉండి పోతారు. ఈ విధంగా బంజారాలు తమ దశరావ్ పండుగలు జరుపుకొంటారు.

# మత్రాల్‌యాడి పూజ

బంజారాలు తమ బిడారులను, తమ గోవులను కాచుకొంటూ, నెల్లూరు జిల్లాలోఉన్న కాలంలో, మూడ్ భీమానాయక్‌గార్కి ఒక కుమార్తె జన్మిస్తుంది. ఆమె పేరు మంత్రిబాయి ఈమె చిన్నప్పటినుండి దైవభక్తురాలు, మంత్రిబాయికి పెద్ద అమ్మవారు వచ్చినది. ఆ అమ్మవారు కారణంగా మంత్రిబాయి చనిపోయినది. ఆమెను అక్కడే భూస్థాపితం చేసారు. బంజారాలలో పెండ్లికాని వారికి దహనం చేయరు. భూ స్థాపితం చేస్తారు.

అలా మంత్రిబాయిని భూస్థాపితం చేసిన తరువాత వారివారి తాండా ప్రజలు గోవులను మేపు కొంటూ, నల్లమల అడవులకు చేరుకొని, వారి తాండాలను నిర్మించుకొని ఉంటారు.

కొద్ది రోజుల తరువాత మంత్రిబాయి సమాధి నుండి లేస్తుంది. అక్కడ ఆమెకు ఎవరు కనిపించరు. తమ వారు ఎక్కడ వెళ్లారని ఆమె అక్కడ ప్రజలను అడుగుతూ, బంజారాలు ఉన్న నల్లమల అడవులకు చేరుకుంటుంది. అక్కడ కొచ్చి వారి తండ్రితో చెప్పింది. నేను నీ కుమార్తె మంత్రిబాయి అని, ఆమెను ఎవ్వరు నమ్మరు. తాండా వాళ్లంతా ఇది ఏదో దయ్యమైనట్లుంది. నల్ల అమ్మవారు వచ్చి చనిపోయిన అమ్మాయిని మనము మన చేతులతోనే భూస్థాపితం చేసి వచ్చినాము. చనిపోయిన వారు తిరిగి లేచినాను అని చెప్పుట, మేము నమ్ముట, బాగున్నది మనలను పిచ్చి వాళ్లను చేస్తున్నది అని, ఆమెను నమ్మకుండా, అవహేళన చేస్తారు.

అప్పుడు దైవస్వరూపమైన మంత్రిబాయి ఆగ్రహించి, మీ గోవులన్నియు మాయమైపోవుగాక మీరందరు మూర్ఛిల్లుదురుగాక అని శపిస్తుంది. వెంటనే గోవులన్నియు కనిపించకుండా పోతాయి. ప్రజలంతా మూర్ఛిల్లి కట్టెలాగా ఉండిపోతారు. అప్పుడు వారిలో కొంత మంది, ఆమె చెప్పిన నిజాలను, నమ్మగలిగినవారు మాత్రమే మూర్ఛపోకుండ ఉంటారు. వారు, ఆమె పాదాలపై పడి తల్లి ఈ మూర్ఖులను క్షమించు, నిన్ను మా దేవతగా తరతరాల ప్రజల చేత పూజించబడునట్లుగా వేడుకొంటున్నాము. మా గోసంపదను, మా వాళ్లను అందరిని క్షమించి మమ్ములను కాపాడుము అని ప్రార్థిస్తారు.

అప్పుడు మత్రాల్ యాడి, కరుణించి, మూర్ఛపోయిన వారినందరిని బ్రతికించి, గోమందలు అన్నింటిని, తిరిగితాండాలకు వచ్చునట్లుగా చేసినది. ఈ మహాత్యమును చూచిన బంజారాలు, మత్రాల్‌యాడి అని ఆమెను పూజిస్తారు. మత్రాల్‌యాడి పుట్టుక నల్లమల అడవులని బంజారాలు చెప్పుతారు. నల్లమల అడవులలో ఆమెను ఇప్పటికీ పూజిస్తున్నారు. పిల్లలు లేని వారు ఆమెను పూజించగా జన్మించిన పిల్లలకు మత్రూ అని, మత్రి అని పేరు పెట్టుకొంటారు.

ప్రతి తాండాలోను, ప్రతి కుటుంబంవారు, మత్రాల్‌యాడిని పూజిస్తారు. తాండా బయట, చిగరమాను క్రింద, పొడుగాటి రాళ్లను, సైజువారిగా, ఏడురాళ్లు నిలబెట్టి వాటి ఎదురుగా ఒకరాయని ఉంచి, వాటిని శుభ్రం చేసి, పసుపు కుంకుములు వ్రాసి బొట్టు పెట్టి, నేతితో అభిషేకిస్తారు. బంజారాలకు, ఏ కష్టమొచ్చిన, ఆరోగ్యం సరిగా లేకపోయినా, అమ్మవారు, కలరలాంటివివచ్చి అనారోగ్యం కలిగినా, తమ గోవులు పోగొట్టుకొనిన, వాటికి ఏదైన వ్యాధివచ్చిన మత్రాల్‌యాడిని మ్రొక్కుకుంటారు.

ప్రతి సంవత్సరం పూజలు చేస్తారు. బిడ్డలు కలగని స్త్రీలు ఉపవాసముఉండి, భక్తితో పూజించి, ప్రసాదంను తీసుకొంటారు. ఆ విధంగా జన్మించిన పిల్లల పేర్లను, మత్రి అని, మత్రూ అని పేరు పెట్టుకొంటారు. పిల్లలకు పుట్టువెంట్రుకలు తీసేటప్పుడు అమ్మవారికి మేక పోతులను నరికి, ఉత్సవమును జరిపి, నైవేద్యం పెట్టి తలనీలాలు సమర్పిస్తారు. ఇది మత్రాల్‌యాడి గూర్చిన చరిత్ర.

# హోళి పండుగ

బంజారా- భాషలో అనేక రూపాలలో వ్రాయబడిన(చెప్పబడిన) హోలి పాటలు(లేంగి) కామోద్రేకమైన పాటలు మరియు ప్రశ్నోత్తరాలు- మొదలగునవి.

## హోలి శ్లోకము :

స్వర్గలోకసే ఆయీ-మృత్యు లోక సమాయీ !
గయరహ మహినా గవత్ రహి - తీన్ దనామా ఆయీ !
రంగ ఛటేన కలబత్ - కబ్ కబ్ ఛబరే మాయీ !
మర్ బర్ జోలి నారల్ ఫర్ ఛబరే మాయీ !

## పాగ్(పాట) :

లదే ఆవరే సహేరే బీచ్ బణజారా లదే ఆవరే!
బంజారా కే బైల్ చర్‌రే హవ్రూలా ! ధుమ్
అనో బంజారా కో భూక్ లగతా హై ! పిలి ఝు కాన ఏక కూణ చాలీ ! (1)
లదే ఆవరే సహరే బీచ్ బణజారా ! లదే ఆవరే !
చడ చడ బొడిరాణి వాట డర్ జాఏ। ఉట్ ఉట్ రాజా ఆయో బణజారా.
బణజారాకే బైల్ ఖోబరా । లదే ఆవరే (2)
తో బణజారాకో నింద్ లగతాహై !। పలింగ రలావ్ రలావ్ ఏక సోమా బాలి.
లదే ఆవరే సహేర్ బీచ్ బణజారా! లదే ఆవరే! (3)

## హోలి బహత్ మహిత్యఛ : సవాల్ – జవాబ్.

1. ప్రశ్న : ఫహలి హోలి కత్ బలిచ? కూణ బాలోచ ?
   జ : భాదర్ బండా సతే నసాణ, సత్‌వీస్ భూక్యా హోలి బాలే.
2. ప్రశ్న : హోలి మలకేర్ నామ్ కాయిఛ?
   జ : హోలిరి మలకేర్ నామ్ మనమథ కామాఛ !.
3. ప్రశ్న : హోలి బాపేర్ నామ్ కాయి ఛ?
   జ : హోలిరి భాపేర్ నామ్ ఘంగా హిరణ్యా కు డుఛ !
4. ప్రశ్న : హోలిరి భతిజేర్ నామ్ కాయి ఛ?
   జ : హోలిర్ భతిజేర్ నామ్ ప్రహల్లాద్ ఛ !.

5. ప్రశ్న : గోరూామా ధూండికత్ పేద వోఛ ?
జ : హోలిర్ గోదేమా ప్రహల్లాద్ హోతోతో హోలిర్ భతిజ్ ప్రహల్లాద్ ఛ !

కామబలగి కరన్ హోలీన్ హాగ్. ఖభర్ సామలన్ హోలి జకో. హోలికో ఔర్ భతిజే, ప్రహల్లాదేన గోదేమా ఘాలన్ హోలిజకో సార్ దేవలో-కూన్, గాళి దేతానిన్ చలి ఆయి: జత్ హోలీజకో ఔర్ భతిజేన, కేలగే, హోలి బల్ తోరి దేవ బాల వోరి కాంకేమాయి బేటా కసేన్ బలియేతూ కరన్ హోలిర్ ఝూల్ లగ జాన్ దేవలోక దాటనబిన్ ఏక రుమాలేమా, పాణిమా భీజన్ లాయె, హామ్ రుమాల్ విలా దేరే అగల్‌బగల్‌వాట్ దినే !

హోలిర్ అగల్ బగల్ వెరామె భిరన్ తోబి,
సమాజేన్, సారి దేవలోక లకడి గొలా కిదే, ఏక్
టోకర్(బాంబు) ఆడో ఏకడన్ లకడి వజాఏ
పేదాహువోఛ!। జనాతి సువాలి చార్ ఖండమోలా
ఛ, ఫగ వతేతి పేదాహుఏ ఛ.!

6. ప్రశ్న : హోలిర్‌దన్ దండేరో రఫియా క్యూదఛ?
జ : దాసూ ఖోలా భూకియా సారి గొణయాన్ కేమ లేకి మత్
మత్ జావో దాండి కాటన్ లావో ! గోన్ మా దాండి చళేగే.
ఖేతెమా జాన్ దేకతో అరేండేర్ ఝూడ్‌భరేతే, గేలియా సారే
ఖేత్ కతో సారిఖేత్ కాటనాకే ! దేకన్ ఖోలార్ ఘర ఆయే
దస్ నాయక్, తారో గోరియా సారీ ఆరెండేర్ ఖేత్ కాట్
నాకే ! ఎరో దండనా కాయిదోచోకరన్ ఏడలిదే, వోదో నష్ట
హజార్ పరన్ తాను దాండేరో రపియా దేను కరన్ లాగా దినే,
ఓ దాడేతి హర్ హోలిమా దాండేరో రపియా నాయకేన్ దేనూ,

**హోలీ చాలా మహత్యం కలది :** బంజారాలు హోలి పండగను చాలా శ్రద్ధా భక్తులతో చేస్తారు. పూర్వం హిరణ్యకశిపుడు శ్రీమన్ నారాయణునితో విరోధంపెంచుకొని మొత్తం దేవతలను హింసిస్తూ ఉంటాడు. శ్రీమన్ నారాయణుని అంశంతో హిరణ్య కశిపునకు ప్రహ్లాదుడు జన్మిస్తాడు. పుట్టుక నుండి ప్రహ్లాదుడు శ్రీమన్ నారాయణుని భక్తుడు అయినందు వలన, అతనిని నానా రకాలుగా హింసిస్తాడు. అయినా తన నోటినుండి నారాయణ శబ్దమును మానడు. అప్పుడు హిరణ్య కశిపుడు ప్రహ్లాదుడుని అగ్నికి ఆహుతి చేయనిశ్చయించుతాడు. అప్పుడు బంజారాలు పై చెప్పిన హోలి శ్లోకమును పాడుతారు.

హోలి స్వర్గలోకమునుండి వచ్చి మృత్యు లోకమునకు పోయినది. హోలి సామాన్యంగా మాఘ పాల్గుణ మాసాలలో వస్తుంది. హోలి మూడు రోజులలో వచ్చినది అని చెపుతారు. బంజారాలు హోలిర్ పాక్ అంటారు. అనగా చంద్రుడుమొదటి రోజా కనపడినప్పటినుండి పౌర్ణమి వరకు మొత్తం 15రోజులు మంచి ఆనందంతో, ఆటపాటలతో రాత్రి వెన్నెలలను అనుభవిస్తూ మగవారు ఒకప్రక్క, ఆడవారు ఒకప్రక్క పాటలు పాడుకొంటూ, డ్యాన్సులు, భజనలు చేస్తారు. మధ్య మధ్యలో స్త్రీలను తమ గుంపులోనికి తీసుకొని వచ్చి,

పుత్ర సంతానం కలగవలయునని ఆశీర్వదించుతారు. కామోద్రేకములైన పాటలను పాడుకొంటూ ఉంటారు. ఈ విధంగా మొత్తం 15 రోజుల వెన్నెలను అనభవిస్తూ కాలం గడపుతారు.

## హోలి గూర్చి కొన్ని ప్రశ్నలు – జవాబులు

1. ప్రశ్న : మొదటి హోలి మంట ఎక్కడ వేసినారు? దానిని మొదట ఎవరు కాల్చినారు?
   జ : మొదటి హోలి బాదర్ బండా – సతేనాసాన్, సతా ఈస్ పాడా భుక్యా కాల్చినారు. (రాథోడ్ వంశంవారు)
2. ప్రశ్న : హోలి ప్రాంతము(దేశము) పేరు ఏమిటి?
   జ : హోలి ప్రాంతము పేరు, మదన కామము.
3. ప్రశ్న : హోలి తండ్రి పేరు ఏమి?
   జ : హోలి తండ్రి పేరు ఘంగా హిరణ్యాక్షుడు.
4. ప్రశ్న : హోలి మేనల్లుడి పేరు ఏమిటి?
   జ : హోలి మేనల్లుడి పేరు ప్రహ్లాదుడు.
5. ప్రశ్న : హోలి గోరూమా(బంజారాలలో)వెతికి చెప్పు, ఎక్కడ పుట్టాడు.
   జ : హోలి మంటలు కాల్చినప్పుడు హోలి ఒడిలో ప్రహ్లాదుడు కూర్చోనిఉన్నాడు. హోలి కాలి బూడిద అయినది. కాని ప్రహ్లాదుడు తిరిగి జన్మించాడు అని అంటారు.

హోలి ఒడిలో కూర్చున్న ప్రహ్లాదుని తీసుకోని హోలి దేవలోకమునకు పోయి, దేవతలందరిని తిట్టి దేవలోకమునుండి తిరిగి వచ్చినది. హోలి మంటలో కూర్చున్నది. మంటలలో కూర్చున్న హోలి ప్రహ్లాదునికి మంటలు తగలకుండా దేవలోకమునకు పోయి, రుమాలు తీసుకొని, దానిని తడపి మంటలు తగల కుండునట్లు రుమాలు ప్రహ్లాదునికి కప్పినది అంటారు. దేవలోకములోని వారంతా కట్టెలు పోగుచేసి, అందులో మండు స్వభావంగల ఒక గంప మందు పోసి, అంటించిరి. ఆ మంటలకు వెలుతురు మొత్తం వ్యాపించినది. హోలి కాలి పోయినది.

హోలి వసంతోత్సవ పర్వము భారతీయ సంస్కృతిలో తరతరాలుగా వస్తున్న, అన్నిటికన్నా ఎక్కువ ప్రజాదరణ పొందిన పండుగ, ఉదార స్వభావము మరియు ఉత్సాహము, ఉల్లాసమును కల్గించు పండుగ, ఆధ్యాత్మికమైన చింతనతో ప్రతి ఒక్కరు సమావేశమై, తమలో దాగిఉన్న ఈర్ష్య, ద్వేషాలను మరచిపోయి కలిసేటట్లు చేస్తుంది. ఇతరములైన ఏ పండుగలలోనూ మానవులు ఇలా కలవరు. ఈ విధమైన ప్రజాదరణ, ఉదారత్వము మరియు మనస్సులో ఉల్లాసము, ఇందులోని రహస్యము. ప్రాచీన కాలమునుండి వస్తున్న ఆధ్యాత్మికము, మరియు ప్రాచీనత్వము ఇందులో మనకు కనిపిస్తుంది. హోలి పండగకును, ఇతర పండుగలకు మధ్య ఎంతో తేడా మనకు కనుపిస్తుంది. ఈ పండుగలలో దైవచింతన అన్నిటికన్న చాలా తక్కువ కనిపిస్తుంది. దీనికి బదులు మానవుని యొక్క కర్తవ్యమును ఈ పండుగ బోధిస్తున్నది.

ఫాల్గుణ మాసం, శుక్లపక్షం, పౌర్ణిమ రోజున హోలి. ఈ హోలి పండుగలో అక్కడక్కడ హోలిని కాల్చటం జరుగుతుంది. (భారతీయులు చెప్పటం బట్టి చూస్తే 1773 పూర్వం 34) మధ్య కాలంలో పద్మాకరన్ ప్రోత్సాహం ద్వారా హోలి కాల్చారు అని

చెప్పబడుచున్నది.(రత్నావళి పు.115) సూరదాసు వ్రాసిన పద్యంలో 15 రోజుల పాటు హోలి ఆడవలయునని చెప్పిఉన్నారు. (సూరసాగర్ ధశమ ఖండములో పు. 2914) మరియు భజనిధిలో(భజినిద్ గ్రంథం పు.163) ఫాల్గుణ మాసంలో ఎందుకు చేయవలయునో, దాని మహాత్యమును వర్ణన చేసి ఉన్నారు. ఈ పండుగ వెనుక ఎన్నో రకాల రహస్యములు దాగి ఉన్నవని తెల్పడం జరిగినది. ఒక ముఖ్యమైన కథని చెప్పడం జరిగినది. ఈ రోజుననే హిరణ్యకశిపుడు తన చెల్లెలు హోలి వడిలో ప్రహ్లాదుని కూర్చోబెట్టి కాల్చి వేయటానికి నిశ్చయించాడు. అప్పటినుండి హోలిని కాల్చివేసి, ప్రహ్లాదుని చిరంజీవి రూపంలో ఈ పండుగను చేస్తున్నారు. హోలి పాటలలో రాధా – కృష్ణులను హోలి వర్ణనలు విశేషంగాఉండి, హోలి మీద అసభ్యకరమైన పాటలు( కామోద్రేకమును కలిగించు) పాడటం జరుగుచున్నది.

హోలిలో ఆడుకుంటూ పాడే పాటలు స్త్రీ పురుషుల కంఠమునుండి అపశ్రుతులను పలుకుతూ వసంత ఉన్మాదమును రెట్టింపు చేస్తుంది. హోలి యొక్క ప్రధానమైన విషయం రాధా–కృష్ణలు మరియు గోపబాలురు – బాలికలు హోలి ఆడటం. అందులో అబీర్, గులాల్ మరియు పిచకారిలతో పరస్పరం చల్లుకోవడం జరుగుతుంది. ఈ పాటలలో శృంగారం యొక్క ప్రాధాన్యత ఉంటుంది. దీనితో పాటు ప్రకృతి మనోహరమైన వర్ణనలు చేయడం జరుగుతుంది. హోలి మనోహరమైన మరియు ఉత్సాహకరమైన పండుగ. ఇక్కడ ఈ పాటలలో ఒక ప్రత్యేకమైన కామవాంఛ గోచరిస్తుంది. అయితే ఈ పాటలలో ఎప్పుడు ఒక ఉత్సాహము, ఉల్లాసము మరియు కోరికల యొక్క ఆశ కనిపిస్తూంది. అదే వేరే వారి హృదయం కదిలించే సంఘటనలు, విరహ వేదనను కలుగచేస్తు ఒకరినొకరు అంకితమై పోతారు. హోలి పండుగ అన్నిటి కన్న భిన్నమైనది. ఇందులో నృత్యము, పాటలు అధికము. ఇందులో జానపద సంగీతం కూడ కలసి ఉంది. హోలి పండుగను సుందరమైన సుమధురమైనదిగా చేస్తుంది. ధర్మశాస్త్రములు, లేక సాహిత్య గ్రంథములలో వసంత్సోవముల వర్ణనలు చేయడం జరిగినది. అందులో మధనుని కామమును గూర్చి తెల్పడం జరిగినది. అది కూడ సమయము – సంతోషంతో హోలి పండగలో పాడుకునే పాటలతోకలిసి పోయినది. హోలి ఉత్సవము అహ్లాదమును, వసంతోత్సవమును మరియు అశ్లీలత యొక్క ప్రాచీన కామోత్సవముతో కలగి ఉన్నది.

బంజారాలలో వసంతోత్సవము, హోలి రూపంలో ఉట్టిపడుతుంది. వీరు ఈ పండుగను చాలా గొప్పగా ఆనందోత్సాహముతో చేస్తారు. మరియు వంశపారంపర్యంగా వస్తున్న విశేషమైన ఆచారములను పాటించడం జరుగుతుంది. ఈ హోలి పండుగ రోజులలో, నగారాతప్పట్లు, తాళాలు మరియు కరతాళ ధ్వనుల మధ్య పాడుకుంటు వారి మనస్సులు మయూర నాట్యం చేస్తాయి.

బంజారాలు కూడ తోటి సమాజముతో పాటు ఫాల్గుణమాసం, పౌర్ణమినాడు మధ్యాహ్నం తరువాత సాయంత్రం కాలంలో హోలిని కాల్చి పూజిస్తారు.

బంజారాలు తమ తాండా చుట్టు ప్రక్కల అరణ్యముల నుండి ఎండు కట్టెలను ప్రతి ఒక్కరు పోగు చేసి తాండాకు దగ్గరలో ఉన్న మైదానములో ప్రోగు చేస్తారు. హోలి దహన కామక్రియ చేయుటకు అగు ఖర్చులను బంజారాలు, తమ తాండా చుట్టుప్రక్క ఉన్న గ్రామాలకు పోయి వారికి తెలిసిన వారి దగ్గర చందాలు వసూలు చేసుకొని వస్తారు. ఈ కార్యమును చేపట్టిన

వారిని(కామదేవుని పూజ)కామ పూజారి అంటారు. మధ్యలో కామమంట వేసి నాలుగు ప్రక్కలనుండి స్త్రీ - పురుషులు, తమ చేతులను పట్టుకొని, గుండ్రముగా ఏర్పడి హృదయోత్సాహంతో కామోద్రేకమైన పాటలు పాడి పాడి తమ భావాలను పొందు పరచుతూ నృత్యం చేస్తారు. ఈ అహ్లాదకరమైన, వాతావరణములో గేరియా(వివాహము కాని బాలురు) మరియు గేరణి (అవివాహితులైన ఆడపిల్లలు) తమ ప్రియమైన పెండ్లి కొడుకుతో పాటు లేంగి నృత్యం చేస్తూ - చేస్తూ మనస్సులో ఆనంద పరవళ్ళు త్రొక్కుతూ పాటలు పాడుతారు. మరియు ఒకరిపై ఒకరు రంగులను వెదచల్లుకొంటారు. ఆనంద పరవశులై పోతారు. ఇదే సమయంలో పాటలు, నృత్యం చేసుకొంటూనే మరది-వదినలు వరుసలతో ఒకరి నొకరు ప్రేమతో కొట్టుకోవటం కూడ చేస్తారు. ఈ నృత్యముల యొక్క భావము మనకు రాధా-మాధవ్(కృష్ణ) మరియు గోపబాలురూ-గోప బాలికల కామదహన నృత్యములతో పోల్చబడినది. గోకులంలో హోలి ఉత్సవంలో స్త్రీలు-పురుషులు వేరు వేరుగా ఏర్పడి పోతారు, గోపికల ద్వారా-కృష్ణుని స్నేహితులపై వెదురు కట్టెలను తీసుకొని కొట్టడం గురించి చెప్పడం జరిగినది.

బంజారాలలో హోలి పక్షంలో దినవంతావారు నృత్యములు-పాటలు పాడుకొంటూనే ఉంటారు. వీరు పాడుకొనే(లేంగి) కామ పాటలలో తరతరములైన పాటలు చాలా తక్కువగాఉన్నవి. వీరిలో అనుభవజ్ఞులైన పెద్దలు పాడే పాటలు చాలా సుందర వర్ణనలు కలిగిఉంటవి. వీరు పాటలు పాడే కన్న, ఒకరిపై ఒకరు చేసే సంవాదనలు, చాలా సంక్షిప్తంగాను, తర్కము మరియు మర్మమును కలిగి ఉంటాయి. అప్పుడప్పుడు వీటిలో హాస్యం కూడ కలసి ఉంటుంది. వీటిలో ఒక పాటను ఇక్కడ ఉదహరించుచున్నాను.

అను భాయి రే !
అనూ భోజియాన్ కాళిగ కాళి రాత్ రే
అసోత్ జల్మేర్ కాళీ అమావసర
మా ఏరో హటకో, భోజియా నహి మానో
బాపెరో హటక్కో, భోజియా నహి మానో
ఉన్ తిలడిన్ భీడ్ తురక్ భీక్ తడకియా !
ఉన్ ఛీంకేరో హటకో రక బావణేరే బేషలి !
ఉన్ తికి తికోనూ గటలేర్ భేజియారే బేషనో !
ఉన్ భోజయేయాన్ హక్‌ల్ తలిర్ భావన్ బడ్డుదియా
ఉన్ గోపాలరి బరబి రక్ సోసో ఫందణ బావోరే.
ఛుపి ఛుపి ఝణి రేతిమ్ బసే సాళూ సోబియా
నరమ్ లగ్‌చేర్ చలా ఝాణి ।
బాండి- తూండే గావడివ్ చోడ్‌సాళా సోబియే !
సాళా సోబియా వారు మళావ్ దరాదూరే చాల్ ।
బాండి- తూండి గోరణిన్ చోడ్ సాళా సేబియా ।
సాళా సోబియా వే భూరియా వాళిరే సాన్ !
మేరేతో సా సాత్ మారే బాప్ చార్ సోబియా ।

హోలి పండగ సందర్భములో పాడిన వీటిని వర్ణించిన, చెప్పిన ఈ పాటలు వారి యొక్క భాషలో బంధం మరియు భావముయొక్క సంబంధము అత్యంత వాత్సల్యముతో పాటు, తియ్యదనమును కలిగిఉంటుంది. ఈ పాటలు ఇలాఉంటాయి, ప్రేమ, కరుణ, వైరాగ్యం మొదలైన మనోవికారములతో పాటు రంగులతో సంపూర్ణత మరియు విశ్వములోని నవరసాలు, వాతావరణముతో సంబంధం, అత్మల యొక్క మనోరంజనము కలిగిస్తుంది.

బంజారా జానపద పాటలలో ప్రజా కవులు తమ కంఠములనుండి వెలువడు పాటలు, సంగీతము ప్రజా జీవితములోని విభిన్న రంగులలో చిత్రీకరణ చేస్తూఉండిరి. ఆనాటి దైవభక్తులు అనేక రకాల జ్ఞాన బోధనలను చేసిఉన్నారు. ఈ పాటలలో భక్తి భావనలను, ఎక్కువగా వెల్లడించడం జరిగినది. శ్రీరాముడు, శ్రీ కృష్ణుడు, సీత, పార్వతి వారితో పాటు బాలాజి (శ్రీ వెంకటేశ్వర స్వామి) సేవాలాల్ వారితోపాటు అవతార పురుషుల గురించి కూడ(లేంగి) హోలి పాటలలో కూడ ఉత్తమ స్థానమును కల్పించి ఉన్నారు. సేవాలాల్‌పై పాడిన ఒక పాటను చూస్తాము.

అసి నంగరిమా సేవాలాల్ బేరాజోరే! ।
మార్ ఝుడవేరి దేవేరి! దరమేరి జయబోలో లచమణ బాలాజి ।
ఆప్ నగరిమా సేవా సూఖా బేరజగే ।
మార ఝుడవేరి దేవహి, చరమెరి జయబోలో లచమణ బాలాజి ।
అసి నంగరేమా హేలా నాయక్ వేరజగే ।
మార ఝుడ నాయకేరి సత్‌వేరి జయబోలో లచమణ బాలాజి !
ఆసి నంగరేమా తులజా భాయి వరాజి
మార ఝుడవేర దేవేర, ధరమేరి జయబోలో లచమణ బాలాజి !

ఈ పాటలలో మధుర సంగీతం, వీరి యొక్క శ్రమ జీవనము ఉట్టి పడునట్లుగా, గోచరిస్తుంది.

దీపావళి పండుగ చేసుకొన్న తరువాత బంజారాలు లదణి వ్యాపారమునకై దూరదూర ప్రదేశాలకు వెళుతుంటారు. పరదేశాలకు పోయిన బంజారా యువకుడు తన విరహ వేదనను ఈ విధంగా అభినయిస్తాడు(చెప్పుకొంటాడు).

లోకతో సుగిన్ చాలె తాండూ హరద్ ఆవరె !
తాండే మాయిర్ ఛోరి సపనేమా ఫరీ రే
కసో కరియారే ।
కసో కరియారే ।
కసో కరియార మిటాయి రో పూడా దియారే ।

**అర్థము :** ప్రజలు పంటలు కోయుటకు పోవుచున్నారు. నాకు నా తాండా గుర్తుకు వస్తున్నది. ఏమి చేయాలి. మిఠాయి పొట్లం తీసుకొన్నాను. దీనిని ఎలా పంపించేది. అని తనలో తాను విరహ వేదన చెందుతాడు.

లేంగి పాటలు పాడటానికి, ఒక విధమైన ఆనందాన్ని వారు అనుభవిస్తారు. లేంగి పాటలు పాడేటప్పుడు నగారా, డప్పులు, తాళములు తీసుకొని రాత్రి వెన్నెలలో వారు ఒక చోట గుమిగూడతారు. పాటలు పాడుతారు. వాటిలో అప్పుడప్పుడు కథలను కూడా పాడుతారు ఈవిధంగా.

అది పేర రాతేరో ఝుగడే తోమాచి
మాచే తో సారి ఏక రాత్
బటేవు దోలా రాజేర్, రాజో రాజో రేహుసి గోర్ !
గమణి డోలా రాజార్ ।।।। ధూ॥c॥
మాయా మనావే బాప్ మనావే నగరిర్ లోకా 1 ।భాయి!

భాయి భాయి రో మనవే నగరిర్ లోక లోకా
భాయి భాయి రే మనవే నగరి రోలోక్
మాయా బణావే కోరితో లాపసి
బేనడా వరసావతోధి ।2। భాయి !

రిసతో తిసతో కోనిమానే ఛోలా
ఏకదో వనేరితో పాటి ।3। భాయి !

జాజో పచమణజాజో ।4। భాయి !

అబద్‌నగర మతజో
ఆబద్ నగరరి లావతో లోచడీ
ధడి ఏకలియా బలమాన్ ।5। భాయి !

అంగ దేకతో నోనడా హుబిచ
కేద మారో దోలరి ఖబర్ ।6। భాయి !

లకూతో ఆవలకు తోజావ
కేరి కేరి రాకూ వోలకా ।7। భాయి !

లాల్ కుసుమల్ ఒరి పగతో వహియ
కాందేప్ ఆడో రుమాల్ ।8। భాయి !

**భావము(అర్థము)** : అర్ధరాత్రి సమయంలో పోట్లాట(యుద్ధం) అయినది. రాత్రి అంతా జరిగినది. పోట్లాడిపోయేవో స్నేహితుడా, బంజారా(గోర్) నీవు నిలచిపో నేను మన్నిస్తున్నాను. నా తండ్రి మరియు నా తాండా ప్రజలు కూడ మన్నిస్తారు. నా తల్లి ఖీరు మరియు పాయసము వండినది. అందులో నా చెల్లి నెయ్యి పోసినది. అయినావారు వినలేదు. కోపముతో, అగ్నిలాగా మారి, స్వాభిమాని అయిన బంజారా అగ్ని అంటుకొన్న వనములా వెళ్లి పోయాడు. ఓ పోవుచున్న యువకుడా తూర్పుదిక్కుగా పోతూ మరియు పడమర వైపు కూడా పోవలయును. అయితే విజయం సాధించిన ఊరిని కూడ మరచిపోవద్దు ! స్వాతంత్రం పొందిన ఊరియొక్క బంజారా యువకులు నిన్ను అపహాస్యం చేసేను. లక్షలతో వస్తుంది, లక్షలతో పోతుంది. వాటిని లెక్క చేయకు వాటిని భుజముపై వేసుకొన్న రుమాలులాగా భావిస్తాను, నేను ఎవరెవరిని

గుర్తించుకొందును. నా పై క్రోధమును పెంచుకొన్న ఓ ప్రియమైన స్నేహితుడా నిన్ను నేను ఏ విధంగా మన్నించగలను, వారు చాలా గొప్ప(పెద్ద) కాంతివంతుడైన సుందర యువకుడు. అతని రుమాలు ఎర్రటి పూలతో మెరస్తున్నది మరియు అతని భుజములపై రుమాలు పడి ఉన్నది.

ఈ విధంగా వారువారి(లేంగి) పాటలలో వర్ణనలు చేస్తున్నారు.

సేవాలాల్‌పై హోలి పాట.
అగలా బగలా పరకోట్ భరే
భాయూర్ దేవల్ భాందేచ
దేవళేమా సేవాభాయి భేటోరే
సత్తేరే టికో లగోచ ।1।

జమణి బాజప్ కువా వావడిరే
గంగా నీర్ భరిచ
డావ వడలి హరియా బాగ్ చరే
జాయి మోగరా ఫూల్‌చ ।2।

సామూ సమనక్ తోళారామ్ భరే
ఓపర ఝుండా ఝూలచ ।3।

అర్థము : నాల్గు ప్రక్కల ఎత్తైన గోడలు ఉన్నవి. అందులో మందిరమును కట్టిఉన్నారు. ఆ మందిరంలో సేవాలాల్ దేవుడు ఉన్నాడు. అతని నొసట బొట్టు దిద్దబడి ఉన్నది. మందిరం కుడిచేయి ప్రక్క బావి ఉన్నది. గంగా జలముతో నిండిఉన్నది. ఎడమ చేయి ప్రక్క పచ్చని చెట్లతో నిండియున్న తోట(తోపు) ఉన్నది. అందులో మొగలి పువ్వులు పూస్తూన్నవి. మందిరం ముందు భాగములో శ్రీ సేవాదాస్ భగవంతుని గుఱ్ఱము, తోళారాం గారి విగ్రహం ఉన్నది. మందిరం పై శ్రీసేవాదాస్ భగవానుని జెండా ఎగురుచున్నది.

బంజారా సమాజములో అందరు కలసిఉండే ఒక గొప్పతనాన్ని నిరూపించారు. ఏకతా గూర్చిన లేంగి పాటను చూడండి.

జయ మతరో వంత్ గోకుల్ నగరియే
గడ మందలో ఘూమే మచియా హోలి

అర్థం : ఎక్కడ ఏకత ఉంటుందో, ఆచోట సముద్రంలాంటి గోకులం ఉంటుంది. ఈ విధమైన సమైక్యత పైనే మేమంతా (గడ) కోట(తాండా)లాగా బలమైనా వ్యక్తులుగా హోలి పండగ యొక్క ఆనందాన్ని ఆనుభవిస్తున్నాము.

అప్పటినుండి బంజారాలు హోలి పండుగను చాలా ఉల్లాసముతో, ఉత్సాహముతో, ఆనందముతో చేసుకొంటారు. హోలి మంటలు వేయుట జరుగుతుంది అని నిశ్చియించుకొన్న ఆ మంటలలో పోవువాడు ఎవరు అని నిర్ణయిస్తారు. అలా నిర్ధారించబడిన వ్యక్తి, సత్ శీలుడు,

పెండ్లి కానివాడు(కుమారో) అయి ఉండాలి. ఈ యువకుడు, ఈ పక్షం అనగా చంద్రుడు కన్పించిన రోజునుండి నిండు పౌర్ణమివరకు రోజు స్నాన పానాలు చేస్తు పూజలు ఉపవాస దీక్షకు పూనుకోవాలి, ప్రతి రోజు ఒక పూట మాత్రం భోజనం చేయవలయును.

హోలి పండుగ ముందురోజులలో బంజారా స్త్రీలు ఇండ్లముందర, పిండి వంటలు అనగా నేతితో చేయబడినవి, అరిసెలు మొదలగునవి, చేస్తున్నప్పుడు వాటిని కాలే కాలే నెయ్యి నుండి తీసి తింటారు అని బంజారాలు చెప్పుకొంటారు. ఆవిధంగా చేసినా వారికి ఆ కాలే నెయ్యి ప్రభావం ఉండదు అంటారు. హోలి సామాన్యంగా ఎక్కడ కాల్చరు. ఒక వేళ కాల్చిన పై తెల్పిన నియమములు పాటించవలయును. నాకు తెలసినంతవరకు అనంతపురం జిల్లాలోని ఖేరాళి తాండా (అడవి బ్రాహ్మనపల్లి తాండా) ముదిగుబ్బ మండలంలో, నా చిన్నతనంలో కాల్చినారు అని చెప్పచున్నారు. హోలి కాల్చటం అనేది చాలానియమ నిబంధనలతో కూడిన కార్యక్రమము.

బంజారాలు హోలి పండుగ క్యాలెండురు ప్రకారం చేయరు. అమవాస్య రోజు మాత్రమే చేస్తారు. మొత్తం తాండా కలసి, తాండాలోని కుటుంబములు సంఖ్యను బట్టి యాటలు తెస్తారు. అనగా మేకపోతులు కాని గొర్రె పొట్టేలు గాని తెచ్చి కోస్తారు. ఆ రోజు ప్రతి ఇంటిని శుభ్రం చేస్తారు. అనగా ఇంటిలోపల, వాకిట్లో గోమూత్రంతో వాకిండ్లు, ధాన్యం పోయుటకు ఉంచిన కుండలు, వాడలు అన్నింటిని కడుగుతారు. ఇంటి లోపల, బయటిలోగిళ్లలో ఆవు పేడతో శుభ్రంగా అలుకుతారు. ఆ తరువాత ముగ్గులు వేస్తారు.

ఇంటిలో వారివారి స్థోమతను బట్టి వంటలు, పింది వంటలు చేసుకొంటారు. స్నానాలు చేసి వీలైనంతవరకు క్రొత్త బట్టలు ధరించుతారు. ఈ యాటలు తాండా మొత్తం, తాండా నాయకుని ఇంటి వద్ద చేస్తారు. యాటలువారు, ఈ హోలి కాలం 15 రోజులలోవారు ఊరూరు తిరిగి వసూలు చేసిన డబ్బుతో కాని, లేక తన సొంత డబ్బుతో కాని కొని యాటలు కోస్తారు.

ఈ విధంగా కోసిన యాటల మాంసమును, తాండాలో ఎన్ని కుటుంబాలు ఉన్నవో అన్ని భాగాలు చేస్తూ మూడుభాగాలు ఎక్కువ వేస్తారు. అవి మూడు భాగాలు, తాండా నాయకుని, తాండా కారభారి(అనగా) కార్యదర్శి డావో అనగా పెద్ద మనిషికి(సలహాదారుడు) ఇస్తారు. ఆ మాంసములో నుండి మెత్తని మాంసము అనగా పొట్ట, ప్రేగులు, ఊపిరితిత్తులు, గుండెకాయలు, కార్యము, నల్లని రక్తంతోకూడిన కాలేయము మరియు కొంత మాంసము, పప్పు ఎముకలు అన్ని తీసి ఒక పెద్ద కుండలో సలోయి(నల్లవంట) వండుతారు. అందులో మసాలాలు వేసి, ఆఖరులో యాటలు కోసినపుడు పట్టిన రక్తములో రాగి పిండిపోసి, బాగా చేతులతో పిసికి, మాంసం వండిన కూరలో వేస్తారు దీనినే సలోయి అంటారు.

ఈ విధంగా వండిన సలోయిని మరియు కాలేయములను కాల్చి ఉంచుతారు. ఈ విధంగా తయారు అయిన తరువాత మాంసం కుప్పలను వారి వారి ఇండ్లకు పంపుతారు. ఆ తరువాత సలోయి వండిన పొయ్యి దగ్గరనే హోలికి నైవేద్యం పెట్టి పూజించుతారు. పూజకు, కొబ్బరి కాయలు, సాంబ్రాణి లేక అగర్‌వత్తులు, ఆకులు, వక్కలు, నెయ్యి ఒక చెంబుతో

మంచినీళ్లు పెట్టి పొయ్యిలోని నిప్పులతో తాండా పెద్ద పూజించుతారు, పూజకు ముందు తాండా నాయకుడు, తాండాలోని ప్రజలందరిని గట్టిగా కేకవేసి పిలుస్తారు. ఈ పిలుపు వినగానే తాండా ప్రజలందరు, పిల్లలు, పెద్దలందరు గుమికూడుతారు.

ఈ విధంగా ప్రజలందరు గుమిగూడిన తరువాత హోలి దేవిని, సలోయి నైవేద్యమును చేతిలో తీసుకొని దానితో పాటు నెయ్యిని, పొయ్యిలోని నిప్పులపై వేసి, పైనుండి నెయ్యిపోస్తారు. ఈ విధంగా మూడుసార్లు వేస్తారు. ఆ తరువాత అగరవత్తులను వెలిగించి పూజవస్తువులు అన్నియు వుంచి టెంకాయకొట్టి చెంబులోని నీళ్లను కుడిప్రక్క మూడు సార్లు, ఎడమ ప్రక్క రెండు సార్లు వదలుతారు. హోలిని ప్రార్థించుతారు. ఈ ప్రార్థనను బంజారా భాషలో వీంతి అని అంటారు. అందులో పూజ ప్రభావమును, తమ తాండా భవిష్యత్తు ప్రజల ఆరోగ్యం గూర్చి తమ పశుసంపద అభివృద్ధి గూర్చి, ధనధాన్యముల గూర్చి హోలి దేవతకు చెప్పుకుంటూ అందరు మ్రొక్కుకుంటారు. పూజ అయిన తరువాత వండిన హోలి ప్రసాదమును ముందుగా, తాండా నాయకుడు, కార్యదర్శి, పెద్ద మనిషి వీరికి ఇచ్చిన తరువాత అందరికి పంచుతూవస్తారు. అదే విధంగా కాల్చిన కాలేయమును నైవేద్యం పెట్టిఉంటారు. అది కూడ అందరికి పంచిపెడుతారు. పప్పు ఎముకలు మాత్రం, అక్కడఉన్న పెద్దలు, తాండ నాయకునితో సహ, ఎంతవరకు పంచగిలిగితే అంతవరకు పెద్దలకు మాత్రమే ఇస్తారు. ఆ తరువాత మిగిలిన సలోయిని, భాగాప్రకారం అందరికి పంచి, ఇండ్లకు పంపుతారు. ఈ విధంగా తాండా మొత్తం తమతమ ఇండ్లలో మాంసం వండుకొని, రొట్టెలు, అనగా రాగి, జొన్న, సజ్జ, గోధుమ చపాతీలు, పూరీలు రకరకాలు రొట్టెలతో పాటు బియ్యం అన్నమును వండుకొని ఈ రెంటితో సంతృప్తిగా భోజనాలు చేస్తారు. కొంత మంది మధువుకూడ సేవించుతారు. ఈ విధంగావారి హోలి పండుగను చేసుకొంటూ వారి ఆనందాన్ని అనుభవిస్తారు.

ఆ తరువాత రంగులు చల్లుకొంటూ ఆటలు, పాటలు, డ్యాన్సులతో ఆ రాత్రి గడచి పోతుంది. ఈ పదిహేను రోజుల నుండి పడిన కోలాహలం అంతటితో సద్దుమణుగుతుంది.

ఈ హోలి పండుగయొక్క ముఖ్య ఉద్దేశం ఏమనగా, ప్రతి జీవకోటి ప్రాణిలోను, తమ సంతానాభివృద్ధికొర్కై ఒక సీజన్ అంటు ఉంటుంది. పశువులలో, పక్షులలో మనం ఆ వింతను చూచుకొంటూనే ఉన్నాము. మానవులలో తమ కామవాంఛను ఈ సీజనులో ఈ విధంగా ప్రకటించుకొంటారు. అది ఈ హోలి మాసంలోనే సాధ్యపడుతుంది. పుత్ర సంతానముకై ఆరాటపడు వారి కామోద్రేకాన్ని ఈ మాసం బాగా ఉపయోగపడుతుంది. పూర్వం జనాభా పెరుగుదల చాలా సమస్యగా ఉండేది. ఎప్పుడు చూచిన యుద్ధాలు, ప్రజలు యుద్ధాలలో చనిపోతూ ఉండేవారు. భర్తలు కోల్పోయిన భార్యలు ఉంటారు. ఇది క్షత్రియవర్ణంలో ఎక్కువగాజననష్టం ఉండేది. దీనిని నివారించుటకు, మరియు, జనాభా అభివృద్ధికి ఈ కాలమును, ఎన్నుకొనటం జరిగినది. ఈ కాలంలో కామవాంఛ స్త్రీ, పురుషులలో ప్రేరేపించి గర్భధారణకు ప్రోత్సాహము జరుగుచుండినది. ఈ కాలంలో గర్భధారణ వహించి, భర్త లేని స్త్రీలను కూడ ఎవరు నిందించకూడదు. అది భగవంతుడు ఇచ్చిన సంతానంగా భావించేవారు. ఈ విధంగా హోలి పండగను ఒక జాతి సంస్కృతిగా భావించి చేస్తువచ్చారు. ఇదే బంజారాల హోలి పండుగ విశేషము.

# ఉగాది పండుగ

బంజారాలు హిందూ సాంప్రదాయం ప్రకారం(ఉగాది) క్రొత్త సంవత్సరాది పండుగ చేస్తారు. వీరి పండుగ, పాత సంవత్సరమునకు వీడుకోలు పూజ క్రొత్త సంవత్సరాదికి స్వాగతం పలుకుతారు.

బంజారాలు ఉగాది పండుగను ఘనంగా చేస్తారు. అందరు క్రొత్త బట్టలు, ధరిస్తారు ఇండ్లను శుభ్రం చేసి సున్నం వేస్తారు. ఇంటి మొత్తమును గోమూత్రంతో(గంజా) కుండలను(దంతులు) శుభ్రం చేస్తారు. ఇండ్లను ఆవు పేడతో అలుకుతారు. బండలను కడుగుతారు. ద్వారాభందములకు, తలుపులకు, పసుపు, కుంకుమ బొట్లు పెట్టి చాలా అందంగా అలంకరించుతారు.

ఉగాది ముందు రోజు బంజారాలు, పాత సంవత్సరమునకు వీడ్కోలు చెప్పుటకు గాను. ''ఆటమేర్ ఓరి'' అని చేస్తారు. తాండా కుటుంబము సంఖ్యను బట్టి ఆ ఊరికి సరిపోయే విధంగా యాటలను తెచ్చి కోస్తారు. వాటి మాంసమును తాండాలోని కుటుంబముల సంఖ్యను బట్టి వాటాలు(కుప్పలు) వేస్తారు. అందులో నాయక్, కార్భారి, డావో వీరికి మూడు భాగాలు ఎక్కువ వేస్తారు. ఆ రోజు, సలోయి కూడ చేస్తారు. సలోయితో పాత సంవత్సరమును పూజిస్తారు. ఆ ప్రసాదమును అందరికి పంచి, వారివారి కుప్పలు ఇంటికి తీసుకొనిపోయి, వంటలు వండుకొని ఆ రాత్రి భోజనం చేసి ఆనందిస్తారు.

ఇక రెండవ రోజు ఇంటిలోని వారందరు స్నానాలు చేసి, క్రొత్త బట్టలు వేసుకొంటారు. ఇంటి వాకిలికి మామిడి, వేప ఆకులతో పచ్చ తోరణములు కడతారు. స్త్రీలు పూజకు రెండు రకాల పాయసం చేస్తారు. పెద్దలకు పిసిపాసి లాప్సి సంవత్సరాదిగ మామూలు పాయసం చేస్తారు. తరువాత రకరకాలవంటలు, కూరలు చేసుకొంటారు. ప్రతి కుటుంబంవారు తమ తమ దేవతలకు కొబ్బరికాయలు కొట్టి పూజిస్తారు. వేపపూత, పచ్చిమామిడి చింత పండు, బెల్లం, నెయ్యి వేసి, కొబ్బరి తురిమి ఉగాది పచ్చడి తయారు చేస్తారు. ఇక సంవత్సరాదిని పూజిస్తారు. తమ వంట పొయ్యిని, అలికి, ముగ్గులు వేసి, కుంకమ, పసుపుతో అలంకరిస్తారు. పొయ్యిలో నిప్పులు బాగాఉన్నట్లు చేస్తారు. పూజకు కొబ్బరికాయ, తాంబూలము అగర్ వత్తులు, నెయ్యి రెండు రకాల పాయసం, చెంబు నిండా నీళ్ల తీసుకొని పూజకు ఉపక్రమిస్తారు. నిప్పును కుప్పగా చేసి అందులో మొదట సంవత్సరాదిని పాయసంతో నెయ్యిని కలిపిచేతితో తీసుకొని నిప్పుపై ఉంచుతూపైనుండి నెయ్యి పోస్తారు. ఆవిధంగా మూడుసార్లు చేస్తారు. ఆవిధంగానే గట్టి పిసిపాసి లాప్సిని బియ్యం పిండితో తయారు చేసిన పాయసమును నెయ్యితో కలిపి, దానిని చేతిలో తీసుకొని నిప్పుపై ఉంచి, నెయ్యి పోస్తారు. తాతలు, ముత్తాతలు, అవ్వలు ముత్తవ్వలు, ఒకవేళ తల్లి, తండ్రిలేక పోయినవారి పేర్లు చెప్పుకొని, నిప్పుపై పాయసం వేస్తూ నెయ్యి పోసి పూజించుతారు. ఆ తరువాత కొబ్బరికాయ కొట్టి, చెంబులోఉన్న నీళ్లను, పూజకు కుడి ప్రక్క మూడుసార్లు, ఎడమ ప్రక్క రెండు సార్లు పోసి, హారతి వెలిగించి కుటుంబములో వారందరు నిలబడి పూజిస్తారు. ఇంతటితో పూజకార్యక్రమం అయిపోతుంది. ఆ రోజు బంజారాలు, తమ ఆయుధాలను శుభ్రంచేసి వాటికి గంధం, విబూది బొట్టు పెడతారు. వేసవి కాలంలోనేవారు

వేటకువెళతారు. ఉగాది పండుగను ఘనంగా చేస్తారు. వారు పగలంతా కోలన్నలు, జడ కోలన్నలు, చెడుగుడు(కబాడి) పెద్ద పెద్ద గుండ్లు ఎత్తడం వంటివి, మగ వాళ్లు చేస్తూ ఉంటే, ఆడవాళ్ల డ్యాన్సులు చేస్తూ పాటలు పాడుతూ ఉంటారు. పిల్లలు ఆటలు పాటలు పాడుతూ ఆ రోజు క్రొత్త సంవత్సరానికి స్వాగతం పలుకుతూ ఆనందిస్తారు.

# శ్రీరామనవమి

బంజారాలు ఎక్కువగా పాటించరు. దానికి బదులు, బాలాజీ భోగ్ చేస్తారు. కానీ ఇప్పుడిప్పుడు ఒకరిని చూచి ఒకరు శ్రీరామనవమిని కూడ చేస్తున్నారు. ఉగాది అయిన వెంటనే వీరు తమ పిల్లల పెండ్లి కార్యక్రమములలో మునిగిపోతారు.

# వినాయక చవితి

బంజారాలు వినాయక చవితి కూడ కొంతవరకు చేస్తారు. దీనిని టెంకాయల పండుగ అంటారు. ఆ రోజు సజ్జ కుడుములు చేసి, వ్యవసాయ పొలంలో అనగా జొన్నలు పండించే కాలంలో ''నామాల కఱ్ఱ'' అని తెల్లటి చారలు కలిగిన జొన్న కఱ్ఱ ఉంటే అక్కడకు పోయి, కుడుములు నైవేద్యముగా పెట్టి కొబ్బరి కాయకొట్టి పూజించివస్తారు. అలాగే ప్రతి చేనులోను కొబ్బరికాయ కొట్టి వస్తారు. ఇదే వీరు చేసే టెంకాయల పండుగ అనగా వినాయక చవితి.

# సంక్రాంతి

బంజారాలు సంక్రాంతి పండుగను ఎక్కువగా చేయరు. దీనిని వీరు ఝూలరియా పండుగ అంటారు. అనగా అనపకాయల పండుగ అని అంటారు. ఈ పండుగకాలం వచ్చేవేళకు శక్తి పూజలు చేస్తూంటారు. అనగా ఆదిశక్తి(మరియామ) గుడి పూజ, మంత్రాల్ పూజ, తొలజాపూజ, మావలి పూజ అని రకరకాల శక్తి పేర్లను పెట్టి వీరు పూజలు చేస్తుంటారు. కావున వీరికి సంక్రాంతి పండుగ అంత ముఖ్యంకాదు. ఇవి బంజారాలు చేసే పండుగలు.

# సమనేకేర్ పూజా

ఇది కూడా శక్తి పూజ. ముఖ్యంగా ఈ పూజ సేవాభాయా మరియు మరియామాగారిని పూజించుతారు. బంజారాలు తమ గ్రామములో ఎక్కువ మందికి సుస్తీ చేసిన ఏదైన కలరా, టైఫాయిడు, అమ్మవారు అలాంటివి వచ్చిన ఈ పూజ చేస్తారు. తాండా ప్రజలకు ఏ మాత్రం బాగాలేదు అన్న వెంటనే ఈ పూజలు చేస్తారు. సేవాభాయ తను చనిపోయిన తరువాత దహన సంస్క్రియలు చేసిన తరువాత అగ్నిలోనుండి ప్రత్యక్షమై బంజారాలకు ఈ విధంగా చెప్పిఉన్నారు. మీరు డాక్టరు వద్దకు పోవద్దండి, నన్ను తలంచుకొని నా భోగ్ బూడిదను నోట వేసుకొండి. కోళ్లు, పందులు పెంచ వద్దండి. గ్రామాలకు ఒకటి లేక రెండు మైళ్ల దూరంలో

ఉండండి అని. దీనినే బంజారాలు చాలా కాలంనుండి పాటించుతూ వస్తున్నారు. కానీ ఈ మధ్యలో కొంత మంది తెలివితేటలు ఎక్కువైనందున అవి కొంత వరకు కనుమరుగైనవి.

ఈ పూజలు చేయు ముఖ్య ఉద్దేశం ఏమనగా మామూలుగా ఎండాకాలం తరువాత వర్షాకాలం వస్తుంది. ఎండా కాలంలో నశించిన సూక్ష్మ జీవులన్నియు వర్షాకాలమునకు తిరిగి విజృంభిస్తాయి. అప్పుడే పల్లెలో జలుబు, దగ్గు, జ్వరాలు ప్రారంభమవుతాయి. వాతవరణంలో మార్పువస్తుంది. తూర్పుగాలి ప్రారంభిస్తుంది. ఆ సూక్ష్మ జీవులన్నియు వీరిపై ప్రభావం చూపుతాయి. అందువలన వాటిని నిర్మూలించుటకుగాను పూర్వం పెద్దలు ఈ పూజను పాటించమన్నారు.

ఊరికి తూర్పు దిక్కున ఈ పూజను చేస్తారు. మట్టితో శక్తిని తయారు చేసి ఉంచుతారు. స్థలం శుభ్రం చేసి, అలికి, ముగ్గులు వేసి ఆ శక్తిని అక్కడ ఉంచుతారు. తాండా మొత్తమునకు సరిపోవునట్లుగా ఒకటి లేక రెండు యాటలు తెచ్చి అమ్మవారికి బలి ఇస్తారు. ఆ మాంసమును అక్కడే భాగాలు చేసి, అందరికి పంచుతారు. ఎవరి భాగములను వారు అక్కడే వండుకొంటారు. ఆడవాళ్లు తమ ఇండ్ల వద్దనే అన్నం రొట్టెలు చేసి ఇక్కడికి తీసుకొనివస్తారు.

శ్రీ సేవాలాల్ భగవానునికి పాయస నైవేద్యం పెట్టి వారిని మ్రొక్కుకొనివచ్చి, మరియామాగారిని పూజిస్తారు. పూజ అయిపోయిన తరువాత, ఎవరి భోజనాలు వారు అక్కడే చేసి ఇండ్లకు వెళ్లి పోతారు. ఆ రోజు కూరలు వండిన కుండలు అక్కడే పారవేసి పోతారు.

అనగా ఈ విధంగా భోజనాలు చేసిన తరువాత అక్కడ పారవేసిన కుండలు, ఎముకలు, అన్నం మిగిలిన పదార్థములు అక్కడే ఉండుటవలన, ఈ సూక్ష్మజీవులు వాటికి ఆకర్షించబడి, వాటి ప్రభావం మనుష్యుల పై పడకుండ ఉండును. సేవాలాల్ మరియామాతో వరం తీసుకొన్నప్పుడు మేము సంవత్సరమునకు ఒక్కసారి మాత్రమే పూజించుతాము. నేను శాఖాహారిని, నీకు మాంసం కావలయును. కావున నాకు నైవేద్యంగా పాయసం మాత్రం చాలు. నీకు మాంసం అది పప్పు, ఎముకలు దూరంనుండే చూపిస్తాము అన్నారు. ఆ విధంగానే సేవాలాల్ నైవేద్యం అయిన తరువాత మరియామా దేవతకు పప్పు ఎముకలతో పూజిస్తారు. ఈ కారణం చేత ఈ సమనేకేర్ పూజ చేస్తారు. ఈ పూజకు నియమం లేదు. తాండా పెద్దలు ఎప్పుడు తలుచుకొన్న అప్పుడు చేయవచ్చును.

# బంజారా మరియు శివ - పార్వతి

ఒకానొక కాలంలో ఒక బంజారా తన ఎద్దులపైన, మణి, మాణిక్యములు, ముత్యములు వాటి వీపులపై మోయించుకొని అడవి మార్గంలో పోవుచున్నాడు. దారిలో కొంతమంది దొంగలు, వీరిని చూచారు. ఆ దొంగలు వచ్చి వీరిపై పడగానే యుద్ధం జరిగినది. ఆ యుద్ధంలో బంజారా చనిపోతాడు. దొంగలు మొత్తం దోచుకొని వెళ్లిపోతారు. ఈ విషయమును తెలుసుకొన్న తన భార్య నెత్తి, నోరు కొట్టుకుంటూ ఏడుస్తు అడవి మార్గమున వస్తుంది. అడవిలోనే ఆమె చాలా గట్టిగా భర్త గూర్చి రోధిస్తూ గట్టిగా ఏడుస్తూ ఉంటుంది.

అకస్మాత్తుగా అదే ప్రాంతం గుండా శివ-పార్వతులు విహార యాత్రకై ఆకాశ మార్గంలో ప్రయాణంచేస్తుంటారు. బంజారా స్త్రీ ఆ దట్టమైన అడవిలో రోధిస్తుండటం చూచిన పార్వతికి ఆమెపై దయకలిగింది. పార్వతి, శంకరునితో చెప్పింది. ఈ అడవిలో అంతగట్టిగా రోధిస్తున్న ఆ స్త్రీ పై ఎవరికి దయరాలేదా? ఆ రోదన ఎవరికి వినిపించదా? అప్పుడు శివుడన్నాడు. ఇది మృత్యులోకము. ఇక్కడ ఇది సామాన్యమే. దీని గూర్చి నీవు విచారించకూడదు. ఇక్కడ ఎందరో చస్తూఉంటారు. ఎందరో జన్మిస్తూ ఉంటారు. మనము ఎవరికని చింతించెదముయని శివుడు పార్వతితో చెప్పినాడు. పార్వతి చూడలేక శివునితో చెప్పుచుండగా శివుడు విని, విననట్లుగా వెళ్ళిపోతున్నాడు.

ఇంత కఠోరమైన హృదయంతో ఆమె ఏడుస్తూఉంటే శివునికి విషయం తెలియపరచుటకు కనిపించకుండాదాగుకొన్నది. కొంత దూరం పోయిన తరువాత శివుడు వెనక్కి తిరిగి చూచాడు, పార్వతి కనిపించలేదు. అది చూచి శివుడు గట్టిగా ఆ అరణ్యంలో పార్వతీ, పార్వతీ అని కేకలు వేయటం మొదలు పెట్టారు. నీవు ఎక్కడైనదాగి ఉన్న వెంటనేరా! నీవు ఏమి చెప్పితే అది చేయుటకు సిద్ధంగా ఉన్నాను. నీవు కనిపించనిదే నేను జీవించలేను అని అన్నారు.

పార్వతి తన ప్రక్కనేదాగి ఉన్నది. వెంటనే ప్రత్యక్షమైనది, మరి చెప్పటం మొదలు పెట్టింది స్వామీ, కొంత సేపు మీకు కనిపించకుండా పోయాను. తమరు మొత్తం అరణ్యం తల పైకి వచ్చినట్లుగా అరుస్తున్నారు. అన్ని చోట్లు వెతికారు. పాపం ఈ బంజారిణికి ఎంత దుఃఖంవచ్చిఉండును. భర్తను పోగొట్టుకొన్న ఆ బంజారా స్త్రీ ఆవేదనను అర్థం చేసుకొనవలయును. అప్పుడు శివ-పార్వతులు కలసి ఆ బంజారాకు జీవం పోయుటుకు బయలు దేరినారు. బంజారిణి అక్కడేఉండినది. స్వామీగారు మృత్యుడైన బంజారా శవం పైన అమృతమును చల్లినాడు. వెంటనే బంజారా బ్రతికాడు.

శివుడు-పార్వతి వారికి ఆశీర్వాదం ఇచ్చారు. మీరు భార్య భర్తలిద్దరు క్షేమంగా ఉండండి. మీ పేరు చిరస్థాయిగాఉండుటకుగాను, గౌరీ వ్రతం చేయునపుడు మిమ్ములను తలంచుకొంటారు. అప్పటినుండి బంజారాల గౌరీ వ్రతం ప్రారంభమైన ఇప్పటి వరకు చేస్తూనే ఉన్నారు.

# తీజ్ పండగ (మొలకల పౌర్ణిమ)

బంజారాల సమాజములో పెండ్లికాని ఆడపిల్లలు(పడచులు) ఈ పండుగను చేస్తారు. ఈ పండుగను వారు చాలా ఆనందోత్సాహాలతో జరుపుకొంటారు. ఈ ఉత్సవమును పార్వతి దేవి ఈశ్వరుణ్ణిని మెప్పించుటకు చేసి ఉన్నది. శంకరుడు వనంలో ఘోరతపస్సు చేస్తున్న సమయంలో పార్వతిదేవి వారు తపస్సు చేస్తున్న వనంలో ఈ తీజ్ ఉత్సవమునుచేసింది. తల్లి పార్వతి సాక్షాత్తు ఆదిశక్తి అగుటవలన, భారతదేశంలోని స్త్రీలందరు తమ మాంగల్యములను కాపాడుకొనుటకు ఈ వ్రతమును పాటించుతారు. ఈ పండుగలో ఆడ పడచులు శివ-పార్వతుల విగ్రహములను మట్టిలో తయారు చేస్తారు. రెండు రోజులు పూజ చేస్తారు. ఆ సమయములో

పాటలు పాడుకుంటూ డ్యాన్సులు చేస్తారు. రెండు రోజుల తరువాత దగ్గరలో ఉన్న చెరువులో కాని, నది లేక వంకలో కాని వదలి వేస్తారు.

ఈ పండుగ చేసేముందు పెండ్లి కాని ఆడపిల్లలందరు తాండా నాయకుని, కార్యదర్శిని, తాండా పెద్దలందరి దగ్గర పోయి అనుమతి తీసుకొంటారు. ఈ తీజ్ పండుగ బంజారాలలో చాలా ప్రసిద్ధి గాంచినది. తాండా పెద్దలు తమ సమ్మతిని ఇచ్చిన తరువాత పెండ్లికాని పిల్లలు తమ పొలాలలోని మట్టిని గంపలలో నింపుకొని వస్తారు. ఆ సమయంలోని పెండ్లి కాని మగపిల్లలు వారిని తీసుకొని రాకుండా అడ్డగించే ప్రయత్నం చేస్తారు. అయిన వారిని లెక్క చేయకుండా తమ తమ గంపలలో మట్టిని తీసుకొనివస్తారు.

ఈ విధంగా గంపలలో మట్టిని నింపుకొని వచ్చిన తరువాత తాండా నాయకుని ఇంటిముందు ఉంచుతారు. తీజ్ పాటలు పాడుకుంటూ నృత్యములు చేస్తారు; మరియు వారు తెచ్చిన గంపలలో చాలా ఉత్సాహంతో గోధుమ గింజలు విత్తుతారు. ఈ సమయంలో ఈ విధమైన పాటలు పాడుతారు.

గహులా ధనుకో పడేచిక కోని రే !
గహులా కులసి భాయి రో వీరా రే !
గహులా సామకి యాడిరో వీరా రే !

ప్రతి రోజు పెండ్లి కాని అడ పిల్లలు సూర్యాస్తమయము తరువాత గంపలో నాటిఉన్న గోధుమ గింజలకు నీళ్ల తెచ్చుటకు, బావి లేక నదికి పోతారు. నదిలేక బావివరకు పోయే మార్గమధ్యలో పెండ్లికాని మగపిల్లలు వారికి అడ్డుపడతారు. ఆ సమయంలో వారు డ్యాన్సులు చేసుకొంటూ, పాటలు పాడుకుంటూ వెళతారు. వారు తమ కడవలలో నీళ్ల నింపుకొని వచ్చేటప్పుడు కూడ పెండ్లికాని మగ పిల్లలు వారిని ఏడ్పించుటకు కుండలకు రాళ్ల విసరుతూవారిని ఆటంకపరుస్తూ ఉంటారు. అయినా వారు వారిని లెక్క చేయకుండాపాటలు పాడుకుంటూ, మధ్య మధ్యలో డ్యాన్సులు చేసుకుంటూ వాటికి నీళ్ల పోస్తారు.

**మధ్యలో ఆడపిల్లలు ఆపి వారికి ప్రశ్నలు వేస్తారు.**

1) ప్రశ్న : సాల్ సాల్ బాందూ పాగడి తో మోజ్ మేడ్ భాందూ పోట్
భరే సభామాహత్ పకడమే చౌహానేరో బేటా!
జ : హోస్ భాండూ హవేలిర్ ఖోచ్ బాందూ ఆంటి

2) ప్రశ్న : సంవత్సరం, సంవత్సరం ఈ విధంగా నా యొక్క కోరిక మీద నేను( తీజ్) మొలకలు పెంచి పండుగ చేస్తాను. నీకు ధైర్యముంటె నిండు సభలో నా చేయిపట్టుకో చౌహాన్‌వారి కొడుకా? ( కుమారుడా)
జ : సంతోషముతో నీకు తాళిబొట్టు కట్టి నా గృహమునకు స్వాగతం పలుకుతాను, నిండు సభలో నే నీ చేయిపట్టుకుంటాను, రాథోడ్‌వారి కూతురా!

*తేజ్ పండుగ రోజులలో పాడే పాట : ఉదాహరణకు ఒకటి.*

హె కావో కే రామ్ సింహవతావో కరమో ;
వతావో కరతోకే తగే రామ్ లియో !

కే తగే కుట్‌లియె హే హే కావో రామ్ వతదే కనమో !
హే జాణు కే రామ్ సింహ హవేలి భండావే !
హవేలి హవేలి భూల్‌గతానే టూటిపుటి టపర్ గపాలే పడాయో !
హే హే కావో ............... కరమో టేక్

హు జాణు కే రామ సింహో ఆరామ్ కరరే !
ఆరామ్ హరామ్ ఛాలుగయా నేదినోకో సహమత కరవా జాలి ఏడుయే !
హే హే కావో ............... కరయే టేక్

హే హే కావో ............... కరయే టేక్

హలతో హలతో బాలు గయనే టూటి ఫూటి ఖాటలి గాఫరే పడాయో
హే హే కావో ............... కరతో టేక్

హు జాణు కే రామ సింహో హవాయా జహజ్‌మే బేరోతో !
హవాయా జహజ్ హవాయా భూల్‌గయా నే !
హగే హగే బీస్ సూత్రియ కో సందేస్ దేవాచలి పడియో
హే హే కావో ............... కరతో టేక్

ఈ పాటలు పాడేటప్పుడు తమ తాండా నాయకుని యొక్క వ్యక్తిత్వమును తెల్పుచూ వారు స్వయంగా కవిత్వమును అల్లుకుంటూ పాటలు పాడుతారు. తమ తాండా యొక్క ప్రజల యొక్క గొప్పలను చెప్పుకొంటూ పాడుతారు. ఈ పాట ఈ విధంగా పాడవలయునను నియమము ఉండదు. వారు పాడే పాట లయమునకు సరిపోవునట్లుగా కవిత్వమును అల్లుకుంటూ పాడుతారు. ఈ విధంగా డ్యాన్సులు చేస్తూవారు పెంచిన మొలకలను త్రుంచుతూ డ్యాన్సులు చేస్తారు. ఈ మొలకలను త్రుంచుతున్నప్పుడు కొంతమంది ఆడపిల్లలు తమ అక్కలకు పెండ్లి చేసి అత్తవారింటికి పంపునపుడు ఎలా ఏడుస్తారో ఆ విధంగా ఏడుస్తారు. ఆ సమయంలో తాండాలోని పెద్దలకు, స్త్రీలకు పురుషులకు పిల్లలకు అందరికి వారు పెంచిన మొక్కలను పంచుతారు.

తాండానాయకుడువారు ఇచ్చిన తీజ్‌కు బదులుగా, డబ్బులు కాని, వస్తువులు కాని వారికి ఇస్తారు. ఆ విధంగా అందరు వారి వారి బంధువులకు ఇస్తారు. ఈ విధమైన ఆచారములు బంజారాలలో అనన్య సామాన్యంగా ఉంటుంది. ఈ కార్యక్రమము అయిన తరువాత అందరు పాటలు పాడుకుంటూ డ్యాన్సులు చేస్తువుంటారు.

నది వద్దకు పోయిన తరువాత అందరూ మగ పిల్లలలో ఒకరిని ఎన్నుకొంటారు. ఎన్నుకో బడిన వారిని గరకలా అంటారు. ఈ గరకలా చేతిలో ఒక మొద్దు ముక్క ఇవ్వబడుతుంది. ఈ ముక్కను ''పిడియో'' అంటారు. గరకలా అయిన ఆమగ పిల్లవాడు ఆడపిల్లలకు నాయుకుడౌతాడు. ఆ సమయములో ఆడపిల్లలు ఈ క్రింది పాటను పాడుతారు.

తీన్ గామేరో పటలియా బనావూఁరే విరా పిడియా దేదర! అనగా విరా(సోదరా) ఆ పిడియా నాకు ఇవ్వుము నేను నిన్ను మూడు గ్రామాల పటేల్‌ను (నాయుకుణ్ణి) చేస్తాను అని ప్రార్థిస్తుంది.

ఈ ప్రేమతోచెప్పిన మాటలు విని''గరకల'' ఆ అబ్బాయి, పిడియా కట్టెముక్కను అమ్మాయిలకు ఇచ్చి వేస్తాడు. ఈ విధంగా ''పిడియా''వారికి అందగానే అమ్మాయిలు ఆ అబ్బాయిని వెక్కిరిస్తూ, అవమాన పరుస్తారు అప్పుడు ఈ క్రింద పాట పాడుతారు.

హమారే పిడిలి య హమారే హోత్!

తో ఛోరారి ఛాతిమా లాత్.

అనగా మా పిడిలియా మా చేతిలోఉన్నది. ఓ పిల్లవాడా నీ ఎదలో తన్ను! అని పాడుతారు. ఆ విధంగా గణపతిని ఏవిధంగా విసర్జింప చేస్తారో ఆ విధంగా ఈ తీజ్ కార్యక్రమము ముగుస్తుంది. ఇంతటితో ఈ తీజ్ పండుగ ముగుస్తుంది.

# బాలాజీర్ భోగ్ - పూజించుట

కలియుగ వైకుంఠమైన తిరుపతి శ్రీ వెంకటేశ్వర స్వామిని బంజారాలు బాలాజి అంటారు. శ్రీరాముడే కలియుగంలో బాలాజి అవతారమెత్తాడని వారినమ్మకము. అందుకేవారు శ్రీరాముడే బాలాజి అంటారు. వారి పాటలలో ''శ్రీరామే బాలాజి'' అని పాడుతారు. కలియుగంలో స్వయంగా బాలాజిని దర్శించి, పాచికలు ఆడుకొన్న బంజారా, శ్రీ హాథీరాం బావాగారి మఠ చరిత్రను బంజారా చరిత్రలో తెలియపరచాను.

కలియుగంలో బంజారాల దైవం శ్రీ వెంకటేశ్వరుడే, అందుకనే అఖిల భారతంలోని బంజారాలు శ్రీ వెంకటేశ్వర స్వామిని దర్శించి, తమ కోరికలను తీర్చుమని, తమ తలనీలాలను సమర్పించి, తమ పూర్వికుడు, పవార్ వంశం, ఆంగోత్ గోత్రియుడైన శ్రీ హాథీరాంబావా మఠంలో తమకు నచ్చినన్ని రోజులు ఉండి, వారి మఠంలో నివశించి, ఆడి, పాడి వారి ఆశీర్వాదములను పొందివచ్చిన తరువాత వారు తమ గ్రామమునకు, నేరుగా తమ ఇంటికిరారు. అదే విధంగా తిరుపతి శ్రీబాలాజి దర్శనార్థం పోయినప్పుడు కూడ వారు ఎప్పుడంటే అప్పుడు బయలుదేరరు.

తాండాలోని ప్రజలు అందరు కలసి, శ్రీబాలాజి దర్శనార్థమై ఎప్పుడు బయలుదేరవలయునోముందుగా నిశ్చయించుకొంటారు. ఆ విధంగావారు ఎవరెవరు ప్రయాణం చేయదలచుకొన్నారోవారు వారి ఇండ్లను శుభ్రం చేసుకొని, ఆ రోజు ఇంటిలో దీపారాధానం చేసుకొని, బాలాజి పటమును పూజించి, ప్రయాణమౌతారు. అప్పుడు తాండా ప్రజలను వారిని సాగనంపే కార్యక్రమములో, కంచు పళ్లెములు, తాళములు, నగారా కొట్టుకొంటు శ్రీ వెంకటేశ్వర స్వామి, భజనాలు పాటలు పాడుకొంటూ వచ్చి తమతాండానుండి వారిని సాగనంపే కార్యక్రమములు చేస్తారు. ఆ తరువాత వారు తిరుపతి ప్రయాణమై పోతారు.

ఈ లోపు తాండావారు బాలాజి భోగ్ కార్యక్రమము ఉన్నదని తమ తమ బంధువులను వేరు వేరు తాండాలకు పోయి అహ్వానించుతారు. బాలాజి భోగ్పూజ శనివారం మాత్రమే చేస్తారు. తరుపతి బాలాజి దర్శనార్థమై పోయి వచ్చినవారు శనివారం ప్రొద్దున లేక శుక్రవారం, రాత్రికే తమ తాండా చేరుకొని, తాండాకు దగ్గరిలో ఉన్న బావి, లేక పెద్ద చెట్టు

క్రింద నివసిస్తారు. శనివారం తాండాప్రజలు తమ తమ ఇండ్లను బాగా శుభ్రం చేసుకొని, అంటు ముట్లులేకుండా ఉండవలెను. ప్రతియింటి ముందు ఆవు పేడతో కల్లాపు చల్లి ముగ్గువేస్తారు. ఆ తరువాత ఇంటిముందు, పొడువుగా ''భోగ్'' చేయుటకు పొయ్యిని త్రవ్వుతారు. ఆ పొయ్యిని పూజ చేసి, అన్నియు క్రొత్త కుండలను మాత్రమేవాడుతారు. కొత్తకుండలు, బానలు, కడవలు, మూకట్లు, దుత్తలు, ముంతలు మాత్రమేవాడుతారు. వారి వారి స్థోమతలను బట్టి బంధువులను బట్టి, బానలతో పాయసం, అన్నం, పప్పు, రసం మరియు ఇతర కూరలు ఏవైన వండుతారు. ఈ 'భోగ్'లో రెండు రకాల పూజలు చేస్తారు. ఒకటి బాలాజి పూజ, రెండవది హనుమంతుని పూజ. హనుమంతుని పూజ చేయువారు బియ్యమును పిండి చేసి, మూడురాళ్ల పొయ్యిని పెట్టి దానిపై రొట్టెలు పెనమును ఉంచి, బియ్యం రొట్టెలు కాల్చుతారు. బియ్యపు రొట్టెలు కాల్చేటప్పుడు ప్రత్యేకంగా పూజకు ఒక 6'' వ్యాసములో రొట్టె చేసి, దానికి ఎత్తైన అంచులు ఉండునట్లుగా కాల్చుతారు. ఈ విధంగా కాల్చిన రొట్టెలను బెల్లం, నెయ్యివేసి ''చుర్మో'' తయారు చేస్తారు. ఈ చుర్మోనే ఆంజనేయస్వామికి నైవేద్యంగా పెడతారు. ఈ వంటలు మగవాళ్లు మాత్రమే చేస్తారు. ఈ విధంగా అన్ని రకాల వంటలు అయిన తరువాత పూజకు ప్రారంభమౌతారు. ప్రతి ఇంటి ముందు వెంకటేశ్వర స్వామి పటం పూజించి, పూలదండలు వేసి, దీపారాధన చేసి, తాంబూలము, పండ్లు, సాంబ్రాణి, కర్పూరం, అన్ని సిద్ధం చేసి ఉంచుతారు. ఇక పూజ ప్రారంభించవలయునను టైములో తాండానుండి అందరు, తాళములు, నగారా, కంచు పళ్లెములు వాయించుకొంటూ, బాలాజి భజన పాటలు పాడుకొంటూ బాలాజిని దర్శించి, తాండా బయట వీరి స్వాగతమునకై వేచిఉన్న బాలాజి భక్తులను, పిలుచుకొని వచ్చుటకు బయలుదేరుతారు. అక్కడ చేరిన వెంటనే వీరంతావారి పాదములకు నమస్కరించి, దైవదర్శనం గూర్చి విషయాలను వారి ద్వారా తెలుసుకొనివస్తారు. ఈ విధంగా తాండాకు పిలుచుకొని వచ్చిన తరువాత మొదట పూజ తాండా నాయకుని ఇంటివద్ద జరుగుతుంది. ఈ పూజలోవెడల్పయిన ఆకులు లేక విస్తరాకులలో వండిన వంటలన్నింటిని ఉంచి వాటిపై నెయ్యిపోసి నైవేద్యమును సిద్ధం చేస్తారు.

ఈ విధంగా ఏర్పాట్లు చేసిన పదార్థములకు, తాండా ప్రజలు, పిల్లలు పెద్దలు అందరు అర్థ చంద్రాకారంగా నిలుచుని చేతులు జోడించి పూజా కార్యక్రమములు చేపట్టుతారు. సిద్ధంగాఉంచిన నైవేద్యంతో పూజ నిర్వర్తించుచు అతను నెయ్యితో కలిపి చేతినిండా నైవేద్యమును తీసుకొని, వంట చేయుటకు తీసిన పొడుగాటిపొయ్యిలో బాగాకాలి నిగనిగలాడుతున్న నిప్పును తీసుకొని వాటిలో నైవేద్యంవేసి దుత్తతో నెయ్యిని అందులో పోస్తారు. ఈ విధంగా మూడుసార్లు, అన్ని పదార్థములనుండి ఒక్కొక్కసారి తీసి అందులో పోస్తారు. ఆపై నెయ్యి దుత్తతో పోస్తారు. ఈ నెయ్యికి పొయ్యినుండి పెద్ద మంటలు వస్తవి. అలా వచ్చిన 'భోగ్' భాగా మండినది. దేవుడు మనలను కరుణించాడు అంటారు. ఆ విధంగా 'భోగ్' చేసిన తరువాత కొబ్బరి కాయకొట్టి బాలాజిని ప్రార్థించుతారు. అదే విధంగా హనుమానేరో 'భోగ్', అంజనేయ స్వామిని పూజిస్తారు. ఆంజనేయ స్వామిని పూజించేటప్పుడు బియ్యం రొట్టెలతో చేసిన చుర్మోను, ప్రత్యేకంగా తయారు చేసిన బియ్యం రొట్టెలు ఉంచి, రొట్టెలు కాల్చటానికి పెట్టిన పొయ్యితోనే పూజిస్తారు. పూజారి బియ్యం చుర్మోను చేతిలో తీసుకొని పైనుండి నెయ్యి పోస్తు నిప్పులలో వదులుతారు ఈ విధంగా మూడుసార్లు వదలి, కొబ్బరి కాయ కొట్టి పూజించుతారు. ఈ విధంగా పూజలు,

ఒక ఇంటి తరువాత మరియొక ఇంటిముందు పూజిస్తూ ప్రసాదం పంచుతారు. పూజించే వ్యక్తి ఉదయంనుండి ఉపవాసం ఉంటారు కాబట్టి నైవేద్యం ముందు అతనికి పంచి, ఆ తరువాత అందరికి పంచుతారు. పూజారి ప్రసాదం తీసుకొనండి అన్నంతవరకు ప్రసాదం తినరు. ఈ విధంగా బంజారాలు శ్రీ బాలాజి వెంకటేశ్వర స్వామిని తరతరాలుగా కొలుస్తూ వస్తున్నారు.

# సీతళాయాడి పూజ( అమ్మవారు)

బంజారాలు ఉత్తర భారతంనుండి వచ్చారు. ఉత్తర భారతంలో శక్తిని సీతళాయాడి అని పూజిస్తారు ప్రతి బంజారా, గుజరాతు, రాజస్తాన్ ప్రాంతములలో సీతళాయాడిను పూజిస్తారు. సీతళా మాతని ప్రజల ఆరోగ్యం గూర్చి ఎక్కువగా పూజిస్తారు. వీరినే సాతిభవాని అంటారు. ఒక చిగర చెట్టు లేక వేప చెట్టు క్రింద పొడువుగా ఉన్న ఒక రాతిని తీసుకొని మధ్యలో ఉంచి, కుడి ప్రక్కకు మూడు, ఎడమ ప్రక్కకు మూడు మొత్తం ఏడురాళ్లను, నిలబెడతారు. వాటికి ఎదురుగా ఒకరాయిని ఉంచుతారు. వాటిని నీటితో బాగా అభిషేకం చేస్తారు. ఆ తరువాత పసుపు, కుంకుమ కలిపి వాటికి పూస్తారు. వాటిపై నేతితో అభిషేకం చేస్తారు.

ఈ సీతళాపూజ తొలి ముంగార్లో చేస్తారు. వర్షాలు పడి మొలకలు, మొలకెత్తినపుడు ఈ పూజను చేస్తారు. తాండా మొత్తం కలసి ఊరి బయట ఈ పూజను చేస్తారు. దూరంగామంచి ఎత్తయిన ప్రదేశములో ఈ దేవతను నిలబెడతారు. తాండాలోని కుటుంబములను బట్టి యాటలు మూడు లేక నాల్గు తెచ్చి, దేవతకు బలి ఇస్తారు. బలి ఇచ్చే ముందు దేవతకు, పూజలు చేసి, అనగా దీపారాధన చేసి, తాంబూలము మరియు కొబ్బరి కాయ పెట్టి, సాంబ్రాణి, అగర్‌బత్తి వెలిగించి, అందరు అర్థచంద్రాకారంగా నిల్చుని, మొక్కుతూ బలి పశువును వరం అడుగుతారు. అది తన ఒళ్ళును జలదరించిన వరం ఇచ్చినది అంటారు. లేకున్న దాని ఒంటిపై నీళ్లు పోస్తారు. అప్పుడు అది ఒళ్ళు జలదరించుతుంది. వరమిచ్చినది. అని, దానిని దేవతకు బలి ఇస్తారు. దాని తలను దేవతముందు ఉంచి, తిరిగి వరమడగుతారు. అది నోరు తెరచిన వరమిచ్చినది అంటారు. ఈ విధంగా బలి ఇచ్చిన యాట మాంసమును తాండాలోని కుటుంబాలను బట్టి భాగాలు పంచుతారు. ఆ మాంసమును అక్కడే వండుకుంటారు. దేవత నైవేద్యం కొరకు ఫేరేర్ బోటి వండుతారు. అందులో పప్పు ఎముకలు వేస్తారు. కాలేయమును నిప్పులపై కాల్చి నైవేద్యంగా ఉంచుతారు.

ఇంకా తాండాలోని ప్రతి కుటుంబమువారు దేవత నైవేద్యం కొరకు పొంగలి, బియ్యం, బెల్లం, పాలు, నెయ్యి పోసి పాయసం గట్టిగావండుతారు. మరియు పెసర గుగ్గిళ్ల జొన్న గుగ్గిళ్ల ప్రతి ఇంటిలోను వండుకొంటారు. సాయంత్రం 5 గం ప్రాంతంలో ప్రతి ఇంటిలోనుండి ఆడవాళ్లు, పిల్లలు అందరు, స్నానములు చేసి, తమ ఒంటిని అలంకరించుకొని, క్రొత్త దుస్తులు ధరించి, నగలు ధరించి ఆనందంలో పరవశించుతారు. ఆ తరువాత ప్రతి ఇంటినుండి వెడల్పయిన ఇత్తడి పళ్లెములో సీతళాతల్లిని పూజించుటకు వండిన నైవేద్యం, పాయసం, గుగ్గిళ్లు, పళ్లెములలో ఉంచుకొని దానిపై అందంగా, ప్రత్యేకంగాతయారు చేసిఉన్న గుడ్డ 'గొన్నో' అను దానిని కప్పుతారు. ఇది చతురస్రాకారంగా, గవ్వలతోను, అద్దములతోను,

రంగు రంగుల దారముతోను ఎంబ్రయిడరి చేసి మరియు దారముతో తయారు చేసిన 'ఫూందా' అనగా చిన్న చిన్న కుచ్చులు 'గొన్నో'కు అతికించి దానిని రకరకాల ఎంబ్రయిడరి చేసి ఉంటారు. ఆ తరువాత వండిన నైవేద్యమును తమ తలపై ఉంచుకొనుటకు అనుకూలంగా ''గాలా'', ''ఫూల్ల్యా'' అనుదానిని తయారు చేస్తారు. నెత్తి మీద ఉంచుకొనే చుట్ట ప్రత్యేకం దారముతో తయారు చేయబడినది. ఇది మందంగా, గుండ్రంగా భద్రంగా దారంతో తాడులా పేని తయారు చేసి ఉంటారు. దీని వెనుక భాగమున ''8'' అంగుళముల వెడల్పు, ఒక మూర పొడవుతో గుడ్డను వ్రేలాడ తీస్తారు. ఇది రకరకాల దారంతో ఎంబ్రయిడరి చేయబడి, గవ్వలతోను గాజులతోను బాగా అలంకారంగా తయారు చేసి ఉంటారు. ప్రసాదం తీసుకొని పోవు స్త్రీకానీ, అమ్మాయి కానీ దీనిని నెత్తి పై ధరించిన, చూచుటకు చాలా అందంగా ఉంటుంది. ఆ పై గొన్నోతో కప్పబడిన కంచు పళ్లెమును నెత్తిపై ఉంచుకొంటారు. దీనిపై ఉంచిన ప్రసాదం ఏ విధంగానైన కదలుటకు వీలులేదు. అంత జాగ్రత్తగా ప్రసాదం తీసుకొనిపోబడుతుంది.

ఆ విధంగా అలంకరించుకొన్న ప్రసాదము అందరు నాయకుని ఇంటి వద్దకు తీసుకొని వస్తారు. అక్కడినుండి దేవత ఉన్నచోటుకు తీసుకొనిపోవుటకు తాండాలోని మగవాళ్లు కంచుపళ్లెములను పట్టుకొని నగారా, తాళములు పట్టుకొని, మ్రోగించుతూ, తప్పెటలు కొట్టుతూ, ముందు ప్రయాణిస్తూండగా, ఆడవారు ప్రతి ఒకరి చేతిలో మంచినీళ్ల చెంబును తీసుకొని నీటిని ధారగా పోస్తూ, సీతళ పాటలు పాడుకొంటూ ఊరి వీధుల గుండా సీతళా దేవతలుఉన్న చోటుకి చేరుకుంటారు.

తీసుకొచ్చిన నైవేద్యం అందురు సీతళదేవి ముందు ఉంచుతారు. ఆ తరువాత కొంత సేపు పాటలు పాడుకొంటూ, డ్యాన్సులు చేస్తారు. పూజకు సిద్ధమైనవెంటనే అందరు అర్ధచంద్రాకారంగా నిల్చుంటారు. సీతళాదేవిని ముఖ్యంగా గోసంపదను అభివృద్ధి చేస్తుందనే విశ్వాసము, గోవులను కట్టే ''దామన్'' అనగా ఒక పొడుగైన తాడుకి మధ్య మధ్యలో వాటికి పలుపులు తగిలించి, వాటిని ఆవుల మెడలకు తగిలించేవారు. దానిని సీతళామాత, తలవద్ద ఉంచుతారు. ఆవుల మందలను, సీతళామాత ముందుగా నడిపించుతారు. ఇది అంతయు పూర్వం చేస్తుండిరి. ఇప్పుడు ఆవుల మందలు లేవు కావున ఈ కార్యక్రమములు చేయరు. ప్రతి ఇంటినుండి నైవేద్యంతో పాటు తాంబూలం, అగర్‌బత్తులు, కొబ్బరికాయలు తెస్తారు.

ఇక పూజ ప్రారంభమౌతుంది. ప్రతి ఒక్కరు, ఆడ, మగ, పిల్లలు, పెద్దలు అందరు నిలచి, వారి వారి కోరికలను వరములుగా కోరుకుంటారు. ఆరోగ్యం సరిగా లేనివారు తమను ఆరోగ్యంగా ఉంచమని ప్రార్థించుతారు. బిడ్డలు లేనివారు తమకు సంతాన ప్రాప్తి కలుగచేయమని ప్రార్థించుతారు. ఈ విధంగా ఎవరి కోరికలను వారు కోరుకుంటు, సకల సౌభాగ్యములు కలుగ చేయవలయునని ప్రార్థించుతారు. ఈ విధంగా అందరు ప్రార్థించి మ్రొక్కుకున్న తరువాత అందరు కూర్చుంటారు. అప్పుడు అక్కడి పెద్దలు, నైవేద్యములను ఒకరు, వండిన మాంసమును ఒకరు తీసుకొని అందరికి ప్రసాదంగా పంచుతారు. ప్రసాదం పంచే ముందు వారు పాటించే పద్ధతి, మొదటి ప్రసాదం, తాండా నాయకునికి, కార్యదర్శికి, డావో అనగా న్యాయాధిపతికి పంచి, ఆ తరువాత కుడిప్రక్క నుండి వరుసగా అందరికి పంచుతూ ఎడమప్రక్కవచ్చేటప్పటికి ప్రసాదం పంచటం పూర్తి అవుతుంది. ఈవిధంగా ప్రసాదం తీసుకొని, వారివారి ఇంటికి పోయి, వారు ఇంటి దగ్గర వండిన వంటలు, అన్నం రొట్టెలు అన్ని తీసుకొని వచ్చి, ఆరాత్రి మొత్తం అక్కడే

భోజనాలు చేస్తారు. అందరు భోజనాలు అయిన తరువాత వారివారి ప్రసాదాలు తీసుకొని వెళతారు.

ఆ తరువాత అక్కడ నిలబడిన పెద్దలు, దేవి దగ్గర ఉంచిన , పప్పెముకలు, కాల్చిన కాలేయం అందరికి పంచి, మరియొక సారి దేవతకు మ్రొక్కి తమ ఇండ్లకు వస్తారు.

# కన్నయ్యాార్ పూజ- శ్రీకృష్ణా అష్టమి

బంజారాలు, అది కాలంనుండి శ్రీ కృష్ణభక్తులు. వారు శ్రీ కృష్ణుణ్ణి 'కన్నయ్యా' అంటారు. రాఠోడ్ వంశస్తురాలైన, మీరాబాయి శ్రీ కృష్ణుని పవిత్ర భక్తురాలు. మీరా భజనలు, మీరా గానాలు మన అందరికి విదితమే. శ్రీ కృష్ణుని భక్తుడు సూరదాసు బంజారాయే! బంజారాలు శ్రీ కృష్ణ భక్తులు అనటానికి చరిత్రాత్మకమైన ఉదాశిటోలాయే దీనికి నిదర్శనము. శ్రీ వెంకటేశ్వర స్వామి తిరుపతిలో బంజారా మఠం ఉన్నట్లే, మథుర, బృందావనంలో ఉదాశిటోల అను ''మఠం ఒకటి'' దీనిని బట్టి బంజారాలు శ్రీ కృష్ణభక్తులు అన్నది అర్థమౌతుంది.

బంజారాలు కృష్ణాష్టమి పూజను మామూలు క్యాలండరు ప్రకారం చేయరు. వారు కార్తులను గుర్తుంచుకొని, పౌర్ణమి అయిన 9వ రోజు అనగా అష్టమి చంద్రుడు 9గడియలకు ఉదయిస్తాడు ముందు రోజున ''బాలభోగ్'' అని, రెండవ రోజు 'భోగ్' అని చేస్తారు. ముఖ్యంగా ఈ పూజలు ప్రతి తాండాలోను చేయరు. మామూలుగా పూజించుకొంటారు. కాని కృష్ణభక్తులుప్రత్యేకంగా ఉంటారు. వారు మాత్రం చేస్తారు. ఉదా : అనంతపురం జిల్లా పుట్టపర్తి తాలూకా, బుక్కపట్నం మండలంలోని బంజారా తాండా నారశింహపల్లిలో కి.శే. పూజారి హంజే నాయక్‌గారు శ్రీ కృష్ణ భక్తులు. వారి పవిత్ర భక్తి ఆ తాండా ప్రజలందరిని భక్తి పారవశ్యం చేసినది. శ్రీ కృష్ణుని పేర వెండితో చేసిన చంద్రుని ఆకారంలో ఉన్న కన్నయ్యను సుమారు 20 అడుగుల ఎత్తైన వెదురు కట్టెకు. ఆ కట్టెకు తొమ్మిది రంగుల క్రొత్త గుడ్డలను తెచ్చి, పది అడగుల వెడల్పు, పది అడుగుల పొడవులో మూక్కోణములలో తొమ్మిది ముక్కలను కత్తరించి వాటిని, మగవాళ్లంతా సూదిదారంతో ఒక్క రోజులోనే జండాను తయారు చేస్తారు. ఆ జండా తయారు చేసేవారు పవిత్రమైన మనస్సుతో, స్నానపానాదులు చేసి శుభ్రంగా ఉండవలెను. ఈ జండా మధ్యలో సూర్యుడు, చంద్రుడు నక్షత్రముల ఆకారంలో గుడ్డను మధ్యలోకుడతారు. జెండా కొనలో పెద్దగా కుచ్చుగాఉన్నట్లు పూలను దారంతో కుడతారు.

ఈ విధంగా తయారు చేసిన జెండాను ఒక పెద్ద మొద్దులాంటి గుంజకు గట్టిగా కడతారు. దానిని అందంగా అలంకరించుటకు నెమలి ఈకలను చుట్టూ కడతారు. అందులో భక్తులు తమ కోర్కెలు తీర్చమని రకరకాల వెండి గొడుగులు, వెండి ఆభరణములు, వెండితో చేయించిన ఎద్దులుజత వాటి అన్నింటిని బాగా మెరయునట్లుగా శుభ్రం చేసి, ఆ నెమలి ఈకల మధ్యగుచ్చుతారు మరియు ఆ జెండా ఎదురుగా అందంగా అలంకరిస్తారు. ఆ రోజు పూజారి ఇంటి ముందు కలకలలాడుతు ఉంటుంది. గుడి మొత్తం పెద్ద పెద్ద దేవతల పటాలతో అలంకరించబడుతుంది. కృష్ణావతారం పటాలు, బాలకృష్ణుని పటాలు, విష్ణువు , ఈశ్వరుడు, బ్రహ్మ మరియు శివభక్తుడు మార్కెండేయుని పటం ఇంకా ఎన్నో పటాలను అక్కడ ప్రదర్శించుతారు.

కీ. శే. శ్రీ పూజారి హాంజే నాయక్, కృష్ణభక్తుడు

ఈ పూజ ఒక్క శ్రీ పూజారి హాంజే నాయక్ ఇంటి ముందు మాత్రం జరుగుతుంది. కాని ఆ పూజ ప్రతి ఇంటిలో జరుగుచున్నంత ఆనందమును ప్రజలు అనుభవిస్తారు. ఈ పండుగ జరిపే ముందు, ఆ తాండా ప్రజలు ప్రతిఇంటివారు, వారివారి బంధువుల ఊర్లకు పోయి, మా తాండాలో 'మోటోపూజ'(అనగా పెద్ద పూజ) కృష్ణస్వామి పూజ చేస్తున్నాము రండి అని పిలిచివస్తారు. వారు ఈ పూజకు రావలయునంటే చాలా సంతోషంతో ఉత్సాహంతోవస్తారు. కాని ఒక్క విషయం ఆ పూజ ఒక్క పూజారి హాంజే నాయక్ మాత్రమే చేస్తారు. ఆ రోజు ఎవ్వరి ఇంటిలోను పొయ్యి వెలగదు. అందరి భోజనాలూ అక్కడే, మొత్తం ఖర్చు పూజారి హాంజేనాయక్ భరిస్తారు. తాండాలోని భక్తులు ప్రతి కుటుంబమునుండి వారికి తోచినది వారు డబ్బు రూపేన ''భేట్'' భగవంతునికి ముడుపు చెల్లిస్తారు, అంతే ప్రతి ఇంటినుండి పూజకు సంబంధించిన వస్తువులు మాత్రం తీసుకొని వెళతారు.

ఇది రెండు రోజుల పండుగ, మొదటి రోజు 'బాళభోగ్' అనగా కృష్ణుడు జన్మిస్తున్నపుడు చేసే పూజ. ఆ రోజు విందు ఏమి ఉండదు. ఆ రాత్రి పూజకు 'పిసిపాసి లాబిసి' అనగా బియ్యంను పిండి చేసి, అందులో బెల్లం నెయ్యి పోసి రెండు మూడు బానలలో వండుతారు. దేవుని ముందు వెడెల్పుగా ''ధూణి'' పొయ్యిలాగా అందులో ఎప్పుడు కట్టెలు వేసి మంట వెలుగుతోనే ఉంటుంది. పూజకు కావలసినవన్ని సిద్ధంగా ఉంచి, తొమ్మిది ఘడియల చంద్రుడు ఎప్పుడు ఉదయిస్తాడా అని ఎదురు చూస్తారు. ఆ రోజు శ్రీ కృష్ణ భక్తుడైన శ్రీ కీ.శే. పూజారి హంజే నాయక్, పచ్చి మంచి నీళ్లు కూడ ముట్టకుండా తలమీద పాగధరించి, ఒంటి నిండా

గంధమును పూసుకొని, నామాలు కుంకుమ పెట్టుకొని, ఒకటే భగవంతుని ధ్యానంలో ఉంటారు. చంద్రుడు ఉదయించుచున్నట్లే ఇక్కడ పూజ ప్రారంభమౌతుంది. పెద్ద పెద్ద ఇత్తడి తట్టలో గట్టి పాయసము, నెయ్యి నిండుగా ఉంచి, దేవునికి తాండాలోని ప్రతి ఇంటినుండి తెచ్చిన కొబ్బరి కాయలను కొడుతూ నైవేద్యమును తన చేతులలో పట్టుకొని, నెయ్యి దుత్తను (ముంత) చేతిలో పట్టుకొని, ''జై బోలో బాల కన్యయ్య'' అని ప్రార్థించుతూ మండుచున్న నిప్పులో పోసి, ప్రార్థించుతారు. అప్పుడు పాటలు పాడుకొంటూ, తలను త్రిప్పుతు, ఒళ్ళు అంతా కదిలించుతూ మనస్ఫూర్తిగా ప్రార్థన చేస్తారు. ఈతను పాడినప్పుడు ప్రక్క ఉన్నవారు తాళములు, కంచు పళ్లెములు చేతులతో మ్రోగిస్తూ తన పాటను అందుకొని దేవుని ప్రార్థించుతారు. ఈ విధంగా పాటలు అయిన తరువత, 'వీంతి అనగా వ్యాక్యాములలో దేవుని' ప్రార్థించుతారు. ఈ పూజ పూర్తి అగువరకు స్త్రీలు, పురుషులు చిన్న పిల్లలు మొదలుకొని రెండు చేతులను జోడించి దేవుని ప్రార్థించుతారు. ఈ విధంగా పూజ పూర్తి అయిన తరువాత నైవేద్యమును మొదట పూజారిగారికి ఇచ్చి ఆ తరువాత అందరికి పంచుతారు. మొత్తం ప్రసాదం పంచడం అయిన తరువాత దైవ ప్రసాదం తీసుకొండి అన్న తరువాత అందరు తీసుకొని, ఇండ్లకు వస్తారు. ఆ రాత్రి అందరు అక్కడనే భజనలు చేస్తూంటారు. ఆడవాళ్లు పాటలు పాడుకొంటూ డ్యాన్సులు చేస్తుంటారు. తాండా మొత్తం భక్తి పారవస్యంలో మునిగిఉంటుంది.

ఇక రెండవ రోజు భోగ్ అనగా విందు, దేవుని సన్నిధిలో పాడుగాటి పొయ్యిని త్రవ్వుతారు. తాండాలోని ప్రతి కుటుంబవము ఈ కార్యక్రమంలో తప్పని సరిగా పాలుపంచుకొంటారు. ముందురోజు అడివికి పోయి ఎండు కట్టెలను ప్రతి ఇంటి వారు ఒక్కొక్కరు మోపు తెచ్చి పెద్ద దిబ్బ వేస్తారు.

మంచినీళ్లు తెచ్చేవారు, వంటలు చేసేవారు, పాయసం చేసేవారు, అన్నం చేసేవారు, కూరలు వండేవారు, ఈ విధంగా తాండా జనాభా వారి బంధువులు అందరికి సరిపోవునట్లుగా ఆహార పదార్థములు వండుతారు. ఈ విధంగా మొత్తం విందుకి, అహార పదార్థములను వండిన తరువాత, పెద్ద పెద్ద, ఆకులు, లేక విస్తారాకులలో వండిన వంటలన్ని కుప్పలు కుప్పలుగా, నైవేద్యంగా పాడుగాటి పొయ్యి ప్రక్కలో ఉంచుతారు, ఆ రోజు జంగమయ్య కూడా వచ్చి ఉంటారు. వారి దీవ స్థభం వద్ద నైవేద్యం ఉంచుతారు. ఈ ఏర్పాట్లు అన్ని అయిపోయిన తరువాత పూజ ప్రారంభమౌతుంది. ఆ రోజు తాండా ప్రజలు, బంధువులు అందరు పెద్ద సంఖ్యలో అర్థచంద్రాకారంగా వరసలు వరసలుగా రెండు చేతులు జోడించి పూజించుటకునిలుచుంటారు. కి.శే. శ్రీ పూజారి హాంజేనాయక్‌గారు, మొత్తం నైవేద్యములను అగ్నిగుండంలో తన చేతినిండా తీసుకొని, ఎడమ చేతితో నెయ్యిదుత్త పట్టుకొని, ఆ విధంగా అన్ని రకాల నైవేద్యములను దేవునికి అర్పిస్తారు. ఆ భోగ్‌మంట తనకన్న ఇంకా ఎత్తుకు పోయినట్లు చేస్తారు. అనగా తన ఎత్తు 6 అడుగులపైన తనకన్న రెండు మూడు అడుగుల ఎత్తువరకు మంట లేచేటట్లుగా నెయ్యి పోస్తారు. అలా భోగ్ మంటలేచిననే ఆతనికి తృప్తి సంతోషము. ప్రజలందరు ఆ మంటలను చూచి ఆనందిస్తూ భగవంతుడు మనలను కరుణించారు అంటారు. ఆ విధంగా భోగ్ మంట వచ్చిన తరువాత, ప్రార్థనలు చేస్తారు. పూజారి హాంజేనాయక్ భక్తి పారవశ్యంతో, తలను చాలా ఎక్కువగా త్రిప్పుతూ ఒళ్ళునంతా గడగడ వణుకునట్లుగా ఊపుతారు. తనను క్రింద పడిపోకుండా ఇద్దరు లేక ముగ్గరు యువకులు గట్టిగా పట్టుకొనిఉంటారు. అయినను వారిని కూడ ఊపేయగలడు.

అంతటి భక్తి ఆవేశములు కలిగి ఉంటారు. ఈ విధంగా తాళములు, కంచు పళ్లెములను మ్రోగించుతూ కన్నయ్య పాటలు పాడి పూజపూర్తి చేస్తారు. ఆ రోజుకూడ వారు ఉపవాసమే ఉంటారు. భక్తులందరు పూజించిన తరువాత, మొత్తం తాండా ప్రజలు, బంధువులు కూర్చొని భోజనం చేస్తారు. ఆ భోజనంవారు చాలా ఆనందపరవశంతో చేస్తారు. తాము మొత్తం సంవత్సరంలో అనుభవించిన అనుభూతిని వారు పొందుతారు. ఆ విధంగా భోజనాలు అయిన తరువాత, ఆరాత్రి అంతా పురుషులు, భజనలు చేస్తూ ఉంటే, ఆడవారు పాటలు పాడుకొంటు, తమ భక్తిని భగవంతునికి సమర్పిస్తారు. ఇది బంజారాలు(శ్రీ కృష్ణుని) కన్నయ్యను పూజించే విధానం ఈ దేవుని ముందు ప్రతి రోజు ''ధూణి'' పొయ్యిలో మంట వెలిగిస్తూ ఉంటారు. ప్రతిరోజు సాంబ్రాణివేసి మ్రొక్కుతూ ఉంటారు. ప్రతి శనివారం తాండా ప్రజలు ఇక్కడ వచ్చి దేవునికి బెల్లం నైవేద్యంగా సమర్పిస్తారు. దానిని ''సీణ్ణి'' చడాయో అంటారు.

# దీపావళి పండుగ

ఏ రోజు అయితే రాత్రినుండి చీకటి తొలగుతుందో, ఎప్పుడైతే నెత్తిమీదఉన్న అప్పు భారం తొలగుతుందో, ఎప్పుడైతే మనస్సులో దాగిఉన్న పాపందూరవౌతుందో, గ్రామమునుండి కుళ్లవాసన కొట్టుచున్న పదార్థములు తొలగించబడునో, మనస్సులోని ఆవేదన తొలగిపోతుందో అప్పుడు లక్ష్మి ఇంటిలో ప్రవేశించుతుంది. అటువంటి రోజున భాగ్యవంతునితో సమానులౌతారు, దీపావళి అటువంటిదే ఒకరోజు అని భావించవలయును.

సంవత్సరంలోని కార్తీక పౌర్ణమి రోజులలో వెన్నెల రాత్రులు ప్రకాశవంతమయినవి. అదే విధంగా సంవత్సరములోని కార్తీక మాసంలోని అమవాస్య చీకటి రాత్రులు అన్ని రాత్రులుకన్న మించిన చీకటి రోజులుగా ఉంటాయి. అయితే కార్తీక అమావాస్య రోజులాగ ఉండదు. ఆ రోజుయొక్క దీపాలకాంతుల వలన, మతాబాలు కాల్చుటవలన ఆ రాత్రి ప్రకాశించే కాంతుల వెలగులతో, అమావాస్య రాత్రిని మరపింప చేస్తుంది. ఈ కారణంగా ఈ రోజు మొత్తం అమవాస్య రోజుల రాణి పరిగణింపబడినది. ఈ రాత్రినే దీపావళి రోజు అని చెప్పుదురు.

ఈ రోజుననే శ్రీరామచంద్రుడు లంకను జయించి తన ఇల్లు అయోధ్యకు తిరిగి వచ్చాడు. రాముడు వనవాసం పోయిన 14సంవత్సరములు తరువాత అయోధ్యానగరం బోసి పోయిఉండినది(నిర్మానుష్యంగా) శ్రీరామ చంద్రుడు, అయోధ్యలో అడుగు మోపగానే ఆ రోజు అయోధ్య వాసులు మొత్తం నగరమును దీపాలతో అలంకరింపచేశారు. ఇంటింట శుభాకాంక్షలు తెల్పడం జరిగినది. ప్రతి ఇంటి లోగిలి దీపాలతో వెలిగించినారు. గ్రామగ్రామాలకు తీపి పదార్థములు పంచడం జరిగినది. ప్రజలు ఆనందాన్ని లెక్క కట్టలేకుండా ఉండిరి, నిర్జీవమైన శరీరములతో ఆనంద పరవశులై యుండిరి.

ప్రజలకు దీపావళి అంటే ఎంతో ఆనందం కలుగుతుంది. ఎన్నోరోజులు ముందునుండే ప్రజలు భక్తి పరవశలౌతారు. బీదవారైన హిందూ కుటుంబములోని ప్రజలు తమ ఇండ్లలోని, మూలమూలలను కూడ శుభ్రపరుస్తారు. ఇంటి గుమ్మములను శుభ్రపరచి, రంగులు వేసి, రకరకాల కుంకమ బొట్లను వేసి అలంకరిస్తారు. ఇంటి బయటి భాగమునంతా

సుందరంగా అలంకరిస్తారు. ఇంటిలోని ప్రతి వస్తువును, శుభ్ర పరుస్తారు. ప్రతి ఒక్కరు తమ గృహములను అలంకరించుటలో ఏ విధమైన లోటు లేకుండా, అన్ని ఇండ్ల కన్న తన ఇల్లే అందంగా కనిపించవలయునని ప్రయత్నించుతారు. దీపావళి రోజు అన్ని ఇండ్లకన్న తన ఇల్లే ఎక్కువ దీపాలతో వెలగాలని ఆశించుతారు. రాత్రి అంతా వెలుగు అలాగే ఉండునట్లు మరియు రాత్రి అంతా మేలుకొని అందరితో ఆనందాన్ని పంచుకొనుటకు ఉత్సాహపడతారు. శాస్త్రం ఏమనగా అటువంటివారి ఇంటిలోకే లక్ష్మివస్తుంది. ఎందుకనగా ఎవరి ఇంటిలో ఎక్కువ వెలుగుఉండి మేలుకొని ఉంటారో ఆ ఇంటిలో లక్ష్మి ప్రవేశించుటకు ఇష్టపడుతుంది అంటారు.

దీపావళికి ముందు వర్షపు రోజులలో ఇంటి బయట ఊరంతా బురదమయమై ఉంటుంది. వాటిని ఎంత శుభ్రం చేసినా, పల్లపు ప్రాంతాలలోని నీరు గుంతలలో నిలబడి ఉంటుంది. పైన, క్రింద ముందు వెనుక ఎక్కడ చూచిన బురదమయమై ఉంటుంది. ఎక్కడంటే అక్కడ కుళ్లిపోతూఉంటుంది. గాలి కూడ కల్మషంతో నిండిఉంటుంది. ఈగలు, దోమలతో ప్రజలు విసిగి పోయి ఉంటారు. ఈ సమయంలో దీపావళి పండుగ వస్తుంది. గ్రామాలనుండి కుళ్లు అంతా బయటకు పంపే ప్రయత్నం జరుగుతుంది, మూల మూలనుండి కుళ్ళునంతా శుభ్రం చేయడం జరుగుతుంది. ప్రతి ఇంటిని బాగా శుభ్రపరచటంవలన, వాటిలో లక్ష్మి ప్రవేశించుటకు ఉత్సాహపడుతుంది. దీపావళి రోజులలో లక్ష్మి ప్రవేశిస్తుంది. అది ఎలాగ.

రైతు ఇంటిలో క్రొత్త ధాన్యం బంగారు కాంతితో తళ తళ మెరుస్తూ ప్రవేశిస్తాయి. ముంగార్లలో విత్తిన ధాన్యం పంటలు పండివస్తవి. ధాన్యం గాదులు నిండిపోతాయి. సజ్జలు, జొన్నలు పంట కోతలై ఉంటాయి. మినుములు, పెసలు ముందుగానే పండి కుండలలో నింపబడతాయి. ఇంటి ముంగిట, దూది మరియు నువ్వులు కోసి కుప్పలు కట్టి ఉంటారు. పొలాలనుండి నడచి లక్ష్మి రైతు ఇంటిలో ప్రవేశిస్తుంది. రైతు దీపములను వెలగించి, వాటిని జాగ్రత్త పరుచుకొంటారు, వాటిని దైవప్రసాదంగా భావించి ఈ క్రొత్త ధాన్యమును పేదలకు పంచుతారు.

వ్యాపారం చేయువారు, క్రొత్త సిరాను( ఇంక్) ఉపయోగించి వారు క్రొత్త ఖాతాలను తయారు చేస్తారు. క్రొత్త క్రొత్త ధాన్యములతో తన యొక్క అంగడిని ( దుకాణంను) నింపు కొంటాడు, క్రొత్త బట్టలు తెస్తారు, కుమ్మరి క్రొత్త కుండలను తయారు చేస్తారు. మిఠాయి దుకాణంవారు క్రొత్త క్రొత్త వంటలను తయారు చేస్తారు. క్రొత్త ఎద్దులను కొనటం జరుగుతుంది. క్రొత్త బండ్లను తయారు చేయటం జరుగుతుంది. క్రొత్త గుట్టములను తెప్పించడం జరుగుతుంది. క్రొత్త క్రొత్త సొమ్ములను కొనటం జరుగుతుంది, క్రొత్తలో క్రొత్తవాటిని దీపావళి రోజు కోరటం జరుగుతుంది.

లక్ష్మిదేవి ప్రతి ఇంటిలోను మెరుస్తూ ఉంటుంది. ఇంటింటిలోను ప్రవేశిస్తుంది. లక్ష్మి కేవలం ఏ ఇంటిలో ప్రవేశించదదంటే, ఆమెను ఎవరు అయితే అగౌరవపరచే పని చేస్తారో వారి ఇంటిలో లక్ష్మి ప్రవేశించదు. లక్ష్మి అటువంటి ఇంటికి, దూరం అంటే అతి దూరంగా ఉండిపోతుంది, కార్తీక మాసంలో కన్నులు మిరమిట్లు కొలిపె రాత్రి ఎద్దైతే ఉన్నదో ఆ రాత్రి మొత్తం ప్రపంచం దీపావళి పండుగను చేసుకొంటారు. అదే రాత్రి ఎవరైతే దీపాలు వెలిగించరో వారి ఇండ్లనుండి లక్ష్మి బయటికి వెళ్లి పోతుంది.

ఓంకార పరమానంద స్త్రీయతే సుఖ సంపదా !
సర్వే మాంగల్య మంగత్యే శివే సర్వార్థ సాధికే !

లక్ష్మిగారు ! తమరు ఓంకార స్వరూపంగలవారు మరియు బ్రహ్మ, విష్ణు, శివుడు ముగ్గురు శక్తి సంపన్నులు మీరు. పరమానందమైన ధరిత్రి మీరు,సుఖ,శాంతములను కలుగ చేస్తారు. అన్ని మంగళ కరమైనవే! కళ్యాణకారిణివి. అన్ని కోరికలను సంపూర్ణం చేయుదానవు.

పీతాంబర ధరం దేవి !
నానాలంకార భూషితమౌ !
తేజపూన్ జగరం,
శ్రేష్ఠ ధ్యాయమే దచాలకుమారికమౌ !

మూసకానబరీ బాల కుమారిని లక్ష్మిదేవి గారిని, ధ్యానం చేయవలయును. ముందు తండ్రి తాతల నుండి ఆశీర్వాదం తీసుకొనవలయును, వివిధ రకములైన అలంకారములతో విరాజిల్లుతున్న పరమ తేజశ్వముతో ఉండును, అంతకన్న ఎవ్వరు శ్రేష్ఠులుకారు.

ప్రసిద్ధ మే మహాలక్ష్మి ।
సుప్రసిద్ధ మహాశివే ।
అచలా భవ సంప్రత్యే ।
సుస్థిర భవ మదు గృహే ।

మహాలక్ష్మిగారు నా పై కృప చూపుము, తమరు పరమ శుభకరమైనవారు. మా పై అనుగ్రహమును చూపుము ప్రీతి పూర్వకముగా నిశ్చలమైన మనస్సుతో నా గృహము నందు స్థిరంగా వశింపుము. నన్ను కరుణించుము.

## బంజారాలు పాటించు దీపావళి పండుగ :

పూర్వం బంజారాలు దీపావళి పండగను ఐదు రోజులు జరుపుకొనేవారు . ఈ రోజులలో రకరకాల తీపి పదార్థములను చేసుకొని ఒకరికి ఒకరు పంచుకొనేవారు. దీపావళి రోజును బంజారాలు 'కాళిమాస్' అని పిలుస్తారు. అదే రోజు లక్ష్మి ప్రసన్న దినము అంటారు. ఆ రోజు ప్రజలందరు కలసి దేవికి గొర్రె పొట్టెలు, మేకపోతులు బలి ఇస్తారు. ఈ విధంగా చేయకపోయిన దేవి మనలను కరుణించదు అని వారి విశ్వాసము. ఏ విధంగా భగవంతుడు కృష్ణుడు నరకాసురడనే రాక్షసుణ్ణి వధంచిఉండెనో, అదే ప్రకారంవారు నరకచతుర్థతినాడు దేవికి మేకపోతులను రాక్షసులుగా భావించి బలి ఇస్తారు. ఆ తరువాత వాటి రక్తంతో 'సళోయి' వండి ప్రసాదం రూపంలో అందరికి పంచుతారు. మాంసను భాగాలుగా చేసి ప్రతి ఇంటికి తీసుకొని పోయి వండి, రొట్టెలు అన్నం చేసుకొని భోజనాలు చేస్తారు.

ఆ రోజు రాత్రి ప్రతిఇంట దీపారాధనలు చేస్తారు. ప్రత్యేకముగా తయారు చేయబడిన దీప కాంతులలో ఆముదముగాని, నెయ్యిగాని ప్రత్తితో వత్తులు తయారు చేసి వెలిగించుతారు. అందులో రుపాయి నాణ్యమును వేసి మ్రొక్కుకుంటారు. ఆ తరువాత ఆ ఇంటిలోనివారు ఒక్కొక్కరు దీపాలను తన చేతిలో పట్టుకొని ప్రతి ఒక్కరికి దీపం వెలుగు చూపిస్తూ, కోర్

దవాలి వరసేర్ దవాల్, బాపూతోన మేర! అని మొదట తండ్రికి చూపుతారు. ఆ విధంగానే దీపం తీసుకొని తల్లిని చూపుతూ 'కోర్‌దవాలి' వరసరే దవాలి యాడితోనే మేర అని చూపుతారు. అలాగే అన్నలకు, అక్కలకు, వదినలకు, తమ్ముళ్లకు, చెల్లెళ్లకు ఇంటిలోని పిల్లలకు అందరికి ''మేర'' చేస్తారు. అదే విధంగా ప్రతి ఒక్కరు, ప్రతి ఒక్క ఇంటిలోని వారికి మేరా చేస్తారు. అలాగే ఇంటి గుమ్మము ముందు నిలిచి, తన గృహమునకు మేర చేస్తారు. అలాగే వ్యవసాయపు ఎద్దులకు, ఆవులకు వాటి దూడలకు, పశువుల కొట్టములలో పోయి పశువులన్నిటికి దీపములను చూపి దీపావళి శుభాకాంక్షలు తెల్పుతారు.

ఆ రోజు తాండాలోని పెండ్లికాని ఆడ పిల్లలు, మొదలుకొని, ప్రతి ఇంటి అమ్మాయి దీపములు పట్టుకొని మొత్తం తాండా నాయకునికి మొదట మేరా చేస్తారు. తమ తమ దేవతల పటాలకు కోర్‌దవాళి పరసేర్ దవాళి బాలాజితోన మేర అని అందరు దేవతల పటాలకూ మేరా చేస్తారు.

ఆడపిల్లలు తమ ఒంటిని బాగా అలంకరించుకొని, క్రొత్త క్రొత్త దుస్తులను ధరించి, ఆభరణములు అన్నియు అలంకరించుకొని, దీపాలను పట్టుకొని ఇంటింటికి పోతారు. ఆ ఇంటిగుమ్మం దగ్గర పోతూనే అందరు ఒకేసారి ఆ ఇంటి యజమాని పేరుకాని, వారికి వరసైన పేర్లుకాని చెప్పుకుంటూ కోర్ దవాళి పరసేర్ దవాళి మేరా అంటూ చెప్పుతారు. అప్పటికి ఇంటివారు, మేల్కొని ఉండి అందరికి వారివారి దీపాలలో డబ్బులు వేస్తారు. ప్రతి ఇంటి వారు ముందుగానే సంతలకు పోయినప్పుడు వారివారి తాహతను బట్టి చిల్లర తెచ్చుకొని వచ్చి ఉంటారు. పెద్ద పిల్లలు, ఆ సంవత్సరం పెండ్లి అయ్యే పిల్లలను బట్టి వారి వారి ఇష్టం ప్రకారం దీపాలలో డబ్బులు వేస్తారు. వారు ఇంటింటికి తిరిగేటప్పుడు పాడే పాటలు.

రాత్ అంధేరిరే వీరా !
దీవలో బాళ్ దీ జో !
పానీ రే తోటే రో వీరా !
లోటా భర లిజో !
ఘర సకడాయిరే వీరా !
మక డాయి కరలిజో !
ఖాడూ భడకో తో వీరా !
హంకర లిజో !
కోతరే భసియే తో వీరా !
హడ కార లీజో !

పూర్వకాలంలో తాండాలు–గ్రామములకు దూరంగాఉండుట వలన అవి అంధకారంలో ఉండేవి. వెలుతురు ఉండేదికాదు. ఇటువంటి చీకటి రాత్రులలో వారు మేరా చేయుటకు బయలుదేరుచుండిరి. వారికి తోడు వారికి సమాన వయస్సుగల అన్న–తమ్ములు వారి వెంట ఉంటారు. ఆ రాత్రి తనకు అంగరక్షకుడుగాఉన్న తన అన్న లేక తమ్మునితో సంభోదించుతూ చెప్పునది ఏమనగా నేను రాత్రిపూట బయలు దేరుచున్నాను. దీపమును వెలిగించుము, నీరు దప్పిక కావచ్చును, చెంబు నిండ నీరు పట్టుము. మరియు దారిలో ఏదైన పశువులో లేక కుక్కలో ఎదురుపడిన వాటిని తరిమి వేయుము అని తన సోదరునితో చెబుతుంది.

ఈ విధంగా పాటలు పాడుకుంటూ, పాడుకుంటూ తోటి కన్యలందరిని గుంపు చేసుకొని, చమక్, చమక్ కాళ్లగజ్జలు మ్రోగుచుండగా తమ గ్రామము యొక్క నాయకుని ఇంటికి మొట్టమొదట పోతారు. నాయకుని ఇంటిలో వీరికి స్వాగతం పలికేటందుకు సిద్ధంగాఉంటారు. తాండా నాయకుడు వచ్చివారి మధ్యలో కూర్చుంటారు. కన్యలువారి చుట్టు గుమిగూడి వారికి చేతిలో దీపం తీసుకొని క్రింద విధంగా పాటపాడుతారు.

వర్సే దాడేరి కోర దవాలి నాయక్ తోన మేర ।నాయకుడు ।
వర్సే దాడేరి కోర దవాలి నాయకణతోన్ మేర ।నాయకురాలు ।
వర్సే దాడేరి కోర దవాలి భీయా తోన మేర ।అన్న ।
వర్సే దాడేరి కోర దవాలి భాయి తోన్ మేర ।తమ్ముడు ।
వర్సే దాడేరి కోర దవాలి కాకి తోన మేర ।పిన్ని ।
వర్సే దాడేరి కోర దవాలి కాకా తోన మేర ।చిన్నాయన ।
వర్సే దాడేరి కోర దవాలి మామా తోన మేర ।మామగారు ।
వర్సే దాడేరి కోర దవాలి మామి తోన మేర ।అత్తగారు ।
వర్సే దాడేరి కోర దవాలి భోజాయి తోన మేర । వదిన ।

తాండలోని కన్యలు వేరు వేరు బంధుత్వమును కలిగి ఉంటారు, కావున వారు వేరు వేరుగా తమ బంధుత్వమును బట్టివారు, అందరికి కాకా, కాకి, మామా, మామి, అన్న, తమ్ముడు, వదిన, చెల్లాయి అను వారివారి బంధుత్వములను బట్టి పై విధంగా పాడుకుంటూవారికి తమ తమ దీపాలను చూపుతారు. అప్పుడువారు ఇష్ట ప్రకారం అందరకి వారివారి దీపాలలో డబ్బులు వేస్తారు. ఈ విధంగా రాత్రి అంతయు, బీద, గొప్ప అను భేదం లేకుండ ప్రతి ఇంటికి పోయి వారికి దీపాలను చూపించి, వారి ద్వారా అశీర్వాదములను పొంది, వారివారి దీపాలలో వేసిన డబ్బులు చూచి గర్వపడుతువాటిని స్వీకరిస్తారు.

అదే విధంగా తాండాలోని మగవారు పిల్లలు, పెద్దలు, జట్లు జట్లుగా ఏర్పడి, తలపై పాగా కట్టుకొని, ప్రతి ఇంటికిపోయి రాం రామ్ చేసుకొంటారు. అనగా లేచి నిలబడి ఒకరి ఎదలను ఒకరు అందించుతూ రాంరాం అని నోటితోఉచ్చరించుకొంటూ రెండు భుజములను స్పర్శించు కొంటారు. పెద్దలను గౌరవించుతూ వారికాళ్లను మ్రొక్కివారి ఆశీర్వాదమును పొందుతారు ఈ విధంగా మొత్తం రాత్రి ఒక్క ఇల్లువదలకుండా, జట్లు జట్లుగా ప్రతి ఒక్కరికి, ప్రతి ఒక్కరు పరామర్శించి, అందరు ఆనందమును పొందుతారు. ఇది కాళిమాస్ రాత్రి బంజారాలు పాటించే పద్ధతి. అడ పిల్లలు, తాండా మొత్తం ప్రదర్శించి, అఖరులో తాండా పెద్ద ఇంటి వద్ద చేరి ప్రతి ఒక్కరు వారివారిదీపాలలోవచ్చిన కానుకలను లెక్కించుకొని, వారివారి మొత్తాలను ఒకరినొకరు చెప్పుకొని ఆనందించుతారు.

రెండవ రోజు తెల్లవారు ఝామున బంజారా స్త్రీలు మేల్కొని తమ ఇండ్లను శుభ్రం చేసుకొంటారు. తమ ఇండ్లను ఆవు పేడతో శుభ్రంగా అలుకుతారు. కుండలను( దంతులు) ఆవు గంజాతో శుభ్రం చేస్తారు. ఇంటి వాకిళ్ళను, రకరకాల కుంకుమ రంగులతో అలంకరిస్తారు. లోగిళ్లలో కల్లాపు చల్లి ముగ్గులువేస్తారు. ఈ విధంగా శుభ్రం చేసుకొన్న తరువాత అందరు

స్నానములు చేసి క్రొత్త బట్టలు వేసుకొంటారు. ఆ తరువాత దీపావళి పూజా కార్యక్రమాలు, వంటలు చేస్తూంటారు.

రాత్రి అంతా దీపారాధన చేసిన ఆడపిల్లలు, సూర్యోదయం అవగానే తంగేడు పూలు తెచ్చుటకు ప్రతిఒక్కరు తమతమ గంపలు తీసుకొని అడివికి వెళ్లుతారు. ఈ సమయములో ఆనంద పరవశులై ఈ క్రింద పాటనుపాడుతారు.

ఖడా కాటే ఘడా భరే లటకన బిజో దే
కాయీా లేరా లేరి కాశీ వగోరియా
కాయీా లేరా లేరి ఏ లాబడి వగోరియా.
కాయీా లేరా లేరి ఏ అంబాడి వగోరియా
కాయీా లేరా లేరి ఏ బరు వగోరియా
కాశీ తోడ బల్‌డా మర్ లటకన్ భీజోదే
బాపూరే టోలయా లోగణ భడే లటకన్ భీజోదే.

ఈ విధంగా వారు పాటలు పాడుకుంటూనే పువ్వులు ప్రోగుచేసుకొంటారు. ఇంటికివచ్చి తమతమ ఇండ్లముందు, పశువుల కొట్టములలో వీధులలో మొత్తం చల్లుతారు మరియు పేడను ప్రోగుచేసి రకరకముల ఆకారములలో గొబ్బెళ్ళు తయారుచేసి పూలతో తమ తమ ఇండ్ల ముందు అలంకరిస్తారు. తరువాత వాటి చుట్టూ తిరిగి ప్రదర్శనలు చేస్తారు. మొదట ఎద్దులు, ఆవులు, మొదలైన వాటి మీద బరువులు ఎత్తి వ్యాపారం చేస్తుండిరి. ఇప్పుడు కూడ వారు ఆ ఎద్దులతోనే తమ పొలములలో వ్యవసాయం చేసుకొంటున్నారు. తమ ఎద్దులు తమ జీవిత భాగస్వాములుగాఉండి పని చేస్తున్నవి. వాటి ద్వారా పంటలు పండించుకొని తింటున్నారు. అందువలనవారు చాలా ఉల్లాసంతో వాటి కొట్టములను పూలతో అలంకరించుతారు.

అంతేకాదు. ఇంటిలోని ఎద్దులకు, ఆవులకు పూజలు కూడ చేస్తారు. వాటి కొమ్ములకు, మెడలో పూలహారాలను వేస్తారు. వాటిని అలంకరించి, హారతి ఇస్తారు. వాటికి తాము చేసుకొన్న తీపి పదార్థములను తినిపిస్తారు. ఈ విధంగా ఆవులను, ఎద్దులను పూజిస్తారు.

ఆ తరువాత వారు తాండా నాయకుని ఇంటిలో కలుస్తారు. అక్కడ పూజ కొరకు, నెయ్యి బెల్లం గోధుమ లేక బియ్యం పిండి వేసి పాయసం తయారు చేస్తారు. ఒక చెంబులో పెరుగు, రెండవ చెంబులో నీళ్ల నింపుకొంటారు. తరువాతవారు గోదానం చేయుట జమ అవుతారు. అ తరువాతవారు కంచుపళ్లెం తీసుకొని అందులో గట్టి పాయసంతో గోవును చేసి గోదాన్ అని దానిపై రూపాయి బిళ్ల ఉంచుతారు. ఆ పైనవారు దానిపై కుంకుమ, పాలు, పెరుగు మరియు నీళ్లుపోసి పూజిస్తారు. ఈ సమయంలో వారు క్రింది పాటను పాడుతారు.

కేవాడా యే మొవడా యే
బాండుయా బుచుయా
లంబి హరే, ధోలి హరే !
ఘడెరి కటోరి !

లావా లసకర్ ధణ ధణ

దేస్ దవాలీ మావలీ.

నాయకేర్ పాగ ఊంచో వేజాయేస్ !

డాక్ డస్ కానేర

టోకలీస్ మాతేర

అన్న దన్, దూద్, పుత్

లావా లసకర్ దస్ దన్

దేస్ దవాలీ మావలీ

నాయకేర్ డాంగ్ ఊంచో వేజాయేస్ !

ఈ కార్యక్రమములన్నియు తాండాలోని పెండ్లి కాని కన్యలు, ఆడపిల్లలు చేస్తారు.

దీపావళి రోజు బంజారాలు ప్రతిఇంటిలోను రెండు రకాల పూజా ప్రసాదములు చేస్తారు. బంజారాలు తమ తమ ఇంటిలో పొయ్యి దగ్గరే ''ధబకార్'' (పూజా కార్యక్రమము) చేస్తారు. వంటలు అయిపోయిన తరువాత పొయ్యిని, పేడతో అలుకుతారు. దానిపై ముగ్గులతో అలంకరిస్తారు. పూజించుటకు, ''పిసిపాసి'', ''పాతల్ లాప్సీ'' అని రెండు రకాల పాయసములు తయారు చేస్తారు. ''పిసిపాసి లాప్సీ'' అనగా బియ్యం నానబెట్టి, ఆరబెట్టి, దానిని పిండి చేస్తారు. దానిని బెల్లం నెయ్యి బియ్యం పిండి వేసిగట్టిగా చేస్తారు. దీనిని, పెద్దలను పూజించుటకు చనిపోయిన తల్లిదండ్రులు కాని, తాత, ఆవ్వలకు పూజించుటకు పాతల్లాప్సీ బియ్యం కాని, గోధుమలను నూకగా చేసి కాని, బెల్లం నెయ్యి పాలు పోసి, పలచగా చేస్తారు. ఈ విధంగా తయారు చేసి నైవేద్యములను, వేరు వేరుగా పళ్లెములో తీసి, పొయ్యి దగ్గర ఉంచుతారు, టెంకాయ, ఆకులు వక్కలు, అగరబత్తి దీపం, ఒక చెంబునిండా నీళ్లు, పసుపు కుంకములు ఉంచుతారు. ఇవి అన్నియూ అమర్చిన తరువాత, ఇంటి పెద్ద పూజను ప్రారంభిస్తారు. ఆ సమయంలో ఇంటిలోనివారందరు శుభ్రంగా స్నానాలు చేసి, క్రొత్తబట్టలు తొడిగి, పూజ దగ్గర చేతులు కట్టుకొని నిలబడుతారు. ఇంటి పెద్ద నెత్తిపై రుమాలు కట్టుకొని పొయ్యి దగ్గరవచ్చి కూర్చుని, మొదట దీపం వెలిగించి, సాంబ్రాణి వేస్తారు. ఆ తరువాత గట్టి పాయసం తీసుకొని, నేతిని కలుపుతూ పొయ్యిలోని నిప్పులోవదులుతారు. ఈ విధంగా మూడుసార్లు వదులుతారు. ఆ తరువాత పలచగాఉన్న పాయసంతీసుకొని, నెయ్యిని చేతిలో తీసుకొని, మూడుసార్లు నెయ్యితో పొయ్యిలో నిప్పులు మీద వేస్తారు. తరువాత కుంకమ బొట్టు పెట్టి కొబ్బరికాయ కొడతారు, తీర్థం, అందరిపైన మొత్తం ఇంటిలో చల్లుతారు. ఆ తరువాత చెంబులో ఉన్న నీళ్లను ఎడమ చేతిలో చెంబుపట్టుకొని కుడిచేతిలో కుడిప్రక్క మూడుసార్లు ఎడమ ప్రక్క రెండుసార్లు పోస్తారు. ఆవిధంగా పూజ ముగించిన తరువాత లేచి, అందరితో పాటు ''వీంతి'' ప్రార్థించుతారు. మొదట తల్లదండ్రుల పేర్లు చెప్పుకొని, తాత అవ్వల పేర్లు చెప్పుకొని, తమ కుటుంబములను, పిల్లలను, పశువులను, భూసంపద, పశుసంపద, తమ పిల్లల భవిష్యత్తు, వారి ఆరోగ్యం, విద్య, వారి గృహస్తుగూర్చి మొత్తం చెప్పుతూ ప్రార్థించి, అందరు రెండు చేతులతో ఒకేసారి తమ చేతులను భూమికి ఆనించి, సాయివేస్యాడి, బాపూ దాదా, దాది అని మూడు సార్లు మొక్కుకుంటారు. ఆ తరువాత దీపావళిని గూర్చి ప్రార్థించుతారు. ''వరసే దాడేర్ దవాళి

యాడి'' నిన్ను నమ్ముకొని, ఈ పూజను నీకు అర్పిస్తున్నాము. మమ్ములను ఆరోగ్యంగా, సౌఖ్యంగా, మా గోసంపద, భూసంపద, పశుసంపద అన్నింటికి వెంట వుండి కాపాడి, మమ్ములను రక్షించు తల్లి. ప్రతి సంవత్సరం నీ పూజలు ఘనంగా చేసుకొనునట్లు చూడు దీపావళి తల్లి అంటూ ప్రతి ఒక్కరు చెప్పుకుంటూ రెండు చేతులు జోడించి భూమికి ఆనించి మూడుసార్లు ''స్రాయివేస్ మారియాడి దవలి, వరసే దాడేర్ ఏ పూజాన భరో మనీతి లయాడి'' అని మ్రొక్కుకుంటారు. అనగా దీపావళి తల్లి మమ్ములను రక్షించుము, ప్రతి సంవత్సరం నీ పూజలు ఘనంగా చేసుకొనునట్లు మాకు ఆశీర్వాదము ఇమ్ము అని ప్రార్థించుకొంటారు, పూజలు అయిన తరువాత. ఆనందముతో చేసిన పదార్థములను సంతృప్తిగా భుజించుతారు. ఇంటికి వచ్చిన ప్రతి ఒక్కరిని, భోజనం చేయనీకుండ వెనక్కిపంపరు. ఎంతవారు, భోజనం చేసాము అని చెప్పిన, వారిని వదలి పెట్టరు. ఒక్క ముద్దను మా ఇంటిలో భోజనం చేసి పోవలయునని పట్టుపడతారు. ఆ తరువాత తమకు దగ్గర సంబంధము ఉన్న అన్న తమ్ముళ్లను, బంధువులను పిలుచుకొని వచ్చి మధ్యాహ్నందాకా ఆడవారు భోజనం వడ్డించే కార్యక్రమంలోనే ఉంటారు.

బాగా భోజనాలు అయిన తరువాత పెద్దవాళ్లు మగవారు కలసి, పాటలు పాడుకొంటూ ఆనందించుతారు. ఇక ఆడవారు, డ్యాన్సులు చేసుకొంటూ దీపావళి పాటలు, దేవతల పాటలు పాడుకొంటూ సంతోషిస్తారు. ఇంతటితో పండుగ ముగుస్తుంది. ఆ తరువాత వారి రోజువారి దినచర్యలో మునిగిపోతారు.

# బంజారాల కథలు

**దేవి స్వప్నంలో కథ! :** బంజారాల తాండాలో ఖోలా అనే పేరుగల ఒక వ్యక్తి ఉండేవాడు వీరే శకునములు మరియు స్వప్నములలో ఎదురయ్యే విషయములను తాండా ప్రజలకు చాలా వివరంగా తెల్పుచుండుట వలన అతనిని అందరు మంచి జ్ఞాని అని భావించి గౌరవించుచుండిరి. తాండాలోని స్త్రీలు, పురుషులు అతనితో విచారించనిదే ఏ కార్యక్రమమును చేపట్టేవారు కాదు.

ఒక పెద్ద అరణ్యంలో వారు తాండా వేసుకొని ఉండిరి. అక్కడ వారి పశువులకు కావలసిన గడ్డి దొరకటంలేదు. అందువలన వారువారి తాండాను వేరొక చోటికి పోవలయనని ఆతురతతో ఉండిరి. ఒకరోజు అర్ధరాత్రిలో ఖోలా లేచి తమ తాండానాయకుని వద్ద పోయి, మనము ఇక్కడినుండి పోకూడదు, మరి కొద్ది రోజులు ఇక్కడనే ఉండవలయును అని చెపుతారు, రాత్రి నా స్వప్నంలో దేవి తౌలజా భవాని వచ్చి మీరు ఇక్కడినుండి పోవద్దండి కొద్ది రోజులు ఇక్కడే ఉండి పోండి అని చెప్పినది, అన్నాడు.

అతను చెప్పినది ఎవ్వరు కాదనలేకుండా ఉండిరి. నాల్గు రోజులు తాండావారిని పోకూడదు అని తెల్పడం జరిగినది. 5వ రోజు ఖోలా గారితో చర్చించటం, జరిగినది. కాని ఖోలాగారు మాత్రం, ముందు చెప్పిన మాట తిరిగి చెప్పటం జరిగినది. ఇంకా కొద్ది రోజులు ఇక్కడే ఉండవలయునని అతను తాండా నాయకునితో చెప్పాడు, మన తాండా మంచి కొరకే తమరు అందరు మరి ఒక నాల్గు రోజులు ఉండిపోవలయును. మూడవసారి అడిగినప్పుడు కూడా ఖోలాగారు మరి ఏ సమాధానము చెప్పలేక పోయినాడు.

అతను తాండా నాయకునితో ఏ విధమైన కల్మషంలేని విధంగా ఎప్పుడైతే నేను చెప్పుతానో అప్పుడే మన తాండా ఇక్కడినుంచి పోవలయును, అప్పటివరకు పోకూడదు. అని అన్నాడు.

తాండా ప్రజలయొక్క సహనం చచ్చిపోయినది. ఎందుకనగా వారి ఆవులు, ఎద్దులు, గడ్డి లేక ఆకలితో అలమటించుచున్నవి. పదిరోజుల క్రిందటనే వారి వద్దఉన్న అన్ని పదార్థములు అయిపోయినవి. అందరు ఖోలాగారి హితోపదేశములను, మాటలను అవహేళన చేయటం మొదలు పెట్టారు. రాత్రికి రాత్రే ఖోలాగారి అవులు, ఎద్దులు, పరివారమును వదలి అక్కడినుండి వెళ్లిపోయారు.

పాపం ఖోలాగారికి తాండా వారు చేసిన పనికి చాలా విచారము, దుఃఖము కలిగినది. అతని మనస్సు దుఃఖావేశంతో నిండిపోయినది. ఆయన మాటలపై కోపగించి కొట్టటం, పోట్లాడటం వారి మాటలు కాదనేంత ధైర్యం ఎవ్వరికి ఉండేది కాదు.

అతని మనస్సు ప్రజల మనస్సుగా అయిపోయి ఉండినది. ఖోలా తన కుమారుని పిలిచి వెంటనే బజారుకు పొయి ఒక మేక పోతుని కొని తీసుకొనిరా అన్నాడు. తండ్రి ఆజ్ఞను పాటించి బజారు నుండి ఒక మేకపోతును కొని తెచ్చాడు. తండ్రికూడ పోయి బజారు నుండి ఒక మేక పోతును కొనితెచ్చాడు. ఇద్దరు కలసి దేవి పూజ చేసారు మరియు మేక పోతు యొక్క గుండెలను దేవికి నైవేద్యం పెట్టారు. అతని భార్యకు కూడ తనభర్త చేస్తున్న కార్యక్రమాల పై ఆశ్చర్యము కలగటం మొదలు పెట్టింది. తమ గుంపులో ఉన్న వారందరు వెళ్లి పోయినారు. వాళ్లుకూడ తమ ఆవులను, ఎద్దులను పస్తు పెట్టటం జరుగుచున్నది. ఏ విషయంలోను ధ్యానం లేకుండ పోయినది. ఒక రోజు ఖోలా పుత్రుని పిలిచి, మన వద్దఉన్న సంచులను, మొత్తం వస్తువులకు అగ్గిపెట్టు అన్నాడు.

భార్య, కుమారుడు ఇద్దరు కలసి ఖోలా చెప్పే విచిత్రమైన ఆజ్ఞకు ఆశ్చర్య పోయారు. వారిద్దరు ఆలోచిస్తూనే ఉండిపోయారు. అయితే వాటిని ఎందుకు అగ్గిపెట్టమంటున్నారు అన్న విషయం మాత్రం వారికి బోధపడటంలేదు. మారు మాట్లాడకుండా మొత్తం కుప్ప చేసి అగ్గిపెట్టేశారు. ఆయనకు ఏమితోచినదో ఏమో అతను చూస్తుండగానే మొత్తం కాలి బూడిద అయినది. చూస్తూ, చూస్తుండగానే సంవత్సరం మొత్తంనకు సరిపోవు ఆహార పదార్థములు గుడ్డలు మొత్తం కాలి బూడిదై కట్టుబట్టలతోనిలబడి పోయినారు. మొత్తం బూడిదను ఒక చోట చేర్చుతుంటే వారికి ఎలా అనిపిస్తుందటే, సంవత్సరం మొత్తం కష్టబడి ఒక రైతు పండించిన పంట జమ చేస్తున్నట్లు ఉన్నదట.

మెల్లిగా ఆ రాత్రి గడిచి పోయినది. ఖోలాగారు ఉదయం లేచి స్నానం చేశారు మరియు బూడిద మొత్తం సంచులకు నింపుకొన్నారు. ఆ సంచులను ఇంటిలోని ఒక మూలలో ఉంచాడు. అది ఎలా ఉంచాడంటే విలువైన, అమూల్యమైన వస్తువులను దాచి పెట్టినట్లు ఉంచాడు.

తరువాతవారు, తన కుమారునికి, భార్యకు చాలా ఆశతో దృఢమైన సంకల్పంతో చెప్పాడు. కొద్దిగా అక్కడ పోయి చూడండి మనం నింపిఉన్న ఆ సంచులలో ఏమి నిండిఉన్నదో! పుత్రుని కడుపుమండి చెప్పాడు. ఏమి ఉంటుంది బూడిద తప్ప? ఇంటిని మొత్తం దబాయించి, ఇప్పటివరకు మీరు చేసిన తమాషా మేముచూస్తూ ఉండిపోయాం చూడు? ఇటువంటిది ఇప్పటివరకు ఎవ్వరు చేసి ఉండరు అన్నారు.

తండ్రి ఎన్నోసార్లు చెప్పిన మాటలు విని కుమారుడు మండి పడుతూ, అలా మండిపడుతూనే అతను పోయి ఆ సంచులలో చూచాడు. చూస్తూనే అతడు ఆశ్చర్య పోయినాడు. అతనికళ్లు జిగేలు మన్నవి. అతను రెండు మూడు సార్లు తనకళ్లతో తేరిపారచూచాడు. కాని అతను ఏదైతే చూచాడో అది స్వప్నం కాదు. నిజంగానే ఉండినది. బూడిదతో నింపిన సంచులు వజ్రములు, ముత్యములతో నిండి ఉన్నది. అతని భవిష్యత్తు క్షణంలో మారిపోయినది.

ఒకటి రెండు నెలల తరువాత తూర్పు దిశగా పోయిన వీరి పూర్వ తాండా తిరిగి అదే చోటకు వచ్చినది. ఖోలా అక్కడే ఉన్నాడు. అతని కుటుంబములో ఇప్పడు ఊహించ లేనంత గొప్ప మార్పువచ్చి ఆనందంగా ఉన్నారు. బీదవాడైన ఖోలాగారి హస్తలాఘవం చూచి తాండాలోని ప్రజలందరు ఆశ్చర్య చకితులైనారు!.

ఖోలాగారు తాండా నాయకుని మరియు తాండా ప్రజలందరిని గౌరవించి ఆదరించాడు. ఖోలాగారి మాటలను అవహేళన చేసిన వారందరు తలవంచుకొని పశ్చాత్తాపం చెందారు.

# ఒక కరుణతో కూడిన కథ, రెండు గజాల భూమి

మే నెలజరుగుచున్నది. ఎండాకాలంలో భూమి వేడి ఎక్కి అగ్ని కురిపిస్తుంది. రాజస్థాన్‌లోని స్మశాన భూమిని నరకంగా అక్కడిప్రజలు ఏర్పాటు చేసిఉండిరి. ధర్మపురం అనే ఊరిలో స్మశాన వాటిక మధ్యలో ఉన్నప్పటికి అక్కడ వెయ్యినుండి రెండువేల ఎకరముల భూమి వ్యవసాయమనకు యోగ్యమైఉన్నది. ఠాకూర్ జస్‌పాల్‌సింగ్‌గారు అక్కడ ఉన్న మొత్తం భూమిని ఆక్రమించి తన స్వాధీనంలో పెట్టుకొని ఉండెను. ఠాకూర్‌గారి క్రూరత్వం మరియు హింసలకు, ప్రకృతిని, గ్రామ ప్రజలను, ఇంతకన్నా ఎక్కువ తాండాలలో నివసించే బంజారానాయకులను తన అదుపులో పెట్టుకొని ఉండెను. గ్రామ ప్రజలు దారిద్రముతో నిండిఉండిరి. ఆ ఊరిలో ఎంచుకోదగ్గ కొన్ని పక్కా ఇండ్లు మాత్రమేఉన్నవి. మిగిలిన ఇండ్లు అన్నియు మట్టితో కట్టినవే, పూరి గుడిసెలు ఉండినవి. గ్రామానికి దూరంగా బంజారాల రెండు తాండాలు ఉండేవి. ఆ గ్రామ ఠాకూర్ జస్‌పాల్‌సింగ్ చేతిలో ఉండెను. గ్రామములోని మొత్తం జనాభావారి పొలాలలోను, తన ఇంటిలోను పనిచేసి రోజూ వారు ఇచ్చే రెండు పూటలు చాలిచాలిన భోజనంతో జీవిస్తున్నారు.

గ్రామమునకు బయట ఠాకూర్‌గారి పెద్ద భవనం ఉండినది. ప్రతి రోజూ ఆ భవనంనుండి, ఏడ్పులు, వేధింపులు(రోదనలు) వినిపించుచుండేవి. ఆ రోదనలు హృదయములను కలవర పరచేవిగా ఉండెను, ఆ రోదనలు హృదయమును, నిలువునా చీల్చి వేస్తున్నారా అని అనిపించేది. ఆ ఠాకూర్ భవనం చుట్టు ప్రజలు గుంపులు, గుంపులుగా ఉండిరి. ఆ కాలే ఎండలోనే ఒక ముసలివాడివిని కొరడాలతో కొట్టుచుండిరి(కొరడాలను ఝుళిపించుచుండి). ఆ గ్రామ ప్రజలకు ఆవిధంగా కొరడాలతో కొట్టించుకొనుట అది క్రొత్త ఏమియుకాదు. ఏదో ఒక విధంగా, ప్రజలు తప్పు చేయనప్పటికి ఆ ఠాకూర్‌గారు, ఏదో ఒక తప్పును వారి మీద మోపి, వారిని మండుటెండలో కొరడాలతో కొట్టించటం చేస్తుండేవారు. అయితే ఆ రోజు ఆ గ్రామ ప్రజలకు ఆశ్చర్యంగా, అగుపించినది ఏమనగా లఖన్ అను

ముసలివాడు, వాని తండ్రి, తాతలు మరియు ముత్తాతలు కూడ మంచి నిజాయితితో పనిచేస్తూవచ్చారు. తమ మొత్తం జీవితము ఠాకూర్‌గారి సేవలోనే గడచిపోయినది. ఈ రోజువారి పై ఏ మాత్రం కరుణ చూపకుండ, కొరడా దెబ్బలను కుమ్మరించుచున్నారు. అక్కడ ఉన్నవారిలో ఎవ్వరికిని సాహసంలేదు, అతన్ని ఆపటానికి ఆ ముసలిని ఎందుకు కొరడాలతో కొట్టిస్తున్నారు అని అడగటానికి, ఆవిధంగా ప్రశ్నించిన, వారి భవిష్యత్తు ఏమౌతుందో అను అందోళన వారిలో కలుగ చేస్తుండేది. ఠాకూర్‌ని ఎదిరించి వీరు బ్రతకగలరా అని అర్థమౌతుంది.

ఒళ్లు అంతా రక్తం కారుతూ అగ్ని గోళంలా మండుచున్న భూమి మీద, పాపం లఖన్ పడివుండెను. అతని నోటినుండి మరియు ముఖంనుండి రక్తం దారవచ్చు చుండెను. ఠాకూర్ మనుష్యులు వారిని దొంగను పట్టుకొని పోవునట్లు హీనాతి హీనంగా కొట్టుకుంటూ, ముండ్ల కంపలోవాని శవమును పారవేసినారు. ప్రజలు తలలు వంచుకొని తమ తమ ఇండ్లకు వెళ్లిపోయినారు.

లఖన్ ఒక నిజాయితిపరుడు మరియు కష్టంచి పనిచేసే వ్యక్తి. వారు బంజారా అయినప్పటికి ధర్మపురిలో తాను తాతాముత్తాలనుండి కూడ ఠాకూర్‌గారి ఇంటిలోనే చేతి కష్టంపై కూలిపని చేస్తూ, జీవనం సాగిస్తూవచ్చాడు. కాటికి కాలు చాపే కాలంలో అతనికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె వారు ఇప్పడు బాగా పెద్దవారైఉండిరి. వారు ఏ విధమైన కల్మషం లేనివారు. పెద్దవాని పేరు నిర్మల్, రెండవాని పేరు నర్మద. సుధా అను ఒక కుమార్తె కూడ ఉన్నది. ఆ ఇద్దరు కుమారులు, నిర్మలమైన, కల్మషం లేనివారై ఉండి మంచి నవీన పద్ధతులలోను, ప్రగతి పథంలో (అభివృద్ధి) పయనించే సమాజ అభివృద్ధికై పనిచేయవలయునన్న అభిప్రాయం గలవారు. ఇద్దరూ కొంత వరకు చదువుకొన్నారు కూడా, అందువలన వారు అప్పుడప్పుడు దినపత్రికలు కూడ చదువుచుండిరి మరియు గ్రామ ప్రజలకు బయటి ప్రపంచంలో జరుగుచున్న విషయములను కూడ తెల్పుచుండిరి. వీరి ద్వారానే గ్రామ ప్రజలకు విషయం తెలిసింది. ఏమనగా ప్రభుత్వమువారు బీదలకు, వ్యవసాయ కూలీలకు భూమిని పంచి, పట్టాలు ఇస్తున్నారని తెలిసింది. మరియు ఎన్నో సంవత్సరముల నుండి, భూములను సాగు చేయుచున్నవారికి, ఆ భూమిలోని కొంత భాగమును వాటాగా లభించును అని. ఈ విషయం అగ్గి మంటలా ఊరంతా తెలిసి పోయినది. కాని గ్రామ ప్రజలలో ఎవ్వరికిని అంత సాహసం లేదు. ఆ ఊరి పెద్ద రైతు అయిన ఠాకూర్ జస్‌పాల్‌సింగ్‌గారితో మాట్లాడటం అటుంచి, అతని భవనం దగ్గర పోవుటకు కూడ సాహిసించేవారు కాదు. ఈ విషయమును ఠాకూర్ వద్ద చంచాగిరి చేసే(చేతులు నలిపేవారు)వారికి కొంత కారం ఉప్పుచల్లి(లేని పోనివన్ని కల్పించి) చెప్పటం జరిగినది. ఠాకూర్‌గారితో ప్రజలు రెచ్చగొట్టబడిన, మనం జీవించుట చాలా కల్మషంకాగలదు. ఠాకూర్ గారికి వారు చెప్పిన మాటలపై విశ్వాసం కలుగలేదు. కానీ అటువంటిది, రాకుండ ముందే జాగ్రత్త పడవలయునని భావించాడు. రెండవ రోజుననే మండుటెండలో ఆ ముసలి లఖన్‌గారిని లాక్కొని వచ్చి తన భవనం ముందుంచి వారిని క్రూరంగా చంపటం జరిగినది. ఈ విషయం గ్రామం మొత్తంలో అల్లకల్లోలమైనది. ఠాకూర్‌గారి దుర్మార్గం గ్రామప్రజల శిరస్సుల్లో ఆందోళనను కల్పించ మొదలు పెట్టింది, రాత్రికి రాత్రి ఎవరైన ఎదురు తిరుగుతారు అను అనుమానం కలిగిందో వారి ఇంటికి నిప్పు పెట్టటం, వారి స్త్రీలను మానభంగం చేయటం, ఠాకూర్ మనుష్యుల నిత్యకృత్యమైనది.

నిర్మల్ మరియు నర్మదా కొద్ది రోజులు ఆ గ్రామములో లేకుండా ఉండిరి. ఊరికి రాగానే వారికి జరిగిన విషయములన్నియు తెలిసిపోయినవి. అక్కడ ప్రజలలోను, బంజారా ప్రజలలోను అశాంతి ప్రబలిపోయినది, ఠాకూర్‌పై కసి తీర్చుకొనుటకు ఇద్దరు అన్నదమ్ములు గ్రామములోని కొంత మంది నవ యువకులను కలిపి ఒక సంఘము ఏర్పాటు చేసుకొన్నారు. అనుకోకుండానే ఠాకూర్‌గారి  అత్యాచారాలు ఆగిపోయినవి. మూడు, నాల్గు రోజులకు, ఠాకూర్ మనుష్యులు గ్రామ ప్రజలతో చెప్పటం మొదలు పెట్టారు. ఠాకూర్‌గారు, తన భూమిలో కొంత భూమిని, ప్రజలకు పంచే ప్రయత్నంలో ఉన్నారు. కావున ఈ విషయం గూర్చి మట్లాడి చర్చించుటకై మీ నాయకులు, నిర్మల్ మరియు నర్మదాగార్లను తన భవనమునకు రమ్మని పిలిచారు అన్నారు. గ్రామ ప్రజలకు వీరి మాటలపై విశ్వాసం కాలేదు. వారికి అసలు అర్థంకాలేదు. మూడు నాల్గు రోజులలోనే ఇంత మార్పు ఠాకూర్‌గారి మనుస్సులో ఎలా వచ్చినది? అయితే అందరికి జరిగిన పరిస్థితి గూర్చి తెలుసుకొన్నారు. కావున, ప్రజలలో విశాస్వం ఎర్పడినది అందువలన గ్రామ ప్రజలలో సంతోషం ఆవరించింది. ఇద్దరు అన్నదమ్ములను ఠాకూర్‌గారు నమ్మించినది ఏమనగా పోలిసుల సమక్షములోనే, భూమిని పంచి ఇవ్వడం జరుగుతుంది. ఈ విషయమును నిర్మల్ గ్రామ ప్రజలకు తెల్పినారు. తన తండ్రి చనిపోయిన దానికి, జమీందాగారికి సంబంధము లేదు. ఎందుకనగా ఠాకూర్‌గారికి తెలియకుండా వారి అనుచరులు మా తండ్రిగారిని చంపి ఉండిరి. ఈ విషయంలో ఠాకూర్‌గారు చాలా చింతించుచున్నారు. మా తండ్రిగార్ని ఎవరైతే చంపారో వారిని పోలీసులకు అప్పగిస్తాను అని మాట ఇచ్చారు. ఈ విధంగా ఠాకూర్‌గారు వారిని నమ్మించారు.

ఆ రోజు గ్రామ ప్రజలకు ఒక పండుగ రోజులాగా ఉండినది. గ్రామములోని కొంత మంది ప్రజలు నిర్మల్ మరియు నర్మదగార్ల నాయకత్వంలో పొలాల ప్రక్కకు తీసుకొని పోయిరి. గ్రామమునకు మూడు మైళ్ల దూరంలో, ఠాకూర్ జస్‌పాల్‌గారు రైతులకు వసతులు ఏర్పాట్లు చేసి ఉండిరి. అక్కడ వీరు చేరుకోగానే ఠాకూర్ మనుష్యులు కత్తులు, కొడవండ్లు, గొడ్డండ్లు పట్టుకొని తయారుగా ఉండిరి. వీరిని చూడగానే వీరిపై పడ్డారు. నిర్మల్ మరియు తన స్నేహితులు ఠాకూర్ పన్నిన వలలో చిక్కుకొని పోయారు. వారు వారిని ఎదిరించారు. కాని వారు ఎంతవరకు పోరాటగలరు. చూస్తుండగానే అందరు చంపబడినారు. వారి రక్తం ఎరుల్లై పారింది. ఎక్కడ చూచిన శవాలే. ఠాకూర్ తన అనుచరులతో తన మందిరానికి వచ్చేసారు. ఈ దుర్ఘటన జరిగిన విషయం గ్రామము వారికి ఏ మాత్రం తెలియలేదు. వారు వారి మధుర స్వప్నంలో తేలి ఆడుచుండిరి. భూములు వారి చేతులలోకి వస్తుందని వారు భూమి హక్కుదారులు అవుతామూ అని భావించారు.

సూర్యుడు అస్తమించి ఉండెను. భూమి మండుటెండలకు వేడేక్కి, చల్లబడు చుండెను. ప్రజలు తమ తమ ఇండ్లలో దీపాలువెలిగించు చుండిరి. అప్పుడప్పుడు కొంత మంది ఇంటిముందు నిల్చుని, ఆశతో దూరంగా ఎవరైన వస్తున్నారా అని చూస్తుండిరి. మధ్యాహ్నం పూట, నిర్మల్ మరియు అతని స్నేహితులు, పొలాల వైపు పోయి ఉండిరి కదా? వారేమైన వస్తున్నారా అని. ఆ చీకటి రాత్రిలో అకస్మాత్తుగా వెలుగుతూ ఉన్న మంట కనిపించింది. ప్రజలు, ఇంటి బయటికి పరిగెత్తుకొంటూ వచ్చారు. చూస్తే ప్రజలు అటు ఇటు పరుగెత్తు చుండిరి. ఆడవాళ్ల ఏడ్పులు లంఘించుకొన్నారు. వారు ఏడ్చేతీరు చూస్తే గుండెదడ ఆగటం

లేదు. ఠాకూర్‌గారి కుటిలమైన ఆలోచన చలామణి అయినది. వారి అనుచరులు ఖూని ఖోరు అవతారం ఎత్తి మారుణాయుధాలతో ఊరు, తాండా మొత్తం అగ్నికి ఆహుతి చేసి వారి ఆస్తులన్నింటిని లూటి చేసినారు. స్త్రీలను మానభంగం చేసినారు. స్త్రీలను వివస్త్రలను చేసారు. వారిని చావబాదినారు మరియు వారిని అవమానపరచినారు. నిజంగా భగవంతుడు కూడ ఈ అకృత్యముల నుండి వారిని కాపాడలేక పోయినారు. గ్రామం పూర్తిగా నిశబ్దంగా ఉండి పోయినది. స్మశాన నిశబ్దం పాటించినది. అక్కడక్కడ గాలికి ఇండ్లు కాలిన నిప్పురవ్వలు ఎగురు చుండెను. రెండవ రోజు దినపత్రికలోని మధ్య పేజిలో ఈ సంఘటన యొక్క క్లుప్తమైన వర్ణన చేసిఉండిరి. ధర్మపురి కాలిన విషయం, గ్రామములోని కొంతమంది గూండాలు, ఠాకూరుగారి పొలాలను లూటి చేసారని మరియు ఠాకూర్‌గారి మనుష్యులు వారిని నివారించుటకు పోగా వారిని చంపారు అని మరియు ఈ కోపంతోనే గ్రామములోని ఇండ్లను, గుడిసెలను కాల్చారని ఉన్నది. మరియు స్త్రీలను మానభంగం చేసారు. ఠాకూర్ జస్‌పాల్‌సింగ్ గారి భవంతి మరియు పొలంలో వేల రూపాయల ధాన్యం లూటి అయినది అని. ఈ సమాచారమును చదివి ఠాకూర్‌గారు మీసాలను మెలివేస్తూ మనస్సులోనే నవ్వుకొన్నాడు.

# అంతిమ నిర్ణయము-కథ

ఈ కథయందు చిత్రించిన వరుడు మరియు వధువుల గురించిన విషయం, మనదేశంలోని యువకులు-యువతులు ఇద్దరు వరకట్నములపై ఆందోళన చేస్తారు. అందువలన సమాజములో వ్యాపించిన ఈ దుష్టాచారమును మాన్పించటం అంత కష్టంకాదు..

చూడండి లక్ష్మితల్లిగారు. నేను ఈ లిస్టును తయారు చేసిఉంచాను. ఇందులో 1.రేడియో 2. టేప్‌రికార్డురు 3. స్కూటరు 4. ఫ్రిజ్ 5. ఫ్యాను, లక్ష్మి తండ్రిగారు తల్లి గారికి వ్రాసిన లిస్టు చదివి వినిపించాడు అంతలోపు లక్ష్మి ఇంటిలోనికి వచ్చింది.

లక్ష్మి తండ్రి చేతిలోని లిస్టు లాక్కొని, దానిని చింపుతూ చెప్పింది, నా వెంట ఇవన్నియు తీసుకుపోనని నేను మీతో ఎన్నోసార్లు చెప్పాను.

తండ్రిదానిని గూర్చి వాదన చేస్తూ చెప్పాడు, మేము ఏదైతే ఇస్తున్నామో, అన్ని నీ సుఖం గూర్చి మాత్రమే ఇస్తున్నాము. మీ చిన్నాయనగారు, తన కూతురుకు ఏమైతే ఇచ్చాడో! అంతే మేము కూడ ఇస్తున్నాము. ఇంతకన్న తక్కువ ఇచ్చినట్లయితే మమ్ములను అందరు అస్యహించుకోరు, మా గౌరవమునకు భంగం కాదు!

లక్ష్మి విరోధం చేస్తూనే చెప్పింది. నేను మీకు చెప్పాను. కట్నం ఇచ్చే కొరకే నాకు జన్మనిచ్చారా? ఇటువంటి ప్రతిష్టలకు పోయే, సమాజములో జరుగుతున్న ఎన్నో అరాచకాలను బట్టియే ఈ నిర్ణయం తీసుకొన్నాను.

లక్ష్మిని అర్థం చేసుకొన్న తండ్రి చెప్పాడు, చూడు తల్లీ( బిడ్డ) ప్రజలు మమ్ములను తప్పుగా అంచనా వేస్తారు. మేము మా కుమార్తెకు చిన్న తమ్ముడు బిడ్డకు ఇచ్చినంత సమానంగా కూడ ఇవ్వలేక పోయానని, బిడ్డ పెండ్లిలో ఖర్చు చేయకపోయిన, ఇంత తొందరలో ఇతను ఎప్పుడు బీదవాడైనాడు అని అనుకుంటారు.

తండ్రియొక్క మనస్సును అర్థం చేసుకొన్న లక్ష్మి ఆవేశములో బదులు చెప్పింది చాలు–చాలు ఈపాత సాకులన్నియు నాకేమి వినిపించవద్దు. ఇంత మాత్రం చెప్పి లక్ష్మి తన రూములోకి వెళ్లిపోయినది. లక్ష్మితల్లి తన భర్తతో చెప్పింది–చూడండి, లక్ష్మి తన పట్టుదల వదలిపెట్టి ఏమిపోదు. సమాజములో మన యొక్క వ్యక్తిత్వమును నిలుపుకొనుటకు, మనము అనుకొన్నదానికన్న ఇంకాకొంచెం ఎక్కువగానే ఇవ్వ వలయును, ఆ విధంగా మనము చేయక పోతే మనము ప్రజలలో మాట పడవలసివస్తుంది. లక్ష్మిగారి కోరికకు వ్యతిరేకంగా, ఆమె తల్లి మరియు తండ్రికట్నం ఘనంగానే ఇవ్వవలయుననుకొన్నారు. ఆ రోజు కూడారానే వచ్చింది. ఆ రోజునుండి లక్ష్మి శాశ్వతంగా పరాయిమనిషి అయి పోతుంది.

ఇంటివద్ద సన్నాయిలు మ్రోగుచున్నవి. ఇంటి నిండ బంధువులు వచ్చి ఉండిరి. ఆమె తల్లి దండ్రులు చాలా సంతోషంలో మునిగి ఉండిరి. బంధువులను మరియు పెండ్లి వారికి స్వాగతం పలికి, అతిథి సత్కార్యములు చేయుచుండిరి. మనస్సులోనే దుఃఖమును దాచుకొనిఉండిరి. ఇప్పుడు వారి ఇల్లు లక్ష్మిలేకుండ నిశబ్దంగా ఉంటుంది. ఎల్లప్పుడు తమ చెవులలో వినిపించే లక్ష్మి, చెవులు ఇక మూతపడిపోతవి. లక్ష్మి అనే శబ్దం, ఇక చెవులకు దూరంగా వెళ్లి పోతుంది.

లక్ష్మి ఉదయంనుండి ఏమియు తినలేదు. తల్లి దండ్రులనుండి దూరంగా పోవుచున్నానే అనే బాధ ఆమె కన్నులనుండి గంగా జలము ధారగా ప్రవహిస్తున్నట్లు ఉన్నది. ఆమె పెండ్లి కువూర్తె రూపంలో అలంకరించబడుచున్నది, చాలా సుందరంగా అగుపించుచుండినది. తర తరాలుగా వస్తున్న ఈ పద్ధతి, వస్తూ ఉండినదే! అందుకే ఆమె చెవులలో పెండ్లి కుమారుని తండ్రి మాటలు, బాబూ శ్యాంలాల్‌గారికి కఠిన శబ్దం వినిపించినది. చూడాలి, ఎలా తనకు తాను సర్దుకొంటుందో, అధికారం చలాయించినంత మాత్రాన, ఎవ్వరూ ? ఇవ్వరు. దానిని లాగుకొన వలసివస్తుంది.

లక్ష్మి మొత్తం వాతావరణమును అర్థం చేసుకొన్నది, ఇక్కడ పురోహితుడు మంత్రాలు చదువుకొంటూ, హోమము చుట్టు ఏడు అడుగులు నడిపించుటకు ప్రయత్నం చేసారు. అతి కష్టమైన నాల్గు చుట్లుగూడా హోమంచుట్టు తిరగలేదు, పెండ్లి కొడుకు తండ్రి గట్టిగా కేకవేస్తూ చెప్పాడు. ముందు కట్నం విషయం తేల్చండి. మాకు కట్నంలో ఇచ్చే సామానులు చూపండి, తరువాత ఏడడుగులు నడవండి.

పురోహితుడుగారు వరుని తండ్రితోచెప్పారు మహాశయా అంత తొందర ఎందుకు, కన్యాదానం అయిన తరువాత చూచుకోవచ్చును.

అక్కడఉన్న పెద్దలంతా వారిని శాంతి వహించమని, చెప్పారు, కాని వరుని తండ్రిమాత్రం తన పట్టు విడువలేదు. అప్పుడు లక్ష్మితండ్రిగారు ఇవ్వదలచుకొన్నవన్నియు చూపించారు . కాని వారు అది చూచి సంతోషించలేదు. కట్నంక్రింద ఇచ్చిన సామాను చూచి, వారు అన్నారు కదా! మిగిలిన ఏడడుగులు నా కుమారుడు ఆఫీసుకు పోవుటకు ఒక కారు మరియు పదివేల రూపాయలు నగదు ఇవ్వవలయును. ఈయన ఏమి మామూలు మనిషికాదు – ఇంజినీరు, ఇతని చదువు సంధ్యలకు నేను లక్షల రూపాయలు గుమ్మరించాను, అందుకే అతను ఈ రోజు ఇంత గొప్పవాడైనాడు.

లక్ష్మి తండ్రి తత్తర పాటుతో అదురుతూ నేను నా తల పాగా మీ పాదముల చెంత ఉంచుతున్నాను, ఈ సమయములో నా గౌరవమును కాపాడండి అని అన్నాడు. లక్ష్మి తండ్రి యొక్క ఆతురత తత్తర పాటు వరుడి తండ్రికి ఏమాత్రం కరుణ కలిగించ లేదు. వారు తనుకోరిన కోరికల నుండి ఒక్క అంగుళము కూడా క్రిందికి దిగిరాలేదు. తన పట్టుదల వదలిపెట్టలేదు.

అప్పుడు లక్ష్మి తండ్రి తనకు పరిచయమున్న ఒక ధనవంతుని వద్ద పరిగెత్తుకొంటూ పోయి, తన గృహమును తాకట్టు పెట్టి పదివేల రూపాయలు తీసుకొని వచ్చారు. కారు మరియు నగదు పదివేల రూపాయల విషయం లక్ష్మిచెవులకు అందినది. ఈ మాట విని, ఆమె తనువు-మనస్సు ఏకమైనవి, ఆవేదనతో చెప్పింది, భయంకరమైన క్రోధంతో(కోపంతో) ఆమె కళ్లు ఎర్రబడిఉన్నవి, ఆమె తన (ఘుంగట్) పెండ్లి కుమార్తె ముసుగు నుండి క్షణకాలం, తన వరునిని చూచినది (పెండ్లికొడుకుని) వారు ప్రేమదయ్యంలాగా నిలుచుని ఉండిరి. ఆమె ఆత్మ చలించినది. అతని పై అసహ్యంవేసినది, ఆమె మనస్సులోనే ఆలోచించుకొని, తన మనస్సులోనే నిశ్చయించుకొన్నది ఏది ఏమైనా కానీ, ఇటువంటి, పనికిరాని మనిషికి, అర్ధాంగిని ఎప్పటికినికాను. తనతండ్రి చెప్పిన మాటలన్ని రామచంద్రుడు కూడ విన్నాడు. అతను శాంత చిత్తంతో మిగిలిన ఏడడుగులు పూర్తి చేసాడు.

పెండ్లి కూమార్తెను సాగనంపు ఎద్దుకూడ తయారై వచ్చినది. పెండ్లి కుమార్తె తల్లి తండ్రి ఆమెను అత్తవారింటికి సాగనంపుటకు, అన్ని ఏర్పాట్లు చేసినారు. కట్నం క్రింద ఇచ్చే మొత్తం సామానులు పెండ్లి కుమార్తె తండ్రి పెండ్లి కొడుకు బండిపై ఎక్కించినారు.

పెండ్లి కొడుకు – పెండ్లి కుమార్తె దగ్గర అందరు నిల్చుని ఉండిరి, లక్ష్మి గుండెలు కొట్టుకొంటున్నవి, సమయం కొరకు వేచిఉన్నది. ఎప్పుడైతే తను నిర్ణయించుకొన్న మనసులోని మాటలను, పెండ్లి కుమార్తెను సాగనంపే సమయంలో, పెండ్లి కుమారుని వెంటపోను అన్న విషయంను చెప్పి అందరిని ఆశ్చర్యంలో ముంచవలయునని నిర్ణయించుకొన్నది.

ప్రయాణ కార్యక్రమము అంతా ముగించుకొని, పెండ్లి కొడుకు తండ్రి బాబు శ్యాంలాల్ కొడుకు దగ్గరకొచ్చి చెప్పుచున్నాడు. త్వరగా తయారు కండి, కట్నంలో ఇచ్చిన అన్ని సామానులు బండిలో ఎక్కించాను, నీవు మీ అత్తమామల, పాదములకు నమస్కరించి, వారి ఆశీర్వాదములు తీసుకో, పోయే ముహుర్తం దగ్గర పడింది. ''నేను ఇక్కడినుండి బయలు దేరవలయునన్న తమరు, పెండ్లికుమార్తె తండ్రి వద్ద కట్నంగా తీసుకొన్న మొత్తం సామానులు, తిరిగి వాపసు ఇచ్చి వేయవలయును'' విషయం చెప్పాడు.

కుమారుని నోటినుండి వెలవడిన ఈ మాటలు విని, బాబూ శ్యామ్‌లాల్ యొక్క మనస్సు, కొండ ఎత్తునుండి అఘాదంలో పారవేసిన విధంగా తన శరీర పరిస్థితి అయినది. వారు ఆశ్చర్య చకితులైనారు. కొడుకును అలాగే చూస్తూఉండి పోయాడు. నోటినుండి మాటరాలేదు. మతి స్థిమితం లేనివాడుగా నిశ్చేస్టుడైనాడు. తన శరీరం పై వెంటనే అధికారంను పొందాడు.

లక్ష్మి ఏ విధంగా ఊహించుకొని ఉండెనో ఆమె మనస్సులో, అందుకు విరుద్ధంగా శత్రువులు బాంబు పేల్చినట్లుగా తను నిశ్చేస్టురాలై పోయినది. ఆనందంతో ఆమె మనస్సు పరవశమై పోయినది. తండ్రి పాదాలపై వాలిపోయినది.

రామచంద్రుడు చెప్పినది గ్రహించి, బాబూ శ్యాంలాల్‌గారు చెప్పారు. అపశకున మాటలు నోటినుండి పల్కుచున్నావు మరియు మూర్ఖుని లాగా మాట్లాడుచున్నావు, కట్నం నేనొక్కడినే తీసుకొంటున్నానా? సమాజంలోని గొప్ప గొప్పవారే గౌరవం కొద్దీ మరియు వరకట్నములు, నిరోధించవలయునను, రాజకీయ నాయకులే కట్నాలు తీసుకొంటున్నారు. నీవు ఈ ప్రపంచంలో ఇంకా చిన్న పిల్లవాడివి, నీకు ఏమియు తెలియదు, నా మాట వినుము, పెండ్లి కుమార్తెను తీసుకొని వెంటనే పద ప్రయాణ మూహుర్తం దగ్గర పడినది.

''నేను పెండ్లిలో కట్నం తీసుకోనని ప్రతిజ్ఞ చేసిఉన్నాను'' తమరికి కట్నం కావలయునా? కొడుకా? తమరు ఈ రెండింటిలో ఏదో ఒకటి కోరుకొండి. నేను ఈ ఇంటినుండి కేవలం పెండ్లి కూతుర్ని మాత్రం నా వెంట తీసుకొని వస్తాను. నాకు కట్నం యొక్క అవసరం ఏ మాత్రం లేదు. ఈశ్వరుడు నా బాహువులకు సంపాదించే మంచి శక్తిని ప్రసాదించాడు. నేను కట్నం తీసుకొని నాకు నేను అమ్ముకోలేను. తమరు వధవు తండ్రినుండి ఏదైతే కట్నంగా పొందారోవాటిని అన్నింటిని, వెంటనే వాపస్సు ఇచ్చివేయండి, అప్పుడే నా పాదం ఇక్కడినుండి లేస్తుంది.

ఒక సాధారణమైన వ్యక్తి, కోమలమైన హృదయం కలవాడు, తనకు జన్మనిచ్చిన తండ్రితో, కట్నంయొక్క సమస్యతో, ఇంత కఠినమైన నిర్ణయం తీసుకొన్నాడు. ఈ విధంగా జరుగుతుందని ఎవ్వరు ఊహించను లేదు. తన ప్రియమైన కుమారుని ఈ క్రొత్త పోకడ చూచిన బాబూ శ్యాంలాల్ ఒకేసారి చల్లబడి పోయాడు. వారు కొడుకు మాటను తప్పని సరిగా వినవలసి వచ్చినది, ఎందుకనగా ఈ కుమారుడే తన యొక్క ముసలితనంలో సహాయకారి.

బాబు శ్యాంలాల్‌గారు తమ వియ్యంకుడుగారికి కట్నంలో ఇచ్చిన సామానులు, డబ్బు మొత్తం తిరిగి ఇచ్చివేసాడు. పెండ్లికి వచ్చిన పెద్దలు, బంధువులు అందరు ఆశ్చర్యంలో మునిగినారు. అందరు ఆనందపరవశులైనారు. వారందరి మనస్సులో పెండ్లి కుమారుడు ఒక గొప్ప ఆదర్శ వ్యక్తి అయినాడు.

లక్ష్మిని పరమార్శించేవారు ఎవరు కనిపించలేదు. ముందు ఆమె మనస్సు, ఆమెను ధిక్కరిస్తుండినది. నేను దేవతలాంటి భర్తను, ఆయన వ్యక్తిత్వమును అవమాన పరచితిని, అని ఆమె మనస్సులో అనుకొనినది. వారికి కూడ నా మనస్సులో ఉన్న ఆలోచన వున్నదని, నాలాగ తను ఒక నిర్ణయం తీసుకొంటాడని నాకు ఎలా తెలుయును?

ఈ విధంగా, ఎవ్వరూ తలంచని సంఘటన వల్ల అందరి మనస్సులు ఆనందంతో నిండినవి. తలంపుకు రాని ''ఈ సుగంధము'' ఎప్పటికిని అమ్ముడుపోదు. ఈ విధంగా లక్ష్మి తన అత్తమామగారింటికి పోయి సుఖించినది

## యోగ్యుడు

''యోగ్యుని పేదరికం ఎప్పుడు చదువని పవిత్ర గ్రంథం వంటిది, తను హాయిగా జీవిస్తున్నానని తను అనుకొంటాడు గాని, ఇతరులకు అతును బ్రతికుండి చచ్చిన వానితో సమానం'' – డెక్కర్

# బంజారాల జానపద కథ

## బంజారా కన్యయొక్క గాథ :

ఒక తాండాలో ఏడుగురు బంజారా సోదరులు నివశించి ఉండిరి. వారికి ఒకే ఒక చెల్లెలు ఉన్నది. తాండాలో తీజ్ పండుగ చేస్తుండిరి. అప్పుడు చెల్లెలు వారి వదినలు దగ్గర పోయి వారివద్ద ''చునార్'' అడిగినది. అప్పుడు వదిన అన్నది. నీకు ఒక షరుతుపై (హమీ) మాత్రమే నీవు అడిగిన చునారి ఇస్తాను. ఆ షరతు ఏమనగా ఈ చునారికి, ఎక్కడైన సరే ముక్క పోయినచో(దెబ్బతగిలినచో) నిన్ను కోసి, నీ రక్తముతో ఆ చునారికి రంగుపూస్తాను. అప్పుడు ఆ అమ్మాయి తీజ్‌ను పూజించుటకు పోయినది. అక్కడ పోయిన తరువాత చునారిని ఒక గట్టుమీద ఉంచినది.

అకస్మాత్తుగా వదిన అక్కడికి వచ్చి చునారికి చెంబుయొక్క కంఠం దగ్గరించి, ఒక గెర్రి(గీటు) వేసి తన ఇంటికి చేరుకొన్నది. ఎప్పుడు ఆ కన్య తన తీజ్ (మట్టిపాత్ర) చునార్ ఎత్తటానికి వచ్చి చూస్తే, చునార్‌పైన గీటు (గెర్రి) పడి ఉన్నది. అప్పుడు ఆ అమ్మాయి తాండా ప్రముఖుల వద్ద ఒక ప్రతిజ్ఞ చేసింది, నన్ను బలిదానం చేయండి, నేను చనిపోయిన తరువాత నా దేశమునకు, స్వాతంత్రం లభించే వరమును నాకు కల్పించండి.

ఈ విధంగా ప్రతిజ్ఞ చేసి ఆమె ఇంటికి వచ్చింది, మరియు తన వదినకు చునారి ఇచ్చినది. వదిన అన్నది ఈ చునారి మీద గీటు(గెర్రి) ఉన్నది, అప్పుడు ఆమె భర్త ఇంటికి వచ్చినప్పుడు ఆయనకు చెప్పింది. నీ చెల్లెలు నా చునారి తీసుకొని పోయి దానిని పాడుచేసుకొని వచ్చినది. ఈ పాడు అయిన దానిని వెంటనే బాగుచేయవలయును.

ఈ విషయమును విన్న అన్న తన చెల్లెలితో చెప్పుచున్నాడు. నిన్ను మామగారు రమ్మన్నారు. పోదంపదా అన్నాడు. చెల్లెలు, అన్న చెప్పిన మాటలు విని చాలా సంతోషించినది. మరియు ఎక్కడికి పోతున్నారు అన్నగారు అన్నది.

వారు ఇద్దరు ప్రయాణమైనారు, పోతు పోతూ ఒక గొప్ప కీకారణ్యం చేరినారు. ఆ ప్రాంతంలో త్రాగుటకు ఒక చుక్క నీళ్లకూడ దొరకని ప్రాంతం. నీటి దప్పికతో గొంతు ఆరిపోతున్నదని చెల్లెలు అన్నతో చెప్పింది. అన్నగారు దప్పిక చాలా అగుచున్నది, కొద్ది నీళ్ల తాపండి అని, ఒక బావి వద్దపోయి కొన్ని నీళ్ళు అన్న త్రాగి, తరువాత ఇప్పుడు నీవు త్రాగు అన్నాడు, నీళ్ల త్రాగటానికి శిరస్సును వంచినవెంటనే, అన్న తరవాళమును తీసి ఆమె తలను ఖండించాడు, చెల్లెలు స్వర్గస్తురాలైనది.

కొద్ది రోజులకు అమ్మాయి, అత్తగారు, వారి ఊరికి వస్తు బావి దగ్గర నీళ్ల త్రాగటానికి వచ్చినప్పుడు, వారికి ఒక శబ్దం వినిపించినది.

కరే బాము కౌన్ ఆయా !

సుగుణ బాయి తార ససురా జీ !

ససురాజీ ససురాజీ !

హత్ మతీ దొవే కుంవార్‌రా !

ఫుల్‌మతీ తోడే !

భాయి న మారి బేనడి !

భూజాయికి రంగీ చునారీ !

కారే భాయి కౌన్ ఆయా !

సుగుణ బాయి తేరి సాసూజీ !

సాసూజీ సాసూజీ !

హత  మతీ దొవే కువంరా రా!

ఫుల్‌మతి తోడే! భాయినే మారి బేనడి।

భోజాయి కీ రంగీ చునేరి !

ఈ విధంగా ఈ కథ జరిగిపోయినది. కాన ఆ బంజారా అమ్మాయి తిరిగి జన్మించి తనకు మాట ఇచ్చిన అబ్బాయినే 7 సం.లకే పెండ్లిచేసుకొని తన అత్తవారింటికి వెళ్లిపోయినది.

# చంద్రమతి-కథ

పడతూ-లేస్తూ ప్రేమసింగ్ కార్యదర్శి, సజనసింగ్ తంబు ముందు చేరాడు. శరీరంనుండి గాయలతో రక్తసిక్తమై నాయనా, నాయనా అని అరుస్తున్నాడు, వాని మొత్తం శరీరం గాయాలతో రక్తంతో నిండి ఉంది. గాయాలతో వాని శరీరంనుండి కండలు వ్రేలాడుతున్నవి. వాని చేతిలో రక్తంతో ఎర్రగా మారిన కరవాళము ఉండినది, ఎవ్వరైతే వారిని ఈ రోజు రక్షించారో వారు. తండ్రి, తండ్రి అను శబ్దమును విని, తండా నుండి ప్రజలు పరిగెత్తి బయటకివచ్చారు. కార్యదర్శి రాజసింహ కూడ దాగుకొంటు బయటకు వచ్చారు. కొడుకు శరీరమును చూచి వారి నిజ స్వరూపమును చూచి ఎక్కువ భయంకరంగా మారాడు. పిడుగు పడిన విధంగా గర్జించి, వెంటనే చెప్పండి ఎవరు నిన్ను ఈ పరిస్థితికి తెచ్చినది. నేను ఇప్పుడే వాడిని భూమిలో పాతివేస్తాను.

నాయక్‌కూడ అక్కడికి వచ్చినారు. అక్కడఉన్న కొంత మంది ప్రేమసింగ్‌కు సహకరించారు. ప్రేమసింగ్ మెల్లిగా చెప్పాడు, ''అమీర్ ఖాన్ జిందా నన్ను తీసుకొని పోయినాడు'' మేము ఇద్దరం నది ఒడ్డున కూర్చుని ఉంటిమి. అతడు బలవంతంగా చందాను నా నుండి లాగుకొన్నాడు. అంతలో సైన్యం నన్ను ముట్టడించింది. నేను ఒక్కడిని ఎంతవరకు పోరాడగలను తండ్రి.

ఇదంతా విని వారు అందరు ఉద్రేకవంతులైనారు. వారి కండ్లలోనుండి అగ్ని కురిసింది. రాజసింహుడు గర్జించాడు. ఆ గుంట నక్కకు ఇప్పుడే చూపిస్తాను. ఇప్పటి వరకు బంజారా కరవాళములు నీళ్ల త్రాగలేదు, ధన్యమైనది. ఇటువంటి నీచుని ఆటంకము చేసి వాడు తన మరణమును ఎప్పటికి తప్పించుకొనలేడు. నాయకుడు చెప్పాడు. ''చూడు నాయనా!''

నేను మీకు ముందు నుండి చెప్పుచున్నాను. మనము అభిరపుర్ సరహద్దులో కాలు మోపకూడదని! వారి దురాగతాలు గూర్చిన కథలు ఎవరికి తెలియనివని, నా బిడ్డను ఎత్తుకొని పోయి, బంజారాలను అగౌరవపరచి, మనలను రెచ్చగొట్టాడు. నేను ఇప్పుడు వాని బల్లెముతో బల్లెము కలుపగలను.

తమరికి తెలియదు నాయక్‌జీగారు, మనము వాని కోటపై దండెత్తుటవలన ఉపయోగము ఉండదు. అందుకుగాను మనము, బౌద్ధ- నీతిని అనుసరించవలసి ఉన్నది. మీరు తొందరపడుటవలన లాభము లేదు. ఎటువంటి ఉపాయమును ఆలోచించవలయునంటే, పాము చనిపోతుంది, కాని దానిని కొట్టిన కర్ర మాత్రం సాక్షిగా ఉండిపోవలెను. నాయకుని యొక్క బుద్ధికుశలతపై కార్యదర్శికి మంచి నమ్మకము ఏర్పడినది. కార్యదర్శి కుమారుడు ప్రేమ్‌సింగ్ గాయాలకు కట్టుకట్టడం జరిగినది. అతనికి భోజన వసతులు కల్పించడం జరిగినది. ఆ రాత్రి గడచిపోయినది.

రెండవ రోజు ఎన్నిక చేసిన రెండువందల మందిని తీసుకొని, ప్రేమ్‌సింగ్ ఆధ్వర్యములో బంజారాల గుంపుకోటకు దూరంగా చేరుకొన్నారు. వారి గుంపులో ఢాల్యా మరియు ఢాడీలు కూడ ఉండిరి. కార్యదర్శిగారి తమ్ముడు కోటగోడ ద్వారం దగ్గర చేరి, ద్వారం కాపలాదారునితో చెప్పుచున్నాడు, చూడండి నాకు సుల్తాన్‌గారి వద్దకు సందేశము పంపండి, వారి మామగారు వారిని కలవాలను కొంటున్నారు. కాపలాదారు ముందేమో అతన్ని అవహేళన చేసాడు, తరువాత అక్కడ వాతావరణం చూచుకొని రెండవ కాపలాదారు సందేశం తీసుకొని లోపలకి వెళ్లి పోయాడు, అమీర్‌ఖాన్ తన మామగారిని దర్బారులో హాజరు పరచుటకు ఆదేశం ఇచ్చాడు.

కార్యదర్శి తమ్ముడు సూరజ్‌మల్ దర్బారులో వచ్చాడు. వారు వంగి అమీర్‌ఖాన్‌గారికి నమస్కారం చేసాడు. ఈ విధంగా చెప్పాడు. సుల్తాన్ సాబ్, తమరు నిజంగా గొప్ప గమ్మత్తు చేసారు. చందాను వివాహం చేసుకొంటాను అని మాతో ఒక్కమాట చెప్పిఉన్న మేము చాలా ఆనందంగా ఆమెతో మీ వివాహం చేస్తుంటిమి. కాని ఇప్పుడు కూడ ఏమి అడ్డంకులు కలుగలేదు. నేను నా కుమార్తె వివాహం మీతో చేయుటకు సిద్ధంగా ఉన్నాను. ఏమిలేదు. తమరు మా వారినందరిని పిలిపించి, వారి పాటలు, గానముల ఆనందమును పంచుకొని, వారిని సంతోషపెట్టవలెను. ఎందుకనగా మా బంజారాలు తమ పిల్లల పెండిండ్లలో, నాట్యం, గానంచేసి ఆనందించుతారు. తమరు దయచేసి ఇందుకు ఒప్పుకొని మాకు అనుమతి ఇవ్వండి. మా యొక్క కంటి స్వప్నం ముందునే మేము, మా బిడ్డ చెయ్యిని, మీ చేతిలో ఉంచుటకు ఉవ్విళ్ళూరుతున్నాము. తమరు అనుమతి ఇవ్వవలెను. నేను నా తాండా వారిని బంధువులను, పిలిపించుకొని వస్తాను. వారు అడవిలో గడ్డి కోయుటకు వచ్చి ఉన్నారు. తమవంటి గొప్ప ధైర్యశాలి అయిన రాజుతో బంధుత్వం చేయటం, నా వంటి వాడికి గొప్ప అదృష్టంగా భావిస్తాను.

అమీర్‌ఖాన్ ఈ ప్రశంసలకు పొంగి పోయాడు. అతను సైనికులతో ఆజ్ఞను ఇచ్చినది ఏమనగా పెండ్లి ఏర్పాట్లు చేయండి మరియు బంజారాలను లోనికిరానీయండి, వారిని అడ్డగించే పని ఏమి చేయవద్దండి.

సూరజ్‌మల్ మరియు ప్రేమ్‌సింగ్ తమ ప్రయత్నంలో కృతకృత్యులైనారు. గడ్డిమోపులతో పాటు రెండువందల మంది పరాక్రమశాలులైన బంజారాలు కోటలోపల

ప్రవేశించినారు. మిగిలిన వారు కోటలోపల అక్కడక్కడ దాగుకొని కూర్చున్నారు. కోటలో అధిక సంఖ్యలో సైనికులు లేకుండిరి. ఎందుకనగా వారిపై ఎప్పుడు ఆక్రమణ చేసే అవకాశము లేకుండెను. కోటనాలుగు ప్రక్కల లోతైన కందకాలు ఉండినవి. దానినిండా నీళ్ళు ఎప్పుడూ ఉంటాయి. అందులో ఎన్నో రకాల విషజంతువులను, మొసళ్లను సంరక్షించుచుండిరి.

కొద్ది సేపటిలోనే పెండ్లికై క్రొత్త మండపము తయారు చేసారు. ఆ మండపములో బంజారాలందరు చేరుకొన్నారు. అమీర్‌ఖాన్ యొక్క ఆనందమునకు అవధులు లేకుండెను (ఆనందం పట్టలేక ఉండెను) అప్పుడు ప్రేమ్‌సింగ్, అమీర్‌ఖాన్ ఎదురుగా చేరి మరియు చెప్పుచున్నాడు, తమరి ప్రక్కన చాంద్‌కుమార్తెను చూచి, బంజారాల మనస్సు పిల్లులాగా గంతులేస్తున్నట్లు అనిపిస్తుంది. తమరు చాంద్ బేటిని రమ్మని చెప్పండి.

సుల్తాన్‌గారు చాంద్‌ను పిలుచుకొని రండి అని పంపగా సైనికులు అప్పుడు వట్టిచేతులతో వచ్చారు. అప్పుడువారు కోపముతో తెల్లబోయి కాళ్లపై ఎగరటం మొదలు పెట్టారు. అప్పుడు ఆ అవకాశమును ఉపయోగించుకొనుటకు ప్రేమ్‌సింగ్ చెప్పాడు, తమరు ఏ మాత్రం చింత చేయకండి, నేను వారిని నా వెంట తీసుకొని వెళ్ళుతాను. చూస్తాను ఆమె ఎందుకు రాదో? పదండి, సిపాయిగారు నా వెంట రండి.

సిపాయి చాంద్ ఉన్న గదిని చూపించాడు. ప్రేమ్‌సింగ్‌గారు సిపాయితో ఇక్కడే నిలబడండి అని చెప్పారు. ప్రేమ్‌సింగ్ వేషము మార్చివచ్చిఉండెను. గదిలో చేరగానే అతను తన నకిలి గడ్డమును, మీసాలను తీసివేసారు. అతన్ని చూచిన వెంటనే చాంద్ పరిగెత్తి వచ్చిగట్టిగా కౌగలించుకొంది. ఇద్దరు ప్రేమికులు ఒక్క క్షణం ఒళ్ళు మరచి ఆ లింగనం చేసుకొన్నారు. అయితే వెంటనే రెండవ క్షణంలో ప్రేమ్‌చంద్‌తో చెప్పాడు. వెంటనే అక్కడినుండే వెళ్లిపోయే మార్గం చేప్పాడు. చాంద్‌ను తీసుకొని వారు మండపం దగ్గరవచ్చాడు. చంద్ ఎటువంటి ఆక్షేపణలేకుండ నెమ్మదిగా పోయి అమీర్‌ఖాన్ ప్రక్కలో కూర్చున్నది.

మండపంలో డ్యాన్సులు, పాటలు పాడుటకు అన్ని ఏర్పాట్లు చేసి ఉండిరి. ఢాల్య తన ఢోలక్‌పై నాట్యం మొదలు పెట్టాడు. మరియు ఢాడి తన చేతిలోని కట్టెతో సారంగిపైన వాయించటం మొదలు పెట్టాడు. బంజారాలు తాళబద్ధంగా నృత్యం చేయటం మొదలు పెట్టారు. అందరి చేతులలోను చిన్న చిన్న కట్టెలు ఉండెను. ఈ కోలన్న కట్టెల శబ్దం ఆకాశాన్నంటు చుండెను.

నాట్యము, పాటల మహోత్యం పాటు మధువు కూడ త్రాగటం మొదలు పెట్టారు. అమీర్‌ఖాన్ అయితే మధువు పెగ్గులు తరువాత పెగ్గులు త్రాగటం మొదలుపెట్టాడు.

ఘోడి( ఆడగుఱ్ఱం) పై పాట చెప్పుచుండిరి.

మామలా మారి బహనా !

చాంద్ ప్యారి బహనా ।

వాట్ దేఖరే తారీ ।

కిడకి భాయిరో బందణా ।

రాత్ భీమి భారి ।

నాయకేరి ఛోరి ।
ప్రేమ్ పుత్కార్ ఖారి ।
వాట్ దేఖరే తారి,
నాయకరి ఛోరి పన,
మారితూ ఛీ బహనా ! సామల్.......

(ఈ పాటలో చాంద్‌కు చెప్పుచుండి, నీవు వెంటనే తయారవ్వు, ప్రేమ్‌సింగ్ కిటకి నుండి క్రిందకి నిన్ను చూస్తుంటారు, నీవు కిటకి కట్టియున్న తాడు సహాయంతో క్రిందకి దిగిపో, సమయం చాలా తక్కువగా ఉన్నది.)

చాంద్ అర్థం చేసుకొంది ఆమె లేచి, అమీర్‌ఖాన్ దగ్గర పోయి అతని చెవిలో ఏదో చెప్పినట్లు చెప్పి వెళ్లి పోయినది. ఇక్కడ బంజారాల నాట్యం తమ కాళ్ల పై నిలువకుండెను, డ్యాన్సులు చేసుకొంటూనే వెళ్లి పోయారు, మధువు(సారాయి) త్రాగటం కూడ తక్కువై పోయినది. అప్పుడు చాంద్ వచ్చి ఉండలేదు. అమీర్‌ఖాన్‌కు అర్థమైంది త్రాగుడు మత్తులో ఏదో అయినది, వారు చాంద్ ఉండే గదిలోకి పోయారు, అక్కడ ఆమెను ఉంచి ఉండెను. కాని చాంద్ అక్కడలేదు. అక్కడ వ్రేలాడుతున్న తాడును చూచి, మత్తు దిగిపోయినది.

వారు వెంటేనే కోపంలో ఉడికిపోతూ, ఆపు చేయండి, ఈ డ్యాన్సులు – పాటలతో, మీరు నన్ను మోసము చేయలేరు, సైనికులారా పట్టుకోండి ఈ ద్రోహులను.

అక్కడ ఉన్న సైనికులలో సగానికి పైన మత్తులో మునిగిఉండిరి. మిగిలిన సైనికులు వచ్చేలోపు బంజారాలు తమ గడ్డిమోపులలో దాచి ఉంచిన, తమ పదునైన ఆయుధములను బయటికి తీసుకొన్నారు. చాంద్‌ను సురక్షితంగా తీసుకొని ప్రేమ్‌కూడ అక్కడకువచ్చాడు.

బంజారాలకు మరియు సైనికుల మధ్య యుద్ధం ప్రారంభమైనది, సైనికులు మత్తులో ఉండిరి. బంజారా ఖడ్గములు వారిని వధించుచుండినవి. కొంత మంది బంజారాలు తమ బిడ్డల రక్షణకై ప్రాణ త్యాగం చేయవలసివచ్చినది.

అమీర్‌ఖాన్‌ను చంపుటకు ప్రేమ్ చాలా ఆగ్రహంతో ఉండెను. ఇద్దరి మధ్య భీకరమైన పోరాటం జరిగినది. ఖాన్ కత్తి యుద్ధంలో బాగా ఆరితేరినవాడు. కాని ప్రేమ్ కూడ తక్కువవాడు కాదు. అతను తన హస్తలాఘవమును చూపించాడు, దానితో అమీర్‌ఖాన్ ఆశలు వదలి పెట్టాడు. ఆఖరికి తమ మాన మర్యాదలపై చేయివేసిన దుష్టుని పై తిరుగులేని ఒక భయంకర పోరాటం చేయగా విరోధి ముక్కలు ముక్కలైనాడు.

చాంద్‌ను వెనక్కి తీసుకొని రావడంలోబంజారా వీరుల ప్రయత్నం ఫలించినది.

''రాజకీయ బలములేని జాతిని ప్రపంచములో ఎవ్వరును గౌరవింపరు''
జాతీయ రాజ్యాభిమానము, సుగుణము అన్నింటిలో ఉత్కృష్టమైనది.
రాజ్యాధికారము సంకుచితముగను, నియమ బద్ధముగను ఉన్నప్పుడే వ్యక్తులకు స్వాతంత్ర్యం లభించును. వ్యక్తి స్వాతంత్రమే వ్యక్తి సౌభాగ్యమునకు మూలాధారము – హీగల్ తత్వవేత్త

# బంజారా భాషా-ఒక సంగ్రహావర్ణనం



డా॥ హెచ్. యస్. బ్రహ్మానంద
డా॥ ఎం. గోనా నాయక్

## 'భారతదేశంలో గోర్ బోలి' :

భారతదేశం అంతటా బంజారాలు తమ భాషను 'గోర్ బోలి' అని, తమను తాము 'గోర్ జాతి' జనులని పిలుచుకుంటారు. ''సర్ జార్జ్ గ్రియర్సన్'' ''లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా'' (సం9)లో కూడా గోర్ బోలి అనే ఈ మాటను గుర్తించలేదు. 'ఆల్-ఇండియా బంజారా స్టడిటీమ్'(1969) తొలిసారి వీరి భాషకు 'గోర్ బోలి' అని వ్యవహారంలో ఉన్నదని గుర్తించారు. తమజాతి కానివారిని 'కోర్' అని పిలుస్తారని కూడా బంజారా స్టడిటీమ్ గుర్తించింది.

గోర్ భాష(లింగో) ఒక ప్రత్యేకమైన గిరిజన భాష అని బంజారా స్టడి టీమ్ అభిప్రాయపడింది. దేహ, భాగ, వాచకాలు, వేష భాషలు, అహార పానీయాలు, వృత్తులు వీటికి సంబంధించిన పద జలాల ఆధారంగా 'ఇండో ఆర్యన్' భాషలో ఇదొక ప్రత్యేకమైన వ్యక్తిత్వాన్ని కలిగిన భాష అని స్టడిటీమ్ అభిప్రాయాన్ని ప్రకటించింది.

గోర్‌బోలి వ్యవహర్తలు ఇండియాలో(17) పదిహేడు రాష్ట్రాలలో వ్యాపించిఉన్నారు. వీటిని ఐదు ప్రాంతాలుగా విభజించవచ్చు.

*1) ఉత్తర ప్రాంతం : హిమాచల్ ప్రదేశ్, పంజాబ్, హర్యానా, ఢిల్లీ మొదలగునవి.*

*2) దక్షిణ ప్రాంతం : మైసూర్, ఆంధ్రప్రదేశ్, కేరళ మరియు మద్రాసు రాష్ట్రాలు.*

*3) పశ్చిమ తీరం : రాజస్థాన్, గుజరాత్, మహరాష్ట్ర, మరియు గోవా రాష్ట్రాలు.*

*4) మధ్య ప్రాంతం : మధ్య ప్రదేశ్*

*5) ఈశాన్య ప్రాంతం : ఒరిస్సా, పశ్చిమ బెంగాల్ మరియు బిహార్ రాష్ట్రాలు.*

గ్రియర్సన్ బంజారి, లభాణి, బహురూపియా అనే మూడురకాల బంజారా మండలికాలను గుర్తించాడు. వీటిలో బిహార్‌లో కనిపించే లభాణి లేదా వంజారి మాండలీకాన్ని ప్రామాణికంగా గుర్తిస్తూ నాసిక్‌నుండి, బెల్గాంనుండి లవాణి మాండలికాలకు ఉదహరణలిచ్చాడు. మధ్య పరిగణాలు, సంయుక్తపరిగణలు, పంజాబ్, లాహోర్(లభాంకి), కాంగ్రా, ముజఫర్ ఘర్, గుజరాత్(లబాని)లో పంజాబోస్‌యార్ కోట్‌లనుండి బహు రూపియాలను ఉదహరించాడు. బంజారాలకు సంబంధించి గ్రియర్సన్ క్రింది అంశాలుచెప్పాడు.

''బంజారాలు సుప్రసిద్ధులైన సార్థవాహులు, పశ్చిమ దక్షిణ భారతం నిండా వ్యాపించి ఉన్నారు. ఇండియాలో చాలా భాగాల్లో ఈ జాతివారు అయా ప్రాంతంల్లోని జనాభా మాట్లాడే

భాషను మాట్లాడుతారు. కాని వీరు బాంబే మధ్య పరిగణాలు, పంజాబ్ సంయుక్త పరిగణాలు, మధ్య భారతంలో వారిదైన ఒక భాషవారికుంది. ఆ భాషపేరు ఆ తెగవారికి ఆయాప్రాంతంలో ఉన్న పేరును బట్టి మారుతూ ఉంటుంది. వాయువ్య భారతంలో అత్యధికంగా వ్యాపించి ఉన్నా దక్కన్‌లో గూడా వారు అత్యధిక సంఖ్యలో వ్యాపించిఉన్నారు. మిక్కలి బలువంతులుగా కూడా ఉన్నారు. వారి ప్రాచీన ఆచార సంప్రదాయాలు ఇక్కడే ఇతర ప్రాంతాలలో కన్నా అధికంగా మిగిలి ఉన్నాయి'' అని గ్రియర్సన్ అభిప్రాయపడ్డారు.

కాని గ్రియర్సన్ బంజారాలపై విషయ సేకరణ దక్కన్ ఉత్తర భాగంలోనే చేశారు. అందుచేత హైదరాబాదు ప్రాంతంలోని బంజారాల మీద దక్షిణ భారత దేశంలోని బంజారాల మీద ఆయనకు సామగ్రి లభ్యం కాలేదు. కాని ధఖన్‌లోని బంజారా 'బిహార్' లోని ప్రామాణికి భాషకు సన్నిహితంగా ఉన్నదని అభిప్రాయపడ్డారు.

''బంజారా భాషకు సంబంధించిన అతి ముఖ్యమైన విషయమేమంటే! అది బీరార్‌లో కూడా పరిశుద్ధరూపంలో ఉండకపోవడం. ప్రతి చోట అది ఆ ప్రాంతంలోని ప్రాంతీయ భాషతో కలిసిపోయి ఉంటుంది''. అన్న విషయాన్ని కూడా గ్రియర్స్‌న్ గుర్తించాడు. అంటే అలా అయిన బీహార్ ప్రాంతంలోని బంజారా భాషలో చాలా ప్రాచీన లక్షణాలు మిగిలాయని చెబుతూ అదిపాక్షికంగా మార్వాడి భాష మీద, పాక్షికంగా ఉత్తరగుజరాతి భాష మీద ఆధారపడి కాలక్రమంలో ఇతర భాషలతో కలిసి వైవిధ్యాన్ని పెంపొందించుకొన్నదని చెప్పాడు.

గ్రియర్సన్ కొన్ని విలక్షణ పదాలను బంజారాభాషలో ప్రత్యేకంగా గుర్తించాడు. అంటే ఈ పదాలు సమీపంలో ఉన్న ఉత్తారది భాషల్లో కన్పించటంలేదని ఆయన స్పష్టంగా గుర్తించాడు.

| | | | |
|---|---|---|---|
| అజి(వజి) | 'ఇంకా' | ఆట్ | 'ఎనిమిది' |
| బాటి | 'రొట్టె' | ధ్యాం | 'తో' |
| కమేడి | 'పక్షి' | కేల్డా | 'దూడ' |
| కొత్ర | 'కుక్క | మాటి | 'మనిషి' |
| యాడి | 'తల్లి' | | |

గ్రియర్సన్ ఇచ్చిన భాషా సామగ్రిని గమనిస్తే, తాండామనిషినే 'గోర్' అని ఇతరులను 'కోర్' అని స్పష్టంగా గుర్తించవచ్చు. సంయుక్త పరగణాలనుంచి ఆయన ఇచ్చిన బంజారా కథలో ఈ క్రింది వాక్యాలు గమనిస్తే ఈ విషయం తెలుస్తుంది.

1) ఏక్ గ్వారేర్ దీ బేటాథే
ఒక బంజారాకు ఇద్దరు కొడుకులు ఉండేవారు.

2) జబ్ ఉయేక్ కోరేర్ ధాంయి చంలగో
అప్పుడు అతను ఒక భూస్వామి దగ్గరకు వెళ్ళాడు.

3) ఓ కోర్
ఆ భూస్వామి.

ఈ ప్రయోగాల ఆధారంగా, బంజారా స్టడీటీమ్ ప్రకటించిన వాస్తవాలను దృష్టిలో పెట్టుకొని బంజారా భాషను 'గోర్ బోలి' గా గుర్తించడం అవసరమని ఆచార్య హెచ్.యస్. బ్రహ్మానందంగారు 1976-82ల నడుమ అనంతపురం, చిత్తూరు జిల్లాలోని సుగాలీలపై పరిశోధించి గుర్తించారు. తరువాత సంవత్సరంలో 1983-89ల నడుమ భారతదేశంలో 17 రాష్ట్రాలనుంచి విషయ సేకరణచేసి. భారతదేశ మంతటా 'గోర్ బోలి'లో సమానతాలు ఉన్నాయని, చారిత్రకంగా పరిశీలిస్తె క్రీస్తుశకం10,11 శతాబ్దాలనాటి పశ్చిమ హిందీస్వరూపమే మౌలికమైన 'గోర్' బోలి స్వరూపమని బ్రహ్మానందగారు 1969లో యూనివర్సిటి గ్రాంట్స్ కమీషన్ పరిశోధన పథకం నివేదకలో స్పష్టం చేశారు/ కీ.శే.శ్రీరాంశర్మగారు ( రీడర్ హిందీ శాఖ స్మానియా విశ్వవిద్యాలయం) 'బంజారా సమాజ్' అనే గ్రంథంలో హిందీ భాష అనే మహానదికి బంజారాభాషకూడా ఒక ఉపనది అని అభిప్రాయపడ్డారు. ఈ అభిప్రాయాన్నే ఇప్పటికీ ప్రమాణికమైన అభిప్రాయంగా గ్రహించవచ్చు.

**సుగాలీల భాష ఒక స్థూల పరిచయం :** నేను అనంతపురం జిల్లాలోని శింగనమల మండలానికి చెందిన నాగల గుడ్డం తాండాలో జన్మించాను, సుగాలీల మాతృభాష కాబట్టి నేను నా తాండాలోని భాష అధారంగానే పరిశీలన మొదలు పెట్టాను. నా పర్యవేక్షకులు ముందుగానే నాభాష గురించి పరిశోధించిఉండటం వల్ల నేను గమనించిన అంశాలను వారుతయారు చేసిన 'A Grammar of Sugali Language'అనే గ్రంథంతో అన్వయించుకొని సుగాలీ భాష స్వరూపాన్ని స్థూలంగా నేను ఇలా పరిచయం చేస్తున్నాను.

## వర్ణాలు

### ఈ భాషలో క్రింది హల్లులైనాయి

| స్థానములు ............ ప్రయత్నములు | ఉభఓష్ఠ్యములు | దంతం<br>దంతమూలీయం | మూర్ధన్యములు | తాలవ్యములు | కంఠ్యములు | కంఠమూలీయం |
|---|---|---|---|---|---|---|
| స్పర్శములు | ప, బ | త, ద | ట, డ | చ, జ | | క |
| ఊష్మములు | | స | | | | షా |
| అనునాసికం | మ | న | ణ | | | |
| పార్శ్వికము | ల | ళ | | | | |
| తాడితం | | ధ | | | | |
| అంతస్థం | వ | | య | | | |

**హల్లులు - 19**

# వర్ణమాల

## ఈ క్రింది భాషలో అచ్చులైనాయి

| స్థానము | పూర్వాచ్చు | కేంద్రాచ్చులేక | మధ్యాచ్చు | పశ్చిమాచ్చు |
|---|---|---|---|---|
| ఊర్ధ్వ | ఇ, ఈ | | | ఉ, ఊ |
| మధ్య | ఎ, ఏ | | | ఒ, ఓ |
| నిమ్న | | అ, ఆ | | |

**అచ్చులు - 10**

# వర్ణవ్యాప్తి

| | | | | |
|---|---|---|---|---|
| ప) | పాగ్ | 'పాదం' | కపాళో | 'నుదురు' |
| | టో(ప్రో | 'కొబ్బెర' | ఝూప్డి | 'కొట్టం' |
| | సాప్ | 'పాము' | | |
| త) | తార్ | 'నీయొక్క' | మాతో | 'తల' |
| | కత్త | 'ఎక్కడికి' | ఖప్తి | 'మెట్లు' |
| | వేత్‌డూ | 'పెళ్లికొడుకు' | మూత్‌ణో | 'మూత్రం' |
| | వాన్‌(జి | 'మంత్రకత్తె' | | |
| ట) | టపారో | 'పెట్టె' | మోటో | 'పెద్దదైన' |
| | లట్టా | 'వెంట్రుకలు/వెంట్రుక' | గట్లా | 'కొండ' |
| | | మిట్కో | 'కప్ప' | రీంట్ 'చీమడి' |

| | | | | |
|---|---|---|---|---|
| చ) | దీనికి దంత్య తాలవ్య ఉచ్చారణలు రెండు ఉన్నాయి | | | |
| | చరా | 'మేపటం' | చట్కి | 'కాలి మెట్టెలు' |
| | చాల్ | 'నడుచు' | చూలో | 'పొయ్యి' |
| | నాచ్ | 'నృత్యం' | పాంచ్ | 'ఐదు' |
| చ) | చ్యార్ | 'నాలుగు' | బిచ్చి | 'స్తనం' |
| | ముచ్ఛే | 'మీసాలు' | కాలేన | 'నిన్న' |
| | కోర్ | 'బంజారేతరుడు' | మాక్తి | 'ఈగ' |
| | ఆంక్రి | 'కన్ను' | పాక్తి | '(ప్రక్క/వైపు' |
| | నాక్ | 'ముక్కు | | |
| బ) | బాప్ | 'నాన్న' | బోడి | 'కోడలు' |
| | హూబో | 'నిలబడుట' | జాబడీ | 'దవడ' |
| | లీంబూ | 'నిమ్మకాయ' | | |

| | | | | |
|---|---|---|---|---|
| ద) | దాంత్ | 'పళ్ళు' | ఆదో | 'అర్ధం' |
| | గద్దా | 'గాడిద' | నందీ | 'ఏరు' |
| | గూద్ | 'కొవ్వు' | | |

| | | |
|---|---|---|
| డ) | డావో | 'ఎడమ చేతి వాటం లేక పెద్దవాడు' |
| | డాంగ్ | 'పొడవైన కట్టె' |

రెండచ్చుల మధ్యలో 'డ' కారం శిథిలమైన ఉచ్చారణకలిగి తాడిత ధ్వనిగా ఉచ్చరింపబడుతుంది.

| | | | |
|---|---|---|---|
| కీడ | 'పురుగు' | జాబ్‌డీ | 'దవడ' |
| తాండో | 'తాండ' | తోడ్ | 'విరుచు' |

రెండచ్చుల మధ్యనేకాకుండా అస్పష్ట ఉచ్చారణ ఉన్న ఇకారాంతం తరువాత( జాబ్‌డీ )పదం చివర డ కారం తాలవ్యంగా ఉచ్చరింపబడుతుంది. ఇతుర త్రా స్పర్శగానే ఉచ్చరింపబడుతుంది.

జ) దీనికి కూడా దంత్య తాలవ్య ఉచ్చారణ ఉంటాయి.

| | | | |
|---|---|---|---|
| జన్న | 'అప్పుడు' | జాన్ | 'ప్రాణం' |
| జీబ్ | 'నాలుక' | జోర్ | 'శక్తి' |

జీబ్ అన్నప్పుడు తాలవ్య ఉచ్చారణే ఉండాలి, తాలవ్య అచ్చు ఉంది. కాని సుగాలీ మాండలికాలలోదంత్య ఉచ్చారణే ఉంది.

జేట్ 'బావ' ( భర్త అన్న) అనే పదంలో మాత్రం తాలవ్య ఉచ్చారణ ఉంది

| | | | | |
|---|---|---|---|---|
| గ) | గావడీ | 'ఆవు' | గీద్ | 'పాట' |
| | గోర్ | 'బంజారా' | బగావ్ | 'ఆవలింత' |
| | కాగ్‌లా | 'కాకి' | కాంగ్‌సె | 'దువ్వెన' |

## ఊష్మాలు

| | | | | |
|---|---|---|---|---|
| స) | సపారి | 'వక్క' | సాత్ | 'ఏడు' |
| | సిఇయాళో | 'చలికాలం' | మసుడి | 'చిగుర్లు' |
| | సాసు | 'అత్త' | ససురో | 'మామ' |
| | సూంటి | 'బొడ్డు' | మస్సో | 'ఆని' |
| | వాఁసి | 'వెదురు' | వీస్ | 'ఇరవై' |

| | | | | |
|---|---|---|---|---|
| హ) | హఁసళో | 'కంఠ కడియం' | హాఁస్ | 'నవ్వు' |
| | హీక్ | 'రొమ్ము' | హోఁట్ | 'పెదవి' |

| | | | | |
|---|---|---|---|---|
| మ) | మాంగ్ | 'అడుగు' | తమార్ | 'మీరు, (మీయొక్క)' |
| | అంబా | 'మామిడి' | ఆమ్లీ | 'చింతకాయ' |
| | కీమ్ | 'ఎక్కడ' | | |

| న) | నాక్ | 'ముక్కు' | నానా | 'తాత' |
|---|---|---|---|---|
| | ఫూంద్ | 'పిరుదు' | బదన | 'తాడు' |
| | తీన్ | 'మూడు' | | |

ణ) ఇది పదాదిలో రాదు పద మధ్యలో రెండచ్చుల మధ్య ట, డ, ల, కు ముందు కొన్ని హల్లులు తరువత కనిపిస్తుంది.

| గోణ్ | 'గోనెసంచి' | రీంట్ | 'చీమడి' |
|---|---|---|---|
| మూండో | 'నోరు' | ఫణ్ణి | 'ముక్కురంధ్రాలు' |
| బాపణి | 'కంటిరెప్ప' | మూత్ణి | 'వంటికి' |
| కూణ్ | 'ఎవరు' | నూణ్ | 'ఉప్పు' |
| కణ్కి | 'మూకలు' | | |

## రెండు సవర్ణాలు

ఙ) ఇది పద మధ్యంలో క, గ, ల, లో ముందు మాత్రమే కనిపిస్తుంది.

| ఝూంక్ | 'ఉమ్ము/ ఉమ్మి' | మాంగ్ | 'అడుగు' |
|---|---|---|---|

ఞ) పద మధ్యలో ఛ, జ, ల ముందు కనిపిస్తుంది.

| ఊంచ్ | 'పైన' | మీంజి | 'మూలుగు' |
|---|---|---|---|

| ల) | లక్ | 'వ్రాయు' | లాప్సి | 'పాయసం' |
|---|---|---|---|---|
| | లోయి | 'రక్తం' | మలక్ | 'దేశం' |
| | తల్లి | 'నువ్వులు' | తేల్ | 'నూని' |

ళ) ఇది పదాదిలో రాదు.

| కళజో | 'గుండె'కాలేయం | కపాళో | 'నుదురు' |
|---|---|---|---|
| ధ్రోళో | 'తెల్లటి' | నళ్ణి | 'కంఠం లేక గొంతు' |
| గట్ల | 'కొండ' | వాళ్ | 'గాలి' |

| ర) | రుపో | 'వెండి' | రూ | 'పత్తి' |
|---|---|---|---|---|
| | కరోడ్ | 'కోటి' | బక్రా | 'మేక' పోతు |
| | కత్రా | 'ఎంత' | గరదన్ | 'మేడ' |
| | ఫేఫ్‌రో | 'పాలదొమ్మె' (ఊపిరి తిత్తులు) | | |
| | ఘర్ | 'ఇల్లు' | | |

| వ) | ఊ | 'అతడు' | వరస్ | 'సంవత్సరం' |
|---|---|---|---|---|
| | డావో | 'ఊరి పెద్ద' | తావ్ | 'జ్వరం' |

క్రింది పదాలలో దంతోష్ఠ్య ఉచ్చారణ ఉంది.

| వీస్ | 'ఇరవై' | వగ్‌ణీస్ | 'పంతొమ్మిది' |
|---|---|---|---|
| లత్తాకవడా | 'బట్టలు' | గావ్‌డి | 'ఆవు' |

| | | | | |
|---|---|---|---|---|
| య) | యాడి | 'అమ్మ' | యవ్‌డి | 'ఇక్కడ' |
| | లోవో | 'లోహం' | లోయి | 'రక్తం' |
| | కాఁయి | 'ఏమిటి' | | |

# మహాప్రాణ అల్పప్రాణ స్పర్శలు

పదాదిలో మాత్రమే అల్పప్రాణ, మహాప్రాణాల మధ్య అర్థభేధం కనిపిస్తుంది. పద మధ్యలో కాని ఇతర హల్లుల సంయోగంలో కాని అల్పప్రాణ స్పర్శల్లాగా వీటికి వ్యాప్తిలేదు.

| | | | | |
|---|---|---|---|---|
| (ప/ఫ) | పాళో | 'పోషించటం' | ఫళ్'పండు' | |
| (బ/భ) | బోడి | 'కోడలు' | భేన్ | చెల్లెలు' |
| (త/థ) | తు | 'నీవు' | థూంక్ | 'ఉమ్ము' |
| (ద/ధ) | దాడో | 'సూర్యుడు' | ధాడ్ | 'దినం' |
| (ట/ఠ) | టపారో | 'పెట్టె' | ఠ | '?' |
| (డ/ఢ) | డావళో | 'ఎడమ చేతి వాటం' | ఢావళో | 'పాట' |
| (చ/ఛ) | ఎ) చ/ఛ చావళ్ | 'బియ్యం' | ఛాఁయి | 'మచ్చ' |
| | బి) చ/ఛ చార్ | 'నాలుగు' | ఛేళి | 'మేక' |
| (జ/ఝ) | ఎ) జ/ఝ జాంగ్ళా | 'తొడ' | ఝాడ్ | 'చెట్టు' |
| | బి) జ/ఝ జ్యార్ | 'జొన్న' | ఝాంప్డి | 'కొట్టం' |
| (క/ఖ) | కాళో | 'నలుపు' | ఖాల్డి | 'చర్మం' |
| (గ/ఘ) | గాంట్ | 'ముడి' | ఘణ్ | 'ఎక్కువ' |

పై పదాలను గమనిస్తే మహాప్రాణ హల్లుల వ్యాప్తిసమగ్రంగాలేదని తెలుస్తుంది. అందుకే బంజారా భాష మీద పరిశోధన చేసిన డాక్టర్ ఉపాధ్యాయగారు ఆచార్య బ్రహ్మానందగారు మహాప్రాణ హల్లులు ఈ భాషలో ప్రత్యేక వర్ణాలు కావని ప్రతిపాదించారు; సుగాలీ భాషకు సంబంధించినంతవరకు మహాప్రాణం అల్ప ప్రాణంగా మారటం అక్కడక్కడా ఉంది ఉదాహరణకు ధాడ్ దాడ్. అలాగే ఛాఁయి నుంచి వచ్చిన శబ్దం భేన్, భగిని శబ్దభవం హిందిలో(భ-బ)అల్ప ప్రాణమై బెహన్ అయింది.

సుగాలీ భాషలో అవ్యవహిత ఉచ్చారణలో స్పర్శహకారాల కలయిక వల్ల కూడా మహాప్రాణ హల్లులు ఏర్పడటం గమనిస్తాం.

| | | |
|---|---|---|
| సంస్కృతం, | బహిః | 'వెలుపల' |
| హింది | బాహర్ | 'వెలుపల' |
| బంజారా | భార్ | 'వెలుపల' |

కాని ఊడ్చు అనే అర్థంలో భార్ అనే శబ్దంఉంది. ఇందులోని మహాప్రాణం సమాజమైందిగానే కనిపిస్తుంది. కాని దీని ఉత్పత్తి స్పష్టంగా తెలియదు.

అంతే కాకుండా ఉత్తర భారతంలోను తెలంగాణాలోనూ బంజారా భాషలలో మహాప్రాణ హల్లులు ఉన్నచోట్ల,

రాయలసీమలోని సుగాలీ భాషలో అల్పప్రాణమే కన్పిస్తుంది.

క్రియాంతంలో వచ్చే పురుషబోధక ప్రత్యయం థో/ థీ/ థ అన్నవి ఈ ప్రాంతంలో తో/ తీ/ త లుగా మారినాయి

| | | | |
|---|---|---|---|
| వెతేథో | వతేతూ 'ఉన్నారు | జారీథీ | జారీతి 'పాతుంటిని' |
| కరథ | కరచ్ 'చేసి' | | |

# అచ్చులు

I ఇ/ ఈ ఏకాక్షర పదాల్లో దీర్ఘాచ్చుగానే కనిపిస్తుంది ఇతరత్రా హ్రస్వాచ్చు కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| పీ | త్రాగు | తీన్ | 'మూడు' |
| రీంట్ | 'చీమిడి' | కీడి | 'చీమ' |
| మాకి | 'ఈగ' | సూంటి | 'బొడ్డు' |
| బిచ్చి | 'చన్ను' | | |

II ఎ/ ఏ వీటి వ్యాప్తికూడ పై విధంగానే ఉంటుంది.

| | | | |
|---|---|---|---|
| ఎ | 'ఇదంతా' | సే | 'అంతా' |
| ఏక్ | 'ఒక' | పేట్ | 'పొట్ట' |
| ముచ్చే | 'మీనం' | | |

III అ/ ఆ హ్రస్వంగా ఉన్నప్పుడు కేంద్రాచ్చు ఉచ్చారణకు సమీపంగా ఉంటుంది. దీర్ఘంగా ఉన్నప్పుడు నిమ్నాచ్చుగా ఉంటుంది.

| | | | |
|---|---|---|---|
| అచార్ | 'ఊరగాయ' | పకడ్ | 'పట్టుకోండి' |
| మ | 'నేను' | కపాళో | 'నుదురు' |
| మీట్యా | 'కప్ప | ఆంబా | 'మామిడి' |
| ఆట్ | 'ఎనిమిది' | మాతో | 'తల' |

IV ఉ/ ఊ ఇక్కడ కూడా I, II లలో లాగానే వ్యాప్తిఉంటుంది.

| | | | |
|---|---|---|---|
| ఊ | 'అతడు/ ఆమె/ అది' | దూద్ | 'పాలు' |
| రూపో | 'వెండి' | ఉందర్ | 'ఎలుక' |
| ఉంగ్‌టా | 'బొటనవేలు' | దారు | 'సారాయి' |

V ఒ/ ఓ వ్యాప్తి పై విధంగానే ఉంటుంది.

| | | | |
|---|---|---|---|
| ఓ | 'వారు' | ఓల్డా | 'గంప' |
| డోడ్ | 'ఒకటిన్నర' | కాంద్ | 'భుజం' |
| ఖవో | 'చంక' | కరోడ్ | 'కోటి' |

## అనునాసిక సహితమైన అచ్చులు

| | | | | |
|---|---|---|---|---|
| I | రూ | 'పత్తి' | దూఁ | 'ఇస్తా' |
| | దూఁచు | 'ఇస్తాను' | | |
| II | హిందీ | 'క్యా' 'ఏమి' | బంజారా | కాఁయి 'ఏమి' |
| | మరాఠి | కాఁయి 'ఏమి' | | |
| III | ఆషా | 'కోరిక' | హాఁసు | 'కంటినీరు' |
| IV | తీన్ | 'మూడు' | రీంట్ | 'చీమిడి' |
| V | వేషం | 'వేషము' | భేఁసి | 'ఎనుము' |
| VI | దస్ | 'పది' | హంస్ | 'నవ్వు' |
| VII | రాద్ | 'చీము' | రాంద్ | 'వండు' |
| VIII | కూఁణ | 'ఎవరు' | సూంటి | 'బొడ్డు' |
| IX | సోట | 'రోకలి' | సూంట్ | 'సొంఠీ' |

# III. ముఖ్యమైన సంధులు

I పదాంతంలోని కచటతపలు నాద హల్లుల ముందు నాదాలుగా మారుతాయి

| | | | | |
|---|---|---|---|---|
| (క) | ధోక్' | ప్రార్థించు' | ధోగ్దే | 'మొక్కుకో' |
| (చ) | పూంచ్ | 'అందుకో' | పూంచ్గో | 'అందుకొన్నాడు' |
| (ట) | బేటి | 'కూతురు' | బేటీర్ బేటా | 'కూతురు కొడుకు' |
| (త) | గీత్ | 'పాట' | గీత్ బోల్ | 'పాటపాడు' |
| (ప) | బాప్ | తండ్రి | బాప్బేటా | 'తండ్రికొడుకులు' |

II 'మరియు' అనే అర్థాన్ని సూచించే 'అన్' లోని అకారం ఇకారాంత ప్రాతిపదిక తరువాత లోపిస్తుంది.

గావ్డీ+ అన్+ ఘోడో ఆవు మరియు గుర్రం

ఇక్కడ అకారం లోపించి గావడిన్ ఘోడో అవుతుంది. ఇతరత్రా అకారం అట్లాగే మిగిలి ఉంటుంది .

బాపన్ బేటా = తండ్రి మరియు కొడుకు

III అజాది పురుష ప్రత్యయం ముందు దంత్యాలలోని అచ్చు వికల్పంగా లోపిస్తుంది.

లే + ఊఁ= లేఊ( లేవూఁ) = తీసుకో దే + ఈ = దీఁఊ ( దీఁయూ = ఇస్తాను))

పే + ఏ = పీఏ( పీయే) జరగబోతుంది.

IV పీ + అన్ = పీన్ 'తాగి'

ఇక్కడ ప్రత్యయంలోనే ఆకారం లోపించడం గమనించవచ్చు. వికల్పంగా 'అన్' మొత్తం లోపించటంవుంది.

పీ + గో = పీగో 'తాగిపోయాడు'

V ధాతువుకు ప్రత్యయానికి నడుమ వ అగమంగారావడం కనిపిస్తుంది

ఆ + గీచ్ = అవ్‌గీచ్ 'వచ్చింది'

VI ధాతువుకు అంతంలోని డకారం ప్రత్యయంలోని నకారాలతో కలిసి పోతుంది.

తోడ్ + లేన్ = తోణ్ణేన్ 'విరిచె' కాడ్ + నాక్ + కణ్ణాక్ 'తీసివేసి'

VII ధాతువులోని చివరి తదనలు ప్రత్యయంలోని జకారంతో కలిసిపోతాయి

మత్ + జో = మజ్జో 'వెళ్ళద్దు' కూద్ + జో = కూజ్జో 'దూకు'

ధాఁస్ + జో = ధాఁజో 'పరిగెత్తిపో'

---

## ఆగమ వర్ణాలు

ఒకే పదంలో రెండచ్చుల నడుమ బలిహీనమైన అకారం చేరడం ఉంది.

| | | | |
|---|---|---|---|
| కపడా | 'వస్త్రం' | హడకా | 'ఎముక' |
| తళవ | 'మిడిమ' | భాణజో | 'మేనల్లుడు' |

యవలు ధాతు ప్రత్యయాల నడుమ ఆగమంగా రావటం ఉంది.

I పియె + ఎ + లాగో = తాగడానికి ప్రారంభించాడు (య్)

పీయేలాగో = తాగడానికి ప్రారంభించాడు.

II ఖా + ఓ = తినండి (వ) ఖావో తినండి

**మూర్ధన్యీకరణం :–** ఈ భాషలో మరాఠి భాషలలోలాగా దంత మూలియాలు మూర్ధన్యాలుగా మారటం ఉంది.

| | | | |
|---|---|---|---|
| హిందీ | 'పానీ' 'నీరు' | సుగాలీ | 'పాణీ' 'నీరు' |
| మరాఠీ | 'పాణీ' 'నీరు' | | |

ఇలాగేఘణో(ఘన్) కాళో(కాలా) సియాళో (శీతల్) వంటి పదాలు గమనించవచ్చు తెలుగు పదాల్ని ఉచ్చరించటంలో కూడా ఈ మార్పు జరగటం చూడవచ్చు

తె- కందెన సు- కందణి

---

# IV పద నిర్మాణం

## నామ పద నిర్మాణం :

### I సాధారణ నామాలు

| | | | | |
|---|---|---|---|---|
| (A) | మానవ | మాటి 'మనిషి' | కూండి | 'అమ్మాయి' |
| (B) | మానవేతర | 'కొత్ర' 'కుక్క' | గావడి | 'ఆవు' |
| (C) | అప్రాణవాచకాలు | ఘర్ 'ఇల్లు' | సూయి | 'సూది' |
| (D) | ద్రవ్యావాచకాలు | దూద్ 'పాలు' | లాప్సీ | 'పాయసం' |

(E) భావ వాచకాలు కామ్ 'పని'

వాత్ 'మాట'

(F) వ్యక్తి నామాలు భావ్య నాయక్ 'వ్యక్తి పేరు' గంగమ్మ 'వ్యక్తి పేరు'

(G) జంతు నామాలు నాగ్యా 'ఎద్దుపేరు' నాగి 'ఆవుపేరు'

(H) స్థలనామాలు నాగలగుడ్డం 'తాండా పేరు'

II సామాన్య నామాలు

| | | | |
|---|---|---|---|
| హాత్ | 'చేయి' | సాదు | 'సాధువు' |
| ఘోడో | 'గుఱ్ఱం' | | |

III సంశ్లిష్ట నామాలు

వాళ్ అనే ప్రత్యయం చేర్చగా కర్తృనామ వాచకాలు ఏర్పడతాయి 'కలిగినవాడు' అనే అర్థాన్ని ఇస్తాయి.

| | | | |
|---|---|---|---|
| భేంసి | 'ఎనుము' | భేంసి వాళో | 'ఎనుములవాడు' |
| ఖేత్ | 'పొలం' | ఖేతే వాళో | 'పొలం కలిగినవాడు' |
| పీసా | 'డబ్బు' | పీసావాళో | 'డబ్బు కలవాడు' |

కొన్ని సందర్భాల్లో వాళో చేరినప్పుడు ఏ ఆగమంగావస్తుంది. అప్పుడు పూర్వ స్వరం లోపిస్తుంది.

ఘర్ + వాళో = ఘరేవాళో - ఇంటివాడు (భర్త)

తాండే + వాళో = తాండేవాళో - తాండావాడు

VI అల్పార్థక నామాలు

(A) అల్పార్థక నామాలు ఇకారం చేర్చటం ద్వార ఏర్పడతాయి. అప్పుడు ఇతరత్రాకనిపించే. అచ్చులు లోపిస్తాయి.

| | | | |
|---|---|---|---|
| ఓల్డా | 'పెద్ద గంప' | ఒల్డి | 'చిన్న గంప' |
| సీసా | 'పెద్ద సీసా' | సీసి | 'చిన్న సీసా' |
| గట్లి | 'గుట్ట' | గట్ల | 'పర్వతం' |
| ఖాల్డో | 'తోలు' (పశుపు చర్మం) | ఖాల్డి | 'మనిషి చర్మం' |

(B) డి(ళి) అనే ప్రత్యయం చేర్చటం, ద్వారా కూడా కొన్నిచోట్ల అల్పార్థక నామాలు ఏర్పడతాయి.

| | |
|---|---|
| పూంచ్ + డి = పూంచ్‌డి | 'చిన్న తోక' |
| పూంచ్ + డో = పూంచ్‌డో | 'పెద్దతోక' |
| కాంచ్ + ళి = కాంచళి | 'రవిక' |

(C) ఇకారం చేర్చటంవల్ల భావ నామూాలు, కర్తృ నామాలు కూడా ఏర్పడతాయి

| | | |
|---|---|---|
| చోర్ | చోరి | 'దొంగతనం' |
| కార్ భార్ | కార్భారి | 'కార్యదర్శి' |
| కమా | కమాయి | 'సంపాదన' |
| లడ్ | లడాయి | 'యుద్ధం' |

(D) అర్, అళ్, బి అనే నిష్పాదక ప్రత్యయాలు కూడా కన్పిస్తున్నాయి.

| | | |
|---|---|---|
| లోవ్ | లవార్ | 'కమ్మరి' |
| సోన్ | సనార్ | 'కంసలి' |
| హేట్ | హెటాళ్ | 'ఉత్తరం' |
| ఊంచ్ | ఊంచాళ్ | 'పడమట' |
| ధో | ధోబి | 'చాకలి' |

(E) సమస్త నామాలు

I విశేషణం + నామం

| | |
|---|---|
| మొట్ + యాడి = మోట్యాడి | 'పెద్దమ్మ' |
| నాణ్క్యా + ఛోర = నాణ్క్యాఛోర | 'చిన్నబ్బాయి' |
| గోళ్ + భాటా = గోళా భాటా | 'గుండ్రని రాయి' |

II నామం + నామం

| | |
|---|---|
| నాగ్ + సాఫ్ = నాగ్సాఫ్ | 'నాగుపాము' |
| జమ్మి + యాడి + జమ్మియాడి | 'భూమాత' |

పూర్వపదాంతం చివర రుగాగమం రావటం కనిపిస్తుంది.

బాపణేర్ + లట్టా + బాపణేర్ లట్టా 'కనురెప్పవెంట్రుకలు'

III (A) జంట పదాలు

| | | | |
|---|---|---|---|
| లతాకపాత | 'బట్ట' | కపడ మపడ | 'బట్ట పాత' |
| దాణా మాణా | 'గింజా గిట్రా' | వీయా మియా | 'పెండ్లి గిండ్లి' |
| గార్లీ గావ్డి | 'గొర్రెలు, ఆవులు' | మాల్ మత్రా | 'డబ్బు గిబ్బు' |

(B) ద్వంద్వ సమాసాలు

| | | | |
|---|---|---|---|
| మాబేటా | 'తల్లీ కొడుకు' | బెట్బేటా | 'కూతురు కొడుకు' |
| డోక్రా డోక్రి | 'ముసలిది ముసలోడు' | గోర్గొణ్ణి | 'భార్య భర్తలు' |
| ఛోరా ఛోరి | 'అబ్బాయి, అమ్మాయి' | | |

(C) గుణ తీవ్రతను తెల్పె చటక్, కచన్ వంటి విశేషణ పదాలను సమాసంలో ఉత్తర పదాలుగా వాడటం కూడా ఉంది.

| | | | |
|---|---|---|---|
| చాందణ్ చటక్ | 'తెల్లని వెన్నెల' | లాల్‌చటక్ | 'ఎర్రని మంట' |
| హరో కచన్ | 'ముదురు ఆకుపచ్చ' | | |

## IV బహు వ్రీహి సమాసాలు

| | | | |
|---|---|---|---|
| ఖాయేర్ పాన్ | 'తమల పాకు' | కాటే వాళో | 'నల్లి' |
| ఆచ్ వాత్ | 'పెళ్లి మంచి మాట' | | |

## V లింగ విభజనాలు

హిందిలో లాగానే బంజారా భాషలో కూడా లింగవ్యవస్థ క్లిష్టంగా ఉంటుంది. కొన్ని చోట్ల శబ్దశ్రితంగా కొన్ని చోట్ల అర్థ శ్రితంగా ఈ బాషలో లింగవ్యవస్థ ఉంది. శబ్దాలన్నీ స్త్రీ, పుం, లింగాలుగా ఈ భాషలో వి భక్తమై ఉంటాయి.

(A) అర్థాశ్రితంగా కొన్ని శబ్దాలు లింగ భేదాన్ని సహజంగా కలిగి ఉంటాయి

| | | | |
|---|---|---|---|
| బాప్ | 'తండ్రి' పుం. లి | యాడి | 'తల్లి' స్త్రీ. లి |

కొన్ని అమనుష్య వాచకాలు సహజ లింగంతో సంబంధంలేకుండా స్త్రీ, పుం లింగాలుగా వాడుకలో ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| కీడా | 'పురుగు' పుం॥లి | కాగ్‌లా | 'కాకి' పుం॥ లి |
| మాకీ | 'ఈగ' స్త్రీ॥ లి. | ఛఫ్‌ణి | 'బల్లి' స్త్రీ॥ లి. |

(B) పెద్దవస్తువులు, పుంలింగాలుగా, చిన్న వస్తువులు స్త్రీ లింగాలుగా వాడటం కూడాఉంది

| | | | |
|---|---|---|---|
| గట్లా | 'కొండ' పుం॥ లి. | గట్లి | 'గుట్ట' స్త్రీ. లి |

(C) ఓతో అంతమయ్యే పదాలు సాధరణంగా పుంలింగాలు.

| | | | |
|---|---|---|---|
| ఘోడో | 'మగ గుర్రం' పుం॥ లి. | గోడో | 'మోకాళ్ళు' పుం॥ లి. |
| గోదో | 'వడి' పుం॥ లి. | కాందో | 'భజం' పుం॥లి. |
| కపాళో | 'నుదురు' పుం॥ లి. | | |

(D) సాధారణంగా ఇకారాంత శబ్దాలు స్త్రీలింగాలు

| | | | |
|---|---|---|---|
| హతళి | 'అరచేయి' స్త్రీ॥లి | హిడికి | 'ఎక్కిళ్ళు' స్త్రీ॥లి |
| ఏడి | 'మిడుమ' స్త్రీ॥లి. | ఘోడి | 'ఆడ గుర్రం' స్త్రీ॥ లి. |

కొన్ని పదాలు ఇకారాంతాలే అయినా అవి పుంలింగాలు.

| | | | |
|---|---|---|---|
| నావి | 'మంగలి' పుం॥ లి. | ధోబి | 'చాకలి' పుం॥ లి. |

(E) 'ఎకారాంత రూపాలు కూడా స్త్రీ లింగాలే'

| | | | |
|---|---|---|---|
| ముచ్చే | 'మీసం' స్త్రీ॥ లి. | ఆంత్రే | 'పేగులు' స్త్రీ॥ లి. |
| ఆంచళె | 'చన్నులు' స్త్రీ॥ లి. | | |

(F) ఉకారాంతాలు కూడా సాధారంణంగా పులింగాలే

| | | | |
|---|---|---|---|
| ధూఁ | 'పొగ' పుం॥ లి. | దారు | 'సారాయి' పుం॥ లి. |
| వీంచు | 'తేలు' పుం॥ లి. | | |

కాని హాఁసు (కన్నీరు) జూఁ (పేను) కొన్ని చోట్ల పుంలింగం కాగా కొన్ని చోట్ల స్త్రీ లింగం అయింది.

(G) అణ్, అణి, - ణి చేరి స్త్రీలింగ రూపాలు ఏర్పడతాయి.

| | |
|---|---|
| నావి | నావణ్ 'మంగలి భార్య' స్త్రీ॥ లి. |
| దేవర్ | దరవాణి 'మరది భార్య' స్త్రీ॥ లి. |
| గోర్ | గోన్ని 'భార్య' స్త్రీ॥ లి. |

(H) డి చేరి కూడా స్త్రీలింగాలు ఎర్పడతాయి
ఊంట్ ఊంట్‌డి- ఆడ ఒంటె- స్త్రీ. లి.

(I) వ్యత్యయ రహిత లింగ రూపాలు

| | | | |
|---|---|---|---|
| కాన్ | 'చెవి' పుం. లి. | నామ్ | 'పేరు' పుం. లి. |
| పాణి | 'వర్షం' పుం. లి. | మాటి | 'మగవాడు' పుం. లి. |
| మీనా | 'నెల' పుం. లి. | రాత్ | 'రాత్రి' స్త్రీ. లి. |
| బీర్ | 'స్త్రీ'. స్త్రీ. లి. | | |

---

# వచన విభక్తి వ్యవస్థ

వచన వ్యవస్థకు విభక్తి వ్యవస్థకు ఈ భాషలో సంబంధం ఉంది. విభక్తి చేరే ముందు బహువచన రూపం ద్వితీయాది విభక్త్యం రూపంగా మారుతుంది. ఆ తరువాతే విభక్తి ప్రత్యయాలు పరమవుతాయి.

ఆ. ఈ. ఊలతో అంతమయ్యే ప్రాతి పదికల్లో బహువచన ప్రత్యయం లేకుండానే వాడబడతాయి. వాటి విభక్త్యం రూపం కూడ అలాగే ఉంటుంది.

| | | | | |
|---|---|---|---|---|
| I | మీనా | 'నెల' | (ఏ.వ) | 'మీనా' |
| | (ద్వి.వ) | 'మీనా' | (బ.వ) | మీనా |
| | (ద్వి.వ) | 'మీనా' | | |

ఇలాగే పూజ, పాణీ, దారూ, అనే రూపాలు గమనించవచ్చు

II ఓ కారంతో అంతమయ్యే, పుంలింగ పదాలు, హల్లుతో అంతమయ్యే స్త్రీలింగ రూపాలు బహువచనంలో - ఏ అనే ప్రత్యయాన్ని చేర్చుకుంటాయి. పుంలింగ రూపాలు ద్వి.వ.రూపాల్లోనే - ఏ.వ చేర్చుకొంటూాయి.

| | | | |
|---|---|---|---|
| ఘోడో (పుం) 'గుర్రం' | | ఏ.వ | ఘోడో'' |
| ద్వి.వ | 'ఘోడే' | బ.వ | 'ఘోడో' |
| ద్వి.వ | 'ఘోడే' | రాత్ (స్త్రీ) | 'రాత్రి' |

ఏ.వ. రాత్ ద్వి.వ. 'రాతే' బ.వ. రాతే
ద్వి.వ 'రాతే'
హలంతమైన పుంలింగ రూపమైతే బహువచనంలో ఏ మార్పులేకుండా ఉంటుంది.

హోత్ (పుం) 'చేయి' ఏ.వ. హోత్ ద్వి.వ. 'హోతే'
బ.వ. హోత్ ద్వి.వ. 'హోతే'

# సర్వ నామాలు

I పురుష భోధన సర్వనామాలు
ఇంకా కొన్ని సర్వనామ రూపాలు ఈ వర్గం కింద వస్తాయి.

(A) సర్వార్ధకం :-
సే అంతా / అందరూ -సే-సే -సే-సే''

(B) ప్రశ్నార్థకం :-
కూణ్ 'ఎవరు'? కాఽయ్ 'ఏది / ఏమి'? -కే -కే -కే -కే

(C) అనిశ్చితార్థకం :
కోయిఽకా (యి) ఎవరైనా ? ఏదైనా -కే -కే -కే -కే
దీనినే కూణ్‌వతోయి అనికూడా చెప్పడం ఉంది.

(D) సంబంధబోధకం :
జకో(ఎవరైతే) - జే - జే - జే - జే

II పురుషేతర సర్వనామాలు
ఇక్కడ ఇతర విధాలైన సర్వనామ రూపాలు ప్రదర్శిస్తాం

(A) సమీపార్థక సర్వనామం
అత్(ఇక్కడ)
ఏమా( దీనిలో) (అధికరణం)

# పురుష బోధక ప్రత్యయాలు

## ద్వితీయా విభక్తిరూపం

| పురుషవచనం | ప్రథమా విభక్తి రూపం | ద్వి.వి/ ష.వి –నే | తృ''వి/పం'' –తి | షష్ఠి –ర్ | సప్తమి –మ |
|---|---|---|---|---|---|
| ఉత్తమపురుష | | | | | |
| ఏకవచనం | మా / మే | మ- | మ- | మా- | మా-(రే) |
| | మామ్ | మామె- | మామే | మామ | మామె |
| బహువచనం | అపణే | అపణె | అపణ్ | అపణే | అపణే- |

| పురుషవచనం | ప్రథమా విభక్తి రూపం | ద్వి.వి/ఛ.వి –నే | తృ''వి/పం'' –తి | షష్ఠి –ర్ | సప్తమి –మ |
|---|---|---|---|---|---|
| మధ్యపురుష | | | | | |
| ఏకవచనం | -తూ/తూ | తో- | తో- | తా- | తో- |
| బహువచనం | తమ్ | తమె- | తమ | తమా- | తమే- |
| ప్రథమపురుష సమీప/ | | | | | |
| ఏకవచనం | ఈ | ఏ- | ఏ- | ఏ- | ఏ- |
| బహువచనం | ఏ- | ఏ- | ఏ- | ఏ- | ఏ- |
| దూర/ఏ.వ | ఊ- | ఓ- | ఓ- | ఓ- | ఓ(రే) |
| బ.వ | ఓ | ఓ- | ఓ- | ఒ- | ఒ- |

| | | | |
|---|---|---|---|
| వర్లేవడి/ఏవిడి | (ఈవైపు) - దిశ | అబ్ | ఇప్పుడు-కాలం |
| అత్రా | (ఇంత) - పరిమాణ | అసో | ఇట్ల + గుణం/విధం |

(B) దూరార్థక సర్వనామాలు :-

| | | | |
|---|---|---|---|
| వత్ | అక్కడ | పర్ | అక్కడ/అధికరణం |
| పర్లేవడి/ ఓవ్డి | ఆవైపు | జనా | అప్పుడు |
| జత్రా | అంతా | | |

(C) సంబంధబోధన/కిమర్థక (ప్రశ్నార్థకం)

| | | | |
|---|---|---|---|
| కత్తె | ఎక్కడ | హన్న | ఎప్పుడు |

ఇతర ప్రాంతాలలో లాగే జత్తె(ఎక్కడ) జేవ్డి (ఏవైపు) అనే సంబంధబోధక సర్వనామాలకు బదులుగా ఇక్కడ ప్రశ్నార్థకంగానేవాడుతారు.

| | | | |
|---|---|---|---|
| కెవడి'' | ఏవైపు | కిమ్ | ఎక్కడో |
| కత్రా | ఎంత | కూc | ఎలా |

(D) అనిశ్చితార్థకం

| | | | |
|---|---|---|---|
| కత్తి | ఎక్కడో | కిమి | ఎక్కడో |
| కెవ్డి | ఎక్కడికో | కన్నా | ఎప్పుడో |
| కత్రాయ్ | ఎంతైనా | కూయి/కుcతోయి | ఎలాగైనా |

## III సంఖ్యా విశేషణ సర్వనామాలు

| | | | |
|---|---|---|---|
| దోయి/దీజారేచ్ | 'ఇద్దరు పోతున్నారు' | అదోఖాగో | 'సగం తినిపోయాడు' |
| డోడ్‌దీనోచ్ | 'ఒకటిన్నర ఇచ్చాడు' | | |

# సంఖ్యా వాచకాలు

చాలావరకు హిందీ సంఖ్యావాచకాల్లాగే ఉన్నా కొన్ని రూపాలలో తేడాలున్నాయి.

| హిందీ | బంజారా | హిందీ | బంజార |
|---|---|---|---|
| దో | ది | ఛి | చో |
| గ్యారహ్ | అఘ్యర్ | ఉన్నీస్ | వగ్నీస్ |
| బీస్ | వీస్ | | |

(A) మూల సంఖ్యలు:- (1-10)

1. ఏక్ 2. ది 3. తీన్ 4. చార్ 5. పాంచ్
6. ఛో 7. సాత్ 8. ఆట్ 9. నవ్ 10. దస్.

(B) దశాంశాలు:-(10-100)

10. దస్ 20. వీస్ 30. తీస్ 40. చాళీస్ 50. పచ్చాస్
60. సాట్ 70. సాట్ సత్తర్ 80. అస్సీ 90. నవ్వద్/నెవ్వ్ 100. ఏక్ సౌ.

(C) మధ్యసంఖ్యలు:-

11. అఘ్యార్ 12. బార్ 13. తేర్ 14. చౌద్
15. పందర్ 16. షోళ్ 17. సత్తర్ 18. అఠార్
19. వగ్నీస్ 21. వీసన్ ఏక్ 22. వీస్ పర్ ది 23. వీస్ పర్ తీన్
24. వీస్ పర్ చార్ 25. వీస్ పర్ పాంచ్ 26. వీస్ పర్ ఛో 27. వీస్ పర్ సాత్
28. వీస్ పర్ ఆఠ్ 29. వీస్ పర్ నవ్.

(D) పెద్ద సంఖ్యలు:-

100-సో, 1000-హజార్, 10000-దస్ హజార్,
100000-లాక్, 1000000-దస్ లాక్, 10000000-కోట్/కరోడ్/సోలాక్

(E) భిన్నాంశాలు:-

1/4-పావ్‌లా 1/2-ఆదో
1-1/2-డోఢ్ 2-1/2-అడాయి

(F) పరిగణనలో ప్యాలో(మొదట) దుసరో(రెండవ) తీస్రో(మూడవ) చౌతో(నాల్గవ) అని తెలంగాణాలో కనిపించే రూపాలు ఇక్కడ లేవు. ఏక్‌మో, దీమో, తీనమో, చారమో, పాంచ్‌మో అన్న రూపాలు కనిపిస్తాయి.

ఆరవ(ఛోవాళో), ఏడవ (సాత్‌వాళో) మొదలైనరూపాలకు తెలంగాణాలో సాత్‌వో వంటిరూపాంతరాలున్నాయి. ఇవి చేరిస్తే వీటి స్త్రీలింగరూపాలు ఏర్పడతాయి.

సాత్‌వాళో బేటా (ఏడవ అబ్బాయి) సాత్‌వాళి బేటి (ఏడవ అమ్మాయి)

(G) సముచ్చయార్థక సంఖ్యలు:–

మూలసంఖ్యలకు ఇకారంచేరి ఏర్పడతాయి

దోయి జారేచ్ 'ఇద్దరు వేళ్తున్నారు'

భళన్(కలసి) అనే రూపాన్ని చేర్చటం కూడాఉంది.

దోయి భళన్ జారెచ్ 'ఇద్దరు కలిసి వెళ్తున్నారు'

(H) సమస్త సంఖ్యలు:–

(a) సంకలన సంఖ్యలు :– ఒక సంఖ్యపై మరొక సంఖ్యచేరి ఏర్పడతాయి.

వీస్ + అన్ + ఏక్ = వీసన్ఏక్(21) దీన్నే కొందరు వీస్‌పర్ ఏక్ అని కూడా అంటారు. ఉత్తర దేశంలో ఏక్‌వీస్ అనే రూపం కనిపించినా, దక్షిణదేశంలో కనిపించటంలేదు. ద్రావిడ భాషల్లో పదుల సంఖ్యపై ఒక్కట్ల సంఖ్య రావటం ఉంది. కాబట్టి ఈ ప్రభావంతో దక్షిణ దేశంలోని బంజారాలు కూడా వీస్ పర్ ఏక్ అనే పదాలు ఏర్పడిఉండవచ్చు ఉర్దూలో ఇలాగే అంటారు.

| | | | |
|---|---|---|---|
| ఏక్ సోదీ | (102) | దీసో తీసన్ చార్ | (234) |
| తీన్‌సో సత్తర్ పర్ పాంచ్ | (375) | సవాతీన్ | (3-1/4) |
| సవాసో | (125) | సాడాతీన్ | (3-1/2) |

సాడే అనే పదం మూడు తర్వాత సంఖ్యలకే చేరుస్తారు. 1 1/2, 2 1/2లను సూచించే పదాలు పేరుగా ఉన్నాయి.

డోఢ్ (1-1/2) అడాయి (2-1/2)

పైన సవా అనే రూపం మౌలికంగా 1/4 అనే అర్థంకల్గింది. కాని వంద తర్వాత 25 అర్థం చెప్పగలుగుతుంది.

(b) వ్యవకలన సంఖ్యలు : దశాంశ సంఖ్యలలో మూలసంఖ్యలు తీసివేసి చెప్పే సంఖ్యలు ఇవి.

ఏక్ కంతీస్ (29) దస్ కం హజార్(990)

రెండవ ఉదాహరణలో దస్ సంఖ్యావాచకం వ్యవకలనంపొందుతుంది. ఇతర ప్రాంతాలలో పావు తక్కువ అనే అర్థంలో పూణ అనే పదాన్ని వాడుతారు ఇక్కడ ఈ పదంలేదు.

పూణదీ (1-3/4)

దీన్ని చెప్పాల్సి వస్తే సుగాలీ భాషలో పావ్‌కందీ అంటారు.

(c) 'గుణాకార సంఖ్యలు:–

దీసో(2X100 = 200) అడాయిసో(2 1/2X100=250)

(d) ప్రత్యర్థక సంఖ్యలు

ఏకేక్ 'ఒక్కొక్క' అదోఅదో 'సగం సగం'

(e) అనిశ్చితార్థక సంఖ్యలు :-

ఏకదీ (ఒకటో రెండో) తీన్ చార్ (మూడో నాలుగో)
పాంచ్‌ఛో (అయిదో ఆరో)

సంఖ్యా వాచకాలన్నింటిని నామ వాచకాల ముందువాడినపుడు సంఖ్యా వాచక విశేషణాలు అవుతాయి.

దీ అద్మీ 'ఇద్దరు మనుషులు'

## IV ఇతర విశేషణ రూపాలు

### (A) సామాన్య విశేషాలు

1. నామవాచక లింగాల్ని బట్టి విశేషణ లింగరూపంమారును.

| | | | |
|---|---|---|---|
| గోరోఛోరా | 'ఎర్రటి అబ్బాయి' | గోరీ ఛోరి | 'ఎర్రటి అమ్మాయి' |
| ఆచో ఆద్మీ | 'మంచి మనిషి' | ఆచ్ తాండ్రీ | 'మంచి స్త్రీ' |
| జాడో ఆద్మీ | 'లావు మనిషి' | జాడ్ తాండ్రీ | 'లావు స్త్రీ' |

కొన్ని విశేషణాలు మారవు

బల్లానామ్ 'చెడ్డపేరు' గోళాభాటా 'గుండ్రనిరాయి'

2. ఇకారాంత విశేషణాలు స్త్రీలింగరూపాలకు ముందేవస్తాయి.

ఖాటీ అమ్లీ 'పులుపు చింతపండు' సారీరాత్ 'రాత్రంతా'

కాని అశ్లి, నక్లి అనే రూపాలు పుంలింగ రూపాలకుముందువస్తాయి.

అస్లీ అమ్లీ 'మంచి చింతకాయలు' అస్లీ రూపో 'మంచి వెండి'

3. హలంత విశేషణారూపాల భిన్న రీతులలో వాడవచ్చు.

ఆచ్‌వాత్(స్త్రీ) 'మంచి వార్త' ఆచోమాటి(పుం) 'మంచి మనిషి'
ఆచ్‌సాఁకి(స్త్రీ) 'మంచి కథ'

హలంత విశేషణాలలో కొన్ని పర్యాయ రూపత లేనివి ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| గరమ్ | | 'వేడి' | మో ట్యార్ 'పెద్దది' |
| గరమ్‌దూద్ | 'వేడిపాలు' | మో ట్యార్‌ఛోరి | 'పెద్దదైనపిల్ల' |

4. ఓకారంతో అంతమయ్యే కొన్నివిశేషణాల చివరి అచ్చులోపించటం ఉంది.

తాతో పాణి 'వేడి నీళ్ళు' తాత్ పాణి 'వేడి నీళ్ళు'

ఇలాగే ఇకారంతో అంతమై స్త్రీలింగంలో కూడా చివరి అచ్చును కోల్పోవటం ఉంది.

| | | | |
|---|---|---|---|
| అచే ఛోరి | 'మంచి అమ్మాయి' | అచో ఛోరి | 'మంచి అమ్మాయి' |
| బూఁడి తాండ్రి | 'ముసలామె' | బూఁడ్ తాండ్రి | 'ముసలామె' |

ఇలా చివరి అచ్చులో పించినపుడు కొన్ని సందర్భాలలో బహువచన అర్థం కూడా వస్తుంది.

బూఁడో ఆద్మీ 'ముసలివాడు' బూఁడో ఆద్మీ 'ముసలివారు'

5. ఒకారంత పుంలింగ విశేషణాలు ఏకారాంతాలై బహువచనాలు అవుతాయి.

మోటో ఆద్మీ 'లావు/పెద్ద మనిషి'

మోటే ఆద్మీ 'లావు.పెద్ద మనుషులు'

ఏకారం చేరినపుడు ఏక బహు వచనాలతో ద్వితీయాదివిభక్త్యంగ రూపం సిద్ధమౌతుంది.

మొటే ఆద్మీతి పెద్దమనిషి చేత పెద్ద మనుషుల చేత

6. తెలంగాణాలో స్త్రీలింగ విశేషణంగా చెప్పేదాన్ని రాయలసీమలో పుంలింగంగా గుర్తించడం ఉంది. (తెలంగాణా) ఆచీవాత్(స్త్రీ) 'మంచివార్త'(రాయలసీమ) ఆచోవాత్(పుం) 'మంచివార్త'

తెలంగాణాలో ఖరాబ్(చెడ్డ) అనే విశేషణ రూపంకనిపిస్తుండగా రాయలసీమలో బల్లా(చెడ్డ) అనే పర్యాయ రూపం కనిపిస్తుంది. ఈ విశేషణ రూపాన్ని అన్ని లింగాల్లోను వాడుతారు.

బల్లాఛోరా చెడ్డ అబ్బాయి బల్ఖా ఛోరి చెడ్డ అమ్మాయి

బల్లావాత్ చెడ్డ వార్త

7. సంశ్లిష్ట విశేషణాలు నామ ప్రాతిపదకలపై లింగసూచకాలైన ఓ/ఇ చేరి ఏర్పడతాయి.

| | | | |
|---|---|---|---|
| కించ్ | 'బురద' | కించడో | 'బురదైన' |
| భూక్ | 'ఆకలి' | భూకో ఆద్మీ | 'ఆకలిగల మనిషి' |
| భూకి ఛోరి | 'ఆకలిగల పాప' | ఏక్ | 'ఒక' |
| ఏక్లో భేటా | 'ఏకైక కుమారుడు' | ఏక్లో భేటి | 'ఏకైక కుమార్తె' |

కాని, కొన్ని విశేషణాలు పర్యాయతలేకుండా వాడబడతాయి.

ధరమ్ 'ధర్మం' ధర్మీరాజా 'ధర్మాత్ముడైన రాజు'

రాజా-పుంలింగమైనా ధర్మోరాజా మారక పొవటం ఇక్కడ గుర్తించాలి.

8. సంయుక్త విశేషణాలు: ఇందులో ఆ మ్రేడితవిశేషణాలు ఒక రకానికి చెందినవి.

మోట్ మోట్ 'పెద్ద పెద్ద' బుడ్ బుడ్ 'ముసలి ముసలి'

జంట విశేషణాలు కొన్ని ఉన్నాయి. ఇవి మరొక వర్గం

మోటో నాన్ 'పెద్ద చిన్న' ఆచ్ - బల్లా

## క్రియలు

ఈ భాషలోని క్రియలు చాలా వైవిధ్యాన్ని ప్రదర్శిస్తాయి. ప్రధానమైన క్రియలు మూడు రకాలు.

1. సామాన్య క్రియలు
2. సంశ్లిష్ట క్రియలు
3. సంయుక్త క్రియలు

**I. సామాన్య క్రియలు :** సాధారణంగా ఇవి ఒక అచ్చుతో కూడిన ఏకాక్షర క్రియలుగా ఉంటాయి. ఇందులో 7 విధాలు కనిపిస్తున్నాయి. అచ్చు (అ) హల్లు(హ)ల అమరికను బట్టి వీటిని విభజించడం జరిగింది.

**(A) ఏకాక్షర ధాతువులు:**

1. అ — అ 'వచ్చు'
2. హ + అ — జా 'వెళ్ళు' — దే 'ఇచ్చు' — రో 'ఏడ్చు'
3. హ + హ + అ — ఖా 'తిను' — ధో 'కడుగు' — ఛ 'ఉన్నది'
4. అ + హ — ఊట్ 'లేచు'
5. హ + అ+హ — కట్ 'చీల్చు' — కర్ 'చేయు' — గణ్ 'లెక్కించు'
6. హ + హ + అ + హ — ఖోల్ 'తెరచు' — ఛ 'ఉన్నది' , — దాఁ పరిగెత్తు
7. హ + హ + అ + హ +హ — వేంట్ 'పంచు' — థూంక్ 'ఉమ్ము' — ఖీంచ్ 'లాగు'

**(B) ద్వ్యక్షర ధాతువులు :** ద్వ్యక్షర ధాతువులు అచ్చులు హల్లులు అమరికను బట్టి క్రింది విధాలుగా ఉండవచ్చు.

1. అ + హ + అ = ఉలా 'లూటి చేయడం'
2. హ + అ + హ + అ = బలా 'పిలుచు' — బగా 'విసరివేయు'
3. హ + హ + అ + హ + అ = ఖోడా 'కుంటు'
4. అ + హ + హ + అ — ఉందా 'పోయు'
5. హ + అ + హ + హ + అ = కల్డా 'అరుచు'
6. హ + హ + అ + హ + హ + అ = ఘబ్రా 'బయపడు'
7. అ + హ + అ + హ = ఉతర్ 'దిగు'
8. హ + అ + హ + అ + హ = కతర్ 'నరుకు' — నికల్ 'బయటికి వచ్చు'
9. హ + హ + అ + హ + అ + హ = ఖరచో 'ఖర్చు పెట్టు' 'ఛణక్ 'చల్లు'

**II. సంశ్లిష్ట క్రియలు :** క్రియా ధాతవులనుంచి కొన్ని నిష్పాదక ప్రత్యయాల ద్వారా ఏర్పడే క్రియా రూపాలను సంశ్లిష్ట క్రియలు అంటారు.

**(A)** ధాతవు + అ

సకర్మక ధాతవు పై- ఆ చేరగా ప్రేరణ క్రియ ఏర్పడుతుంది.

| | | | |
|---|---|---|---|
| అడ్ | 'అడ్డగింపు' | అడా | 'అడ్డగించేలా చేయటం' |
| కర | 'చేయి' | కరా | 'చేయించు' |
| కూట్ | 'దంచు' | కుటా | 'దంపించు' |
| ఘాల్ | 'పోయు' | ఘలా | 'పోయించు' |

(B) ద్వ్యక్షర ధాతువులలో ప్రేరణార్థకమైన 'ఆ' కు ముందు ద్వితీయాక్షరంలోని అకారం లోపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| ఖరచ్ | 'ఖర్చుచేయు' | ఖర్చా | 'ఖర్చు చేసేలా' |
| నికల్ | 'బయటికి వచ్చు' | నికళా | 'బయటికి వచ్చేలా చేయు' |
| పకడ్ | 'పట్టుకొ' | పకడా | 'పట్టించు' |
| సామళ్ | 'విను' | సమళ | 'వినిపించు' |

ద్వితీయాక్షరంలో ఆ ఉన్నా కూడా ఈ మార్పు జరుగుచున్నది.

| | | | |
|---|---|---|---|
| హకాల్ | 'తోలు' | హకలా | 'తోలించు' |

II ధాతువునిలో హ్రస్వాచ్చు దీర్ఘం కావటం ద్వారా అకర్మక ధాతువు సకర్మంగా మారుతుంది.

| | | | |
|---|---|---|---|
| (అ''క) గడ్ | 'పూడుకు పోవు' | (స'' క) గాడ్ | 'పూడ్చిపెట్టు' |
| థమ్ | 'నిలువు' | థామ్ | 'నిలుపు' |

ధాతువులో రెండవ అచ్చు అంటే ఆ రెండవ అచ్చు దీర్ఘంకావటం ద్వారా అకర్మక ధాతువు సకర్మకంగా మారుతుంది.

| | | | |
|---|---|---|---|
| (అ''క) వదర్ | 'అప్పు' | వదార్ | 'అప్పు' |

ఆకర్మక ధాతువు చివర శ్వాస స్పర్శనాదంగా మారటంవల్ల అకర్మకాలు సకర్మకాలుగా వస్తాయి.

| | | | |
|---|---|---|---|
| తూట్ | 'విరిగిపోవు' | తోడ్ | 'విరుచు' |
| ఫాడ్ | 'తెరచు' | | |

III ఏకాక్షర ధాతువులకు రా అనే ప్రత్యయంచేరినపుడు, ధాతువులోని అచ్చు అకారంగా మారుతుంది.

| | | | |
|---|---|---|---|
| ఖా | 'తిను' | ఖరా | 'తినిపించు' |
| దే | 'ఇచ్చు' | దరా | 'ఇప్పించు' |
| పీ | 'తాగు' | పరా | 'తాగించు' |
| లే | 'తీసుకొను' | దరా | 'తీయించు' |

కొన్ని ధాతువులలోని దీర్ఘాచ్చు ఏ మార్పు పొందకుండా ఉంది.

| | | | |
|---|---|---|---|
| క | 'చెప్పు' | కెరా | 'చెప్పించు' |

IV ధాతువు పై- అడ్ అనే ప్రత్యయం చేర్చిన సకర్మకధాతువులు ఏర్పడతాయి

| | | | |
|---|---|---|---|
| ఖూాట్ | 'అయిపోవు' | ఖూటాడ్ | 'అయిపోయేలా చేయటం' |
| హఁస్ | 'నవ్వు' | హఁసాడ్ | 'నవ్వించు' |
| ధాఁస్ | 'పరిగెత్తు' | ధాఁస్గో | 'పరిగెత్తుకు పోవుట' |
| జాగ్ | 'మేలుకో' | జగాడ్ | 'మేలుకొనేలా చేయటం' |

**V** కొన్ని ధాతువులలో ఈ పద్ధతుల్లో కాకుండావిలక్షణంగా సకర్మక ప్రేరణ రూపాలు ఏర్పడతాయి.

| | | | |
|---|---|---|---|
| భళ్ | 'కలుసుకొను' | భేళ్ | 'కలుసుకొనేలా చేయు' |
| బేస్ | 'కూర్చో' | బెసార్ | 'కూర్చో బెట్టు' |
| దేక్ | 'చూచు' | దకాళ్ | 'చూపు' |
| రో | 'ఏడ్వు' | రోవాడ్ | 'ఏడ్పించు' |

**VI** కొన్ని ధాతువులు సకర్మకప్రేరణ రూపాలు పొందవు.

| | | | |
|---|---|---|---|
| ఆ | 'వచ్చు' | జో | 'పోవు' |
| విచార్ | 'ఆలోచించు' | | |

**III** **సంయుక్త క్రియలు :** రెండు ధాతు రూపాలు చేరి ఏర్పడే క్రియలు ఇవి. వీటిలో అనేక పద్ధతులు ఉన్నాయి. అందులో

**(A)** అకర్మక ధాతువు తర్వాత జా, ఏడ్, తే మొదలైన సహాయక క్రియలు చేర్చి వాడటం.

| | | | |
|---|---|---|---|
| హట్ | 'కదులు' | హట్‌జో | 'కదలిపోవు' |
| ఆ | 'వచ్చు' | ఆజో | 'రా' |
| ఊట్ | 'పైకిలేచు' | ఊట్‌పడ్ | 'పైకిలేచాడు' |
| జో | 'వెళ్ళు' | జాపడ్ | 'వెళ్ళిపోవు' |
| లడ్ | 'పోట్లాడు' | లడరే | 'పోట్లాడుకొను' |

**(B)** ఆ, రే, రేజా, వంటి సహాయక క్రియలు చేరి కూడ సంయుక్త క్రియలు ఏర్పడతాయి.

| | | | |
|---|---|---|---|
| నికళ్ | 'బయటపడు' | నికళా | 'బయటికి వచ్చు' |
| బేస్ | 'కూర్చొను' | బేట్‌రే | 'కూర్చొని ఉండు' |
| హూబ్ | 'నిలుచు' | హూబ్‌రేజో | 'నుంచొని ఉండు' |

**(C)** సకర్మక ధాతువులపై –లే, –దే, –నాక్, మేల్, –జా వంటి సహాయక క్రియలు చేరి ఏర్పడే సంయుక్త ధాతువులుకొన్ని ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| దేక్ | 'చూచు' | దేక్‌లే | 'చూచుకొను' |
| భాంద్ | 'కట్టు' | బాంద్‌లే | 'కట్టుకొను' |
| కర్ | 'చేయు' | కర్‌దే | 'ఇతరులకొరకు చేయటం' |
| క | 'చెప్పు' | కేద | 'ఇతరులకోసం చెప్పు' |
| తోడ్ | 'విరుచు' | తోడ్‌న్నాక్ | 'విరచి పారవేయు' |
| కర్‌నాక్ | 'చేసి పారేయి' | కర్‌మేల్ | 'చేసిపెట్టు' |
| భాందమేల్ | 'కట్టి పెట్టు' | మాన్ | 'ఒప్పుకొను' |
| మానజోగో | 'ఒప్పుకొనటం' | | |

**(D)** సంశ్లిష్ట క్రియపై సహాయక క్రియ చేరి కూడా సంయుక్త క్రియలు ఏర్పడతాయి

| | | | |
|---|---|---|---|
| సుకానాక్‌ద | 'ఎండేలా చేయు' | పకడ్ మాంగ్‌ల | 'పట్టి తీసుకురా' |

**(E)** నామ వాచకం తర్వాత క్రియారూపాలు చేరి కూడసంయుక్త రూపాలు ఏర్పడతాయి

| | | | |
|---|---|---|---|
| నీంద్ | 'నిద్ర' | నీంద అ | 'నిద్ర వచ్చు' |
| గీద్ | 'పాట' | గీద్‌బోల్ | 'పాట పాడు' |

**(F)** విశేషణం మీద కూడా క్రియ చేరి సంయుక్త ధాతువు ఏర్పడుతుంది.

| | | | |
|---|---|---|---|
| మోటో | 'పెద్దది' | మోటోఛ | 'పెద్దది ఆగు' |

## I క్రియా రూపు విష్పత్తి.

సుగాలీ భాష క్రియా నిర్మాణంలో పదాంశాల అమరిక ఈ క్రింది వరుసలో ఉంటుంది.
ధాతువు + కాల/భావ బోధక ప్రత్యయం + పురుషబోధక ప్రత్యయం.
క్రియలను సమాపక క్రియలని, అసమాపక క్రియలని రెండు విధాలుగా చెప్పవచ్చు.
అసమాపక క్రియల చివర పురుష బోధక క్రియ ఉండదు.

### 1) సమాపక క్రియలు :-

ఈ వర్గం క్రింద హెచ్చించదగిన క్రియలు ఇలా ఉన్నాయి.

**(A)** భవిష్యత్తద్దరార్థక క్రియలు : (-O- / త -/)

-కాట్ 'కొరుకు'

| | ఏ''వ | | బ''వ | |
|---|---|---|---|---|
| ఉ''పు | కాట్ +O + ఊc | 'కొరుకుతాను' | కాట్ + O + ఆc | 'కొరుకుతాము' |
| మ''పు | కాట్ +O + ఏ | 'కొరుకుతావు' | కాట్ + O + ఏc | 'కొరుకుతారు' |
| ప్ర''పు | కాట్ +O + ఏ | 'కొరుకుతారు' | కాట్ + O + ఏc | 'కొరుకుతారు' |

-ఖా 'తిను'

| | | | | |
|---|---|---|---|---|
| ఉ''పు | ఖా +O + ఊc | 'తింటాను' | ఖా + O + మ | 'తింటాము' |
| మ''పు | ఖా +O + ప/వే | 'తింటావు' | ఖా + O + ఏ | 'తింటారు' |
| ప్ర''పు | ఖా +O + ఏ/వే | 'తింటాడు' | ఖా + O + ఏ/వె | 'తింటారు' |

–దే 'ఇచ్చు'

| | | | | |
|---|---|---|---|---|
| ఉ''పు | ద్ +O + ఊc | 'ఇస్తాను' | ద్ + O + అc | 'ఇస్తాము' |
| మ''పు | ద్ +O + ప | 'ఇస్తాము' | ద్ + O + ఏ | 'ఇస్తారు' |
| ప్ర''పు | ద్ +O + ఏ | 'ఇస్తాడు' | ద్ + O + ఏ | 'ఇస్తారు' |

ఇక్కడ ధాతువులోపించటం గుర్తించాలి.

-ఛే/ ఛ 'ఉండు'

| | | | | |
|---|---|---|---|---|
| ఉ''పు | ఛ్ +O + ఊ | 'ఉంటాను' | ఛ్ + O + ఆc | 'ఉంటాము' |
| మ''పు | ఛ్ +O + ఇ | 'ఉన్నావు' | ఛ్ + O + ఓ | 'ఉన్నారు' |
| ప్ర''పు | ఛ్ +O + ఏ | 'ఉంటాడు' | ఛ్ + O + ఏ | 'ఉంటారు' |

–తకారం ప్రత్యయంగా చేరే కొన్ని క్రియా రూపాలు ప్రదర్శిస్తాము. తకారం చేరినపుడు ఇదే కాలంలో భూతార్థం వస్తుంది.

| కర్ | | చేయి | |
|---|---|---|---|
| పుం'' లి | కర్ + తు + ఓ 'చేసేవాడిని' | కర్ + మె + ఏ | 'చేసేవాళ్ళము' |
| స్త్రీ'' లి | కర్ + త్ + ఇ | 'చేసేదానిని' | కర్ + త్ + ఇ 'చేసేవారు' |

ఈ క్రియా రూపాలను వాక్య రూపంలో ఇక్కడ ప్రదర్శిస్తాను.

మ అవ్‌చూం = నేను వస్తాను.
మ అతోతో = నేను వచ్చేవాడిని.

## II శత్రర్థక క్రియలు

ఈ క్రియలో ధాతు వ్యాపారం పూర్తి అయి ఉండదు. వర్తమాన, భూత, భవిష్యత్ కాలాల్లో ఈ క్రియా రూపాలు కనిపిస్తాయి.

| దేక్ | 'చూచు' | |
|---|---|---|
| ఏ'' వ | బ'' వ | |
| పు'' లి | దేక్+ ర్/ త్/ ఓ | దేక్+ ర/ త్+ ఏ |
| స్త్రీలు | దేక్+ ర్/ త్+ఈ | దేక్+ ర్/ + త్+ఈ. |

1) వక్త పుంలింగమైనపుడు: మదేక్‌రోచూం 'నేను చూస్తున్నాను'
మదేక్ తోతో 'నేను చూస్తూఉంటిని'

2) వక్త స్త్రీలింగమైనపుడు: మదేక్‌రీ 'నేను చూస్తూన్నాను'
మదేక్ తీతీ 'నేను చూస్తుంటిని'

## III భూతకాలిక క్రియలు

పై విధంగా కాకుండా ధాతు వ్యపారం పూర్తి అయిపోయిన క్రియా రూపాలలో ౦/ యాకారాలు ప్రత్యయాలుగా కనిపిస్తాయి.

| | భర్ | 'నింపు' |
|---|---|---|
| | ఏ'' వ | బ'' వ |
| పు'' లి | భర్ + ౦ + ఓ 'నింపాడు' | భర్ + ౦ + ఏ 'నింపారు' |
| స్త్రీ'' లి | భర్ + ౦ + ఈ 'నింపావు' | భర్ + ౦ + ఏ 'నింపారు' |
| | లా | 'తెచ్చు' |
| | ఏ'' వ | బ'' వ |
| పు'' లి | లా+ య్ + ఓ 'తెచ్చాడు' | లా+ య్ + ఏ 'తెచ్చాడు' |
| స్త్రీ'' లి | లా+ య్ + ఈ 'తెచ్చింది' | లా+ య్ + ఈ 'తెచ్చినారు' |

ఈ క్రియలు వాక్య రూపంలో చూపినాను

వక్త పుంలింగమైనపుడు:

మకీది 'నేను చేసినాను' హమ్‌కీదే 'మేము చేసినాము'

వక్త స్త్రీలింగమైనపుడు :

మకీది 'నేను చేసినాను' హమ్‌కీదే 'మేము చేసినాము'

ప్రథమ పురుషలో

ఊకో 'వాడు చెప్పాడు' ఒకే'వారు చెప్పారు' పుం'' లి'' బ

ఊకీ 'ఆమె చెప్పింది' ఒకీ'వారు చెప్పారు' స్త్రీ'' లి'' బ

భూతకాలిక క్రియా రూపాలలో ధాతువులకు రూపాంతరాలు కనిపిస్తాయి. అంటే సపదాంశాలని అర్థం.

1. బేస్ - బేట్ 'కూర్చొను' తూబేస్ 'నువ్వు కూర్చో' (విధిక్రియా)
ఊబేటో 'వారు కూర్చున్నారు' (భూతకాలిక క్రియ)

2. దేక్ - దీట్ 'చూచు' తూదేక్ 'నీవు చూడు'
ఊదీటో 'వాడు చూచాడు'

3. చే - మేల్ 'ఉంచు' మఛూం 'నేను ఉన్నాను'
మతో 'నేను ఉంటిని'

4. జా గే 'పోవు' తూజో 'నీవు వెళ్ళు'
మగో 'నేను వెళ్ళితిని'

5. లే ద 'ఇచ్చు' తూలే 'నీవు తీసుకో'
మలీదో 'నేను తీసుకున్నాను'

IV అన్నంత ప్రాతి పదికపై ఏర్పడే క్రియా రూపాలు జరగబోయే లేదా జరపబోయే క్రియను తెల్పుతాయి

దే ఇచ్చు

ఏ'' వ బ'' వ

పుం'' లి దే+వాళ్+ఓ 'ఇవ్వబోతున్నాడు' దే+వాళ్+ఏ 'ఇవ్వబోతున్నారు'

స్త్రీ'' లి దే+వాళ్+ఈ 'ఇవ్వబోతుంది' దే+వాళ్+ఈ 'ఇవ్వబోతున్నారు'

వక్తపుంలింగమైనపుడు మదేవాళోఛూం 'నేను ఇవ్వబోతున్నాను'

వక్తస్త్రీలింగమైనపుడు మదేవాళిఛూం 'నేను ఇవ్వబోతున్నాను'

IV భావ బోధక క్రియలు

I విధి క్రియలు : ఈ క్రియా రూపాలు మధ్యమ పురుష ఏక బహువచనాలలో ఉంటాయి.

ఏ'' వ బ'' వ

ఊట్ ''లే'' ఊటో 'లేవండి'

| మధ్యమపురుష | ఆ | 'రా' | 'ఆవో' | 'రండి' |
|---|---|---|---|---|
| | దే | 'ఇవ్వు' | దేవో | 'ఇవ్వండి' |

కేవలం ధాతు ధాతు రూపాన్ని అలాగే వాడితే ఏకవచనం అవుతుంది ఓ చేరిస్తే బహువచనం అవుతుంది.

ఖా, జా అనే ధాతువుల్లోని అచ్చు ఓ ముందు లోపిస్తుంది.

| 'తూఁఖో' | 'నీవుతిను' | తూఁజో | 'నీవు వెళ్ళు' |
|---|---|---|---|

పురుషతో సంబంధం లేకుండా తప్పనిసరిగా చేయవలసినక్రియను సూచించే విధి క్రియ రూపాలు కొన్ని ఉన్నాయి.

దీనికి ణ/ణో అనే ప్రత్యయం చేరుతుంది.

| కర్ | 'చేయు' | మ కర్ణూ | 'నేను చేయాలి' |
|---|---|---|---|
| తు కరణూ | 'నీవు చేయాలి' | ఊ కరణూ | 'వాడు చేయాలి' |
| ఓ కరణూ | 'వారు చేయాలి' | | |

II **ఆశీస్సు, శాపాదులు :** ఒక పని చేయాలన్న ఇచ్ఛఒకటి జరగాలన్న కోరిక సంకల్పం ఆశీస్సు శాపం మొదలైనవి ఈ వర్గం క్రిందవస్తాయి.

| | కర్ | | **'చేయు'** | |
|---|---|---|---|---|
| | ఏ''వ | | బ''వ | |
| ఉ''పు | కరియుఁ | 'చేస్తాను' | కరియా | 'చేస్తాము' |
| మ''పు | కరియె | 'చేస్తావు' | కరియో | 'చేసారు' |
| ప్ర''పు | కరియే | 'చేస్తాడు' | కరయే | 'చేస్తారు' |

| | –అ | | **'వచ్చు'** | |
|---|---|---|---|---|
| | ఏ''వ | | బ''వ | |
| ఉ''పు | అయియుఁ | 'వస్తాను' | ఆయేఁ | 'వస్తాము' |
| మ''పు | అయియే | 'వస్తావు' | ఆయియో | 'వస్తారు' |
| ప్ర''పు | ఆయియే | 'వస్తాడు' | ఆయియే | 'వస్తాడు' |

| | –దే | | **'ఇచ్చు'** | |
|---|---|---|---|---|
| | ఏ''వ | | బ''వ | |
| ఉ''పు | దీయుఁ | 'ఇస్తాను' | దీయాఁ | 'ఇస్తాము' |
| మ''పు | దీయే | 'ఇస్తావు' | దీయో | 'ఇస్తారు' |
| ప్ర''పు | దీయే | 'ఇస్తాడు' | దీయే | 'ఇస్తాడు' |

(1) మతోన్ వరం దియుఁ నేను నీకు వరం ఇస్తాను.

(2) దేవ్‌తోన్ అచో కరియే/కరేస్-దేవుడు నీకుమంచిచేస్తాడు.

పై వాక్యలలో (1)లో ఇస్తాను ఉన్నది. ఆకాంక్షను, కరియే/కరీస్ ఉన్నది ఆశీస్సును సూచిస్తాయి.

వాక్యం ఉనికిను బట్టి సహాయక క్రియలను బట్టి ఆశీస్సును సూచించే క్రియ శాపాన్ని సూచిస్తుంది.

తు మరేస్ — నీవు చత్తువు గాక

మరేస్ తరువాత జా అనే సహాయక క్రియ చేర్చడంకూడ ఉంది.

తూ మరే స్జో! — నీవు చస్తావు పో!

తార్ ఘర్ బళజా! — నీ ఇల్లు కాలిపోని!

తార్ ధణి మరజా! — నీ మొగడు చావని!

## (2) అసమాపక క్రియలు

క్రియా వ్యాపారం పూర్తి కాకుంటే అసమాపక క్రియఅంటారు. ఇదివర్తమాన భూత కాలంలో రెండింటిలోను ఉంటుంది.

## (A) శత్రర్థక అసమాపక క్రియ

తూ అనే ప్రత్యయం చేరి శత్రర్థక అసమాపక క్రియను సూచిస్తుంది, ప్రధాన వాక్యంలో ఉండే క్రియతో సమాన కాలంలో ఈ వ్యాపారం కూడజరుగుతుంది.

| | కర్ | | 'చేయు' |
|---|---|---|---|
| | ఏ'' వ | | బ'' వ |
| పుం'' లి | కర్తూc/ తో | 'చే స్తూ' | కర్ తూc/ తే |
| స్త్రీ'' లి | కర్తూ/ తీ | 'చేసి' | కర్తూc/ కర్తి |

వక్త పుంలింగమైనపుడు — మరకరతc( జాతోతో!
నేను చేస్తూ పోతుంటిని!

వక్తస్త్రీలింగమైనపుడు — మకర్తి జాతీతీ!
నేను చేస్తూ పోతుంటిని!

వక్తపుంలింగమైనపడు — మ ఓన్ రోతో దిటో!
నేను వాడు ఏడుస్తుంటే చూసాను!

## (B) భూతకాలిక అసమాపక క్రియ(క్త్వార్థకం)

కర్ — 'చేయు' — కర్- అన్/ కర్వాణి 'చేయు'

జా — 'పోవు' — జాన్/ జాతాణి 'పోయి'

అ (వచ్చు) అనే సహాయక క్రియకు ముందు ఇ అనే క్త్వార్థక ప్రత్యయం కనిపిస్తుంది.

దేక్ — 'చూచు' — దేక్+ ఇ+ ఆయో 'చూసివచ్చాడు'

ఊమన్ దేకన్ ఆజో కన్ కో! — వాడు నన్ను చూసి రమ్మని పిలిచాడు!

ఊ సేన్ అఏ దేన్ అరోచ్ — వాడు అందరిని రానిచ్చి వస్తున్నాడు.

పీ అనే ధాతువు తర్వాత అన్‌లోని అకారం లోపిస్తుంది.

పీ + అన్-పీన్ 'తాగు'

**(C) భావార్థక క్రియలు :**

| | |
|---|---|
| కర్ | 'చేయి' |
| కరణు | 'చేయటం' |

| | |
|---|---|
| ఈవత్ జాయేన్ ఇష్ట పడ్రోచ్ ! | వాడుఅక్కడికి పోవటకు ఇష్టపడతాడు |
| ఉవత్ జాన్ ఇష్ట పడ్రోచ్ | వాడుఅక్కడికి పోవటం ఇష్టపడతాడు |

**(D) చౌదర్థకం :**

'తో' అనే ప్రత్యయం చేర్చటం ద్వారాచేదర్థక క్రియలు ఏర్పడతాయి.

జా 'వెళ్ళు'

| | |
|---|---|
| తూ:వత్ జావతో మ అఊ:చు! | నీవు అక్కడికి వెళ్ళితే నేను వస్తాను! |
| తూ:వత్ ఆయోవతో ఆచ్ రేతో! | నీవు అక్కడికి వచ్చిఉంటే బాగుండేది! |

**(E) పురుష భోదక ప్రత్యయాలు :-**

| | ఏ''వ | బ.వ. |
|---|---|---|
| ఉ''పు | ఊ:c | ఆc/కూ:c''కు |
| | మ''పు | -ఏ/-వే/Oఓ |
| పు''పు | -ఏ/వే/O | -ఏ/-వీ/O |

| | ఏ''వ | బ''వ |
|---|---|---|
| పుంలింగం | ఓ | ఏ |
| స్త్రీలింగం | ఈ | ఈ |

వీటి ఉదాహరణలు ఇంతవరకూ చెప్పిన క్రియా రూపాలల్లోనే ఉన్నాయి.

**(F) క్రియా విశేషణాలు**

శత్రర్థక క్త్వార్థక ప్రత్యయాలు చేరి క్రియావిశేషణాలు చేరుతాయి.

| | | |
|---|---|---|
| I | ఊ ఛోరా హాఁసతో జారోచ్! | ఆ అబ్బాయి నవ్వుతూ పోతున్నాడు! |
| II | ఈ ఛోరా రోతో రోతో ఆయో! | ఆ అబ్బాయి ఏడుస్తూ ఏడుస్తూ వచ్చినాడు. |
| III | ఊదళయా సేలాన్ మన్ దీనో! | వాడు అన్నమంతా తెచ్చి నాకిచ్చినాడు. |
| IV | ఊ ఆచో ఖాఖాన్ జాడో పేగో! | వాడు బాగా తిని తిని లావెక్కినాడు. |

ఆమ్రేడితమైనపుడు మొదటి క్త్వార్థక ప్రత్యయం లోపించటం గమనించవచ్చు.

ఖాన్+ ఖాన్ = ఖాఖాన్

ఇలాగే దేక్ దేకన్( చూసి చూసి) ధాఁసన్( పరిగెత్తి పరిగెత్తి) లేలేన్( తీసుకొని తీసుకొని) మొదలుగునవి.

**(3) విభక్తి వ్యవస్థ**

ఈ భాషలో విభక్తి ప్రత్యయాలుగా చెప్పగలిగినవి. క్రిందిరూపాలు.

-నే( ద్వితియా/ చతుర్థి) -తీ( తృతియా/ పంచమి)

-ర్( షష్ఠీ) -మ (సప్తమి)

ఈ నాల్గు విభక్తి రూపాలకు అర్థఛాయలు చాలాఉన్నాయి. వీటిని క్రింది ఉదాహరణల ద్వారా గమనించవచ్చు.

**I -నే (న్) అనే ప్రత్యయం ద్వితీయ చతుర్థిని బోధిస్తుంది.**

| | | |
|---|---|---|
| ద్వితీయ | మ ఓన్ దీటో! | నేను వాడిని చూశాను! |
| | మ రామేన్ బలాయో! | నేను రాముని పిలిచాను! |
| చతుర్థి | మ ఘరేన్ గోతో! | నేను ఇంటికి వెళ్ళాను! |
| | మ ఏక్ మీనాన్ ఆc ఊచుc | నేను ఒక నెలలో వస్తాను |
| | హాcమ్ ధోకేన్ జామాచ | మేముపూజించడానికి వెళ్ళుతున్నాం. |

**II – తి అనే ప్రత్యయం తృతీయలోను. పంచమిలోను చాలా అర్థాలలో వాడబడుతుంది.**

| | | |
|---|---|---|
| తృతీయ | మ దాంత్‌లా తీ కొతరూcచు | నేను కొడవలితో నరుకుతాను. |
| | మ ఓసేతి తాండేన్ గోతో | నేను వారితో ఊరికి వెళ్ళాను. |
| పంచమి | మతాండేతి ఆయో | నేను తాండానుంచి వచ్చాను. |
| | తూ సవారేతి ఈ కామ్‌కర్ | నీవు రేపటి నుంచి ఈ పనిచేయి |
| | ఊ ఈకామ్ మజాతి కరరోచ్ | వాడు ఈపని సంతోషంతో చేస్తున్నాడు. |
| | తూ మోతి మోటోచి | నీవు నాకంటే పెద్దవాడివి. |
| | ఊ తావేతి మరగో | వాడు జ్వరంతో చచ్చిపోయాడు. |

**III -ర్ అనే రూపం 'యొక్క' అనే అర్థాన్ని సూచిస్తుంది.**

| | |
|---|---|
| ఊ రాజేర్ బేటా ఛ | వాడు రాజు యొక్క కుమారుడు |
| ఈ మార్ చాకు/ ఈ చాకు మార్ఛ | ఇదినా చాకు/ ఈ చాకు నాది. |

**IV –మ సప్తమీ విభక్తిలో వాడే ఈ ప్రత్యయం విశేషార్థంలో వాడబడుతుంది.**

| | |
|---|---|
| గావ్‌డి తళాయేమా చరరీచ్ | ఆవు చెరువులో మేస్తున్నది. |
| మ ఏక్ గంటామా ఆc ఊచుc | నేను ఒక గంటలో వస్తాను. |

**V ఇంకా, వైపు, వరకు, వంటి, ఇంత, అంత, దగ్గర తరువాత, వెనుక, దూరంగా, బయట, ముందు, మధ్య, కోసం, క్రింద అనే కారక సంబంధాలను బోధించే విభక్త్యర్థక పదాలు కూడా ఉన్నాయి.**

| | | |
|---|---|---|
| (A) | మ అనంతపూర్ వడి/సామ్‌జారోచు | నేను అనంతపురం వైపు పోతున్నాను. |
| (B) | మ పాములాయి థాణు జాఊc చుc | నేను పాములాయవరకు పోతాను. |
| (C) | ఊ ఉక్కు సరికో ఆద్మీ | వాడు ఉక్కులాంటి మనిషి. |
| (D) | మన దళియా అత్రా ఘాల్ | నాకు అన్నం ఇంత పెట్టు |
| (E) | మార్ ధాcయి పీసా అత్రా ఛేని | నా దగ్గర డబ్బు అంతలేదు. |
| (F) | ఊఓర్ బా పేర్ కన్ గో | వాడు వాళ్ళ నాన్న దగ్గరకు వెళ్ళాడు. |
| (G) | (1) తార్ పాచ్ మ అcఊcచూc | నీ వెనుక నేను వస్తాను. |
| | (2) తార్ ఘరేర్‌పాచ్ కాcయి ఛకో దేక్ | నీ ఇంటి వెనుక ఏముందో చూడు. |
| (H) | తూ పర్ జో | నీవు దూరంగా పో |

| | | |
|---|---|---|
| (I) | ఊ ఘరేర్ బార్ ఛ | అమె ఇంటి బయటఉంది (ఋతుమతి) |
| (J) | ఘరేర్ ముండాగ్ హుబ్‌మత్ | ఇంటి ముందునిలబడవద్దు. |
| (K) | ఊ వాటేర్ వచ్ హూబో | వాడు దారి మధ్యలో నిలబడి ఉన్నాడు. |
| (L) | ఓర ఘరేన్ ఖడే స్రారు గోతో | వారి ఇంటికి గడ్డి కోసం వెళ్ళారు. |
| (M) | ఊ ఝూ డేర్ హేట్ సోగో! | వాడు చెట్టు క్రింద నిద్రపోతున్నారు. |

## (4) సంబోధనలు

వ్యక్తులను, జంతువులను, వస్తువులను, పక్షులను పేర్లతో పిలవడం ఉంది.

గోనా! అత్ అజో — గోనా! ఇక్కడికిరా!

సంబంధ బోధక వాచకాలతో కూడా పిలవడం ఉంది.

| | | | |
|---|---|---|---|
| భీయా! | 'అన్నా/ తమ్ముడా' | బా! | 'నాన్నా' |
| యాడీ! | 'అమ్మా' | బేటా! | 'కొడకా' |
| బాపూ! | 'అయ్యా' | | |

ఏ అనే సంబోధనను పై వాచకాలకు ముందు చేర్చటంఉంది.

| | | | |
|---|---|---|---|
| ఏ భీయా | ఓ అన్నా | ఏ భాయి | ఓ తమ్ముడా |
| ఏ బాయిా | ఓ అక్కా | ఏభెన్ | ఓ చెల్లెలా |

ఒక్కొక్కసారి సంబోధక వాచకాన్ని పునరుక్తం చేయవచ్చు.

యాడీయాడీ — అమ్మా అమ్మా

అత్యంత సాన్నిహిత్యాన్ని అరే సూచిస్తుంది.

అరే తూ కెవడి గోతో — ఒరే నీవు ఎక్కడికి వెళ్ళావు.

## V వాక్యం''

సుగాలీ భాషలో వాక్యంలో భారతీయ భాషలలోలాగనే కర్త, కర్మ, క్రియ అనే వరుసలో పదాలు అమరి ఉంటాయి. వాక్యాలను ప్రధాన వాక్యాలని, అప్రధాన వాక్యాలని రెండురకాలుగా చెప్పవచ్చు.

### I. ప్రధాన వాక్యాలు :

**(A)** సామాన్య వాక్యాలు : వీటిలో క్రియలేనివి, క్రియఉన్నవి రెండురకాలు ఉన్నాయి.

క్రియారహిత వాక్యాలు:

1. ఈఘర్ — ఇది ఇల్లు
2. ఈ హమార్ ఘర్ — ఇది మా ఇల్లు

పై రెండు వాక్యాలను అస్తక క్రియ లేకపోయినా వీటిని వాడి కూడా వాక్యాలు ఉపయోగిస్తారు.

3. ఈ హమార్ ఘర్ ఛ — ఇది మాఇల్లు

వ్యతిరేక వాక్యాలలో క్రియ తప్పనిసరిగా ఉంటుంది.

4. ఈ హమార్ గర్ కోని ఇది మా ఇల్లు కాదు.

5. బామణ్ ఆరోచ్ బ్రాహ్మణుడు వస్తున్నాడు.

6. మా బాటీ ఖాయీ లీదో నేను రొట్టె తినేశాను.

పై రెండు వాక్యాలలో వరసగా అకర్మక, సకర్మక క్రియలు కనిపిస్తాయి. ఇది ఆర్యభాషయే అయినా కర్మణి వాక్యాలు మాత్రం కనిపించటం లేదు.

7. ఈ కామ్ మకిదో అనే కర్తరీ వాక్యానికి ఈపని నేను చేసాను.

ఈకామ్ మోతీవేగో ఈ పని నాచేత అయింది.

అనే వాక్యంలో తెలుగులో లాగా ఉంది తప్పుచేయబడినది వంటి కర్మణి, క్రియతోటి వాక్యం కనిపించటం లేదు.

**(B)** **సంశ్లిష్ట వాక్యాలు :** ఒక వాక్యం మరొక వాక్యంలో భాగంగా చేరటం వల్ల సంశ్లిష్టం వాక్యం ఏర్పడుతుంది.

ఆమె అడవికి వెళ్ళింది

ఆమె కట్టెలు కొట్టింది - ఈ రెండు వాక్యాలు కలిపితే ఆమె అడవికి వెళ్ళి కట్టెలు కొట్టింది. అన్న సంశ్లిష్ట వాక్యం ఏర్పడుతుంది.

మొదటి వాక్యంలోని క్రియను క్త్వార్థకంగా మార్చటంవల్ల ఈ సంశ్లిష్ట వాక్యం ఏర్పడింది. ఇలాంటి వాక్యాలు బంజారా భాషలో అధికంగా ఉన్నాయి.

(1) ఊ తాంద్రి ఒగట్లా మాజాన్ లకడీ కాటీ ఆ స్త్రీ అడవిలోకి వెళ్ళి కట్టెలు కొట్టింది.

**(A)** నామ్నీకరణం : ఒక వాక్యాన్ని మరో వాక్యంలో నామపద స్థానంలో చేర్చటాన్ని నామ్నీకరణం అంటారు.

నేను కట్టెతో కుక్కను కొట్టాను ఆ కుక్క చనిపోయింది.

నేను కట్టెతో కొట్టిన ఆ కుక్క చనిపోయింది. ఇలాంటి వాక్యాలు సుగాలీ భాషలో కూడా కనిపిస్తాయి.

(2) మ లకడితి మరోజకో కొత్రా మరగో - నేను కట్టెతో కొట్టిన కుక్క చనిపోయింది

యత్రదర్థక ప్రయోగం కూడా ఈ భాషలో ఉంది.

(3) మకుణసో కొత్రాన్ లకడితి మారో కొఊ కొత్రా మరగో -

నేను ఏకుక్కను కట్టెతో కొట్టానో ఆ కుక్క చనిపోయింది

ఇక్కడ సుగాలీ భాషలో, సమీపంలో ఉన్న తెలుగుభాషలో లాగ, క్రియాజన్య విశేషంతోవున్న పదబంధమే (కొట్టినకుక్క) అధికంగా అమలులో ఉంది.

**(B)** **సంయుక్త వాక్యం :** రెండు వాక్యాలను కలిపితే సంయుక్త వాక్యం అవుతుంది. ఇక్కడ వాక్యాలను కలిపే ఏదో ఒక పదాంశం సాధారణంగా కనిపిస్తుంది. సమీపంలోని తెలుగు భాషలోలాగా ఏ పదాంశం చేరకుండానే రెండు వాక్యాలను ప్రక్కప్రక్కలో పెడితే సంయుక్త వాక్యం అవుతుంది.

1. ఊచోరిఆచ్ గీద్ బోలచ్, ఆచ్ నాచచ్ -

ఆ పాప బాగా పాట పాడుతుంది. బాగా ఆడుతుంది

మొదటి వాక్యం చివరి అచ్చు దీర్ఘంచేసి రెండవవాక్యంలో కర్త పదం తరువాత బీ చేర్చటం ద్వారా కూడా సంయుక్త వాక్యాలు ఏర్పడతాయి.

2. మ జారో చూం, ఊబీ ఆరోచ్- నేను పోతున్నాను. వాడుకూడా వస్తున్నాడు.

సంబంధాన్ని బోధించే జేర్‌కాణ్( కాబట్టి) అనే రూపాన్ని చేర్చటంవల్ల కూడా సంయుక్త వాక్యలు ఏర్పడుతుంది.

3. తూ ఆరోచి జేర్ కాణ్ మ బిఆరోచుం - నీవు వస్తున్నావు కాబట్టి నేను వస్తున్నాను.

వికల్పాన్ని బోధించే ఫరన్( కాని) అనే ఈ రూపాన్నిచేర్చటం వల్ల కూడా సంయుక్త వాక్యం ఏర్పడుతుంది.

4. బోడి అయీ ఫరన్, బేటా ఆయోకోని- కోడలు వచ్చింది, కాని కొడుకు రాలేదు.

(2) అప్రధాన వాక్యాలు

(A) సంబోధన వాక్యాలు

యాడి! కన్నాఆయీ అమ్మా! ఎప్పుడు వచ్చినావు.

పై వాక్యంలో అమ్మ అన్నది వాక్యస్థాయి ఉన్న సంబోధన.

(B) ప్రశ్నార్థక వాక్యాలు

కత్ జారోచ్? ఎక్కడికి వెళ్ళుచున్నావు''

(C) ఆశ్చర్యార్థక వాక్యాలు

అబ్బ్! కాయి ఛర! అబ్బా ఏం ఉందిరా!

ఆశ్చర్య సూచికమైన అబ్బ్! సంబోధన సూచించేది తెలుగు పదాలే కావడం గమనించాలి.

(D) వ్యతిరేక వాక్యాలు

1. ఊమార్ కోని అది నాది కాదు.

2. మార్ ఢాయి పీసాఛేని నా దగ్గర డబ్బులేదు.

(E). సామాధాన వాక్యాలు

ఛోరా అచోఛి కాయి?- అబ్బాయి బాగా ఉన్నావా ఏమి? అనే ప్రశ్నకు సమాధానం.

అఛోఛూం/ వారు ఛూం- బాగున్నాను. అన్నది మాత్రమే సమాధానంగా ఉంది.

(F) అభినందన వాక్యాలు

ఇద్దరు బంజారాలు కలిసినపుడు అభినందించు కొనేవాక్యం సుప్రసిద్ధంగా ఉంది.

రామ్ రామ్ నాయక్.

VI బంధువాచక ప్రణాళిక

సామాజిక శాస్త్ర వేత్తల ప్రకారం, బంజారా బంధుత్వ ప్రణాళిక 'డకోటా' పద్ధతికి చెందింది. వ్యక్తి అటు ఇటు ఏడు తరాలను గుర్తిస్తాడు. వీటిని స్థూలంగా ఈ క్రింది విధంగా చెప్పవచ్చు.

1. ఒక వ్యక్తికి సంబంధించిన తరం.

2. ఆరోహణ క్రమంలో ప్రథమ, ద్వితీయ, తృతీయ తరాలు.

3. అవరోహణ క్రమంలో ప్రథమ, ద్వితీయా తరాలు

శ్రీ వడితే సర్వేశ్వర్ నాయక్ బంజారా బంధు వాచాకాలమీద పరిశోధన వ్యాసాన్ని అనుసరిస్తూ నాకు లభించిన సుగాలీ భాషా సామాగ్రిని ఇక్కడ ప్రదర్శిస్తున్నాను.

తెలుగు పదం సూచకపదం సంబోధన

1. సోదరుడు

(a) అన్న భియా భీయా (b) తమ్ముడు భాయి పేరుతో

2. తండ్రి సోదరుని కొడుకు

(a) పెద్ద(వ్యవహర్తకంటే) భీయా భీయా (b) చిన్న భాయి పేరుతో

3. తండ్రి సోదరి కొడుకు

(a) పెద్ద మామ మామ (b) చిన్న భాయి పేరుతో

4. తల్లి సోదరుని కొడుకు

(a) పెద్ద భవి మామ (b) చిన్న సాళో(బావమరిది) పేరుతో

5. తల్లి సోదరి కొడుకు

(a) పెద్ద భీయా అన్న (b) చిన్న భాయి పేరుతో

6. సోదరి

(a) పెద్ద భాయి భాయి (b) చిన్న భేన్ పేరుతో

7. తండ్రి సోదరి కూతురు

(a) పెద్ద భోజాయి భోజాయి (b) చిన్న సాళి పేరుతో

8. తల్లి సోదరుని కూతురు

(a) పెద్ద భోజాయి భోజాయి (b) చిన్న సాళి పేరుతో

9. తల్లి సోదరి కూతురు

(a) పెద్ద భాయి భాయి (b) చిన్న భేన్ పేరుతో

10. భర్త ధణి ఘరేవాళో
భార్య గోణ్ణి పేరుతో

11. భర్త సోదరి

(a) పెద్ద నీణద్ భోజాయి (b) చిన్న నణంద్ పేరుతో

12. భర్త సోదరి భర్త

(a) పెద్ద నీణందోయి భీయా (b) చిన్న నణందోయి పేరుతో

13. భర్త అన్న
(a) పెద్ద జేట్/ఓడారి వఓడారి (b) చిన్న దేవర్ పేరు/పీకా

14. భార్య సోదరి భర్త
(a) పెద్ద సాడు భీయా (b) చిన్న సాడు పేరుతో

15. భార్య సోదరి భర్త
(a) పెద్ద సోదరి భర్త భేనోపీ మామ (b) చిన్న సోదరి భర్త సాళో పేరుతో

16. సోదరి భర్త
(a) పెద్ద సోదరి భర్త జేట్. వడారి (b) చిన్న సోదరి భర్త దేవర్ పేరుతో

17. భార్య సోదరుడు
(a) పెద్ద భెనోవి భెనోవి (b) చిన్న సాళో పేరుతో

18. కొడుకు భార్య తండ్రి
(a) పురుషుడుసగాసేన్/సంమ్దీ మామా (b) స్త్రీలు సగాసేన్/సందీ భీయా

19. కూతురు భర్త తండ్రి
(a) పు, సగాసేన్/సంమ్దీ మామా (b) స్త్రీ సగాసేన్/సంమ్దన్ భోజాయి

20. కూతురు భర్త తల్లి
(a) పు సగాసేన్/సంమ్దీ భాయి (b) స్త్రీ సగాసేన్/సంమ్దన్ భోజాయి

21. భార్య సోదరి
(a) పెద్ద భోజాయి భోజాయి/భాయి (b) చిన్న సాళి పేరుతో

22. సోదర భార్య
(a) పెద్దన్న భోజాయి(మోటి) భోజాయి (b) చిన్నన్న? నాన్‌కీ భోజాయి పేరుతో

23. భర్త సోదరుని భార్య
(a) పెద్దన్న జటాణి భాయి (b) చిన్నన్న దర్‌వాణి పేరుతో

(B)

1. కొడుకు (కొ) బేటా పేరుతో

2. సోదరుని కొడుకు
(a) పు బేటా పేరుతో (b) స్త్రీ భతీజో పేరుతో

3. సోదరి కొడుకు
(a) పు భాణ్‌జో పేరుతో (b) స్త్రీ భాణ్‌జీ పేరుతో

4. సోదర కూతురు
(a) పు బేటి పేరుతో (b) స్త్రీ భతీజీ పేరుతో

5. సోదరి పిల్లలు
(a) పు కొడుకు భాణ్‌జో పేరుతో (b) స్త్రీ కూతురు భాణజీ పేరుతో

6. భార్య సోదరి పి.

(a) పు కోడుకు బేటా పేరుతో (b) స్త్రీ కూతురు బేటి పేరుతో

7. భర్త సోదరి కొడుకు భాణ్జో పేరుతో

8. భర్త సోదర కొడుకు భతీజో పేరుతో

9. భర్త సోదరి కూతురు బేటి పేరుతో

10. భర్త సోదరి కొడుకు బాణ్జో పేరుతో

11. భార్య సోదరి కూతురు బేటి పేరుతో

12. కూతురు భర్త జమాయి పేరుతో

13. కొడుకు భార్య బోడి పేరుతో

(C)

1. తండ్రి బాపు బా

2. తండ్రి సోదరుడు

(a) పెద్ద మోటోబాపుమోటోబా(మోటాపు)

(b) చిన్న కాకా కాకా

3. తల్లి యా యా

4. తల్లి సోదరుడు మామా మామ

(a) పెద్ద మోటో మామ (b) చిన్న నాణ్క్య మామా

5. తండ్రి సోదరి పూపి పూపి

(a) పెద్ద పూపి పూపి (b) చిన్న పూపి పూపి

6. తల్లి సోదరి మాసి మాసి

(a) పెద్ద మోట్ మాసి (b) చిన్న నాణ్కి మాసి

7. తండ్రి సోదరి భర్త పూప పూప

(a) పెద్ద మోటో పూపి (b) చిన్న నాణ్క్యా పూప

8. తల్లి సోదరి భర్త మాస మాస

(a) పెద్ద మోట్ మాస (b) చిన్న నాణ్కి మాస

9. తండ్రి సోదర భార్య

(a) పెద్ద మోట్యాడి మోట్యా (b) చిన్న కాకి కాకి

10. తల్లి సోదర భార్య మామి మామి/పూపి

(a) పెద్ద మోట్ మామి/పూపి (b) చిన్న నాణ్క మామి/పూపి

11. భర్త తండ్రి ససరో/పుషా/మామ పూపి

12. భర్త తల్లి సాను పాపా

13. భార్య తండ్రి ససరో మామా/పూపా

14. భర్త తండ్రి ససరో మామి/పూపా

(D)

| | | | |
|---|---|---|---|
| 1. | కొడుకు కొడుకు | పోతో | పేరుతో |
| 2. | కూతురి కొడుకు | భానజో | పేరుతో |
| 3. | కొడుకు కూతురు | పోతి | పేరుతో |
| 4. | కూతురి కూతురు | భాణజి | పేరుతో |

II

| | | | |
|---|---|---|---|
| 1. | తండ్రి-తండ్రి | దాదా | దాదా |
| 2. | తల్లి-తండ్రి | నానా | నానా |
| 3. | తండ్రి-తల్లి | దాది | దాది |
| 4. | తల్లి తల్లి | నాని | నాని |

III

| | | | |
|---|---|---|---|
| 1. | తండ్రి తండ్రి తండ్రి | పడ్‌దాదా | దాదా |
| 2. | తండ్రి తండ్రి తల్లి | పడ్‌దాది | దాది |
| 3. | తండ్రి తల్లి తండ్రి | పడ్‌నానా | నానా |
| 4. | తండ్రి తల్లి తల్లి | పడ్‌దాది | దాది |
| 5. | తల్లి తండ్రి తండ్రి | పడ్‌నానా | నానా |
| 6. | తల్లి తండ్రి తల్లి | పడ్‌నాని | నాని |
| 7. | తల్లి తల్లి తండ్రి | పడ్‌నానా | నానా |
| 8. | తల్లి తల్లి తల్లి | పడ్‌నాని | నాని |

2. III

| | | | |
|---|---|---|---|
| 1. | కొడుకు కొడుకు కొడుకు | జీట్‌పోతో | పేరుతో |
| 2. | కూతురి కొడుకు కొడుకు | జీట్‌ఖణజో | పేరుతో |
| 3. | కూతురి కూతురి కొడుకు | జీట్‌ఖణజో | పేరుతో |
| 4. | కొడుకు కూతురు కొడుకు | జీట్‌పోతో | పేరుతో |
| 5. | కూతురి కూతురి కూతురు | జీట్‌పోతి | పేరుతో |
| 6. | కూతురి కొడుకు కూతురు | జీట్‌పోతి | పేరుతో |
| 7. | కొడుకు కూతురి కూతురు | జీట్‌పోతి | పేరుతో |
| 8. | కొడుకు కొడుకు కూతురు | జీట్‌పోతి | పేరుతో |

ఈ బంధుత్వ వాచకాల్ని పరిశీలిస్తే ఒక గోత్రానికిచెందినవారు ఒకే కుటుంబానికి చెందినవారన్న భావనస్పష్టమవుతుంది. ఒకేగోత్రానికి చెందిన వారనితెలియగానే చిన్నాన్న పెదనాన్న వరుసలతోను అన్నదమ్ముల వరుసలతోను పిలుచుకుంటారు. దీన్ని బట్టిస్త్రీల బంధువాచకాలు కూడా నిర్ణయింపబడతాయి. కనుక వీరిది పితృ ప్రధానమైన. అగోత్ర వివాహ ప్రధానమైన బంధు వ్యవస్థగా అంటే సగోత్రాలలో వివాహం జరగదని అర్థం. స్త్రీకి వివాహంకాగానే భర్త ఇంటి తాలుకు గోత్రాన్ని పొందుతుంది. ఆమె, వారి అత్త, వారి అత్త, మూడు తరాలు అవుతారు. ఆమె, ఆమె కోడలు, కోడలు కోడలు మూడుతరాలు అవుతారు. ఇతర బంధు వాచకాలంతా ఈ సంబంధాలను కేంద్రంగా కలిగి ఉంటాయి.

## VII సుగాలీ భాష పై తెలుగు ప్రభావం

సుగాలీలకు తెలుగు దేశంలో దాదాపు రెండువందల సంవత్సరాల సంబంధం ఉంది. ఈ కారణంగా నిత్యజీవితానికి సంబంధించిన పదజాలంలో వస్తు సంస్కృతికి సంబంధిచిన తెలుగు పదాలే అధికంగా కనిపిస్తున్నాయి. వ్యాకరణ నిర్మాణానికి సంబంధించిన ప్రభావం చాలా తక్కువ.

(1) **వ్యవసాయ పదాలు :** మడక, బండి, పలుగు, పంట, కపిలి, మకరి, కందణి, అచ్చు, నొగ, ఇస్క, బంక, ముద్ద,మోడం, మొదలుగునవి

(2) **గృహనిర్మాణానికి సంబంధిచిన పదాలు :**

వాకిలి 'వాకలో' ఇంటిమెట్లు 'ఘరేర్ మొట్కి'
ఉక్కు 'ఉక్కు' కిటికి 'కిటికి'
దూలం 'దూలం' కడ్డామను 'కడ్డమను'

(3) **కూరగాయలు - పండ్లు :**

అల్లం, ద్రాక్ష, మల్లి జాంకాయ్, బెండ(భీండా) కొత్తిమెర (కొత్తిమిరి) టమోటా, ఉర్లగడ్డ, సొంటి,(సూంట్) మునగ ఆవాలు, గసగసాలు.

(4) **జంతువుల పేర్ల :**

గొర్రె(గోర్లి) ఏనుగు (హాతి), ఒంటె(హూంట్).

(5) **సమానరూపాలు :** బీగంచెలి, పెద్దమనిషి, కడ్పిల్లు, వట్టినాకు, మెకమేయని ఆకు, దోన్మోద్దు

(6) **తెలుగు + సుగాలీ పదాలు :** మల్లెపూల్, గొడ్డుతాండ్రి, మనగార్ ఫళి, సోమ + వారం = సోమారం

(7) **సుగాలీ + తెలుగు పదాలు :**

కూక్డీర్ పిల్ పిలా బండీర్ నొగ
తపిలి తపేల

## (8) కొన్ని తెలుగు క్రియ రూపాలు :

| | | |
|---|---|---|
| చదవేన్ జారోచ్ | గెల్చేన్ గో | గుణగ్ మత్ |

## (9) సంఖ్యా వాచకాలు :

పదులు చెప్పి ఒక్కట్లు చెప్పడం ద్రావిడ భాషలో పరిగణ పద్ధతి. హిందిలో 57ను పచహత్తర్ అంటారు.

కాని ఇక్కడ సుగాలీ భాషలో పచ్చాస్(అన్)సాత్ అని అంటారు. ఇక్కడ 57అనే రూపానికి అనువాదమే.

## (10) వాక్య ప్రయోగంలో

(1) అస్తిక క్రియలోపం

| | |
|---|---|
| ఈ ఘర్ (ఛ) లోపం | ఇది ఇల్లు |

తెలుగులో కూడా ఈ క్రియా రహిత వాక్యం సహజం

(2) సంబంధ బోధక నామ బంధంలో పదంతో ప్రయోగించటం అత్ ఆయెూజకో

| | |
|---|---|
| మాటీన్ మదీటో | ఇక్కడ వచ్చిన మనిషిని నేను చూస్తిను. |

(3) వాక్యాంతంలో ఏ ప్రయోగం

| | |
|---|---|
| మ జాఁ వ్వూఁచుల | నేను పోతానులే |

(4) సంయుక్త వాక్యాలలో అన్ లోపించటం కూడా తెలుగు ప్రభావంగా చెప్పవచ్చు.

| | |
|---|---|
| రామ్ శంకర్ డగరగే | రామ మరియు శంకర్ వెళ్ళిపోయారు. |

## (11) తెలుగులో జాతీయాలు

| | | |
|---|---|---|
| (1) | ఆమె బయట చేరింది. | ఊ భార్ వేగీచ్ |
| (2) | ఏమి గుసగుస లాడుతున్నావ్ | కాఁగుసగుస కరరోచి. |
| (3) | వాడా ఆమెకు కడుపు చేసాడు? | ఊ ఓతాండ్రిన్ పేట్ కర్నాకోచ్ |
| (4) | వాడు బాన కడుపోడు | ఊ బానా సరికో పేటే వాళో |

సాధారణంగా ఏ తెలుగు పదాన్నైనా సులభంగా ఇమడ్చుకోగల భాషా సహానం సుగాలీలకు సాంస్కృతికంగా అబ్బిన వార సత్యం.

> ''పశు బలమునకు మేము భయపడము, ధనము కొఱకు మేము ఆశించము;
> పేదరికము వల్ల నిరుత్సాహము చెందము,
> బంజారా జాతి సౌధ నిర్మాణము'' మా ఆదర్శములు.
> చదువురానివాడు గ్రుడ్డివాడు; నీ కుమారుడు గ్రుడ్డివాడా?
> చదువురాని జాతి బలహీనమైన జాతి,
> బంజారాల యొక్క మోక్షము విద్యా వ్యాపకము చేయుటలో యున్నది.
> బంజారాలలో 100కి 99 మంది అంధకారమునందుండగా సహించి యూరకొనగలవా?

# బంజారాలువారి ప్రాముఖ్యత వారి లిపిని గూర్చి ఆలోచన

మన భారతదేశంలో సుమారు 25 రాష్ట్రములలో 5నుండి 6 కోట్ల మంది బంజారాలు నివశించుచూ, ఒకే భాషా, ఒకే రకమైన దుస్తులు(డ్రస్సు) ఒకే రకమైన అచార వ్యవహారములు కలిగివుండి, బంజారేతరులకు దూరముగా సోంత గ్రామములు(తాండాలు) స్థాపించుకొని. కొంత భూవసతిని కల్గియుండి. దేశములోని అన్ని భాషలను మాట్లాడకలిగిఉండి, తిరిగి అందరూ కలసి ఒకే భాషలో మాట్లాడగలిగిన, స్థోమత మన బంజారాల ఒక్కరికే ఈ దేశములో ఉన్నది. అనగా జాతీయ సమైఖ్యతను, ఏక కంఠముతో చాటిచెప్పగల ధైర్యము మనకు తప్ప మరి ఏ జాతికిని, ఈ దేశములోలేదు. కావున మనకు భాషా రాష్ట్రమునకుగల అర్హతలన్నియు ఉన్నవి.

ఒక కులం కాదు. బంజారాలు ఒక వర్గమునకు చెందిన వారము. అనగా తెలుగు, తమిళము, కన్నడము, మళయాలము, ఒరియా, అస్సామి, బిహారి, గుజరాతీ, పంజాబి, కాశ్మీరి, హింది, మరాఠీలలాగా.

''గోర్‌వట్'' అనగా పై తెలపిన వర్గములాగా, బంజారాలు పూర్వము వారు ఎద్దుల మీద బీడారులను నడిపించినందువలన బంజారాలు అంటారు. బంజారా అనగా సంస్కృతంలో వ్యాపారి అని అర్థము. మనవారు ఎద్దుల మీద బీడారులు నడిపించుట ''బలద్ జారా'' అనే పదమే బంజారాలుగా మారి ఉండవచ్చును, బలద్ అంటే ఎద్దు, ఆనాటి ప్రజలు(ఉత్తర భారత్) ఎద్దుల మీద పోవు వ్యాపారులు అని చెప్పుతూ, బలద్ జారానే బంజారాగా రూపాంతరం చెంది ఉండును.

''గోర్‌వట్'' గోర్‌వట్ అనేది కూడ గోర్ అంటే తెలుపు, తెలుపు మనుషులు అని ఒకరిని ఒకరు, గోర్ ఆద్‌మి అని తెల్పుకొనుటకుగాను, గోర్‌భాయి అంటారు. ఈ గోర్‌భాయినే గోర్‌వట్‌గా రూపాంతరం చెందిఉండను.

బంజారాలు ఒక వర్గమువారు అనేదానికి కారణం, వీరు నాల్గు వర్ణముల క్షత్రియలు 1. రాథోడ్ వంశము, వీరినే 27 గోత్రముల (సత్తాయీస్ పాడా) భుక్యా అంటారు. 2. చౌహాన్ వంశము, వీరిని 6 ఛోగోత్ చౌహాణులు అంటారు. 3. పవార్ వంశము, వీరిని 12 గోత్రాల (బార్ గోత్) పవార్ అంటారు. 4. జాదవ్ వంశము, వీరిని 52 గోత్రాల వడిత్యా అంటారు. అనగా (బావన్‌పాడా వడిత్యా) నాల్గు క్షత్రియ వంశములు. వీరిని మొత్తం భారతములో 44పేర్లతో పిలుస్తున్నారు.

వీరిని అనుసరించి ఉన్న ఇతర కులస్థులు శూద్రులు, మరి ఇతర వర్ణములు 17జాతులు అనగా ఢాడి, ఢాలియా, ఢోలియా, ఢపడియా, లోహార్‌బంజారా, మథురబంజారా, వాగరియా, భరావా సనార్(కంసాలి) నావి(మంగలి) మొదలగువారు. ఇప్పుడు భాషా రాష్ట్రములుగా ఏర్పడిన వారిలో బ్రహ్మణులు, వైశ్యులు, శూద్రులు మరియు

హరిజనులులాగా, వీరందరు ఒకే భాషను మాట్లాడుటవలన ఏ ప్రాంతమువారు, ఆయా ప్రాంతముల వారిగా భాషారాష్ట్ర ప్రజలుగా గుర్తించబడిఉన్నారు.

అలాగే బంజారాలు కూడ ఒక కులస్థులు కాకుండా అన్ని వర్ణముల ప్రజలు కలసి ఒకే భాషనుమాట్లాడుకొంటూ, ఒకే రకమైన వేషధారణ, ఒకే రకమైన ఆచార వ్యవహారములను కలిగి, వారి మనుగడను సాగిస్తూవచ్చారు. వీరు పూర్వము తమ వృత్తివ్యాపారము, రవాణా సౌకర్యమలు అనగా ఆహారధాన్యములు మొదలుగొని యుద్ధసామాగ్రులను, ఒక రాజ్యము నుండి వేరొక రాజ్యమునకు ముందు సైన్యము మధ్యన బీడారుల వెనుక సైన్యమును నడిపించుకొంటూ సరఫరా చేయుటవలన, ఒక ప్రాంతము లేక ఒక ప్రదేశమును తమ నివాస స్థానముగా ఏర్పరచక మొత్తం భారతదేశమునే తమ దేశముగా స్వీరకరించి ఉన్నారు.

అందువలన స్థిర నివాసములేక, తమ భాషకు లిపి అంటూలేక, తమ పిల్లలను విద్యా విహీనులుగా చేసి, రాజకీయ చైత్యనము లేక, అర్థికస్తోమతలేక మొత్తం భారతావనిలో దిక్కులేని, ధీనులై ఉండిపోయినారు.

బంజారాలు దేశమంతటా చెల్లాచెదురై ఉండటకు కారణము, తమ వ్యాపార బిడారులను ఆంగ్లేయుల ప్రభుత్వము వచ్చిన తరువాత, తమ దోపిడి విధానమును త్వరత్వరగా సాధించుటకుగాను, రైళ్ళు, రోడ్లు, నిర్మించుట వలన బంజారాల వ్యాపారమునకు ముప్పు ఏర్పడినది. రైళ్ళు మార్గములు, రోడ్లు నిర్మాణములు కావించకుండా అడ్డు పడినారు. అప్పుడు ఆంగ్లేయులు విడదీసి పాలించు అను సూత్రమును ఉపయోగించి, బంజారా పెద్దలను రప్పించి వారికి, మీ సౌకర్యముల కొరకే ఇవి అన్నియు ఏర్పాట్లు చేయుచున్నాము. మీరు ఇంత మందిని వెంటపెట్టుకొని వ్యాపారము చేసే బదులు, మా రైళ్ళలో మీ సరకులను ఎంతైనా, ఎక్కడికైనా సులభముగా తీసుకొనిపోయి మంచి లాభమును సంపాందించవచ్చునని ఆశ కల్పించినారు. మరియు మీ ఆదిశక్తి ''మరియామా యాడి'' పేరనే రైళ్ళు నడిపిస్తామని నమ్మించారు. దీనికి నిదర్శనముగా ఇప్పటికి పాత రైళ్ళ ఇంజనులపైన ఆది శక్తి విగ్రహములు ఉన్నవి. ఇదే దీనికి నిదర్శనము.

ఈ విధముగా బంజారాల వ్యాపారము దెబ్బతినడమువలన వారి వద్ద ఉన్న గోసంపదను అనుకూలమైన ప్రదేశములకు ఎన్నిక చేసుకొని, ఈ దేశము మొత్తములో వారి తాండాలను నిర్మించుకొని జీవనం గడుపుచున్నారు. ఈ విధంగా దేశము మొత్తం పై అల్లుకొనిపోయినా! వారి భాష, వేషము, ఆచార వ్యవహారములు మాత్రం చెక్కుచెదరకుండా కాపాడుకొంటూ వస్తున్నారు.

కావున బంజారాల శ్రేయస్సు దృష్ట్యా, బంజారా కార్యకర్తగా ఈ వ్యాసమును వ్రాసి దీనిని బంజారా సంఘములలో ప్రచారం గావించవలయునని, బంజారా జాతీయులు ఈ విషయములు సూక్షదృష్టితో పరిశీలించవలయునని నమ్ముచున్నాను. బంజారాల కంటూ ఒక 'లిపి' అవసరము అను జాగృతిని బంజారా జాతీయులలో ఏర్పడునట్లు చూడవలయును. 1000ను పైబడి గాఢనిద్రలో మునగి ఉన్న బంజారా జాతిని మేలుకొల్పవలయును మరియు స్వాతంత్ర్యమువచ్చి 50 సంవత్సరములు అనగా 1/2శతాబ్దము అయినను బంజారాజాతి అభివృద్ధికి, వారి భాషాభివృద్ధికి ( లిపి) ఎటువంటి కార్యక్రమములు చేపట్టిని భారత ప్రభుత్వము

కాని, భాషా రాష్ట్రములు కాని ఏ మాత్రం శ్రద్ధ వహించలేదు. కాన ఈ వ్యాసం ద్వారాఇటు బంజారా ప్రజలకు (విజ్ఞానవంతులు–విద్యావంతులు) అటు ప్రభుత్వమునకు మేలు కొలపు జరుగుతుందని భావిస్తాను.

బంజారాలలో ఐక్యమత్యం లేకపోవడంవలన గుంటూరు జిల్లా మాచెర్లకు, అనంతపురం జిల్లాలోని కదిరి పశ్చిమమును 1963 సంవత్సరములో ఎం.ఎల్.ఏ. సీట్లను ఎస్.టి. సీట్లను రిజర్వేషన్‌గా కేటాయించి ఉండిరి. ఆనాడు ఉన్న ఎస్.టి. రిజర్వేషన్ ఈనాడు ఎందుకు ఇవ్వలేదు. అనగా అప్పుడు బంజారాల పాపులేషన్ ఎక్కువ ఉండి, ఈనాడు తగ్గినాదా? ఒక ప్రక్క దేశజనాభా దిక్కు మొక్కూలేకుండా పెరిగిపోవుచున్నది అని మొత్తుకుంటుంటే, ఈ రెండు నియోజక వర్గములలో బంజారాల జనాభా తగ్గిపోయినదా?. ఇదే విషయం బంజారాలు తెలుసుకొనవలయును. మన భాషలో ఒక సామెత ఉన్నది ''హల్డాఖాన్ తల్డాయో! ఘూఁటిదేన్ విచ్‌కాయో'' అన్నట్లు మన రాయలసీమ, సర్కారు జిల్లాల గతి అవుతుంది. కావున ఇప్పడైన మేల్కొని జాగృతి కాని పక్షమున, మన జాతికి ఈ ప్రాంతములో పుట్టగతులు ఉండవు.

ఇంతటి ఘనత వహించిన ఈ బంజారా జాతికి ''లిపి'' చాలా ముఖ్యము. బంజారా భాషకు హింది లిపియే బంజారా లిపిగా స్వీకరించి బంజారా భాషను అభివృద్ధి గావించ వలయును. ఒకే అక్షర జ్ఞానముతో రెండు భాషలను నేర్చుకొను అవకాశము బంజారా పిల్లలకు ఏర్పడగలదు. ఇటు మాతృభాష మరియు దేశ భాషను సులభముగా నేర్చుకొని త్వరగా అభివృద్ధి చెందుటకు అవకాశము ఏర్పడగలదు.

వాస్తవములో బంజారాలు ఉత్తర భారతమునకు చెందినవారు. ఉత్తరాది భాషలన్నియు హిందీని కొంత మార్పులు, చేర్పులు చేసి వారి వారి లిపిని(భాషను) అభివృద్ధి చేసుకొన్నారు. హింది, పంజాబి, హరియానా, గుజరాతి, మరాఠి, బిహారి, బెంగాలి, అస్సామి మొదలుగా గల భాషలన్నింటికి హింది(సంస్కృతము దేవనాగరి లిపి) లిపి మూలము. అందులో బంజారా భాష ఉత్తరాధి భాషలన్నింటితోను సంబంధము కలిగి ఉన్నది.

కావున హింది లిపిని ఆధారము చేసుకొని, కొత్త గూడెం శ్రీ భుక్యాబాలాజీదాస్ రాఠోడ్ గారు, బంజారా బాలశిక్షను తయారుచేసి ఉన్నారు. ఆ మహానుభావుడు ఇప్పటికి 30సంవత్సరముల క్రిందటనే ఈ పుస్తకమును అచ్చుచేసి, మొత్తం అన్ని తరగతులకు చెందిన పుస్తకములను తయారుచేస్తాను అని కూడా విన్నవించి ఉన్నారు. కాని ఇటు బంజారా జాతి వారుకాని, ప్రభుత్వమువారు కాని వారికి సహాయము, సహాకారము, ఉత్సాహమును అందించ లేదు. అందువలన ఆతని శ్రమ అంతయు వృథా అయిపోయినది. వారు రచించి ముద్రించిన పుస్తకములను బంజారా కేసరిలో ప్రచురించి, ప్రచారములోకి తెచ్చి, ఇటు ప్రభుత్వ దృష్టికి, బంజారా ప్రజల(విద్యావంతులు) దృష్టికి వచ్చునట్లు చూడవలయును.

ఈ భాషాభివృద్ధికి చేపట్టవలసిన కార్యక్రమములు ఏమనగా కేంద్ర ప్రభుత్వము మరియు రాష్ట్ర ప్రభుత్వముల ద్వారా కావలసినంత ధన సహాయమును పొంది, ప్రతి రాష్ట్రము నుండి బంజారాభాషా పండితులను రప్పించి, వారి సహాయమున బంజారా భాషలో నిఘంటువులను తయారు చేయించి, అచ్చు పుస్తకములను ముద్రింపచేయుట, ఈ పనిని శ్రీ భుక్యాబాలాజీదాస్ రాఠోడ్‌గారు చేపట్టిన నాటి నుండి తలపెట్టి ఉన్న ఈ నాటికి బంజారా

దక్షిణభారతంలో బంజారా స్త్రీ వేషధారణ - అవివాహిత/వివాహిత



ఉత్తర భారతంలో బంజారా స్త్రీ వేషధారణ - వివాహిత/విధవ

సాధారణ దుస్తులలో బంజారా పురుషుడు, స్త్రీ-కీ.శే. శ్రీ ధర్మానాయక్ మరియు కీ.శే. శ్రీమతి సక్రీబాయి-పితావత్ గోత్రం, రాఠోడ్ వంశం, పాడరాళ్ళపల్లి తాండా

లిపి ఉండి ప్రజలందరు బంజారా భాషను నేర్చుకొని ఎంతో అభివృద్ధి చెందియుందురు. బంజారాలకు లిపి లేని కారణమున వారి భావములను ఒకరినొకరికి తెలియపరచలేక పోతున్నారు. తమ భావములను వారు కన్నడములోను, వీరి భావములను తెలుగులోను వ్రాయుట వలన వారిద్దరి భావములకు అడ్డుగోడగా 'లిపి' నిలబడుచున్నది. కావున బంజారాల అభివృద్ధిక 'లిపి' చాలా ముఖ్యము. దీనివలన దాగి ఉన్న సంస్కృతిని వెలికి దీయవచ్చును. ఈ ప్రయత్నం ఇప్పుడు మొదలు పెట్టనిచో ఈ జాతి చాలా నష్టములకు గురికాగలదు.

భారతదేశము మొత్తములో బంజారాలు నివశించి ఉండి ఒకే భాషను మాట్లాడగలిగి ఉండి కూడ లిపి లేని కారణమున ఒకరి భావములను మరియొకరు పంచుకొనలేక పోవుచున్నారు. దీని వలన బంజారా జాతికి ఎంతో భరించరాని నష్టము జరుగుచున్నది. బంజారా విజ్ఞులు దీనిని తెలిసికొనవలయును.

కావున బంజారాలకు ఒక భాషా రాష్ట్రమునకు ఎన్ని హంగులైతే ఉండవలయునో అన్ని హంగులు బంజారాలు కలిగి ఉన్నారు. కావున బంజారాలు కూడ ఒక భాషా రాష్ట్రమునకు అర్హులు, కాని బంజారాలకు ఒక భాషా రాష్ట్రముగా ఏర్పడుటకు అవకాశముఉన్నదా? అని ప్రశ్నించవచ్చును. ఆ అవకాశములు బంజారాలకు లేదు. ఎందుకనగా వీరు దేశం మొత్తం మీద విస్తరించి ఉన్నారు. అందువలన ఒక రాష్ట్రంగా ఏర్పడే అవకాశము లేదు.

అయిన ఒక భాషా రాష్ట్రానికి గల, భాషాభివృద్ధిని చేపట్టవచ్చును కాదా? సుమారు 5నుండి 6కోట్ల జనసంఖ్యను కలిగి ఉన్న ఒకే పెద్ద భాషారాష్ట్ర జనాభకు సమానంతరముగా ఉన్నది. అంటే ఈ దేశ జనాభాలో సుమారు 1/16వ వంతు అన్నమాట. దేశభాషలకు ఖర్చు చేయుచున్న మొత్తంలో 1/16వ వంతు ధనము కేటాయించి, వీరి భాషాభివృద్ధిని చేపట్టవచ్చును కదా? ఇది తప్పకుండ జరుగవలయును.

మరియు 'బంజారా జాతి అభివృద్ధికిగాను ప్రస్తుతం లిపితో అవసరము లేని కార్యక్రమములు అనగా.

1. ఒక ప్రత్యేక ఆల్ ఇండియా రేడియోను స్థాపించి బంజారా భాషలో కార్యక్రమములు చేపట్టవచ్చును.
2. బంజారా భాషలో టి.వి. ప్రోగ్రాములు ఏర్పాటు చేయుట.
3. ఫీల్డ్ పబ్లిసిటి డిపార్టుమెంటను స్థాపించి, బంజారా భాషలో ప్రచారము చేయుట.
4. భారతదేశములోని బంజారా భాషా ప్రవీణులను ప్రొగుచేసి(అన్ని రాష్ట్రాలవారిని) వారి ద్వారా లిపిని అభివృద్ధి చేయించి బంజారా నిఘంటువును తయారు చేయించుట.
5. కేంద్ర స్థాయిలో ఒక బంజారా విద్యాపీఠమును (యానివర్సిటిని) స్థాపించి, బంజారా భాషాభివృద్ధికి ఒక యూనివర్సిటి లెవల్‌లో కార్యక్రమములు చేపట్టుట.

ఇవి అన్నియు ఒక భాషా రాష్ట్రమునకు సంబంధించిన పనులు కాదా? దేశములోని 1/16వ వంతు జనాభాను అంధకారములో ఉంచి, దేశ ప్రగతి, దేశాభివృద్ధి అని చెప్పుచూ అన్ని హంగులు ఉన్న ఒక వర్గమును, ఈ దేశము కొరకు అహోరాత్రులు శ్రమించి, కష్టించుచున్న ప్రజలను చిన్న చూపుచూచిన, ఏ ప్రభుత్వము అభివృద్ధి అగును. ఏమి గొప్పలు సాధించగలరు.

కావున బంజారా విద్యావంతులు, జాతి పురోభివృద్ధిని కాంక్షించే పెద్దలు ఈ విషయమును చాలా సూక్ష్మాతి సూక్ష్మమైన ఆలోచనా శక్తితో విచారించ వలయునని కోరుచున్నాను. ఈ జాతి అభివృద్ధి పైననే దేశాభివృద్ధి ఆధారపడినదిగా భావించవలయును.

బంజారా కేసరి 10-9-93 బంజారాల సేవలో!!

బి. చీనియానాయక్

# బంజారా లిపి సాధ్యము

-డాక్టర్ పి. కె. ఖండోబా



బంజారా కేసరి 1వ సంచిక 24వ సంపుటి సెప్టంబరు 10వ తారీఖు 1993లో ప్రకటించిన శ్రీ. బి. చీనియానాయక్‌గారి లేఖలో బంజారా ప్రాముఖ్యత మరియు ''బంజారా లిపి'' గూర్చి ఒక వ్యాసమును రచించి, బంజారా జాతి అభివృద్ధికి ''లిపి'' చాలా అవసరమని వివరంగా తెల్పినారు. లిపి గురించి కొన్ని విషయాలను పేర్కొన్నారు. బంజారా సమాజంలోని డా. ఖండోబాగారు చిన్న వయస్సులోనే విశ్వ విద్యాలయంలో అత్యున్నత పదవిలో ఉండి ఎన్నోవిషయములను కనుగొన్నారు. డాక్టరు పి.కె. ఖండోబాగారు గుల్‌బర్గా విశ్వ విద్యా లయంలో కన్నడ అధ్యాయన సంస్థలో ముఖ్యులుగా ఉన్నారు.

వారి వ్యాసం బంజారా భాష, లిపి సాధ్యం గురించి ఆలోచనాపరమైన వ్యాసంగా ఉన్నది. ఖండోబాగారి వ్యాసములో బంజారా లిపికి, కావలసిన సాధక బాధకములను స్పష్టంగా తెలియపరచారు. వారు కొన్ని సలహాలను, సూచనలను ఈ వ్యాసము ద్వారా చాలా గొప్ప ఆలోచనతో తెల్పడం జరిగినది.

బంజారా భాష, సాహిత్యం, సంస్కృతి, కళల గూర్చి, అఖిల భారతం మరియు రాష్ట్ర సమ్మేళనములలో చర్చించవలసిన విషయములు. కాని కొందరు దీనిని రాజకీయ సమ్మేళనంగా చూడ కూడదు. ఇది భారతం మొత్తంలోని బంజారా భాషాభివృద్ధి గూర్చిన విషయం, రాజకీయం కాదు అని తేల్చి చెప్పి ఉన్నారు.

బంజారా భాషకు ప్రత్యకమైన లిపి అవసరమా? యావత్ భారతంలో ఒకే భాషను మాట్లాడుతున్న బంజారాలు, పరస్పర వ్యవహారములు తెలుసుకొనుటకు ఒక లిపి అంటూ

లేదు. ప్రపంచంలో ఉన్న భాషలన్నింటికిని లిపి లేదు. అల్ప సంఖ్యాకులైన ప్రజలకు కొన్ని ప్రాంతీయ భాషలను అనుసరించి తమ వ్యవహారములను జరుపుకొంటున్నారు.

కాని బంజారాలు అలా కాదు. మొత్తం భారతంలో విస్తరించుట వలన ప్రాంతీయ భాషలు వచ్చియున్న తమ కంటూ ఒక లిపి లేకపోవుట వలన పరస్పరం తమ భావములను తెలియ పరుచుకోలేక పోవుచున్నారు. బంజారాలు స్వతహాగా ఉత్తర భారతం నుండి జీవనాధారముకై దేశము నలుమూలలో వ్యాపించియున్నారు. ఉత్తర భారతమునకు సంబంధించిన బంజారాలు, మామూలుగా మాట్లాడు భాషలో రాజస్తాన్, గుజరాత్, హింది పదజాలములు ఎక్కువగా ఉన్నవి. బంజారా భాష రాజస్థాన్ భాషయొక్క ఉపభాష అని కొందరు విద్వాంసులు అభిప్రాయ పడుచున్నారు. కాని వాస్తవానికి బంజారా భాష ఇండో, ఆర్యన్ వర్గమునకు చెందినది. ఉత్తర భారతదేశమునకు బంజారా భాష చాలా దగ్గర సంబంధము కలిగి ఉన్నది.

ఉత్తర భారతదేశంలో ప్రతి భాషకు భాషా సంబంధమైన మరియు లిపి సంబంధమైన దృష్టిని ఉంచుకొని, ఆంతరంగిక సంబంధము కలిగి ఉండును. ఉత్తర భారత భాషలన్నింటికి దేవనాగరి ''లిపి''యే మూలం. దేవనాగరి లిపినే కొంత మార్పులు, చేర్పులు చేసి పంజాబి, అస్సామి, బెంగాలి, గుజరాత్, రాజస్థాన్, మరాఠి మరియు హింది భాషలు ఈ లిపి ద్వారానే అభివృద్ధి చెందినవి.

బంజారా భాష ఉత్తర భారత భాషలన్నింటికి నేరుగా సంబంధము ఉండుట వలన నిస్సందేహముగా దేవనాగరి ''లిపి''నే బంజారా లిపిగా అభివృద్ధి చేసుకొనవలయును. నేను చేసిన పరిశోధనలతో హింది లిపినే బంజారా లిపిగా అభివృద్ధి చేయవలయునను అభిప్రాయం నాకు కలిగినది. నా అభిప్రాయములో బంజారా భాష యొక్క ధ్వని, ఉచ్ఛారణ స్పష్టంగా దేవనాగరి లిపితో సులభంగా కలసిపోయి సులభముగా వ్రాయుటకు వీలు కలుగుతుంది.

దేవనాగరి లిపినే బంజారా భాషకు ఉపయోగించిన వేరే లిపి అవసరం లేదు. అయినా ఉతర భారతంలో అన్ని భాషల మాదరిగానే దేవనాగరి లిపినే ఆధారంగా ఉంచుకొని, కొన్ని మార్పులు, చేర్పులు చేసుకొని భాషను తనదైన ఒక లిపి అను మాధ్యమును పొందుటకు మంచి అవకాశం కలదు. బంజారా భాషకు ''లిపి'' అను కవచము తొడుగుట అంత సులభమైన పనికాదు.

సామాన్యంగా ఒక భాషకు ''లిపి'' అను కవచమును తొడగుటకు, ఆ భాషను ఒక వ్యవస్థ క్రింద తీసుకొని రావలయును. దీని వెనుక బంజారా భాషను మాట్లాడే భాషాభిమానులు, ప్రజాభిమానులు మొట్టమొదట చేయవలసిన పని ఏమనగా, కొన్ని కార్యక్రమములను, అనుసరించవలసిన కొన్ని సూచనలను ఈ క్రింది విధంగా తెలియ పరచుచున్నాను.

1. వేరు వేరు రాష్ట్రాలకు సంబంధించిన బంజారా భాషాపండితులు, మరియు విజ్ఞులు సాహిత్య కారులు, ఒక చోట చేరి ఒక కార్యక్రమమును రూపొందించ వలయును. ఈ కార్య నిర్వహకులలో బంజారా లిపి మధ్యమం గూర్చి వివరంగా చర్చించవలసి ఉన్నది. మరియు ఒక కార్యక్రమమును, రూపొందించి దానిని మానవ వనరుల కేంద్ర (భారత) శాఖవారికి లేక యు.జి.సి. సంస్థకు అప్పగించవలయును.

2. పై తెల్పబడిన కార్యక్రమమునకు కోట్లాది రూపాయలు ఖర్చు అగును. పై తెల్పిన యోజన మంజూరైనచో బంజారా భాషకు నిఘంటువు, లిపి వ్యవస్థ గురించి పుస్తకములు ముద్రించి ప్రచారం గావించవలయును.

3. బంజారా భాషకు సంబంధించిన వ్యాకరణమును, గ్రంథములను మరియు కావలసిన పుస్తకములను ముద్రించి ప్రజలలోకి తీసుకొని రావలయును.

4. పై కార్యక్రమముల గూర్చి, వేరు వేరు ప్రదేశములలో అనగా రాష్ట్రస్థాయిలో విద్యాభివృద్ధికిగాను ప్రభుత్వ సహకారముతో బంజారా భాషలో ప్రచారం గావించవలయును.

5. ముఖ్యమైన బంజారా కార్యకర్తలు అందరు కలసి బంజారా భాషలో విద్య అభివృద్ధికిగాను ప్రభుత్వంపై ఒత్తడి తీసుకొనిరావలయును.

6. బంజారా భాష అభివృద్ధికిగాను ఒక సంఘమును స్థాపించుట కొరకు కేంద్ర ప్రభుత్వము మరియు రాష్ట్ర ప్రభుత్వంతో సంప్రదింపులు జరుపవలెను.

7. దేశములో ఇప్పటికి బంజారా భాష, సంస్కృతి, సాహిత్యము, కళ మొదలగు విషయముల గురించి, ఎనిమిది లేక పది మంది డాక్టరేకు పొందిన బంజారా భాషా విద్వాంసులను ఈ కార్యక్రమము చేపట్టునట్లుగా చూడవలయును. ఈ విద్వాంసుల సహకారంతో ఎక్కువ లాభమును పొందవచ్చును ( భాషా పండితులు).

8. బంజారా భాషలో బంజారాలను చైతన్య పరచ గల చిత్రాలను నిర్మించి, దాని మాధ్యమం ద్వారా ప్రచారం గావించవలయును. బంజారా భాషరాని వారికి బంజారా సీరియల్స్ ఇతర భాషలవారికి కూడ అర్థం అగునట్లు చూడవలయును. బంజారా సమాజంలోని చిత్ర నిర్మాతలు, దర్శకులు, కథా రచయితలు ముందుకు రావలయును.

9. బంజారాలకంటే ఎన్నో రెట్లు తక్కువ జన సంఖ్యగల కొంకణి భాషను గుర్తించి, మొన్న మొన్ననే పార్లమెంటులో ఆమోద ముద్రను పొంది కొంకణి భాషాభివృద్ధికై ప్రభుత్వం పూనుకొంది. ఇప్పుడు కొంకణి భాష ఒక భారతీయ భాషగా అభివృద్ధి చెందుచున్నది. దాని గుర్తింపునకు వారు పడిన శ్రమ, పోరాటం, రాజకీయ బలంను ఉపయోగించటం జరిగినది.

10. బంజారాలు అఖిల భారత స్థాయిలోను, రాష్ట్రస్థాయిలోను సమ్మేళనములను జరిపి, భాషా, సాహిత్యం, సంస్కృతి మరియు కళలను గూర్చి చర్చించివలయును. ఇంతకు మునుపు జరిగిన సమ్మేళనములు కేవలం రాజకీయ లబ్ధి పొందుటకు జరిపిన సమ్మేళనములు మాత్రమే.

బంజారా జాతి అభివృద్ధికి మరియు వారి బాగోగులు గురించి, అహర్నిశలు శ్రమించువారు ఏకమై పై కార్యక్రమములను చేపట్టిన మాత్రమే, బంజారా భాష అభివృద్ధికి చెందుతుంది తప్పా, రాజకీయ సౌలభ్యం పొందుటకు చేసే కార్యక్రమము వలన అభివృద్ధి చెందదు. కావున భాషాభివృద్ధికై కలసికట్టుగా పనిచేయవలసి ఉన్నది.

# బంజారా లిపి



## బంజారాకేసరి(కన్నడ) ఎడిటర్ సి. యస్. కళ్యాణనాయక్‌గారి సంపాదకీయం

17 డిసెంబరు 1993 సంచిక – 2 సంపుటి 2లో ''బంజారా భాష లిపి'' గూర్చి ఒక ఆలోచన. పేరు పొందిన సమాజసేవకులు, లేఖకులు మరియు ఆలోచనాపరులైన ఆంధ్రప్రేదశ్, అనంతపురం నివాసులైన శ్రీ. బి.చీనియా నాయక్‌వారి గొప్పరచన–

'' బంజారాల ప్రాముఖ్యత – మరియు వారి ''లిపి''ని గురించి ఆలోచన'' బంజారా కేసరి సెప్టెంబరు 10వ తేది 93 సం. సంచికలో ప్రకటించబడినది. దేశంలో ప్రచారం కావించబడిన వారి లేఖనం నిజానికి బంజారా జాతి చరిత్ర, సంస్కృతి, భాషాభీమానము, లిపి మరియు వాటి యొక్క ప్రాముఖ్యత, గొప్పదనము బంజారా ప్రజలగూర్చి వారికి ఉన్న అభిరుచి అందరిని ఎత్తి చూపించగలిగినది.

బంజారా భాషాభివృద్ధిగూర్చివారు ప్రస్తావించిన విషయములు. ఈ దేశములోగల సుమారు 5నుండి 6కోట్ల జనాభా కలిగిన ఈ బంజారా జాతీయులు ఒక బృహత్తరమైన భాషారాష్ట్రమునకు సరిసామానమైన జనసంఖ్యను కలిగి ఉన్నారు. ఈ బంజారా జాతీయులు ఈ దేశము యొక్క మొత్తం జనసంఖ్యలో సుమారు 1/16వ వంతు. ఇప్పటికి ప్రభుత్వం ఈ బంజారా జాతీయల అభివృద్ధి కొరకు ఎంత ఖర్చుచేసినది, అని అడుగుట ఒక యాదార్థమైన విషయం. ఇదే ప్రకారము డా. పి. కె. ఖండోబా, 15 ఆక్టోబరు 93న తన వ్యాసము ద్వారా బంజారాలకు తెలియపరచినట్లు, బంజారాల జనసంఖ్యకంటే కూడా చాలాతక్కువ జనసంఖ్యగల కొంకణి భాషను, ఈ మధ్యనే పార్లమెంటు నందు గుర్తింపు ముద్రపడి అమలలోకి వచ్చినది. దీని కొరకువారి శ్రమ పోరాటం, మరియు రాజకీయ వేత్తలు, ఈ కార్యక్రమమును సాధించి, కొంకణి ప్రజల మెప్పు పొందినారు. ఈ విధంగానే బంజారా జాతీయ రాజకీయ నాయకులు కార్యనిమజ్ఞులు కావలసి ఉన్నది.

ఇలాంటి మార్గదర్శమును తీసుకొని బంజారా జాతీయులు అతి ముఖ్యమైన కోరికను, సందర్భమును బట్టి మాట్లాడటం, ఉట్టి, ఉట్టి మాటలతో ప్రజలను మభ్యపెట్టుట వలన సాధ్యంకాదు. శ్రీ బి. చీనియానాయక్‌గారు విశ్లేషించిన భాష మరియు లిపి గురించి, తెల్పినకొన్ని కార్యానుకూలమైన పనులను కార్య రూపమును దాల్చుటకు, తీవ్రమైన కృషి చేయవలసిఉన్నది. వారు అన్నట్లు బంజారా భాష, హిందీ భాషకు చాలా దగ్గర సంబంధము కల్గి ఉండుట వలన మరియు ఉత్తరాది భాషలన్నిటికి సంబంధము ఉండుట వలన దేవనాగరి

లిపినే ఈ భాషకు లిపిగా ఎన్నుకొనుటయే, సమంజసముగా ఉన్నది. అలాగే డాక్టరు ఖండోబా గారు కూడ వారి అభిప్రాయం వెలిబుచ్చినారు. బంజారాలకు ''లిపి'' అను కవచమును తొడిగించుటయే ధ్యేయము.

ఇది జరిగినవాడు బంజారా ప్రజలు అన్ని విధాల సర్వతోన్నతమైన అభివృద్ధిని సాధించగలరు. ఖండోబావారి పది కార్యాచరణ పనులు, బంజారా భాషాభివృద్ధికి వజ్ర కవచములాంటివి. అలాంటి భద్రమైన పునాదిపైన దివ్యమైన భవంతిలాంటి భాషా లిపిని రూపొందించి, దాని ద్వారా బంజారా 'లిపి' కి వ్యాకరణ గ్రంథములు బాల శిక్షణ పుస్తకములు మొదలైన వాటిని ప్రచురించవలయును.

భాతరదేశము మరియు దాని చుట్టు ఉన్న ప్రదేశాలు బంజారాలు, తమ మత ప్రాంతీయ భాషలు ఉన్నను, తమ బంజారా భాషలోనే మాట్లాడుకొంటున్నారు. ఈ భాషకు తనదైన ఒక లిపి లేనందువలన, ఒకరి భావాన్ని మరి వొకరు పంచుకొనుటకు సాధ్యం కాకుండా, వ్రాయుటకు ప్రాంతీయ భాషలను వాడుచున్నారు. ఇందు వలన బంజారాల ఐక్యతకు భంగం కలుగుచున్నది. సాహిత్యమునకు, సంస్కృతికి గొడ్డలి పెట్టుగా ఉన్నది. ఇవి అన్నియు సరిదిద్దుటకు మొట్టమొదట ఈ భాషకు తనదైన ఒక ''లిపి'' చాలా అవసరము. ఈ సదుద్దేశమును సాధించుటకు బంజారా పెద్దలు, విద్యావంతులు, పరిశోధకులు, అందరు కలసి చర్చించి ఈ కార్యమును సాధించుటకు తమ హక్కును ప్రభుత్వదృష్టికి తెచ్చి సాధించించవలసిన అవసరం ఎంతైన ఉన్నది.

# బంజారా భాషా లిపి


ప్రొఫెసర్: ఠాకూర్‌నాయక్,

ఎం.బి.బి.యస్., పిహెచ్.డి.,

దావణగేరి, కర్ణాటక




బంజారా కేసరి 28వ సంచికలో (10-9-93) ప్రకటించిన శ్రీయుతులు. బి. చీనియానాయక్ 'బంజారాల ప్రాముఖ్యతను మరియు లిపి గురించి లేఖనము, 32వ సంచికలో 15-10-93లో ప్రకటించిన డా. పి. కె. ఖండోబావారి బంజారా భాష లిపి సాధ్య పడును అను రచనను చదివిన తరువాత నాకూ కొన్ని అభిప్రాయలు తోచినందు వలన నా అభిప్రాయములను కూడ మన సమాజము ముందు ఉంచువలయునన్న అభిప్రాయము కలిగినది. పై కనపరచిన రెండు లేఖలు బంజారా సమాజమునకు మరియు లిపి గురించి ఆలోచించ తగిన విషయముగా అభిప్రాయపడుచున్నాను. నా భాష జ్ఞానము అంత చెప్పెకోదగ్గనిది కానప్పటికిని, కొన్ని విషయములు తెలుప

దలచుకొన్నాను. నేను బంజారా కేసరిలో ప్రచురించిన కొన్ని రచనలలో పేర్కొనట్లు, సంస్కృతి, భాష, ఆచార వ్యవహారములు, కాలానికి సరిపోయినట్లు, మార్పురావలయునని నా యొక్క స్పష్టమైన విచారము, అభిప్రాయము. బంజారా సమాజముయొక్క భాషకు 'లిపి' లేదనుట సమంజసము కాదు అని నా అభిప్రాయము. డా. ఖండోబాగారు తెలియపరచినట్లే బంజారాల పుట్టు పూర్వోత్తరాలు ఉత్తర భారతదేశము నుండి, దేశము నలుమూలల వ్యాపించినది. బంజారా భాష రాజస్థాని యొక్క ఉపభాష, వాస్తవముగా బంజారా భాష ఉత్తరాది భాషలకు చాలా దగ్గర సంబంధము ఉన్నదని స్పష్టమగుచున్నది. ఈ విషయమును బంజారా సమాజమంతయు ఒప్పుకుంటుందని భావించుచున్నాను. అందువలన బంజారా సమాజము యొక్క విద్యావంతులు, రాజస్థాన్ భాషకు మూలమైన ఉపభాష గురించి తెలుసుకొనుట చాలా అవసరము. దీనిని నేర్చుకొన్న వ్యవహారములు చాలా సులభముగను మరియు భారతదేశము యొక్క సమగ్రతను దృష్టిలోఉంచుకొని, డా. ఖండోబాగారు వ్రాసినట్లు ఉత్తరాది భాషలన్నియు ఒకే లిపికి సంబంధము కలిగి ఉన్నవి. కావున ఉత్తారాది భాషలన్నింటికి దేవనాగరి 'లిపి'యే మూలమై ఉన్నదను విషయం సత్యము. ముందు ముందుగావారు రచించినట్లే, బంజారా భాష ఉత్తరాది భాషలకు దగ్గర సంబంధము ఉన్నందు వలన నిస్సందేహముగా దేవనాగరి లిపిని బంజారా భాషకు లిపిగా వాడు కొనవలయునని సూచించినారు. ఈయన అభిప్రాయము కూడా, నా అభిప్రాయముతో సంపూర్ణమైనది. ఇది కూడ ఒక సమంజసమైన విచారము. బంజారా సమాజములో 14 మరియు 15 శతాబ్దమునుండి రాష్ట్ర సమగ్రత కాపాడుటకు కృషిచేసి ఉన్నారు. బంజారా సమాజము భారతదేశము నందలి అన్ని ప్రదేశములలో వ్యాపించి ఉన్నారు. బంజారాల నడవడికలు, ఆచార విచారములు ఒకే విధంగా ఉన్నాయి మరియు దేవనాగరి లిపితో రాష్ట్ర భాష అయిన హింది కూడ వ్యాపించియుండుట వలన బంజారా భాషను, దేవనాగరి లిపితో జతపరచిన, పరోక్షంగా రాష్ట్రభాషను ప్రోత్సహించినట్లుగును. అంతేకాక బంజారా భాషకు ప్రత్యేకమైన లిపి గురించి బాధపడవలసి అవసరమేలేదు.

డా. కె. ఖండోబాగారు మరియు శ్రీ బి. చీనియానాయక్‌గారు బంజారా భాష అభివృద్ధి కొరకు అనేకమైన సూచనలు వెల్లడించినారు. దాని వెనుక బంజారా సమాజమువారు, అఖిల భారత బంజారా సేవా సంఘమువారు, ప్రభుత్వ పదాధికారులు, కార్యకర్తలు, ముందుకు రావలసిన అవసరం ఎంతైన ఉన్నది. కర్ణాటక రాష్ట్ర బంజారా సేవా సంఘ కార్యకర్తలు ఎక్కువ శ్రమపడవలసి ఉన్నది. కర్ణాటకలో అన్ని భాషలు తెలసిన పండితులు కలరు. మాన్య మంత్రిగారైన డా. హెగ్గప్ప లమాణిగారు హిందీభాషలో పిహెచ్.డి. పొంది ఉన్నారు. లంబాణిల ఆచార వ్యవహారములు, విచారాలు, నడవడిక, మరియు భాషను శ్రద్ధతో అభ్యసించినారు. మరియు అనేక మంది పెద్దలు ఇతర విషయములలో పిహెచ్.డి. పొంది ఉన్నారు. అందువలన డా. హెగ్గప్ప లమాణిగారి అధ్యక్షతన, డాక్టరు ఖండోబా మరియు ఇతర అనుభవగ్నులైన పెద్దలు ఒక సంఘమును ఏర్పాటు చేసి, బంజారా భాష అభివృద్ధికి సమంజసమైన కార్యకలాపములను రూపొందించి బంజారా భాషకు ఒక స్పష్టమైన రూపమును సమకూర్చవలసినదిగా ఆశించుచున్నాను.

బంజారా కేసరి – బెంగళూరు

# అనంతీ జాబాసింగ్‌గారి

# భారతి లిపికై బంజారాలకు వినంతి

అఖిలభారత బంజారా విద్యావంతులకు, రాజకీయ చతురులకు, తెలియచేయునది ఏమనగా ఈ నవీన ప్రపంచంలోని అన్ని దేశాలు, అన్ని జాతులవారు అంతులేని అభివృద్ధిని సాధించి ఒకిరి మీద ఒకరు పోటి పడి అభివృద్ధి చెందుచున్నారు.

కాని బంజారాలు, ఎక్కడ ఉన్నవారు అక్కడే ఉండి పోయినారు. దేశంలోని బంజారాల జన సంఖ్యను బట్టి చూచిన అభివృద్ధి చెందినవారు చాటడు బియ్యంలోని కంకర రాళ్ళుగానో, మట్టి పెల్లలుగానో కనుపించుచున్నారు. అయితే ఈ కంకరరాళ్లు బియ్యం గింజలకన్న చాలా కఠినమైనవి పంటిక్రింద పడితే పళ్ళు కూడ ఊడిపోయే అంతశక్తి ఉన్నది. కాని, ఆ కంకర రాళ్ళను అన్నం వండుకొనే టప్పుడు ఎలా ఏరిపారేస్తున్నారో అట్లు బంజారాలను కూడ ఏరి పారవేస్తున్నారు.

అభివృద్ధి చెందిన కులాలు, జాతులు, మరీ పోటీపడి ముందుకు సాగిపోతుంటే అభివృద్ధి చెందని బంజారాలు, మరీ వెనుకబడిపోవుచున్నారు. దీనికంతటికి కారణం విద్య, విద్య అనేది మాతృభాషనుండి నేర్పించవలసి ఉన్నది. కాని బంజారాలకు మాతృభాష ఒకటి ఉంటే, విద్య నేర్చుకొనే భాష వేరొకటి ఉన్నది. అందువలన కావలసినంత అభివృద్ధి చెందలేక పోవుచున్నారు.

బంజారా భాష దేశం మొత్తంలో మాట్లాడగలగుచున్నారు కాని ఆ భాషకు లిపి లేక పోవటంవలన భాష వచ్చి కూడ దూరప్రాంతంలోఉన్న బంజారాలతో ఒకరి మనుసులు మరియొకరితో కలుపలేక పోవుచున్నారు.

బంజారా భాష దేశం మొత్తంలో అమలుపరచుటకు వీలుకలుగుతుందా అని అనుమానం రావచ్చును. తప్పకుండా అమలు పరచవచ్చును. ప్రతి బంజారా తాండా గ్రామమునకు దూరంగా ఉండి, 6-14 సం. వరకు వయసున్న బడికి పోవు పిల్లలు 50నుండి 100 మందికి పైగానే ప్రతి తాండాలోను ఉన్నారు. కొన్ని తాండాలోనైతే 2వందల మందికి పైనే ఉన్నారు. విద్యావంతులైన బంజారా నిరుద్యోగులను టీచర్ ట్రయినింగ్ ఇప్పించి, ప్రాంతీయ భాషతో పాటు, బంజారా భాషను కూడ నేర్పించవచ్చును.

అనంతపురం జిల్లా ఉన్నది. ఇందులో మొత్తం 500 తాండాలున్నవి, చిన్న పెద్ద సగటున 100మంది పిల్లలు చొప్పున తీసుకొంటే 500X100=50,000మంది, చదువుకొనే పిల్లలు ఉన్నారు. అలాగే మొత్తం రాష్ట్రములో 25 జిల్లాలు, అందులో తూర్పు ప్రాంత జిల్లాలలో కొంత తక్కువ ఉన్నా సగటున 20 జిల్లాలలో మొత్తం 50,000X20=10,00,000 మంది బంజారా పిల్లలు చదువుకొను ప్రాయంలో ఉన్నారు.

బంజారా పిల్లలకు మాతృభాష బోధనతోపాటు, బంజారా విద్యావంతులైన నిరుద్యోగులకు ఉపాధ్యాయ ఉద్యోగం లభిస్తుంది. అనగా, సగటున ప్రతి జిల్లాకు 500 నుండి 600మంది ఉపాధ్యాయులు 500X20 = 10,000 సుమారు దేశం మొత్తంలో 1లక్ష మందికి

# TELUGU TO BARATI TRANSFORMATION MODEL

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అ ా | ఆ ా | క ఖ | గ ఘ | జ్ఞ | హ | | య |
| ఇ ి | ఈ ీ | చ ఛ | జ | ఞ | న | శ ష | |
| ఉ ు | ఊ ూ | ట ఠ | డ ఢ | ణ | ం | ఋ ౠ | |
| ఎ ె | ఏ | త థ | ద ధ | ర | ల | ళ | |
| ఒ ొ | ఓ ో | ప ఫ | బ భ | మ | వ | క్ష | |

v

బంజారా భాషలో వర్ణమాల

## वयायाम - कास्रात

वयायाम जीवनना धाट काराचा. दाठी चOकाखनमा जान तθठसनक वयायाम कारखU. तामार नाकनतीज वाख लनखU. मUखठनती कθनी. काना वातθयी सामθर बनसाखU. वाज्ञचा जाना लाका जाना नावान बनसनर चननी. सामθर हUबरनन सामθर चालाखU

## रामती (कनल)

रामती कातO नक चाखा. ापाख सनना रामती रामनरO धाख कातार राचा. ापाख बार चOकाखनमा रामलनखO. रामनर वनजायनर पाचा ापखनना बUक लाधारी जU राचा. ापखनना नीनद सादा ावाचा.

| पांरबातती | |
|---|---|
| 1. | धान. 25-27 |
| 2. | धान. 28-30 |
| 3. | धान. 31-33 |
| 4. | धान. 34-36 |
| 5. | दाराम. 1-2 |
| 6. | दाराम. 3-4 |
| 7. | दाराम. 5-7 |
| 8. | दाराम. 8-10 |
| 9. | दाराम. 11-13 |
| 10. | दाराम. 14-16 |
| 11. | दाराम. 17-19 |
| 12. | दाराम. 20-22 |
| 13. | दाराम. 23-25 |
| 14. | दाराम. 26-27 |
| 15. | दाराम. 28-29 |
| 16. | दाराम. 30-31 |
| 17. | दाराम. 32-34 |
| 18. | यरहेब. 1-3 |
| 19. | यरहेब. 4-6 |
| 20. | यरहेब. 7-9 |
| 21. | यरहेब. 10-12 |
| 22. | यरहेब. 13-15 |
| 23. | यरहेब. 16-18 |
| 24. | यरहेब. 19-21 |
| 25. | यरहेब. 22-24 |
| 26. | नाय. 1-3 |
| 27. | नाय. 4-6 |
| 28. | नाय. 7-8 |
| 29. | नाय. 9-10 |
| 30. | नाय. 11-12 |
| 31. | नाय 13-15 |

| साजंज | |
|---|---|
| 1 | मार. 8.1-21 |
| 2. | मार. 8:22-38. |
| 3. | मार. 9:1-29 |
| 4. | मार. 9:30-50 |
| 5. | मार. 10:1-30 |
| 6. | मार. 10:31-52 |
| 7. | मार. 11:1-18 |
| 8. | मार. 11:19-33 |
| 9. | मार. 12:1-27 |
| 10. | मार. 12:28-44 |
| 11. | मार. 13:1-20 |
| 12. | मार. 13:21-37 |
| 13. | मार. 14:1-26 |
| 14. | मार. 14:27-52 |
| 15. | मार. 14:53-72 |
| 16. | मार. 15:1-25 |
| 17. | मार. 15:26-47 |
| 18. | मार. 16 |
| 19. | लूक. 1:1-23 |
| 20. | लूक. 1:24-38 |
| 21. | लूक. 1:39-56 |
| 22. | लूक. 1:57-80 |
| 23. | लूक 2:1-24 |
| 24. | लूक. 2:25-52 |
| 25. | लूक. 3 |
| 26. | लूक. 4:1-31 |
| 27. | लूक. 4:32-44 |
| 28. | लूक. 5:1-16 |
| 29. | लूक. 5:17-39 |
| 30. | लूक. 6:1-26 |
| 31. | लूक. 6:27-49 |

# मारच

| दीतवार | सोमवार | माडधानवार | बुदवार | बारास्पात | साकरावार | तावार |
|---|---|---|---|---|---|---|
| **30** यरहेवा तु माना गचेब कार. मा गचेब उजचु. यार. 17:14 | **31** सवागडर वासु ताम हायाकार मात. मात. 6:34 | | | | | **1** तामार हाया सु भ उमपार नाक दू. 1 पत. 5:7 |
| **2** पुरुदालती यरहेवाना दावनु. 1सामु.12:20 | **3** शास्वात परमती तेना परमकार रुचु. यार. 31:3 | **4** तार कामडर नेजा यरहेवा उमपार मडल. नीती. 16:3 | **5** तामार दाल धानरायरव मात. दववद पार वास्वास कारब. यशया. 14:1 | **6** दव मापार मडर कारान माना चावानु जाकु सद दाना चा. गदा. 33:11 | **7** मार नायातडर जामान हातती तेना सामानउजचु. यशा. 41:10 | **8** बावडती काम लून, परारतान मा वास्वास राकाठनु. रोम. 12:12 |
| **9** सवात दाठना पावतारती राकाठनु. नीर. 20:8 | **10** दव वाजानब वदन चा. 1 यहेना. 1:5 | **11** नायातडर सुराज नीकलाचा, भर पाहकती चाहधा वाचा. माला. 5:44 | **12** मार, परावुर ताकात धान मउटवन चा: धान. 14:17 | **13** परावु यरसु कराससु तीज उ गपनना जात दानु. 1कर. 15:59 | **14** मा तामार वाचा गन वासउजचु. जाक. 2:10 | **15** वालाया कारडवानु दवडर ठायाती गरबचा. 3 यहेना.1:11 |
| **16** यरहेवा मार गराज मानलावु. धाद 6:9 | **17** तेना वाहधायनी जाकब कायी चनी. यार. 32: 17 | **18** सद वाकतद मा दवद पार नारबसा राकाठ. धाद. 62:8 | **19** हामार वास्वास जादा कार लूक. 17:5 | **20** तेना धान मबट जानडर जात (मानाव) कारउजचु. नीर. 32:10 | **21** यरहेवा गपान वासु धान मबट काम कादबचा धाद 126:3 | **22** मा द जाधना वाजानु वदन चु. यहेना. 8:12 |
| **23** तार दवानडना चाबद.वाला या ती हाम दापान चा धाद 654 | **24** सामादान कारद वान नासवदार. ब दवडर बडटी-कन कडावाचा. मात. 5:9 | **25** कउसती दवानडना दव परम काराचा. 2 कर. 9:7 | **26** तार पास्वा चउ जाकु माना वासडकडर दाल दा. 1 राज. 3:9 | **27** ताकातद ती हाममातती रदनु दार. 31:6 | **28** बापु, तेना सधनी कार सकडर ताकात चा. मार. 14:36 | **29** तामना दा हासद वालाया कारउजचु. जाक. 9:12 |

బంజారా భాషలో క్యాలెండరు.

ఉపాధ్యాయ ఉద్యోగములు లభించే అవకాశము ఉన్నది. ఈ విధంగా ప్రతి రాష్ట్రములోని బంజారా పిల్లలకు, విద్యతో పాటు ఉద్యోగము లభిస్తుంది. మరియు బంజారా భాష దేశం మొత్తంలో వ్యాప్తిచెంది, జాతీయ సమైఖ్యతకు ఉపకరిస్తుంది.

ఉదా : క్రీ.శ. 74 సంవత్సరంలో విడిపోయిన యూదులు 1900 సంవత్సరముల తరువాత 1948లో ఇజ్రయిలు రాజ్యమును స్థాపించుకొన్నారు. 70 దేశాల నుంచి వచ్చిన 20లక్షల మంది యూదులు 30 భాషలు మాట్లాడుతారు. అయిన వారందరి మాతృభాష అయిన హిబ్రు భాషను నేర్చుకొన్నారు. ఇజ్రాయిల్ అధికార భాష హిబ్రు. ఇది యూదులందరిని సంఘటిత పరచింది.

ఇదే విధంగా బంజారాలు కూడా, మొత్తం భారతదేశములో కన్యాకుమారి నుండి కాశ్మీరమువరకు, బంగాళ ఖాతం నుండి అరేబియా సముద్రం వరకు వ్యాపించి ఉన్న భారతంలో, బంజారాలు భారతదేశంలోని భాషలన్నింటిని నేర్చుకొని ఉన్నారు. అయినను బంజారా భాషను మాత్రం వదలి పెట్టలేదు. ఇదే బంజారాలకు దేవుడు ఇచ్చిన వరంగా భావించవలయును. దేశ జనాభాలో 1/15వంతుయున్న బంజారాలు, భాషా రాష్ట్రమునకు గల అన్ని అర్హతలను కలిగి ఉన్నది. బంజారాలంతా ఒక చోట లేక పోయినంత మాత్రమున బంజారా భాష అభివృద్ధి చేయుటలో ఆటంకం ఏమున్నది. మాతృభాషలో ఉన్న విద్యయే విద్య తప్ప ఇతర భాషలద్వారా వచ్చిన విద్య ఎంత ఉన్న ఏమి ప్రయోజనము? అది వ్యవహార భాషగా మాత్రమే ఉపయోగపడుతుంది.

బంజారాల అభివృద్ధి అంతా మాతృభాషలోనే ఇమిడి ఉంది. జ్ఞాన బోధన తరువాతనే భుక్తి బోధన, జ్ఞాన బోధన లేనిదే భుక్తి బోధన ఉపయోగపడదు. మాతృభాషలోనే సరిగా మాటలురాని పసిపిల్లలకు పరభాషలో బోధించిన వారి జ్ఞానం అభివృద్ధి చెందుతుందా?

స్వాతంత్ర్యంవచ్చి 50సం. గడచిపోయినను, బంజారాల భాష గూర్చి ప్రభుత్వం శ్రద్ధవహించలేదు. కొంతవరకు చదువుకొని, ప్రభుత్వంలో పనిచేయుచున్న బంజారా విద్యావంతులు కాని, రాజకీయనాయకులు కాని, బంజారా భాషాభివృద్ధి గూర్చి చర్చించడంలేదు. ప్రభుత్వం దృష్టికి తేనూలేదు. ఇక వీరి అభివృద్ధి ఎప్పుడు జరుగుతుంది. అఖిల భారత బంజారా సేవా సంఘము తరపున బంజారాలకు, భారతం మొత్తంలో గిరిజనులుగా చేర్చవలయునని ఒక రిపోర్టు మాత్రం, శ్రీ వి. పి. నాయక్‌గారి శ్రద్ధతో సమర్పించగలినారు. కాని అందులో బంజారాల భాషాభివృద్ధి గురించి ఒక్క మాటనైన మాట్లాడలేదు. ఒక వేళ కేంద్ర ప్రభుత్వం వీరిని గిరిజనులుగా భావించినను, ఇప్పుడు కేంద్ర ప్రభుత్వంవారు గిరిజనులకు కెటాయించిన 7-1/2% రిజర్వేషన్ మాత్రమే లభిస్తుంది. బంజారాలు దేశ జనభాలో 6నుండి 7% జనసంఖ్య కలిగి ఉన్నారు. అనగా వీరు 6నుండి 7% అధికారమును కలిగి ఉన్నారు. వీరిని గిరిజనులుగా గుర్తించిన వీరికి లభించేది అందరితో పాటు 1లేక 2%లాభం మాత్రమే. కావున బంజారాలు వెంటనే ఈ సత్యమును గ్రహించగలిగిన, ఇప్పటివరకు జరిగిన నష్టమును త్వరగా భర్తి చేయవచ్చును.

అసలు బంజారాలు గిరిజనులు కారు. వారు ఇతర భాషా రాష్ట్ర ప్రజల మాదిరిగానే ఉన్నారు. కాని ఒక్కచోట లేరు. భారత దేశమంతటా విస్తరించి ఉన్నారు. వారికంటూ ఒక

ప్రత్యేకమైన తాండాలను ఏర్పాటు చేసుకొని, వారి చుట్టుపట్ల కొంత భూవసతిని కూడ కలిగి ఉన్నారు. అన్ని కులస్థులలాగా, గ్రామములలో కలిసిపోయి ఉండలేదు. కావున వీరి ప్రత్యేకత వీరికి ఉన్నది. అందువలన వీరికి కూడ భాషారాష్ట్రములకుగాను, భాషాభివృద్ధికి ఎటువంటి అవకాశములు ఉన్నవో వీరికి కూడ భారత ప్రభుత్వంవారు కల్పించవలయును. ఈ విషయము గూర్చి ముందుగా చర్చించడం జరిగినది.

భారత ప్రభుత్వంవారు 9వ పంచవర్ష ప్రణాళికలో 40, 000కోట్లు రూ. నిరక్షరాస్యత నిర్మూలనకు ఖర్చు చేస్తారని మానవ వనరుల శాఖ కేంద్రమంత్రి ప్రకటించివున్నారు. అందులో బంజారాల జనభాను బట్టి 1/15వ వంతు అనగా 40,000X1/15=2666 కోట్ల రూ. వీరి అభివృద్ధికి కేటాయించవలయును. ఈవిధంగా ప్రత్యేకమైన శ్రద్ధను భారత ప్రభుత్వం చేపట్టకపోయిన, ఈ దేశంలో బంజారాలు ఉండికూడ లేనట్లుగా భావించవలసి వస్తున్నది. బంజారా విద్యావంతులు కాని, బంజారా రాజకీయ నాయకులు కాని ఉండి కూడ లేనట్లుగానే భావించవలయును.

కావున భారత ప్రభుత్వం వెంటనే తగిన చర్య తీసుకొనునట్లుగా బంజారా విద్యావంతులు, బంజారా రాజకీయ నాయకులు శ్రద్ధ వహించవలయును. అలా శ్రద్ధ వహించని యెడలవారు బంజారా జాతిలో జన్మించలేదని భావించవలయును. ఏ మాత్రం జాతి అభిమానమున్న వారు వెంటనే బంజారాలను జాగృతి పరచి, ప్రభుత్వముతో వారి హక్కుకై పోరాడవలసి ఉండను. బంజారాల పేరుతో రాజకీయ లాభమును పొందుతున్నవారు, వారి రిజర్వేషన్ల పేరుతో ఉద్యోగాలు సంపాదించుకొన్నవారు, బంజారా జాతిగా పరిగణించబడరు. ప్రపంచంలో ఎంతో అభివృద్ధిని సాధించి ముందుకు పోవుచున్న తోటి మానవులను చూచి అయిన, మనం కూడ ముందుకు సాగవలయునను ఆకాంక్షతో తెలియ చెప్పడం జరిగినది.

ఈ కార్యక్రమమును చేపట్టటకు, నాయకత్వం వహించుటకు కూడ సిద్ధమేనని తెలియపరచుచున్నాను ఉదా : A script for Trible languages for the promotion of literacy by Ananthi Jebasinghగారు, బంజారా భారతి అనే లిపిని, బంజారా భాషకు తగ్గట్టుగా తయారుచేసి, 1నుండి 25పుస్తకములను ప్రింటింగ్ చేసి ప్రచారం గావించుచున్నారు.

1. Ananthi Jebasingh, she says the tribal people have been the victims of civilization, forming a forth world within the third world. Mass education introduced in major regional languages to centuries ago has pushed them aside and denied them the opportunity of having education in mother tongue as their language remained unwritten.

2. The tribal communities who are still to be provided with education in their mother-tongue. Using the common Bharathi Script that has the capacity to tide over any psychological barrier that may rise, is certain to bring a change in writing in India. Once it is introduced in the primary

educational institution in tribal area its advantages will become evident which will induce other major languages to use the simple technologically advanced coding system such a development will put the tribal communities a step a head in the use of their languages and evolve new methodology for the integration of the peoples of India.

3. The script that has proposed not only fits the Indian script scheme. But also represents matriculation examination of phonetic details. The Bharathi Script has the additional weight of using universal symbols which are easy to grasp simple enough to manipulate and representationally adequate. The script developed by Mrs. Jebasingh is basically for Kurukh language but it can be easily adopted for any other languages (in fact her whole thesis that it should be so adopted) and lend itself admirably to the requirements of type writing type setting and printing. It is a simple uncomplicated easily manipulable system that she has worked out.

4. It would like to acknowledge gratefully the practical guidelines given by S.Rangarajan the Additional General Manager of the computer section of Bharat Electronics Ltd. Sincerely acknowledge Helmut Menzel, an acoustic engineer and S.Nirmala Mary, Professor of Physics, for their efforts to explain to the wave propagation of sound. Thanks Prof. Mary Silvaimuthu for her guidance in understanding the Tamil linguistic tradition. Thanks Elenzar Samuel who collected books published in Chota Nagapur on tribal languages and helped in educating a socio linguistic survey, thanks Ahimas, Divakaran, Simon, Buiyan and others who discussed with the problems of script in their respective languages areas and provided samples of the scripts being used. I would like to express and gratitude to Dr. Frances Ekka of Central Institute of Indian Languages who read carefully through my first draft and made valuable suggestions.

5. Prakash Chiraparampil and Mahavir Singh rendered extraordinary help in sending the manuscript through to his computer print out. (I sincerely thank Amar Prakasham for gracefully taking up the responsibility of publishing such a inspite of the difficulties involved in it.)

6. This invention, cannot be a chance accident but a careful and conscious development in an effort to fix sound or sound

complex to store and transmit the already acquired knowledge. Hence it cannot be the inability or otherwise of the people who shield away from aggressive areas that they are not exposed to storing of knowledge in the form of writing.

7. To stall any unhealthy development among the tribal people and uplift the socio economic conditions of the rural poor, the government has formulated many new programmes even the process of organisation of the rural poor has been promoted officially by various agencies of the labour, Human Resources and Development Ministries and is supported by other bodies. In some regions of Bihar, organisation of the harijans and other tribals has been sought to be done through mass bodies.

8. A massive afforestation has been launched in the nine tribal districts of Bihar under a Rs. 54 crore International Social Forestry Project..

   The problems of the tribal population cannot be treated in a superficially sympathitically symptomic way. They should be viewed in the present context of the socio-economic, cultural and educational systems prevailing in India. Many tribal populations have been subjected in human conditions by the colossal forces of the exploiting competive, profit oriented sections of the society. Their fundamental problems are not their made of living, their habits, customs or culture, It is basically, lack of basic education through which access modern ways of living and thanking are obtained. How else can they attain a different social order with equality of opportunities and elimination of exploitation? The acquisition of education will enable them to decide on own what they should retain eliminate or exploitation cannot be eliminated from outside. It has to come from the self. Ignorance leads to subjugation and subjugation leads to exploitation. Ignorance driven away, with basic and higher education. They are sure to come up in society.

9. In 1835 the government policy decided by changed from communication for the masses to giving higher education to the select few. Serampore group voiced fear that vernacular education would be neglected. Marshamna in friend of India pleaded for "Education for the people in the language of the people" Laired 1972-232. James will at east India house in London warned; put you on your grand against a disposition - to underrate the importance of that they be

done to spread useful ledge among the natives through the medium of their own languages. John stuarts mill condemned the resolution saying. "The mental cultivation of a people can we take place through the medium of a foreign language". But their voice were a cry in wilderness. The government undoubtedly considered the then utilitarian values. That for Indian to be appointed as teacher translators or clerical staff a knowledge of English would be essential and so it refused to act on William Adam's plan to improve the indigenous schools.

10. The tribal society contained to be pre-literature and did not develop a script of its own. The wisdom of the elders, The theologies and philosophy of the people, their interpretation of the joys and sufferings of life were all handed down by word of month-through story telling riddles, songs and dances. This was done through indigenous institutions the Jonkh-Erpa in the case of oraon boys, better known under the Hindi name Dhum-Kuria and Pel-Erap for oraon maidens.

11. The Indus valley civilization had used a phonetic script which is considered the source of all India scripts.

    The Indian constitution, through articles 343-351 deals with the language situation in India. Articles 29,30 and 347 are devised to safeguard the interest of minority language groups Article 343 makes Hindi in Devanagiri Script as the official language of India. It stands on purely emphirical grounds, being spoken by 33 percent of the total population.

12. From time to time people exert pressure for the inclusion of their language in the VIII schedule of the constitution. In view of such legitimate demands, our government has amended some of the constitutional provisions. Thus the official languages Act 1967 came into existence. The twenty first Amendment 1967 added Sindhi to the list of offocoal languages. Konkani was recognised as one of the official languages of Goa under the official language Act passed in 1987.

***Important points noted from the Book Scripts for tribal languages, for the promotion of literacy written by Ananthi Jebasingh.***

# విద్యా - విజ్ఞానము

విద్య అనేది విజ్ఞానమును ప్రసాదించుతుంది. ఈ విజ్ఞానము ద్వారానే మానవుడు తన జీవిత కాలమును మలచుకొని ఈ భూమిమీద తను అనుభవించ వలసిన సుఖదుఃఖాలను పూర్తిచేసుకొని తన జీవితమును చాలించుతాడు. ఈ సత్యం కొద్దియో గొప్ప యో అందరికి తెలిసిన విషయమే.

అయితే జ్ఞానమనేది ఒక భాండాగారంలాంటిది. అందులో ఎంత జ్ఞానమునైన ఇమిడ్చుకొంటుంది. ఆ భాండాగారమే విద్య అంటారు. మన పెద్దలు, విద్య గురించి చాలా సూక్ష్మముగా వివరించిఉన్నారు. అదే

విద్య యొసంగు వినయంబు, వినయముననను,
బడియు పాత్రత పాత్రత, వలన ధనము.
ధనము వలనను ధర్మమంబు, దానివలన
అయిహిక, ముస్మికా సుఖంబులందు నరుడు.

అని నాల్గు పదములలో మొత్తం జీవితం గూర్చి తెల్పిఉన్నారు. విద్య, వినయమును సమకూర్చుతుంది, వినయంవలన మంచితనమును, సంపాదించవచ్చును. ఆ మంచితనముచేత, పెద్దలను ఆశ్రయించి, ధనమును సంపాదించవచ్చును. ఎప్పుడైతే ధనము సంపాదిస్తాడో తనకు కావలసిన సౌకర్యములను సమకూర్చుకొంటాడు. ఆ ధనమేతనకు ఎక్కువగా లభిస్తూఉన్న ధర్మ గుణం దానంగుణం చేకూరుతుంది. ఈ ధర్మగుణము, దాన గుణములువలన, తోటి మానవులకు సేవలు చేసి వారి ఆదరాభిమానములకు, పొగడ్తలకు, మనసుపొంగి, సుఖమును సౌఖ్యమును పొంది ఈ లోకంలో ఆనందించుతూ మరియు తను చేసిన పుణ్యకార్యముల వలన పరలోకములో (పుణ్యలోకములో) కూడ సౌఖ్యమును అనుభవిస్తాడు.

మానవుడు ఈ భూమి మీద సుఖ-దుఃఖాలే స్వర్గం-నరకాలుగా భావించ వలయును.

మానవ శరీరంలోని ప్రతి అంగం అనుభవించేదే స్వర్గం.

1) ప్రతి అంగం అనుభవించేదే నరకం. అనగా తన నాలుక చేసిన పుణ్యం ఏమిటి? రకరకాలైన పదార్థములను తిని ఆనందించుట. షడ్ రుచులు అంటారు. తన సంపాదన వలన లభించు ధనముతో తన నాలుక అన్ని రకాల రుచులను అస్వాదించుట. అదే పుణ్యం.

2) తన ముక్కు ద్వారా లభించు రకరకాల సువాసనలను అస్వాదించిన, అది తన ముక్కు చేసిన పుణ్యం.

2ఎ) తన చెవులు నయనానంద భరితమైన సంగీత వాయిద్యములను, వినుట, మంచి మంచి విజ్ఞానదాయకమైన భోదనలు విని ఆనందించుట, చెవి చేసిన పుణ్యం.

3) తన కన్నుల ద్వారా అహ్లాదకరమైన వాతావరణం, పూల తోటలు, మంచి మంచి సుందరమైన ప్రదేశములు చూచి ఆనందించుట మోక్షం. లేకున్న నరకం.

4) తన చేతుల ద్వారా మంచి మంచి పనులు, దాన ధర్మలు చేసేదే పుణ్యం. కానిది నరకం.

5) తన కాళ్ళు చేసిన పుణ్యం, మంచి మంచి మెత్తటి ప్రదేశములో తిరగాడుటయే పుణ్యం లేక నరకం.

6) తన మనస్సు వీటిన్నింటి ద్వారా ప్రశాంతతను పొందుతుంది. దానినే స్వర్గం లేకున్న నరకం.

అనగా ప్రతి అవయం అనుభవించుసుఖమును. పుణ్యం అని చెప్పువచ్చును. అలాగే ప్రతి అవయం అనుభవించు కష్టమునే నరకం అనవచ్చును. ఈ కష్టం, సుఖం, మానవుడి చేతిలోనే ఉన్నది. అలాగే మోక్షం, నరకం కూడా. దీనినే ''సూక్షంలో మోక్షం'' అన్నారు మన పెద్దలు. హిందిలో అంటారు ''ముట్టిమే హై పరమాత్మ'' అనగా నీ పరమాత్ముడు నీ పిడికిలిలో ఉన్నాడు. అనగా నీవు కష్టపడి, పిడికిలి బిగించి, ధైర్యంగా సాహసించి ఏ పని చేపట్టినను జయమును చేకూర్చు తుంది అని అర్థం. అందుకే అన్నారు పెద్దలు ''ధైర్యే సహసే లక్ష్మి'' ధైర్యంగా సాహసించి ఎటువంటి కార్యక్రమమును చేపట్టినను మానవుడు సాధించగలడు. అందుకే మానవుడు తలచుకొంటే సాధించనది ఏమియు లేదు. కొండమీద కోతిని కూడ తేగలడు అని మన పెద్దలు రకరకాల ఉదాహరణములు ఇచ్చి, మానవ జాతిని ప్రేరేపించి అసాధ్యమనుకొన్న వాటిని కూడ సాధించగలిగారు. ఎక్కడో మాట్లాడే మాటలను రేడియోల ద్వారా వినిపించగలిగారు. ప్రపంచంలో ఏ మూలనో ఉన్న మనిషితో తను ఎలాగున్నాడు అనునది చూపిస్తు ఎదురుగా నిలుచుని మాట్లాడినంత సంతోషమును కల్గించినాడు. ఎక్కడో పాటలు, డ్యాన్సు చేస్తున్నవాడిని తన సొంత ఇంట్లో కూర్చుని ఆనందింపచేస్తున్నాడు. చంద్ర మండలం పోయివచ్చినాడు. ఇవన్నియుమానవుడు చేసినవే! కావున ప్రతీది సాధ్యమే.

''కలసిఉంటే కలదు సుఖం అన్నారు'' అంటే ఒకడు చేయలేని పనిని, అందరు కలసి కట్టుగా పనిచేసుకొన్న సుఖం అనుభవించచ్చును.

వ్యవసాయం ఉంది ఒక్కడు చేసుకొనేకంటే, అందరు కలసి చేసిన చాలా లాభం ఉంటుంది. కాని మనవాళ్లు చేయుటలేదు, కారణం వ్యవసాయం గూర్చి సరియైన అవగాహన లేదు. ప్రతిరైతు తనకున్న పొలంలో రకరకాల పంటలు వేస్తారు. ఆ పొలం కూడ ఒక చోట ఉండదు. కొందరికి నీటి వసితి ఉంటే కొందరికి లేదు. అందువలన అది సాధ్యంకాదని వారి నమ్మకం.

విద్య నేర్చుకొనేది జ్ఞాన సంపద. మొదటిది అక్షర జ్ఞానము, ఏ అక్షరము ఎలా కలిపితే ఒక పదము అవుతుంది, ఆయా పదాలకు అర్థములను తెలుసుకొనుట, అ పదాలన్నింటిని కలిపి వాక్యాలుగా వ్రాయుట, ఆ వాక్యాల భావములను తెలుసుకొనుట. ఆ విధంగా మొదట అక్షర జ్ఞానమును సంపాదించిన తరువాత, మానవునికి సంబంధించిన, దినచర్యలలో వాడే వస్తువుల పేర్లు, పనిముట్ల పేర్లు, ఫలాల పేర్లు, ధాన్యముల పేర్లు, పదార్థాల పేర్లు ఈ విధంగా తనకు సంబంధించిన చిన్నచిన్న విషయములు, తన జ్ఞానాభివృద్ధిని పెంపొందించుటకు మానవుడు ప్రయత్నించుతున్నాడు. ఈ విషయములు ఎవరికి తెలియదు? ఇది అందరికి తెలసినదే, విద్య లేనివారికి, విద్య ఉన్న వారికి అందరికి తెలుసు అని చెప్పవచ్చును.

అలా చెప్పటం అందరికి తెలసిన విషయమే కాని, ఆ విషయములనే ఖచ్చితంగా సున్నితంగా తెలుసుకోగలిగాలి. ఇప్పుడు అన్నం చేసే పాత్రలు, కుండలు ఉన్నవి. అవి ఎవరికి తెలియదు, అందరికి తెలుసు చిన్నపిల్ల వాని మొదలుకొని పెద్దవారిదాకా అందరికి తెలుసు, కాని, కుండ ఎలా చేస్తారు? దేనితో చేస్తారు? అలా చేసిన అది నిలుస్తుందా? అట్ల ఎలా నిలుస్తుంది? అనే విషయం, తరువాత దాని భద్రత గురించి తెలుసుకొనుట.

కుండను కుమ్మరి చేస్తున్నాడు. బంక మట్టితో చేస్తున్నాడు. బాగా జిగట ఉన్న మట్టితో అంటే, ఆ జిగట అంటే ఏమిటి? దేనిని జిగట అంటారు. ఆ జిగట వచ్చుటకు కుమ్మరి ఏమి ఏమి చేస్తాడు? అలా చేసినప్పుడు కదా? అది జిగటగా మారి, కుమ్మరి చక్రము పై పెట్టిదానిని, ఒక ఆకారంలో తెచ్చి దానిని తిరిగి, తన యొక్క చేతిలో ఉంచుకొని కుండ ఆకారమును మలచుకొంటాడు. అలా అయితే అందరు చేయవచ్చు కదా? ఎందుకు చేయటం లేదు. ఎందుకనగా దానిని ఎలా మలచ వలయునన్న జ్ఞానము, పనితనము కావలసి ఉన్నది. దానినే ఇంగ్లీషులో స్కిల్ అంటారు. ఆవిధంగా తయారు చేసిన కుండను, కుమ్మరి, వాటిని కాల్చుటకు ప్రత్యేకముగా తయారు చేసి ఉన్న పొయ్యిలో అమర్చి, దానిని బాగా కాల్చుతాడు. కాల్చుటం అనగా ఆ కుండమట్టి మరియు నీరు ఇతరములైన కొన్ని రసాయనముల వలన మిళితమై ఉన్నది. అది అగ్ని వేడికి, అందులోని నీరంతయు ఆవిరి అయి, మట్టి అణువులు కరిగి ఒకదానితో ఒకటి కలసి పోయి, చల్లారినతరువాత గట్టిగా ఉండిపోతాయి. ఈవిధంగా కుండ ఆకారం తయారు అగును. ఆందులో, నీరు, అన్నమును మరియు ఇతరములైన అన్ని రకాల పనులను చేసుకొనవచ్చును. కాని దానికి, ఏ మాత్రం దెబ్బ తగిలిన అది చిల్లు పడటమో, పగిలి పోవటమో జరుగుతుంది. దానికి కారణం, కుండ అనేది పెళుసుతనం కలిగిఉంటుంది. అందువలన అది పగిలిపోవటం, చీలిపోవుట జరుగుతుంది. అనగా వాటి అణువులకు గట్టి పటుత్వం లేదని అర్థము. అదే లోహపు పాత్రలు ఉన్నవి, అవి అలాజరగవు, ఈ విషయములను తెలుసుకొనుటనే జ్ఞానము అంటారు. జ్ఞాని ఎటువంటి విషయమునైన అట్టే గ్రహించుకొంటారు. కాని, అజ్ఞానులు, అదే విషయమును తెలుసుకొనుటకు చాలా కాలం పట్టును.

విద్య అనేది అన్నిటికి మూలము. ఈ విద్యవలననే ప్రపంచము సర్వతో ముఖాభివృద్ధిచెందుచున్నది. ప్రతి విషయము తెలుసుకొనుట ఒక్కొక్క మార్గమును చేపట్టవలయును. మన పెద్దలంటారు, ''సూక్షములో ఉన్నది మోక్షం'' అనగా ఏ విషయమునైనను సూక్ష్మ దృష్టితో చూడగలిననాడు, ఏ విషయమునైనను అట్లే ఆకట్టు కొనవచ్చును.

అలా ఆకట్టుకొనవలయునంటే మానవ శరీరంపై అధారపడి ఉన్నది. మనిషి ఆరోగ్యంగా ఉండవలయునంటే మంచి ఆహారం తీసుకొనవలయును. ఆహారంలో కూడ ముఖ్యంగా మూడు విషయములను పెద్దలు చెప్పిఉన్నారు. 1) క్షీరము అనగా పాలు, పాలు బాగా సేవించిన వారికి ఆయుషు పెరుగుతుందట. అనగా ''క్షీరం అయుర్ వృద్ధి హె'' అన్నారు. అలాగే 2) ''ఘీ సూక్ష్మ బుద్దిహి'' నేతిని సేవించిన సూక్ష్మబుద్ధి ఉండును. ప్రతి విషయము వెంటనే తెలుసుకొనుట. 3) ''మాంసం మామ్సేనే వృద్ధహ'' అన్నారు. శరీరం కండర పుష్టిగా ఉండవలయునంటే, మాంసకృత్తులు కలిగిన ఆహార పదార్థములు, ఎక్కువగా వాడవలయును. మాంసాహారులకు మాంసం ద్వారాను, శాఖాహారలకు పప్పు దినుసుల ద్వారాను లభిస్తుంది.

పై మూడు పదార్థాలను ప్రతి రోజూ తప్పని సరిగా సేవించిన మంచి ఆరోగ్యమును సంపాదించి, దీర్ఘాయువు, మంచి తెలివితేటలు కలిగిఉంటారు.

కాని మానవుడు పై మూడింటిని సంపాదించవలయునంటే, తన విద్య విజ్ఞానములను ఉపయోగించి ధనమును సంపాదించవలయును. అలా కాకుండ పై వాటిని సంపాదించుటకు తప్పుడుదారులకు అలవాటు పడకూడదు. నీతినిజాయితితో సంపాదించిన, ప్రతిఫలం ప్రతి పైసా ఉపయోగపడి సుఖసంతోషాలతో పాటు, ఆయురారోగ్యములను సమకూరుస్తుంది. అదే తప్పుడు దారులలో సంపాదించిన ప్రతిఫలం, సుఖశాంతులు లేకుండా, ఆయురారోగ్యములను కూడ క్షీణంప చేస్తుంది, కావున మానవుడు తనుచేయు ప్రతి పనిని ఆచి తూచి చేయవలసి ఉండును.

# విద్య - ఉద్యోగం

విద్య అనేది విజ్ఞానమును ఇస్తుంది. దీనినే జ్ఞాన నేత్రం అంటారు. ఈ జ్ఞాననేత్రం ద్వారా తన భవిష్యత్తును ఎలా మలచుకొనవలయునో ముందుగా తెలుసుకొని, మానవుడు తన జీవితమనుగడను సాధిస్తాడు. విద్యా జ్ఞానమనదే, సముద్రం వంటిది, సముద్రమనగా అనంతమైనది, అంతులేనిది అని అర్థం. అనగా కొలత తీయుటకు గాని దానిలోతును కనిపెట్టుటకాని సాధ్యపడనిది అని అర్థం.

విద్యకూడ అటువంటిదే. విద్యను రకరకాలుగా విభజించి ఉన్నాం. ఒక ప్రాథమిక విద్య దీనిని 1నుండి 5వ తరగతి ఎలిమెంటరీ ఎడ్యుకేషన్ అంటారు. అక్షర జ్ఞానం వచ్చుట, వ్రాయుట, చదువుట వచ్చి, తనకు కావలసిన కొంత జ్ఞానమును తెల్పుతుంది, తన వరకు కావలసిన లెక్కలను చూచుకొనుట.

రెండవది మాధ్యమిక. ఇది 6నుండి 10వ తరగతి. దీని ద్వారా భాషా జ్ఞానమును తెలుసుకొనుట, గణిత శాస్త్రము(లెక్కలు) సాంఘిక శాస్త్రము. ప్రపంచ జ్ఞానమును సామాన్య శాస్త్రము అనగా మానవ శరీరం గూర్చి వ్యవసాయం పశుపోషణ, రసాయణ శాస్త్రము మొదలగునవి. అనగా ఈ విద్య ద్వారా అన్ని రకాల జ్ఞానమును సంపాదించుట జరుగుతుంది. మానవజన్మ ఎత్తిన ప్రతి వ్యక్తి విధిగా ఈ మాత్రం జ్ఞానమును తప్పని సరిగా పొందవలసి ఉండును. దీనినే ప్రాథమిక విద్య లేక కంపల్సరి ఎడ్యుకేషన్ అంటారు. ఈ విద్యవలన మానవుడు తన సుఖజీవనం చేయుటకు రకరకాల మార్గములను, వెత్తుకొనగలగుతాడు. అనగా తను సంపాదించిన విద్య ద్వారా తనకు ఏ విషయంలో అయితే మంచి అభిరుచి ఉండనో ఆ మార్గమును అన్వేషించుకొంటారు.

తను ముందు చేపట్టబోయే రకరకాల వృత్తులను దీని ద్వారా తెలుసుకొన గలడు. వృత్తి విద్యలు: ఫిబ్ రిజిస్టరు అను గ్రంథములో నేను చదివినది ఏమనగా మానవులు 320 వృత్తులను చేపట్టవచ్చును అన్నారు. వృత్తి అనగా ఒక పని. గుమస్తా పనిచేయటం కూడ ఒక వృత్తి మాత్రమే, వృత్తి అనగా ఒక్కొక్క పనిని ఒక్కొక్క వృత్తి అంటారు. ఇప్పుడు ఉదాహరణకు వ్యవసాయం ఉందనుకొండి, సేద్యం చేయటం ఒక వృత్తి, కూరగాయలు పండించటం ఒక

వృత్తి, పండ్ల తోటలు పెంచటం ఒక వృత్తి, పాలు ఉత్పత్తి చేయటం ఒక వృత్తి, గొర్రెలు పోషించటం ఒక వృత్తి, కోళ్లు పెంచటం ఒక వృత్తి, చేపల పెంపకం ఒక వృత్తి, పట్టుపురుగులను పెంచటం ఒక వృత్తి, వాణిజ్య పంటలు, చెఱుకు పండించటం ఒక వృత్తి, అలాగే ఈ వ్యవసాయంలో కూడ చాలా ఉపవృత్తులు ఉన్నవి. వరి పండించటం, రాగులు పండించటం, వేరుశెనగ పండించటం గోధుమలు, జొన్న సజ్జ ఒక్కొక్క పంటను మాత్రమే పండించుట. అలాగే కూర గాయలలో, ఒక్కొక్క రకం మాత్రమే పండించటం 1) మిరపకాయలు, 2) వంకాయలు, 3) బెండకాయలు, 4) కాకరకాయలు, 5) బీరకాయలు, 6) గుమ్మడి కాయలు, 7) దోసకాయలు, 8) దొండకాయలు, 9) టొమోటాలు, 10) ముల్లంగి, 11) ఎర్రగడ్డలు, 12) ధనియాలు, 13) తెల్లగడ్డలు, 14) బంగాళ దుంపలు, 15) పసుపు, 16) క్యాబెజి, 17) క్యాలిఫ్లవర్, 18) క్యారెట్, 19) చామ దుంపలు. అలాగే ఆకుకూరలు:– 1. కొత్తమీర 2. మెంతికూర 3. తోటకూర 4. బచ్చలికూర 5. పాలకూర 6. చుక్కకూర 7. గోంగూర మొదలైనవి. రైతు తనకున్న విద్యాజ్ఞానముతో ప్రతిదినం ప్రతి కుటుంబమునకు కావలసిన నిత్య అవసర వస్తువులను దృష్టిలో ఉంచుకొని, తనకున్న భూవసతిని, నీటివసతిని, ఇతరములైన వ్యవసాయ వసతులను దృష్టిలో ఉంచుకొని ఒకే ఒక వృత్తిని ఎన్నుకొని, వాటిని ఉత్పత్తి చేసి అమ్ముకొని మంచి లాభములను, పని ఒత్తడిని తగ్గించుకొని, సుఖజీవనమునకు మార్గములు అన్వేషించుకొనవలయును. ఈ వ్యవసాయం ద్వారా ఉపవృత్తులను కూడ చేపట్టవచ్చును. అనగా రైతులు పండించు పంటలను, కూరగాయలను, ఆకు కూరలను, పండ్లను పాలను, మాంసంలను, ప్రతి కుటుంబమునకు అందుబాటులోను, చుట్టు ప్రక్కల గ్రామాలకు, పట్టణములకు సరఫరా చేసి వ్యాపార వృత్తిని కూడ చేపట్టవచ్చును, ఒక్కడు ఒక వృత్తినే చేపట్టిన ఎడల మంచి ఆదాయమును, కావలసినంత విశ్రాంతిని, పని భారమును తగ్గించుకొనుటకు అవకాశం ఏర్పడగలదు.

**వృత్తి విద్యలు :** పదవ తరగతి పాస్ అయిన ఫేయిల్ అయిన వీటిని చేపట్టవచ్చును. పూర్వంమానవ అవసరాలకు సరిపోవు వృత్తులను ప్రతి గ్రామములోను చేపట్టి ఉన్నారు. అనగా వ్యవసాయ పని ముట్లు చేయుటకు కుమ్మరి, వడ్రంగి, వస్త్రములు నేయుటకు సాలీలు, ఆహారపదార్థములు వండుకొనుటకు ఉపయోగించు కుండలను తయారుచేసి కుమ్మరి, నగలు చేయుటకు కంసాలి, గడ్డం తీయుటకు మంగలి, బట్టలు ఉతుకుటకు చాకలి, గ్రామ లెక్కలు వ్రాయుటకు కరణాలు, గ్రామ కట్టుబడికి రెడ్డి లేక పటేల్ అని ఏర్పాటు చూసుకొని ఉన్నారు. అనగా అడ్మినిస్ట్రేషన్ కొరకు రెడ్డి, కరణం, ఇక వృత్తులు చేపట్టుటకు మొత్తం గ్రామ రైతులు, మరియు వారిని రకరకాల పనులుచేసి సహకరించుటకు పై తెల్పిన వృత్తులవారు పనిచేస్తూఉండిరి.

పై వృత్తులవారు తమ తమ వృత్తులను వంశపారం పర్యంగా నేర్చుకొనుచూ వారి జీవనములను సాగించుకొంటూ వస్తున్నారు.

నవీన ప్రపంచంలో వ్యవసాయం కూడ ఆధునిక యంత్రాల ద్వారా చేపట్టటం జరుగుచున్నది మరియు రవాణా సౌకర్యములు పెరిగినవి. రోడ్లు, రైళ్ళు మార్గాలు, ఓడ, విమాన మార్గాలు ఏర్పాడ్డాయి, వాటిని తయారు చేయుటకు రకరకాల వృత్తులువారు కావలసి వచ్చినారు. వారినే టెక్నికల్ అనగా వృత్తిపరమైన విద్యలు అన్నారు. 1) వెల్డింగ్, 2) ఫిట్టింగ్, 3) టర్నర్, 4) మిషినిష్టు, 5) గ్రైండర్, 6) మోటార్ మెకానిక్. 7) డీజల్ మెకానిక్,

8) బ్లాక్‌స్మిత్, 9) కార్ పెంటర్, 10) మౌల్డ్‌ర్, 11) ప్యాట్రన్ మేకర్,12) డ్రాఫ్ట్స్‌మెన్ సివిల్ 13) డ్రాఫ్ట్స్‌మెన్ మెకానిక్, 14) ఇన్‌స్ట్రుమెంట్ మెకానిక్, 15) ఎలెక్ట్రికల్, 16) వైర్‌మెన్, 17) రేడియో మెకానిక్, 18) టి. వి. మెకానిక్, 19) కంప్యూటర్ మెకానిక్, 20) ఏర్‌కండిషనర్ మెకానిక్, 21) పైప్ ఫిట్టర్, 22) ఎలెక్ట్రికల్ ఫిట్టర్, 23) గ్యాస్ వెల్డెర్, 24) బాయిలర్ వెల్డెర్ ఇంకను ఎన్నో రకరకాల ట్రేడ్లు(వృత్తులు) ఉన్నవి.

వ్యవసాయ పనులకు, ట్రాక్టర్లు ఎలెక్ట్రిక్ మోటార్ రిపేర్లు బోరుఫిట్టర్లు మొదలైనవారు.

గృహ నిర్మాణంలో, బేల్‌దార్లు రాడ్ బెండర్లు ఎలెక్ట్రికల్ ఫిట్టర్లు, డ్రైనేజి ప్లంబర్లు ఫ్లోరింగ్ పనివాళ్లు పైయింటర్లు మొదలైనవారు ఉన్నారు.

ఇక హోటల్ వృత్తులు, వంట వాళ్లు సప్లయర్లు(బేరర్లు) క్లీనర్లు మొదలైనవారు అనగా చిన్న హోటల్ నుండి ఫైవ్ స్టార్ హోటల్ దాకా చిన్న చిన్న పనులనుండి పెద్ద పెద్ద పనులు వరకు ఉన్నారు.

అలాగే, ఫోటోగ్రాఫర్లు, విడియో గ్రాఫర్లు, ఫోటో ప్రింటర్లు మొదలైనవారు విద్యుత్ లైట్లు, పందిళ్ళు వేయువారు, పెద్ద పెద్ద సభలకు, పెండ్లిండ్లకు ఏర్పాట్లు చేయు మొదలగువారు.

ఆఫీసులో పని చేసే టైపిస్టులు, స్టెనో గ్రాఫర్లు, సెక్రెటరియల్ ప్రాక్టీసు వారు, కంప్యూటర్ రికార్డింగ్ చేయువారు.

ఇక వస్త్రసదుపాయం కొరకు, అంగళ్లలో సేల్స్‌మెన్ వృత్తివారు, టైలరింగ్ వృత్తివారు.(కటింగ్ అండ్ టైలరింగ్) వీరు చిన్న చిన్న బంకులనుండి పెద్ద పెద్ద టైలరింగ్ షాపులను చేపట్టి ఉన్నారు. ఇవి అన్నియు వృత్తి విద్య క్రిందనే వస్తున్నవి.

ఇంటర్‌మిడియేట్ ఎడ్యుకేషన్ : అనగా ప్రాథమిక విద్య అయిన తరువాత చదువవలయునని ఉత్సాహం ఉండి ఆర్థికంగా ముందుకు నడిపించగలిగిన తల్లిదండ్రులు ఉన్న ఈ విద్యను చేపట్టవచ్చును.

ఈ విద్య అన్ని విద్యలకు ప్రముఖ స్థానం వహిస్తుంది. పెద్ద పెద్ద చదువులు చదవ తలచిన వారు వారి వారి అభిరుచులను బట్టి, వారికి విద్యా సంస్థలలో లభించే సీట్లను బట్టి ఆధారపడి ఉన్న వి. ఇక్కడ రెండువర్గాలుగా విభజించి ఉన్నారు. ఆర్ట్సు గ్రూపు, సైన్సు గ్రూపు. ఆర్ట్సు గ్రూపులో, హెచ్.ఇ.సి., సి.ఇ.సి., హెచ్.ఇ.టి మరియు కొన్ని ఒకేషనల్ కోర్సులు ఉన్నవి. అవి సెక్రెటరియల్ ప్రాక్టీసు. టైపు మరియు షార్ట్‌హ్యాండ్ టైపు, డైరిసైన్సు, సెరికల్చర్, నర్సింగ్, ల్యాబ్ టెక్నిషియన్, సర్వేయింగ్ మరియు లెవలింగ్, బిల్డింగ్, బిల్డింగ్ ఫౌండేషన్ కోర్సు ఆటోమోబైల్, డ్రస్ మెకింగ్ కోర్సులు.

అనగా హెచ్.ఇ.సి అనగా హిస్టరి(చరిత్ర) ఎకనామిక్స్(పొదుపు) మరియు సివిక్సు (పరిపాలన) (రాజకీయం) సి.ఇ.సి. అనగా కామర్సు(వాణ్యిము), హెచ్.ఇ.టి. హిస్టరి, ఎకనామిక్సు మరియు తెలుగు గూర్చి.

ఇక సైన్సు కోర్సులు :-

యం. పి. సి. : మాథ్స్(లెక్కలు) ఫిజిక్స్(భౌతిక శాస్త్రము) కెమిస్ట్రి (రసాయన శాస్త్రము).

బై. పి. సి. : బాటని(వృక్ష శాస్త్రం) జువాలజి(జంతు శాస్త్రం), ఫిజిక్సు (భౌతిక శాస్త్రం) కెమిస్ట్రి(రసాయన శాస్త్రం) నేర్పుతారు.

ఈ విధంగా రెండు సంవత్సరములు వివిధ రకములైన భాషలలో, తెలుగు ఇంగ్లీషు, హింది, సంస్కృతం, ఉర్దూ మరియు ఇతర భారతీయ భాషలలోని పరిజ్ఞానమును సంపాదించుకొంటూ, వారి వారి అభిరుచులకు తగిన శాస్త్రములను, అనగా చరిత్ర, రాజకీయ శాస్త్రం పోదువు, వాణిజ్యము, గణిత శాస్త్రం, భౌతిక శాస్త్రం, భూభౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం, వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం మరియు ఇతరములైన వృత్తిపరమైన జ్ఞానమును సంపాదించగలుగుతారు.

పై చదువు పూర్తి అయిన తరువాత 3 సంవత్సరముల డిగ్రి చదువులు, అన్ని రంగాలకు చెందిన చదువులు. ఇంజినీరింగ్, గ్రాడ్యుయేట్ చదువులు మానవ భద్రతకు సంబంధించిన చదువులు 5 సంవత్సరములు.

**1.** డాక్టరు : యం.బి.బి.యస్. ఇందులో రకరకాలు. ఆయుర్వేదిక్, హోమియోపతి, అలోపతి, యునాని మరియు మొదలుగున్నవి.

మరియు బి.వి.యస్.సి. పశుసంబంధమైన వైద్యం, ఎ.జి.బి.యస్.సి. వృక్ష సంబంధమైన వైద్యం, హర్టికల్చర్ వనములు, పండ్ల తోటల అభివృద్ధి గూర్చిన శాస్త్రం, డైరి సైన్సు, ఫిషరీస్ అనగా చేపలు, రొయ్యలు అభివృద్ధి గూర్చిన శాస్త్రం మొదలైనవి.

**4** సంవత్సరముల ఇంజనీరింగ్: బి.టెక్ ఇందులో 1. మెకానికల్ ఇంజినీరు, 2. సివిల్ ఇంజినీరు, 3) ఎలెక్ట్రికల్ అండ్ ఎలెక్ట్రానిక్స్ ఇంజినీరు 4) కెమికల్ ఇంజినీరు 5) ఎలెక్ట్రానిక్స్ అండ్ కమ్యూనికేషన్స్ 6) కంప్యూటర్ సైన్సు 7) మైనింగ్ ఇంజినీర్ 8) ప్రింటింగ్ టెక్నాలజి 9) ప్రోడక్షన్ టెక్నాలజి 10) అగ్రికల్చర్ మరియు డైరి టెక్నాలజీ ఇంజినీరింగ్.

జనరల్ ఎడ్యుకేషన్ : బి.ఏ. బి.కాం. బి.యస్.సి.

పై చదువు చదివిన వారు, రాజకీయంలోను, కార్యాలయములలో గుమాస్తాలుగాను, లాయర్లు, పోలీసు ఉద్యోగాలు, ఉపాధ్యాయ వృత్తులు, బ్యాంకు ఉద్యోగాలు, కో. ఆపరేటివ్ బ్యాంకులు మరియు సహకార శాఖలలోనూ, రెవిన్యూ శాఖలలోను, సమాచార శాఖలలోను, వాణిజ్య శాఖలలోను. పాదువు శాఖలలోను, పోస్టులు, టెలిఫోన్, టెలిగ్రాఫ్ శాఖలలోను, పంచాయితి శాఖలలోను, భూగర్భ శాఖలలోను, అన్ని ప్రభుత్వ శాఖలలోను విద్యుత్ శాఖ, సమాచారా శాఖలలోను, ఆల్ ఇండియా రేడియో, టి. వి. రవాణా శాఖలు, పరిశ్రమలు, అన్నిటిలోను, అటెండరు మొదలుకొని, గుమాస్తా, సెక్షన్ ఆఫీసర్ ఆఫీసర్‌వరకు ఉద్యోగములు చేపట్టవచ్చును.

పై ఇంటర్ మీడియట్, మరియు డిగ్రికోర్సులు చదివినవారు రకరకాల పి.జి. డిప్లొమా డిగ్రీ కోర్సులు చదువవచ్చును.

వైద్య రంగలో, బి.యస్.సి. నర్సింగ్, పురుషులు, స్త్రీలు, నర్సింగ్, స్త్రీ మాత్రం మరియు ఎం. ఎస్. ఇతర కోర్సులు, ల్యాబ్ టెక్నిషియన్లు, ఎక్సరే, మొదలైనవి.

ఇంజినీరింగ్‌లో డిప్లొమో కోర్సులు, డి.యం.ఇ., యల్.యం.ఇ., డి.సి.ఇ., డి.ఇ.ఇ., డి.యం.ఇ. ఎలెక్ట్రికల్ మరియు, మెకానికల్ ఇంజినీరింగ్ ఎలెక్ట్రికల్ మరియు ఎలెక్ట్రానిక్స్ ఇంజినీరింగ్, మైనింగ్ ఇంజినీరింగ్ అన్ని రకాల ఇంజినీరింగ్ సబెక్టులుతో విద్య నేర్చుకొనుట.

ఇక సాయిల్స్ టెస్టయింగ్, వ్యవసాయ పరమైన డిప్లొమో ట్రైనింగ్ డైరి టెక్నాలజి, విలేజ్ డెవలప్‌మెంట్ ఆఫీసర్ల ట్రైనింగ్, కో. ఆపరేటివ్ ఆడిటర్సు, మరియు ఇన్స్‌పెక్టర్ల ట్రయినింగ్, టీచర్ ట్రయినింగ్, ఐ.టి.ఐ. లలో బోధించు టెక్నికల్ కోర్సులు, సి.టి.ఐ. అనగా సెంట్రల్ ట్రయినింగ్ ఇనిస్టిట్యూట్ నందు లెక్చరర్ కోర్సులు, పోలీస్ ట్రయినింగ్ కోర్సులు, బి.యిడి కోర్సులు బి.యల్ మొదలైనవి. వృత్తి విద్యలకు సంబంధించిన కోర్సులలో ట్రయినింగ్ అయి వారి వారి వృత్తులను స్వీకరించివలసి ఉండును. ఎంత చదువు చదివిన ఏదో ఒక వృత్తిని చేపట్టి జీవించలసి ఉన్నది. పై చదువులు అయిన తరువాత యం.బి.ఏ., సి.ఏ. మొదలగునవి.

అత్యున్నత విద్య : అదే పోస్టుగ్రాడ్యుయేట్ ఎడ్యుకేషన్ అంటారు. యం.ఏ., యం.యస్.సి., యం.కాం., యం.ఫిల్., యం.యల్., లో రెండు సంవత్సరములు తనకు కావలసిన ఒకే ఒక శాస్త్రంలో జ్ఞానము సంపాదించటం. రసాయన శాస్త్రంలో తన జ్ఞానమును అభివృద్ధి పరచుట, అలాగే భౌతిక శాస్త్రం, గణిత శాస్త్రం, చరిత్ర, రాజకీయం, జంతు శాస్త్రం వృక్షశాస్త్రం, భూగర్భ శాస్త్రం, మెనేజ్‌మెంట్ ఆన్ బిజినెస్ అడ్మినిస్ట్రేషన్, ఛార్‌టెడ్ అకౌంటెంట్, మొదలైనవి. ఆ తరువాత పిఎచ్.డి. తను సంపాదించిన జ్ఞానముతో ఇదివరకు ఎవరు కనిపెట్టని ఒక క్రొత్త విషయంను కనిపెట్టి రుజువు చేయుట. ఇంతటితో తన విద్యా సముపార్జనం ఆగిపోయి తన విద్యను తన జీవిత కాలంలో ఖర్చు పెట్టటం జరుగుతుంది. ''నాలెడ్జి ఈజ్ ట్రెజరి'' (" KNOWLEDGE IS TREASURE, BUT PRACTICE IS KEY TO IT") జ్ఞానం అనేది ఒక భద్రమైన ప్రభుత్వ ఖజాన వంటిది. ''బట్ ప్రాక్టిస్ ఈజ్ కీ టు ఇట్'' ఖజానాలో ఉన్న ధనమును ఎట్లువాడుకుంటామో అలాగే జ్ఞానముతో పనులు చేసి ఆదాయం సంపాదించి ఖర్చు పెట్టవలెను.

వైద్య విద్యలు : యం.బి.బి.యస్ అయిన తరువాత, యం.యస్., యం.డి. యం.డి.గైనిక్, ఆప్తమాలజి, కార్డియాలజి, డెర్మటాలజి, లెప్రసి, టి.బి., ఆర్తోపెడిక్, మొదలగునవి. ఒక్కొక్క వైద్య శాస్త్రంలో జ్ఞానమును సంపాదించి గుండె జబ్బులు, కంటి జబ్బులు, చర్మవ్యాధులు, టిబి. క్షయ, ఎముకులు, దంతములు, స్త్రీ సంబంధమైన, శిశు సంబంధమైన వ్యాధులు, కంటి వైద్యులు, ముక్కు, గొంతు, చెవి సంబంధించిన ఒక్కొక్క శాస్త్రములో నైపుణ్యంగలిగిన విద్యను అభ్యసించుటవలన ఆయా వృత్తులలో నైపుణ్యం కలిగి ఉంటారు. జంతు సంబంధమైన, వృక్ష సంబంధమైన, డైరి, ఫౌల్‌ట్రి, ఫిషరీస్ మరియు అన్ని రకాల శాస్త్రములు తెలుసుకొని వాటి అభివృద్ధికి, వాటికి సంబంధించిన రోగాలు, వాటికి సంబంధించిన మందులను గూర్చి తెల్సుకొని, తయారు చేసి ఉపయోగించు జ్ఞానమును కలిగి ఉంటారు.

అలాగే, ఇంజినీరింగ్, యం.టెక్. లోను ఎలెక్ట్రానిక్స్, ఎలెక్ట్రికల్, మెకానికల్, సివిల్ ఆర్కిటెక్చర్, కెమికల్, మైనింగ్, టెక్స్‌టైల్ రకరకాల ఇంజినీరింగ్ శాస్త్రములు క్షుణ్ణంగా తెలుసుకొని వాటి అభివృద్ధికి, ఉత్పత్తికి పాటుపడుచు క్రొత్త క్రొత్త యంత్రములను కనిపెట్టుచున్నారు.

ఆ తరువాత ప్రభుత్వ, ప్రజాపాలనలలో మంచి నైపుణ్యమును సంపాదించుటకుగాను, ఐ.ఏ.యస్. ఐ.పి.యస్. ఐ.ఎఫ్.యస్. ఐ.ఆర్.యస్. ఐ.బి.యస్. ఐ.ఓ.యఫ్.యస్. ఐ.ఇ.యస్. గ్రూప్-1, గ్రూప్-2, గ్రూప్-3, గ్రూప్-4, కోర్సులలో రకరకాల ట్రయినింగ్‌లు చేపట్టినారు.

ఐ.ఏ.యస్. ఇండియన్ అడ్మినిస్ట్రేషన్ సర్వీసులు, ఐ.పి.యస్. ఇండియన్ పోలిసు సర్వీసులు. ఐ.ఎఫ్.యస్. ఇండియన్ ఫారెస్ట్ సర్వీస్, ఇండియన్ ఫయర్ సర్వీస్, ఇండియన్ రైల్వే సర్వీసస్, ఇండియన్ బ్యాంకింగ్ సర్వీస్, ఇండియన్ ఇంజినీరింగ్ సర్వీసస్, ఐ.యం.యస్. ఇండియన్ మెడికల్ సర్వీసస్, ఈ విధంగా రకరకాల శాఖలలో రకరకాల వృత్తి అనుభవంగల అడ్మినిస్ట్రేషన్ ఆఫీసర్లను, కమీషనర్లు, కార్యదర్శులు, ఆడిటర్లు పనిచేయుచున్నారు. ఇన్ని రకాల ప్రభుత్వ శాఖలలో మంచి ఆరితేరిన, అనుభవజ్ఞులైన అధికారులు, ప్రజాప్రతినిధులు సహకారంతో పాలించుచున్నారు.

అయితే ఇక్కడ ఒకటి గ్రహించవలసి ఉన్నది. ఒక వైద్యవృత్తిని వదిలితే, మిగిలిన విద్యలన్నియు, రెండు వర్గములుగా విభజించబడినది.

| 1. సాధారణ విద్య | 2. సాంకేతిక విద్య |
|---|---|
| (నాన్ టెక్నికల్ విద్య) | (టెక్నికల్ విద్య) |

టెక్నికల్ అనగా నైపుణ్యం ఉన్నది.(ఇంజనీరింగ్) నాన్ టెక్నికల్ అనగా నైపుణ్యం లేనిది. విద్యను నాల్గు వర్గాలుగా విభజించవచ్చును.

| 1. సాధారణ విద్య | 2. సాంకేతిక విద్య |
|---|---|
| 1 ఎలిమెంటరి 1 నుండి 5వ తరగతి | 1. ఐ.టి.ఐ |
| 2. హైస్కూల్ | 2. డిప్లమా |
| 3. ఇంటర్ మీడియేట్ | డిప్లమా |
| 4. డిగ్రి, గ్రాడ్యుయేట్స్ | 3. బి.టెక్ |
| 5. పోస్టు గ్రాడ్యుయేట్ | 4. ఎం. టెక్ |

ఇక్కడ సాధారణ విద్యతో టెక్నికల్ విద్యను పోల్చిన ఈ క్రింది విధంగా ఉండును.

| | |
|---|---|
| 1. ఎలిమెంట్రి స్కూలు | ఐ.టి.ఐ కి సమానం |
| 2. హైస్కూలు | డిప్లమాకు సమానం |
| 3. డిగ్రి | బి. టెక్‌కు సమానం |
| 4. పోస్టుగ్రాడ్యుయేషన్ | యం.టెక్ కు సమానం |

మనము ఎలిమెంటరి ఎడ్యుకేషన్‌లో ఎంత అయితే విద్యాజ్ఞానమును సంపాదించ గలమో అదే టెక్నికల్ సైడు ఐ.టి.ఐ విద్యతో సమానం. అయిన ఇక్కడ విద్యతోపాటు అనగా తనకు నచ్చిన ఒక వృత్తిలో సాంకేతిక జ్ఞానంతోపాటు, స్వయం వృత్తి పనిని (నైపుణ్యం, స్కిల్) కూడ చేయగలడు(ప్రాక్టికల్) ఉండును. ఇందులో 20% థీరి, 80% స్కిల్డ్.

హైస్కూల్ ద్వారా పొందిన జ్ఞానముతో ఇక్కడ డిప్లమో విద్యయందు కొన్ని రకాల వృత్తి సాంకేతిక జ్ఞానమును కల్గి ఉంటాడు. కాని ఇక్కడ వృత్తిపరమైన పనితనం కలిగి ఉండరు. కొద్ది పాట 80% థీరి, 20% స్కిల్డ్.

డిగ్రి : దీని ద్వారా ఒక విద్యాజ్ఞానమును తెలుసుకొని ఉంటాడు గాని, వృత్తి పరమైన జ్ఞానము ఉండదు. ఇంజినీరింగ్ నందు జ్ఞానముతో పాటు వృత్తిపరమైన విజ్ఞానమును, సాంకేతిక జ్ఞానమును కలిగిఉంటారు. కావున, ఎవరు ఎంత వరకు జ్ఞానమును సముపార్జించగలరో అంతవరకే ఉండను కాని, అన్ని చదువులలో, అన్ని రకాల జ్ఞానము అబ్బదు. ఇది గ్రహించి ప్రతి ఒక్కరు. తమ తమ పరిజ్ఞానంతో నడచిన, ఒకరు పెద్ద, ఒకరు చిన్న అనే భావము ఏర్పడుకుండా, జీవితమును మంచిగా సాగించి, ఒకరినొకరు అన్యోన్యతగా మెలిగి మంచి సుఖజీవినం సాగించ వచ్చును, అజ్ఞానముతో ఒకరి మీద ఒకరు పెత్తనం చలాయిస్తూ తమ జీవితములను దుఖఃమయం చేసుకొన కూడదు. ఇదే విద్య వలన మానవుడు సంపాదించే ధనం.

పూర్వము మన పెద్దలు నిర్ణయించిన నాల్గు వర్ణములను ఇక్కడ పొందు పరచబడమైనది.

1) బ్రాహ్మణ అనగా జ్ఞానోదయమును కలిగించువాడు . ఎలిమెంటరి ఎడ్యుకేషన్ నుండి యునివర్సిటి వరకు బోధించగల అన్నిరకాల బోధకులు.

2) క్షత్రియ : ఇది ప్రజారాజ్యం కావున ప్రజల చేత ఎన్నుకొనబడి రాజకీయ చేతన్యం ఉండి ప్రజల చేత పాలించబడుచున్న ఈ ప్రభుత్వం, రాజకీయ జ్ఞానం కలిగి, వారి అదుపు ఆజ్ఞానలలో పనిచేయుచున్న పోలీసులు, సైన్యం ఈ కోవలో వస్తుంది.

3) వైశ్యా అనగా వాణిజ్యము. అన్ని రకాల బ్యాంకులు, కో. ఆపరేటివ్ బ్యాంకులు, క్రెడిట్ సొసైటీ వీటిలో పనిచేయువారు, వాణిజ్యము, లైఫ్ ఇన్సూరెన్స్‌లు, పోస్టల్, టెలిఫోన్, రేడియో, రోడ్డు, రవాణా, రైల్వేలు మొదలైనవి.

4) శూద్ర- వ్యవసాయం, ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులు, పశుపోషణ, పౌల్ట్రిలు, మత్స్య పరిశ్రమ అటవీ సంపద మొదలైన అన్ని రంగాలలో పనిచేయువారు.

# 9వ ప్రణాళికలో బంజారా లిపి అమలు గూర్చి

నిరక్ష రాస్యత నిర్మూలనకు 40,000 కోట్లు, బొమ్మయ్. అని హెడ్డింగ్‌తో 29-3-97 ఈనాడు దినపత్రికలో ప్రచురించబడినది. తొమ్మదో ప్రణాళికా కాలంలో దేశంలోని గ్రామీణ ప్రాంతాలలో నిరక్ష రాస్యత నిర్మూలించే బృహత్తర ప్రాజెక్టుపై కేంద్ర ప్రభుత్వం 40,000 కోట్లు రాపాయలు వెచ్చిస్తుందని కేంద్ర మానవ వనరుల అభివృద్ధి శాఖ మంత్రి యస్. ఆర్. బొమ్మయ్ చెప్పారు. దేశంలో పూర్తి అక్షరాస్యత లక్షాన్ని సాధించడానికి కేంద్రం పూర్తిగా కట్టుబడి ఉందని చెప్పారు. రాష్ట్ర ప్రభుత్వాల సహకారంతో కేంద్రం ఈ లక్ష్యాన్ని సాధిస్తుందని అన్నారు. ''దోపిడి రహిత సమాజాన్ని నిర్మించడమే'' ప్రభుత్వ ప్రధాన లక్షమని, సమాజంలోని అణగారిన, పీడిత వర్గాలు ఈ విద్య ఉద్యమంలో చేరాలని శ్రీ బొమ్మాయ్ కోరారు.

దీని ప్రకారం బంజారాలు నూటికి నూరుపాళ్లు నిరక్ష రాశ్యులుగానే ఉన్నారు. వీరికి నిరాక్షరాశ్యులను చేయాలన్న. వీరికి ఖర్చు పెట్టే డబ్బునే వారి 'లిపి' ద్వారా వారిని విద్యావంతులను చేయవచ్చు కదా? మొత్తం భారతంలో బంజారాలు ఎక్కడ ఉన్న తమ కంటు ఒక ప్రత్యేక పల్లెను( తాండాను) కలిగి ఉన్నారు. కావున ఆ పల్లెవాసులకు వారి భాషలోనే విద్యా

దానం చేయవచ్చును. దీనికంటూ ప్రభుత్వం ప్రత్యేక డబ్బును ఖర్చు పెట్టనవసరం లేదు. 9వ పంచవర్ష ప్రణాళికలో ఖర్చు పెట్టబోయే 40,000 కోట్ల రూపాయలలోనే ఖర్చు చేయవచ్చును.

భారతదేశంలో వీరి జనాభా 6నుండి 7 కోట్లు పై బడి ఉన్నది. దేశ జనాభా ప్రస్తుతానికి 100 కోట్లు అయిన 1/16వ వంతు జనాభా కలిగిఉన్నారు. 40,000 కోట్లతో 1/16వ వంతు అనగా 2,500 కోట్ల రూపాయలు అవుతుంది. ఇక్కడ ఎవరి డబ్బో ఖర్చు చేయటంలేదు. బంజారాల జనాభాను బట్టి దేశజనాభాలో 16వ వంతు డబ్బును మాత్రమే ఖర్చు పెట్టిన చాలును. ఈ డబ్బుతోనే కేంద్రస్థాయిలో ఒక బంజారా విశ్వ విద్యాలయమును స్థాపించుట, దానికి అనుబంధగా రాష్ట్రస్థాయిలో బంజారా ఉప కేంద్రములను స్థాపించుట, అందులో బంజారాలలో భాషా పండితులను, ఆయా రాష్ట్రాలలో నియమించి వారి ద్వారా, పాఠ్యాంశాలను తయారు చేయించుట, ముద్రించుట, వారికి ట్రైనింగ్ ఇచ్చుట మొదలైనవి జరుపవలయును. మరియు కేంద్రస్థాయిలో ఒక ఆల్ ఇండియా రేడియోను బంజారా భాషలో ప్రచారం చేయుటకు స్థాపించుట. ప్రతి రాష్ట్రస్థాయిలోను ఒక బంజారా ప్రచార, సమాచార శాఖను స్థాపించి, బంజారా ప్రజలలో, అవగాహన తెచ్చుట. బంజారా భాషలో టి.వి. ప్రోగ్రాములను తయారు చేసి డి.డి1, డి.డి2, డి.డి3, లేక డి.డి4ను స్థాపించుట. ఈ విధంగా పై డబ్బును, ప్రణాళిక తయారు చేయించి ఖర్చు పెట్టించవలయును. ఇదే ప్రకారం విద్యభోదన చేయవలయును. ఇదంతా సాధ్యమా? అంటే సాధ్యమే అంటాను.

ఉదాహరణకు : అనంతపురం జిల్లా ఉన్నది. ఇందులో 63 మండలాలున్నాయి. 14 అసెంబ్లి నియోజక స్థానాలు ఉన్నవి. రెండు యం.పి. స్థానాలు ఉన్నవి. మొత్తం ప్రతి మండలంలో ఎన్ని తాండాలున్నది. జాబితా ప్రకటించడమైనది. అనంతపురం జిల్లాలో 500 తాండాలు ఉన్నది. అందులో హిందూపురం పార్లమెంటరి క్రింద 340 తాండాలు, అనంతపురం పార్లమెంటరి క్రింద 137 తాండాలు ఉన్నవి. వారు కాకుండ కొంత మంది పట్టణాలలోను, పల్లెలలోను నివసిస్తున్నారు. వీరి విద్యాబోధనకు 500 మంది బంజారా భాషలో నేర్పించే ఉపాధ్యాయులు కావలయును. వీరు పగలు చిన్న పిల్లలకు విద్య నేర్పి రాత్రిపూట నిరక్షరాశ్యులకు కూడ వారి భాషలో విద్య నేర్పించగలరు.

ఈ విధంగా మొత్తం 25 రాష్ట్రంలోని తాండాలను గుర్తించవలెను. ఈ కార్యక్రమము వలన, నిరుద్యోగులైన బంజారాలకు ఉద్యోగ వసతులు లభ్యమౌతాయి మరియు వారికి విద్యాభోధన ఈ విధంగా జరిగిన 9వ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయేటప్పటికి బంజారా భాషాభివృద్ధితో పాటు, నిరక్షరాశ్యత కూడ నిర్మూలించబడుతుంది. ఈ విధంగా ప్రతి జిల్లా, ప్రతి రాష్ట్రంలోని తాండాలను లెక్కకట్టి ఏ రాష్ట్రాలకు ఎంత డబ్బు కేటాయించవలయునో, వారి వారి జనాభాను పట్టి కేటాయించి ఈ కార్యక్రమమును చేపట్టవలయును.

ఎలిమెంటరి విద్య తరువాత, హైస్కూలు స్థాపించుటకుగాను ఎక్కువ జనాభా(తాండాలు) కలిగిన ప్రాంతాలలో స్థాపించవలయును. అనంతపురం జిల్లాలో కదిరి, అసెంబ్లి నియోజక వర్గము నందు 130 తాండాలు, నల్లమడ నియోజక వర్గమునందు 75 తాండాలు, గోరంట్ల నియోజక వర్గమునందు 65 తాండాలు ఆ విధంగా ఎక్కువ జనాభా కలిగిన చోట్లలల్లో హైస్కూలును స్థాపించవలయును. ఈ ప్రకారం ప్రణాళికలు తయారు చేయించవలయును.

ఇవి అన్నియు సాధ్యమా? గొంతెమ్మ కోరికలు కదా? అనవచ్చును. ఒక మత ప్రచారకులు తమ మతం మార్పిడి కోసం 6నుండి 7కోట్ల జనాభాను దృష్టిలో పెట్టుకొని బంజారా లిపి తయారు చేసి, బైబిల్ తయారు చేసి, బైబిల్ వాక్యంతో కాలెండర్, తయారుచేసి, ఊరూర చర్చీలు నిర్మించి, బంజారా భాషలో రేడియోలో క్రైస్తవ పాటలు, వాక్యములతో ప్రచారం చేయటంలేనిదే, కేంద్రం ప్రభుత్వం చర్చీల బదులు పిల్లల స్కూలు కట్టించ లేవా? ప్రచారకులు బదలు, ఉపాధ్యాయులను నియమించ లేవా. రేడియాలో బైబిల్ వాక్యములను, పాటలను పాడించినపుడు, భాషలో ప్రభుత్వ కార్యక్రమాలను, బంజారా పాటలను పాడించ లేదా? ఇదంతయూ చేయనప్పుడు, ఆ ప్రభుత్వం ఎవ్వరి కోసం? ఇందులో ఒకరి ఆదాయంతో కాని, వేరొకరి విద్యాధనంతో కాని చేపట్టం లేదే? భారతదేశ జనాభాను పట్టి అందులో బంజారాల జనాభాను పట్టి కేటాయించమంటున్నమే కాని, మేము ఏమియు గొంతెమ్మ కోర్కెలు కోరటం లేదే. అలా చేయని పక్షంలో భారతదేశం చాల అష్టకష్టాల పాలు కావలసి వస్తుంది. ఇవి చరిత్ర చెప్పిన సత్యాలు.

ఈనాడు ప్రతి తాండాలోను విద్యావంతులైన నిరుద్యోగులు చాలామంది ఉన్నారు. వారికి పై కార్యక్రమం ద్వారా ఉద్యోగ వసతి, ప్రజలకు విద్యాభివృద్ధి, దేశాభివృద్ధికి సహకరించునట్లు భారత ప్రభుత్వం వారి విద్యాభివృద్ధిని చేపట్టవలెను.

భారత ప్రభుత్వం 19వ భాషగా కొంకణి భాషను గుర్తించి వారి లిపిని తయారు చేసి అమలు పరచగా లేనిది, బంజారా భాషను గుర్తించివారి లిపిని గుర్తించి ప్రచారం ఎందుకుచేయ కూడదు?

ఇది చేసినా నాడే భారతదేశ సమైక్యత చేకూరతుంది. భారత దేశంలోని అన్ని భాషలు వచ్చి, అందరు కలసినప్పుడు ఒకే భాషలో మాట్లాడగల జాతి బంజారా జాతి ఒక్కటే ఈ దేశంలో ఉన్నది. దీనిని ప్రభుత్వం గ్రహించవలయును. ఎన్నటికైన దీని ద్వారానే జాతియ సమ్మెక్యత చేకూరుతుందే కాని, వేరేవిధంగా కాదు. బంజారా భాష, లిపి, దేవనాగరి లిపికి, అనుకూలంగా, ఇంగ్లీషు భాషా అక్షరాలు 26 ప్రకారం బైబిల్ గ్రంథకర్తలు తయారు చేసి ఉన్నారు. ఇది దేశ భాష అయిన హిందీ లిపిని కలిగిఉన్నది. బంజారా భాష 60% హిందీ అర్థాలు కలిగి ఉన్నది. అందువలన చిన్న పిల్లలు కాని, పెద్దలు కాని అతి సులభంగా ఈ లిపి ద్వారా ఇటు మాతృభాష, అటు దేశ భాషను నేర్చుకొనగలరు. అనగా మాతృభాష మరియు హిందీ ఒక లిపితోను, ప్రాంతీయ భాష ఒక లిపి, ప్రపంచ భాష ఇంగ్లీష్ కూడ మన రాష్ట్ర ప్రజలు నేర్చుకొన్నంత సులభంగా బంజారా పిల్లలు నేర్చుకొని అతిత్వరలో దేశాభివృద్ధి కార్యక్రమములలో పాలుపంచకోగలరని విశ్వశించుచున్నాము. కావున కేంద్ర ప్రభుత్వంవారు, రాష్ట్రప్రభుత్వంవారు, బంజారా రాజకీయనాయకులు, విద్యావంతులు, ఆర్థిక అభివృద్ధి సాధించిన పెద్దలు ఇందుకు ఇతోధికంగా సహకరించాలని నా ప్రార్థన.

## పదవులు

''పదవులను బట్టి, స్థానాలను బట్టి, వ్యక్తిత్వం పెరగదు,
వ్యక్తిత్వాన్నిబట్టి, ఆ పదవులకు, స్థానాలకు విలువ పెరుగుతుంది''



శ్రీ సుధాకరరావు నాయక్, అధ్యక్షులు–అఖిల భారత బంజారా సేవా సంఘు,
మాజి ముఖ్య మంత్రి, మహారాష్ట్ర మరియు మాజి గవర్నరు హిమాచల్‌ప్రదేశ్

కుడి నుండి కీ. శే. శ్రీ ఉత్తమ్‌సింగ్ రాథోడ్ మూడవవారు శ్రీ రంజిత్ నాయక్, శ్రీ ఆర్. రేఖ్యా నాయక్, శ్రీ మేఘనాథ్ చౌహాన్
శ్రీ సుధాకరరావు నాయక్‌గారు, శ్రీ బి. చీనియా నాయక్‌గారు, శ్రీ ప్రతాప్‌సింగ్ రామసింగ్ ఆడేగారు మరియు తదితరులు

# అఖిల భారత బంజారా సేవా సంఘం అధ్యక్షుల వారికి విన్నపం

గౌరవనీయులు శ్రీ సుధాకర రావు నాయక్ గారు,

అధ్యక్షులు,

అఖిల భారత బంజారా సేవా సంఘము, బొంబాయి.

అయ్యా!

బంజారా కేసరి సంచిక 14 తేది 18.04.97వార పత్రికలో ప్రచురించిన విషయమును బట్టి 13.04.97న ఆల్ ఇండియా బంజారా సేవా సంఘము అధ్యక్షులుగా శ్రీ సుధాకరరావు నాయక్ గారు (మాజీ ముఖ్యమంత్రి మహారాష్ట్రము మరియు మాజీ గవర్నర్ హిమాచలప్రదేశ్), ఏకగ్రీవముగా ఎన్నికైనందులకు మా హృదయ పూర్వక నమస్కారములు. ఈ 50 ఏ అఖిల భారత బంజారా సేవా సంఘం చరిత్రలో ఇంత గొప్ప ఘనత వహించిన వారు అఖిల భారత బంజారా సేవా సంఘం అధ్యక్షులుకావటం మనయావత్ భారత్ బంజారాలు మరియు ప్రపంచ వ్యాపితమైన రోమా బంజారాల పూర్వపుణ్య సుకృతంగా భావిస్తాను.

అఖిల భారత బంజారా సేవా సంఘం అని పేరు మాత్రం ఉన్నది. కాని అది మొత్తం దేశంలో విస్తరించలేదు. ప్రతి రాష్ట్రంలోను దాని ఉపసంఘాలు ఏర్పడలేదు. అఖిల భారత బంజారా సేవా సంఘం. మహారాష్ట్ర శాఖ, ఆంధ్రప్రదేశ్ శాఖ, కర్ణాటక శాఖలు మొదలైనవి. రాష్ట్ర శాఖల ద్వారా ప్రతి జిల్లాలోను, ప్రతినియోజక వర్గంలోను దాని ఉపసంఘాలు ఏర్పడవలయును. వీటి ద్వారా ఒక్కొక్క కార్యకర్తను ఎన్నిక చేసి, జిల్లా సంఘము, ప్రతి జిల్లా సంఘంనుండి ఒక కార్యకర్తను రాష్ట్ర సంఘమునకు, ప్రతి రాష్ట్ర సంఘమునుండి ఒక కార్యకర్తను ఎన్నిక చేసి అఖిల భారత బంజారా సేవా సంఘమును ఎన్నుకొనవలయును.

అట్లు ఎర్పడిన సంఘమునే అఖిల భారత బంజారా సేవా సంఘముగా గుర్తించి దాని ద్వారా కేంద్ర ప్రభుత్వముతోను, రాష్ట్ర ప్రభుత్వములతో సంప్రదించి బంజారాల హక్కులను, రాజకీయ, సాంఘిక, ఆర్థిక, విద్య, వైజ్ఞానిక రంగాలలో అభివృద్ధి చెందవలసి ఉన్నది. మొదట సంఘమును భద్ర పరచినతరువాత మిగిలిన కార్యక్రమములు చేపట్టవలయును.

ఈ ఉద్దేశ్యమును పూర్తి చేయుటకే మన బంజారాల ప్రముఖులు, బంజారా జాతి గర్వించ తగిన వ్యక్తి, బంజారాల గౌరవాన్ని నిలబెట్టిన వ్యక్తి కీ.శే. శ్రీ వసంతరావు పూల్‌సింగ్ నాయక్ మహారాష్ట్రమును ఏకధాటికా ఏలిన మాజి ముఖ్య మంత్రిగారు ఈ సంఘమును రిజిష్టర్ నెం. 78/1947లో స్థాపించారు. కానీ వారి ఉద్దేశ్యమును ఈనాటి వరకు సంపూర్ణం చేయలేదు. వారి వంశోస్తులు, వారి స్వభావములను పూర్తిగా ఆకలించుకున్న శ్రీ సుధాకరరావు నాయక్‌గారు, సంఘ అధ్యక్షులు కావడం బంజారాల అదృష్టంగా భావిస్తున్నాము.

అఖిల భారత బంజారా సేవా సంఘం అనేది ఒక మహా వటవృక్షం. ఈ వట వృక్షం(మొదలు) దానికి బలమైన కొమ్మలు కలిగి శాఖోపశాఖలుగా విస్తరించినవాడు అది

వటవృక్షంగా గుర్తించబడుతుంది. కానీ ఈ వటవృక్షం 1947 మొక్కగా పెరిగి 1997వరకు బలమైన మొదలుగానే నిలచిపోయినది కాని ఇప్పటివరకు దానికి బలమైన కొమ్మలు వ్యాపించలేదు. ఒక కొమ్మ మాత్రం బలమైనదిగా నిలబడింది. అదే మహారాష్ట్రము. మిగిలిన కొమ్మలు అన్నియు మొదలుకే అంటుకాని కృంగి, కృశించిపోయినవి.

కావున 50 సం॥లు సంఘ స్థాపన తరువాత అయినా లేక 50సం.ల స్వాతంత్రం తరువాత అయిన గౌరవనీయులు, పెద్దలు, రాజకీయ సంపూర్ణనుభవం కలిగిన శ్రీ సుధాకర రావునాయక్‌గారి అధ్యక్షతన ఈ వటవృక్షం, దాని బలమైన కొమ్మలు శాఖోపశాఖలుగా విస్తరింపచేసి, బంజారాలను అన్ని విధాలుగా ముందుకు నడిపించగలరని ఆశించుచూ వారి ఆజ్ఞలను శిరశావహిస్తానని వాగ్దానం చేస్తున్నాను.

తమరు ఇప్పటివరకు ఒక మహారాష్ట్ర ప్రాంత ప్రజలకు గౌరవనీయులు, తమ అధ్యక్షతన రాష్ట్రసంఘాలు, జిల్లా, తాలుకా సంఘాలవరకు వ్యాపించి, బంజారా లిపి ద్వారా బంజారా భాషను అభివృద్ధి చేయగలిగిన తమ నామము అఖిల భారత చరిత్రలోనే కాకుండ అఖిల ప్రపంచ చరిత్రలోనే సువర్ణాక్షరాలతో లిఖింపబడగలదని ఆశించుతాను. దీని వలన అఖిల భారత బంజారాలకే కాకుండ అఖిల ప్రపంచ రోమా బంజారాల భవిష్యత్తుకు రాచబాట కాగలదని ఆశించుతాము.

ఈ దేశంలో సుమారు 5నుండి 6 కోట్లుపైబడి ఉన్న బంజారాలు మరియు యూరప్ మరియు ఇతర ఆసియా ఖండములలోని 60 దేశాలలో సుమారు 3కోట్ల రోమా బంజారాలు ఉన్నారని తెలియబడుచున్నది. వీరందరు కలసి ఒక దేశంగా ఏర్పడాలనే భావనతో ఉన్నారని గమనించ తగిన విషయం. భారత దేశంలోని బంజారాలు ఒక స్వంత రాష్ట్రమునకు అర్హులు, భాషా రాష్ట్రమునకు ఉన్న గుణమలన్నియు వీరికి ఉన్నవి. కానీ వీరి కంటు ఒక ''లిపి'' లేదు. బంజారాల జన సంఖ్యను గ్రహించిన క్రైస్తవ మతస్తులు, బంజారా భాషకు దేవనాగిరి లిపిని ప్రవేశ పెట్టి దాని ద్వారా బైబిలు, క్యాలెండర్లులతో వాటి వాక్యములను ముద్రించి, బంజారా తాండాలలో స్కూల్లు స్థాపించి, వారికి బంజారా భాషను నేర్పించి వాటి ద్వారా బైబిలు వాక్యములను బోదిస్తూ ఆంధ్రదేశంలో కొన్ని జిల్లాలలోని బంజారాలను క్రైస్తవులుగా మార్చి వేస్తున్నారు. ఒక మతం మార్పిడిని దృష్టిలో పెట్టుకొని వారు ఇన్ని రకాలుగా బంజారాలుకు తోడ్పడుచుండగా, భారతప్రభుత్వం ఏమి చేయుచున్నది? 50 సంవత్సరముల స్వాతంత్ర్యం పూర్తిగావస్తున్నను వీరి భాషలో విద్యను ఎందుకు ప్రారంభించుట లేదు. ఇది అంతయు ఒక బంజారా జాతిలో పుట్టి పెరిగిన నాయకులు చేయవలసినదే తప్ప, వేరే ఎవరికి ఇది అవసరంలేదు. కావున శ్రీ సుధాకర రావు నాయక్‌గారి నాయకత్వంలో ఈ కార్య క్రమము భారత ప్రభుత్వంతో సంప్రదించి తప్పకుండా ఏర్పాట్లు చేయవలసినదిగా ప్రార్థించుచున్నాను..

9వ పంచవర్ష ప్రణాళికలో 40, 000 కోట్ల రూ. నిరక్షరాస్య నిర్మూలనకు ఖర్చు చేస్తారని, మానవనరుల కేంద్ర మంత్రి శ్రీ. యస్. ఆర్. బొమ్మాయిగారు ప్రకటించిఉన్నారు. ఈ బంజారాల విద్యాభివృద్ధికి, బంజారా భాషలో దేవనాగరి లిపితో బైబిల్ సొసైటివారు తయారు చేసిన లిపి ద్వారానే, బోధనా కార్యక్రమములు సాగించవలయును. ఇది చాలా సులభముగాను, అతి త్వరలో ప్రజలు నేర్చుకొనే విధంగా ఉన్నది. బంజారాల జనభాను బట్టి,

వారికి రావలసిన విద్యా ధనముతోనే ఈ కార్యక్రమం చేపట్టవలయును. 9వ ప్రణాళికలో కేటాయించ బోయే రూ. 40,000 కోట్లు రూపాయలలో 1/16వంతు అనగా (బంజారా జనసంఖ్యను బట్టి) రూ. 2500 కోట్లు వీరి అభివృద్ధికి కేటాయించవలయును, దీనికై బంజారా కేంద్ర యూనివర్‌సిటీని స్థాపించవలయును, దీనికి సరియైన స్థలం హైద్రాబాద్. ఎందుకనగా మధ్య భారత్ తెలంగాణా, రాయలసీమ, ఉత్తర కర్ణాటకా, మరాట్‌వాడా, మరియు విదర్భ ప్రాంతాలలోని బంజారాల జనసంఖ్య, మొత్తం భారత్‌లోని బంజారాల జనసంఖ్య 50% పైబడి ఉన్నది. కేంద్ర యునివర్ సిటి ఆధారంగా ప్రతి రాష్ట్రంలోను ఒక బంజారా యునివర్‌సిటీని స్థాపించవలయును. ఇది జరిగిన నాడు బంజారాలు అతి కొద్ది కాలంలోనే అభివృద్ధి చెందగలరు.

అఖిల భారత బంజారా సేవా సంఘ పెద్దలు మాత్రం ఒక మహారాష్ట్రమునకు చెందినవారై, అది కూడ అకోలా జిల్లా, ఓత్‌మాల్ జిల్లాల బార్డర్ అయిన డిగ్రెస్ తాలుకాకు మాత్రం వర్తించుతుంది. దీని ప్రథమ అధ్యక్షులు అనుకొంటాను. శ్రీ ప్రతాప్‌సింగ్ ఆడే, ప్రధాన కార్యదర్శి శ్రీ రాంసింగ్ భాణావత్‌జీ గారు. ఇతర సభులు శ్రీ బాబాసాహెబ్ రాజుసింగ్ నాయక్(తండ్రి) గారు, ఆత్మారాం అమర్‌సింగ్ రాథోడ్, వసరాంపటేల్, శ్రీ ఉత్తంరావు రాథోడ్, మూడేగురుజీ, శ్రీ హర్జి విశ్రాంరాథోడ్, చంద్రాంమ్ చౌహన్(గురుజీ) సోలాపూర్, బొంబాయిలోనే ఉన్న శ్రీ పి, రంజిత్‌నాయక్ బి. ఆర్క్‌గారు శ్రీ కె. టిరాథోడ్‌గారు మరియు శ్రీ. ఎల్. ఆర్ నాయక్‌గారు.

పై వారందరి తోను నాకు అఖిల భారత కాంగ్రెస్ మీటింగ్ హైద్రాబాదులో ఇందిరా గాంధి గారి అధ్యక్షతన(ప్రధాన మంత్రి) జరిగిననప్పుడు 1967లో పంచశిలా హోటల్‌లో బంజారాల అఖిల భారత స్టడీ టీమ్ మీటింగ్ జరిగినది. అప్పటినుండి పరిచయం ఏర్పడినది.

వీరి ఉద్దేశం మొత్తం భారత్ లోని బంజారాలు ఒకే భాషా, ఒకే ఆచార విచారములు, ఒకే రకమైన వేషధారణ(డ్రస్సు) కలిగిఉండి. రాజకీయంగాను, విద్యా రంగాలలోను, ఆర్థికంగాను అన్ని వర్గాల కన్నా చాలా వెనుబడిఉన్నందున, వీరందరిని కూడా గిరిజనులు జాబీతాలలో తీసుకొని రావలయునని కీ.శే. శ్రీ వసంతరావు ఫూల్‌సింగ్ నాయక్‌గారి ప్రోత్సాహంతో ఏర్పాటు చేసినారు. పార్లమెంటులో ఈ బిల్లును రానీయకుండా అప్పటి రాజకీయ నాయకులు అడ్డుపడినారు. అందువలన అది పార్లమెంట్ విచారణలోను రాలేదు. శ్రీమతి ఇందిరాగాంధి ప్రధానమంత్రిగారు ఈ బిల్లును పార్లమెంట్‌లో పెట్టుటకు ప్రయత్నించినను, స్వార్థపూరిత రాజకీయ నాయకులు దీనిని రాకుండా చేసారు.

కాని నా వాదన అదికాదు. మనం భారత దేశంలో 1/16 వంతు జనాభాకన్న ఎక్కువగా ఉన్నాము, మన వాటా మనకు ఇచ్చినను, ఒక పెద్ద రాష్ట్ర బడ్జెటుకు మించిన ధనం లభించగలదు. మనం ఎవరి ఆస్తిపాస్తులను అడగటంలేదు. అన్ని ప్రభుత్వ శాఖలలో కేటాయించే డబ్బునే మనజన సంఖ్య ఆధారంగా ఖర్చు పెట్టివున్న ఇప్పటికి ఎంతో అభివృద్ధి చెందిఉండేవారం. దీని కంతటికి మూల కారణం అవిద్యా! సొంత భాషలో ఒకరి భావములను మరయొకరికి తెలుపకపోవడం, దీనికి సొంత ''లిపి'' లేక పోవటం మాత్రమే, విద్యావంతుడు ఏదో ఒక విధంగా తన హక్కును(వాటాను) తాను సాధించుకోగలడు. అవిద్యావంతుడు ఎలా సాధించుకోగలడు?

# అభివృద్ధి:

నేను 1972-73 సంవత్సరములో ఆంధ్రప్రదేశ్ బంజారా విద్యావంతుల సమాజ్ తరపున 45 రోజులు మహారాష్ట్రము, మైసూరు రాష్ట్రములు పర్యటించి అక్కటి బంజారాల అభివృద్ధిని పరిశీలించడం జరిగినది.

మహారాష్ట్ర బంజారాలు శ్రీ వి.పి. నాయక్ ముఖ్యమంత్రిగారి ఆశీర్వాదములవలన ప్రతి ఒక్కరు విద్యాభివృద్ధికి ముందుగా కృషిచేసినారు. గొప్ప గొప్ప సంస్థలను స్థాపించినారు.

శ్రీ ప్రతాప్‌సింగ్ ఆడే(అధ్యక్షులు) గారు 31 సంస్థలను స్థాపించారు. అనగా ఆర్థిక సాంఘిక, విద్యా రంగాలలో, సమిష్టి వ్యవసాయ సంఘాలు 1200 ఎకరములలో, స్త్రీ శిశు సంక్షేమ సంఘాలు, బాలీవాడీలు, ఆశ్రమ పాఠశాలలు, హైస్కూలు, కో. ఆపరేటు సొసైటీలు, కాలేజీలు, మరి ఎన్నో స్థాపించారు.

శ్రీ చంద్రాం చౌహాన్(గురుజీ) గారు సొలాపూర్ జిల్లా కేంద్రములో మన ప్రథమ ప్రధాని శ్రీ జవహరలాల్ నెహ్రూ గారి పేర ఒక ఆదర్శ గ్రామమును స్థాపించి, దాని ద్వారా అన్ని రకాల విద్యా సంస్థలు, అనగా బాల్‌వాడీలు, ఆశ్రమ పాఠశాలలు, హైస్కూలు, టీచర్ ట్రైనింగ్ స్కూలు, వ్యవసాయ క్షేత్రములు, పండ్లతోటలు, డైరీలు, కూరగాయలు మొదలుగునవి సమస్తము కోట్ల రూపాయల ఖర్చుతో వెలిసాయి.

ధులియా జిల్లా కేంద్రం నుండి సొంత తాండావరకు శ్రీ అసరాంజాదవ్‌గారు బాల్‌వాడీలు, ఆశ్రమ పాఠశాలలు, హైస్కూళ్లు, జిల్లా కేంద్రంలో హైస్కూళ్లు, హస్టళ్లు స్థాపించి ఎంతో అభివృద్ధిని సాధించారు.

ఆకోలా జిల్లాలో శ్రీ ఆత్మారాం రాథోడ్‌గారు నాయక్‌గారి పేర విద్యా సంస్థలు స్థాపించారు ఓత్ మాల్ జిల్లాలో శ్రీ. వి.పి.నాయక్‌గారి సొంత జిల్లలో శ్రీ ప్రతాప్‌సింగ్ ఆడేగారు, శ్రీ భోపిదాస్ రాథోడ్, (శ్రీ వి.పి.నాయక్‌గారి చెల్లెలి కుమారుడు). వీరు భార్యభర్తలు ఇద్దరు చాలా విద్య సంస్థలు స్థాపించారు. శ్రీ కె.డి. జ్యాదవ్‌గారు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులుగా ఉండినాయక్‌గారి పేర చాలా విద్యా సంస్థలు స్థాపించారు. అక్కడే పూసద్‌నందు వి.పి.నాయక్‌గారి సొంత తాలూకా నందు పూల్‌సింగ్ కాలేజీ స్థాపించి చాలా అభివృద్ధి పరిచారు. నాందేడ్ జిల్లా కేంద్రంలో శ్రీ చౌహాన్‌గారు చాలా విద్యా సంస్థలు స్థాపించారు. పరభాని జిల్లాల్లోని శ్రీ భోజాజి రామరావు రాథోడ్‌గారు చాలా విద్యాలయాలు స్థాపించారు. ఔరంగబాద్ జిల్లా కేంద్రములో శ్రీ రాజరాం రాథోడ్‌గారు యం.ఏ.(పాల్‌టెక్స్) యం.ఏ(చరిత్ర) వీరు శ్రీ వసంతరావు నాయక్ మహా విశ్వవిద్యాలయాన్ని స్థాపించారు. వీరికి హౌసింగ్ కాలనీలు, ఇతర విద్యా సంస్థలు చాలా ఉన్నవి. మహరాష్ట్ర మొత్తాంలో బంజారాలు, సంఘ స్థాపన చేసి చాలా అభివృద్ధి చెందినారు. రాజకీయంగా కూడా చాలా ముందుకున్నారు.

ఇక కర్ణాటకకు వస్తే శ్రీ కె.టి. రాథోడ్‌గారు బిజాపూర్ జిల్లా కేంద్రంలో కొన్ని హస్టల్లు స్థాపించి శ్రీ యల్.యల్ రాథోడ్‌గారి నిర్వహణలో ఉంచి రాజకీయలలో దిగినారు.

ఈ తరువాత చిత్రదుర్గ, మైసూరు రాజ్యంలో ఉన్నప్పటినుంచి శ్రీ కీ.శే జాతరనాయక్‌గారు బంజారాల కొరకు స్థాపించిన బాలుర, బాలికల హాస్టలు, మాత్రం ఉన్నది. అంతేతప్ప మరి ఏ అభివృద్ధి కనిపించలేదు.

శ్రీ రంజిత్‌నాయక్‌గారు ఆంధ్రప్రదేశ్‌కు చెందిన వారు బొంబాయిలోనే ఆర్కిటెక్చర్‌గా పనిప్రారంభించారు. శ్రీ వసంతరావునాయక్ గారి ప్రోత్సాహంతో అఖిల భారత బంజారా సేవ సంఘంలో ప్రథమ పాత్రనువహించారు. తను సంపాదించిన ధనమును ధారపోశారు. కాని అతని ద్వారా ఆంధ్రప్రదేశ్‌లో ఏ విద్యా సంస్థలు, స్థాపించబడలేదు. తన ద్వారా మరి ఎవరినిప్రోత్సాహించనులేదు.

ఆంధ్రప్రదేశ్‌లో నా ఆధ్వర్యంలో 1973లో అఖిల భారత బంజారా సేవా సంఘ బ్రాంచిని స్థాపించడమైనది. ఇది ఇక్కడ శ్రీరంజిత్‌నాయక్‌గారు ఇది వరకూ మేము స్థాపించిన విద్యావంతుల సమాజ్ అనుపేరు సరిగా లేదని అని చెప్పినపుడు, పై పేరు ఉదహరించినపుడు ఆ పేరు పెట్టగలిగాము. కాని అఖిల భారత బంజారా సేవా సంఘంవారు ఏ విధమైన సహకారం అందించలేదు. ఈ సంఘం ఆధ్వర్యంలో 1973లో తెలుగులో ఒక పక్ష పత్రిక ''బంజారా'' విడుదల చేసి కొద్ది సంవత్సరాల తరువాత ఆర్థిక ఇబ్బందులవలన నిలిపి వేయడం జరిగినది.

నాకు తెలసినంత వరకు బంజారా రాజకీయ నాయకులు, బంజారా పేరుతోవారు అభివృద్ధి చెందుటకో లేక రాజకీయ లాభాలు పొందుటకు చూస్తున్నవారే ఎక్కువ మందిఉన్నారు. కానీ బంజారాలను అభివృద్ధి పరచుటకుకాదు. వారి పేరుతో వీరు గొప్పవారు కావలయునని ప్రయత్నించు చున్నారు. ఈ ఉద్దేశం ఉన్నంత వరకు ఈ బంజారాలు అభివృద్ధి చెందరు.

ఒక గొప్ప రాజకీయ చైతన్యం పొందిన మహారాష్ట్రమునకు ముఖ్యమంత్రిగాను, ఒక రాష్ట్రమునకు గవర్నర్‌గాను మంచి రాజకీయ అనుభవం కలిగిన శ్రీ సుధాకరరావుగారు మంచి ఆశయంతో బంజారా సమాజమునకు ప్రథమ వ్యక్తిగా గౌరవించి గుర్తించబడటం మన బంజారా జాతికే ఒక గర్వకారణం. వారి అడగు జాడలలో నడవటంకన్నా మనకు , మరియొక మార్గంలేదు. వారి నాయకత్వంలో బంజారా ''లిపి'' ద్వారా విద్యాభివృద్ధి, ఆర్థికాభివృద్ధి, రాజకీయ చైతన్యం కలిగి, అఖిల భారత బంజారాలే కాకుండ ప్రపంచ వ్యాపితమైన రోమా బంజారాలు కూడ అభివృద్ధి చెందగలరని ప్రార్థించుచున్నాను.

'' జై బంజారా, జై జై బంజారా''

ఇట్లు
తమ విధేయులు
బి. చీనియా నాయక్



స్వాతంత్ర దినోత్సవ వేడుకలలో పాల్గొన్న బంజారా నృత్య బృందముతో మన ప్రియతమ ప్రధానమంత్రి ఇందిరాగాంధి

కేంద్ర మానవ వనరుల శాఖామాత్యులు
శ్రీ బొమ్మయ్‌గారికి సమర్పించిన వినతి పత్రం

**All India Banjara Seva Sangh, Andhra Pradesh Branch**
Regd No. 78/1947

Office : H.No. 11/339 A, Aravinda Nagar, Anantapur - 515 001

**President : Ranjit Naik** B.ARCH, A.I.I.A **Vice President : G Swamy**
**General Secretary : B. Cheeniya Naik**
**Joint Secretary : B. K. Satyam** B.A. L.LB. **Treasurer : Meghanath Chowhan**

**Regd. Post With Ack. Due**

Date : 8-09-1997

To
**Sri S. R. Bommai garu,**
Hon'ble Minister for Human Resources Department,
Government of India,
NEW DELHI

Sir,

Sub : Banjaras (Lamani - Lambadi, Sugali etc.) living in all States of Indian Territory -Removing illiteracy to 90 to 95% in this community in 9th Five Year Plan - Reg..

Ref : 1) Your Newspaper statement Regarding earmarking of Rs. 40,000 crores for removing illiteracy in 9th Five Year Plan "Eenadu" Telugu daily dated 29-3-97.

2) Your paper statement - Allotment of Rs. 50,000/- crores for eradicating illiteracy published in the same daily dated 27-8-1997.

In this connection, I would like to inform the Hone'ble Minister that the Banjaras are called by 44 different names such as Banjaras, Lamani-Lambadi, Sugali etc., They are all only one. They are living in all Indian States. Amounting nearly 5 to 6 crores in this Indian population. This is one fifteen (1/15) Indian population. These 5 to 6 crores population is living in Thandas faraway from cities, Towns and villages, nearly 100 to 500 families in each

Thanda. The smallest Thanda is constitute not less than 50 families and the big one with more than 1,000 families. They speak purely Banjara Language. Almost all are illiterates. Illiterates in upto 90 to 95% in this community. Only 5-10% are educated. This is the fate of illiteracy among Banjaras even after 50 years of Independent India. For example in Andhra Pradesh Anantapur district having 500 Thanda list enclosed.

Banjaras know all the local languages in their respective states and speak Banjara language throughout India. This is the only community in our India. Who speak all the state languages and when they unite speak one language. They speak Northern languages, it is sub-language of Rajasthani and Gujarathi, which are in Devanagari script, and very close to Hindi.

To remove illiteracy from this community Banjara language must be recognised & should be included in eight schedule of Indian constitution. There should be special programme for the Development of this language and removing illiteracy among the Banjaras.

We request that we do not need any special grant for this. Accordingly on the basis of population statistics, Banjaras constitute 5 to 6 crores. One fifteenth of the total amount Rs. 40,000/- to 50,000/- crores earmarked for eradicating illiteracy in 9th Five Year Plan is Rs. 2,666 to 3, 335 crores, If this is done illiteracy will be totally removed from this community by the end of 9th Five Year Plan.

If it is not done, it will not be possible to us to remove illiteracy from Indian population. Because 1/15th share of the population will remain still illiterates. The 9th Five Year Plan will not be a successful one, If we ignore the above aspects.

To make the programme a successful one I suggest the following important points.

1. At National level a separate division of All India Radio should be started in Banjara language.
2. To start a field publicity department in Banjara language.
3. To start all India T.V. Channel for Banjaras.
4. To start an university at national level as well as state level.
5. To start teacher training institutions for Banjara Educated.

6. Teachers should be appointed to Banjara Thandas from among Banjara only. So that they can teach in their mother tongue as well as state and national languages. And also night school for Banjara Adults.

7. I suggest that, for easy and speedy implementation of the above programmes and promotion of Banjara language, "Barathi script" written and developed by Dr. Ananthi Jebasingh titled " Script for tribal languages for the promotion of illiteracy".

The Christian missionaries are trying to educate Banjaras in their Mother Tongue in Bharathi script developed by Dr. Ananthi Jebasingh. They have published yearly calender with Biblical slogans on them, They have also published the Bible in Banjara language and coming closer to their hearts to convert the Banjaras into Christianity. It is not bad thing, But in political point of view it is very dangerous to the country in future. Because past history shows the real historical evidence, for this cause only Banjaras are behind 1,000 years (one thousand years).

The Hon'ble Minister may please go through all the points and implements this in the forth coming Five Year P'an. So that, the Banjaras of India will be great full to you sir. If you consider our cause in the implementation of 9th Five Year Plan.

Thanking you sir

Yours faithfully

**(B. CHEENIYA NAIK)**

Gen. Sect. AIBSS A.P.Branch

**Copy to :**

The Editor, Banjara Kesari, Kannada weekly, Bangalore.

The Editor, Eenadu Telugu daily Newspaper, Anantapur.

The Editor Vartha Telugu daily Newspaper,
D.No.8/2325-B, Almostpeta, Cuddapah - 516 001.

The Editor Hindu, English daily Newspaper,
859-860, Annasalai, Madras - 600 002.

The Editor Sathi Banjara, Marati weekly Jalagam, Maharastra.

Copy Submitted to Hon'ble Former Prime Minister of India Sri Atal Bihari Vajpayee, requesting him to take an appropriate steps to implement the Banjara illiteracy programme so as to restore the procces of convertion.

## All India Banjara Seva Sangh, Andhra Pradesh Branch

Regd. No. 78/1947

## No of Thandas in each Mandal and Assembly Constituency.
## Hindupur Parliamentary & Assembly Constituency

| Sl of No. | Name of Mandal Assembly | | Constituency | No. Thandas |
|---|---|---|---|---|
| 1. | 1. | KADIRI | KADIRI Const. | 45 No.s |
| | 2. | Talapula | " | 18 " |
| | 3. | N.P.Kunta | " | 17 " |
| | 4. | Mudigubba | " | 20 " |
| | 5. | Gandlapenta | " | 16 " |
| | | **Total** | **116 Thandas** | |
| 2. | 6. | Nallamada | Nallamada Const. | 33 " |
| | 7. | Amadagooru | " | 8 " |
| | 8. | Tanakalu | " | 31 " |
| | 9. | Nallacheruvu | " | 5 " |
| | 10. | O.D.Cheruvu | " | 10 " |
| | | **Total** | **87 Thandas** | |
| 3. | 11. | Gorentala | Gorentala Const. | 31 " |
| | 12. | Kothachervu | " | 4 " |
| | 13. | Puttaparthi | " | 13 " |
| | 14. | Bukkapatnam | " | 14 " |
| | | **Total** | **62 Thandas** | |
| 4. | 15. | Hindupur | Hindupur Const. | 3 " |
| | 16. | Lepakshi | " | Nil |
| | 17. | Parigi | " | Nil |
| | 18. | Chilamattur | " | 4 " |
| | | **Total** | **7 Thandas** | |
| 5. | 19. | Madakasira | Madakasira Const. | 5 " |
| | 20. | Amarapuram | " | 1 " |
| | 21. | Gudibanda | " | 2 " |
| | 22. | Rolla | " | 9 " |
| | 23. | Hagali | " | 5 " |
| | | **Total** | **22 Thandas** | |
| | 24. | Penukonda | Penukonda Const. | 12 " |
| | 25. | Somandepalli | " | 1 " |
| | 26. | Roddam | " | 1 " |
| | 27. | Chennekothapalli | " | 8 " |
| | 28. | Kanaganapalli | " | 2 " |
| | 29. | Ramagiri | " | 3 " |
| | | **Total** | **27 Thandas** | |
| 7. | 30. | Dharmavaram | Dharmavaram Const. | 12 " |
| | 31. | Tadimarri | " | 2 " |
| | 32. | Battalapalli | " | 5 " |
| | | **Total** | **19 Thandas** | |

**Hindupur Parliamentary Constituency Total No. of Thandas 340 No.s**

## No. of Thandas in each Mandal and Assembly Constituency.
## Anantapur Parliamentary & Assembly Constituency

| Sl of No. | Name of Mandal Assembly | | Constituency | No. Thandas |
|---|---|---|---|---|
| 8. | 33. | Kalyanadurgam | Kalyanadurgam Const. | 12 " |
| | 34. | Kambadur | " | 5 " |
| | 35. | Belaguppa, | " | 2 " |
| | 36. | Kundurpi | " | 4 " |
| | 37. | Bramhasamudram | " | 2 " |
| | 38. | Settur | " | Nil |
| | | **Total** | **25 Thandas** | |
| 9. | 39. | Rayadurgam | Rayadurgam Const. | 5 " |
| | 40. | D. Hirehall | " | 1 " |
| | 41. | Gummagatta | " | 3 " |
| | 42. | Kanekal | " | 1 " |
| | 43. | Bommanahalli | " | 1 " |
| | | **Total** | **11 Thandas** | |
| 10. | 44. | Uravakonda | Uravakonda Const. | 10 " |
| | 45. | Vajrakarur | " | 18 " |
| | 46. | Vidapanakal | " | Nil |
| | | **Total** | **28Thandas** | |
| 11. | 47. | Gooty | Gooty Const. | 5 " |
| | 48. | Guntkal | " | 13 " |
| | 49. | Pamidi | " | 5 " |
| | | **Total** | **23 Thandas** | |
| 12. | 50. | Anantapur | Anantapur Const. | 5 " |
| | 51. | Rapthadu | " | 4 " |
| | 52. | Atmakur | " | 9 " |
| | 53. | Kuderu | " | 6 " |
| | | **Total** | **24Thandas** | |
| 13. | 54. | Singanamala | Singanamala Const. | 1 " |
| | 55. | Bukkarayasamudram | " | 4 " |
| | 56. | Peddavadagooru | " | 5 " |
| | 57. | Narpala | " | 1 " |
| | 58. | Garladinna | " | 5 " |
| | | **Total** | **16Thandas** | |
| 14. | 59. | Tadipatri | Tadipatri Const. | 4 " |
| | 60. | Yadiki | " | 4 " |
| | 61. | Peddapappoor | " | 1 " |
| | 62. | Putlore | " | Nil |
| | 63. | Yellanoor | " | Nil |
| | | **Total** | **9 Thandas** | |

**Anantapur Parliamentary Constituency Total No. of Thandas: 137**

# బంజారాల సామెతలు వాటి వివరణ

సామెతలు అన్ని చిరకాలంగా వస్తున్న కొన్ని వాక్యములు. ఆ వాక్యములు సామాన్యంగా వచ్చినవి కావు. అవి అనుభవపూర్వకంగా, వాస్తవమును తెలియపరచేవిగా ఉంటున్నవి. వీటినిప్రయోగించటంవలన భాష యొక్క సుందరత, సజీవత మరియు ఆకర్షణకూడ వృద్ధిచెందుతుంది. దీనియొక్క రెండవ విశేషం ఏమంటే ఈ భాష ఎంత ప్రాచీనమైనది అని అర్థమౌతుంది. అందువలన అదిఅతి సులభంగా తనయొక్క స్థానమును నిలబెట్టుకొంటుంది.

బంజారా ప్రజల యొక్క వచన చాతుర్యము యొక్క మార్గం వీరియొక్క దైనందిన వ్యవహారములవలన కాకుండ వారు అప్పుడప్పుడు చెప్పుకొనే సామెతలపైకూడ ఆధారపడి ఉంటుంది. వీరు పర్యాటక రూపంలో వ్యాపారమునకై తిరుగాడు కాలంలో, వారి వృత్తి ధర్మములను నేరవేర్చుతూ తమ భాషపై ఒక గొప్ప ప్రభావమును కలిగిఉన్నారు. అందువలన వారు గడించిన జ్ఞానమువలన వారు కొన్ని సామెతలను చెప్పకొంటు వచ్చారు. అవి తమ నిజజీవితంలో చక్కగా అనువదించునట్లు ఉన్నవి.

దేశ, కాలమును బట్టి, జీవితంలోని వివిధ సందర్భములను, వాటియొక్క విశేషములను ఇందులో పొందుపరచటం జరిగినది. ఇవి శాశ్వతమైన సత్యమును చాటి చెప్పుచున్నవి.

## బంజారా సామెతల వర్గీకరణ :

బంజారాల సామెతలు చాలా వ్యాప్తిచెందినవి, జీవితంలోని ప్రతి విషయము ప్రతిబింబించునట్లుగా ఇవి చెప్పబడినవి. బంజారాల పరివార సంబంధము, సమాజ సంబంధమైన, ఆర్థిక సంబంధమైన మరియు సాంస్కృతికి సంబంధమైన విషయములను వాటిమలో గోచరిస్తుంది. పూర్వం వీనియొక్క ముఖ్యవృత్తి బిడారి వ్యాపారం ఆగుటవలన వీరు స్పష్టముగా వర్గీకరించుటకు వీలుపడుదు. వీటిని అధ్యాయనం చేయువలయునన్న వీటిని ఈ క్రింది విధంగా విడదీయవచ్చును.

1. జయమునకు సంబంధంచినవి
2. నీతి సంబంధమైనవి
3. ప్రకృతి మరియు అభివృద్ధికి సంబంధించినవి
4. పశుపక్షాదుల గూర్చి.

**1. విజయమునకు సంబంధించినవి :** ఈ సామెతలలో ఎవరికైన విజయంయొక్క విశేషమున్నవారి ఆచారం, విచారం, పలుకులు, వ్యవహారములు, వారి మంచి, చెడ్డలు, గూర్చి సరియైన పద్ధతిలో వర్ణన చేయటం జరుగుతుంది. కొన్ని సామెతలు, బంజారా సామాజమునకు మాత్రమే అనుకరిస్తాయి.

1) పియే మంద్, హోగయే బంద్ !
ఆంగేర్ మాటిన్ మలగి సంద్ !

ఇది మద్యపానం గూర్చిన సామెత మందుతాగాడు, బంద్ అయి పోయాడు, ముందు పోయే మనిషికి, మంచి వాటం దొరికింది. అని దీని అర్థము.

వీడు తాగిన మత్తులో పడిపోయాడు. వండిన వంటలన్నియు తాగనివాడు భోంచేయటానికి మంచి వాటం దొరికింది అని చెప్పటం.

వీరు స్వతంత్రులగుటవలన, వీరి భోజన వసతులలో కూడ స్వతంత్రంగా ప్రవర్తించుతారు. రాజపుత్ర వంశీయులగుటవలన వీరు ఎల్లప్పుడు మృష్టాన్న భోజనమును కోరుతారు. మరియు విజయంలో కూడ అందరికన్న గొప్పవాడు అనిపించుకొనవలయునను గర్వం కలిగిఉంటారు.

2) గోరమాటి ఖా బాటి!
హతేమా ల కాటీ!
ఈ సామెతను చేత కాని వాని గూర్చి చెప్పే సందర్భంలో వాడుతారు.
(బంజారా ఒక చేతితో రొట్టెను తింటూ, రెండవ చేతితో కల్లుముంత లేదా మద్యం)

3) ఖాడూ భాయిరో హుశియా! ఖేత్ భాయిరో బసియా!
మళాయే మాయీ రో నాసియా!

(ఆవులపై వదిలిన గూలి ఎద్దు! పొలంలో వేసియున్న పంటమేస్తుంది మరియు పంచాయితీ కూర్చునప్పుడు; సిగ్గులేనివారిలా ప్రవర్తించటం, ఏదైన మాట మాట్లాడినపుడు అది నిజంకానపుడు పైసాయెతాను చెపుతారు.)

4) ఛోరిన్ ఘోడేర్ హుంస్! తాండరీన్ ఘుంగటేర్ హుఃస్
మాటీన్ వాతేర్ హుఃస్! వేళ ఆవగి కతో కట్ జార్ తార్ ఫూంచ్!

(అమ్మాయికి గుర్రింది ఇష్టం, స్త్రీకి(ఘుంగట్) అనగా తల పై అద్దాలతో అలంకరించబడినది ఇష్టం; పురుషునికి మాటలు ఇష్టం, సమయం వచ్చినపుడు తెగిపోతుంది కాలి నరం.)

ఇంటిలో మనుషులు, ఎప్పుడైతే ఇంటి పెద్దను కష్టపెడతారో వారి కోరికలగూర్చి అడుగుతారో అప్పుడు ఈ సామెత ఉపయోగిస్తారు.

5) పామణో పామణో చోర్ మార్ కతో ఘరేర్
గావడీన్ మారన్ టాంగ్‌తోడ నాకోతో కచ!

(దొంగను, కొట్టిరా బంధువు అంటే, ఇంటి ఆవు కాలు విరగ కొట్టాడట) పామణ్- అతిథి)

ఏదైన ఆకర్షవంతమైన వాటిపై డబ్బు ఖర్చు పెట్టిన ఈ సామెతను చెప్పుకొంటారు.

6) కూ కసగి బాయీ, కతో మ తారో ఝూలర్ మల్లర్ దేఖ కర్ పైస్ గయీ!

(నీవు ఎలామోసపోయావు అక్క అంటే నీ పై మెరగులు చూచి ఇట్లా ఇరు కొన్నాను)

సుఖమును అనుభవించే రోజులు వచ్చేటప్పుడే, కష్టాలను దగ్గర రానియకుండా చూడవలయును, అలా కాకుండ తెలిసి కూడ కష్టమును తెచ్చు కొన్నప్పుడు ఈ సామెతను చెప్పుకొంటారు.

7) ఆ ఛోఖాదో, ఆచో పీదో, ఆదో ఆమదన!
వోదాడ్ కోసన్ కోనిగో, అబతో జాణ!
దీపావళి బాగా చేసుకొన్నావు– ఇప్పుడు హోలి చెయ్యి
(పని తక్కువ ఆయాసం ఎక్కువ అన్నట్లు) అతి తక్కువగా ఉండి ఎక్కువ హోదా ఉండి చేసినపుడు ఈ సామెత చెపుతారు.

8) భాయీ భాయీ కేన్ హేట్ టాంగే, ఖందంలేన్ ఆ యోచి తూ !
(అనవసరంగా లేనిపోనిది చేసి ఉట్టి చేతులతో ఖాళీగా వచ్చుట)
పూర్వం నుంచి వస్తున్న ఆచారములను వీడి, క్రొత్తగా చేపట్టిన వాటిని గూర్చి చెప్పినపుడు ఈ సామెత చెపుతారు.

9) అరకడి, తరకడి జాత్ పురాన్!
అపణ కూ పండబలే కురాన్!
(అట్లాది, ఇట్లాది జాతి పాతది, తమరు పొర్లుతూ ఖురాన్ ఎలా పటనం చేస్తారు) ఈ వర్గంలోని ఇతరములైన కొన్ని సామెతలు గుత్తముగా ఉన్నవి.) అనగా వ్రాయుటకు వీలుకానివి.

10) కాళ కాబర్ బకరా కాటూం ! మాల్ కాందే పర్, తార్ వాసు మ బోటో చుంరే!
ఒకేసారి మేక పోతును హలాల్ చేయనా! లేక ఒకేసారి తోలు ఒలచనా– అని నీ కొర్కై నేను విధి లేక కూర్చొని ఉన్నాను.

11) రాం రాం తూ ఆయో! తారో సోబతేరో కిమగో!
రామ్ రామా నీవు వచ్చావు నీ వెంట ఉన్నవాడు ఎక్కువ పోయాడు.

12) దమ్ దమ్ నాచరీ! కుణి డంగే సమబన్‌దీ!
ఆడవాళ్లు అక్కడ డ్యాన్సు చేస్తుంటే! నన్ను ఎక్కడ తీసుకొని పోతున్నారు.

**2.** నీతి సంబంధమైనవి : బంజారా సమాజములో ప్రజా సాహిత్యంలో, జ్ఞాన భోదన మరియు నీతికి సంబంధించినవి సామెతలు చాలా ఎక్కువగా ఉన్నవి. సమస్తలోకములోని జీవిత సారాంశము అందులో లభించుతాయి. పాపము ఎన్నటికిని దాగదు. మరియు సత్యం ఎన్నిటికైనా బయట పడుతుంది. ఈ అర్థం వచ్చే ఒక సామెత!

13) పాపేర్ బల్ బలా పాణిమా బోలో!
పాపము యొక్క బుడ బుడయను శబ్దం నీళ్లనుండే వస్తుంది.
దీని భావము ఏమనగా ఉపయోగము లేని ఈ మాటలు ఎన్ని చెప్పిన ఏమి జరుగును. దీని వల్ల ప్రయోజనం లేదు అని ఈ సామెత వలన తెలుస్తుంది.

14) మరద్ మరద్ కి జకఢి! టాంగ్ ఫోడ్ జడ వకడీ!
మనిషి, మనిషియొక్క పోరులో కాలు అనుకొని చెట్టు వేరు లేక ఊడ పట్టుకున్నారట వాస్తవమును వదిలి పెట్టి ఎంత వాదించినను, సత్యం అనే విషయం కనపడుతూనే ఉంటుంది.

15) ఛటక్ మటక్ ఆయీ! మీయా బందీ పటకాయే!
అపటి బోల్ ఎక్ ఎకాన్ లటకాయే!
చట పట అంటూ తిరుగుతుంటే, తెల్లటి రుమాలుతో నిన్ను బంధించారు. ఉండు ఇప్పుడు సమయం వచ్చింది. నేను ఒక్కొక్క దాని గూర్చి చెపుతాను.
ఎవరి ఖర్మకు, ఎవరు బాధ్యులు అను విషయం గూర్చి ఈ సామెత చెప్పబడుతుంది.

16) బావల్ మాయి మిటికీ! ఆప్ తరం- దాన్!
బాప్ ఖాగీ కి బేటా, సూంఘ్ హాత్.
కొడుకు కొట్టెను కప్పను, తండ్రి తిరంగా దాసుడు. తండ్రి నెయ్యితో తింటే, కొడుకు చేతివాసన చూచాడట.
సత్యం ఎన్నిటికి దాగదు. చేసిన చెడ్డపని యొక్క ఖర్మను తిరిగి చెల్లించవలసి ఉంటుంది. ఈ విషయంలోనే సామెతను ప్రయోగిస్తారు.

17) తోనసాబి దడదడసే దపటా! మార్‌మాత్ లపటా!
ఆవగోచ్ టైమ్, కిమ్ జావోగి బేటా!
మనిషి తన యొక్క యోగ్యతను సరియైన మార్గంలో పెట్టలేడు అందువలన ఇది నా ఖర్మ అంటాడు. ఇటువంటి సందర్భములో ఈ సామెతను ప్రయోగిస్తారు.

18) మానేన సేర్! నమానేన సవాసేరు.
ఒప్పుకొన్నావారికి నేరు, ఒప్పుకోని వారికి ఒకటింకాల్ సేరు.
అనగా బుద్ధి కొద్ది సుఖము అని సాపెత.

19) ఆనాదేర్ ఆణి కడాయీ! దీ ఆనాదేన్ హాటో మరాయి!
''మంచి గుందని అణా ఇచ్చి పని చేయించిదట, బాగులేనందుకు అదే పనిని రెండు అణాలు ఇచ్చి తీయించినదట. ఈ సామెత చేయకూడని పని చేయునపుడు ఉపయోగిస్తారు.

20) పాపీర్ మాల్‌పన్నా ఖా! ధోబీర్ మాల్ గద్దాఖా!
పాపపు సొమ్మును, ఏపనికిరాని వాడో తింటారు. చాకలి సంపాదించినది గాడిదలు తింటాయట. ఈ సామెతలను ధాన ధర్మములు చేయని పిసినారుల విషయంలో చెపుతారు.

21) కిడి సాంస, మకోడా ఫాకీమార.
చీమలు, ఎక్కడెక్కడి ఆహారమునో జమ చేస్తుంటాయి! కాని వాటిని గండు చీమలు బుక్కుతుంటాయట. అనగా ఎంతో కష్టపడి సంపాదించి పెడితే, పనిపాటు చేయని సోమారి పోతులు వాటిని తింటుంటారట. అందుకు సోమారి పోతులను చూచినపుడు ఈ సామెత వాడుతారు.

22) తప్పుడు నడతగల వారి గూర్చి చెప్పునపుడు
హేట్ గాండ్ గందారీ – దుసరేన్ శిక్‌వాడి దీనోతో కచ్!
తన తప్పును తను తెలుసుకోలేక వేరే వానికి బోధించాడట.

ఈ విధంగా సమయం సందర్భమును బట్టి ఎన్నో సామెతలు చెప్పకుంటూ ఉంటారు.

# మానవ శరీరంలోని భాగాలు – బంజారా భాషలో

1. మాతో – తల
2. చోటి – నెత్తి
3. తాళో – నొసట
4. లట్టా – వెంట్రుక
5. ఉంచేర్ బాపణి – పై రెప్ప
6. హేటేర్ బాపణి – క్రింది రెప్ప
7. ఆంకీ – కన్ను
8. డోలా – కన్ను గ్రుడ్డు
9. నాక్ – ముక్కు
10. మూండో – నోరు
11. హోట్ – పెదవి
12. జీబ్ – నాలుక
13. గాల్ – చెంప
14. దాంత్ – పళ్లు
15. జాడేర్ దాంత్ – దవడ పళ్లు
16. ముసడి – పంటి చిగురు
17. ఘోగ్ – గొంతు
18. కాగల – లోపలి నాలుక
19. దాడి – గడ్డం
20. జాబడి – దౌడ
21. నల్డ్డి – గొంతు
22. గొదడి – మెడ
23. కాందో – వీపు
24. కాంక్ – చంక
25. కనపడి – ముచ్చుల గుంత
26. పూటో – వీపు
27. పాగతి – ప్రక్క
28. జమనోపాగతి – కుడి ప్రక్క
29. డావ్పాగతి – ఎడమ ప్రక్క
30. ఛాతి – ఎద
31. హీక్ – రొమ్ము
32. పేట్ – కడుపు
33. సూంటి – బొడ్డు
34. కడ్ – నడుము
35. పూంద్ – పిర్రలు
36. భోల్డి – పురుషలింగము
37. గాండ్ – స్త్రీఅంగము
38. ఖాల్డ్డి – చర్మము
39. జాంగ్ – తొడ
40. పిండి – పిక్క భాగము.
41. గోడో – మోకాలు
42. హాత్ – చెయ్యి
43. మర్చి – మణికట్టు
44. హాతళీ – అరచెయ్యి
45. అంగుటా – బొటున వ్రేలు
46. ఆంగళి – వ్రేలు
47. ముండాగేర్ ఆంగళి – చూపుడు వ్రేలు
48. అజ్జోతేర్ ఆంగళి – మధ్య వ్రేలు
49. వీంటర్ ఆంగళి – ఉంగరపు వ్రేలు
50. చీటికి ఆంగళి – చిటికిన వ్రేలు
51. జమనోహాత్ – కుడిచెయ్యి
52. డావ్ హాత్ – ఎడమ చెయ్యి
53. కూణి – ముంజెయ్యి
54. టాంగేర్ అంగుట – కాలిబొటన వ్రేలు
55. టాంగేర్ ఆంగళి – ముందు వ్రేలు
56. టాంగ్ర్ ఆజ్జోతిర్ అంగళి – కాలిమధ్యవ్రేలు
57. టాంగ్ర్ చటకి ఆంగళి – కాలి చిటికన వ్రేలు
58. తలవా – పాదము
59. ఏడి – మెడమ
60. టాంగేర్ మర్చి – కాలిమణి కట్టు
61. హంగేర్ గాండ్ – ఆపాన భాగము
62. బచ్చి – చనులు
63. పేడూ – పొత్తికడుపు
64. డాడీర్లట్టా – గడ్డం వెంట్రుకులు
65. కాంకేర్ లట్టా – చంక వెంట్రుకులు
66. కాన్ – చెవి
67. డావ్కాన్ – ఎడము చెవి
68. జమణోకాన్ – కుడిచెవి.
69. ఘుంస్నా – ఆతులు
70. నక్ – గోరు( నక్కే – గోళ్లు)
71. ముండాగేర్ హాత్ – ముంజెయ్యి.

## 3వ అధ్యాయము

# పెద్దల జీవిత చరిత్ర

## మహాత్మాఫూల్‌సింగ్‌నాయక్



భరతవర్షంలో మహామహా సుపుత్రులు జన్మించారు. ప్రతి ఒక కష్టకాలంలో ఒక్కొక్క మహాత్ముడు జన్మిస్తాడు. ఆయా సమయాలలో ఆయా సమాజము యొక్క దుష్టకార్యములను మాన్పించుటకు భగవంతుడు ఒక్కొక్కరికి జన్మనిస్తాడు. బంజారా జాతిలో కూడ అటువంటి మహాత్ములు జన్మించారు. అటువంటి వారిలో ఒకరు ఫూల్‌సింగ్‌నాయక్ గారు. మహారాష్ట్ర రాజ్యంలో, ఓత్‌మాల్ జిల్లాలోని గౌలితాండాలో శ్రీ మహాత్మాఫూల్‌సింగ్ నాయక్‌గారు జన్మించారు. వారు ఆ తాండాకే జమిందారుగా ఉండిరి. 20వ శతాబ్దము ఆరంభములో బంజారా జాతిలో అభివృద్ధి అయినవారిలో ఇతను లెక్కించబడినవారిలో అందరికన్న చిన్నవాడుగా ఉండిరి.

ఇది ఆనాటి సమాజముయొక్క మాట ఏమనగా ఆనాడు బంజారా జాతి ''నసాబ్'' పంచాయితి, ''ఓరి ఔర్ బకరి''. ''ఓరి ఔర్ బకరి'' అనగా పంచాయితి. కూర్చున్నారంటే ముందు భోజనములకు యాటలు కోయటం, తినటం, తాగటం చేస్తుఉండిరి. బంజారా జాతిలోని సంస్కృతి, విచారణ అన్నిటికి అక్కడ ఉన్న తాండానాయకుడే ముఖ్యుడు. తాండాలోని ప్రతి ఒక సమస్యను, తాండా నాయకుడు చెప్పిన ప్రకారం, ఆ తాండాలో అమలు జరుగుచుండును. దానిని ఎవ్వరు వ్యతిరేకించకూడదు. ప్రప్రథమం ఈ విధంగా తాండా మొత్తమును ఒక్క కట్టడిలో ఉంచుటకే బాగా ఉపయోగపడినది. అయితే కాలం మారిన కొలది ఈకట్టుబాట్లు కూడ మారుతూ వచ్చినవి.

ఎప్పుడైతే తాండా నాయకత్వం మార్పుచెందుతూ వచ్చిందో వారు పంచాయితీ వ్యవస్థను కూడా తప్పుడు మార్గంలో నడిపించుట మొదలు పెట్టారు. ఇటువంటి కథలు ఈ సమాజంలో కూడ వినబడటం మొదలు పెట్టింది. ఈ పంచాయితీలోని తీర్మానం ప్రకారం, వారు వడ్డించిన దండుగ చెల్లించుటకుగాను, బీద బంజారాలు తమ వద్దయున్న మొత్తం ఆస్తిని అమ్మినా తీరక తమ పిల్లలను అమ్మవలసి వచ్చేదట.

నేను విన్న ఒక కథ ఏమనగా ఒక ఊరి చెరువు క్రింది పంట పొలాలు చాలా బాగా పండినవట. ఆ విధంగా ఏ చెరువు క్రింద కూడ అంత పంటరాదట, ఏమిటి కారణం అని ఆ ఊరివారిని అడిగారట, పూర్వం ఈ చెరువు పై భాగంలో బంజారాలు, పంచాయితీలు చేసారట,

అప్పుడు వారు తిని పారవేసిన ఎముకలు ఈ చెరువుతో నిండిపోయినవట, అంటేవారి పంచాయితి తింటూ, తాగుతూ నెలలు నెలలు చేసేవారట. అప్పటి నుండి ఈ పంట వస్తున్నదట.

ఇంకొకటి నేను శ్రీశైలంలో చూచినది ఏమనగా ఇద్దరు బంజారా ఆడవాళ్లు శ్రీశైలంలో ఉండిరి. వారు గుంటూరు జిల్లా ప్రక్కనుండి ఆడవాళ్లను పట్టుకొచ్చి సానిపని చేయిస్తూ ఉండిరి. వారు బంజారా స్త్రీలు అని తెలిసినది. ఎందుకలా చేస్తున్నారు అని అడుగగా వారు కర్నూలు జిల్లా ఆత్మకూరు ప్రాంతంవారు. అక్కడ వారికి పంచాయితి చేసి 14,000రూ. అనగా 1960 ప్రాంతంలో దండనవేసారట, అది కట్టలేక రాత్రికి రాత్రి ఊరు వదలి, పారిపోయి శ్రీశైలంలో ఉండి ఈ పనులు చేస్తున్నారు అని తెలిసినది.

''నసాబ్'' పంచాయితి ద్వార జర్గిగే ఈ కఠోరమైన దండనతో జాతి అభివృద్ధి నిరోధకం జరుగుచున్నది. అప్పుడు భగవాన్ సేవాలాల్ మహారాజ్, హెచ్చరిక చేసాడు ఈ విధంగా, గోర్ గరిబేన్ దాండియోతో సాత్ పీడి తను నరకేమా జాయో, తమార్ వంశజ్ కోనిరియే రాంప్యారీరో భాటా బనియోరే! అని చెప్పినారు.

అనగా బీదసాదలకు అన్యాయంగా దండన విధించకండి; అలా విధించిన వారు ఏడు తరముల వరకు నరకమును అనుభవించుతారు. మీ వంశములో దీపం వెలిగించుటకు ఏ ఒక్కరు మిగలరు. మీరు ఎంత గొప్ప ఘనకార్యములను చేసినప్పటికి, రామాయణంలో అహల్యలాగా రాయిగా మారిపోయేరు అని శ్రీ భగవాన్ సేవాలాల్ మహారాజ్ చెప్పిఉన్నారు. కొద్ది రోజులు ఊరకయుండి, వారిలో స్వార్థపరులైన వారు తిరిగి బీదలకు తప్పుడు పంచాయితీలు చేసి, వారి ధనాన్ని లూటి చేయటం మొదలు పెట్టారు.

సేవాదాస్ మహారాజ్ తరువాత ఈ తప్పుడు పంచాయితీలను తీవ్రంగా రూపుమాపుటకు శ్రీ ఫూల్‌సింగ్‌నాయక్‌గారు ఆధ్వర్యం వహించారు. వారు తమ యొక్క నిర్ణయాలను దూర దూర తాండాలకు కూడ ప్రచారం చేసారు మరియు వాటిని అరికట్టుటకు ప్రజలను మేలుకొల్పాడు.

అయితే ఈ భూమి మీద పూర్వంనుండి సన్మార్గులతో పాటు – దుర్మార్గులు కూడ జన్మించుతూనే ఉన్నా అటువంటి దుర్మార్గులు ఫూల్‌సింగ్‌నాయక్‌గారికి కూడ ఎదురు పడ్డారు. అతనికి అనిపించినది, పంచాయితి ద్వారా లభించే డబ్బురాకపోతే తమ జీవనం కష్టం అవుతుందని వారు భావిస్తున్నారు. అందుకని వారు ఫూల్‌సింగ్‌నాయక్‌గారిపైన విరోధమును ప్రకటించి, జాతి ద్రోహిగా నిర్ణయించి, కులంనుండి బహిష్కరించారు. ఈ విధంగావారితో పోరాడి, జాతి అభివృద్ధికి పాటుపడినారు.

ఈ విధంగా వారు బంజారాలలో మార్పులు తేవటంవలన కొంత మందికి వీరిపై గౌరవం పెరిగినది. ఎప్పుడువారు వీరిని గౌరవించగలిగారో అప్పుడు అతను క్రొత్త క్రొత్త విషయాలు, క్రొత్త క్రొత్త కార్యక్రమములు ప్రజలముందు ఉంచుతారు. మొట్ట మొదటవారు వివాహ సంబంధమైన కొన్ని పురాతన ఆచారములను(బాల్యవివాహలు) (ఫలోత్యార్ సగాయి) వివరిస్తు బంజారాలకు బోధించారు. వాటి గూర్చిన సమస్యలను వారి ముందు ఉంచారు. దానితో పాటు హోలీపండగలలో బూతు పాటలు, బూతు మాటలు గూర్చి, వాటి చెడు ప్రభావం గూర్చి బోధించారు. అప్పుడు కొంతమంది బంజారాలలో ప్రచారం మొదలు పెట్టారు.

''తాండో గొలీరో చాల్ బిగాడో, సేరియా తాండో గొలీరే !'' గొలి తాండా బంజారా సంస్కృతిని పాడుచేస్తున్నది. (సేరియా అనగా సింహము) గొలీ తాండా సింహము వంటిది. అనగా గొలీ తాండా పూర్తిగా చెడిపోయినది! అని ప్రచారం మొదలు పెట్టారు. అట్లాగే ఫూల్‌సింగ్‌నాయక్‌గారి సమాజ్ క్రాంతికై కీర్తి పెరగటం మొదలు పెట్టింది. ఈ విధంగా తను చేపట్టిన ప్రతి మంచిపని ప్రజలలో అర్థం అవుతూ వచ్చినది. ఈ విధమైన అభివృద్ధి చెందటంవలన, విరోధివర్గంలో మార్పులను చూచి, వారికి నిద్దుర పట్టలేదు. ఏ విధంగానైనా ఫూల్‌సింగ్‌నాయక్‌గారికి వారు చేయుచున్న మంచి కార్యక్రమములను అప్రతిష్టపాలు చేయుటకు, తప్పుడు ప్రచారం చేయుటకు వారి సాయశక్తులా ప్రయత్నించినారు. అభివృద్ధి పథంలో నడిపించుటకుగాను ఫూల్ సింగ్‌నాయక్‌గారు, బంజారా స్త్రీలను ఆధునిక వస్త్రములను ధరించుటకు సలహ ఇచ్చారు. మరియు వారి ఇంటి స్త్రీలకే ఈ వస్త్రములను ధరింపచేసిరి. అప్పుడు వారి విరోధి వర్గం ఆహాకారాలు మొదలు పెట్టినారు.

అప్పుడు ఫూల్‌సింగ్‌నాయక్‌గారు అనేక కార్యక్రమాలలోను, మహోత్కరమైన కార్యములు చేసి, వారిలో ఒక్కడిగా గుర్తించబడినారు. అప్పటికివారి ఇద్దరి కుమారుల వయస్సు 8 సంవత్సరాలు మరియు 11 సంవత్సరాలు ఉండినవి. అప్పుడు వారు సమాజంలో దేవతలకు బలి ఇచ్చే పద్ధతిని మానవలెనని చెప్పి, తన ఇంటిలో బలి పూజ చేయకూడదని నిశ్చియించాడు. వారు చేసిన ఈ ప్రతిజ్ఞను భంగపరచుటకుగాను, వారి విరోధులు గట్టి ప్రయత్నం చేసారు. వారి ఉద్దేశ్యమును పూర్తి చేయుటకు వారు ఒక కుట్రపన్నినారు.

గొలి తాండానుండి 10మైళ్ల దూరంలో పోహరాదేవి తాండా ఉన్నది. అది బంజారాల పవిత్ర స్థలం. అక్కడ సేవాభాయ నిర్యాణమై ఉన్నారు. ఆకాలంలో వామనదాస్ మహోరాజ్ ఆ గుడికి బంజారాల పెద్దగా ఉండిరి. ఆ మహోరాజ్‌కు మరియు ఫూల్‌సింగ్ నాయక్‌గార్కి మంచి సంబంధం ఉండినది. వీరిద్దరికిని సమాజం అభివృద్ధిలో మంచి ఉద్దేశ్యములు ఉండినవి, విరోధ వర్గంవారు మహోరాజ్‌గారి తరపున, ఒక భయం కలిగించే సందేశమును ఫూల్‌సింగ్‌నాయక్‌గారి ధర్మపత్ని దగ్గరకి పంపించారు. అందులో వ్రాయబడింది ఏమనగా, ఫూల్‌సింగ్‌నాయక్‌గారు, జాతి విరోధమైన మాటలలో పడకుండా నీవు మన ధర్మమును రక్షించు వెంటనే నీవు దేవి పేరట రెండు మేక పోతులను బలి ఇవ్వు ఇట్లు నీవు చెయ్యక పోయావో, దేవి ఆగ్రహమువలన, నీ ఇద్దరు కుమారులను పోగొట్టుకొంటావు. అని వ్రాసివుంది.

తన కుమారుల రక్షణకై తల్లి ఏమైన చేస్తుంది అయితే ఈ కార్యమును చేయుటకు ఫూల్‌సింగ్‌నాయక్‌గారు లేకుండా ఉండవలెను. అందుకని ఫూల్‌సింగ్ భార్య మంగళవారం రోజు భర్తకు ఏదో ఒక ముఖ్యమైన కార్యమునకై పంపించినది. ఫూల్‌సింగ్‌నాయక్‌గారికి ఈ విషయం తెల్సి పోయినది. అప్పుడు ఫూల్‌సింగ్‌నాయక్‌గారు కొండపై భాగము పోయి దాక్కొని అక్కడినుండి తాండాలో జరిగే కార్యక్రమములను అన్నింటిని చూస్తూ ఉన్నారు. తన ఇంటిలో దేవికి బలి ఇచ్చే కార్యక్రమము జోరుగా సాగుచున్నది. ప్రజలు కూడ గుంపులు గుంపులుగా వచ్చి చేరుతున్నారు. మేక పోతులను బలి ఇచ్చే సమయం దగ్గరపడింది. అదే సమయంలో ఫూల్‌సింగ్ నాయక్‌గారు ప్రత్యక్షమైనారు. అతన్ని చూడగానే అందరు భయకంపితులైనారు. ఎవరికి వారు దారులు చూసికొని పారి పోయారు. కాని అక్కడ నిలిచిన వారిలో కొంతమంది పెద్దవారు, ముసలి వాళ్లు మాత్రం నిలచిపోయారు. అప్పుడువారు బాపూజీ (ఫూల్‌సింగ్‌నాయక్)

గారికి వినిపించారు. ఇది దేవతలు – బంజారా ధర్మమునకు సంబంధించిన విషయం. ఇందులో మీరు కలిగించుకోవద్దండి దేవి యొక్క క్రోధము చాలా భయంకరంగా ఉంటుంది, దేవితో విరోధించుట వ్యర్థం.

కాని ఫూల్‌సింగ్‌నాయక్‌గారు అంధ విశ్వాసాలను నమ్మేవారుకాదు. ఆయనకు తను చేపట్టిన కార్యక్రమములపై గట్టి నమ్మకమున్నవారు. వారు అక్కడ ఉన్న ప్రజలతో పాటు దేవిని ప్రార్థించాడు మరియు అన్నాడు కదా! దేవి నీకు బలియే కావలయునన్న ఈ రోజు రాత్రికినా ఇద్దరు కుమారులను తీసుకొనిపో( మ్రింగు) నేను ఏ భూత పిశాచాలకు లొంగను. వాటి మీద నాకు విశ్వాసం లేదు.

ఫూల్‌సింగ్‌నాయక్‌గారి ఈ విధమైన ప్రార్థన విని అక్కడ ఉన్న పెద్దలందరు ఆశ్చర్యపోయినారు, తమ తండ్రి కోరిన కోరికను విని పిల్లల యొక్క శరీరాలు భయంతో కంపించి పోయినాయి, ఫూల్‌సింగ్ భార్య తన పిల్లల ప్రాణరక్షణకై భయంతో రాత్రి అంతా మేల్కొనే ఉండి పోయినది. ప్రజలలో అంధవిశ్వాసములను పోగొట్టుటకై ఇంత సాహసమును వహించిన ఫూల్‌సింగ్‌నాయక్‌గార్ని చూచి అందరు వారి ముందు తలవంచక తప్పలేదు. విరోధి వర్గం ఫూల్‌సింగ్‌నాయక్‌గార్ని లొంగదీయుటకు చేసిన ప్రయత్నంలన్నియు వృథా అయినవి. అప్పుడు వారు ఫూల్‌సింగ్‌నాయక్ పై ఆఖరి ప్రయత్నంగా, వారిని బంజారా జాతి నుండి అతి కఠినంగా బంజారా సమాజంనుంచి వెలివేసి, ఎటువంటి కార్యక్రమములలోను రాకూడదని శాసించారు.

ఈ విధంగా వారు బంజారా సమాజంనుండి వెలివేయబడి సమాజంతో ఏదో ఒక విధమైన అవసరం ఏర్పడుతుంది. కాని ఫూల్‌సింగ్‌నాయక్‌గారు, సమాజం మార్పు తన ఇంటిలోనే మార్పుతెచ్చెవారు. మహిళల యొక్క వేషభూషణములను మార్పుచేయుటకుగాను, సమాజమునకు ముందు తన ఇంటిలోనే మార్పు తెచ్చుటకు, తన ఇంటిలోనే వేషం మార్చి వేయబడినది, తన కుమారులను వారు స్కూళ్ళలో చేర్చుకొనలేదు. అందువలన వారు తమ పుత్రులను క్రొత్త స్కూళ్లలో చేర్పించారు.

ఫూల్‌సింగ్‌నాయక్‌గారి సమాజ మార్పులో కొద్ది కొద్ది ఫలితం వచ్చిన తరువాత మనస్సులోని వాంఛలు ఫలించటం మొదలు పెట్టాయి. సమాజములో ఎప్పుడైతే నవజాగరణ, మార్పురావటం మొదలు పెట్టిందో, ప్రాచీనకాలం నాటి మొరటు పద్ధతి, కొద్ది కొద్దిగా తుడుచుకొనిపోయినవి. అతని చిన్న కుమారుడు ఉన్నత విద్యను అభ్యసించాడు. తన జీవితమును సమాజ సేవ దేశ సేవ చేయుటకు పూనుకొన్నాడు. ముందు ముందువారు మహారాష్ట్ర ముఖ్యమంత్రి అయినారు. శ్రీ వసంతరావునాయక్‌గారు వీరి చిన్న కుమారుడు మరియు బాబా సాహెబ్‌నాయక్‌గారు బంజారాల భీష్మ పితామహ అని చెపుతారు. ఈ ఇద్దరునూ కలసి, తమ తండ్రిపేరన పూసద్( తాలూకా) లో ఒక మహావిద్యాలయమును స్థాపించి వారియొక్క సమాజ సేవ చేస్తు తండ్రి పేరును చిరస్థాయి చేసారు.

3-12-1960 సంవత్సరములో తను 105 సంవత్సరములు జీవించి తన నామమును సార్థకం చేసుకొన్నారు. వీరు గౌలితాండాలోనే తనువు చాలించారు. తన మనుమడైన శ్రీసుధాకరరావునాయక్‌కూడ మహారాష్ట్ర ముఖ్యమంత్రిగాను, హిమాచల్ ప్రదేశ్ గవర్నర్‌గాను పనిచేసారు.



కీ. శే. శ్రీ వసంతరావు ఫూల్‌సింగ్ నాయక్ (వి. పి. నాయక్) - కాకాసాహెబ్
మాజీ ముఖ్యమంత్రులు - మహారాష్ట్రము



కీ. శే. శ్రీ వసంతరావు ఫూల్‌సింగ్ నాయక్ (వి. పి. నాయక్) గారి కుమారులు శ్రీ వి. అవినాష్ నాయక్, శ్రీ వి. నిరంజన నాయక్
మరియు భార్య శ్రీమతి వత్సాలాదేవి

# శ్రీ వసంతరావ్ పూల్‌సింగ్‌నాయక్

శ్రీ వసంతరావు పూల్‌సింగ్‌నాయక్ గారు (వి.పి. నాయక్) అఖిలభారతంలో బంజారాలు గర్వించతగ్గ మానవుడు. బంజారాల ఖ్యాతిని భారతంలోనే కాకుండ ప్రపంచదేశములలో చాటిచెప్పిన వ్యక్తి శ్రీ వి.పి. నాయక్‌గారు. వీరు రాథోడ్ వంశం, ఖేతావత్ గోత్రంలో జన్మించారు. వీరి తండ్రి పేరు, పూల్‌సింగ్ రాథోడ్. వీరి జన్మస్థానం మహారాష్ట్రంలోని విదర్భప్రాంతం, ఓత్మాల్ జిల్లా, పూసద్ తాలుకా, గౌలితాండా. వీరి మొట్టమొదటి పేరు హద్దు రాథోడ్, వీరుతమ న్యాయవాద విద్యపూర్తిచేసిన సందర్భములో పేరు మార్చుకోవడం జరిగింది. ఆనాటినుండి వారి పేరు వి.పి.నాయక్‌గా మార్చబడినది. వి అనగా వసంతరావు, పి అనగా పూల్‌సింగ్ తండ్రిపేరు, వారి తండ్రిగారు తాండానాయక్ అయినందున నాయక్ అని పేరు పెట్టుకొని, పూర్తి పేరు వసంతరావు పూల్‌సింగ్‌నాయక్‌గారుగా రూపొందినది. వారి అన్నగారి పేరు బాబాసాహెబ్ రాజుసింగ్‌నాయక్‌గారు. వి.పి. నాయక్‌గారిని మహారాష్ట్రీయులు గౌరవంగా ''కాకా సాహెబ్'' అనిపిలుస్తారు.

శ్రీ బాబాసాహెబ్ రాజుసింగ్‌నాయక్‌గారు 1967 సంలో హైద్రాబాదులో అఖిలభారత కాంగ్రెస్ జనరల్ బాడీ మీటింగ్‌కు హాజరైనారు. పంచసిలా హోటల్ నందు ఆలిండియా బంజారా స్టడి టీమ్ మీటింగ్ జరుపబడినది. ఆ సందర్భంలో శ్రీ రాజుసింగ్‌నాయక్‌గారు, అక్కడ హాజరు అయిన బంజారాల గూర్చి మాట్లాడుతూ తమ కుటుంబ అభివృద్ధిని గూర్చి చెప్పడం జరిగినది. వారి తండ్రిగారు ఏడుగురు. వారిలో వారి తండ్రి అందరికన్న చిన్నవాడని, అతనికి వేట అంటే చాలా ఇష్టమని. ఆ కారణంగా, కొంతమంది ఆంగ్లేయుల పరిచయం ఏర్పడినదని తెల్పినారు. వారి తండ్రికి వీరు ఇద్దరే కుమారులు కావున, తన తండ్రి తనను వ్యవసాయము చేయుటకు ఉంచుకొని తన తమ్ముడు అయిన శ్రీ వి.పి. నాయక్‌గార్ని వారు చదివిస్తామని చెప్పగా వారి సహకారంతో చదువు కొన్నాడని తెల్పినారు. ఈ విధంగా శ్రీ వి.పి. నాయక్‌గారి విద్య ప్రారంభమైనదని తెల్పినారు. ఆనాడు తాండాలలో స్కూళ్ళు ఉండేవికావు. వీరు 1913వ సం. జులై నేల ఒకటవ తారీఖున జన్మించారు. వీరి విద్యాభ్యాసము నైయిల్ సిటి హైస్కూలునందు పూర్తిచేసారు. వీరు మేరి డిగ్రి కాలేజిలో బి.ఏ. పూర్తి చేసారు. అదే కాలేజీ ఇప్పుడు మహావిద్యాలయంగా రూపుదిద్దుకొన్నది. వీరు న్యాయవాద వృత్తి విద్యను నాగపూర్ యూనివర్సిటిలో పూర్తి చేసారు.

ఆ సమయంలో వీరికి ఒక బ్రాహ్మణకన్యతో పరిచయమైనది. ఆమెయే వత్సలాదేవి గారు. వీరి పరిచయం ప్రణయంగా మారి వివాహం చేసుకొనుటకు నిశ్చయించుకొన్నారు. కాని ఇరు వర్గాల తల్లితండ్రుల అభ్యంతరమున్నను, వీరు వివాహం చేసుకొన్నారు. ఆ తరువాత వారే సర్దుకోవటం జరిగినది.

ఆ కాలంలో బంజారాలలో కులాంతర వివాహం చాలా( అభ్యంతరకరం) ఆక్షేపణగా ఉండెడిది. ఆ కారణంగా శ్రీ సేవా భాయామతంవారు, వీరి వివాహామును వ్యతిరేకించినట్లుగా చెప్పబడుచున్నది. ఈ కారణంగానే సేవా భాయమతం అభివృద్ధికి మహారాష్ట్ర ముఖ్యమంత్రిగా చాలా ఏళ్లు ఉన్నను, అభివృద్ధి పరచలేక పోయారని వినికిడి.

శ్రీ వి.పి.నాయక్‌గారు తన న్యాయవాద వృత్తిని ప్రారంభించి, ప్రజలలో సత్ సంబంధములను ఏర్పరచుకొన్నారు. వీరు 1946 సం. లో అఖిలభారత కాంగ్రెస్ సంఘములో సభ్యత్వమును తీసుకొన్నారు. వీరు కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా పూసద్ మునిసిపాలిటీ ఛైర్మన్ అయినారు. ఆ తరువాత ఎన్నికలలో గెలిచి, 1952 సం. వరకు ఆ పదవిని నిర్వర్తించారు.

వీరు 1952 సం. మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ రవిశంకర్ శుక్లాగారి మంత్రి వర్గంలో డెప్యుటి మంత్రిగా పనిచేశారు. ఆ కాలంలో విదర్భ ప్రాంతం మధ్యప్రదేశ్‌లో భాగంగా ఉండినది.

భాషా రాష్ట్రముల ప్రాతిపదికన తరువాత మహారాష్ట్రములో చేర్చబడినది. ఆ తరువాత కూడ వారు మహారాష్ట్ర మంత్రి వర్గములో ఆర్థికమంత్రిగా కొనసాగారు. 1963 సం. డిశెంబరు నెలలో శ్రీ కన్నమ్మవారు మరణించిన తరువాత శ్రీ వి.పి.నాయక్‌గార్ని మహారాష్ట్ర కాంగ్రెస్ పార్టీ నాయకునిగా ఎన్నికచేసుకొని, మహారాష్ట్ర ముఖ్యమంత్రి అయ్యారు. శ్రీ నాయక్‌గారు ముఖ్యమంత్రి అయిన తరువాత మొత్తం రాష్ట్రమును పర్యటించి, ప్రజల కష్టనష్టాలను పరిశీలించి, ఆత్మ విశ్వాసముగలవాడై తన రాష్ట్రములోని బీదరికమును, నిరక్షరాస్యతను, వారి ఆర్థిక అభివృద్ధికి, ఎటువంటి కార్యక్రమములను చేపట్టవలయునో ఆలోచించి, తన మంత్రి వర్గమును, ప్రభుత్వ అధికారులను, మొదట ప్రజా అభివృద్ధి కార్యక్రమములను మాత్రమే చేపట్టవలయునను ప్రభోదం చేయించినారు. వారు బీదప్రజలను, వ్యవసాయంపై ఆధారపడినవారికి, వారి భూ అభివృద్ధికి, నీటి వసతులను, విద్యుచ్ఛక్తి, విత్తనములు, ఎరువుల గూర్చి ఎక్కువ శ్రద్ధను తీసుకోవటం జరిగినది. వారి అభివృద్ధికై కో.ఆపరేటివ్ సమిష్టి వ్యవసాయ క్షేత్రములను, కో.ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీలను స్థాపించి, వారి అందరిని సభ్యులుగా చేసుకొని వారిద్వారా అభివృద్ధికి కావలసిన వసతులను కల్పించారు.

పిల్లల అభివృద్ధికి ఎడ్యుకేషన్ సొసైటీలను, ఆశ్రమ పాఠశాలను స్థాపింపచేసి విద్యాభివృద్ధికావించారు. అదే విధంగా స్కూళ్లు, హైస్కూళ్లు, కాలేజీలు, విశ్వ విద్యాలయాలు కూడ స్థాపింపచేసారు. కృషి సెంటర్లు, నిరాశ్రయులైన స్త్రీలకు శిశు సంక్షేమ సెంటర్లను స్థాపింపచేసారు. వృద్ధాప్య ఆశ్రమాలను స్థాపింపచేసారు. ప్రతి గ్రామములోను, బహిర్ భూమికి పోకుండా విశాలమైన మరుగుదొడ్లను కట్టించి, వాటితోనే గోబర్ గ్యాస్ ప్లాంట్లును నిర్మింప చేసారు.

వ్యవసాయ సంబంధమైన, అన్ని రకాల సౌకర్యములను ప్రజల ద్వారానే విద్యుఛక్తి నీటి ప్రాజెక్టులు, చెక్‌డ్యాములు, భూసార పరిరక్షణ, విత్తన అభివృద్ధి, రసాయునిక ఎరువులవాడకం, మొదలైన పనులన్నియు ప్రజల ఆధ్వర్యంలోనే చేయించారు. ప్రభుత్వ అధికారులు, ప్రజల కోరికలపై వారి అవసరములను, ప్రభుత్వంనకు నివేదించుటవరకే, ప్రజాభివృద్ధి పనులను ప్రజలు మాత్రమే నిర్వహించవలయును.

పై కారణముల వలన శ్రీ వి.పి.నాయక్‌గారు ప్రజల ముఖ్యమంత్రిగా తన పేరును సార్థకం చేసుకొన్నారు. అందువలననే శ్రీ నాయక్‌గారు 1952నుండి 1963వరకు క్యాబినెట్ మంత్రిగాను, 1963 నుండి 1977 సం. వరకు తిరుగులేని మహారాష్ట్ర ముఖ్యమంత్రిగా వెలుగొందారు.

శ్రీ వి.పి.నాయక్‌గార్కి బంజారా జాతి అన్నా బంజారా కార్యకర్తలన్నా ఎక్కువుగా గౌరవించేవారు. 1974 సం.లో ఆంధ్రప్రదేశ్ గాంధిభవనములో వారి అధ్యక్షతన అఖిల భారత బంజారా సేవా సంఘం మీటింగ్ జరిగినది. అఖిల భారత కాంగ్రెస్ ప్రెసిడెంట్ శ్రీ నిజలింగప్పగారు, రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు, రాష్ట్రమంత్రులు హాజరైయున్న ఆ సభలో, తన ఉపన్యాసమును ఇస్తూ సభను ఉద్దేశించి ఇక్కడవచ్చిన వారిలో చాలామంది బంజారాలు ఉన్నారు. వారికి నా భాష అర్థంకాదు. అనగా ఇంగ్లీషు, నాకు తెలుగురాదు. కావున నేను నా మాతృభాషలో వారికి కొన్ని విషయాలు చెప్పదలచాను అని సభ అనుమతి తీసుకొని బంజారా భాషలో ప్రసంగించారు. వారు చెప్పిన విషయం ఏమనగా, నేను నా తల్లిని ఎంతగా ప్రేమించగలనో, నేను నా జాతిని కూడ అంతగానే ప్రేమిస్తాను. కావున బంజారాల అభివృద్ధికి కొన్ని సూచనలు ఇచ్చారు. తమ పిల్లలకు విద్య, ఆర్థిక అభివృద్ధికి కొన్ని సూచనలు ఇచ్చారు.

శ్రీ వి.పి.నాయక్‌గారు, న్యాయవాద వృత్తిని స్వీకరించుటవలన, వారు దూరదృష్టితో అఖిల భారత బంజారా సేవా సంఘమును, రిజిస్టర్ నం.78/1947లోనే స్థాపించారు కాని, ఆర్థిక ఇబ్బందులు, భాషా పరమైన ఆటంకాలు ఉండుటవలన భారత్ మొత్తంలో వ్యాపింప చేయలేక పోయినారు.

ఎవ్వరైన బంజారా కార్యకర్త వారిని ఆశ్రయించి తన కార్యక్రమమును చెప్పిన, తన శక్తి కొద్ది విరాళములను, ముఖ్యమంత్రి సహాయ నిధినుండి ప్రకటించి, ఆ నిధితో వారు చేసే అభివృద్ధిని ఒక కంటకనిపెట్టి ఉండేవారు. సరియైన మార్గములో ఉపయోగపడినది అని తెలిసిన తిరిగి తనకు సహాయమును చేసేవారు. ఆ విధంగానే 1972లో నేను అనంతపురం బంజారా విద్యావంతుల సమాజము, సంఘ అభివృద్ధికి, సంఘ కార్యక్రమములు చేపట్టుటకు చేసిన విన్నపమునకు **5,000/-** రూ॥ ఇస్తున్నట్లుగా తెల్పినారు. దానిని హోమ్ డిపార్టుమెంటువారికి, ఎన్నియో ఉత్తరములు వ్రాసిన తరువాత 6 మాసాలకు పంపినారు. ఆ సహాయమును కూడ అనంతపురం జిల్లా సంఘంలో సభ్యులుకాని వారు, తమ కొరకై పంపినట్లుగా భావించి, శ్రీ గోపాలరావునాయక్ గారిని నిందించుతూ రికార్డులు, డబ్బులు లాక్కొని సంఘ అభివృద్ధిని ఆటంకపరచినారు. ఆ ధనమంతా వృథా చేసినారు.

శ్రీ వి.పి.నాయక్‌గార్ని 1973 సంవత్సరంలో నాట్యూర్ ప్రోగ్రామములో 5-1-1973న తన ఇంటిలోను మరియు 6-1-1974న తన క్యాబినెట్‌లోను కలుసుకోవటం జరిగినది. వారికి బంజారా కార్యకర్తలన్న ఎక్కడలేని అభిమానము.

మహారాష్ట్రమునందు అఖిలభారత బంజారా సేవా సంఘము ద్వారా, ఎడ్యుకేషన్ సొసైటీలను, సమిష్టి వ్యవసాయ క్షేత్రములను మొత్తం మహారాష్ట్రములో ప్రతిజిల్లా, ప్రతి తాలుకాలందు, మంచి సేవాతత్పరులైన కార్యకర్తలను ఏర్పరచి, విద్యాభివృదద్ధి, ఆర్థికాభివృద్ధిని, రాజకీయ చైతన్యమును కల్పించారు. ఈ సందర్భములో శ్రీ వి.పి.నాయక్ అసెంబ్లిలో ఒక ప్రశ్న వేయబడినది. అందులో అఖిలభారత బంజారా సేవా సంఘ ఆధ్యక్షుడైన శ్రీ ప్రతాప్‌సింగ్ అడేగారు సుమారు మొత్తం 31 సంస్థలను స్థాపించి, కోటాను కోట్లు రూపాయలను

దుర్వినియోగం చేస్తున్నారని, అప్పుడు శ్రీ నాయక్‌గారు ఒక్కటే మాట అన్నారు. శ్రీ ప్రతాప్‌సింగ్ అడే బంజారా అని, నా కులస్థులని కదా? మీ అభిప్రాయం. నేను ముఖ్యమంత్రిగా ఉన్న ఈ కాలంలో నా ముందు ఉన్న మీరందరుకూడ ఎన్నో పనులు చేస్తున్నారు. ఎవరు ఏమి చేయుచున్నది నాకు తెలుసును. ఒక ప్రతాప్‌సింగ్ అడే మాత్రమే దుర్వినియోగం చేస్తున్నారా? వారి మీద చర్యతో పాటు ఇతరుల మీద కూడ చర్య తీసుకొంటాను. మీ అందరికి సమ్మతమేనా అని ప్రశ్నించారు. అంతటితో అందరి నోర్లు కట్టివేయడం జరిగినది. ఇది తనలో ఉన్న గొప్పతనం. కొంత మంచి పనిచేస్తున్నప్పుడు కొన్ని ఇతర పొరపాట్లు జరుగుచుండును. అంత మాత్రాన అవి అభివృద్ధికాకుండా పోదు అని ఆతని భావన.

శ్రీ వి.పి.నాయక్‌గారు తిరుగులేని పేదప్రజల ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో మరాటాలువారిని వ్యతికేకించడం జరిగినది. ఒక బంజారా వ్యక్తియే మాకు ముఖ్య మంత్రిగా ఉండవలయునా? మాకు ఆ హక్కులేదా అని శ్రీమతి ఇందిరాగాంధీ ప్రధాన మంత్రిగారితో మొరపెట్టుకొనటం జరిగినది.

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీగారు. శ్రీ వి.పి.నాయక్‌గార్కి తనకు కేంద్రంలో తీసుకొంటానని చెప్పి, ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేయించినారు. ఆ తరువాత కేంద్రంలో మంత్రి పదవి ఇవ్వకుండా ఆంధ్రప్రేదేశ్ గవర్నర్‌గా ఇస్తామన్నారు. గవర్నర్ పదవి ఇష్టములేని శ్రీ వి.పి.నాయక్ గారు తనకు వద్దన్నారు.

1979 సంవత్సరవముఆగస్ట్ నెల 18వ తేదిన సింగపూర్ చూడటానికి పోయిన(హాలీడేవిజిట్) శ్రీ వి.పి.నాయక్‌గారు. ఆకస్మిక మరణం సంభవించినది. అక్కడ నుండి బొంబాయికి తన పార్థ శరీరమును విమానము ద్వారా తీసుకొని రావడం జరిగినది. ఈ ఆకస్మిక వార్త రేడియో, టీ.వి.ల ద్వారా, దేశం, ప్రపంచమంతా వ్యాపించి, ప్రజలు దిగ్భ్రాంతిని చెంది, శోక సముద్రంలో మునిగి పోయినారు. దేశ రాజకీయాలలో అంత గొప్పవ్యక్తిని, దేశం ముఖ్యంగా బంజారా ప్రజలు, లెక్కకట్టలేనంత నష్టమును పొందారు. వారు లేని లోతునుపూడ్చగలిగిన వ్యక్తిని బంజారాలకు దేవుడు ప్రసాదిస్తాడో లేదో.

శ్రీ వి.పి.నాయక్‌గారు స్వాతంత్ర పోరాటంలో పాల్గొనలేదు. రాజకీయ జైలు జీవితం కూడ అనుభవించలేదు. అయినను, తన రాజకీయ చతురతను ప్రజలకు చాటి చెప్పినారు. మహారాష్ట్ర ప్రజల అదృష్ట వ్యక్తిగా, వారి కష్టాలను పాలుపంచుకొనుటకు జన్మమెత్తిన వ్యక్తిగా భావిస్తారు.

శ్రీ వి.పి.నాయక్‌గార్కి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె జన్మించినారు. కుమార్తె ప్రమాదవశాత్తు చనిపోవడం జరిగినది. పెద్ద కుమారుడు అవినాష్ నాయక్, రెండవ వాడు నిరంజన్‌నాయక్, పెద్ద కుమారుడు శ్రీ అవినాష్‌నాయక్‌గారు, పవార్ మంత్రి వర్గంలో మంత్రిగా పనిచేసి ఉన్నారు. వీరు ఇప్పుడు తమ తల్లితోపాటు బొంబాయిలో ఉంటున్నారు.

నా సంతాపమును వెల్లడించి, తన కుటుంబీకులను ఓదార్చుతూ టెలిగ్రాము ఇవ్వగా శ్రీమతి వత్సలాదేవిగారు కుమారులు అవినాష్‌నాయక్, నిరంజన్‌నాయక్ గార్లు బొంబాయి నుండి తమ కృతజ్ఞతలు 3-9-78 తెల్పినారు.



1976లో బొంబాయిలో జరుపబడిన బంజారా మహా సభలో ప్రసంగిస్తున్న కీ. శే. శ్రీ వి. పి. నాయక్
శ్రీ రంజిత్‌నాయక్, శ్రీ అమరసింగ్ రాఠోడ్, కె. టి. రాఠోడ్ మరియు తదితరులు

# బంజారా


*BANJARA' Fortnightly Organ of All India Banjara Seva Sangh*

**A. P. Branch, Anantapur, In Telugu & English. Managing Editor: Ranjit Naik.**

ఆంధ్ర ప్రదేశ్ సుగాలీ, తదితర పీడిత జాతుల యేకైక పక్ష పత్రిక.

[illegible]

సంపుటి : 1, సంచిక : 1 | అనంతపురం 17-3-74 ఆదివారం | వెల: రు. 0-50


# "బంజారా" పత్రికకు పెద్దల ఆశీస్సులు



## పురోభివృద్ధికి సమాలోచన

[illegible] ఉద్యమ ఫలితం, అది [illegible] కర్నాటక రాష్ట్రము [illegible] బంజారా [illegible] రాష్ట్రాలలోను కలుగ [illegible] అనేక విధాల వృత్తిగత [illegible] దాని ఫలితంగానే కొంత [illegible] ముఖులు [illegible] దేశం మొత్తంమీద [illegible] మహారాష్ట్రంలోను, [illegible] కర్నాటక రాష్ట్రములోను వుండ [illegible]

[illegible] లో మన్ననున్న ముఖ్యమంత్రి [illegible] మంత్రి శ్రీ [illegible] గురించి సమాలోచన [illegible] శ్రమతో [illegible] లో మున్నారు.

Press Secretary to the *President*,
Rashtrapati Bhavan,
New Delhi - 110004.
6 3 74

Dear Shri Naik,

The President thanks [y]ou for your letter of the [...] March, 1974. He sends best wishes to the All [India] Banjara Seva Sangh, [Andh]ra Pradesh for success

*[Yours] sincerely,*
**Abdul Hamid**

**Chief Minister,**
Maharashtra
SACHIVALAYA
Bombay - 32
Dated 14 3 74

On the occasion of the inaugural function and releasing the First Issue of "**BANJARA**" I send my best wishes for its success.

**V. P. NAIK.**

**Dear Sri Ranjit Naik,**

I am glad to know that the All India Banjara Seva Sangh is bringing out a regular journal '**BANJARA**' to focus and project the problems, interests and aspirations of the Banjara community. I wish the journal all success.



**B. V. Subba Reddy.** (Deputy Chief Minister)

అనంతపురం నుండి ***17-3-74*** బంజారా పక్ష పత్రిక ప్రారంభ సంచిక

# కీ.శే. శ్రీ వి.పి.నాయక్‌గారి భాషణ 1976 బొంబాయి

ఎల్లవేళల కఠినమైన శ్రమ చేసి, తమ యొక్క ఆర్థికాభివృద్ధిగావించవలెనని, కీ.శే. శ్రీ వి.పి.నాయక్‌గారి సందేశం.

1976 సంవత్సరము మార్చి నెల 15,16 తేదీలలో బొంబాయిలోని, నాయక్ నగర్‌లో జరిగిన అఖిలభారతీయ బంజారా సేవ సంఘం, జనరల్‌కౌన్సిల్ కీ.శే శ్రీ వసంతరావు ఫూల్‌సింగ్ నాయక్‌గారు చేసిన భాషణ వివరములు, ప్రత్యక్షమైన అతిథి రూపంలో బంజారా సమాజములోని ఏకైక నాయకుడు, మహారాష్ట్ర ముఖ్యమంత్రి హోదాలో శ్రీ నాయక్‌గారు అన్నారు. నేను మీ అందరికి ఋణపడి ఉన్నాను. ఇక్కడ సమావేశమైన ప్రజలందరు నా పై అపారమైన ప్రేమను చూపారు. ఆశీర్వాదమును ఇచ్చారు. ఆ కారణంవల్లనే నేను. అభివృద్ధి చెందాను. కాంగ్రెస్ నేత ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధీగారు నాకు ఎంత గౌరవమును ఇచ్చారో, అంత ఈ దేశములో పది మందికి కూడ ఇవ్వలేదు. వారు నాకు రెండుసార్లు గవర్నర్ పదవిని స్వీకరించమని కూడా ఆహ్వానించారు. దేశములోని బీదరికమును పోగొట్టుటకు, నిశ్చలమైన మనస్సుతోనే, మన ప్రధానమంత్రి 20 సూత్రముల అర్థిక కార్యక్రమమును దేశ మంతట చేపట్టినారు. ఈ రోజు ఈ విషయంలో, దేశంలోని బీదలలోని పేదరికాన్నే, ఎంత ఖర్చు అయినప్పటికిని పారద్రోలవలయునను సంకల్పముతో ఉన్నారు. ఈవిషయంలో ఎదురించుటకు ఏ రాష్ట్రము ముందుకురాదు. మన ప్రధానమంత్రి ఈ ప్రపంచమునుండే బీదరికమును పారద్రోలవలయునను పట్టుదలతో ఉన్నారు. దీనిని వ్యతిరేకించువారి శ్వాస ఆడకుండునట్లు చేస్తుంది. ఇందిరాగాంధిగారి నేత్రుత్వం లేకుండా ఉండిన ఈ దేశం చాలా ప్రమాదంలో పడిఉండేది.

మేము ఎల్లప్పుడు కాంగ్రెస్‌వారమే మరియు కాంగ్రెస్‌లోనే జీవితం అంతంవరకు ఉంటాము. వేరే పార్టీ గూర్చిన విచారణ మా మనస్సులోనే రాదు. రాజనీతి మనిషిని, స్వార్థపరుణ్ని చేస్తుంది. మరియు ఎప్పుడు వాడు స్వార్థపరుడు అవుతాడో అప్పుడు అతను దాని బానిస అవుతాడు. యువకులలో ఈ బానిసత్వపు ఆలోచన ఎప్పటికినీ రానీకూడదు. వెనుకబడిన ప్రజల గూర్చిన ఆలోచన వారి మనస్సులలో ఉండి వారి అభివృద్ధికి పాటు పడవలయును.

నా ఆలోచనలో( అభిప్రాయంలో) మనము అభివృద్ధి చెందుటకు కోట్ల రూపాయలు అవసరంలేదు మరియు మనకు లక్షల రూపాయలు కూడ అవసరం లేదు. సమాజము యొక్క పనులు చేయుటకుగాను అవసరమైన ధనము కావలయునో అంతవరకే చందాలను స్వీకరించవలయును. వీటియొక్క లెక్కలు సంఘంకార్యకర్తలు చూసుకొంటారు. దీనిని గూర్చి ప్రశ్నించే అధికారం ఎవ్వరికి ఉండదు. ధనం ప్రోగు చేయుటకు ఒక సమితిని ఏర్పాటు చేసుకొనవలయును. వారే దీనిని సంఘమునకు సమకూర్చుతారు.

బంజారాలు తమయొక్క సంచార పద్ధతిని మాని స్థిరంగా నివశించే పద్ధతిని పాటించవలెను. భూమి సంపాదించుకొనవలెను. అందులో బావి త్రవ్వుకొనవలెను. గట్లు వేసుకొనవలయును, నామమాత్రమునకు భూమి ఉందనిపించుకోకుండ, అందులో పంటలను

అభివృద్ధి చేసుకొని, జీవించుటకుకావలసిన ధాన్యమును పండించుకొనవలెను పంట అభివృద్ధికిగాను, కాలువ, నది, బావులను ఉపయోగించుకొనవలెను. దీనివల్ల మీ యొక్క ఆర్థిక స్థితిగతులు అభివృద్ధి చెందుతాయి. కష్టపడి భూమిలోని పంటను అభివృద్ధి చేయండి. నేను ఒక విషయమును వివరంగా తెల్పుతాను, ఎట్లనగా, తమరి బీదరికం బ్యాంకు ద్వారాలభించే, సహాయంవలన కాని లేక ప్రభుత్వ శాసనాలవల్ల పోదు. ఎవరో బయటినుంచి వచ్చి మీ యొక్క బీదరికమును పోగొట్టరు. ఆ విధంగా కూడ ఆలోచించవద్దండి. ఎప్పుడైతే మనం, మన యొక్క కష్టములను మనశక్తి, మనశ్రమను ధారపోసి వ్యవసాయం చేయుటకు క్రొత్త క్రొత్త పద్ధతులను మంచి మార్గంలో చేయని పక్షంలో మననుండి, బీదరికము దూరంగాపోదు.

శ్రమించి పని చేయుట అనేది, మన సమాజంలో ప్రకృతి ప్రసాదించిన వరము. ఈ సమాజములో ప్రతి ఒక్కరు కష్టించి పని చేస్తారు. చిన్న పిల్లలు మొదలుకొని, యువకులు, ముసలివాళ్లు కూడ పనిచేస్తారు. ఈ సమాజములోని వారు మంచి శ్రమ జీవులు. శ్రమను పూజించుటే ఈ సమాజము యొక్క ప్రత్యేకత, నిరంతరం కష్టించి మనం మనయొక్క ఆర్థిక స్థితిని అభివృద్ధి పరచుకొనవలయును. మహారాష్ట్రంలో 50 లక్షల ఎకరముల భూమిని, భూమిలేని పేదలకు పంచడం జరిగినది. మరియు 36 లక్షల భూమిని యే భూములు సాగు చేసుకొనుచున్న బీద వ్యవసాయదారులకు పట్టాలు మంజూరు చేయడం జరిగినది. ఇది కాకుండా 10 లక్షల ఎకరముల భూమిని, భవిష్యత్తులో భూమిలేని పేదలకు పంచుటకు నిర్ణయించడం జరిగినది. అందులో బంజారాలకు ఎన్ని ఎకరములు రావలయునన్నది నిశ్చయించడం జరిగినది.

ప్రజలలో ప్రచారం జరుగుటకు పత్రికయొక్క అవసరం చాలా ఉన్నది. పత్రికలను వారి స్వార్థమునకై స్థాపించుకొన్నారు. ఈ విషయములనువారు ఎందుకు ప్రచారం చేస్తారు. వారికి మీ అభివృద్ధి గూర్చినవి ప్రచురించుటకు వారికేమంత పట్టినది. నాకు ఇది చూచి చాలా సంతోషమైనది, బంజారా పక్ష పత్రిక నడుపించుటలో గోర్ బంజారాలు చాలాగొప్ప ఉపకారం చేసారు. నేను ఇక్కడ వచ్చిఉన్న బంజారా ప్రజలకు విన్నవించుట ఏమనగా, తమతమ ప్రాంతములో ఎంత సాధ్యపడితే అంత ఎక్కువ పత్రిక గూర్చి ప్రచారం చేయవలయును. మరియు అక్కడి సమాచారములను ఈ పత్రికకు పంపండి. ఎక్కువ ప్రకటనలు వచ్చుటకు ప్రయత్నం చేయండి మరియు ఎక్కువ మంది ఈ పత్రికను తీసుకొని చదివేటట్లు చూడండి. ఎందుకనగా ప్రచారం జరుగుటకు ఇది ఒక్కటే సాధనము. దీని యొక్క మంచి ఉపయోగమును బాగా చదివి లాభం పొందండి.

నిజంగా ఈ పత్రికను చూచి నేను చాలా సంతోషించాను. భవిషత్తులో మీ అభివృద్ధి కార్యక్రమములు మీ చేతులలో ఉన్నవి. ఎందుకనగా ఏపని చేసినను, ఆలోచించి, ముందుకు పాదం వేయవలయును. మనము మన యువ వ్యవస్థపైననే ఈ విషయంలో అందరితోడు తీసుకొన్ననే, అందరి అభివృద్ధికి సంబంధించిన పనులను చేపట్టవచ్చును. పోట్లాటలు, ఒకరి మీద ఒకరు చాడీలు చెప్పుకొంటూ, సమయమును వృథా చేయకూడదు. అందరి మనస్సు ఒక్కటిగా ఉండి పనిచేయవలయును. అర్థం చేసుకోండి, ఆత్మ విశ్వాసముతోనే సమాజము, ముందడగు వేస్తుంది. కాని, ఎవరి మీదో విరోధమును పెంచుకొన్నందువల్ల కాదు. ఈ సత్యం గ్రహించవలయును.

తమరు తమతమ తాండాలో 20 సూత్రముల కార్యక్రమము మొదలు పెట్టండి. ఈ విషయంలో ఎదురైన అడ్డంకులను కల్పించిన, అధికారులను కలసివాటిని దూరంగా ఉంచండి. ప్రజలందరికి ఉపయోగపడే సంస్థలను నడిపించుట అంత చిన్న పని ఏమియుకాదు. న్యాయబద్ధమైన కార్యములను చేపట్టువారికి, ప్రజలు ఎప్పుడు అండగానే ఉంటారు. అటువంటి పరిస్థితులలో నిర్ణీతమైన కార్యక్రమములను చేపట్టవలయునన్న, నిర్ణయించబడిన కార్యకర్తల సహాయము కావలసి ఉండును.

తమరు డబ్బులేదు అనే దానికన్న పనికిమాలిన పనులకు డబ్బు ఖర్చు చేయటం మాని వేయండి, పెండ్లి కార్యక్రమములలో పనికిమాలిన ఖర్చులను చేయవద్దండి. గ్రామాలలో పెండిండ్లు చేయునప్పుడు గ్రామములోని పెండ్లికాని మగపిల్లలకు, ఆడపిల్లల పెండిండ్లు ఒకేసారి జరుగునట్లు,(సామూహిక వివాహాలను) ఏర్పాటు చేయండి. దీనివలన చాలా ఖర్చులు కలిసివస్తాయి. అందరికి ఒకే సమయంలో, ఒకే మంటపములో శుభ కార్యములు జరిగిపోవును. పూర్వకాలంలో పెండ్లిడ్లు చేసినట్లు చేసిన దాని భారమును 10 సంవత్సరములవరకు భరించవలసి వస్తుంది.

నవయువకులు మనస్పూర్తిగా నిర్ణయించుకొనవలసినది ఏమనగామేము పెళ్ళిళ్ళలో పనికిమాలిన ఖర్చులను చేయము. మరియు వాటిని జరుగనివ్వము. వివాహ విషయములలో పొగడ్తల ప్రభావంలో పడకూడదు. సమాజమునకు నష్టము, కష్టము కలిగించు పనిని, త్రాగుపోతు అలవాటును వెంటనే నిర్మూలించటం చాలా ముఖ్యము. 3 రూపాయలు సంపాదించేవాడు 2 రూపాయలు సారాయి తాగిన, తినేది ఏమిటి? సమాజములోని ఇటువంటి దుర అలవాట్లను నిర్మూలించే కార్యక్రమమును యువకులు చేపట్టవలయును యువకులు తమయొక్క పట్టుదలతో ఈ పనిని చేపట్టవలయును. వారిని బెదరించి, లేక హింసించి కాదు. వారి మనస్సు మార్చి, దానివలన జరుగు కష్టనష్టములు, ఆరోగ్య సంబంధ విషయములను బోధించి, వారిలో మార్పుతేవలయును. వారి కాళ్ళువట్టి అయినసరే చెడ్డ అలవాట్లను మాన్పించునట్లు చూడవలెను. ఎవ్వరైతే నిజాయితీ గా పని చేస్తారో, వారికి భగవంతుడు తోడు ఉంటారు. మేలు చేస్తారు. వేరే వాడు ఏమి చేస్తున్నాడు, దానిని చూడవద్దు. నేను ఏమి చేస్తున్నాను అనే విషయమును గ్రహించి చెప్పవలయును.

మిమ్ములను విద్యావంతులను చేయుటకు ఈ సమాజములో ఎవ్వరైతే త్యాగమును చేస్తారోవారి ఋణమును తీర్చుటకు మీరు పాటుపడవలయును. ఈ విషయమును మీరు గ్రహించి, మీ విద్య పై ఎంత డబ్బు ఖర్చు చేస్తున్నది. రెండు వందల కోట్లు మహారాష్ట్ర ప్రభుత్వం ఒక సంవత్సరమునకు ఖర్చు చేస్తున్నది. ఈ డబ్బును, బీదలలోని అతి బీదవాడు కూడ ట్యాక్సు రూపంలో ప్రభుత్వమునకు చెల్లించుచున్నాడు. సమాజముయొక్క ఆ ధనముతోనే, మీరు అభివృద్ధి చెందుచున్నారు. ఏ పురుషుడైతే ఈ ఋణమును చెల్లించలేక పోతాడో ఆ మనిషిని సంస్కారవంతుడు అని చెప్పజాలము. సమాజము యొక్క ఖర్చును, ఒక భాధ్యత వహించిన వ్యక్తిగా ప్రవర్తించవలయును. తమరు ఇతరుల ధనమును భద్ర పరిచిన, మీకు మంచి జరుగుతుంది.

నాకు ఈ విషయంలో చాలా గర్వంగా ఉంటుంది. ఎలా అనగా అఖిలభారతీయ బంజారా సంఘం మరియు బంజారా పత్రికవారు, చండీఘడ్‌లో ఏర్పాటు చేసిన ప్రపంచ రోమా

బంజారా సమ్మేళన మహోత్సవములో హాజరై, ప్రపంచదేశాలనుండి వచ్చిన రోమా బంజారా సోదరులను, సంబంధాలను ఏర్పరచుకొని, సంఘం ద్వారా బంజారా సమాజమును గౌరవమును పెంచినారు. ఈ విషయమును ప్రపంచ దేశాలలో తెలియపరచినారు.

ఈ ఉపన్యాసం అంతంలో తమరికి ఒక ముఖ్య విషయమును, తెలియపరచదలచుకొన్నాను. తమరు దయచేసి వినిండి, మీలో మీరే చిన్న(తక్కువ) భావనను, మీ మనస్సునుండి దూరం చేసుకోండి. ఇతరులు ఎలా పని చేస్తున్నారో చూడండి, మనం వెనుకపడకుండా చూడండి. తమరు, తమ కొరకే బంగారు బాటను ఏర్పాటు చేసుకొండి, అనగా వెనుకటి(కఠిన) మార్గాలను వదలిపెట్టండి, ప్రగతి మార్గంలో ప్రయాణించండి. మన పూర్వీకుల చరిత్రను గుర్తించండి ఈ దేశములో 25 కోట్ల ప్రజలు సామాన్య జీవనమనకు కూడ నోచుకోకుండా తమ చేతులు, కాళ్ళు ఆస్తులుగా చేసుకొని జీవించుచున్నారు, అందువల్ల దేశమును ఏ రూపంలో సంపన్న దేశమని అంటారు?

నేను నా అనుభవములు తమరికి తెలియపరచటం జరిగినది. నవయువకులు సమాజ సేవ చేయుటకు శపథం తీసుకొని, నిజాయితితో, సమాజ సేవలో నిమఘ్నులుకండి. బంజారా సమాజం కూడ సుఖసంతోషాలతో అభివృద్ధి చెందగలదు. ఇక్కడ ఆసీనులైన ప్రజలందరు, శాంతముగా నేను చెప్పిన మాటలను విన్నారు. ఇందుకుగాను మీ అందరికి మరి ఒకసారి ధన్యవాదములు చేసి, నా యొక్క సుదీర్ఘమైన భాషణను సమాప్తం చేస్తున్నాను. జై హింద్.

1974 సంవత్సరము సెప్టెంబరు నెల 15వ తారీఖున అఖిల భారత బంజారా సేవా సంఘం, ఆంధ్ర ప్రదేశ్ శాఖ మీటింగ్ హైద్రాబాద్ గాంధీ భవన్‌లో జరిగిన సభలో శ్రీ వి.పి.నాయక్, మహారాష్ట్ర ముఖ్యమంత్రిగారు సంఘంగూర్చి ఈ విధంగా చెప్పారు. ప్రజలకు కావలసినంత మంచినీళ్ల ట్యాంకు పెద్దగా ఒకటి ఉంటేచాలు, త్రాగకటానికి పనికిరాని, చిన్న చిన్న మురికిగుంటలాంటి ట్యాంకులు ఎన్ని ఉన్న ఏమి ఫలము అన్నారు. తమతమ నాయకత్వంకై ఎన్ని సంఘాలను ఏర్పాటు చేసిన వృథాయే అన్నారు. అదే అందరు సంఘటితమై ఒక గొప్ప సంఘమును, భారత్ మొత్తంలో ఉండి, దానియొక్క శాఖలు, మొత్తం భారతంలో వ్యాపింపచేయవలయును. రాష్ట్రసంఘాలు, ప్రాంతీయ సంఘాలు, జిల్లా సంఘాలనుండి కేంద్ర సంఘవరకు కార్యక్రమములు చేపట్టండి, అప్పుడు బంజారా జాతి, దేశం బాగుపడుతుంది అన్నారు. నేను నా తల్లిని ఎంత ప్రేమిస్తున్నానో అంతకన్నా ఎక్కువగా నా బంజారా సమాజమును ప్రేమిస్తున్నాను అన్నారు.

మార్ గోర్ భాయీావో – గామేర్ కొత్రా బస్‌జూం బస్‌సోమతో!
భాయీా లక్కీషా బంజారార్ కొత్రా విశ్వాసమేతి
కామ్ కరన్ చరిత్రామా రేగోజూం జాతేర్ సేవాకరన్,
భారతేర్ చరిత్రామా రేజావో!

నా బంజారా సోదరులారా- ఊరకుక్క మొరిగినట్లు మొరగ వద్దండి! భాయీా లక్కీషాగారి కుక్క విశ్వాసముతో ఉండి, చరిత్ర కెక్కినట్లు జాతి సేవచేసి, భారతదేశ చరిత్రలో మీ పేరును సార్థకం చేసుకోండి.

# ఆదర్శ వ్యక్తి సర్వ శ్రీ బలిరాం హిరామణ్ పటేల్



శ్రీ బలిరాం పటేల్ జననం 1897లో విదర్భ ప్రాంతం లోని, మహాలుంగీ గ్రామం, ధారవార్ తాలుకా, ఓత్‌మాల్ జిల్లాలో జన్మించారు. వారి తండ్రి పేరు హిరామన్ పటేల్. ఆ కాలంలో వారి గృహ పరిస్థితి సరిగా లేకుండినది. నిజాం రాజ్య కాలంలో విద్యాభివృద్ధికై ఇప్పుడున్న పరిస్థితి ఉండేది కాదు. ప్రజలంతా విద్యా విహీనులై ఉండిరి. విద్యాలయాలు లేకుండెను. బంజారా జాతిలో చదువు విషయం అసలే తెలియకుండెను. అయినను వారు మరాట్‌వాడాలో 4వ తరగతివరకు చదివారు, యుక్తవయస్సు వస్తూనే, వారు తమ ప్రభుత్వ అధికారులతో పరిచయం చేసుకొన్నారు. మరియు వారితో ఒక ప్రత్యేకమైన గుర్తింపును పొందారు. అప్పుడు వారి తాండా జనసంఖ్య సుమారు 30నుండి 40 మంది ఉండిరి. కాని ఇప్పుడు వారి తాండాలో సుమారు 1,000 కుటుంబాలు అయినవి. తాండా పిల్లల విద్యకై వారు 500 రూపాయలు ఖర్చుపెట్టి ఒక స్కూలును స్థాపించారు. కాని ప్రజలు తమ పిల్లలను స్కూలుకు పంపించుటకు ఇష్టపడేవారు కాదు. మరియు వారు హిరా అనుపేరు ఉచిత భోజన హాస్టలును స్థాపించారు. అందులో 124 మంది విద్యార్థులు, 24 మంది విద్యార్థినులు ఉండి, విద్య అభ్యసించుచుండిరి. వారికి భోజనము, పుస్తకములు ఉచితముగా అందించుచుండిరి. వారు తాండాలానే ఒక ఉచిత పుస్తకాలయమును స్థాపించారు. తన వద్ద ఉన్న కూలీల నిరుద్యోగ నిర్మూలనకుగాను ప్రత్తి పరిశ్రమను ఒకటి మాండ్వీ తన ఊరిలోను, మరి ఒకటి అదిలాబాద్‌లో స్థాపించారు. అప్పుడు వందల మందికి పనులు దొరకినవి. వారి వద్ద సుమారు 2000 ఎకరముల భూమి ఉన్నది. వారు ఆ భూమి అభివృద్ధికి ఆధునిక పద్ధతులను ఉపయోగించారు. వారు ఎక్కువగా శ్రమించుచుండిరి. అందువలన భూములనుండి బాగా దూది పంటపండేది. అందువలన, భూములనుండి, పరిశ్రమలనుండి మంచి ఆదాయం వచ్చేది. ఆదిలాబాదులో వారి భూముల గూర్చి చాలా గొప్ప చర్చ జరుగుచుండినది. వారి పంటలను చూచుటకు చాలా దూరదూర ప్రాంతాలనుండి రైతులు వచ్చి చూచి వారినుండి సలహాలు కూడ తీసుకొనుచుండిరి.

బంజారా స్త్రీలు తమ తల జడలలో రెండు ''ఆంటి'' పేరుతో ''V'' ఆకారంలో వేసుకొంటారు. మరియు వాటిపైనుండి ఘాంటియాను కప్పుకొంటారు. వారు కప్పుకొనే గుడ్డ పెద్దగా ఉంటుంది. వారు శరీరం మొత్తంను కప్పుకొని మరియు గవ్వలతో తయారు చేసిన ఆభరణాలను వేసుకొంటారు. సౌభాగ్యవతి స్త్రీతన తలలోని జడలలో వేసుకొను వాటిని మరియు మొరటగా ఉన్న దుస్తులను తీయించి, నవనాగరీక దుస్తులను ధరించవలయునని ప్రేరేపించారు. ఈవిధంగా సాంప్రదాయ దుస్తులను మార్చి వేస్తూన్నారని బంజారా నాయకులు వారిని కులంనుండి వెలివేశారు. తన జాతి సోదరులే వారిని బహిష్కరించినారు. వేషములు మార్చుటవలన ధర్మం నశించుతుందని, భ్రష్టు పడుతుందని ప్రజల అభిప్రాయం ఉండినది. అయినా వారు ఎవరి భయంలేకుండా బంజారాలను అభివృద్ధి పరచుటకు తన వంతు ప్రయత్నం చేసారు. మరియు పెద్ద పెద్ద తాండాలలో సభలను నిర్వర్తించి వారిని ప్రభోదించడం జరిగినది.

ఈ ప్రచారం ద్వారా బంజారాలకు తమ అభిప్రాయంను తెలియపరచి, వారి మనస్సుకు అర్థం అగునట్లు చేసారు. మరియ తను చేపట్టిన ఈ కార్యక్రమములో ప్రజలను భాగస్వాములను చేసారు. చాలా మంది తమ పురాతన దుస్తులను వదలి నవీన దుస్తులను తొడగటం ప్రారంభించారు. గవ్వలతో తయారు చేసిన సొమ్ములను తొడగడం మానివేసినారు. ఈ విధంగా ఈ మహాపురుషుని ఎంత పొగడినను అది తక్కువే అనిపిస్తుంది.

సర్వ శ్రీ బలిరాంగార్కి ఐదు మంది పుత్రులు, మరియు ముగ్గురు పుత్రికలు. అందరు మంచి ఉన్నత విద్యలను అభ్యసించి ఉన్నారు. వారి పెద్ద కుమారుడు శ్రీ ఉత్తమసింగ్ రాఠోడ్. వారు మూడు సార్లు కిన్‌వట్ శాసనసభ స్థానంనుండి విధానసభకు ఎన్నికై వచ్చినారు. వారు యం.ఎల్.సి. గాను ఎం.పి. గా కూడ ఉండిరి. వారి ఒక అల్లుడు శ్రీ ఎల్. ఆర్. నాయక్ మైసూరు రాజ్యం తరుపున ట్రేడ్ కమీషనర్‌గా లండన్‌లో పది సంవత్సరాలు ఉన్నారు. రెండవ అల్లుడు శ్రీ సుధాకర్‌రావు నాయక్ (మహారాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి మరియు హిమాచల్ ప్రదేశ్ మాజీ గవర్నర్) గా పని చేసి ఇప్పుడు అఖిల భారత బంజారా సేవా సంఘం అధ్యక్షులుగా ఉన్నారు. మూడవ అల్లుడు డాక్టర్ బి. బి. చౌహాన్, పరభాని జిల్లాలో సర్జన్‌గా ఉన్నారు. బలిరాంజీ గారి చిన్నతమ్ముడు దత్తారాంజీగారి మొత్తం సంతానం అంతా విద్యావంతులే, దీనిని చూచి అర్థమైనది ఏమనగా బలిరాంజీగారు కుటుంబమంతా బంజారా జాతివారై ఉండి కూడా విద్య, వారు నివసించే విధానం, వ్యాపారం, దానికితోడు ధన సంపద, ఈ దృష్టితో చూచిన మనసమాజంలో చాలా ఏండ్లనుంచి ఆదర్శవంతంగా ఉన్నారు.

సర్వ శ్రీ బలిరాంజీగారు ఈ దేశంలోని బంజారా సమాజములోని ఒక గొప్ప పుణ్యాత్ములై ఉండిరి. వీరిలాంటివారు ఈ సమాజములో పునర్జన్మను పొందు అవకాశం ఉన్నది. వారి వ్యక్తిత్వము ఏ విధంగా ఉండినది అనగా, వారు బీదవారుగాఉండి తనయొక్క స్వయం కృషిమీద, తన స్వహస్తాలతో కష్టించి, నిజాయితీగా ధనము సంపాదించారు. వ్యాపారం అనేది ఏమిటి అను విషయాలను, ఈ సమాజమునకు నేర్పించారు. దీనికితోడుగా తనవారిని, వెనుక బడిఉన్న బీద సమాజమును, బాగు పరచుటకు, వారు విద్యావంతులను తయారు చేస్తూ, వారి యొక్క గౌరవము సంపాదించుటకై వారి వారి కష్టాలను గట్టెక్కించుటకువారు సంపాందించిన వేల రూపాయలను ఖర్చు పెట్టారు. దీనికి ప్రత్యక్ష తార్కాణంవారు వ్రాసిన ''గోర్ బంజారాల చరిత్ర'' అను గ్రంథము.

సర్వ శ్రీ బలిరాంజీగారి ప్రేరణ ద్వారానే శ్రీ వసంతరావు నాయక్‌గారు. శ్రీ ఉత్తం రాథోడ్‌గారు శ్రీ యల్. ఆర్. నాయక్‌గారు, శ్రీ కె. టి. రాథోడ్‌గారు మరియు ఇతర రాజకీయ నాయకులు ఈ రోజు భారతంలో ప్రసిద్ధులైనారు. అదే విధంగా అనేక ప్రాంతములలో అనేక మంది సమాజసేవకులు అయినారు. బలిరాంజీకి తోడుగా విదర్భలో శ్రీ ఫూల్‌సింగ్‌నాయక్‌గారు, సర్వ శ్రీ ధగడూ సింగ్ రాథోడ్‌గారు. శ్రీ రామసింగ్ భాణావత్ శ్రీ సకారాం మూడే, శ్రీవసరాం పటేల్, శ్రీ సోనాబాచందూ నాయక్, కందేశ్‌లో శ్రీ హిరాసింగ్ సదా పవార్, మైసూరు రాజ్యమునుండి సర్వశ్రీ జాతరసింగ్ నాయక్, హైద్రాబాద్ కర్నాటక రాజ్యంనుండి శ్రీ గోపాల దేవ్ జ్యాదవ్, శ్రీ తేజ్‌సింగ్ రాథోడ్, బాంబే కర్నాటక ప్రాంతంనుండి సర్వ శ్రీ హెగప్పా రాథోడ్, శ్రీ ఎల్. ఆర్. నాయక్ ఆంధ్రప్రాంతంనుండి సర్వ శ్రీ పూజారి చాంప్లానాయక్ మొదలగు సమాజసేవకులు వీరి ద్వారా ప్రగతి పథంలో ప్రయాణించుటకు, సమాజంలో వ్యాపించినారు.

ఇదే విధంగా వీరి తరువాత సంతతికి చెందినవారి పేర్లను లెక్కించి చెప్పుటకు సాధ్యపడదు. వీరంతా కూడా సర్వశ్రీ బలిరాంజీగారి సమాజసేవ ప్రేరణలభించి, సమాజసేవకులైనారు.

శ్రీ రంజిత్‌నాయక్‌గారు కూడ శ్రీ బలిరాం పటేల్‌గారి ప్రేరణతోనే బంజారా ప్రజలను జాగృతి పరచవలయునను ఉద్దేశ్యంతో బొంబాయినుండి, హిందీలోను, ఇంగ్లీషులోను బంజారా, రోమా బంజారా వార పత్రికను నడిపి, ప్రజలను చాలా జాగృతి చేసిఉన్నారు. 1974 సంవత్సరము అనంతపురంనుండి తెలుగు బంజారా నడిపారు.

బలిరాం పటేల్‌గారు తన బంజారా సోదరుల అభివృద్ధికై తనువు, మనస్సు మరియు ధనమును ఖర్చు చేసారు. అదే విధంగా బంజారాలు కాని వారి గూర్చి కూడ నిస్వార్థంగా లేకుండా పాటు పడినారు. '' ఛత్రియాంచా జతవార్ ఇతిహాస్'' అనగా క్షత్రియ జాతుల ఇతిహాసం అను పుస్తకంలో సుమారు 20 క్షత్రియ జాతుల ఇతిహాసమును చెప్పడం జరిగినది. అందులో 500 పేజీల పుస్తకం మరియు అందులో కొన్ని చిత్రాలు కూడ ఉన్నవి. లండన్‌లోని లైబ్రరి కొరకు ఆ రోజులలోని నాగపూర్ గవర్నర్ ఈ పుస్తకమును కొన్నాడు. ఆ పుస్తకమునకై ఆ రోజులలో బలిరాంజీగారు 600 రూ. ఇవ్వడం జరిగినది. ఈ విధంగా ఏదైన మంచి పని చేయుటకువారు సహాయం చేస్తూఉండిరి.

శ్రీ బలిరాం పటేల్ ఎత్తుగాను, తెల్ల రంగులో ఉండిరి. వారు ఎల్లప్పుడు నవ్వుముఖంతో ఉండిరి. వారు ఉత్తర భారతంలోని రాజపుత్రులు లాగ ఉండిరి. వారి సంతానం కూడ అలాగే ఉన్నది.

శ్రీ బలిరాం పటేల్‌గారు తన మాండవీ తాండాను ఆధునిక గ్రామంగా తయారు చేయుటకు ప్రయత్నం చేశారు. టౌన్‌ప్లానింగ్ ప్రకారం, గ్రామములోని రోడ్లు వెడల్పుగాను, త్రాగుటకుమంచి నీరు ఇంటింటికి సప్లయి, ప్రాథమిక హైస్కూలు, పోస్టాఫీసు, ఆసుపత్రి, టెలిఫోన్ ఎక్చేంజ్, అంతేకాదు, తాండావాసులకు 16 యంయం ఫిలిమ్ సినిమాహాలు, ఒక శివ మందిరంను కూడ నిర్మించారు. ఈ విధమైనటువంటి సౌకర్యాలు, ఆకాలంలో మంచిగా

అభివృద్ధి అయిన గ్రామములలో కూడ ఉండేవి కావు. వారు వీటినన్నింటిని నిర్మించి ప్రజలకు చూపించారు.

వారు తన దూది ఫ్యాక్టరీలను, మండవీ మరియు ఆదిలాబాద్‌లో నడిపించుచుండిరి. మరియు బొంబాయి మిల్లు వ్యాపారులతో వ్యాపారం చేస్తూఉండిరి. ఆ రోజులలో గొప్ప గొప్ప కంపెనీలను నడిపించగల శక్తి బంజారాలలో ఎక్కడ ఉండినది. అది బలిరాంజీ మాత్రమే తెలుసుకొని ఉండిరి.

బంజారా సమాజమును అభివృద్ధి పరచవలయునని ఆరోజులలో( స్వరాజ్యమునకు పూర్వం) సంపూర్ణ నిజాం మధ్యభారతంలోని విదర్భ ప్రాంతం, బొంబాయి రాజ్యంలోని ఖండేస్, బీజాపూర్, హుబ్లి, పాతమైసూర్ స్టేట్ మరియు మద్రాసు రాజ్యములోని తెలుగు మాట్లాడే ప్రదేశమంతటా విస్తరించి ఉండెను. తన సొంత కాళ్లపైనే ఆధారపడి తన సమాజంలో విస్తరించి ఉన్న అంధకారమును తుడిచి పెట్టుటకు, క్షత్రియ జాతి పోషణకు మరియు ఆభరణములు మార్పు చేయించుటకు, విద్యా వ్యాప్తి చేయుటకు, దానితో పాటు వ్యవసాయ భూములను అభివృద్ధి చేయుటకు అధికముగా పాటు పడినారు.

ఎప్పుడైతే బలిరాం పటేల్‌గారు సమాజ సేవ చేయుటకు పూనుకొన్నారో అప్పుడే మన నాయకుడైన శ్రీ వసంతరావునాయక్ మహారాష్ట్ర మాజీ ముఖ్యమంత్రిగారు నాగపూర్ మేరీస్ కాలేజీలో చదువుకుంటు ఉండేవారు. నాయక్ సాహెబ్‌గార్కి బలిరాం పటేల్‌గారి ప్రేరణ ఉండినది. నాయక్ సాహెబ్‌గారు వారిని తన పెద్ద అన్నగా భావించేవారు. శ్రీ వసంతరావు నాయక్ గార్కి స్వయం బలిరాంజీగారి ఆలోచనలకు చాలా దగ్గర సంబంధం ఉండినది.

సర్వ శ్రీ బలిరాంజీలాంటి వ్యక్తి, ఆకర్షవంతమైన వ్యక్తిత్వం గలవారు. బంజారా సమాజంలో లభించటం చాలా కష్టము. వారు స్వాభిమానం కలిగిన వ్యక్తి అయి ఉండిరి. వారియొక్క పోషణ సర్వ సాధారణంగా అనగా అన్నపానీయాలలోగాని, నడవడికలలోగాని స్వచ్ఛత కలిగియుండిరి. ఎవరైన సరే వారి వద్ద, చిన్న – పెద్ద అందరు గోర్ మాటీ( బంజారాలు) లను గౌరవించుచుండిరి మరియు వారిలో ఎవరైన విద్యావంతులైన బంజారా యువకులన్న, వారి సన్నిధికి వచ్చేవారు. వారు వారిని తన సంతానం కన్నా ఎక్కువ ప్రేమించుచుండిరి మరియు వారికి అభివృద్ధి మార్గములను చూపుచుండిరి. అటువంటి వ్యక్తిత్వం ఉన్నవారిని బంజారా సమాజం ఎన్నటికిని మరవదు.

ఈ మహాగొప్ప వ్యక్తియొక్క పార్థ శరీరం 1973 జనవరి 13వ తారీఖున భగవంతుని సన్నిధిని చేరుకొన్నది. వీరి పేర మహారాష్ట్ర బంజారాలు ఒక ట్రస్టును ఏర్పాటు చేసారు. దాని మీటింగ్, మహారాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి శ్రీ వసంతరావునాయక్ జన్మించిన గౌలీ తాండాలో 1973 సం ఫిబ్రవరి నెలలో జరిగినది. నేను అప్పుడు మహారాష్ట్ర మైసూరు, రాష్ట్రాల టూరులో ఉంటిని. ఆ మీటింగ్ హాజరుగుటకు నాకు భగవంతుడు అవకాశమును ఇచ్చారు. ఆ ట్రస్టు నందు నన్ను కూడా కమిటి మెంబరుగా చేర్చినారు. ఆ ట్రస్టుకై 5,00,000 రూపాయలు నిధి ఏర్పాటు చేసారు. ఉడతా భక్తిగా నేను కొంత జమ చేయడం జరిగినది. వారి పేర ఈనాడు ''కిన్‌వట్'' లో నాందేడ్ జిల్లా బలిరాం హిరామన్ పటేల్ పేరుతో కళా మరియు వాణిజ్యమును బోధించు కాలేజీని స్థాపించి విద్యా బోధన చేస్తున్నారు.

# ఆర్. జాతరనాయక్



కర్నాటక రాజ్యములో బంజారాల అభివృద్ధికి పాటుపడిన ముఖ్యులలో శ్రీ జాతర్‌నాయక్ ఒకరు. వీరి జననము ఆంధ్రప్రదేశ్‌లోని, అనంతపురం జిల్లా, మడకశిర తాలూకా మండ్లూరు గ్రామములో క్రి.శ. 1892 సం జన్మించారు. వీరు రాఠోడ్ వంశము రామావత్ గోత్రం. మడకశిర తాలూకాలో, వీరి జీవనము చాలా కష్టముగా ఉండుటవలన, మైసూర్ రాష్ట్రమందలి మారికడిమె డ్యాం కట్టడం జరుగుటవలన అక్కడవలస వెళ్లినారు అక్కడవారి తల్లిదండ్రులు, అన్న దమ్ములు అందరు అక్కడే నివాసం ఏర్పరచుకొన్నారు.

జాతర్‌నాయక్‌గార్కి విద్యాభాస్యం చేయవలయునను కోరిక చాలా ఉండినది. వారి తల్లిదండ్రుల అనుమతితో 1905 సం ఎ.పి. స్కూలు నందు చేరారు. వీరి విద్యాభ్యాసం ప్రాధమిక విద్యతోనే చాలించబడినది. ఇతను పవార్ వంశం, వాంకోడోత్ గోత్రం కన్యతో 1913 సంవత్సరములో వివాహం జరిగినది.

ఇతను బంజారా జాతి అభివృద్ధికి శక్తి వంచన లేకుండా పాటు పడినారు. వీరు అభివృద్ధి సంఘాలను స్థాపించారు. ఇతను భారతజాతి స్వాతంత్ర్యము, వారి స్థితిగతులను, వారు అనుభవించుచున్న దారిద్ర్యము, అవిద్యా, అమాయకత్వము గూర్చి ఆలోచనాపరుడై నందువలన రాజకీయ కార్యకలాపాలలో కూడ పాల్గొనగలిగారు.

రాజకీయ కార్యక్రమాలలో పాల్గొనుటవలన ప్రభుత్వ కార్యకలాపాల గూర్చిన అవగాహన కలిగి, వెనుకబడిన జాతుల అభివృద్ధికై ప్రభుత్వంతో పోరాడి కొన్ని అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టగలిగారు.

పూర్వం బంజారాలు, టిప్పు సుల్తాన్ సైన్యముతో ఉండి, ఇంగ్లీషువారితో పోరాడుటవలన, వీరిని అదుపు చేయుటకుగాను, ఇంగ్లీషువారు, బంజారాలను క్రిమినల్ ట్రైబ్స్ గా గుర్తించి, ప్రతి రోజూ దగ్గరలోని పోలీసు స్టేషన్‌లో పోయి హాజరు కావలయునను, నియమంచేసి ఉండిరి. ఇది బంజారాలకు నిత్య జీవనమునకై చాలా ఆటంకముగా ఉండినది.

అప్పుడు శ్రీ జాతర్‌నాయక్ గారు, స్వయంగా బ్రిటీషు హైకమీషనర్ గార్ని కలసి, ఇది చాలా అన్యాయం, బంజారాలు, క్రిమినల్స్ అయిన జైలులో ఉండవలయును కదా? ప్రస్తుతము వీరు జైళ్ళలో ఎంత మంది ఉన్నారు. ఒకవేళఉన్న ఏ ఏ కారణములవలన జైళ్ళలో ఉన్నారు. ఒక విచారణ కమిటిని వేసి, విచారించవలయునని, విజ్ఞాపనచేస్తారు. దానికి స్పందించిన బ్రిటీషువారు, జైలు అధికారులకు ఉత్తర్వులు పంపినారు. వాటిలో బంజారాలు లేరు. ఒక వేళ

ఒక్కరు ఇద్దరు ఉన్నావారు ఏవో కొన్ని జీవనమునకై పండ్ల దొంగతనములో, కూరగాయల దొంగతనమో లేక, గొఱ్ఱె, మేకల దొంగతనమో చేసినవారు తప్ప, బలమైన నేరస్తులు కాదు అని తెలిసినది. ఇది గ్రహించిన హైకమీషనర్‌గారు బంజారాలను ''సిటి యాక్టు నుండి'' బంజారాల పేరును తొలగించుటవలన, బంజారాలు, అందరితో పాటు స్వేచ్ఛా వాయువును పీల్చుకోగలిగారు.

1926లో జరిగిన బెలగామ్ కాంగ్రెస్ మహాసభలో గొప్ప గొప్ప దేశనాయకులతో పరిచయం చేసుకొని, గాంధీజీగారి ఆశీర్వాదమును పొందగలిగారు. 1926 సం మార్చి నెలలో అఖిల భారత బంజారా మొదటి మహాసభను, హిరియూరు తాలుకాలో ఏర్పాటు చేశినారు. ఆ సభకు శ్రీ కోదండ రామయ్యగారు. శ్రీ సంజీవయ్యగారు. తోపాటు చాలామంది పెద్దలు కలిసి బంజారాల అభివృద్ధి గూర్చి చర్చించి, మొదటి సభను జయప్రదం చేసారు.

1927 సం శ్రీ జాతర్‌నాయక్‌గారు, ఆస్తాతో, అనారోగ్యంగా ఉన్నప్పుడు. మైసూర్ రాజావారి డాక్టరు అయిన శ్రీ చంద్రఖాన్ సింగ్‌గారు వైద్యం చేసి, వారి ఆరోగ్యమును కాపాడగలిగారు.

1927 సంవత్సరము బంజారా విద్యార్థులకై చిత్రదుర్గం నందు, బొంబాయి, బెంగుళూరు హైవే రోడ్డులో ఒక హాస్టలును స్థాపించారు. ఈ హాస్టలు నిర్మాణమునకు 5,000/–రూపాయలను శ్రీ అనంతయ్య శెట్టిగారు విరాళంగా ఇవ్వడం జరిగినది. ఈ రోజు విలువను పట్టి చూస్తే దానివిలువ ఒక కోటి రూపాయలు పైన చేస్తుంది.

1928 సంవత్సరములో సింగపూర్ కావల్ సంఘంవారు ఇచ్చిన 150 ఎకరముల భూమిని దానంగా పొంది, దాని ఆదాయంతో బంజారా విద్యార్థులకు హాస్టలు వసతి, ఉచిత భోజన వసతులను కల్పించివారి విద్యాభివృద్ధికి పాటుపడినారు. దీనినే బబ్బూర్ ఫారం అని అంటారు.

1930 నుండి 1951 సం. వరకు వారు మొత్తం భారత పర్యటన చేసి, బంజారాలను జాగృతి పరచి, దేశం మొత్తంలో సంఘాలను స్థాపించగలిగారు.

1952లో రాజకీయ లబ్ధిని పొందుటకుగాను చళికేరి, హిరియూరు రిజర్వ్ పార్లమెంటు స్థానంనుండి పార్లమెంటుకు పోటి చేయగలిగారు.

శ్రీ జాతరనాయక్‌గారు, స్వతంత్ర సమరయోధుడు, ఆనాటి ప్రజలలో ఉన్న, దారిద్ర్యం, అవిద్యా, మొరటుతనం, ఆర్థిక బలహీనత, రాజకీయ చైతన్యంలేనందువలన, వీరి అభివృద్ధికి రేయింబవళ్లు కష్టపడి, ఇటు ప్రజలతోను, అటు ప్రభుత్వంవారితోను, పోరాటం సల్పి, వారిని జాగృతి చేసివారి పిల్లలకు విద్యాభివృద్ధిని చేకూర్చుటకు, ఎన్నియో కష్టనష్టాలకు ఓర్చి, పనిచేసాడు. ఆనాడు వారిని బంజారాలు, మా అభివృద్ధికోసం, జన్మయెత్తిన, మహానుభావుడుగా ఆరాధించారు. వారి చైతన్యమే, ఆంధ్రదేశంలో కూడ వెల్లి విరసింది. వీరి ప్రోత్సాహముతోనే, పెనుకొండలో సొంత భవనమును నిర్మించి, ధక్కర భాపా లంబాడి హాస్టల్ని స్థాపించగలిగారు. శ్రీ పూజారి చాంప్లానాయక్, నాగినాని చెరువుతాండావారికి, వీరి ప్రభావము

ఎక్కువగా ఉండినది. ప్రతి తాండా యందు సమావేశములు జరిపి, బాలబాలికలకు విద్య నేర్పించవలయునని ప్రభోదించెవారు. వారి హాస్టళ్ల నుండి చదివివచ్చిన పిల్లలకు ఉద్యోగ వసతులు కూడ చూపించే ప్రయత్నం చేసేవారు. వీరి యందు అపారమైన దేశభక్తి, త్యాగబుద్ధి కలిగి అఖిలభారత బంజారాలను జాగృతి పరచగలిగారు, వీరి ప్రభావం మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ బంజారా సంఘం కార్యకర్తల పైపడి, వారు కొంత అభివృద్ధిని సాధించగలిగారు. వారిలో శ్రీ వడితే గోపాలరావునాయక్ ఒక్కరు.

వీరు బంజారా సంస్కృతిని, వారి డ్రస్సులను తయారు చేయించి భారతంలో ప్రచారం గావించారు. శ్రీ జాతరనాయక్‌గారు, ఆజాను బాహుడు, గంభీరమైన మీసాలు, ఎర్రగా, అందంగా, బలిష్టమైన కండపుష్టి కలిగి, ఎల్లప్పుడు, తలకు జరీపాగా, కోటు, ఫుల్ పంచతో ఆకర్షణీయంగా ఉండేవారు.

వీరు ఆకస్మికముగా గుండెపోటు వలన పరమ పదించారు. ఈయన ఆకస్మిక మరణం ప్రజలను దుఖఃసాగరములో ముంచెత్తినది. వేలాది మంది అభిమానులు, బంజారా తాండా ప్రజలు, కన్నీరు మున్నీరుగా ఏడ్చి, ఇంత గొప్ప బంజారా సంస్కర్త ఇకమాకు దొరకగలడా అని ఇకమాకు దిక్కెవరు అన్నట్లుగా అక్కడి ప్రజలు దుఖఃసాగరంలో మునిగిపోయారట.

# శ్రీ పూజారి చాంప్లానాయక్



రాయలసీమ ముఖ్యముగా అనంతపురం జిల్లాలో బంజారాల అభివృద్ధికి పాటుపడిన ముఖ్యులలో శ్రీ పూజారి చాంప్లానాయక్ ఒకరు. వీరి జన్మస్థలం నాగినాని చెరువు తాండావారు వీరు చౌహన్ వంశం, మూడ్ గోత్రీయులు; వీరు 1905 సం లో జన్మించారు. వీరు అవిద్యావంతులు, దస్తూరి మాత్రం చేయ గలిగేవారు. వీరు తాండా నాయకులు, వీరికి మైసూర్ రాజ్యములోని శ్రీ జాతర్‌నాయక్ గారితో పరిచయం ఏర్పడి, వారి సంఘ కార్యక్రమములు, రాజకీయ చైతన్యం వీరికి అబ్బి తాండా ప్రజల సహకారంతో పెనుకొండలో ఒక సొంత హాస్టలు భవనమును కట్టించి, శ్రీ థక్కర్ భాపా లంబాడి, హాస్టలును, 1946 స లో స్థాపించారు. ఈ హాస్టలు అధ్యక్షులు కీ. శే. శ్రీ గుండూరావుగారు న్యాయవాదులు.

ఈ హాస్టలు మేనేజరు స్వాతంత్ర సమర యోధుడు శ్రీ వెంకటనరసయ్యగారు ఈ హాస్టలునందు. 25మంది బంజారా బాలురకు వసతి ఉండెడిది. శ్రీ వెంకటనరసయ్యగారు

నిస్వార్థిగా పని చేసి బంజారా విద్యార్థుల అభివృద్ధికి చేయూత ఇచ్చారు. నేను(బి.చీనియానాయక్) 1950 సం.ము ఈ హాస్టలులో చేరి పెనుకొండ బోర్డు హైస్కూలునందు విద్య అభ్యసించినాను. శ్రీ పూజారి చాంప్లానాయక్ గారు హాస్టలుకు వచ్చినప్పుడల్ల నన్ను పిలిపించి, కబుర్లు చెప్పుకొంటు ఒళ్లు పట్టించుకొనేవారు.

శ్రీ పూజారి చాంప్లానాయక్‌గార్కి ఇద్దరు భార్యలు, మొదటి భార్య లాలీబాయి రాథోడ్ వంశం. కరంతోట్ గోత్రియురాలు, నాకు పెద్దమ్మవరుస అవుతారు. నేను అనిన ఆమెకు చాలా ప్రేమ ఉండెడిది. వీరి జన్మభూమి నారశింహపల్లి తాండా, అదే నా జన్మభూమి కూడా.

శ్రీ పూజారి చాంప్లానాయక్‌గారికి 11 మంది మగబిడ్డలు, ఐదు మంది కుమార్తెలు. వీరి బిడ్డలందరు విద్యావంతులు, పెద్ద పెద్ద ఉద్యోగులు. వీరి ఆడ బిడ్డలు సంతానం కూడ మంచి విద్యావంతులు, ఉద్యోగులు కూడాను. వీరికి సంబంధించిన బంధువర్గం కూడ మంచి విద్యావంతులు గొప్ప గొప్ప ప్రభుత్వ ఉద్యోగులు. డాక్టర్లు, ఇంజినీర్లు, హైకోర్టు జడ్జి, పోలీసు ఆఫీసర్లు ఉన్నత ఉద్యోగులు.

శ్రీ పూజారి చాంప్లానాయక్ రెండవ కుమారుడు పి. రంజిత్‌నాయక్ బి.ఆర్క్ ఎ.ఐ.ఐ.ఎగారు, బొంబాయిలో పేరు గాంచిన ఆర్కిటెక్చర్. వీరు అఖిలభారత బంజారా సేవా సంఘం యొక్క ప్రముఖకార్యకర్త. అఖిలభారత బంజారా సేవా సంఘమునకు ఎనలేని సేవలు చేసిఉన్నారు.

శ్రీ పూజారి చాంప్లానాయక్‌గారి ప్రభావవమువలన వారి తాండాలో ప్రతి కుటుంబములోను ఇద్దరు లేక ముగ్గురు గ్రాడ్యుయేట్స్ ఉన్నారు. అఖిల భారతంలో శ్రీ పూజారి చాంప్లానాయక్‌గారు స్థాపించిన హాస్టలు విద్యావంతులే అగుపించారు. అనంతపురం జిల్లాలో ఉన్న బంజారా విద్యావంతులు, ఉద్యోగులలో 80% మంది ఇక్కడనుండి ఉత్పత్తి అయినవారే!

శ్రీ పూజారి చాంప్లానాయక్‌గారు దైవభక్తి కలిగినవారు. ప్రతి సంవత్సరము దసరా పండుగ టైములో మరియామా పూజలు(శక్తి) చేయించేవారు. వీరు నిర్వర్థించు ఈ పూజా కార్యక్రమములకు, అనంతపురం జిల్లా తాండానాయకులందరిని ఆహ్వానించి, చాలా గొప్పగా జరిపించేవారు.

శ్రీ చాంప్లానాయక్, అజానుబాహుడు, ఎత్తుగాను, ఎత్తుకు తగ్గలావు, ఎర్రగాను, గంభీరమైన మీసములు, తలపాగా, ఫుల్‌జుబ్బా, ఫుల్‌పంచకట్టుకొని, చూపరులకు అట్టే ఆకర్షింప బడేవారు. వీరు 1959 సం.లో పరమపదించారు. అతి తక్కువ వయస్సులోనే కాల ధర్మమునొందిరి. వీరి మరణము బంజారాల అభివృద్ధికి ఎనలేని నష్టమును కలిగించినది. వీరు లేని లోటును అనంతపురం జిల్లాలో భర్తి చేయువ్యక్తి బంజారాలకు లభించలేదని చెప్పవచ్చును. వీరి సేవా నిరతి, వీరి దూరదృష్టియే ఈ నాడు అభివృద్ధి చెందిన బంజారాలేనని చెప్పవచ్చును.

> "నీవు చేసే ప్రతిపనిని భగవంతుడు పైనుండి గమనిస్తున్నాడని గుర్తుంచుకో"

# సాగర గంభీరమైన వ్యక్తిత్వము

# శ్రీ బాబా సాహెబ్ రాజుసింగ్ నాయక్

సాగర గంభీరమైన వ్యక్తిత్వము : ఆ రోజులలో ''పూసద్ సమాచార్'' అను పత్రికలో హోలి పండుగ విశేషమును గూర్చి చదువుచుండెను. అతని కంటికి పూసద్‌లో నివాసమున్న ప్రముఖ వ్యక్తులలో జమిందారులు అను బిరుదమును ఇచ్చి ఉండిరి. అందులో మొదటి బిరుదము శ్రీ బాబాసాహెబ్ నాయక్‌గారి పేరు ఉండెను. ''రాష్ట్రపతి'' పాఠకులందరు ఈ బిరుదమును చాలా గొప్పగా అభిమానించారు. కారణమేమనగా అందులో వినోదము తక్కువగాను. విషయం గూర్చి అధికముగా ఉండెను. నిజంగానే శ్రీ బాబాసాహెబ్ పూసద్‌లో గొప్ప అభిమానము గల, అందరి మన్ననలను పొందిన వ్యక్తి. ఏ విధంగా మహారాష్ట్ర ముఖ్యమంత్రి పదవిని అలంకరించిన శ్రీ వసంతరావ్‌జీనాయక్, తమ యొక్క నాయక్ అను పేరును, సంపూర్ణ అర్థం వచ్చునట్లు ప్రజోపయోగము చేసి, తన కన్న పెద్ద అగు అన్న శ్రీ బాబా సాహెబ్ నాయక్‌గారు, కూడ పూసద్ తాలుకానే కాకుండా సుమారు మొత్తం విదర్భ ప్రాంతములో తన యొక్క బిరుదము సార్థకమును చేసి చూపించారు.

శ్రీ బాబా సాహెబ్ నాయక్ వ్యక్తిత్వములో జన్మతా జాతిలోని తనయొక్క గొప్ప గుణములను ఈనాటి ప్రజలకు చేసి చూపించారు. వారియొక్క కార్యదీక్షను, వ్యవసాయములో



పద్మశ్రీ శ్రీ రామ్‌సింగ్ బాణావత్‌గారు, శ్రీ బాబా సాహెబ్‌నాయక్‌గారు గ్రంథకర్త బి. చీనియా నాయక్ తదితరులు

వారికున్న అనుభవమును ప్రజలకు చేసి చూపించారు. ఈ రోజులలో పూసద్ ప్రాంతమంతయు పచ్చదనముతో అల్లుకొని పోయినది అంటే అది అంతయు శ్రీ బాబా సాహెబ్ నాయక్‌గారు, అహర్నిశలు శ్రమించి పనిచేసిన ఫలము అని ఆ ప్రాంత ప్రజలు ఎన్నో విధములుగావారిని తలంచుకొంటారు. వారు వ్యవసాయం ప్రారంభించినపుడు ఇప్పుడున్నటువంటి పరిస్థితులు లేవు. అసలు వ్యవసాయమే సరిగ చేసేవారుకాదు. వీరు వ్యవసాయంలో ఎన్నో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చారు. మొత్తం భూమిని రకరకాల వ్యవసాయ ఉత్పత్తులకై కేటాయించారు. అందులో ప్రజలు తమ వ్యవసాయ దిగుబడులు పెంచుటకు గాను, హైబ్రీడు విత్తనములను ఉత్పత్తి చేయవలయునని నిశ్చయించినారు. వారు, హైబ్రీడు బాజరా, హైబ్రీడు జవార్, హైబ్రీడు గోధుములు, ప్రొద్దు తిరుగుడు, హైబ్రీడు ప్రత్తి పంటలు పండించి, వాటిని తన సొంత యంత్రంలో ప్రొసెసింగ్(శుద్ధి) చేసి వాటిని, చెడిపోకుండా భద్రంగా ఉండునట్లు చర్యలు తీసుకొని, విత్తన ఉత్పత్తి చేసి దేశమంతటా వ్యవసాయ దారులకు సరసమైన ధరలకు అందచేసేవారు. వాటినుండివచ్చు సొప్ప, గడ్డిని, సద్వినియోగం చేయుటకు డైరి ఫారమును స్థాపించారు. దానివలన పాలతో పాటు, మంచి జాతి ఆవులను ఉత్పత్తి చేస్తూ తన పొలాలకు సరిపోవు ఎరువును ఉత్పత్తి కూడ చేసారు. పౌల్ట్రి ఫారములు, పండ్ల తోటలు మరియు వ్యవసాయమునకు సంబంధించిన ఎన్నో కార్యక్రమములు చేపట్టి, దానిని వ్యవసాయ పరిశ్రమగా మార్చి అక్కడివేల మంది ప్రజలకు మంచి ఉన్నతమైన ఉద్యోగ వసతులను కల్పించారు. ఈ ప్రాంతము వ్యవసాయకంగా అభివృద్ధి చెందినది అంటే కేవలం శ్రీ బాబా సాహెబ్‌గారి వ్యవసాయోత్పత్తులపై ఉన్న దూరదృష్టి అనవచ్చును.

శ్రీ బాబా సాహెబ్‌నాయక్‌గారి రాజకీయం, ఆదర్శమైనది మరియు గర్వించదగినది. మొత్తం విదర్భ ప్రాంతంలో రాజకీయ జాగృతి చేయడం జరిగినది. మొత్తం విదర్భ ప్రాంతంలో ఎటువంటి రాజకీయ మార్పులను తేవలయునన్న అక్కడి రాజకీయ నాయకులు. శ్రీ బాబా సాహెబ్‌నాయక్‌గారి సహకారం వలననే జరిగేది. రాజకీయంలో భీష్మునివంటివాడు. వారు చెప్పిన మాటలను జవదాటి బయటికి పోవలయునన్న ధైర్యం అక్కడివారిలో ఎవ్వరికి లేదు. అక్కడి వారిలోవారు చెప్పిన ఆదేశమును కాదు అని ఎవ్వరు చెప్పలేరు. ఎందుకనగా వారుచేప్పే రాజకీయ లాభములు అక్కడి ప్రజలందరికి శిరోధార్యములు. వారి మాటలన్నా, వారి ఆదేశము లన్న ప్రజలు ఉత్సాహముతో ముందడుగువేసేవారు. ఏదైన నిర్ణయంవారు తీసుకొనదలచిన వారు అందరిని సంప్రదించి, తీసుకొనేవారు. వారికి ప్రముఖమైన స్నేహితులైన వ్యక్తులు, శ్రీ విఠల్‌రావ్ దేశ్‌ముఖ్, డా.ఆహలే మరియు ఎంతోమంది వారి ముఖ్యకార్యకర్తలైన రాజకీయ నాయకులు, వారి సలహాలను తీసుకొననిదే ఏ దేని ముఖ్య కార్యక్రమములను బాబాసాహెబ్ నాయక్‌గారు చేసేవారుకాదు. ఈ కారణంగానే పూసద్ తాలుకా రాజకీయంలో ఎప్పుడు కూడ ఆటంకంకలుగలేదు. అక్కడి ప్రజలందరు మంచిగా కలసిమెలసి ఉండేవారు.

**వ్యక్తిత్వము యొక్క మహోత్యం (మంత్రం) :** ఈ ప్రకారంగా చూచినట్లయితే బాబాసాహెబ్‌గారి విద్యార్హత చెప్పుకోదగ్గ ఏమియులేదు. అయితే కూడ వీరివద్ద గొప్ప గొప్ప విద్యావంతులు కూడా, వారి మార్గదర్శములను తెలుసుకొనేందుకు పూసద్‌కు వారితో కలవటానికి వచ్చేవారు. అందువలననే శ్రీ బాబాసాహెబ్ గార్ని మాంత్రికుడు అనేవారు. ప్రతిదినం ప్రొద్దునేవారి బంగ్లావద్ద, వారిని దర్శించటానికివచ్చే ప్రజల హారములు ఉండేవి.

ఎంతో మందికి ఎన్నో రకాల పనులు ఉంటవి, ఇక అనారోగ్యవంతులు, వారి సలహా తీసుకొనుటకు లేదా సహాయం పొందుటకు కొంతమంది, సమాజ పనులకుగాను కొంతమంది తన సమస్థలను అభివృద్ధి పరచుటకు చందా కొరకకో వస్తారు. వచ్చిన ప్రతి ఒక్కరు, వారిని కలిసి సంతోషముగా పోతున్నట్లు కనుపించుతారు.

**శ్రద్ధాశక్తులు :** సమాజ సేవలో బాబా సాహెబ్‌గారి హస్తం చాలా గర్వించదగినది.. బంజారా సమాజములో ఎన్నో సామూహిక వివాహములు వారి ఆశీర్వదంవలననే జరిగినవి, జరుగుచున్నవి కూడా. బంజారా సమాజముతో పాటు, ప్రతి సమాజముయొక్క సామూహిక వివాహాలు బాబా సాహెబ్ జీవితంలో పూసద్‌లోని సామూహిక జీవనంలో లీనమైపోయినారు. పూసద్‌లోని ఏ వివాహం కూడ వీరి ఆశీర్వాదంలేనిది జరుగలేదు. వరుడు వధువు, వారి తల్లి దండ్రులువారి రాకతో ఎంతో సంతోషిస్తారు అంటే, తమ పెండ్లికి స్వయం ఈశ్వరుడే వారికి ఆశీర్వాదం ఇచ్చుటకు నడచివచ్చినట్లుగా భావిస్తారు. ఇంతటి శ్రద్ధా భక్తులువారిలో కలుగుచుండేవి. మరియు ప్రజలపై కూడావారికి అంత ప్రీతి ఉండినది. ప్రజలు వార్కై తమ ప్రాణములను ధారపోయుటకు సిద్ధంగా ఉండిరి. వారకి ఏదైన ఆనారోగ్యం అయినది అని తెలిసిన డాక్టర్లు పోటిపడి వచ్చేవారు. అంతకన్న ఎక్కువగా ప్రజలు వచ్చేవారు. వారి ప్రార్థనలు, దీవెనలు డాక్టర్ల కన్నా బాగా పనిచేసేవి, ఎన్నో వేలమంది ఆరోజు చింతితులైనా రంటే, వారి యొక్క హృదయ పూర్వకమైన ప్రార్థనలు భగవంతుడు ఆలకించి, వారికి వచ్చిన గండమును తొలగించినారు. ప్రజల సంతోషమునకు ఎల్లలులేకుండెను.

శ్రీ బాబా సాహెబ్‌గారు, ఖుద్దున తనయొక్క విద్యను ఎక్కువగా ఆర్జించలేదు. అయిన బీదప్రజలయొక్క పిల్లలకై విద్య మరియు వారి అభివృద్ధికి, వారు ఎన్నిచేసినా, వారి స్వర్గియ పిత్రుదేవులు ఫూల్‌సింగ్‌నాయక్‌గారి, ఉత్కంటమైన ఇష్టం ప్రకారం, వారు 1962 సంవత్సరములో పూసద్‌నందు ఒక కాలేజీని స్థాపించారు. ఆ రోజులలోవారు, పట్టువిడవకుండా ఎన్నో రోజులు మొత్తంగ్రామము పర్యటించి, ఆరోజులలోనే రెండులక్షల రూపాయలు చందాలు ప్రోగు చేసినారు. ప్రతి రోజువారు పర్యటనకై వెళ్లేవారు మరియు సాయంత్రమవగానే తిరిగి వస్తుండిరి. ఈ రోజు ఫూల్‌సింగ్‌నాయక్ కాలేజీ, విదర్భ ప్రాంతంలో అగ్రంగా వ్యాప్తి చెందినది. వారి వెనుక శ్రీ బాబాసాహెబ్‌గారి అసామాన్యమైన త్యాగము మరియు వారి తపస్సు లెక్కించ సఖ్యముకానిది.

**ఎన్నోగుణ గణములు కల వ్యక్తిత్వం :** ఒక సామాన్యమైన వ్యక్తిత్వముగల బాబా సాహెబ్‌నాయక్‌గారు వారి స్వభావములో అనేకమైన గుణములు కలిగి ఉన్నారు. ఎవరైన ఏదైన సంకటముతో ఉన్నారని తెలుసుకుంటే, వారు వారికి అన్ని రకముల సహాయం చేసేవారు. వారియొక్క స్నేహితుల సంఖ్య చాలా పెద్దది. వారియొక్క రాజకీయ జీవితంలో ఎప్పుడైన, ఎక్కడైన ఎవరి మనస్సులను నొప్పించలేదు. ఎంత అయినా కానిగాక, వేలమందికైనవారు మంచినే కోరిచేస్తారు. వారి సన్నిధిలో అనగా ఎటువంటి లాభము వచ్చు విషయములు ఉన్నను, అది సామాన్యమైనదిగా భావించేవారు. ఎంతో మంది వ్యక్తిగతమైన పోట్లాటలు, సంస్థలయొక్క సందర్భన, వాటిలోని భేదాభిప్రాయములు, వారు చాలా కుశలముగా తీర్చేవారు. రెండు

పక్షములు, చెప్పిన తరువాత వారి మాటలను పూర్తిగా వినేవారు. మరియు అనేక విషయములు వారికి బోధన చేసి, దానియొక్క పరిష్కార మార్గమును, వారికే వినిపించి, పక్షపాతంలేకుండా, న్యాయ సమ్మతముగా వారు చెప్పినది విని ఒప్పుకొనేవారు. ఏదైన ఒక పెద్ద సంస్థయొక్క విషయం మొదలుకొని, సామాన్య ప్రజలయొక్క లేక భార్యా భర్తల వివాదములైనను క్షణంలో తీర్పు చెప్పేవారు, వారి నోటినుండి వచ్చిన మాటలలోని శబ్దము బట్టివారికే తీర్పు చెప్పేవారు. అటువంటి శక్తి ఎవ్వరికి ఉండేదికాదు.

ఇంత గొప్ప మహానీయమైన, సన్మానించ దగ్గ వ్యక్తిత్వం ఉండికూడా వారిపై అభిమానము ఉండికూడ తను గొప్పవాడిని అనుగర్వం ఎప్పుడు కలుగలేదు. వారు ప్రభుత్వ అధికారి కాని, సమాజములోని ఎవరైన గౌరవ ప్రదమైన వ్యక్తికాని, వారిని గౌరవించుటలో వారు ఎప్పుడు వెనుకంజవేసేవారుకాదు. సామాన్య తహసిల్‌దారువారు ఉన్నను వారికి, సాహెబ్ అనే, సంబోధించేవారు. ఇటువంటి చిన్న చిన్న మాటలతోనే వారియొక్క వ్యక్తిత్వం అభివృద్ధి చెంది, అందరికి ఆదరణీయమైనది. ఇటువంటి వ్యక్తిత్వంగలవారు బాబాసాహెబ్‌గారు.

ఇటువంటి ఎన్నో సాధుగుణములు కలిగిఉన్నవారు మరియు, వారిలో ఉన్న ముఖ్య విషయం ఏమంటే, వారిలో నేను, నా యొక్క పేరు ప్రతిష్టలు పెంచుకొనవలయును, అనుస్వభావము వారికి ఉండినదికాదు. వారు ఉన్నంతవరకు ఎన్నో రాజకీయం, సామాజీకమైన, విద్యాభివృద్ధికి పాటుపడినారు, వేలమంది ప్రజలు, భాగ్యవంతులను చేసారు. కాని, వారు స్వయంగా వారు ఉన్నంతవరకు, ఎల్లప్పుడు తెరవెనుకనుండి విశేషమైన పనులు చేసారు. వారి గురించి వర్ణన చేయవలయునంటే ఒక గొప్ప పెద్ద గ్రంథంకాగలదు. కాని ఎప్పుడువారు తన జన్మ దినమును జరుపుకొనలేదు, లేదా తన ఫోటోలు తీయించుకొనలేదు. ఎంతోమంది సమాజ కార్యకర్తలువారిని గౌరవించుటకు, ఆయనపేరుపై తమ పేరు సంపాదించుటకు, వారి ఫోటోలను తీయించుకొని, వారి పేరుతోనే ఎన్నో స్కూళ్ళను స్థాపించారు. వారి పేర బాలమందిరాలు కూడ స్థాపించారు. వారుస్వయంగా పేరు ప్రతిష్టలకు దూరమున్నను, వారి నిస్వార్థమైన సమాజసేవల ఫల స్వరూపమేవారి కీర్తిని పెంపొందించుటుకు అవకాశమైనది. వారే ఒక మంచి చిహ్నము, ఎట్లనగా వారి కీర్తివలననే, ముందు జరుగబోయే ప్రజాభివృద్ధి కార్యక్రమాలను గూర్చి, కార్యకర్తలకు ఉత్సాహము మరియు మార్గదర్శకము, కలుగచేసినవి. శ్రీ బాబాసాహెబ్‌గారి వ్యక్తిత్వము మరియు కర్తవ్యనిర్వహణ, చాలా గొప్పది, విశాలమైనది. ఎట్లనగా సముద్రమువంటి రూపంకలది. వారి వ్యక్తిత్వము మరియు కార్యదీక్ష ముందు తరాల ప్రజలకు క్రొత్త క్రొత్త ప్రేరణలు కలుగచేస్తూ మరియు, వారి దూరదృష్టి గూర్చిన విషయములను చర్చించుచుందురు.

ఏక్‌ధోబో లోయీా-ముట్ఠీభరే కండా
రజెతాణోజ్ పాట్ పడేరో- ఒర్ పచ్ఛ్ కోయిీా సూంగేని!
పిడికెడు కండ - పావు రక్తము వున్నంతవరకే ఈ పొగరు
ఆ తరువాత నిన్ను ఎవ్వరూ చూడరు.

## పద్మశ్రీ, పద్మ విభూషన్

# శ్రీ రామ్‌సింగ్ ఫక్కిరాజీ బాణావత్‌గారు



రామ్‌సింగ్ బాణావత్ తండ్రి ఫక్కిరాజీ, వీరు ప్రతి ఒక్కరికి చిరపరచితులు. వీరు బంజారాలు మరియు వెనుక పడిన ధీన, హీన జాతీయుల ఉద్ధరణకై కంకణం కట్టుకొన్న పెద్దలు. వీరు 15ఆగస్టు 1906 సంలో మహారాష్ట్ర రాష్ట్రంలోని అకోలా జిల్లా, ఫూల్‌ఉమ్‌రి అను తాండాలో జన్మించారు. వీరు 1921 సంలో శ్రీ ఫూల్‌సింగ్‌నాయక్‌గారు, శ్రీ బలిరాం పటేల్, జేట్‌పంటూ నాయక్ మరియు ఇతర పెద్దల ద్వారాప్రారంభించిన జాతి ఉద్ధరణ ఆందోళనలో పాల్గొన్నారు. 1926లో సర్వీస్ ఆఫ్ ఇండియా సొసైటీలో జీవిత సదస్యులయ్యారు. 1931 సంవత్సరములో వీరు ఏర్పాటు చేసిన భారత బంజారా సమ్మేళనములో 5 సూత్రముల కార్యక్రమమును, తయారు చేసివాటిని అమలు జరుపు కార్యక్రమములో నిమజ్ఞమైనారు.

జమిందార్ వ్యవస్థలో మగ్గిఉన్న తన జాతి బంజారాల విముక్తికై, విదర్భ బంజారా సేవా సంఘమును స్థాపించారు. ఈ సంఘమును స్థాపించుటకు తమ శక్తిసామర్థ్యములను బాగా ఉపయోగించారు. వారు బంజారాలను ఈ జమిందార్ వ్యవస్థనుండి విముక్తి పరచుటకు 1946 సంవత్సరము వరకు కష్టించి పనిచేశారు. వీరు బంజారా సమాజమును గిరిజనులుగా గుర్తించవలయునని ఒక ఆల్ ఇండియా రిపోర్టును తయారు చేయించి లోక్‌సభకు సమర్పించే ప్రయత్నంచేసారు. వీరు అఖిల భారతీయ హరిజన సేవా సంఘము, అఖిల భారతీయ ఆదిమ జాతి సేవా సంఘం, అఖిల భారతీయ ఖానాబద్దుస్ విమోచన ట్రైబల్ సేవా సంఘంయొక్క కార్యదర్శిగా పనిచేసిఉన్నారు. డీగ్రెస్, మధ్యప్రదేశ్‌లో అఖిల భారతీయ బంజారా పరిషత్ వీరి ఆధ్వర్యములోనే నడచినది.

శ్రీరామ్‌సింగ్ ఫక్కిరాజీ బాణావత్‌గారు కేవలం భారతీయ బంజారాల అభివృద్ధికే కాకుండ ఇతర దేశములలో నివశించుచున్న జిప్సీలు గూర్చిన అభివృద్ధిని కూడ చేపట్టారు. వారు స్థాపించిన అఖిల భారతీయ బంజార్ా సేవా సంఘంతో పాటు జిప్సీలు అభివృద్ధికై ఏర్పాటుచేసిన సంయుక్త తల్‌వధాన్‌లో 1971లో లండన్‌లో (పీటర్స్‌బర్గు) ప్రథమ జిప్సీ అంతర్ రాష్ట్రీయ సమ్మేళనమును ఏర్పాటు చేసారు; మరియు ద్వితీయ సమ్మేశము ''వాలి ఈ రోమాని కాంగ్రెస్'' జనివాలో ఏప్రిల్ 1978లో ఏర్పాటు చేయడం జరిగినది. మూడవ సమ్మేళనమును 1981 సంవత్సరము జర్మనిలో ఏర్పాటు చేయడం జరిగినది.

వారు బంజారాలయొక్క సంస్కృతి, ఆచారములు, సాహిత్యము, చరిత్ర మరియు కళలను సంరక్షణకై చాలా మంచి రుచిని చూపించారు. వీరు వాటి అభివృద్ధికై ఒక గ్రంథాలయమును స్థాపించుటకు ప్రయత్నం చేసి ఉన్నారు. వీరు బంజారాల ఇతిహాసం(చరిత్ర)పై రెండు గ్రంథాలను వ్రాసిఉన్నారు. వీరికి వివిధ రకములైన సమాజం మరియు వారి సంస్కృతిని, సంబంధములు గూర్చి తెలుసుకొని ఉన్నారు. వీరికి 1967 సంవత్సరములో మహారాష్ట్ర గవర్నమెంటువారు ''దళిత మిత్ర'' అను బిరుదమును ఇచ్చి గౌరవించినారు.

## ఖర్మయోగి గురుజీ

# శ్రీ చంద్రాం రామచంద్ర చౌహాన్



షోలాంపూర్(జిల్లా), తాలుకా ఉత్తర్, నెహ్రూనగర్ నివాసి అయిన ''గురుజీ'' శ్రీ చంద్రాం రామచంద్రచౌహాన్‌గారు సర్వజనులకు ఉపయోగపడు సంస్థను స్థాపించి, జన్మదాత మరియు దాని నిర్వహణకై అత్యంత కృషిచేసిన ఖర్మయోగి అని చెప్పవచ్చును. వీరు ''మాగాస్ సవాజ్ సేవా వంండల్ ''అను సంస్థను (వెనుకబడిన జాతుల సేవా సంఘం) స్థాపించి దాని అధ్యక్షులుగా ఉన్నారు. వీరు స్థాపించిన ఈ సంఘం సర్వజనుల మన్ననలను పొందినది. ఆ సంఘముయొక్క అభివృద్ధి తన ఒక్క షోలాపూర్ జిల్లాకే కాకుండా మొత్తం మహారాష్ట్ర ప్రజలకు మార్గదర్శకమైందే కాకుండా మొత్తం భారతంలోని రాజకీయ నాయకులకు నేతలకు కూడ ఆకర్షించబడినది. ఒక విద్యావిహీనమైన సమాజంలో జన్మించి కేవలం తన శక్తి సామర్థ్యం పైననే సర్వజనుల హితం కోరేవారు, గొప్ప గొప్ప ఆలోచనలు చేసి, ఒక మహాగొప్ప కార్యమును చేపట్టవలయునని నిర్ధారించుకొన్నారు. వారు విద్యా విహీనులైన, వెనుక పడియున్న తన జాతి బంధు వర్గముయొక్క అభివృద్ధికి ఎన్నో ఉపయోగకరమైన కార్యక్రమములను చేపట్టారు. వారి గురించి తెలుసుకొనవలయునన్న వారిని స్వయంగా దర్శించిన కాని తెలుసుకోలేము.

వీరు 1925 సం.లో బీజాపూర్ జిల్లా ఇందీ అను ప్రదేశంలోని లమన్ (బంజారా) తాండాలో జన్మించారు. వీరు వెనుక బడిన జాతిలో, విముక్తి జాతిలోని స్థిరనివాసంలేని సంచార జాతి అయిఉండెను. వీరి కుటుంబము వ్యవసాయ కూలీలుగా ఉండి, జీవనం సాగిస్తూ ఉండిరి. అక్కడవారి జీవనం సరిగా జరగనందున, షోలాపూర్ జిల్లాలోని హోజాకోర్‌వాలికి వచ్చినారు.

కోర్‌వాలిలో వారు నివసించుట ప్రారంభించారు. వారి తల్లి దండ్రులు, పెద్దన్న అక్కడ దొరికే, ఏదో ఒక పని చేసివారి జీవనం గడుపు చుండిరి. 1935లో వారు పది సంవత్సరములు వయస్సున్నప్పుడు అతనిని ఒక రైతు ఇంటిలో పశువులను మేపుటకుగాను జీతానికి ఉంచినారు. వారు నివసించే తాండా ప్రజల యొక్క ఆర్థిక పరిస్థితులు సరిగా ఉన్నందున వారు తమ పిల్లలు స్కూలుకు పోయి చదువుకొనుచున్నది చూచి ఇతని మనస్సులో కూడ చదువు కొనవలయును అను కుతూహలం పెరిగినది. బీదరికం వలన, తన ఈ కోరిక నెరవేరదనుకొన్నాడు. అయిన తనయొక్క బుద్ధి కుశలతతో ఒక ఆలోచన చేశాడు. వారి తండ్రి పారంపారికంగా వస్తున్న విఠల్ స్వామి భక్తుడై ఉండిరి(పాండురంగ విఠల్) తన తండ్రి భక్తియొక్క లాభమును పొందవలయునని నిశ్చయించుకొన్నాడు. ఆ గ్రామములో చదువు నేర్పిస్తున్న అంబూరే గురుజీ వద్దకుపోయి, వారి వద్ద తన అభిప్రాయమును తెలియపరచారు. వారిని ప్రార్థించారు. తమరు

నా తండ్రితో నా చదువుగూర్చి తెల్పండి, వారు తమరి మాట తప్పకుండా వింటారు. కాదనలేరు అని కూడా అన్నారు.

శ్రీ అంబూరే గురుజీగారు చంద్రాం మనస్సులో దాగివున్న విద్యా దాహమును, వారి తండ్రికి, వివరంగా తెలియపరచి, తప్పకుండా అభివృద్ధి చెందుతారు. విద్యా దానం నేను చేస్తాను అని ఒప్పించ గలిగారు. అప్పుడు చంద్రాం తండ్రి పశువులు కాయటానికి జీతం పెట్టిన పనిని మాన్పించి, బడికి పంపించారు. 1936 సంవత్సరములో తన పేరును స్కూలులో వ్రాయించడం జరిగినది. పంటలు పండించే కాలంలో, పంటల కోతల కాలంలో వారి కుటుంబ సభ్యులు, వేరు వేరు గ్రామాలకు పోవుచుండిరి, వీరు కూడ వారితోపాటు పోతూ, ఆయాగ్రామాలలోని స్కూళ్లలో చదువుకొనుచుండిరి. పొలంపనులు చేసేటప్పుడువారు పనికి పోతుండిరి. మరియు మనస్సు లగ్నం చేసి ఎప్పటికప్పుడు చదువు కొనుచుండిరి. ఈవిధంగా వారు వ్యవసాయ పనులతో పాటు చదువుకూడ చదువుకొంటూ తన చదువు పూర్తి చేసారు. నాల్గవ తరగతివరకు వారు ప్రతి సంవత్సరంరెండు గ్రామాల స్కూళ్ళలో చదువుకొనేవారు. ఈ విధంగా వారు 1941 లో 8 వ తరగతి పాస్ అయ్యారు.

7వ తరగతి పాస్ అయిన సంవత్సరంలో 3లేక 4 మాసములకే వారి తల్లి దండ్రులు చనిపోయిరి. వీరికి గవర్నమెంటు ఉద్యోగం లభించలేదు. వారు తిరిగి వ్యవసాయ కూలీ చేయటం మొదలుపెట్టి తన కుటుంబ పోషణ చేయమొదలుపెట్టారు. 1946 సంవత్సరము మొదలుకొని 1949సంవత్సరమువరకు వారు ఇండియాలోనే వెనుకబడిన జాతులవారికి ఇచ్చే సౌకర్యాలను ఉపయోగించుకొంటు ( బండింగ్) పొలాలలో గట్లువేసే కార్యక్రమంలో మేస్త్రీగా పనిచేసారు.

స్వాతంత్రం వచ్చిన తరువాత వెనుకబడిన జాతులకు కల్పించిన సౌకర్యము ప్రకారం 1949 సంవత్సరములో వీరికి ప్రాథమిక ఉపాధ్యాయ ఉద్యోగం లభించినది. మొట్టమొదట కోరవాలిలో మూసివేయబడిన స్కూలులో వారిని నియమించారు. కేవలం 14 మంది పిల్లలువస్తున్న ఆ స్కూలును 4వతరగతి వరకు అభివృద్ధి చేసి కొద్దికాలంలోనే 200 మందిపిల్లలు బడికి వచ్చునట్లు చేయగలిగారు. అందులో ఇద్దరు ఉపాధ్యాయులను నియమించేటట్లు చేసారు.

హెడ్మాస్టరుగా పనిచేస్తున్నప్పుడు వారికి షోలాపూర్‌లోని కార్యకర్తలు సర్వశ్రీ కమలే గురుజీ, సివలింగ దుగనీ మరియు శివదారేతో పరిచయం జరిగినది. వారి ప్రేరణవల్లనే 1950లో లమాన్( బంజారా) జాతి అభివృద్ధికి గాను పూజ్యనీయ దేశభక్తులు, మామాసాహెబ్ చితలేయొక్క అధ్యక్షతలో షోలాపూర్ జిల్లా లమాన్ సేవామండల్ పేరుతో ఒక సంస్థను స్థాపించారు. ఈ సంస్థయొక్క అధ్యక్షులు శ్రీ కమలే గురుజీ మరియు మహామంత్రి ( కార్యదర్శి) శ్రీ శివలింగ దుగనీ ఉండిరి. వీరి మార్గదర్శకం క్రింద వీరు ఉపకార్యదర్శిగా పనిచేసారు. వీరు ఈ కార్యక్రమమును చాలా ఉత్సాహంగాను, శ్రద్ధతోను చేస్తుండిరి. ఉపాధ్యాయవృత్తితో పాటు వీరు సమాజసేవ కూడ చేస్తు ఉండిరి. ఉపాధ్యాయవృత్తిని చేస్తూ, సమాజసేవ చేయుట అన్నది అంత సులభమైన పనికాదు. చాలా కష్టించి, విసుగు విరామం లేకుండా చేస్తూ ఉండిరి. ఉపాధ్యాయ వృత్తిని వదలి పెట్టి సమాజసేవ చేయవలయునంటే, తన ఆర్థిక పరిస్థితులు బాగా లేవు మరియు సంస్థకూడ క్రొత్తది. కావున దానిని అభివృద్ధి పరచటం కూడ కష్టంగా ఉండినది. అందువలన వారు గాంధీ సేవా సంస్థ మండల్‌వారికి ఒక వినతి పత్రం పంపిస్తూ, వెనుకబడిన బంజారా జాతి అభివృద్ధికిగాను, జీతంపై ఒక పూర్తి సమయమును ఉపయోగించి పనిచేయు

ఒక లమాన్ సమాజంలోని ఒక కార్యకర్తను నియమించవలసినదిగా కోరాడు. ఆ వినతి ప్రకారం, వారు వారి సమ్మతిని తెల్పుతూ ఆ కార్యకర్తకు సమాజ సేవయొక్క ట్రయినింగ్ ఇచ్చుటకు గోపురి ఆశ్రమమునకు పంపించారు. అక్కడవారు పూజ్య అప్పాసాహెబ్ పటువర్ధన్‌గారి నేతృత్వంలో 1955 వరకు సమాజ్‌సేవయొక్క ట్రయినింగ్ హృదయ పూర్వకంగా చేయసాగిరి. అక్కడ ఉండివారు చాలా గొప్ప సత్‌ప్రవర్తనతో ప్రజాసేవలోని ఆనందమును పొందిరి. మానవసేవ చేసినంత అనుభూతిని పొందారు. ఒక సామాన్య అధ్యాపకవృత్తినుండి మహానిష్ఠా గరిష్టుడైన కార్యకర్తగా పరివర్తనం చెందారు.

కోరువాలిలో 1955 సంలో ఆర్థిక ఇబ్బందులకు గురి అగుచున్న వెనుకబడిన జాతుల పిల్లల కొర్కై వారు సానే గురూజీ విద్యార్థి హాస్టల్ని స్థాపించారు. తను స్వయంగా అనుభవించిన కష్టనష్టాలను దృష్టిలో ఉంచుకొని తన జాతిలోని విద్యా.విహీనులైన పిల్లల కొర్కై దీనిని స్థాపించడం జరిగినది. విద్య నేర్చుకొన వలయునను కుతూహలము వలనను, ధనాభావము, నివసించుటకు వసతిలేని కారణంగా చాలామంది పిల్లలు విద్య అభ్యసించకుండా పోవుచుండిరి. ఈ ఇబ్బందులన్నింటిని తొలగించవలయునను పట్టుదలతో శ్రీ చంద్రాం గురూజీగారు, ఈ సాహసవంతమైన కార్యక్రమమును చేపట్టినారు. 14 మంది పిల్లలను చంద్రాం గురుజీ తనఇంటి యందే ఉంచుకొని, ధనవంతులైన వారి వద్దకు పోయి, వారి నుండి సహాయం, మరియు అప్పులను తీసుకొని 1958 సం వరకు వారు హాస్టలు మూసివేయకుండా కాపాడుతూ వచ్చారు. పిల్లలయొక్క భోజన ఖర్చులను వారు తన సొంత జీతంనుండి కూడా ఖర్చు పెట్టుచుండిరి.

కోరవాలీలోనే నేహ్రునగర్‌లో సంఘం కార్యక్రమము యొక్క ఉపయోగార్ధమున్నకై వారు ఒక కార్యక్రమమును చేపట్టిఉండిరి. 1957 లో ఆ సంఘంయొక్క కార్యములు చేపట్టుకు ప్రభుత్వ అనుమతి లభించినది. అదే సంఘమును ఈనాడు ప్రభుత్వంవారు, కార్య క్రమములకుగాను 210 మంది వెనుకబడిన జాతి వారికి ఒక ఆశ్రమ విద్యను కల్పించడం జరిగినది. దానితో పాటు గోర్ వెనుకబడిన జాతి వారి 42 విద్యార్థులను కలుపుకొని అక్కడ మొత్తం 252 మంది అయినారు. ఈ ఆశ్రమ విద్యాలయం ఖర్చు ప్రభుత్వం భరిస్తున్నది.

అదే కాలంలోవారు తనకు సహాయపడుచున్న తోటి ప్రజలకు సహాయం చేయుట కొరకు షోలాపూర్ జిల్లాలోని సుమారు 37 తాండాలలో ప్రాథమిక విద్య మరియు, ప్రాథమిక వాలంటీర్లకుగాను స్కూళ్లు ప్రారంభించారు. 21 తాండాలలో బీదలకు ఇండ్ల స్థలాలను ఇప్పించి, వాటిపై గృహనిర్మాణములను కూడ చేయించి ఇవ్వడం జరిగినది. వాటికై హౌసింగ్ సొసైటీలను స్థాపించారు. 14 సొసైటీలకూ గాను ప్రభుత్వము వారితో సంప్రదించి వాటికి అన్ని రకాల సౌకర్యములను కలుగచేసారు. అంతేకాకుండ వారి జీవనాధారమునకే 9 సమిష్టి వ్యవసాయ సంఘాలను స్థాపింపచేసి 2,000 ఎకరముల భూమినివారు వెనుకబడిన జాతి ప్రజలకు పంచి లాభమును సమకూర్చారు. ఆ తరువాత ప్రణాళికను తయారు చేయించి, ప్రభుత్వంవారు వెనుకబడిన జాతుల అభివృద్ధికి ఇస్తున్న ధనసహాయంతోవారి శ్రమకు తగ్గ అభివృద్ధిని చేపట్టవలయునని తన మనస్సు తల్లడిల్లుచుండెడిది. అందుకని వాటియొక్క ఫలితములను ఎక్కువ మంది బంజారాల అభివృద్ధికి ఉపయోగపడునట్లు చూడవలయును అని భావించేవారు. అదే విషయం తన మనస్సులో వేధిస్తూఉండేది. అందువలన విద్యతోపాటు, ప్రజల ఆర్థికాభివృద్ధికి ఎక్కువ శ్రద్ధవహించుచుండిరి. ప్రభుత్వంద్వారా తప్ప వీరి అభివృద్ధి జరగదు అని గ్రహించారు.

అందుకు గాను వారు జీవనాధారమునకు ముఖ్యమైన నీటివసతిని కల్పించుటకు ప్రభుత్వంతో సంప్రదింపులు చేసి మాకు నీటిని ప్రసాదించండి అనికోరడం జరిగినది.

ఒక ఆదర్శ గ్రామమును స్థాపించుటకుగాను వారు నెహ్రూనగర్ హౌసింగ్ సొసైటీని స్థాపించి అందులో 100 కుటుంబాలకు నివాసయోగ్యమైన గృహములను నిర్మింపచేసారు. అదే కాలంలోవారు అన్ని వసతులను కల్పించగలిగారు. బంజారా జాతిలో వ్యవసాయం చేసే గుణమును అభివృద్ధి పరిచారు. వారు ఎన్నో ఏండ్లుగా వ్యవసాయ కూలీలుగా పనిచేసి ఉన్నారు. అందువలన వారికి వ్యవసాయం చేసేమంచి అనుభవం ఉండినది. దానికి తోడువారు 1946 నుండి 1949 వరకు వ్యవసాయ భూములలో గట్లు వేసే కార్యక్రమములో పనిచేసి మంచి అనుభవమును సంపాదించిఉన్నారు. తనకున్న ఈ అనుభవమును, ప్రజా జీవనంలో మలచుటకు అనేకమైన వ్యవసాయ పనులను, శీఘ్రమే చేపట్టారు, మరియు వీరు చేపట్టిన వ్యవసాయ అభివృద్ధి పనులు ప్రభుత్వ దృష్టికి వచ్చునట్లు చేసారు. ఇది చూచిన మహారాష్ట్ర ప్రభుత్వం వారు 1961లో సహకార మరియు సమిష్టి వ్యవసాయ క్షేత్రములను స్థాపించుటకుగాను ప్రతి జిల్లానుండి ప్రతినిధులను పిలిపించి వారి ద్వారా వ్యవసాయ అభివృద్ధి సంఘము స్థాపించారు. అందులో షోలాపూర్ జిల్లా ప్రతినిధి రూపంలో ఈ మండల్‌తో పాటు వారు పంజాబ్, ఉత్తర ప్రదేశ్ మరియు మధ్యప్రదేశ్ లో పర్యటనలు చేసి ప్రభుత్వ వ్యవసాయ అధికారులకు భూమి అభివృద్ధికి చేపట్టవలసిన కార్యక్రమముల గూర్చి తెల్పడం జరిగినది. మరియు వ్యవసాయ సొసైటీలను స్థాపించు అవశ్యకథను గూర్చి తెల్పినారు. ఈ అవకాశం ద్వారా వారికి మరియొక లాభంకూడ జరిగినది. వారు తిరిగిన ప్రాంతములన్నియు, వాటి ద్వారావచ్చిన విజ్ఞానవమును వారు ఉపయోగించుటకుగాను, వారు గ్రహించిన ప్రతి వస్తువును, పుస్తకములు, పత్రికలు అన్నింటిని ప్రోగుచేసి, వాటి గూర్చి తెలుసుగొనటం జరిగినది.

వారు 1959 నుండి తమ ప్రాంత కాంగ్రెసు మెంబరు అయినారు. 5 సంవత్సరముల నుండి కార్యకార్తగా ఉంటూ, 2 సంవత్సరములు వారు అధ్యక్ష పదవిని పొందారు. షోలాపూర్ జిల్లా మణ్ సేవా సంఘంను 1960 సంవత్సరము నుండి పేరును మార్చి వెనుకబడిన జాతుల సేవా సంఘంగా క్రొత్త పేరును కల్పించారు. వారు ఈ సంఘంనకు 1959 సంవత్సరము నుండి ఇప్పటివరకు అధ్యక్షులుగా పనిచేస్తున్నారు. ఈ సంఘం పేరుతో స్థాపించిన సంస్థలు, నెహ్రూనగర్ మరియు షోలాపూర్ వట్టణంలోను మరియు గ్రామ ప్రాంతాలలోను అనేక సంస్థలను స్థాపించారు.

| | | |
|---|---|---|
| 1. | జాగృతి దీక్షా మందిర్ | నెహ్రూనగర్ |
| 2. | సాన్ గురుజీ విద్యార్థి హాస్టలు | నెహ్రూనగర్ |
| 3. | విజయలక్షి బాలీకల హాస్టలు | నెహ్రూనగర్ |
| 4. | గాంధీ ఆశ్రమ పాఠశాల | నెహ్రూనగర్ |
| 5. | శ్రీ శివాజీ అధ్యయన కాలేజీ | నెహ్రూనగర్ |
| 6. | సంస్కరణ కేంద్రము | నెహ్రూనగర్ |
| 7. | పోస్ట్ బేసిక్ ఆశ్రమశాల | నెహ్రూనగర్ |
| 8. | ఇందిరా బాలల మందిరం | నెహ్రూనగర్ |
| 9. | రవీంద్ర గ్రంథాలయం | నెహ్రూనగర్ |

| | | |
|---|---|---|
| 10. | గాంధీ బాలల మందిరం | నెహ్రూనగర్ |
| 11. | కస్తూరి బాల బాలికల మందిరం | అశోకనగర్ |
| 12. | శ్రీ వసంతరావు నాయక్ హైస్కూలు | షోలాపూర్ |
| 13. | సమతా మరాఠి విద్యాలయ(కాలేజీ) | షోలాపూర్ |
| 14. | సుభాస్ విద్యార్థి హాస్టలు | షోలాపూర్ |
| 15. | అహల్య దేవి బాలికల హాస్టలు | షోలాపూర్ |
| 16. | న్యూ హైస్కూల్ | సల్‌గర్‌వాడ్, షోలాపూర్ |
| 17. | వసంత ఆశ్రమ పాఠశాల(హైస్కూలు) | మంద్రుప్, తాలుకా దక్షిణ షోలాపూర్ |

వీటితో పాటు క్రింద తెల్పబడిన వ్యవసాయ సహకార సంఘాలకు అధ్యక్షులుగా పనిచేస్తున్నారు.

1. ఆనంద్ కో.ఆపరేటివ్ జాయింట్ ఫార్మింగ్ సొసైటీ లిమిటెడ్, నెహ్రూనగర్, షోలాపూర్.
2. నెహ్రూనగర్ వివిధ కార్యక్రమాల(మల్టిపర్‌పస్) కో.ఆపరేటివ్ సహకార సంఘం లిమిటెడ్, నెహ్రూనగర్, షోలాపూర్.
3. నెహ్రూనగర్ పాల ఉత్పత్తి కో.ఆపరేటివ్ సహకార సంఘం లిమిటెడ్, నెహ్రూనగర్, షోలాపూర్.
4. నెహ్రూనగర్‌ల మణ్ కో.ఆపరేటివ్ హౌసింగ్ సొసైటి లిమిటెడ్, నెహ్రూనగర్, షోలాపూర్.
5. నెహ్రూనగర్ లమాణి లేబర్ కో.ఆపరేటివ్ సొసైటి లిమిటెడ్, నెహ్రూనగర్, షోలాపూర్.

వీటితోపాటు వారు ప్రభుత్వంవారిచే స్థాపించబడిన సంస్థలలోను, మరియు ప్రజోపయోగమైన సంస్థలలో వివిధ రకాల పదవులనువారు నిర్వర్తించుచున్నారు.

1. సుమారు 10 సం.ల నుండి వారు షోలాపూర్ జిల్లా క్రొత్తగా స్థాపించిన పరిశ్రమల సంఘం, డైరెక్టర్ల బోర్డులో పనిచేస్తున్నారు.
2. షోలాపూర్ జిల్లాలో ప్రభుత్వ సంస్థ అయిన కో. ఆపరేటీవ్ సొసైటి ఫెడరేషన్ 5 సంవత్సరముల నుండి అధ్యక్ష పదవి నిర్వహిస్తున్నారు.
3. షోలాపూర్ జిల్లా హాస్పటల్ యొక్క బాగోగులను చూచే కమిటి నందు సభ్యులుగా ఉన్నారు.
4. సుమారు 5 సంవత్సరముల నుండి వారు షోలాపూర్ జిల్లా మజ్‌దూర్(లేబర్) ఫెడరేషన్ యొక్క డైరెక్టరు బోర్డు నందు పనిచేస్తున్నారు.
5. షోలాపూర్ జిల్లా, జిల్లాపరిషత్‌లో మెంబరుగా ఉన్నారు.
6. షోలాపూర్ జిల్లా, మహాత్మాగాంధీ శతాబ్ది కమిటిలో మెంబరు.
7. పోయిన 7 సంవత్సరముల నుండి మహారాష్ట్ర రాష్ట్రము, విముక్తి, మరియు సంచారజాతి సంస్థయొక్క అధ్యక్షులుగా ఉండి వారి అభివృద్ధికి పాటు పడుచున్నారు.
8. మహారాష్ట్ర రాష్ట్రమువారు స్థాపించిన విద్యా ఫెడరేషన్‌లో మెంబరు.
9. అఖిల భారత బంజారా సేవా సంఘంలోని కార్యనిర్వాహక కమిటిలో మెంబరుగా ఉన్నారు.

10. ఏప్రిల్ 1963 నుండి 1967 సం అఖరువరకువారు మహారాష్ట్ర రాష్ట్రంవారిచే ఏర్పాటుచేయ బడిన ఫామిలీ ప్లానింగ్ ప్రోగ్రాములో పాల్గొని షోలాపూర్ జిల్లా తరపున పనిచేసారు.

11. మహారాష్ట్ర రాష్ట్రంవారు స్థాపించిన అస్పృశ్యతా కమిటి, డివిజన్, పూనా, అందులోవారు ఇప్పటివరకు మెంబరుగా ఉండి పనిచేస్తున్నారు.

12. మహారాష్ట్ర ప్రదేశ్ కాంగ్రెస్ కమిటిలో వెనుక బడిన జాతుల వారి అభివృద్ధికి, రాష్ట్ర పురోభివృద్ధిని కాంక్షిస్తూ, వారికి ఏ విధమైన అన్యాయం జరుగకుండా చూచుటకుగాను వీరిని నియమించటం జరిగినది.

13. షోలాపూర్ జిల్లా వెనుకపడ్డ జాతులు వర్గం తరపున, విద్యావంతులైన నిరుద్యోగుల నివారణార్థం నియమించిన సమితి అధ్యక్షులుగా పనిచేస్తున్నారు.

14. మహారాష్ట్ర రాజ్యంయొక్క రోడ్డు, వాహనాల అభివృద్ధి బోర్డు, షోలాపూర్ ప్రాంత అభివృద్ధి బోర్డుకువారు అధ్యక్షులుగా ఉండిరి.

15. షోలాపూర్ జిల్లా హింద్ కుష్టు రోగుల నివారణ సంస్థయొక్క కార్యవర్గ కమిటి సభ్యులుగా ఉన్నారు.

16. షోలాపూర్ జిల్లా శాసన సభ స్థానం సబ్‌కమిటి సభ్యునిగా పనిచేస్తున్నారు.

17. మహారాష్ట్ర ప్రదేశ్ హరిజన కళ్యాణ బోర్డు సభ్యులుగా ఉన్నారు.

18. మహారాష్ట్ర ప్రదేశ్ జిల్లా విద్యార్థి అభివృద్ధి ఫెడరేషన్ అధ్యక్షుల హోదాలో పనిచేస్తున్నారు.



షోలాపూర్, నెహ్రూనగర్ - ఆశ్రమ విద్యార్థులు భోజనం చేస్తున్న దృశ్యమును తిలకిస్తున్న గ్రంథకర్త బి. చీనియా నాయక్ మరియు ఆశ్రమ నిర్వాహకులు

19. షోలాపూర్ జిల్లా వ్యవసాయ కార్మికులను సంఘటిత పరిచి, వారి అభివృద్ధి కార్య క్రమములు చేస్తున్నారు.

20. శ్రీ సాదూ గురుసేవా మండల్, నెహ్రూనగర్ ఈ సంస్థను స్థాపించుటకు ప్రయత్నం చేస్తున్నారు.

1 వ తారీఖు మార్చి నెల 1967 నుండి నెహ్రూనగర్ విద్యార్థి ఆనంద సహకార సముదాయక(జాయింట్) వ్యవసాయ సొసైటీని, సర్వవిదాల అభివృద్ధి చేస్తూ నెహ్రూనగర్‌లోని సంస్థలను మరియు కాలనీ వాసులకు, సమాజమునకు ఆత్మ నిబ్బరం చేయుటకుగాను వారు రాత్రి పగలు కష్టించి పనిచేస్తున్నారు. విరామము లేకుండా రాత్రింబగళ్ళ కార్యక్రమాలు చేపట్టుచు, దృఢ నిశ్చయంతో ఉన్నారు. వారి ప్రజా సేవలను గుర్తించి మహారాష్ట్ర ప్రభుత్వంవారు వారిని సన్మానించవలయునను తలంపుతో, 1967లో వారిని గౌరవించి, వారికి ''ప్రజాబంధు'' అను పేరుతో ప్రసంశా పత్రం ఇచ్చారు. దాని తర్వాత కూడ తన జీవితంలోని ఒక్కొక్క క్షణం, సమాజ సేవకు సమర్పించుటకువారు నిర్ణయించుకొన్నారు. వారు స్థాపించిన సంస్థలకు పగలు చూచుటకు వీలుపడనందున వాటి కార్యకలాపాలను, రాత్రి చాలా ప్రొద్దు పోయేదాక మేల్కొని వాటిని గూర్చిన పనులను చేస్తుంటారు. ఆలశ్యం అను శబ్దంవారి వద్దకు రాకూడదు. వారి సఫలతకు జీవం పోయుటకు ముఖ్యమైన కారణం వారు చిన్న తనంలో తను అనుభవించిన కష్టాలే కారణం.

సమానతయొక్క వ్యవహారం నిర్భయంగా ఉండుట, నివశించే విధానం, మరియు గొప్పవైన ఆలోచనలు, సేవా భావము, దేశాభిమానము, రాష్ట్రము మరియు కేంద్ర ప్రభుత్వం పైన పూర్తి శ్రద్ధ మొదలగు సద్గుణములు వారిలో దాగి ఉన్నవి. ఒక సామాన్య ప్రభుత్వ అధికారినుండి మంత్రులవరకు వారు స్వయంగా, సమాన భావముతో సేవ చేయుటలో వెనకాడరు. జండా చేతిలో పట్టుకొని, చెత్తా చెదారము తొలగించుటలో వారికి కొంచమైనను సిగ్గురాదు. మరియు రెండవ ప్రక్క అధ్యక్ష ఆసనంపై కూర్చుంటారు. వారు ఎలాంటి విధమైన గౌరవమును ఖాతరుచేయరు.

సుఖము, దుఃఖము సమపాళ్ళల్లో చూడవలయును. భగవద్గీతలో చెప్పిన విధంగా నడుచుకొని, సమాజసేవలో తన మనస్సును చందనంతో సమానంగా రుద్ది రుద్ది పూసుకొన్నట్లు ఈ మహావ్యక్తి పరోపకారం. ఇటువంటి వారే చివర కాలం వరకు మానవ సేవను చేస్తూ, అలాగే వారి కొరకువారి దారిద్ర్యము పారద్రోలుటకు, ఇటువంటి మంగళప్రదమైన పనులు చేస్తూ అందరి మనస్సులో సేవా భావము ఉత్పన్నం చేయుటలోనే, వారు సకల ప్రయత్నములు చేయుశక్తి వారిలో దాగిఉన్నది. వారి భావి జీవితం, రాజకీయ,సమాజపరమైన మరియు తమతోటివారి అభివృద్ధి, రోజు, ప్రతి రోజు అధిక సౌఖ్యంతో–స్వయంసమృద్ధి, విశాలమైన తేజస్సుతో వెలుగొందడం, మా యొక్క ప్రయత్నం అంటున్నారు.

నేను నా మహారాష్ట్ర, మైసూరు రాష్ట్రాలు బంజారాల అభివృద్ధి గూర్చి చేసిన ''స్టడీ టూర్'' కాలంలో 1973 సం. జనవరి 30,31 తారీఖులో షోలాపూర్ నెహ్రూనగర్‌ను దర్శించడం జరిగినది. వారు నన్ను చాలా అప్యాయతతో ఆహ్వానించారు. వారు చేపట్టిన కార్యక్రమముల గూర్చి, వారి సంస్థలో పనిచేయుచున్న తోటి సంఘ నాయకులతో పరిచయం చేయించారు.

విద్యార్థులను, ఉపాధ్యాయులను పరిచయం చేయించారు. మరియు వారు స్థాపించిన సంస్థలన్నింటికి తీసికొని పోయి స్వయంగా, వాటి గూర్చిన వివరములు తెలియపరిచారు. అక్కడి ఆశ్రమ పాఠశాలలు, అన్ని సంస్థల ఫోటోలు తీయుటం జరిగినది. గాంధీగారి నిర్యాణదినం ఆగుటవలన వారి మనశ్శాంతికి ప్రార్థనలు చేయటం జరిగినది. వారి మాటలను టేప్‌రికార్డు చేయడం జరిగినది. రోడ్డు నిర్మాణంలో పని చేయుచున్న శ్రీ మోహన్‌రాథోడ్‌గారు, తను స్వయంగా తబల వాయించుతూ, పృథ్వీరాజ్ చౌహాన్ మరియు రాణాప్రాతాప్‌సింగ్‌రాథోడ్ పై బంజారా భాషలో గానం చేసిన పాటలు విని నా ఒళ్లు జలదరించి, వెంట్రుకలు నిక్కపొడుచినవి. ఆ విధంగా వారి బలపరాక్రమములను, శౌర్యములను పొగుడుచు గానం చేసారు. వాటిని కూడ టేప్‌రికార్డు చేయడం జరిగినది.

# శ్రీ భుక్యా బాలాజి దాస్ రాథోడ్ రాజయోగి



శ్రీ భుక్యా బాలాజి దాస్ రాథోడ్ గారు, ఖమ్మం జిల్లా కొత్తగూడెం నివాసులు. వీరి తండ్రి పేరు రాథోడ్. భుక్యారాంజీగారు. తల్లి హంస్లీ బాయి. వీరి గోత్రం రాత్‌ళా. వీరు బంజారా జాతిలో ఆది కవిగా వన్నెకెక్కినారు.

వీరు బంజారాల జాతి అభివృద్ధికై ఎన్నో విధాలుగా పాటు పడినారు. వీరు ముఖ్యంగా సంఘ సేవా కార్యక్రమాలను కాకుండ తన రచన ద్వారా బంజారా ప్రజలను చైతన్య పరచినారు. వీరు బంజారా ''లిపి'' స్వయంగా దేవనాగిరి ''లిపి'' ఆధారంగా తయారు చేసి బంజారా భాషలో ఒకటవ, రెండవ తరగతుల పుస్తకములను ముద్రించి ప్రచారం గావించారు. వారు చేపట్టిన బంజారా లిపిని, అభివృద్ధి పరచియున్న ఇప్పటికి బంజారా లిపి దేశమంతట విస్తరించి, ఎంతో అభివృద్ధిని, భాషాపరంగా సాధించి ఉండేవారు. కాని అటు ప్రభుత్వము ఇటు ప్రజలు వారికి సహకరించలేదు. తను పుస్తకములు ముద్రించి వ్యాపారం చేసుకొంటున్నాడు అనే ధ్యాసలో ప్రజలు పోయినారు.

శ్రీ భుక్యా బాలాజిదాస్ రాథోడ్‌గార్ని స్వయంగా 1974 సంవత్సరములో కొత్త గూడెంలో కలవటం జరిగినది. నేతాజి స్ట్రీట్‌నందు మొత్తం బంజారాల వీధియే ఉన్నది. అక్కడ బంజారాలందరు వ్యాపారులు. అనగా బట్టల అంగళ్లు, కిరాణా అంగళ్లు, బంజారా దుస్తులను కుట్టేటందుకు కుట్టు మిషన్లు ఏర్పాటు చేసి, నానా వృత్తులలో జీవించుచున్నారు. శ్రీ భుక్యా బాలాజిదాస్ రాథోడ్‌గారికి కూడ గుడ్డల అంగడి ఉన్నది. వారు వారి జీవనాధారంగా దానిని నడుపుకొంటూ తన ఆర్థిక సంపాదన ఆధారంగా, బంజారా సమాజమునకు తన తీరిక వేళల్లో కవిత్వం అల్లుకుంటూవాటిని ముద్రించి, బంజారా జాతికి మంచి వెలుగును ప్రసాదించారు. వారిని ఖమ్మం జిల్లా బంజారా మహాసభ మీటింగ్‌నకు ఆహ్వానించడం జరిగినది. నేను (బి.చీనియా నాయక్), జి. అమరసింగ్ రాథోడ్, మాజీ యం.ఎల్.సి గారు హాజరైనాము. ఆ

శ్రీ భుక్యా బాలాజీదాస్ రాఠోడ్ తయారు చేసిన
బంజారా బాలశిక్షలోని కొన్ని పాఠాలు

# बंजारा बालशिक्षा

## सरू (అచ్చులు)

अ आ इ ई उ ऊ ऋ
ऌ ए ऐ ओ औ अं अः

అంకెలు

१ २ ३ ४ ५ ६ ७ ८ ९ १०

## दूसरो (హల్లులు)

क ख ग घ ङ
च छ ज झ ञ
ट ठ ड ढ ण
त थ द ध न
प फ ब भ म
य र ल व श ष स
ह ळ क्ष त्र ज्ञ
ज़ ड़ फ़

## परिचो (అక్షరముల కూర్పు)

उ ऊ ऄ ऄा ऄो ऄौ ऄं

च ज ञ त्र ज्ञ ळ

ट ठ ढ द

ड ङ इ ई ह झ

प ष फ रा

ग न त

व ब क

य थ घ ध छ

म भ

र स ख श ए ऐ क्ष ऋ ल

వత్తులు

ऻ ा ि ी ु ू ृ े ै ो ौ ं :

## बारखडि (గుణింతములు)

क का कि की कु कू कृ के कै को कौ कं कः

ग गा गि गी गु गू गृ गे गै गो गौ गं गः

च चा चि ची चु चू चृ चे चै चो चौ चं चः

ज जा जि जी जु जू जृ जे जै जो जौ जं जः

ट टा टि टी टु टू टृ टे टै टो टौ टं टः

ड डा डि डी डु डू डृ डे डै डो डौ डं डः

त ता ति ती तु तू तृ ते तै तो तौ तं तः

प पा पि पी पु पू पृ पे पै पो पौ पं पः

र रा रि री रु रू रृ रे रै रो रौ रं रः

## पाठ

आ काल त्र्प्राज

जो पाणी सीलो

बेस गिलास गरमो

ला कुरसी रपिया

पी कापी मत

मन्या आ

कुरसि पर बेस

मेजे पर कापि छे

तूँ कापि पीले

पंडितजी आजो

तूँ कुरसी पर बेस

गिलासेमा पाणी छे

तूँ पाणी पीले

सीता तूँ जो

तूँ घर जो

तूँ सवार घर जायेस

तूँ रप्या लायेस

मन्या अते आ

जम्मी पर मत बेस

कापि गरम छे

तू गरम कापी पीले

पंडितजी अते आजो

मेजे पर गिलास छे

पाणि सीळो छे

तूँ सीळो पाणी पीले

सीता तूँ ओते जो

तूँ आज घर मत जायेस

तूँ अत सवार मत आ

तूँ पाँच रप्या लायेस

तूँ एक कलम लातूँ एक गिलास सीळो पाणि ला
ओते किताब मत ला तूँ कलम अन दवात लायेस
तूँ अते स्याई मत लायेस

## सादु संतूर

१. सेवा भाया भूकिया रामावत । २. लोका मसन्द भूकिया मोद्रेचा । ३. लक्ष्मा साद भूकिया रामावत । ४. लालू साद भूकिया रामावत । ५. लिंगा मसन्द झरपला । ६. ठेपा मसन्द मूड । ७. सेविया साद आँगोत । ८. मतरू साद वाँकडोत । ९. भगवान दास हालावत । १०. जग मल दास नूणासावत । ११. सीथळ दास लाकावत । १२. अठल दास सामी क्षत्री । १३. हातीराम बावा पमार । १४. भाव संग बावा माळोत । १५. हेमा साद अजमेरा । १६. बालाजी दास भूकिया रातला ।

सेवा भाया हमारो धाता छे। मरीयामा हमार माता छे। सेवा भाया मरीयामा न हम वरसा वरस पूजाँ छां। त्रो हमने हर गामेमा गड बड वेजना कापाड छे। सेवा भायान सारी जगेर गोर भायी धाव छे। सेवा भाया सासो महान पुरूष छे।

సభకు ఖమ్మం జిల్లా ప్రజలు చాలా ఉత్సాహంగా హాజరైనారు. శ్రీ బాలాజీదాస్ రాఠోడ్‌గారు సభలో బంజారా భాషలో పాటలు అల్లి పాడివినిపించారు. శ్రీ జి. అమర్‌సింగ్ రాఠోడ్ యం.ఎల్.సి గారిపై పాటను అల్లి బంజారా ప్రతినిధిగా వారు ఏమేమి చేయవలసినది పాటలో అల్లుకొంటూ పాడినారు. బంజారా భాషలో కవిత్వమును అల్లి పాడగలిగిన వ్యక్తిని నా జీవితంలో నేను మొత్తం భారతంలో వీరిని ఒక్కరినే చూడగలిగాను. ఆ తరువాత వారు పాడిన కొన్ని పాటలను రికార్డింగ్ చేసుకొనటం జరిగినది. బంజారా వంశ చరిత్రను మొట్ట మొదట వ్రాసి ప్రచారం చేసినవారు వీరు మాత్రమే. అంతటి గొప్ప వ్యక్తిని బంజారా చరిత్రలో సువర్ణ అక్షరములతో లిఖించవలయును. శ్రీ భుక్యా బాలాజిదాస్ రాఠోడ్‌గారు సుమారు 40 పైన పుస్తకములను వ్రాసి ఉన్నారు. కొన్ని తెలుగులోను కొన్ని బంజారా భాషలోను, తెలుగు లిపి అధారంగా తీసుకొని ముద్రించి ప్రచారం కావించారు. అందులో ముఖ్యమైనవి. 1) బంజారా వంశావళి చరిత్ర. 2) బంజారా వంశావళి బుర్ర కథ 3) రాధా మోల అనుద్రామా 4) బాలాజి భజనమాల 5) వేదాంత బాల బోధిని 6) త్రిభాషా బాలాజీ భజనమాల 7) బంజారా సుజ్ఞాన దీపిక 8) పృథ్వీరాజ్ చౌహాన్ బుర్ర కథ 9) ప్రతి రోజు గురుపూజ విధానం 10) బాలాజి బోధనామృతం 11) బంజారా బోధనామృతం 12) బంజారా కీర్తనలు 13) బంజారాల వీర చరిత్ర 14) నవీన బంజారా సాంఘిక సంకీర్తనములు. 15) బంజారా బాలశిక్ష మొదటివాచకం, రెండవ వాచకం. 16) బంజారా సాగలి ప్రచార్ 17) బంజారా బాలాజి పద్య రత్నావళి 18) దోబణ్ లక్ష్మణ బుర్రకథ 19) శల్వరాజ్ శనీవాళేర్ బుర్రకథ 20) సూరజ్ రాఠోడ్ – సుందర చౌహాన్ బుర్రకథ మొదలైనవి ఎన్నో వ్రాసి బంజారాల అభివృద్ధికి పాటుపడినారు.

నేను నా మహారాష్ట్రము మైసూరు రాష్ట్రముల పర్యటన వ్యాసం, 3-7-1973 సం. ''ప్రకటనలు మినహా ప్రగతికి నోచుకోని ఆంధ్రప్రదేశ్ బంజారాలు'' అని పెద్ద హెడ్డింగ్‌తో విశాలాంధ్ర దినప్రతికలో ప్రచురించినదిచూచి, వారు అందులోని నా అడ్రస్సును తీసుకొని తను ప్రచురించిన మొత్తం పుస్తకముల ఒక బండలును వారు నాకు పోస్టు ద్వారా శ్రీశైలం పంపించి ఉండిరి. ఆ పుస్తకములను చూచి నేను చాలా ఆశ్చర్యం పొందాను. మన బంజారాలలో కూడ కవులు ఉండి పుస్తకములను ముద్రించి బంజారా జాతి అభివృద్ధికి పాటు పడుచున్నారని తెలుసుకొన్నాను. ఆనాటినుండి నాకు వారికి ఉత్తర ప్రత్యుత్తరములు ద్వారా పరిచయం ఏర్పడినది. ఆ తరువాత 1974 సంవత్సరములో స్వయంగా వారిని కలుసుకొనే భాగ్యం నాకు లభించినది. బంజారా జాతి ''ఆణిముత్యం'' శ్రీ భుక్యా బాలాజిదాస్ రాఠోడ్‌గారు. వారికి ఒక కుమారుడు ఒక కుమార్తె ఉన్నారు. వారి కుమారుడు డా. హాథీరాం రాఠోడ్ గార్ని హైద్రాబాదులో ఒకసారి కలసి పరిచయం చేసుకొన్నాను. వారి కోడలు కూడ డాక్టరే. బంజారాలలో రాఠోడ్ వంశమునందు బాణోత్ గోత్రం ఒకటి, తెలంగాణా భుక్యాలు( రాఠోడ్ వశం) బాణోత్‌వారిని అన్న తమ్ములుగా భావిస్తారు. కాని రాయల సీమ, సర్కారు ఇతర రాష్ట్రములలో వారితో బంధుత్వం చేసుకొంటారు. కాని శ్రీ భుక్యా బాలాజిదాస్ రాఠోడ్‌గారి కుమారుడు బాణోత్ గోత్రం అమ్మాయిని పెండ్లి చేసుకొన్నారు. ప్రస్తుతం వారి వయస్సు 102 సంవత్సరములు కలిగియున్నారు. భగవంతుడు వారిని వారి కుటుంబీకులను ఆశీర్వదించగలరని ప్రార్థన. వారు వ్రాసిన ఒక పాట కూడ ఈ పుస్తకములో ప్రబోధగీత అను నాల్గవ అధ్యాయం మొదట ప్రచురించటం జరిగినది.

# శ్రీ వడితె. గోపాల్‌రావు నాయక్ బి.ఏ.



శ్రీ వి. గోపాలరావుగారి జననం గుంటూరు జిల్లా వినుకొండ తాలూకా, హనమాపురం తాండాలో, తండ్రి శ్రీ వడితె. బాల్యనాయక్ తల్లి శ్రీమతి హనిమి బాయి వీరికి నాల్గవ సంతానంగా 1926 సం జూన్ 1వ తేదిన జన్మించినారు. వీరికి ఒక అన్న, ఇద్దరు అక్కగార్లు ఉన్నారు. వీరి అన్నగారైన శ్రీ భీమానాయక్‌గారు రైల్వేలో ఉన్నత ఉద్యోగిగా ఉండి రిటైర్డ్ అయినారు.

వీరి తండ్రి స్వర్గీయ శ్రీ బాల్యానాయక్‌గారు, గుంటూరు జిల్లా, వినుకొండ తాలూకా, గండిగామల తాండా. శ్రీ వడితె. లక్కేనాయక్ గార్కి కనిష్ట సంతానంగా 1890 సంవత్సరము జులై 17వ తారీఖున జన్మించారు. శ్రీ బాల్యనాయక్‌గారు ఆ రోజులలో ఉపాధ్యాయులు. వకీళ్ల ఇళ్లల్లో పూట కూళ్లు చేసుకొంటూ విద్యను అభ్యసించారు. వీరు 1923 సంవత్సరములో జిల్లా బోర్డు ఉపాధ్యాయులుగా పనిచేసారు. వీరు శ్రీలాల్ అను ఇంగ్లిషు గవర్నర్‌ను గుంటూరులో కలసి, తాండా పెద్దలు శ్రీ బానోత్ భోజానాయక్, మంత్రు నాయక్ గవర్నర్‌తో పరిచయం చేయించి, లాల్‌పురం, చక్రాయ పాలెం, హనమాపురం తాండాలు కట్టుకొనుటకు అనుమతిని పొంది, కొన్ని వేల ఏకరములు అటవి భూములను విడదీయించి, వారికి వ్యవసాయ వృత్తిని, విద్యాభివృద్ధికి పాటుపడినారు. వీరికి ఇద్దరు కుమార్తెలు. ఇద్దరు కుమారులు. 1) దేవ్లి బాయి 2) భీమిబాయి 3) భీమా నాయక్ 4) గోపాలరావు నాయక్.

వీరు 1948 సంవత్సములో ఏప్రిల్ నెల 2వ తారీఖున. గుంటూరు జిల్లా లంబాడి సంఘమును స్థాపించారు. హనుమాపురం మూడ్‌బద్యానాయక్, ఝరపల లచ్చానాయక్, రామావత్ భీమనాయక్ బి. కోల్యానాయక్, రామావత్ సూర్యనాయక్, ఆర్. చీమన్ నాయక్ ద్వారా విరాళాలు వసూలు చేయించి, తన మేనేజ్‌మెంటు క్రింద కారంపూడిలో మహాత్మాజీ లంబాడి హాస్టలు స్థాపించి, విద్యాభివృద్ధికి పాటు పడినారు. తరువాత తన విధేయుడు అయిన బి. హరిశ్చంద్ర నాయక్‌గార్కి ఈ హాస్టల్ని ఒప్పచెప్పారు.

శ్రీమతి హనిమిబాయి 1973 సంవత్సరము మే 23వ తారీఖు స్వర్గస్తురాలైనారు. శ్రీ బాల్య నాయక్‌గారు తాండాలలో త్రాగుడు, దొంగతనాలు, సారాయి కాయుట, మొదలైన చెడు అలవాట్లను మాన్పించి బంజారాలకు మంచి గౌరవమును తెచ్చారు. వీరు 1973 సంవత్సరము మార్చి నెల 26వ తారీఖున స్వర్గస్తులైనారు.

శ్రీ గోపాలరావునాయక్ ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటి బంజారా గ్రాడ్యుయేట్. వీరి ప్రాథమిక విద్య తండ్రి దగ్గరే జరిగినది. వీరు రెంటచింతల లూథరన్ హైయర్ ఎలిమెంటరి స్కూలునందు ఐదవ తరగతి చదివారు. 1939లో గుంటూరు బోర్డు హైస్కూలులో యస్.యస్.ఎల్.సి. పాస్ అయినారు. 1943లో గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో ఇంటర్ మీడియట్‌లో చేరి, ఇండియన్ హిస్టరి లాజిక్ స్పెషల్ తెలుగు సబ్జెక్టుగా తీసుకొని పాస్ అయ్యారు. 1946 సంవత్సరము తత్వజ్ఞాన శాస్త్రమును తీసుకొని బి.ఏ పాస్ అయ్యారు.

వీరి వివాహం 1947 సంవత్సరము ఏప్రిల్ నెల 30వ తారీఖున తన మేనమామ బాణోత్ హర్జేనాయక్ కుమార్తె బి.లక్ష్మిబాయితో జరిగింది. వీరు 1948 సంవత్సరము గుంటూరుట్రెజరి ఆఫీసులో 51 రూ జీతంతో ఉద్యోగ ప్రవేశం చేసారు. వీరు ఉద్యోగం చేస్తూనే బంజారా సేవ చేస్తుండేవారు.

1948 సంవత్సరము మే 2వ తారీఖున, గుంటూరు జిల్లా లంబాడీలను ప్రోత్సహించి, శ్రీ పెద్దరెడ్డి తిమ్మారెడ్డి, శ్రీ బాచిన సుబ్బారావు అధ్యక్షతన సమావేశ పరచి, శ్రీరామావత్ సూరేనాయక్‌గార్ని అధ్యక్షులుగాను, శ్రీ వి. గోపాలరావునాయక్ బి.ఏ.గారు, కార్యదర్శిగా 25మంది సభ్యులతో జిల్లా సుగాలీ సంఘమును స్థాపించారు. అదే సంవత్సరము 1948 జూన్ 4వ తారీఖున కారంపుడిలో మహాసభ జరిపి, 14 మంది బాలురతో మహాత్మాజీ లంబాడీ హాస్టలు స్థాపించారు.

ప్రతి 3 నెలల కొకసారి సభలు జరుపుచూ, శ్రీ రామావత్ లాలూనాయక్, కేవళా, ఎం. భీక్యానాయక్, వారితో బంజారా భాషలో బుర్రకథలు చెప్పుచూ, బంజారాలను చైతన్య పరుస్తూ బంజారాలను షెడ్యూలు జాతుల లిస్టులో చేర్చాలని, ఉద్యోగ రిజర్వేషన్లు ఇవ్వాలని, తాండాలలో స్కూళ్లు స్థాపించాలని, పిల్లలకు ఉచిత విద్యా సౌకర్యాలు కల్పించాలని హస్టళ్ళు స్థాపించాలని, నివాస స్థలాలు ఇవ్వాలని, బంజరు భూములు వ్యవసాయానికి ఇచ్చి కాలనీలు ఏర్పాటు చేయాలని, తీర్మానములు చేసి ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తూ వచ్చారు. 1949 సం జనవరి 1 వ తారీఖున శ్రీ కాసుబ్రహ్మానంద రెడ్డిగార్ని ఆహ్వానించి, శ్రీ గోపాలరావునాయక్ అధ్యక్షతన మహాసభ జరిపించి, సత్తెన పల్లి, పల్నాడు తాలుకా సంఘాలను స్థాపించారు.

1949 జూన్ నెలలో శ్రీ వెన్నెల కంటి రాఘవయ్య(నెల్లూరు) అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్, ఆదిమ జాతి సేవా సంఘం, వారి ప్రోత్సాహముతో పిడుగురాళ్లలో 16 మంది విద్యార్థులతో థక్కర్ బాపా సుగాలీ బాలుర హస్టలును స్థాపించారు.

ప్రభుత్వ జీ.ఒ.యం.యస్. నం1949 విద్య తేది 27-5-49 ప్రకారం. 1949-50 సంవత్సరము నుండి సుగాలీ విద్యార్థులకు ఫీజు మినహాయించారు. మరి ఒక ఏడు తప్పినా రెండవ సంవత్సరముఫీజు చెల్లించకుండా చదువు కొనసాగించవచ్చును. సుగాలీలు, లంబాడీలు, బంజారాలు ఒకేజాతి వారని ప్రభుత్వమునకు తెలియపరచి, అందరికి వర్తించేలా 15-6-1950 తేదిన విద్యా డైరెక్టరు వారిచే ఈ ఉత్తర్వులు ఇప్పించారు.

1950 సంవత్సరముజూలై 15వ తారీఖున కారంపూడిలో రాష్ట్రంలోనే ప్రప్రథమంగా సుగాలీ బాలికల హాస్టలును స్థాపించారు. దీని స్థాపనకు వారితోపాటు శ్రీ జాకబ్ కె.సి. పాల్ శ్రీ డి. లక్ష్మానాయక్‌గార్లు తోడ్పడ్డారు.

1951 ఫిబ్రవరి 18వ తేదిన గుంటూరు జిల్లా పెదవడ్లపూడిలో ప్రప్రథమంగా ఆంధ్రరాష్ట్ర సుగాలీ మహాసభను ఏర్పాటు చేసారు. ఈ సభకు రాష్ట్రమొత్తంనుండి రెండువేల మంది ప్రతినిధులు బొంబాయి రాష్ట్రము, హైద్రాబాదు, మైసూరు రాష్ట్రమునుండి శ్రీ జాతర సింగ్‌నాయక్, బళ్ళారి జిల్లా బంజారా సంఘ అధ్యక్షులు, శ్రీ బి. శంకర్‌నాయక్, భారత ఆదిమ జాతి సేవ సంఘ కార్యదర్శి శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య ఎం.ఎల్.ఎ మహాసభను ప్రారంభించారు. హాజరైన ప్రముఖులు శ్రీ బి.జి. లమాణి(బొంబాయి) శ్రీయస్. బి. సక్రియానాయక్(మైసూర్ నిమ్న జాతుల స్పెషల్ ఆఫీసర్) శ్రీ బి. రామానాయక్(బి.ఎ) పుంగనూరు, సి.యస్. కళ్యాణ నాయక్, బెంగుళూరు, ఈ మహాసభలో ఆంధ్రరాష్ట్ర సుగాలీ సంఘంను స్థాపించి, 35 మంది సభ్యులతో, శ్రీ బి. శంకరనాయక్ అధ్యక్షులుగాను, శ్రీ వి. గోపాలరావు ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకొనబడినారు.

1951 సం.ము ఏప్రెల్ 7వ తారీఖున, భారత రాష్ట్రపతి, కొత్త ఢిల్లీ వద్దకు శ్రీ వెన్నలకంటి రాఘవయ్య ద్వారా, రాష్ట్రసుగాలీ సేవాసంఘం అధ్యక్షులు శ్రీ బి. శంకరనాయక్, బి. జోగానాయక్ కార్యాదర్శులు, శ్రీమతి బి. కమలమ్మ సభ్యురాలు, శ్రీ వి. గోపాలరావునాయక్ కార్యదర్శి, బి. రామానాయక్ కార్యదర్శికలసి ఆంధ్రరాష్ట్రములోని సుగాలీ యానాది, ఎరుకలు మున్నగు ఆదివాసులను షెడ్యూల్డ్ జాతిలో చేర్చవలయునని కోరారు.

1951సం.ము మే నెల 12వ తేదిన రాష్ట్రకమిటి గుంటూరులో సమావేశమై పుంగనూరులో శ్రీ బి.రామానాయక్, థావర్యానాయక్ ద్వారా, తెనాలి చినరావురులో శ్రీ బి. ఘంకా లాలూ నాయక్ ద్వారా సుగాలీ హాస్టలును స్థాపించుటకు తీర్మానించారు.

1953 ఏప్రిల్ 12వ తేదీన జగ్గయ్య పేటలో సుగాలీ బాలుర హాస్టలు స్థాపించారు. 1953 సం నవంబరు 11,12,13వ తేదీలలో రాంచి – లోహాడ్‌గడ్‌లో శ్రీ పండిట్ హృదయినాథ్ కుంజ్రూ అధ్యక్షతన, ఆదివాసుల మహాసభను, భారత రాష్ట్రపతి శ్రీ రాజేంద్ర ప్రసాద్‌గారు, షెడ్యూల్ జాతుల మహాసభకు, రాష్ట్ర బంజారా సంఘం తరపున శ్రీ పి. గోపాలరావుగారు హాజరైనారు.

1953 జనవరి 31వ తేదీలో మధ్యప్రదేశ్ రాష్ట్రం డిగ్రెస్‌లోని థక్కర్ బాపానగర్‌లో అఖిల భారత బంజారా సేవా సంఘం మహాసభ జరిగినది. ఈ సభకు అన్ని రాష్ట్రాలనుండి సుమారు 500మంది ప్రతినిధులు, హాజరై 20వేల మందిపైబడి జనసమూహంతో 3,000 మంది పైబడి బంజారా స్త్రీలు హాజరైనారు. ఆ సభను ఉత్తంరాఠోడ్, బాణోవత్‌జీ, ప్రతాప్‌సింగ్ ఆడే, గజానన రాఠోడ్ తదితరులు నిర్వహించారు. ఆ సభకు మధ్యప్రదేశ్ డెప్యూటి మంత్రిగారైన శ్రీ వి.పి. నాయక్ అధ్యక్షులు, రైల్వేమంత్రి శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రిగారు ప్రారంభించారు. ఈ సమావేశంలో భారత బంజారాలలో చైతన్యంవచ్చి ప్రప్రథమంగా 20 మంది సభ్యులతో బంజారా సేవా సంఘమును స్థాపించారు. అదే సమయంలో ఆచార్య దాదా ధర్మాధికారి ఆధ్వర్యంలో బంజారా మహిళా సభకూడ జరిగినది. ఈ సభకు శ్రీ వి. గోపాలరావు హాజరైనారు.

1954 సంవత్సరము జనవరి 19,20 తేదీలలో, తొర్రూరు గ్రామం హైద్రాబాదు స్టేట్ లంబాడి మహాసభ జరిగినది. ఆదిలాబాద్ వాసి, శ్రీ బలిరాం పటేల్ అధ్యక్షత వహించారు.

శ్రీ వి.పి.నాయక్ మధ్యప్రదేశ్ డిప్యూటీ మంత్రిగారు, శ్రీ రాజేంద్రస్వామి రామానంద తీర్థగారు మరియు కాంగ్రెస్‌నాయకులు పాల్గొన్నారు. ఆ సమయంలో భారత్ బంజారా సేవా సంఘం కార్యవర్గ సమావేశం జరుపబడినది.

1954 సం.ఏప్రిల్ నెలలో 11,12,13 తేదీలలో అప్పుడు హైద్రాబాద్ స్టేట్‌లో ఉన్న పరభాని జిల్లా, జింతూరు తాలూకా, సోమ్‌ఖడ్‌లో భారత బంజారా సేవా సంఘం ద్వితీయ బంజారా మహాసభలు జరిగాయి. శ్రీ వి.పి.నాయక్ అధ్యక్షత వహించారు. బూర్గుల రామక్రిష్ణా రావు హైద్రాబాద్ ముఖ్యమంత్రిగారు ప్రారంభించారు. ఆదివాసులు సాగుచేసుకొంటున్న భూములకు పట్టాలు పంచిపెట్టారు.

సంఘమునకు శ్రీ ఉత్తం రాఠోడ్ అధ్యక్షులుగాను, ఆంధ్రదేశమునుండి శ్రీ బి. శంకర్‌నాయక్, శ్రీ వి. గోపాలరావునాయక్, శ్రీ యన్. జీవలానాయక్‌గార్లు సభ్యులుగా 30 మందితో సభ్యులను కార్యవర్గమును ఎన్నుకొన్నారు,

1954 సంవత్సరములో ఆగస్టు 5,9 తారీఖులలో బంజారా జాతి పుట్టు పూర్వోత్తరాలను వివరించుతూ, వెనుకబడిన జాతుల కమీషన్ శ్రీ కాకా కలేల్కర్‌గారి వద్దకు రాయబారం పోయి, వీరిని షెడ్యూల్డ్ ట్రైబ్సు లిస్టులో చేర్పించవలసినదిగా సంఘం తరపున శ్రీ వి. గోపాలరావు నాయక్ అధ్యక్షతన, శ్రీ లాలూనాయక్, జోగా నాయక్‌గార్లు, బెజవాడలోను, తెనాలిలోను మెమోరాండం సమర్పించారు. అనంతపురం జిల్లా తరపున, శ్రీ పూజారి చాంప్లానాయక్, యస్, ఘనేనాయక్, పి, రంజిత్‌నాయక్ శ్రీ యల్. రూప్లానాయక్‌గారు మెమోరాండం ఇచ్చారు.

1954 ఆగస్టు 11వ తేది నుండి 15వ తేది వరకు రంజిత్ నాయక్‌తో పాటు శ్రీ వి. గోపాలరావు నాయక్‌గారు అనంతపురం జిల్లా పర్యటించి, నాగినాని చెరువు తాండా, పెనుకొండ, గోరెంట్ల, బుక్కపట్నం ప్రాంత తాండాలను చూచి, తాండా నాయకులను కలసివారికి జాతి అభివృద్ధికై సలహాలు ఇచ్చి ఉన్నారు.

1954 సంవత్సరము సెప్టెంబరు, అక్టోబరు నెలలో ఢిల్లీనుండి వచ్చిన గోసంకర్షణ సంఘ సర్వే అఫీసరుతో పర్యటించి ఆయా తాండాల ఆవులను పరిశీలించి, వాటి సంరక్షణకు కారంపూడి, పాణ్యం, పుంగనూరు సుగాలీ మెట్ట ప్రాంతములలో గోసంరక్షణ స్కీములు పెట్టుటకు వీలు కల్పించమని కోరారు.

1956 సంవత్సరము సెప్టెంబరు 8వ తేదిన కర్నూలు జిల్లా మహాసభను పుల్లల చెర్వు తాండానందు శ్రీ ఉప్పల దిన్నె భుక్యా రామానాయక్ అధ్యక్షతన, శ్రీ కందుల ఓబుల రెడ్డి, వ్యవసాయ శాఖామాత్యుల ద్వారా ప్రారంభింప చేసారు.

పై ఆందోళన కారణంగా, బంజారాలను ట్రైబల్ జాతిలో చేర్చబడి, 1963 సంవత్సరములో కదిరి, మాచర్ల, కావలి, జగ్గయ్యపేట నాల్గు మైదాన ప్రాంతాలకు అసెంబ్లీ నియోజక వర్గములుగా కేటాయించబడినవి. 1956మరియు 63 సంవత్సరముల నవంబరులో షెడ్యూల్డ్ జాతుల సవరణ చట్టం ప్రకారం ఉద్యోగాలలోను, పాలక సంస్థలలోను రిజర్వేషన్లు ప్రారంభమైనవి.

1956 సంవత్సరము జులై 23వ తేదిన మద్రాసు రాష్ట్రం గాంధీ గ్రామంలో గాంధీజీ శిష్యులు రామచంద్రన్ – సుందరం దంపతుల శిబిరంలో ఒకనెల సాంఘిక విద్యావ్యవస్థాపకుడు అను శిక్షణ పొందినారు.

1957 సంవత్సరము మే నెల 5వ తేది హైద్రాబాదులో గాంధీ భవన్‌లో ఆంధ్రప్రదేశ్ బంజారా ప్రతినిధుల సభ, సమావేశం జరిపారు. ఆ సభను డి . సంజీవయ్యగారు ప్రారంభించారు. దీప్‌లాల్ చౌహాన్ అధ్యక్షతన జరిగినది. 28–8–57సం. శ్రీలాల్‌సింగ్ కార్యదర్శి అహ్వానం పై ఖమ్మములోను 30–8–1964 శ్రీ వాగ్యానాయక్ చౌహన్ ఆహ్వానంపై హనుమకొండలోను సంఘ సమా వేశములు జరిపినారు.

1965 ఏప్రెల్ 10వ తేదిన వరంగల్ జిల్లా నెక్కొండలో బంజారా మహాసభ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసుబ్రహ్మానందరెడ్డిగారి అధ్యక్షతన మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ వి.పి.నాయక్‌గారి చే ప్రారంభించబడినది. శ్రీ తిమ్మారెడ్డి, యస్. రామ చంద్రారెడ్డి, శ్రీ యస్. సిద్దారెడి, శ్రీమతి టి.యస్. సదా లక్ష్మిగార్లు మరియు గిరిజనాభివృద్ధి శాఖాదికార్లు హాజరైన సభలో రాష్ట్రసంఘ తరపున మంత్రివర్యులకు మెమోరాండం సమర్పించారు.

1968 సంవత్సరము ఫిబ్రవరి 3 4 తేదీలలో పెనుకొండ సబ్ కలెక్టరు శ్రీ టి.యస్. రత్నం ఐ.ఎ.యస్. గారి ద్వారా ప్రారంభించబడిన, అఖిల భారత బంజారా సేవా సంఘం, స్టడీ టీమ్ యొక్క కార్యవర్గ సమావేశములో శ్రీరామ్‌సింగ్ బాణావత్ ప్రధాన కార్యదర్శి, శ్రీ కె.టి. రాథోడ్, సహాయ కార్యదర్శి, తేజ్‌సింగ్ రాథోడ్ ఎం.ఎల్.సి మైసూరు, వై రూప్లానాయక్, ఎల్. కృష్ణానాయక్ మైసూరు కలెక్టర్లు, యస్.బి. సక్రేనాయక్(మైసూర్ డెప్యూటి కలెక్టర్) జవహర్ నాయక్ (మద్రాస్ స్టేట్) యస్. ఘణేనాయక్ బుక్కపట్నం, బి.కె. సత్యం, జీఫ్లా, హరిశ్చంద్ర నాయక్, లాలూ నాయక్, రూపాబాయి, చంద్ర కళాబాయి అందరు ఉపన్యసించి, సభలో ఆహ్వాన వినతి పత్రం సమర్పించారు.

వీరి ద్వారా 1948సంవత్సరము నుండి 1972 సంవత్సరము వరకు సంఘ ప్రోత్సాహంతో సుమారు 75 బంజారా హాస్టళ్ళను స్థాపించగలిగారు. 1972–73 సంవత్సరము నుండి హరిజన హస్టళ్ళతో పాటు గిరిజన హస్టళ్ళను కూడ ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్నది. ఆ కాలంలో మేనేజర్లు కొంత మంది త్యాగబుద్ధితో నిస్వార్థంగా హాస్టలు నడిపి బంజారాల విద్యాభివృద్ధికి పాటుపడినారు.

శ్రీ గోపాల్‌రావు నాయక్‌గారు అనంతపురం జిల్లాలో 1966 సం నుండి అనంతపురం జిల్లా కదిరి వెస్ట్‌లో బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరుగా పనిచేస్తున్నారని, వారి సంఘ సేవ గూర్చి నాకు బాగ తెలిసి ఉండినది. 1967 సం. లో శ్రీ బాబు జగజీవన్‌రాం కేంద్ర మంత్రిగారు అనంతపురంవచ్చిన సందర్భముగా వారిని చూచుటకు శ్రీశైలంనుండి వచ్చిఉంటిని. ఆసందర్భములో శ్రీ గోపాల్‌రావు నాయక్‌గారు అనంతపురంవచ్చి ఉండిరి. అనంతపురం జిల్లాలో మేము ప్రారంభించిన జిల్లా సంఘం గూర్చి వారికి తెలియుటవలన, నన్ను చూడవలయునని కుతూహలంగా ఉండిరి. వారితో అనంతపురంలో మొట్టమొదటి సారిగా పరిచయం ఏర్పడినది. వారి సంఘ సేవ నన్ను ఆకట్టుకొన్నది. వారు కదిరినుండి ధర్మవరం ట్రాన్స్‌ఫర్ అయి, అనంతపురంలో కాపురం పెట్టిఉండిరి.

1970 సం. జనవరి 10వ తారీఖున, గుంటూరు జిల్లా పిరికిపాడు తాండాలో శ్రీ ఎ. గోప్యానాయక్ ఆధ్వర్యంలో బంజారా ప్రభుత్వ ఉద్యోగుల సమ్మేళనం ఏర్పాటు చేసి ఉండిరి. ఆసభకు శ్రీశైలంనుండి నేను కూడ హాజరై ఉంటిని. ఆ సభలో ఆంధ్రప్రదేశ్ బంజారా ఎడ్యుకేటేడ్ సమాజ్ పేరును పెట్టవలయునని తీర్మానించడమైనది.

1971 సం జనవరి నెల 19,20 తారీఖులలో శ్రీ గోపాలరావునాయక్, సహకారంతో నేను(చీన్యానాయక్) కన్వీనరుగా ఆంధ్రప్రదేశ్ బంజారా విద్యావంతుల మొదటి మహాసభను ఏర్పాటు చేసి, జిల్లా కలెక్టరు శ్రీ యల్. సుబ్బయ్య ఐ.ఎ.యస్ గార్లు జిల్లా పరిషత్ ఛైర్మెన్ శ్రీ వై.సి.తిమ్మారెడ్డిగారు సమితి ప్రెసిడెంట్ నర్శిరెడ్డిగారు, జిల్లా ఫారెస్టు ఆఫీసరు యస్.యం. ఖాదర్‌గారు ఐ.యఫ్.యస్ గారు పి.రంజిత్‌నాయక్, అధ్యక్షతన నారశింహపల్లి తాండా (నాస్వగ్రామం)లో ఏర్పాటు చేసి తాండా అభివృద్ధికి, సమిష్టి వ్యవసాయం అభివృద్ధికి, చెన్నమ్మ చెరువు, రోడ్డు, గూర్చి వారికి ఒక వినితపత్రమును సమర్పించడమైనది. ఆ తరువాత రాష్ట్రశాఖ, జిల్లా శాఖల ఎన్నికలు జరుపబడినవి, శ్రీ వి. గోపాల్‌రావునాయక్‌గారు రాష్ట్రశాఖలో ఉపాధ్యక్షులుగాను, జిల్లాశాఖకు అధ్యక్షులుగాను, శ్రీ బి. చీనియానాయక్(నేను) రాష్ట్ర శాఖలో సంయుక్త కార్యదర్శిగాను, జిల్లాశాఖలో ప్రధాన కార్యదర్శిగాను ఎన్నిక చేయబడినాము.

మేమిద్దరము జిల్లా అభివృద్ధికి, రాయలసీమ అభివృద్ధికి, రాత్రింబవళ్ళు పనిచేశాము. ఒక గుమాస్తాను నేను, నా జీతంలో నియమించుకొని, ప్రభుత్వములోని అన్ని శాఖలకు, అన్ని శాఖల మంత్రులకు, ముఖ్యమంత్రికి, జిల్లా ఛైర్మెన్‌లకు, జిల్లా కలెక్టర్లకు, వారి వారి శాఖపరమైన అభివృద్ధిని బంజారా తాండాలో జరిపించవలయునని విన్నపములు సంఘం ద్వారా సమర్పించినాము. సంఘ కార్యక్రమములు చేపట్టుటకు ఆర్థిక సహాయం గురించి, సంఘ బైలా ప్రకారం ప్రతి ప్రభుత్వ ఉద్యోగి బంజారా జాతి అభివృద్ధికి, తన నెలసరి జీతంలో 100కి 1రూ. ప్రతి నెల సంఘ పనులు చేపట్టుటకు సహకరించవలయునని, కరపత్రములను ముద్రించి, ప్రభుత్వ పంచాయితీరాజ్ మంత్రిగారు, మొత్తం రాష్ట్రంలో బంజారాల అభివృద్ధికి సంఘం ద్వారా తెల్పిన కార్యక్రమములను వెంటనే అమలు జరుపవలయునని రాష్ట్రంలోని అన్ని జిల్లా పరిషత్ ఛేర్మన్‌లకు తెల్పుతూ, ఆర్.సి.నెం 1622 ప్రొసీడింగ్స్ నం. 1/72 తేది 23-6-1972 కాపిని తెలుగులో ముద్రించి, సంఘ కార్యక్రమాల గూర్చి తెల్పుతు రాయలసీమలో ఉన్న ముఖ్యమైన బంజారా ప్రభుత్వ ఉద్యోగులకు లెక్కలేనన్ని సార్లు ఉత్తరములను వ్రాయడం జరిగినది. కాని, ఒక 15 పైసలు పోస్టుకార్డు కూడ ఎవరు జవాబు ఇవ్వలేదు.

అలాంటప్పుడు సంఘ కార్యక్రమములు చేపట్టట ఎట్లు? ప్రతి నెల సుమారు 500రూ నుండి 600రూపాయలుఖర్చు జరుగుచున్నది. అందుకని మొత్తం దేశ బంజారాలకు బంజారేతరులకు ముఖ్యంగా సినిమావారికి సుమారు 100 మందికి ఉత్తరం వ్రాయడం జరిగినది. వారిలో ఒక నాగేశ్వరరావుగారు ఉత్తరం బదులు ఇచ్చారు. తాను సహాయం చేయుపరిస్థితులలో లేనని, ఆ తరువాత మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ వి.పి.నాయక్‌గారు అనంతపురం బంజారా సేవా సంఘ కార్యక్రమములకుగాను ముఖ్యమంత్రి నిధినుండి 5,000/- రూపాయలు ఇవ్వతలచారు. మహారాష్ట్ర హోం డిపార్టుమెంటువారు పంపుతారని, దానికై 6 నెలలు పోరాడి, తీసుకొనటం జరిగినది. అప్పటికి సంఘంలో నేను నా స్వంత డబ్బు అడ్వాన్సుగా

సుమారు 2,000/-రూ.ల పెట్టుబడి పెట్టి ఉంటిని. ఆ విషయం అధ్యక్షుడికి, వి. గోపాలరావు నాయక్ గార్కి తెల్పిన వారు 500/- రూ.లు నాకు తిరిగి ఇచ్చారు. నేను సంఘ అభివృద్ధికై మహారాష్ట్ర - మైసూరు రాష్ట్ర పర్యటనలు చేస్తాను. అవి వారికి ఉత్తరం ఇవ్వగావారు సమ్మతించి, ఒక అధికార పత్రమును ఇచ్చి, ఒక విన్నప పత్రమును కూడ తయారు చేసి ఇచ్చినారు. ఆ ప్రకారం నేను 1973 డిశెంబరు 28 తారీఖునుండి 10-3-1973 వరకు మహారాష్ట్రము మైసూరు రాష్ట్రమును తిరిగి రావడం జరిగినది.

నేను టూరుప్రోగ్రాములో ఉన్న కాలంలో అనంతపురంలో ఉన్న బంజారా ఉద్యోగులు సంఘం నిబంధనల ప్రకారం సభ్యత్వంలేని వారు, అందరు గోపాలరావు ఇంటి మీదపడి వారిని నానా అనరాని మాటలు అని, ఇంటి మీద రాళ్లు రువ్వించి, మా జిల్లావారు కాదు, గుంటూరు జిల్లావారు, మా జిల్లాలో పెత్తనం ఏమిటి, మాకై మహారాష్ట్ర ముఖ్యమంత్రిగారు 5,000/-రూ పంపించారు. అది ఇచ్చి వేయవలయును అని నానా రభస చేసి, వారిని దుఃఖఃపచేసి, మనశ్శాంతి లేకుండాచేసి, చాలా బాధలకు గురిచేసారు. వారి బాధలకు తట్టుకొనలేక రంజిత్‌నాయక్‌ను ముందుఉంచి, వారికి, సంఘం డబ్బు, మేము అప్పటివరకు తయారు చేసిన సంఘం రికార్డులు అన్నియు గుంజాకొన్నారు. జాతి మీద గౌరవముతో ప్రభుత్వ ఉద్యోగం చేస్తు మొత్తం రాష్ట్రము, దేశము తిరిగి బంజారాల అభివృద్ధి రాయితీలను మంజూరు చేయించి, ఆ రాయితీల సహకారంతో విద్య నేర్చుకొని, ఉద్యోగం చేసి, సంపాదించుకొంటు జాతి అంటే గౌరవంలేని, జాతి అభివృద్ధికి, ఏ విధంగాను తోడ్పడనివారు, వి.పి.నాయక్ 5,000/- రూ.లువంపించారని, వారి పైబడి సంఘ ద్రోహులను ఏమని చెప్పవలయును. తల్లిపాలు త్రాగి తల్లి రొమ్మును గుద్దినవాడు అంటారు. వాడి కన్న వీరు తక్కువ అంటారా? వారి కారణంగా సంఘం పనులు నిలచి పోయినవి. వారు లాక్కున్న డబ్బును, రికార్డులను సద్వినియోగం చేయకుండా దుర్వినియోగ పరచినారు. ఆనాడు నాయకత్వం వహించిన ఒక్కరు కూడ ఈనాడు ముందుకు రారు ఎందుకు? వారుకొన్న సంఘం భూమిని పరులపాలు చేసి దానిని పట్టించుకొనువాడు లేడు. వాళ్లు చేసిన తప్పును, ఇప్పటి పెద్ద మనుష్యులు నన్ను అడుగుతున్నారు,. నేను ఏమని జవాబు చెప్పవలయును. 15 సెంట్లుతీసాము అన్నారు. ఇప్పటి విలువను బట్టి సెంటు 50వేల అనగా 7.50లక్షల రూపాయలు వారినుండి వసూలు చేయవలయును. ఒక స్థలంకే 7.50లక్షలు అయిన, బంజారాల అభివృద్ధిని గూర్చి, లెక్కకట్టిన కోటాను కోట్లు జాతికి నష్టపరచినారు. ఈ విషయమును గూర్చి బంజారాలే తేల్చవలసి ఉన్నది.

శ్రీ గోపాలరావుగారు శాంత స్వభావుడు, ఎవరు ఎద్దైన కఠినమాట అన్నా తనను కాదని తలంచువారు. శ్రీ గోపాల్‌రావు నాయక్‌గార్కి నాకు ఎన్నోసార్లు సంఘ విషయంలో జగడపడినాము. నేను ఉద్రేకముతో అతనిని, కఠినంగా మాట్లాడిన, కఠినంగా ప్రవర్తించిన, చిరునవ్వుతో పలకరించేవాడు. ఒకరి మనస్సును నొప్పించు గుణం ఆయనకు లేదు. తను నొప్పి పడగలడేమో కాని ఇతరులను నొప్పించి ఎరుగరు. అతని సతీమణి అన్నపూర్ణా దేవి. ఆమెవచ్చిన ప్రతివారికి చిరునవ్వుతో అహ్వానించి, అందరి క్షేమ సమాచారములను అడుగుతుంది. అనంతపురంలో బంజారా పత్రిక నడిపిన రోజులలో 6 నెలలు నేను నా భార్య పిల్లలను, శ్రీ శైలంలో వదలి, ఉద్యోగమునకు శెలవు( జీతం లేకుండా) పెట్టిపని చేస్తున్న కాలంలో వారి ఇంటిలోనే, నేను వారిలో ఒకరినై, నేను ఎప్పుడు వెళ్లినా, వారు నిద్రతోఉంటే, నేనే

భో320319జనం వడ్డించుకొని తినేవాడిని, ఏ మాత్రం విసుగులేకుండ వారు నా సేవ చేసారు. ఒక్కొక్కప్పుడు శ్రీ గోపాలరావుగారు, నాకు మంచంవేసి, పరుపు, దోమ తెరలు కట్టిఉంచెవారు. ఒక ఉద్యోగి, ఎవరైన 6 నెలల కాలం, ఒక్క పైసా లేకుండ భోజనం పెట్టి గౌరవిస్తారా? కాఫీ ఇచ్చుటకు కూడ ఇష్టపడనివారు ఎందరో ఉన్నారు. వీరిని గూర్చి ఎంత వ్రాసిన తనవి తీరదు. వీరిని భగవంతుడు బంజారాల సేవకై నియమించాడా! అని నాకు అనిపిస్తుంది.

శ్రీ గోపాలరావునాయక్‌గారు సమాజం ప్రెసిడెంటు అయినప్పటినుండి సంఘం మెంబర్‌షిప్ కట్టి ఉండలేదు. నేను తమాషాగా అన్నా(నేను వారిని అలాగే పిలుస్తాను) మీరు సంఘ బైలా ప్రకారం మీ ఆదాయంలో 1% కట్టలేదు అని తెల్పినాను. వెంటనే అతను స్పందించి 774/- రూ సుమారు అనుకొంటాను. అంతా ఒకేసారి కట్టి రసీదు తీసుకొన్నారు. అంతటి స్వభావము కలవారు.

1971వ సంవత్సరము ఆగస్టు నెల 22వ తారీఖున గుంటూరు జిల్లా మాచర్ల సమీపమున గుబ్బలపోడు తాండాలో బంజారా ఎడ్యుకేటేడ్ మహాసభ, శ్రీ బి. రామానాయక్ సంఘం అధ్యక్షులువారి అధ్యక్షతన జరిగినది. గుంటూరు జిల్లా కలెక్టరు ఎం. వెంకట రత్నం, సభను ప్రారంభించారు. శ్రీయుతులు రంజీత్‌నాయక్ పి., సత్యం బి.కె., జీవలానాయక్, లాలూనాయక్, శ్రీమతి చంద్రకళ, వీరందరూ హాజరైనారు. ఈ సభ ఏర్పాటు చేయుటలో శ్రీ గోపాల్‌రావునాయక్‌గారే ముఖ్యులు.

1972 సంవత్సరము మార్చినెల 11,12 తేదీలలో శ్రీ గోపాలరావుగారి అనుమతితో శ్రీశైలంలో సంఘకరస్పాండెటుగా శ్రీ గుంటూరు వెంకటశాస్త్రిగారిని నియమింపచేసి సంఘం పనులు చేపటట్టం జరిగినది. 1972 జూన్ 5వ తేదీన మహబూబ్‌నగర్ జిల్లా, జడ్చర్ల వద్ద, గొల్లపల్లి తాండాలో నాల్గవ బంజారా ఎడ్యుకేటెడ్ మహాసభను ఏర్పాటు చేసి శ్రీ కె. భీమారావు గిరిజన శాఖమాత్యులు అధ్యక్షత వహించారు. ఈ సభకు శ్రీ కె.టి. రాఠోడ్ మత్స్య శాఖామంత్రి కర్నాటక, ప్రారంభించారు. ఎక్సైజ్ శాఖమంత్రి శ్రీ పి. మహేంద్రనాథ్ పి. రంజిత్‌నాయక్ బి. రామానాయక్, వి. గోపాలరావు నాయక్, శ్రీమతి చంద్రకళ, బి. చీనియానాయక్ పాల్గొని సభను జయప్రదం చేసారు.

1974వ సంవత్సరమువమార్చి 17వ తారీఖున, బంజారా పక్ష పత్రికను ప్రారంభించాము. ఈ పత్రిక విడుదలకు శ్రీ కె. టి. రాఠోడ్ మత్స్యశాఖ మంత్రి శ్రీ తేజ్‌సింగ్ రాఠోడ్ యం.ఎల్.సి శ్రీ రామక్రిష్ణ జాయింట్ కలెక్టరు ద్వారా అనంతపురంలో ప్రారంభించబడినది. ఈ పత్రిక విడుదలకు మేమిద్దరం రేయింబవళ్లు శ్రమించాము. ఈ పత్రిక విడుదలకు రాష్ట్రపతి వి. వి. గిరి నుండి మహారాష్ట్ర ముఖ్యమంత్రి వి. పి. నాయక్ మరియు ఎందరో శుభాకాంక్షలు పంపించారు.

1974 సంవత్సరము ఏప్రిల్ 9వ తారీఖున మహబూబ్‌నగర్ జిల్లా కొడంగల్ తాలూకా, తిమ్మారెడ్డి పల్లిలో నివశించిన శ్రీ శ్రీ శ్రీ గురులోకామసంద్ ప్రభుగారి ఆశ్రమ మందిర ఉత్సవ సందర్భములో బంజారా యువజన విద్యార్థులు మహాసభను ఏర్పరచి, శ్రీ లూకలపు లక్ష్మణదాసు, కార్మిక శాఖామాత్యులు అతిథిగా వచ్చి సభను జయప్రదం చేసారు. ఈ సభను శ్రీ డి. రవీంద్రనాయక్‌గారు ఏర్పాటు చేసారు.

1974 సంవత్సరము సెప్టెంబరు నెల 15వ తారీఖున హైద్రాబాదు గాంధీ భవన్‌లో జరిగిన సభకు శ్రీ వి.పి.నాయక్ మహారాష్ట్ర ముఖ్యమంత్రిగారు, కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ నిజలింగప్ప గారు, రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ జె.వెంగళరావు గారు విచ్చేసి, ఈ సభను జయప్రదం చేసినారు. ముఖ్యంగా తెలంగాణా బంజారాలను గిరిజనులుగా గుర్తించాలని తీర్మానం చేయించి ముఖ్యమంత్రిగారి ద్వారా కేంద్ర ప్రభుత్వానికి పంపడం జరిగినది. 1978 సం వీరిని గిరిజనులుగా గుర్తించారు. ఈ విధంగా వీరి సేవలు లెక్కలేనన్ని, లెక్కకట్ట జాలనంతగా ఉన్నవి. శ్రీ గోపాల్‌రావు నాయక్ శాంత స్వభావుడు. బంజారా జాతి మీద ఎనలేని ప్రేమ. శ్రీ గోపాల్‌రావుగారు బంజారా జాతి అభివృద్ధికి పాటు పడినారేకాని, బంజారా సంస్కృతినివారు అంతగా పట్టించుకోలేదు. కారణం వీరు ముందునుండి అనగా తండ్రిగారి కాలమునుండి క్రైస్తవమత ప్రభోదంలో పడి బంజారాల సంస్కృతి, పండగలు, వాటి విలువ తెలుసుకొనలేక పోయినారని నేను భావిస్తాను. భారత రాజ్యాంగాన్ని వ్రాసిన శ్రీ డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్‌గారు, అన్ని మతాల సారంశమును గ్రహించినవారు. అయిన హిందు ధర్మమును పాటించిన హిందువులే తోటి హిందువులు(హరిజనులను) ఆదరించక పోవుటవలన వీరితో విసుగెత్తివారు చివరి కాలంలో భారత దేశములోనే ఉధ్భవించిన బౌద్ధమతమును స్వీకరించారు. కాని, పరమతమైన క్రైస్తవ మతమునువారు స్వీకరించలేక పోయారు. కారణం మత ప్రభావమే దేశాలను, రాజ్యాలను తలక్రిందలు చేసాయి. కావున తనకున్న జ్ఞానము తోటివారికి ఉండదు. శ్రీ గోపాల్‌రావునాయక్ గారు తన ఉద్యోగ విరమణ కాలం తరువాత బంజారా సేవతోపాటు క్రీస్తు సేవ కూడ చేస్తున్నారు. బంజారా భాషలో క్రీస్తు వాక్యములు, బంజారా భాషలో పాటలు వ్రాస్తూ బంజారాలను క్రైస్తవులుగా మార్చే కార్యక్రమములో నిమగ్నమై ఉన్నారు. ఇక్కడే మా ఇద్దరికి భేదాభిప్రాయం ఉన్నది.

శ్రీ గోపాల్‌రావు నాయక్‌గారు 1976 సం ఫిబ్రవరి 24వ తేదినుండి ట్రైబల్ వెల్‌ఫేర్ స్పెషల్ ఆఫీసరుగా పనిచేసారు. 1983 రిటైరైనారు. ఈ కాలంలో గిరిజన ప్రాంతాలను శ్రమలేకుండ పర్యటించి వారి అభివృద్ధికి ప్రభుత్వపరంగా చాలా సేవ చేసారు. శ్రీ గోపాల్‌రావు నాయక్‌గార్కి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు, పెద్ద కుమారుడు వి. సర్వేశ్వరనాయక్ ఎం.ఎ., అంత్రోపాలజీ చేసి, కేంద్ర ప్రభుత్వంలో ఢిల్లీలో ఉన్నత ఉద్యోగిగా ఉన్నారు. వీరికి పెండ్లి అయి ముగ్గురు పిల్లలున్నారు. రెండవ కుమారుడు వి. దివాకర్‌నాయక్ ఎం.ఏ. చేసి స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో బ్యాంక్ మేనేజరుగా ఉన్నారు. వీరికి ఇద్దరుకుమారులు, కూతురు, పెద్ద అమ్మాయి వి. సుశీల, శ్రీ పూజారి చాంప్లానాయక్ కుమారుడు పి.కృష్ణానాయక్‌గార్కి ఇచ్చారు. వీరు ఫుడ్‌కార్పోరేషన్‌లో మేనేజరుగా పనిచేస్తున్నారు. వీరికి ముగ్గురు పిల్లలు, చిన్న అమ్మాయి శాంతాబాయి, ఈమెను వారు అతిగారాభంగా పెంచుకొన్నారు. ఆమె కనుపించకున్న ఒక్క క్షణం ఉండలేరు ఈమె ఇక్కడ డిగ్రి చేసి. ఉద్యోగం చేస్తున్నారు. ఇది నాకు తెలిసిన శ్రీ వి. గోపాలరావుగారి జీవిత చరిత్ర.

**"ప్రతి ఒక్కరు అందరికోసము,**
**అందరు ప్రతి ఒక్కరి కోసము"**

# SRI P. RANJIT NAIK B.ARCH.(BOMBAY) A.I.I.A



He is born in Naginayanicheruvu Thanda, Hindupur Taluq, Anantapur District, Andhra Pradesh, India. He is aged about 66 years, well built body, very active, physically fit in all respects.

**Family Background :** Mr. Sri Ranjit Pujari Naik is second son of Late Pujari Champla Naik. Late Champla Naik was very popular in the entire Anantapur District and even now he is remembered as one of the Reformist and pioneer in giving education to the Banjara Tribe (Lambadies/Sugalies which is in Scheduled Tribes list of Andhra Pradesh) then Madras State. This family has been working in the Congress party right from freedom movement and that was how Mr. Ranjit's father was nominated as District Board Member before the Independence of the Country. This family is well known, not only to Andhra Pradesh Lambadies (Banjaras) but also the entire country's Lambadies. This family is known for their sacrifices, service and devotion for the Society. Mr. Ranjit's father was the first man who started free hostel at Penukonda (Anantapur District) for the educational benefit of Banjaras under the blessings of Late Thakkarbapa, Late Kalluri Subba Rao, Sri N. Sanjeeva Reddy, the then Minister of State and Sri Chidambar Reddy M.L.C. Due to this pioneering work of Mr. Ranjit's father, today one can see number of educated people amongst Banjaras (Lambadies/ Sugalies) in Anantapur District.

This is one of the noble family from which Mr. Ranjit hails, which has brought social revolution in Banajara tribe and contributed great deal in socio, economic, educational and political development very particularly of Andhra Pradesh Banjaras and in general Banjaras of this nation.

**Educational Qualification :** Mr. Ranjit passed out his S.S.L.C. from Penukonda High School in 1952 and then joined Andhra Christian College, Guntur, and did his Intermediate Science. He was selected by the Advisory Committee of Education Department, Govt. of India, from the entire state of Andhra for one seat reserved

in J.J. School of Art to do the degree course of 5 years in Architecture. Ranjit joined Sir J.J. School of Art (one of the best school of Architecture in Asia) in 1956 and successfully completed the degree course in 1962 with the help of handsome scholarship from Government of Andhra Pradesh. He got his associate ship with Indian Institute of Architects in 1964 (i.e. AIIA) He is having licence to practice as an architect, in Bombay for the last 35 years.

He is Registered Architect in Indian Council of Architects under Govt. of India Act 1972.

Through out his educational career Mr. Ranjit was brilliant Scholar with an intellectual calibre.

**Professional Career :** Mr. Ranjit has been practising as an independent architect since he got his degree in Architecture having his head office at Bombay and branches at Hyderabad, Bangalore and Anantapur. Technically he is very competent architect and professionally on he has high professional standards and ethics, And he is first and only qualified architect in the entire Banajara Tribe of this country.

**Social Work :** The entire family of Mr. Ranjit is known for their self sacrifice, service, devotion and social minded. In the family Mr. Ranjit is foremost and known for his conviction for the cause of down trodden of this country.

As inherited from his father that he is reforming and doing social work for the cause of Banjaras and such weaker sections (Lambadies/Sugalies) right from his eight standard (i.e. at the age of 14). Throughout his student days, besides his studies, he has been doing reformist work for Lambadies. The following are the important contributions for the cause of Banjara Tribe.

1. When he was in his teens (hardly 19 years old) he took his illiterate father with him and met Sarva Sri Kaka Kalelkar's Backward Classes Commission during 1954, presented a memorandum and pleaded for the inclusion of Banjara (Lambadies/ Sugalies) in the list if Scheduled Tribe with his broken English in the then Madras State. That small approach to Kalelkar's Commission along with his only associate Lambadi social workers like Sri V. Gopal Rao from Guntur and B. Rama Naik from Chittoor, brought an historical event in the life of Lambadies of present Andhra Pradesh State by including them in the list of Scheduled Tribes in the then Madras State.

2. Mr. Ranjit took an active part in organising Andhra Pradesh Yerukala, Yanadi and Lambadi/ Sugali Conference at Guntur during 1954. For this conference Late B.N. Datar, the then Deputy Home Minister graced the occasion..

3. Mr. Ranjit was the main pillar behind in successfully organising A.P. Banjara conference in 1965 by bringing Sri V.P.Naik the then Chief Minister of Maharastra State and Sri K. Brahmananda Reddy garu, the Chief Minister of Andhra Pradesh. By this conference Sri Reddy came to know about the Banjara (Lambadi) population in Telangana area and was very much impressed. Since then he repeatedly recommended the case of Banjaras to Central Government for the inclusion of Telangana Lambadies in the list if Scheduled Tribes and at last he saw to it in getting the same effected, now, as a Home Minister at Center.

4. Since 1959 when he came in contact with All India Banjara Seva Sangh and with National leaders from Banjara community be joined All India Sangh and became very active worker of the Sangh.

5. He took very active part in 4th All India Banjara Sangh's conference at Gulbarga in 1966 where National leaders like Sri Sanjeevaiah graced the occasion. In this conference Mr. Ranjit was elected in the Executive Committee and high power committee of the Sangh

6. Since this 4th conference of Banjara Sangh Mr. Ranjit became one of the important workers of all India Body in fighting for the cause of Banjaras to include them in Scheduled Tribes list in all the states where Banjara are in existence. He, very particularly, worked nearly 20 years for the inclusion of Telangana Banjaras in Scheduled Tribe. All the records will prove this fact.

7. He was one of the very important worker in successfully organising all India Banjara Sevak Siber at Delhi during 1966, where Smt. Indira Gandhi Hon'ble Prime Minister inaugurated, Sri Y. B. Chavan the then Defence Minister presided, Sri K. Brahmananda Reddy graced the occasion. Number of M.Ps. V.I.Ps., M.L.As and foreign ambassadors attended this Sibir.

8. Mr. Ranjit was instrumental in organising the Ist General Council meeting of Banjaras during 1968 at Penukonda (District Anantapur) and 2nd at Bombay during May 1976.

9. He was in Drafting Committee of Banjara Sangh's Progressive Constitution.

10. He was the member of All India Banjaras Study Team, who toured the whole nation and prepared comprehensive report on the condition of Banjaras of this country.

11. He was the member of the All India Banjara delegates who appeared before the Lokur High Power Committee (Govt. of India's) and pleaded for the inclusion of Telangana Banjaras in Scheduled Tribes.

12. He was the member of the delegate of All India Banjaras who appeared before Parliamentary Joint Select Committee under the Chairmanship of Anil Kumar Chanda during 1969.

13. He was specially invited on behalf of All India Banjara Seva Sangh to participate in Internal Gypsy (Roma) Festival at Chandigarh in March 1976.

14. He is very popular amongst the Gypsies of the World and his photo with note has appeared in Yugoslavakian and Scandinavian countries. He is offered the Vice-President ship of International Gypsy Council. Very soon he will be elected for this position.

15. Mr. Ranjit is the pioneer in literary movement of this country's Banjaras and reconstructor of the history of five crore Banjaras of this country. He is the Ist person to publish one fortnightly in Telugu from Andhra Pradesh and another fortnightly for all India circulation in our national language Hindi with a title '**BANJARA**'. This news journal is creating good sensation in the country by uniting the Banjaras of the entire country and educating them.

**Following are the major publications brought out by Mr. Ranjit Naik.**

1. All India Banjara Sevak Sibir Report.
2. All India Banjara Study Team Report.
3. 'BANJARA' fortnightly in Telugu.
4. 'BANJARA' fortnightly in Hindi from Bombay.
5. Besides the above major publications he has published number of papers for the cause of Banjaras and such sections.

16. He is the first man, who is root cause for the construction of a most modern and beautiful colony of Banjaras at an International City like Bombay. The photograph of the same is published in U.N.O's Housing Magazines.

Besides the above major events in the Social Work of Mr. Ranjit there are hundreds of other small and big events in his social life.

**Political :** Mr. Ranjit is politically very conscious right from his teenage that is how he organised Guntur city students for the cause of first linguistics of Andhra Pradesh in 1954 - 55.

He has been working for the congress party for the last 40 years as an humble worker and made entire Andhra Pradesh Banjaras to vote endblock for the Congress. His village has made history by voting hundred percent for the Congress party, at all levels. He is now very active Congress worker of country.

**Conclusion :** Mr. Ranjit Naik is well known in National Socio-Political arena. Number of State and National leaders know him personally. He is an intellectual, scholarly, well read, well travelled, and has been eye on national structure. He has wide knowledge on the country's problem and social structure. He is sincere and devoted in whichever capacity he is placed. Patriotic and always worked for the cause of poor section of the Society. He is socialist minded and down right practical in his approach. Temperamentally he is quite and talks less and does more. He is more a field worker then a Politician. He hurts least the other's feelings. 60% to 70% of Mr. Ranjit's income from his profession goes for his social work. He lives a very simple life and does not have any vices.

His wife Smt. Chandrakala Naik M.A., B.Ed., is the first woman graduate amongst the entire country's Banjaras. She is always with Mr. Ranjit and sacrifices for his social activities.

He will be a real asset not only to A.P. but also to the Nation, representing 50 million Banjaras if an opportunity is given to him in the highest policy making forum.

Mr. Ranjit is working tirelessly for the implementation of 20 point programme of Smt. Indiraji and 5 Points Programme of Sri Sanjay Gandhi. He has taken these programmes to every door step of Banjaras of this country.

# శ్రీ రామావత్ లాలూనాయక్



శ్రీరామావత్‌లాలూనాయక్‌గారు, గుంటూరు జిల్లా, మాచెర్ల తాలూకా, దాపెల్లె అను బంజారా తాండాలో, శ్రీ రామావత్ హేమానాయక్, శ్రీమతి సోనీబాయి పుణ్య దంపతులకు 1926వ సంవత్సరమున జన్మించారు. అక్కడి నుండి వారు పెద్దవడ్లపూడి అను గ్రామమును చేరి, స్థిరపడినారు. హేమానాయక్ గార్కి ముగ్గురు సంతానం. లాలూ నాయక్, లక్ష్మానాయక్, రామకోటి నాయక్. వీరి తండ్రి నారింజ తోటను కౌలు తీసుకొని, చేతి వృత్తులపై కష్టపడి బిడ్డలను విద్యావంతులుగ్గా చేసారు. లాలూనాయక్‌గారు ఆ రోజులలో10వ తరగతి వరకు చదువుకొన్నారు. వీరికి నాటకాలు, బుర్రకథలు అంటేచాల ఇష్టము. వీరు వేమూరి సత్య అనువారి వద్ద నాటకాలు, బుర్రకథలు నేర్చుకొని ''గాంధేయ విజయం'', పల్నాటి చరిత్ర, బొబ్బిలి యుద్ధం, బాల నాగమ్మ కథలు, గ్రామ గ్రామముల చెప్పి ప్రచారం చేయుచుండిరి.

ఈ విధంగా వారు కాలం గడుపు సందర్భములో శ్రీ వడితే, గోపాలరావునాయక్ బి.ఎ. గారి సాంగత్యంలభించినది. బంజారా జాతి కొరకు పాటుపడుచున్న శ్రీ లాలూనాయక్ గార్ని గుంటూరు జిల్లా సుగాలీ సేవా సంఘంను 1948 సంవత్సరములో స్థాపించి, కార్యదర్శిగా నియమించి, సుగాలీలలో మూఢాచారములను, నిర్మూలించుటకు గాను ప్రచారం గావించవలయునని కోరారు. వీరు శ్రీ జీవలానాయక్, హరిశ్చంద్రనాయక్ శ్రీ జోగానాయక్. థావర్యానాయక్‌ల తోడ్పాటుతో సంఘ అభివృద్ధికి ప్రచారం చేయుచున్న సందర్భములో, వీరికి ఆదిమ జాతి సేవా సంఘం అధ్యక్షులు, శ్రీ వెన్నెల కంటి రాఘవయ్యగారి పరిచయం లభించినది.

శ్రీ లాలూనాయక్ గార్ని ఆ సంఘం కార్యదర్శిగా ఎన్నుకోబడి, వారికి నెల్లూరులో అదిమజాతి కార్యకర్తగా ట్రైనింగ్ ఇప్పించి, 1951 సంవత్సరములో తెనాలి చినరావురు నందు ఒక సుగాలీ బాలుర హాస్టలును స్థాపించారు. 1951 ఫిబ్రవరి 18వ తేదిన తన స్వగ్రామమైన పెద్దవడ్లపూడిలో ప్రథమ ఆంధ్ర రాష్ట్ర సుగాలీ(లంబాడి – బంజారా) మహాసభను ఏర్పాటు చేసినారు. ఆ సభకు, బొంబాయి, నిజాము రాష్ట్రం(హైదరాబాద్) మైసూర్ రాష్ట్రముల నుండి బంజారా ప్రముఖులు ఈ సభకు హాజరైనారు. వారిలో ముఖ్యులు శ్రీ యుతులు జాతరసింగ్‌నాయక్, మాజీ ఎం.ఎల్.సి. శ్రీ యస్.బి. సక్రియానాయక్, నిమ్నజాతుల స్పెషల్ ఆఫీసరు. బి.జి.లమాణి శ్రీ బి. శంకరనాయక్ సంఘ సేవకులు(బళ్ళారి) శ్రీ బి. రామానాయక్ (పుంగనూరు) శ్రీ సి.యస్. కళ్యాణనాయక్, బెంగుళూరు. మొదలైనవారు హాజరై సభను జయప్రదం చేసారు.

శ్రీ లాలూనాయక్‌గారు మంచి కళాకారులు. వీరు స్వాతంత్రోద్యమంలో భాగంగా ఆనాటి స్వాతంత్ర్య పోరాట నాయకులు. శ్రీ అల్లూరి సీతారామ రాజు, గాంధీజీ, సుభాష్‌చంద్ర బోసు మరియు క్విట్ ఇండియా తీర్మాన ములపై బుర్ర కథలను అల్లి ప్రజలను ఉత్తేజ పరచినారు.

వీరు 1955 సంవత్సరము ప్రాంతంలో బంజారాలను చైతన్యం చేయుటకు బంజారా భాషలో నాటకం వ్రాసి, వాటిని తాండాలలో ప్రదర్శించి, వారి దురలవాట్లను, మూఢనమ్మకాలను, వాటివల్ల కలుగు నష్టములను, కళ్ళకు కట్టినట్లుగా చూపించి, బంజారాల అభివృద్ధికి పాటు పడినారు.

వీరు బంజారాల ఆది కవి అయిన శ్రీ భుక్యాబాలాజీదాస్ రాథోడ్‌గారు వ్రాసిన పుస్తకములను చూచి, ఉత్సాహవంతులై వీరు కూడ ఎన్నో పాటలు గేయములు వ్రాసారు. కాని ఆర్థికస్థోమతలేనందువల్ల, ముద్రించలేక పోయినారు.

1954 సంవత్సరంలో వెనుకబడిన జాతులు కమీషనర్ శ్రీ కాకా కలేల్కర్ గారిని, బంజారా జాతిని, గిరిజనులుగా గుర్తించవలయునని, ఆంధ్రరాష్ట్రం తరపున ఇచ్చిన విన్నపం, శ్రీ వి. గోపాలరావుగారు. శ్రీ ఆర్. లాలూనాయక్‌గారు, శ్రీ బి. జోగానాయక్‌గారు సమర్పించారు. ఇది వరలోనే సి.టి. యాక్టు రద్దు పరచవలయునని, రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగార్కి సమర్పించారు. ఇది 1956 సంవత్సరము నుండి అమలు పరచబడినవి.

1972 సంవత్సరము అక్టోబర్ నెల 8వ, తారీఖున, వీరి సేవలను గుర్తించి, శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారి అధ్యక్షతన, శ్రీ భీమారావు, గిరిజన సంక్షేమ శాఖామాత్యుల చేతి మీదుగా శ్రీ లాలూనాయక్‌గార్కి "ఆదివాసి ప్రజా భూషన్" అను బిరుదమును సత్కరించారు. వీరిని భారతీయ ఆదిమజాతి సేవక్ సంఘం ఢిల్లీవారు. "లైఫ్ మెంబరుగా" గుర్తించారు.

వీరికి దైవభక్తి, దేశభక్తి ఎక్కువ, సర్వమతాల సారం ఒక్కటే అనేదే వీరి నమ్మకం, వీరు ఇంట్లోగాని, హాస్టలులోగాని దేవుని ఫోటోలతోపాటు, క్రీస్తు, బుద్ధుడు, గాంధీ ఫొటోలను ఉంచి పూజించేవారు.

వీరికి కుమారులు ముగ్గురు, కుమార్తెలు ఇద్దరు 1) పెద్ద కుమారుడు డా. అమర్ సింగ్‌నాయక్ ఎం.డి. 2) రామచంద్రా నాయక్ బి.టెక్., ఎం.బి.ఏ. 3) డా.సుందరరామ నాయక్ యం.యస్. 4) కుమార్తె ఉమాబాయి బి.ఎ. వీరికి ఇద్దరు భార్యలు. 1) శ్రీమతి హంజీబాయి 2) శ్రీమతి చాందీబాయి. వీరి ద్వారా 5వ సంతానం సోనాబాయి బి.ఎ. వీరి పెద్ద కోడలు పేరు. శ్రీలక్ష్మి, రెండవ కోడలు లక్ష్మి, మూడవ కోడలు డా. కళ, పెద్దఅల్లుడు శ్రీ ఎం. భావసింగ్‌నాయక్. రెండవ అల్లుడు శ్రీ బి.బాలాజినాయక్‌గారు.

వీరు మాకు 1967 సంవత్సరము నుండి స్థిరపరచితులు. వారు ఇప్పటి వరకు మాతో ఉత్తర ప్రత్యుత్తరములు చేస్తుంటారు.

# శ్రీ సి. యస్. కల్యాణ్‌నాయక్
# (ఎడిటర్ బంజారా కేసరి)



శ్రీ సి.యస్. కల్యాణ్ నాయక్ బి.ఏ., బి.ఎల్., ఎల్.ఎస్.జి.డి. బంజారా ఎడిటర్‌గారు 10-12-1929 కర్ణాటక రాష్ట్రంలోని చిక్కతోరపాళ్యం తాండా, మాగడి తాలూకా, బెంగుళూరు జిల్లాలో జన్మించారు. వీరి తండ్రి పేరు సక్రియా నాయక్ తల్లి లక్ష్మీభాయి వీరికి శ్రీ కల్యాణ నాయక్‌గారు ఏకైక సంతానం. వీరిని వారు చాలా అల్లారు ముద్దుగా పెంచారు. వీరు బి.ఎ. బి.ఎల్ డిగ్రీలను బెంగుళూరు నందు చదివారు. ఎల్.యస్.జి.డి. బొంబాయినందు పూర్తి చేసారు.

వీరికి చిన్నప్పటినుండి బంజారా జాతి అంటే చాలా గౌరవము. వీరు విద్యార్థి దశనుండి బంజారాల గూర్చిన విషయములు కన్నడంలో వ్రాసి ప్రచారం చేయుచుండిరి. వీరు ఎస్.ఎల్.సి. చదువు చున్నప్పుడు ''బడ నౌకర'' అను నాటికను వ్రాసి బెంగళూరునందు జరుగుచున్న ఎగ్జిబిషన్‌లో ప్రదర్శించి మంచి పేరును సంపాదించారు. శ్రీ సేవాలాల్ మహారాజ్ బాలబ్రహ్మచారి, బంజారాల దేవుని పేర బంజారాల భాషలో కథను వ్రాసి ప్రచారం గావించారు. వీరు స్వయంగా హార్మోనిస్టు కావున, ఎన్నో డ్రామాలను ఆడించి, స్వయంగా నటించేవారు కూడా!.

వీరు బంజారా సంఘంవారు ఎక్కడ సభలు ఏర్పాటుచేసినను, దూరమును, ఆర్థికమును లెక్క చేయకుండా హాజరయ్యేవారు 1952 సం.లో ఆంధ్రప్రదేశ్‌లోని, గుంటూరు జిల్లా, పెదవడ్లపూడి ప్రథమ మహాసభకు హాజరై, పెద్దలతో పరిచయము గావించుకున్నారు. శ్రీ వి.పి. నాయక్‌గారు మధ్యప్రదేశ్‌లో ఏర్పాటు చేసిన అఖిలభారత బంజారా మహాసభకు హాజరై భారత బంజారా సంఘంవారితో పరిచయం కల్గి ఉన్నారు.

వీరు బెంగుళూరు సిటీ కార్పోరేషన్‌లో రెవెన్యూ ఇన్స్‌పెక్టరుగా పనిచేసి, క్లాస్‌వన్ ఆఫీసరుగా రిటైర్డు అయినారు. ఉద్యోగ విరమణ తరువాత న్యాయవాద వృత్తిని ప్రారంభిస్తూ, బంజారా జాతి అభివృద్ధికై, వారి సేవ చేయుటకుగాను, బెంగుళూరునుండి బంజారా కేసరి అను వారపత్రికను కన్నడంలో ప్రారంభించారు. బంజారా కేసరి వారపత్రిక కర్ణాటక రాష్ట్రం మరియు మొత్తం భారతంలో చాలా గొప్ప ప్రజాదరణ పొంది, బంజారా విద్యావంతులను మేలు కొల్పినది. వారిలో మంచి రాజకీయ చైతన్యమును సమకూర్చినది.

వీరి ప్రోత్సాహమువలన బంజారా ధార్మిక పరిషత్తును రిజిస్టరు చేయించి, ఆ సంస్థను ప్రారంభించారు. ఈ సంస్థ అధ్యక్షులు శ్రీ తారానాథ్ పవార్‌గారు, శ్రీ సి.యస్. కల్యాణ నాయక్‌గారు ప్రధాన కార్యదర్శి, వీరి ప్రోత్సాహముతో, కల్లిహళ్లి తాండా, కనకపుర తాలూకా నందు ఒక బంజారా మఠమును స్థాపించి, స్వామివారిని ఏర్పాటు చేసారు, చిత్రదుర్గ పట్టణనందు, శ్రీ సేవాలాల్ సంఘన బసవ స్వామీజీవార్ని కర్ణాటక రాష్ట్రం బంజారా జగత్‌గురువుగా నియమించుటకు ప్రోత్సాహించడం జరిగినది. గుల్బర్గాలోని ఐదు గురుమఠాలను దర్శించి, వాటిని సంఘటిత పరచుటకు, అ మఠాల గూర్చిన విషయాలను బంజారా కేసరిలో ప్రచారంగావించటం జరిగినది.

1997సం.లో గుల్బర్గా పట్టణనందు 25 మంది బంజారా గురువులను ఆహ్వానించి, గురుసమ్మేళనము జరిపించారు. శ్రీ తిరుపతి, తిరుమల బంజారా మఠం గూర్చిన అస్తులన్నింటి విషయములు తెలుసుకొని, ఎండోమెంట్ కమిషనర్ ఆఫీసులో వాటి వివరముల గూర్చి తెలుసుకొని, బంజారా-కేసరివార పత్రికలో ప్రచురించి, బంజారా సమాజమునకు తెలియ పరచారు. నాగార్జునసాగర్‌లో జరిగిన బంజారా నాయకుల సమావేశమునకు హాజరై, హైదరాబాదునందు శ్రీ హాథీరాం బావా మఠం గూర్చిన విషయములను చర్చిండం జరిగింది అన్నారు. వీరి ప్రోత్సాహముతో, తెలుగులో కూడ బంజారా-కేసరి వార పత్రిక ప్రారంభించ వలయునను, ఉత్సాహము నాకు (గ్రంథకర్త) కలిగినది. ఆర్థిక కారణములవలన ప్రారంభించలేక పోయినాను. ఈ కారణంగానే నాకు శ్రీ సి. యస్. కల్యాణనాయక్‌గారితో పరిచయమైనది. ఆ పరిచయమే బంధుత్వమునుకూడ కలుగ చేసినది. వీరి ప్రథమ కుమారుడు. సి.కె. ఆశోక్, కెమరామెన్ దూరదర్శన్‌గారితో నా చిన్న కుమార్తె బి. భ్రమరాంబ మల్లేశ్వరి బాయి, స్టాఫ్‌నర్సు రైల్వే తో వివాహం జరిగింది. శ్రీ సి.యస్. కల్యాణ్ నాయక్‌గారు మంచి మేధా సంపన్నుడు, జాతి గౌరవమును పెంపొందించుటకు అహర్నిశలు పాటు పడుచున్నారు, ఈ వయస్సులో కూడ వారు ఒక్క నిమిషము కూడ వృథా చేయకుండా కష్టపడి ప్రయాణించి, ప్రజలను జాగృతి చేస్తున్నారు. వీరి ప్రేరేపణవల్లనే నేను ఈ గ్రంథమును వ్రాయగలిగాను.

శ్రీ కల్యాణ్ నాయక్‌గారు, వ్యవసాయంలో కూడ మంచి అభిరుచి కలవారు. వారి తండ్రి సహకారముతో వ్యవసాయం అభివృద్ధి చేసారు. పది ఎకరముల కొబ్బరితోట ఐదు ఎకరముల మామిడి తోపు కూడ కలిగి ఉండి, వ్యవసాయమును అభివృద్ధి చేస్తున్నారు. వీరికి ఇద్దరు భార్యలు, శ్రీమతి రమాబాయి, శ్రీమతి తులసీబాయి, వీరికి ముగ్గురు కుమారులు, ఏడుమంది కుమార్తెలు, వీరికి తల్లి అంటే చాలా ప్రేమ, ఆమెను చాలా ప్రేమతో చూచుకుంటున్నారు. వీరికి భగవంతుడు మంచి ఆయురారోగ్యమును కలుగ చేసి, బంజారా జాతి అభివృద్ధికి మంచి శక్తిని ప్రసాదిస్తారని ప్రార్థన.

''తెలిసికొనుట తేలికయేగాని, కార్యములో పెట్టుట కష్టము''
అనునది ఫూపె యను తత్వ బోధకుని సిద్ధాంతము

# సాధుసింగ్ ధరమ్‌సోత్ (ఎం.ఎల్.ఎ)



పంజాబ్‌లో గోర్ బంజారాలను "బాజీగర్" అంటారు. వీరు లక్షల సంఖ్యలో ఉన్నారు. భారతదేశమునకు స్వాతంత్ర్యము వచ్చినప్పటి నుండి, ఇప్పటివరకు రాజకీయ రంగములో వీరిని రానీయ కుండా చేయడం జరిగినది. కాని కాంగ్రెస్(ఐ) అధ్యక్షులు శ్రీ నరసింహరావు గారి నేత్రుత్వములో పంజాబ్‌లో జరిగిన రాష్ట్ర ఎన్నికలలో ప్రప్రథముగా బాజీగర్ (బంజారా) సమాజమునకు చెందిన శ్రీ సాధూసింహ్ ధర్మసోత్‌వారికి శాసనసభ, హల్‌కా అమలోక్ స్థానమునకు(జిల్లా పాటియాలా) ద్వారా కాంగ్రెస్(ఐ) తరపున నిలబెట్టడం జరిగినది. శ్రీ సాధూసింహధరమ్ సోత్‌గారు సిరోమణి అకాలీదల్ తరపున నిలచిన శ్రీ దీలిప్ సింహ పాంధీ, పంజాబ్ సాంఘిక సేవా శాఖ మంత్రిగార్కి సుమారు 5,500 ఓట్లు తేడాతో సునాయాసంగా ఓడించారు. ఈ విధంగా పంజాబ్ రాష్ట్రంలో మొట్టమొదటి సారి బాజీగర్(బంజారా) శాసనసభలో కాలుపెట్టారు.

అతి బీద కుటుంబంలో జన్మించిన శ్రీ సాధూ సింహ ధరమ్‌సోత్‌గారు, రాజకీయాలలో ప్రవేశించి చాలా రోజులు కూడ కాలేదు. శ్రీ ధర్మసోత్‌గారు "ఆసి" జిల్లా పాటియాలా సంఘంలో యువ కాంగ్రెస్ కమిటిలో ఉపాధ్యక్షులుగా పనిచేసారు. ఆ తరువాత వారిని పంజాబ్ రాష్ట్రము యువ కాంగ్రెస్‌లో అధ్యక్షులైన శ్రీ మనిందర్ సింహభట్టిగారు పంజాబ్ యువ సంఘంలో బాజీగర్ సంఘం తరపున అధ్యక్షులను చేసారు. అప్పటినుండి ఇప్పటివరకు వారు పంజాబ్ బంజారా సంఘం అధ్యక్షులుగానే ఉన్నారు. పంజాబ్‌లోని గోర్ సమాజంలోని శ్రీ సాధుసింహ ధర్మసోత్‌గారు పంజాబ్, విధాన సభలో మెంబరుగా ఎన్నికై నందులకు బంజారాలు ధన్యులైనారు.

పంజాబ్‌లోని లుబానా వర్గమునకు చెందిన శ్రీ జగతార్ సింహములతోనే విధాన సభకు ఎన్నికైనారు. వీరు పుల్‌కానా జిల్లా వాసులు. వీరు కూడా కాంగ్రెస్ "ఐ" అభ్యర్థిగా ఎన్నుకోబడినారు.

| తెలిసికొనుట కొంత కష్టమైన పని గావచ్చును,<br>తెలిసిన పిమ్మట కార్యాచరణము<br>సులభ సాధ్యము – డా. సన్‌యేట్‌సేన్ |
|---|

# పద్మభూషణ డా. కె. వెంకట లక్ష్మమ్మ



నాట్య విశారద, పద్మభూషణ, డా. కె. వెంకట లక్ష్మమ్మ వారికి 1995 సం॥లో కర్నాటక రాష్ట్రంవారు. ''శాంతల నాట్యం'' అను గౌరవ బిరుదమును తనయొక్క భరత నాట్యంలో గణనీయమైన సేవ చేసినందులకు ఇచ్చిఉన్నారు. డా. వెంకట లక్ష్మమ్మ, చిక్కమంగళూరు జిల్లా, కడూర్ తాలూకా, తాంగళ్ళ తాండాకు చెందిన వారు. మైసూరు మహారాజ ఆస్థానంలో భరతనాట్య విధూషి మణిగానం, సంగీత విద్వాంసురాలుగాను సుమారు 30 సం.గా పనిచేస్తుఉన్నారు. వీరు ప్రపంచదేశాలలో కూడ మంచిపేరు ప్రతిష్టలను సంపాదించారు. బంజారా జాతికి చెందిన డా. వెంకటలక్ష్మమ్మగారు పద్మభూషణ అను బిరుదమును సంపాదించి, జాతి గౌరవమును పెంపొందించారు. వీరికి భగవంతుడు ఆయురారోగ్యములను ప్రసాదించగలరని ప్రార్థన.

# డా॥ అనంతిజబాసింగ్



శ్రీమతి డా. అనంతిజబాసింగ్‌గారు బంజార భాషకొక లిపిని తయారుచేశారు. ఆమె భారతి స్క్రిప్టు ద్వారా బంజారా భాషను అభివృద్ధి చేయాలని ''భారతి లిటరిసి ప్రోగ్రాము''ను స్థాపించారు. ఆమె నాకు వ్రాసిన ఉత్తరంలో (8-8-97)లో ''బంజారాల చరిత్ర'' సంస్కృతి మరియు సంఘ అభివృద్ధి, ప్రగతి పథంలో అను పుస్తకం వెలువడతున్నందులకు ఎంతో సంతోషించారు. బంజారాలందరు ఒక లిపి ద్వారా తమ మాతృభాషలోనే విద్యావంతులై ప్రగతిని సాధించాలని, ప్రపంచ బంజారాలందరు ఒకటై. ఈభాషను అభివృద్ధి పరచాలని, తానెంతో ఆశతో ఉన్నానని, ఇందులకు తాను ఎలాంటి త్యాగానికైనా సిద్ధపడి కృషిచేస్తున్నానని వ్రాసినారు, తన ఉత్తరంతో పాటు బయోడాటా పంపించారు. పేరు : శ్రీమతి డా. అనంతిజబాసింగ్, అడ్రస్ : నెం.121, మందాకిని ఎన్‌క్లేవ్ అలకానంద, క్రొత్త ఢిల్లీ - 110 019 విద్య: బి. యస్సీ(కెమిస్ట్రీ), ఎం.ఎ(ఇంగ్లీషు) ఎం.ఫిల్(లింగ్విస్టిక్స్ మరియు ఇంగ్లీష్), ప్రచురణలు : పి.హెచ్.డి(లింగ్విస్టిక్స్), పుస్తకాలు : స్క్రిప్ట్ ఫర్ ట్రైబల్ లాంగ్వేజస్ ఫార్ ది ప్రమోషన్ ఆఫ్ లిటరసీ, అమర్ ప్రకాశం(క్రొత్తఢిల్లీ) - 1990

ఇంకనూ పలు పత్రికల్లో వ్యాసాలు, రిసెర్చి ఆర్టికల్స్ మరియు సెమినార్లు మరియు టి.వి. ప్రోగ్రాములు మొదలగునవి.

# జీవలానాయక్

## (పవార్ వంశం. నూన్‌సావత్ గోత్రం)



శ్రీ జీవలానాయక్ 1923 న సత్తెనపల్లి తాలూకా చిట్టాల తాండా పవార్ వంశము, నూన్‌సావత్ కేవాలానాయక్, తల్లి పట్నిబాయికి జన్మించారు. వీరు తన తాండాలోనే ప్రైవేట్ స్కూలునందు 5వ తరగతివరకుచదవి, పది నుల ప్రాయంలో ఏ.బి.యం. హాస్టలు ద్వారా హైస్కూల్లో 8వ తరగతి వరకు చదివి, అనారోగ్య కారణంగా చదువుకు స్వస్తి చెప్పారు. వీరు బంజారాలలో ఉన్న కొన్ని మూఢాచారాలను, సంఘంవారు పెట్టుదండనలను వ్యతిరేకించి, వారిని నవీన పద్ధతులకు అలవాటుపడునట్లు చేసారు. వీరు గుంటూరు జిల్లాలో బంజారా వివాహ పద్ధతులకు బదులు, హిందూ సాంప్రదాయకంగా వివాహం చేసుకొన్నారు. వీరి ధర్మపత్ని సాలీభాయి ఉత్తమ ఇల్లాలు. అత్త మామలను భక్తి విశ్వాసములతో చూచుకొని వారి గౌరవము పొందినది.

వీరికి చాలాకాలంవరకు పుత్ర సంతానంలేదు. వీరు తమ తాండాలో శ్రీరామ మందిరంను నిర్మించి, బంజారాలకు దైవభక్తిని ప్రేరేపింప చేశారు. ఆ తరువాత వీరికి ఒక సంవత్సరమునకు పుత్ర సంతానం అయినది. వారికి ''రామప్రసాదు'' అని నామకరణం చేశారు.

1949 సం.లో 16 మంది బంజారా విద్యార్థులతో శ్రీ థక్కర్ బాపా సుగాలీ హస్టలును, పిడుగురాళ్లలో స్థాపించారు. తరువాత 120మంది విద్యార్థులవరకు అభివృద్ధి పరిచారు, ఈ హాస్టలునుండి అనేక మంది విద్యార్థులు పట్టభద్రులై ఉన్నత ఉద్యోగాలలో ఉన్నారు.

1948 న నాల్గవ తారీఖున పల్నాడు తాలుకా, కారంపూడిలో ప్రథమ బంజారా (లంబాడి) మహాసభ జరుపబడినది. ఆ సభకు రామావత్ సూర్యానాయక్ అధ్యక్షత వహించారు. ఆ సభలో వి. గోపాల్‌రావు నాయక్‌గారు, వి. భీమానాయక్‌గారు, బీ. జోగా నాయక్, కె. సిన్‌పాల్, బి. లాలూనాయక్ మొదలగు పెద్దలు ఉపన్యసించుటవలన, వారి భాషణకు ప్రభావితుడైన శ్రీ జీవలా నాయక్ ఆనాటినుండి సంఘ అభివృద్ధికి పాటుపడ్డారు.

19-12-48 సం. సత్తెనపల్లి తాలూకా పిరికి పాడులో, జిల్లా సంఘ సభ్యులను ఆహ్వానించి, సభను జయప్రదం చేసారు. 1966 జనవరి 26వ తారీఖున ఢిల్లీలో జరుపబడిన బంజారా సేవాసంఘ శిబిరమునకు ఆంధ్రప్రదేశ్ ప్రతినిధిగా హాజరైనారు.

1959 సం.మొట్టమొదట ఆంధ్రప్రదేశ్ బంజారా సేవా సంఘమును రిజిస్టరు చేసి ఆ సంఘం అధ్యక్షులుగా పనిచేసారు.

# తెరమీద 'తప్పెట'డుగులు

# బేబి లక్ష్మి



నెమలిపిల్ల ఎలా నడిచినా నాట్యమే. బేబీ లక్ష్మికూడా అంతే. తెలుగింట పుట్టి కన్నడ తెరమీద చిందులు వేస్తోంది: ఏడు సంవత్సరాల బేబీలక్ష్మి నృత్యంలో, నటనలో మేటి అనిపించుకొని ఎందరో పెద్దల ప్రశంసలందు కొంది. తెలుగుబాలిక కన్నడ రాజ్యం కర్నాటకలో ప్రతిభతో ఒక వెలుగు వెలుగు తోంది. అనంతపురం జిల్లా పెనుకొండ మండలం మంగాపురానికి చెందిన బేబీలక్ష్మి పలు కన్నడు సినిమాల్లో నటించింది. బేబీలక్ష్మి మొట్టమొదట బాలనటిగా నటించిన కన్నడ సినిమాలు వందరోజుల పండగ పూర్తి చేసుకొన్నాయి. రెండున్నర సంవత్సరాల వయస్సులోనే లయబద్ధంగా అడుగులు(నాట్యం)వేయడం మొదలు పెట్టింది. అప్పటినుంచి నాట్యం, నటన పట్ల మక్కువ చూపుతూ అందులో మెళకువలు తెలుసుకొని బాలమయూరిగా పేరొందింది. తండ్రి గోపినాయక్ రైల్వే ఉద్యోగి, తండ్రి ఉద్యోగరీత్యా బెంగుళూరులో ఉండటంతో బేబీలక్ష్మికి మంచి అవకాశాలు లభించాయి. ప్రస్తుతం బేబీలక్ష్మి సెకండ్ స్టాండర్డ్ చదువుతోంది. కూచిపూడి తరగతులకి హాజరవుతూనే కన్నడ టి.వి. సీరియల్స్‌లోనూ, సినిమాల్లోనూ నటించింది. ఇంతవరకు ఇర్వై రెండు సినిమాల్లో నటించింది. కన్నడ విశ్వామిత్ర బాలనటిగా టి. వీ. సీరియల్‌లో కూడ నటించినది. ఇంకను ఎన్నో కన్నడ సినిమాలలో బాలనటిగా బిజిగా నటిస్తూనే.... తెలుగు వెండి తెరపైకి కూడా త్వరలో రాబోతోంది. తెలుగు నిర్మాతలు బేబీలక్ష్మి ప్రతిభగుర్తించి అవకాశలు కల్పిస్తున్నారు.

సదరన్ రైల్వే డివిజన్(ఏడు రాష్ట్రాలు పరధీ)లో జరిగిన నృత్యపోటీలలో బేబీలక్ష్మికి ప్రథమ బహుమతి లభించింది. తమిళనాడు గవర్నర్ మర్రి చెన్నారెడ్డి చేతుల మీదుగా ప్రథమ బహుమతి అందుకొంది. కన్నడ సినిమాల్లో నటిస్తున్న బేబీలక్ష్మికి, ఆమె మాతృమూర్తులకు తెలుగు నేలపై ఎనలేని అభిమానం ఉంది. శ్రీకృష్ణదేవరాయల పాలనలో వేసవి విడిదిగా ఒక వెలుగువెలిగి, తీపి గుర్తుగా మిగిలిన ఘనగిరి(పెనుకొండ)నుంచి వచ్చిన బేబీలక్ష్మికి స్వంత ఊరు పెనుకొండ అంటే ఎంతో అభిమానం.

గత రెండు సంవత్సరాలనుంచి పెనుకొండలో ఘనగిరి అఫిషియల్ క్లబ్ ఏటా జరిపే వార్షికోత్సవ సభలకి బేబీలక్ష్మి వచ్చి నృత్యప్రదర్శనతో పట్టణ వాసులను ఆశ్చర్యచకితుల్ని చేస్తొంది. తెలుగు బాలిక అయినా కన్నడంలో వెలుగొందుతున్నందుకు గర్వపడాల్సిందే.

# దేవత పేరట 'సజీవసమాధి'!

## పాలమూరుతాండాలో వెలసిన కొత్త 'అమ్మోరు'

అర్వై గడపలున్న ఆ చిన్న లంబాడీ తాండా సరిగ్గా ఏడాది క్రితం జనబాహుళ్యానికే తెలిసింది. కాలిబాట కూడాలేని తాండాకు ఒక్కసారిగా రొడ్డు సౌకర్యం వచ్చేసింది. పదహారేళ్ళ లంబాడీ పడుచు 'దేవత' అవతారం ఎత్తింది, ఏడుకొండల వెంకటేశ్వరస్వామి తన పక్షాన ఉన్నట్లు ప్రకటించి ఆరు నెలలలో లక్షమంది భక్తులకు ఆరాధ్యదైవమైంది. ఇంతలోనే హేతువాదులు, తర్కవాదులను సవాల్‌చేస్తూ ఈ నెల 11వ తేదిన పదహారేళ్ళ 'దేవత' సజీవ సమాది అయింది. పన్నెండేళ్ళ పాటు బాహ్య ప్రపంచాన్ని చూడనని, తపస్సుతో సర్వశక్తులు సమీకరిస్తానని చెప్పి గాలి, వెలుతురు లేని భూగర్భమందిరంలో అడుగెట్టి సంచలనం సృష్టించింది.

మహబూబ్‌నగర్ జిల్లా దౌల్తాబాద్ మండల కేంద్రానికి కూతవేటు దూరంలో ఉన్న నంద్యానాయక్ తాండాలో ఈ సజీవ సమాధి సన్నివేశం, వేలాది మంది భక్తజనం, కళ్ళార్పకుండా చూస్తుండగా జరిగింది. నంద్యానాయక్ తాండాకు చెందిన గోప్యానాయక్, బుగ్గిబాయి పెద్దకుమార్తె అయిన హేమ్లిబాయి అలియాస్ ఉమా మహేశ్వరి అలియాస్ హేమామహేశ్వరికి మద్దూరు మండలం దర్‌పల్లి తాండాకు చెందిన నర్స్యానాయక్‌కి గత ఏడాది మే 12వ తేదిన పెద్దలు వివాహం జరిపారు. ఈ వివాహం తనకు ఇష్టంలేదని భీష్మించిన హేమ్లిబాయికి పెద్దల వత్తిడి మేరకు జరుగవలసిన తంతు జరిగిపోయింది. దీనితో వేంకటేశ్వరస్వామి అంశ కలిగిన తనను తాకరాదని భర్తని హెచ్చరించి తన ఇంటికి సుమారు యాభై అడుగుల దూరంలో హేమ్లిబాయి కాస్త దేవత అవతారం ఎత్తి ఒక పాకలో ఆశీనురాలయింది. సరిగ్గా అప్పటినుంచి ఈ విషయం ఆనోట ఈనోటా పాకి హేమ్లిబాయిని చూసేందుకు కర్నాటక రాష్ట్రంనుండి కూడ వందలాది మంది తరలి వచ్చారు. కేవలం సుగాలీ( లంబాడీ) భాష మాత్రమే వచ్చిన హేమ్లిబాయి



హేమ్లిబాయి సజీవ సమాధి భవనం (ఇన్‌సెట్‌లో హేమ్లిబాయి)

మౌనముగా మారి కేవలం భక్తులకు దర్శనమిచ్చేది కాని మాట పలికేది కాదు. ఇదేతరుణంలో ఆమె మహత్యాల గురించి కొందరు విస్తృత ప్రచారానికి సైతం పూనుకోవడంతో నంద్యానాయక్ తాండా భక్తజన సముద్రమయింది. హోటళ్ళు, పాన్ డబ్బాలు, కొబ్బరికాయలమ్మే షాపులు వెలిసాయి. అల్లంత దూరాన నిలచి చేతులు ఎత్తి నమస్కరిస్తే కోర్కెలు కోరేవారిని హేమ్లిబాయి కళ్ళతోనే పలకరించి సంతృప్తి పరిచేది.

అప్పటి నుంచి సుమారు 3నెలలు పాటు ఇసుకవేస్తే రాలనంత భక్తజన సందోహంతో తాండా యావత్తు కళకళలాడింది. వేలాది రూపాయలు భక్తుల విరాళాలుగా లభించాయి. తను ఆశీనమైన ప్రాంతం వెనుకవైపు కోనేరు త్రవ్వండవి 'బాలదేవత' ఇచ్చిన ఆదేశానుసారం కొందరు తాండావాసులు రంగంలోకి దిగి త్రవ్వడం ప్రారంభించారు. కొన్ని అడుగుల లోతు త్రవ్వినా నీరు పడకపోవడంతో ఆ ప్రయత్నాన్ని విరమించుకొన్నారు. అయిదు అడుగులు త్రవ్వితే నీరు వస్తుందని అంతకు ముందే దేవత పలికిన మాటలు, చెవుల్లో మూరు మోగుతున్న తాండావాసులు ఈ విషయాన్ని గోప్యంగా ఉంచారు. ఆరునెలల క్రితం 'తనను వేంకటెశ్వరస్వామి రమ్మంటున్నాడు నన్ను తిరుపతికి తీసుకెళ్ళండని' హేమ్లిబాయి కోరడంతో ఆమెను తిరుపతికి తీసుకెళ్ళారు. తిరుపతినుంచి వచ్చిన తరువాత కూడా ఆమె ప్రవర్తనలో ఎలాంటి మార్పు రాకపోగా ఒకసారి ఉన్నట్టుండి తనను ఇంట్లో ఉంచి తాళాలు వేయవలసిందిగా ఆదేశించడంతో ఆమె ఆదేశాలను ఆమె బంధువులు అమలు జరిపారు. మూడురోజులు మాత్రమే ఇంట్లో ఒంటరిగా ఉన్న హేమ్లిబాయి తిరిగి యథాస్థానానికి చేరుకుంది.

బొంబాయికి చెందిన రాథోడ్ అనే భక్తుడు హేమ్లిబాయి దీవెనలతో అర్థికంగా స్థిరపడినట్లు చెప్పుకొంటూ ఆమెకు 'గుడి' కట్టించెందుకు సిద్ధపడ్డాడు. రాథోడ్ కోర్కెను 'దేవత' ఆమోదించింది. ఈ ఏడాది జూన్ నెలలో గుడి నిర్మాణం కూడ జరిగిపోయింది. జూలైలో తాను సజీవ సమాధిలోనికి వెళ్ళిపోతున్నట్లు 16 సం. హేమ్లిబాయి ప్రకటించింది. 12 సం. పాటు తాను జీవసామాధిలోనే ఉంటూ తపస్సు ఆచరిస్తానని, ఆ తరువాత మాత్రమే సమాధి నుంచి బయటకు వస్తానని వెల్లడించి అందుకు అనుగుణంగా తనకు నిర్మించే గుడికి తలుపులు కూడా ఉండరాదని కోరింది. ఈమేరకు గుడి నిర్మాణం పూర్తిచేస్తూ కేవలం దక్షిణంవైపు అడుగుఎత్తు, ఆరఅడుగు వెడల్పు ఉన్న కిటికిని మాత్రమే అమర్చారు.

**సమాధి అయినవైనం (11-7-1996) :** జూలై11 సమయం మధ్యాహ్నం 11.30 నిమిషాలు, అశేష భక్తజన సందోహంతో నంద్యానాయక్ తాండా నిండిపోయింది. హేమ్లిబాయికి హారతులిచ్చారు. కొబ్బరికాయలు కొట్టారు. తమని చల్లగా చూడమంటూ అర్థించారు. హేమ్లిబాయి తల్లిదండ్రులు గోప్యానాయక్, బుగ్గిబాయి, తాత బస్యనాయక్‌లు భక్తిశ్రద్ధలతో ఆమె కాళ్ళకు మొక్కారు. ఆహాకారాలు చేస్తున్న భక్తులను దౌల్తాబాద్ ఎస్.ఐ బాలయ్య. సిబ్బంది అదుపు చేస్తుండగా హేమ్లిబాయి జీవసమాధి యాత్ర ఆరంభమైనది. గుడికి తలుపులు లేనందున, గుడిగోపుర శిఖరం పైనుంచి లోపలికి దిగేందుకు ఏర్పాట్లు చేశారు. దీనికి అనువుగా శిఖిరం పైన కొంత ఖాళీని ఉంచారు. సజీవసమాధి చట్టవిరుద్ధమైనందున దౌల్తాబాద్ పోలీసు కానిస్టేబల్ రాంజీ కూడా హేమ్లిబాయి సజీవసమాధి అయ్యే గుడి లోపలి భాగాన్ని అంతకముందు పరిశీలించారు.

**సమయం** : మధ్యాహ్నం 1.30 గంటలు, భక్తులు కేరింతలు, అరపుల మధ్య హేమ్లీబాయి నిచ్చెన సహాయంతో గుడి శిఖరాన్ని అధిరోహించి సుమారు అరగంటసేపు భక్తులకు దర్శనమిచ్చింది. ఆ తరువాత సజీవసమాధి మందిరంలోకి ఆమె క్రమేపీ దిగుతూ అదృశ్యమైంది. ఆమె లోపలికి దిగిన వెంటనే శిఖరంపైన ఖాళీప్రదేశాన్ని మూసివేశారు. సమాధిలోపల ఒక్క ఫ్యాన్‌మాత్రం అమర్చారు. సమాధిలోపల ఉన్న దేవతని చూసేందుకు తొలుత ఉన్న కిటికీని సైతంవారు పూర్తిగా మూసివేశారు. సజీవసమాధిలో ఉన్నా హేమ్లీబాయి గత 12 రోజులుగా ఎటువంటి ఆహార పానీయాలను స్వీకరించడంలేదు. ఈ విషయాన్ని తాండావాసులు కూడ స్పష్టం చేశారు. సజీవసామాధిలో ఉన్న హేమ్లిబాయి తల్లిదండ్రులు, బంధువులు ఈ విషయాన్ని పెద్దగా పట్టించుకున్న దాఖలాలు లేవు. సమాధిలోపలి వైపుకు గాలికూడా లేని పరిస్థితిలో ఆమె ప్రాణానికి ముప్పువాటిల్లే ప్రమాదం కూడ లేకపోలేదు.

**అంతాదేవుడే చూస్తాడు** : 'నా మనవరాలు సమాధిలోకి పోయింది, తిండి లేదు నీళ్ళు లేవు, అయిన అంతా దేవుడు చూస్తాడు' అని హేమ్లిబాయి తాతా బస్యనాయక్ పేర్కొన్నారు. సమాధి కావద్దని మీరు కోరలేదా అన్న ప్రశ్నకు ఆయన బదులిస్తూ మా బిడ్డని మంచిగా చూసుకొన్నాం. దేవుడు పిలిచాడు. అది పోయింది. ఇంకా మాకాడేముంది చెప్పడానికి అని అన్నారు.

హేమ్లిబాయి దేవత మంచి మహత్యముగల దేవత. దేవతను చూసేందకు కాలినడకన వచ్చానని కర్నాటక రాష్ట్రానికి చెందిన నీల్యానాయక్ చెప్పాడు. మొత్తం మీద హేమ్లీబాయి 'సజీవసమాధి' జిల్లాలో ఇప్పటివరకు వెలుగుచూడలేదు.

*ఆంధ్రజ్యోతి తిరుపతి – ఎడిషన్, 26-7-96 శుక్రవారం.*

# నారాసింహపల్లి తాండా ప్రసాదించిన ప్రప్రథమ వైద్య పట్టభద్రుడు

# డా. కె. బాపూజీ నాయక్ ఎం.డి.

శ్రీ డా. కె. బాపూజినాయక్, అనంతపురం జిల్లా, బుక్కపట్టణం మండలం, నారసింహపల్లి తాండాలో 23-10-1948 సం.లో జన్మించారు. వీరు రాథోడ్ వంశం, కరంతోట్ గోత్రీయులు.

వీరి ముత్తాతగారు కీ.శే. కె. థావురియా నాయక్, తాత కీ.శే. శ్రీ కె. హర్జేనాయక్, అవ్వ(జేజి) కీ. శే. శ్రీమతి రంకీబాయి, వీరి ఏకైక కుమారుడు కె. భీమానాయక్, కోడలు కీ.శే. శ్రీమతి హనిమీ బాయి. ఈ దంపతుల ప్రథమ పుత్రుడే డా. శ్రీ కె. బాపూజీనాయక్ వీరు వృత్తి విద్యను అభ్యసించుకాలంలో తనకు జూనియర్ అయిన శ్రీమతి డా. కృష్ణవేణమ్మను (జననం 29-6-1950) వివాహం చేసుకొన్నారు. వీరిది కులాంతర, వర్ణాంతర వివాహమైన, ఆదర్శ దాంపత్యం. వీరిరువురు వైద్య వృత్తిని స్వీకరించి, ప్రజలకు మంచి వైద్య సేవలను అందించారు. వీరుకొంతకాలం పశ్చిమ గోదావరి జిల్లాలోని ఏలేశ్వరం ఏజెన్సీ ప్రాంతములోను,



అనంతపురం జిల్లా ముదిగుబ్బ, కదిరి ప్రభుత్వ ఆస్పత్రులలో పని చేసి ప్రజలకు మంచి సేవను అందించారు. నాల్గు నెలలు క్రితంనుండి, హిందుపురం ప్రభుత్వ ఆస్పత్రిలో పనిచేయుచున్నారు.

వీరికి ముగ్గురు కుమార్తెలు. ఈ ముగ్గురు వైద్య వృత్తినే అభ్యసించుచున్నారు. వీరి పెద్ద అల్లుడు డా. రామస్వామినాయక్ ఎం.ఎస్. వీరు అనంతపురం పెద్ద ఆస్పత్రిలో పని చేస్తున్నారు. వీరి రెండవ కుమార్తె ప్రశాంతిని వారి మేనమామకే ఇచ్చి వివాహంచేసారు. ఈమెకు ఒక బిడ్డ 'భావన' 3 నెలలు. వీరి పెంపుడు కుమారుడు రాజేశ్ 12 సంవత్సరములు.

బిడ్డ, పెంపుడు కుమారుడు, మనుమరాలుతో వీరు హిందుపురంనుండి అనంతపురం వచ్చి, అల్లుడు డా. రామస్వామి నాయక్‌ను కలసి, విశాఖపట్టణంలో హవుస్ సర్జన్ చేయుచున్న తమ బిడ్డ డా. ప్రతిమా, డా. వీణ వీరిని చూచిరావలయునని, 20-2-1998సం. శుక్రవారం 12 గం.లకు బయలు దేరి అనంతపురం వస్తున్నారు. అనంతపురంనకు కొద్ది దగ్గరలో ఉన్న గోళ్లపల్లి, మరూరు గ్రామమునకు మధ్య ప్రాంతములో సుమారు 1.50 నుండి 2.00 గంటల మధ్యలో భగవంతుడు వీరిపై చిన్నచూపు చూచి, బండల లారీ రూపంలో వీరి స్వంత వాహనమును( కారు) నుగ్గు నుగ్గు చేసి, అందులో ప్రయాణించుచున్న వీరి ఆత్మను పంచభూతములలో విలీనం చేసారు. ఈ వార్త ''ఈ'' టీవిలోను, ఈనాడు దినపత్రిక రూపంలోను వ్యాపింప చేసి మొత్తం ప్రజలను ఆశ్చర్యంలోను, దుఃఖములో ముంచేత్తినది. ఈ వార్తను విన్న తాండా ప్రజలు శోక సముద్రంలో మునిగిపోయారు. వెంటనే వారు అనంతపురం, ప్రభుత్వ వైద్యశాలకు వచ్చి వారిని చూచి, సంతాపమును తెలియపరచారు.

వారి పార్థ శరీరములను, తన జన్మభూమి, నారశింహపల్లె తాండాకు తీసుకొని పోయినారు. ఈ వార్త బంజారా చరిత్రలోనే ప్రప్రథమము. ఇటువంటి వార్త బంజారాలు ఎప్పుడు వినలేదు, కనలేదు కూడ. భగవంతుడు వారి ఆత్మలకు ప్రశాంతిని, శుభములు కలుగు చేయవలెను అని ప్రార్థించుచున్నాము. వీరికి నల్గురు తమ్ముళ్లు, నల్గురు చెల్లెళ్లు, పెద్ద తమ్ముడు డా. శ్రీ కె. రవీంద్రనాయక్ ఎం. ఎస్, రెండవ తమ్ముడు శ్రీ కె. లక్ష్మీరాం నాయక్, మూడవ తమ్ముడు డా. కె. శివశంకర్‌నాయక్ ఎం.ఎస్సి(అగ్రి). పిహెచ్.డి. వారి మూడవ మరదలు డా. బి. పద్మావతి బాయి, ఎం.డి.( గైనిక్ అండ్ ఆబ్‌స్టిక్స్) (AIMS) నా జ్యేష్టపుత్రిక. నాలుగవ తమ్ముడు కె. అశోక్ బ్యాంకు ఉద్యోగి. ఈ విధంగా అభివృద్ధి చెందుచున్న ఈ కుటుంబమును, శోక సముద్రంలో ముంచినది. వారికి మా ప్రగాఢ సంతాపము తెలియచేస్తున్నాను.

బి. చీనియా నాయక్

## అభిమానవంతుడు

# శ్రీ వి. రామస్వామి నాయక్ బి.ఎ.



గ్రేడ్ బి ఆఫీసరు. రిజర్వ్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా. బెంగళూరు. వీరు 1-4-1944 సంవత్సరములో గోనిపెంట తాండా, పెనుకొండ తాలుకా, అనంతపురం జిల్లాలో జన్మించారు. శ్రీ రామస్వామి నాయక్‌గారు నాకు చిన్ననాటినుండి మంచి స్నేహితుడు. మేము పెనుకొండ బోర్డు హైస్కూలులో చదువుచున్నప్పుడు వారు నాకన్నా రెండు సంవత్సరములు వెనుక హైస్కూలులో చేరినారు. మేమిద్దరం ఒకే హాస్టలులో చదువుకున్నాము. ఆ తరువాత నేను గవర్నమెంటు ఐ.టి.ఐ అనంతపురంలో ఉద్యోగం చేయుచున్నప్పుడు వారు అనంతపురంలో బి.ఎ. డిగ్రీ చేస్తున్నారు. 1965వ సంవత్సరములో బంజారా సంఘము స్థాపించినపుడు వారు కూడా సంఘ మీటింగ్‌లో పాల్గొన్నారు. నేను నా మహారాష్ట్ర, మైసూరు పర్యటన ముగించుకొని బెంగళూరు వచ్చినపుడు వారిని కలవటం జరిగినది. బెంగుళూరు వెళ్ళినప్పుడెల్లా వారిని కలిసి సంఘ కార్యక్రమముల గురించి వారితో చర్చించేవాడిని. నన్ను చాలాఆప్యాయతతో ఆహ్వానించి, తనవంతు సహకారం అందించేవారు.

నేను బంజారా కేసరి వారపత్రిక స్థాపించవలయునని ప్రయత్నించినపుడు వారు నన్ను తనతో తీసుకువెళ్లి బెంగుళూరులోని బంజారా నాయకులతో పరిచయము చేసి, వారిద్వారా కొంత ఆర్థిక సహాయమును కూడా అందచేయ గలిగారు. నన్ను అతిథిగా గుర్తించి వారు తన గృహములో కొద్దిరోజులు ఆతిథ్యము సమకూర్చినారు. వారి శ్రీమతి వి.ఆర్.లీలాబాయి కూడా నన్ను ఆప్యాయంగా చూచారు. వారికి ఇద్దరు పిల్లలు. కుమారుడు వి.ఆర్.అశోక్ నాయక్, కుమార్తె వి.ఆర్.ఆషాబాయి. వీరిద్దరు కంప్యూటర్ ఇంజనీర్‌లు. కాని వారిని భగవంతుడు చిన్నచూపు చూచాడు. వారు 26-3-1998న సాయంత్రం 4.30గంటల సమయములో బెంగుళూరు నందు ప్రమాదవశాత్తు స్వర్గస్థులైనారు. వారి ఆత్మకు శాంతిని ప్రసాదించమని భగవంతుని వేడుకుంటున్నాను. వారి కుటుంబమునకు నా ప్రగాఢ సంతాపమును తెలియ పరచుచున్నాను.

-బి.చీనియా నాయక్



కీ.శే. డా. లాల్యానాయక్

కంటి వైద్య నిపుణుడు, సుధాకరరావు నాయక్‌గారి వియ్యంకుడు, బెంగుళూరు



శ్రీ భుజంగ నాయక్

మాజి పశు సంవర్ధక శాఖామంత్రి, ఆంధ్రప్రదేశ్



శ్రీమతి అగ్నిస్ ఫ్రాంకి, బేబి అనీష

జనరల్ సెక్రటరి, విశ్వరోమాని యూనియన్ బ్రాంచ్ ఆఫీసు,
ఉదయపూర్, రాజస్థాన్

# 4వ అధ్యాయం

# బంజారాలపై నేను గావించిన కృషి

## ప్రభోద గీతాలు

### బంజారా వీర సోదర లేరా!

రాఠోడ్ భుక్యా బాలాజీదాస్, కొత్తగూడెం.

లేరా లేరా భారత బంజారా వీరసోదరా లేరా

1. భారతమాత బిడ్డడవేర – మరచితివెందుకు మాతను
   వీరమేదివిలో నీవర్ణమే మహా – మేలిమైనదని కను గొనవేర ॥లే రా॥
2. భారత బంజారా సంఘములో – సేవ చేయుటకు
   సిద్ధపడర మానవసేవే మాధవ సేవని – మరవక మదినుంచి సేవచేయర ॥లే రా॥
3. నీ వర్ణము నీవు బాగుపరచర – నీలో నున్న వీరత్వం జూపర
   నిరాధారమైన బంజారులకు – నీ ఆధారము నిజము సోదర ॥లే రా॥
4. తన మన ధనమును ధారబోయర – తనవు శాశ్వాతము కాదనితెలియర
   మానవ జన్మము మళ్ళిరాదుర మానవ సేవలో అర్పించు వీర ॥లే రా॥
5. స్వాతంత్రమే మరి స్వర్గలోకమేర – సాధించేమరి మహాత్మగాంధిర
   సోదర చెయ్యి కలిపితే – సాధించవచ్చు సకల కార్యములూ ॥లే రా॥
6. కలముబట్టి మరివ్రాయ నేర్చిన – కట్టెలమ్మే నీ ఖర్మ తొలుగుర
   కలియుగమందున కష్టసుఖంబులు కావడి కుండని కనుగొను వీర ॥లే రా॥
7. భాసురముగ బాలాజిదాసుర – చేసే మనవి మరి అలకించరా
   భారతమాతను మదిలో స్మరించి బంజారావరణము సేవజేయరా ॥లే రా॥

### అబతోయి బణజావో – భారతేర్ నేతా

నారాయణ్ నాయక్(కోయిలకొండ మహబూబ్ నగర్)

(చాల్ : తూహి మారొ రాంరె)

అబతోయి జాగో మార్ గోర్ బందా

అబతోయి బణజావొ భారతేరనేతా

1. హార్ సమాజేర్ బడె బడె నేతా.
   ఏకత బణన బణగెచ నేతా

అబతోయి సోచో మార్ గోర్ బందా
అబతోయి బణజావొ భారతేర నేతా ||అబతోయి||

2. సోనేరి ధరతిఛ ఏ భారతేరి
జన్మ లిదేచ రాజవాడామ
కర్మెరి కారణి ఖోట వేగి జన
వన, వన జంగలేమ జానపడేచ ||అబతోయి||

3. వనిన్ సో సైంతాలిస్‌మ అజాది బణాన
అమర్ వేగేచ గాంధి నెహ్రూ దాదా
గులామిడి, ఛూటన్ అజాది మళగి
సత్తావిన్ పర్స్ వేగే ఏ భారతేన ||అబతోయి||

4. వి.పి.న్., కె.టి., దేరేచ సాహరో
రాంసింగ్ భాణావత్ మార్‌రో పుకారో
రణ్‌జిత్, గోపాల్, చీనియా, అమర్‌సింగ్ భళన
జగారె గోరున వన పనేమ జాన ||అబతోయి||

5. వి.పి., కె.టి., రో సహరో ఛ అజ
ఏకత రియెతోయి బణజాయ్ నేతా
ఆజెరో బాలక్ సవారేరో నేతా
జై బంజార జై భరత మాత ||అబతోయి||

# బంజారా తాండాలు సమిష్టి వ్యవసాయం

ముఖ్యంగా బంజారాలు, ఒకే వర్గమునకు చెందినవారు కనుక వీరిలో తక్కువ ఎక్కువ అనే భేదభావములు లేవు. అయిన వీరిలో ఇంటి గోత్రములు, వేరు అగుటవలన మీ గోత్రం, మా గోత్రం అనే భావన ఉండవచ్చును. అయినా అది అంత చెప్పదగ్గ విషయంకాదు. అయితే వీరిలో కూడ ధనవంతులు, బీదవారు అనే భేదభావము ఉండవచ్చును.

ముఖ్యంగా బంజారాలు, పశుసంపదపైనను, వ్యవసాయంపైనను జీవనం గడుపుచున్నారు. అందులో కొంత మందికి భూవసతి కొంత ఎక్కువగా అంటే 10 లేక 15 ఎకరములు కొంత మందికి 5 లేక 10 ఎకరముల, కొంత మందికి 5 ఎకరముల లోపు, మరి కొంత మందికి అసలే ఉండక పోవచ్చును.

బంజారా కుటుంబం సామాన్యంగా తల్లి, తండ్రి భార్య, భర్త మరి ముగ్గురు లేక నల్గురు పిల్లలు ఉండవచ్చును. వీరికి 10 ఎకరములు భూమి, ఒక జత ఎద్దులు, బండి ఉండవచ్చు లేక ఉండక పోవచ్చు, కొన్ని ఆవులు లేక గేదలు, కొన్ని మేకలు, గొర్రెలు ఉండవచ్చును. ఇంత మాత్రం ఉన్నదేవారు పెద్ద కుటుంబము లేక ధనవంతులు అని భావిస్తారు. ప్రస్తుత పరిస్థితులలో ఒకే రకమైన పంట పండించుటవలనవారికి సంవత్సరమునకు 30వేల రూపాయల నుండి 50 వేల రూపాయలలోపు ఆదాయం ఉండవచ్చును. అందులోనే వారు చేసిన బాకీలు తీర్చుకొనవలయును, సంవత్సరముమొత్తంనకు సరిపోవు ఆహార ధాన్యములను సమకూర్చు

కొనవలయును, మొత్తం కుటుంబమునకు సరిపడ వస్త్రములను కొనవలయును. ఒక వేళ చదువుకొనుచున్న పిల్లలు ఉన్నవారి ఖర్చులను భరించవలయును. పెండ్లికి ఎదిగిన పిల్లలున్న పెండ్లి ఖర్చులు భరించవలయును. గృహవసతి లేక పోయిన అందుకై కొంత డబ్బును కేటాయించవలయును. పండగ ఖర్చులు, బంధువుల రాకపోకల ఖర్చులు భరించవలసి ఉండును. మరియు ఆరోగ్య సంబంధమైన ఖర్చులు భరించవలసి ఉండును. ఈ విధంగా ప్రతి బంజారా కుటుంబము అన్ని రకాల బరువు బాధ్యతలను నెత్తి పై వేసుకొని జీవితం గడుపుచున్నారు. కావున వీరు ఆరోగ్య వంతులుగా ఉండటకు పౌష్టిక ఆహారం కావలయునన్న, వీరికి సరియైన గృహవసతి కావలయునన్న, కాలమునకు తగ్గట్టుగా వస్త్ర సదుపాయం కావలయునన్న, పిల్లలను మంచి విద్యావంతులను చేయవలయునన్న, వారి పిల్లల భవిషత్తు అభివృద్ధి చెందునట్లుగ మంచి బంధుత్వమును సమకూర్చువలయునన్న వీరందరు కలసి కట్టుగా సమిష్టి వ్యవసాయం చేసినచో అతి త్వరలో చాలా అభివృద్ధి చెందగలరు.

సుమారు ఒక తాండ, 100 కుటుంబములు ఉన్నదనుకొందాము, వీరందరికి కలసి 1,000 లేక 1,200 ఎకరముల పొలం ఉందనుకొందాము. సుమారు 80 కాండ్ల ఎద్దులు, ఒక 50 బండ్లు, ఒక రెండు లేక మూడు వందల ఆవులు లేక గేదెలున్నవను కొందాము, సుమారు రెండువేల గొర్రెలు లేక మేకలు ఉండవచ్చు అనుకొందము. ఇంతకన్న ప్రత్యేకమైన ఆస్థి ఏ తాండాకు ఉండదు.

అనగా 1,000 నుండి 1200 ఎకరముల భూమి, 80 జతల ఎద్దులు, బండ్లు కావలయును, సంవత్సరములో 3నెలలు మాత్రం సేద్యం చేయుటకు 80 జతల ఎడ్లు 50 బండ్లు కావలయును. వీటి ఖరీదు ప్రస్తుతం విలువలో సామాన్య జత అంటే 6లేక 8వేల రూపాయలు, అనగా 80 X 8 = 6,40,000 వేల రూపాయలు, బండ్లు 50 X 10 = 5,00,000 రూపాయలు అనగా మొత్తం సుమారు 10 లక్షల రూపాయలు పెట్టబడి కావలయును. దానికి తోడు వ్యవసాయ పనిముట్లు సుమారు ప్రతి ఇంట, 3000 X 100 = 3,00,000/– రూ. మొత్తం 640 + 500 + 300 = 1,440 వేలు అనగా రూ.14.40 లక్షలు సుమారు 15 లక్షల రూపాయలు ఖర్చు పెట్టుచున్నారు.

మరియు విత్తనములు + ఎరువులు ఒక ఎకరమునకు వేరుశెనగ అయితే 50 కే.జి ఎరువు ఒక బస్తా అనగా 500 బస్తాల విత్తనం, 1000 బస్తాల రసాయన ఎరువు, పురగుల మందు విత్తనం + పంటకు – ఎకరమునకు 200/– రూ  అనగా మొత్తం.

| | | | |
|---|---|---|---|
| 1) | 500 బస్తాలు విత్తనం | 500 X 1500 | = 7,50,000/– |
| | 1,000 బస్తాల ఎరువు | 1,000 X 480 | = 4,80,000/– |
| | 1 ఎకరమునకు మందులు | 200 X 1200 | = 2,40,000/– |
| 2) | ప్రతి సంవత్సరం పెట్టుబడి రూ. | | 14,70,000/– |
| | వ్యవసాయ పెట్టుబడి అనగా ఎడ్లు బండ్లు, వ్యవసాయ పనిముట్లు మొ | | 15,00,000/– |
| | మొత్తం రూ.లలో | | 29,70,000/– |

ఒక గ్రామము (తాండా) ప్రతి సంవత్సరం రైతులు – సుమారు 30 లక్షల రూపాయలు వ్యవసాయమున్నకై ఖర్చు చేయుచున్నారన్న మాట.

పంట దిగుబడి ఒక ఎకరమునకు మెట్టపంట బాగా పండిన 10 బస్తాలు అనగా 400 కె.జీ.లు.

అనగా 1000 ఎకరములకు – 4,00,000 కె.జీ.లు

వేరు శనగ బస్తా 400రూపాయల (40 కేజీలు) చొప్పున 10,000X400=40,00,000రూ. అగును. అదే సరియైన వర్షములు లేక పంట సరిగ్గా పండకపోయిన ఎకరమునకు 2 లేక 3 బస్తాలు దిగుబడి కూడా రాదు.

అనగా 100 నుండి 150 కె.జీ.లు కూడ ఉత్పత్తికాదు. సంవత్సర ఆదాయం 10 లేక 15 లక్షలకు పడిపోతుంది. అందువలన భారతంలోని రైతులు అభివృద్ధి చెందటం లేదు. అందువలన వీరి ఆర్థిక అభివృద్ధిని చేపట్టువలయునన్న సమిష్టి వ్యవసాయమే మంచి మార్గ దర్శకం కాగలదు. వీరందరిని సమిష్టి పరచి, వారికి, సమిష్టి లాభములను దాని ద్వారా లభించు ఫలితములను వివరించవలసి ఉన్నది.

వీరిని సమిష్టి పరచవలయునంటే ముఖ్యంగా వారి ఆస్థిపాస్తులకు ఎటువంటి నష్టము ఉండకూడదు, మరియు వారి భూములకు ప్రతి సంవత్సరం కాని లేక 10 సం. గాని కౌలులేక గుత్త ఏర్పాటు చేసుకొనవలయును. వారి ఎద్దులను, బండ్లను, ధరకట్టి, సంఘంలో పెట్టుబడిగా తీసుకొనవలయును, దానికిగాను వారికి వీలైతే వడ్డీకూడ చెల్లించవలయును, వారి పశువులని ధర కట్టి, వాటి విలువను, వారి పేర షేరు ధనముగా సంఘంలో జమ చేయవలయును. ఈ విధంగా వారి ఆస్తులకు భద్రత చేకూర్చువలయును. ఈ విధంగా ఏర్పాటు చేసిన, సమిష్టి వ్యవసాయ మునకు కావలసిన పెట్టుబడిని, వారినుండి సమకూర్చుకొనవచ్చును.

1) వ్యవసాయ ఎద్దులు, బండ్ల, పనిముట్లు అన్నియు కలసిన మొత్తం 15,00,000–రూపాయలు అయినది.

   ప్రజల ద్వారానే సంఘం పెట్టుబడి — 15 లక్షలు

2) ఆధునిక వ్యవసాయం ద్వారా, వ్యవసాయం చేయవలయునన్న వారి మొత్తం పొలం, వ్యవసాయం చేయుటకు, రెండు ట్రాక్టర్లు ఉన్న చాలును, అనగా ట్రాలి, వ్యవసాయ పనిముట్లుతో సహా — 8 లక్షలు

3) మిగిలిన పెట్టుబడితో విత్తనములు, మందులు కొనవచ్చును. — 7 లక్షలు

1,000 ఎకరములు వ్యవసాయమునకు ప్రస్తుతం <u>100 కుటుంబములు</u> అవసరము

| | | |
|---|---|---|
| 1) | కాని సమిష్టి గా వ్యవసాయం చేసిన | –40 కుటుంబములు చాలును |
| 2) | గొఱ్ఱెలు, మేకలు | –10 కుటుంబాలు |
| 3) | కోళ్ళు | – 5 కుటుంబాలు |
| 4) | పందులు పెంపకం | – 5 కుటుంబాలు |
| 5) | పాడి పరిశ్రమ | –10 కుటుంబాలు |
| 6) | కూరగాయలు | – 5 కుటుంబాలు |
| 7) | గృహ నిర్మాణ కార్యక్రమములు | –20 కుటుంబాలు |

| | |
|---|---|
| 8) మత్స్య పరిశ్రమ | – 5 కుటుంబాలు |
| మొత్తం కుటుంబాలు | 60 కుటుంబాలు |
| మొత్తము 40 + 60 = | 100 కుటుంబాలు |

ఈ విధంగా ప్రతి కుటుంబమును వారి వారి పనినైపుణ్యమును బట్టి నిర్ణయించి, ప్రణాళికలను నిర్ణయించి, ప్రణాళికలను తయారు చేసుకొనవలయును. వీటికి కావలసిన ధనమును, ప్రజలనుండి కాని, ప్రభుత్వమునుండి కాని, దగ్గరలో ఉన్న వాణిజ్య సంస్థల ద్వారా కాని ఏర్పాటు చేసుకొనవలయును.

ఈ సమిష్టి వ్యవసాయమునకు కావలసిన 50% పెట్టుబడి సమిష్టి వ్యవసాయ సంఘంలో చేరిన సభ్యుల చర, ఆస్థులనుండి యే సమకూర్చుకొనవచ్చును. ఎద్దులు, బండ్లు, పనిముట్లు, ఆవులు, గేదేలు, గొఱ్ఱెలు, మేకల్ను వీటి ద్వారా అవసరమైన వాటిని, సమిష్టిక్షేత్రంలో ఉంచుకొని, మిగిలిన వాటిని అమ్మి ఆ డబ్బుతో ప్రణాళికాబద్ధమైన కార్యక్రమమును చేపట్టవలయును. మిగిలిన సొమ్ము ప్రభుత్వం, వాణిజ్య బ్యాంకులు సమకూర్చవలయును. ప్రతి కార్యక్రమము చేపట్టుటకు, అనుభవము, విద్యావంతులైన వ్యక్తిని, ఎన్నిక చేసుకొనవలయును. ఈ నాడు ప్రతి తాండా ఎందనుకొంతవరకు విద్యావంతులైన నిరుద్యోగులు ఉన్నారు. వీరి ద్వారా ఈ కార్యక్రమములు చేపట్టవలయును.

ప్రతి చదువుకొన్న వ్యక్తి ఉద్యోగం కావలయునంటున్నారు ఎందుకు? మంచిగా జీవనం సాగించవచ్చునని. మంచి ఆహారం తీసుకొనవచ్చును, మంచి వస్త్రము ధరించవచ్చును. మంచి గృహవసతి సమకూర్చుకొనవచ్చును, తమ పిల్లలను మంచి విద్యావంతులను చేసుకొనవచ్చును అని. కాని, ఎంత మంది ఉద్యోగులకు ఇవి లభించుచున్నవి. చాలీచాలనీ జీతములతో కోరికలకు మించి, అప్పులు చేసుకొని, వాటిని తిరిగి తీర్చలేక, వచ్చిన జీతం అంతా చేసిన అప్పులకు వడ్డీలుకట్టుకుంటు ఎంతమంది బాధలకు గురి అగుచున్నారు. ఎవరో కొంత మంది, తెలివిగా ప్రవర్తించి జాగ్రత్తవహించినవారు తప్ప, మధ్య తరగతి ఉద్యోగులంతా ఏదో ఒక విధమైన కష్టమునే అనుభవిస్తున్నారు. ఎంత జీతం వచ్చిన, ఆడబ్బులతో రైతులు పండించిన ధాన్యమును, మధ్య దళారీల ద్వారా అధిక మొత్తం చెల్లించుకొని భుజించవలసినదే కదా? అదే ధాన్యములను, సమిష్టిగా పండించుకొని తమకు కావలసినంత తీసుకొని భుజించవచ్చును కదా?

తల్లి తండ్రి, భార్య భర్త, 3 పిల్లలు వీరికి ప్రతిరోజు కావలసిన ఆహార పదార్థములు సమిష్టిగా వ్యవసాయం అభివృద్ధి పరచటం ద్వారా సగటున సుమారు నెల వ్యయము ఈ క్రింద తెల్పిన విధంగా పొందవచ్చును.

| | | రోజు | నెల | రూ. |
|---|---|---|---|---|
| 1. | బియ్యం | 2 కె.జి. | 60 కె.జి. | 500/- |
| 2. | కూరగాయలు | 2 కె.జి. | 60 కె.జి. | 150/- |
| 3. | పాలు లీటరు 8.00చొప్పున | 2 లీ | 60 లీట్లర్ల | 480/- |
| 4. | మాంసం కే.జి. 50-00 చొప్పున వారమునకు | 2 కే.జి. | 4వా. | 400/- |
| 5. | చేపలు కే.జి. 25-00 చొప్పున వారమునకు | 2 కే.జి. | 4వా. | 200/- |
| 6. | పప్పుదినసులు కే.జి.10-00 చొప్పున | 2 కే.జి. | 4వా. | 160/- |

7. మంచినూనె " 4 కె.జి. 40రూ. 160/-

8. చిల్లర ఖర్చులు అనగా ప్రతి నెల కావలసిన సబ్బులు, పేస్టులు, మసాల ప్రతీది 500/-

మొత్తం 2550/-

అనగా ఒక కుటుంబమునకు ఆరోగ్యవంతమైన ఆహారం తీసుకొనవలయునంటే కనీసం అయ్యే ఖర్చు రూ 2,550/-

ఈ ప్రకారం, ఏ పెద్ద ఉద్యోగి కూడ ఆహారమును తీసుకొనుట లేదు. లేక ఏ గొప్ప రైతుకూడ వీటిని అనుభవించటం లేదు. ప్రతివాడు ఏదో ఒక లోటుతోనే జీవితం గడుపుచున్నారు. ఆహారమునకే ఇంత అయిన, ఇక మొత్తం కుటుంబమునకు కావలసిన గుడ్డల గూర్చి ఏమిటి? ఇక గృహ వసతి గూర్చి, పిల్లల చదువుల గూర్చి, అన్ని ఆలోచించిన 10,000 రూ. పైబడి జీతం తీసుకొన్నవారు కూడ పై ఆహార పదార్థం లిస్టును అనుభవించుట లేదు.

అదే సమిష్టి వ్యవసాయం ద్వారా అయితే పండించే పంటనుండి, వాటిని పొందవచ్చును.

1. పండించిన ధాన్యమునే లెక్క కట్టి ప్రతి నెల తీసుకొనవచ్చును.
2. వారు పండించే కూరగాయను లెక్క కట్టి ప్రతి రోజు వాడవచ్చును.
3. పాలు వారి పాడి పరిశ్రమనుండే పొందవచ్చును.
4. మాంసము వారు ఉత్పత్తి చేస్తున్న, పొట్టేలు, మేకల ద్వారా పొందవచ్చును.
5. చేపలు, వారి పరిశ్రమనుండే తీసుకొనవచ్చును.
6. పప్పు ధాన్యాలు, మంచి నూనె వారి ఉత్పత్తినుండి తీసుకొనవచ్చును.
7. పండ్లువారు ఉత్పత్తి చేసిన దాని నుండే పొందవచ్చును.
8. చిల్లర సరకులు వారు స్థాపించిన కన్స్యూమర్ స్టోర్సునుండి కాతాగా తీసుకొనవచ్చును.
9. వస్త్రములు, వారు పెట్టిన సొసైటి షాపునుండే కొనవచ్చును.
10. గృహ వసతి, వారు నిర్మించే వాటినుండి, కేటాయించబడును.
11. పిల్లల చదువులు సంఘం స్థాపించిన విద్యాలయం ద్వారా లభిస్తుంది.
12. వృద్ధులకు, వృద్ధాప్య పెన్షన్ సంఘం ద్వారా లభిస్తుంది.
13. స్త్రీ సంక్షేమము, సంఘము ద్వారా.
14. 5 సం. లోపు పిల్లల సంరక్షణ సంఘం ద్వారా లభిస్తుంది.
15. సాంస్కృతిక, వినోద కార్యక్రమములు టెలివిజన్ సౌకర్యములు, విశ్రాంతి మందిరం సంఘం ద్వారా స్థాపించవచ్చును.
16. దేవస్థానం సంఘం ద్వారా స్థాపించవచ్చును.
17. లైబ్రరి సౌకర్యం సంఘం సమకూర్చుతుంది.
18. స్వీట్ స్టాల్ సంఘం సమకూర్చుతుంది.
19. శుభ కార్యక్రమములకు కావలసిన కళ్యాణ మంటపములను సంఘం సమకూర్చుతుంది.
20. రవాణా సౌకర్యం సంఘం సమకూర్చుతుంది.
21. విద్యాలయాలు సంఘం సమకూర్చుతుంది.

22. ఆటస్థలాలు సంఘం సమకూర్చుతుంది.
23. సినిమా హాలు సంఘం సమకూర్చుతుంది.
24. ఈ విధంగా ప్రతి సౌకర్యమును సమిష్టిగా పొందవచ్చును.
25. ఇంటింట, నీటి వసతి సంఘం సమకూర్చుతుంది.
26. ఇంటింటికి బయోగ్యాసు సప్లయి సంఘం సమకూర్చుతుంది.
27. వైద్య సౌకర్యం సంఘం సమకూర్చుతుంది.
28. పశువైద్య సౌకర్యం సంఘం సమకూర్చుతుంది.
29. టైలరింగ్ షాపు షాపింగ్ కాంప్లెక్స్‌లు, సంఘం ద్వారా సమకూర్చటం జరుగుతుంది.
30. చెప్పుల షాపు షాపింగ్ కాంప్లెక్స్‌లు, సంఘం ద్వారా సమకూర్చటం జరుగుతుంది.
31. మెడికల్ షాపు షాపింగ్ కాంప్లెక్స్‌లు, సంఘం ద్వారా సమకూర్చటం జరుగుతుంది.
32. ఆటబొమ్మలు, జనరల్ షాపు షాపింగ్ కాంప్లెక్స్‌లు, సంఘం ద్వారా సమకూర్చటం జరుగుతుంది.
33. హోటల్, టిఫన్ సెక్షన్ షాపింగ్ కాంప్లెక్స్‌లు, సంఘం ద్వారా సమకూర్చటం జరుగుతుంది.
34. డీజల్, పెట్రోల్ సౌకర్యం షాపింగ్ కాంప్లెక్స్‌లు, సంఘం ద్వారా సమకూర్చటం జరుగుతుంది.
35. లాండ్రీ షాపులు షాపింగ్ కాంప్లెక్స్‌లు, సంఘం ద్వారా సమకూర్చటం జరుగుతుంది.

పై సౌకార్యములన్నియు సమిష్టిగా కష్టపడి సాధించుకొనవచ్చును.

గృహ సౌకర్యములు :- ఒక ఇల్లు ఉండినంత మాత్రాన చాలదు కదా అందులో సౌకర్యములు ప్రతి ఇంటికి, వరండా, హాలు, బెడ్ రూములు, రీడింగ్ రూము, డైనింగ్ హాల్, వంట రూము, బాత్ రూము, ల్యావటరి, ఇంటి ముందు కొంత కాంపౌండు కావలయును, అలా అన్ని సౌకర్యములు ఉన్న ఇల్లునే, ఇల్లు అంటారు. వీటిలో ఏది లేకున్న అసౌకర్యమే కదా?

ఆ తరువాత, ఇంటిలో సామానులు, ఫర్నీచర్లు, సోఫాసెట్టు, టిపాయి, పడక గదిలో మంచాలు, పరుపులు, బట్టలు పెట్టుటకు బీరువా, భోజనం చేయుటకు, డైనింగ్ టేబులు, రేడియో, టి.వి. వాటికి స్టాండ్సు, టేప్ రికార్డు, కుర్చీలు, టెబుల్, మిక్సీ, ఫ్రిజ్, మంచి లైటింగ్‌కుగాను ట్యూబ్‌లైట్లు, వాషింగ్ మిషన్లు అన్ని వసతులు ఉన్న ఇంటినే గృహము అంటారు. అప్పుడే ఆ కుటుంబం సుఖం, సౌఖ్యం అనుభవిస్తుంది.

ప్రతి వ్యక్తి సంఘంలో మెంబరై పై సౌకర్యములను దూరదృష్టితో ఆలోచించి, అమలు పరిచిన ఇంతకన్న సులభమార్గములేదు. ప్రభుత్వ ఉద్యోగి ఏ విధంగా ప్రతి రోజు తన దిన చర్యను చేస్తున్నాడో అదే విధంగా సమిష్టి వ్యవసాయ సంఘంలోని వ్యక్తి కూడ తనకు కేటాయించిన పనిని నిజాయితీతో చేసుకొన్న ఎంతో ఆదాయమును పొందగలుగుతాడు. ఎవరికి కేటాయించిన పని వారిదే, వారి వారి ఉత్పత్తి ఆధారంగానే వారి ఆదాయం పెరుగుతుంది. వ్యవసాయం చేయువారు, వారి ఆదాయం వారు పండించే పంట పై ఆధారపడి ఉంటుంది. అలాగే పాడి పరిశ్రమవారు ఉత్పత్తి చేసే పాల దిగుబడి పై ఆధారపడి ఉంటుంది. పశుసంపదవారు ఉత్పత్తి చేసే పశుసంపద పై ఆధారపడి ఉంటుంది. పండ్ల తోటలు, కూరగాయలువారు పండించే కూరగాయలు పండ్ల ఉత్పత్తి పై ఆధారపడి ఉంటుంది. చేపల పరిశ్రమ, వారు ఉత్పత్తి చేసే

చేపల ఆదాయం పై ఆధారపడి ఉంటుంది. అలాగే గృహ వసతి, వారు నిర్మించే గృహాల నిర్మాణ ఉత్పత్తి పై ఆధారపడి ఉంటుంది. ప్రతి ఒక్కరు ప్రతి నెల జీతంతో పాటు, వారు ఉత్పత్తి చేసిన లాభం పై బోనస్‌ను పొందుతారు. మరియు వారు సంఘములో పెట్టిన పెట్టుబడి పై వాటా ధనం పైవచ్చు లాభం పొందుతారు. అలాగే కౌలుకు ఇచ్చిన భూమి ఆదాయం కూడ ప్రతి సంవత్సరం లభిస్తుంది. ఈ విధంగా ప్రతి వ్యక్తి, ప్రతి కుటుంబీకుడు లాభమును పొందుతూ సర్వ సౌకర్యములను అనుభవిస్తారు. అప్పులు చేయువలయునని కాని, పెట్టుబడులు పెట్టవలయును అని కాని, ఆలోచించవలసిన పని ఉండదు. ఎవరైతే వాటి ముఖ్య బాధ్యతలు వహించి ఉంటారో వారే ఈ కార్యక్రమములు చేపట్టుతారు. కావున నిశ్చితంగా ఉండి మంచి సుఖమును పొందువచ్చును. ఆ విధంగా సౌఖ్యం పొందనది, అది ఇల్లు కాదు.

ఈ సౌకర్యములు పొందుట కొరకే కదా మానవుడు తహతహలాడుచున్నాడు. ఈ సౌకర్యములన్నియు, లభించిననాడు మానవుడు ఎక్కడ జీవించినా ఒకటే కదా? అది పట్టణమున ఉన్నా ఒక్కటే, పల్లెలో ఉన్నా ఒక్కటే, పై సౌకర్యములు లభించిననాడు, పట్టణమున్న, పల్లెకన్న తక్కువే అన్పిస్తుంది. కావున, ఎక్కడైతే అన్ని సౌకర్యములు లభించగలదో అదే మానవ జీవనానికి సరియైన చోటు అవుతుంది.

ఉదాహరణకు, ఒక నారశింహపల్లి తాండాను చూచుకొందాం. ఇక్కడ సుమారు 300 కుటుంబాలున్నాయి. భూ వసతి, రెండ వేల ఎకరములు ఉండవచ్చును. అందులో మాగాణి భూములు, 200 ఎకరములు, కూరగాయల ఉత్పత్తికి 20 ఎకరముల వంక పొడవు సుమారు 5 నుండి 6 కి.మీ. ఒక చెరువు, 10 బావులు – అటవి భూమి– 500 ఎకరములు, భూగర్భ జలం లభిస్తుంది, విద్యా వంతులైన నిరుద్యోగిలు పి. హెచ్‌డి చేసినవారు ఎం.ఏ., బి.ఎ., బి. యిడి, ఇంటర్ మీడియెట్, 10వ తరగతి, ఇంజనీర్లు, డాక్టర్లు, డిప్లొమో, ఐ.టి.ఐ చేసినవారు సుమారు 150 మంది ఉన్నారు.

వీరికి వారి వారి విద్యను బట్టి, గ్రూపులుగా విడగొట్టవలయును. పిల్లలు ఎడ్యుకేషన్, వైద్య సౌకర్యం, ఇంజనీరింగ్ పనులు, వ్యవసాయం, పశుపోషణ, పౌల్ట్రి, డైరీ, పిగ్‌రి మత్స్య పరిశ్రమ, పండ్ల తోటలు పెంపకం, కూరగాయల ఉత్పత్తి, వాణిజ్య పంటలు, మొదలైనవి. పై తెల్పిన 40 రకాల పనులకు, వారి వారి నై పుణ్యంనుబట్టి, నిర్ణయించవలయును.

పై పనులు నిర్వహించుటకు కావలసిన ఆర్థికసహాయమును కై సంఘంతరపున ఒక బ్యాంకును, ప్రారంభించవలయును, అనగా ప్రస్తుతమున్న వారి సంపదను విలువకట్టి అందులో జమ చేయవలయును, భూ సంపద, వ్యవసాయపు ఎద్దులు, బండ్లు, పశువులు మొదలైనవి. వాటి విలువలే బ్యాంకులో జమ అయ్యే మొత్తం. ప్రతి ఒక్క కుటుంబము, ఈ సంఘంలో ఎంత పెట్టుబడి పెట్టిన అర్థం అవుతుంది. ప్రక్క గ్రామాల ప్రజలనుండి కూడ బ్యాంకులో డబ్బులు జమ చేయించి, వారికి లాభించే వడ్డీని ఇవ్వవచ్చును. ఆ ధనమును బట్టి సంఘ ప్రణాళికను ఏర్పాటు చేయవలయును. మిగిలిన ధనమును ప్రభుత్వము గ్రాంటుగాను, అప్పుగాను, మరియు వాణిజ్య బ్యాంకుల ద్వారా ఋణంగా పొందవలయును.

పై విధంగా కార్యక్రమములు చేపట్టిన, ఆర్థిక లోటు, నిరుద్యోగుల సంఖ్య, మానవ సంపద, భూ సంపద, వనరుల సంపద, భూగర్భ నీటి సంపద, అటవీ సంపద, పశుసంపద, పాడి సంపద, మత్స్య సంపద అన్నింటిని అక్కడే ఉత్పత్తి చేసి, వాటిని వారి చేతనే ఖర్చు చేయించి,

మిగిలిన ఆహార సంపదను పట్టణవాసులకు అతిచౌకగా అందించవచ్చును. ఈ కార్యక్రమం చేపట్టిన, వారు కోరుకునే మంచి ఆరోగ్యకరమైన ఆహారమును, వస్త్రసదుపాయమును, మంచి గృహవసతిని, పిల్లల విద్యాభివృద్ధిని, ఉద్యోగ అవకాశములను, ఆర్థికాభివృద్ధిని, వారి సంస్కృతిని, రాజకీయ చాతుర్యమును, పొంది రాష్ట్రదేశ అభివృద్ధికి తోడ్పడిన వారు కాగలరు. ఈ విధమైన, స్థిరమైన శాశ్వతమైన కార్యక్రమములను చేపట్టనంతవరకు, మానవుడు, ఒకరినొకరు, వంచించు కొంటూ, మోస కార్యములు చేస్తు, ఆర్థిక సంపదను, వనరుల సంపదను అభివృద్ధి కానీకుండ. ఒకరి మీద ఒకరి, పోరు సలుపు కొంటూ, రాష్ట్రభివృద్ధిని దేశాభివృద్ధిని, కుంటు పరుస్తు అన్ని రకాల, కష్ట నష్టాలకు గురికావలసి ఉండును.

కావున మంచి ఏదో దానినే పాటించవలెను.

''కలసి ఉంటే – కలదు సుఖం''

''కష్టేఫలి'' – అను సామెతను ఫలప్రదం చేయవచ్చును.

''నీలో దీపం వెలిగించు'' – నీవే వెలుగై వ్యాపించు.

''ముట్టిమే హై పరమాత్మా''

''ధైర్యే సహసే – లక్ష్మి''

'నీ జన్మ ఇచ్చిన తాండాను ప్రేమించుమన్నా – మంచి అన్నది పెంచుమన్నా'

' దేశమంటే మట్టి కాదోయ్ – దేశమంటే మనుషులోయ్'

'దేశాభిమానమునాకు కద్దని – వట్టి గొప్పలు చెప్పుకోకోయి'

'పూని ఏదైనాను ఒక మేల్ – కూర్చి జనులకు చూపవోయ్'

'సొంత లాభము కొంత మాని – పరుల మెల్ తలపెట్టవోయ్'

'దేశమును ప్రేమించమన్నా – మంచి అన్నది పెంచమన్న'

– గురుజాడ అప్పరావు

''జయం, నిశ్చయం – భయంబు లేదురా? ''

''సారే జహాసే అచ్చా – హిందూ సితా హమారా''

జై జన్మభూమి!     జై బంజారా !!     జై భారత్ !!!

సౌజన్య వారపత్రిక తా. 1-5-1977 విజయవాడ

# బంజారాల బ్రతుకులు బాగుపడే దెప్పుడో.....

– బి. చీనియానాయక్

ఆంధ్రప్రదేశ్‌లోని అనంతపురం జిల్లా ఉందని అందరికి తెల్సు. అక్కడ నివసించే ప్రజలకూ కష్టాలూ ఇబ్బందులూ ఉంటాయనీ తెల్సు. అయితే అక్కడ సుగాలీలు, బంజారాలు అనే జాతులున్నాయనీ వాళ్ల కష్టాలు వర్ణనాతీతమనీ చాల తక్కువ మందికి మాత్రమే తెలుసును విచిత్రమేమంటే – అక్కడి బ్యాంకులు ఈ సుగాలీలకి ధన సహాయం చేయడానికి నిరాకరిస్తున్నాయి. అదేమని అడిగితే, తాండాలు ఊరికి దూరంగా ఉంటున్నాయనీ రోడ్డు

సౌకర్యం లేదని వాళ్ల సమాధానం. అంటే రోడ్డు సౌకర్యంలేనంత మాత్రాన(రోడ్డు సౌకర్యం అనేది ప్రభుత్వం చేయాల్సిన పనే గదా!) వాళ్ళకి బ్యాంకులనుంచి సహాయం ఉండదా? వెనుకబడిన జాతులపై ప్రత్యేక శ్రద్ధా, వాటి అభివృద్ధికి కృషి అన్నవారు వాస్తవానికి చేస్తున్నది ఇదన్నమాట.

ఈ జిల్లాలో సుమారుగా 500 సుగాలీ గుంపులు(తాండాలు) ఉన్నాయి. వీరి ముఖ్య వృత్తి వ్యవసాయము, పశుపోషణ. ఈ బంజారాలు, సుగాలీల అభివృద్ధికోసం ప్రభుత్వం ఒక ''గిరిజన ఫైనాన్స్ కార్పొరేషన్'' ఏర్పాటు చేసింది. కాని దాని నిర్వహణకొక కార్యాలయమంటూ లేదు. జిల్లా కలెక్టరు అధ్వర్యంలో జిల్లా సాంఘిక సంక్షేమాధికారిని చూడమన్నారు. కాని ఈ అధికారి ప్రభుత్వము కేటాయించిన లక్షల ధనాన్ని ఖర్చు చేయలేదు. కారణం అడిగితే సిబ్బంది లేదు అని తప్పించుకుంటున్నారు. ఏదో ఒక తాండాలోని పది పదిహేను మందికి ఆర్థికసాయం చేస్తే సరిపోతుందా? దానివల్ల ఆ ప్రజలందరి స్థితిగతులూ బాగుపడతాయా?

అసలు సుగాలీలందరికి సక్రమంగా ఆర్థిక సహాయం చేయాలంటే, ప్రతి తాండానూ సొసైటిగా రిజిస్టరు చేయాలి. ఆ తాండాలోని అన్ని కుటుంబాలను సభ్యులుగా చేర్చుకోవాలి. ఒక తాండాలో సుమారు 100 కుటుంబాలుంటే, వారిని గ్రూపులుగా విడదీసి. 30 కుటుంబాలు వ్యవసాయం, 20 కుటుంబాలు గొర్రెలు పెంపకం, 20 కుటుంబాలు పాడి పరిశ్రమ, 10 కుటుంబాలు కోళ్ల పరిశ్రమ, పందులు, చేపలు కొంత మంది చేతి వృత్తులు వగైరా చేయాల్చి ఉంటుంది. వాళ్లందరికి సరిపోయే ఆర్థిక సాయం కార్పొరేషన్ ద్వారా మంజూరు చేయించాలి. అన్ని రకాల తాండాలను గుర్తించి వాటికి ధన సహాయం అందజేయాల్సిన కనీస బాధ్యత జాతీయం చేయబడిన బ్యాంకులకుంది.

16 పంచాయితీ సమితులకూ, జిల్లా పరిషత్ వారికి కేటాయించిన 4,65,000 రూపాయలను 1963నుంచి 1976వరకూ ఒక్క పైసా కూడా ఖర్చు చేయలేదు. జిల్లా సోషల్ వెల్ఫేర్ ఆఫీసరు ఇచ్చిన స్కీముల్ని అమలు చేయలేదు. పిల్లలకు స్కాలర్ షిప్పులు ఇవ్వలేదు. హాస్టళ్లకు కేటాయించిన డబ్బుతో భవనాలు కట్టలేదు. మరి ఈ డబ్బంతా ఏమైపోతుంది? దేనికి ఖర్చు చేస్తున్నారు? ల్యాప్స్ అయిపోతుందా? ఆ విషయం తెలీదు. సమాధానం లేదు.

ఈ జిల్లాలో హరిజనులకి 68 హస్టళ్లుంటే, గిరిజనులకి 4 మాత్రమే ఉన్నాయి. ఒక గిరిజన హాస్టల్ని హరిజన హాస్టల్గా మార్చేశారు. అధికారులంత హరిజనులవ్వడమే దీనికి కారణం. కనుక ఇలాంటి పక్ష పాతాలకు తావులేకుండా ఉండటానికి ప్రత్యేకంగా ఒక గిరిజన జిల్లా సంక్షేమ శాఖ ఏర్పాటు చేయటం అవసరం.

కలెక్టరు ఆదేశం మేరకు నారశింహపల్లి తాండా సమిష్టి వ్యవసాయ సంఘానికి 10,86,000 రూ. లు కేటాయించబడితే జిల్లా సాంఘిక సంక్షేమ శాఖధికారి ,70,000 రూ.లు మాత్రం మంజూరు చేశారు. అయితే అవి కూడా ఎవ్వరికి యివ్వలేదు. అందువల్ల సహాయం కోసం వేయికళ్లతో ఎదురుచూసే ఆ ప్రజలకు ప్రతి సారి నిరాశా, నిస్ప్రహ తప్పటంలేదు. అధికార్లు విపరీతంగా కాలయాపన చేస్తున్నారు.

స్వాతంత్ర్యంవచ్చి 50ఏళ్లు అయినా బంజారాలు, సుగాలీల బ్రతుకుల్లో చీకటి మాత్రం పోలేదు. వాళ్లింకా కష్టాల్లోనే ఉన్నారు. వాళ్ల బ్రతుకులు నికృష్టంగానే ఉన్నాయి. వాళ్ళేదో బంగారు కోరటంలేదు. కనీస అవసరాలు తీర్చు మంటున్నారు. కడుపుకింత అన్నం కోరుకుంటున్నారు. కానీ వాళ్లని కన్నెత్తి చూసేనాధుడే లేడు.

# National Scheduled Castes & Scheduled Tribes Finance and Development Co-operation, New Delhi

## ORGANISATION:

National Scheduled Castes & Scheduled Tribes Finance and Development Corporation (NSFDC) is a fully owned Govt. of India undertaking under the Ministry of Welfare and is managed by a Board of Directors with representation from Central Government. State level Channelising Agencies. Financial institutions and eminent public recognised for their services to SCs & STs.

As on September 30, 1995. NSFDC had a paid up capital of Rs. 21477 lakhs as against the authorised capital of Rs. 30000 lakhs. The functions of NSFDC are grouped into Projects. Finance and Personnel & Administration.

## OBJECTIVES:

NSFDC is the apex institution for financing facilitating and promoting the economic development activities of SCs and STs.

## OPERATIONS:

1. Financing income generating economic development activities of SCs and STs through the State level channelising agencies and other recognised institutions.
2. Providing advisory services to SCs and STs and the State channelising agencies.
3. Providing grants for skill development programmes operated by State Channelising Agencies and Non-Governmental Organisations. Also upgrading skills of officers of state level channelising agencies through periodic training programmes.
4. As a National level apex institution, coordinates the working of other institutions and agencies engaged in the economic development of SCs and STs.
5. Operates as a Nodal Agency for the Ministry of Welfare. Govt. of India with regard to economic development of SCs and STs.

## ELIGIBILITY CRITERIA:

1. The beneficiary should be an SC or ST or a Cooperative Society or a legally constituted association, firm promoted by members of SCs & STs.

2. Annual family income of the beneficiary/members of Cooperative Society or other Constitution should not exceed double the poverty line limit (Rs.22,000/- for rural areas and Rs. 23,700/- for urban areas).

## FINANCING PROGRAMMES:

### I. Term Loan:

1. Term Loan assistance is considered for projects costing up to Rs. 30 lakhs only.

2. Promoter's contribution

| Project/Unit Cost | Minimum Promoter's contribution as %age of project cost* |
|---|---|
| Up to Rs.1 lakh | Not to be insisted |
| Above Rs.1 lakh and up to Rs.10 lakhs | 5% |
| Above Rs. 10 lakhs | 8% |

**The above Promoter's contribution is not on slab basts*

3. Term Loan is provided up to a maximum of 85% of the project cost subject to the State Channelising Agencies contribution their share of assistance as per their schemes and tieing up of all other available sources of funds/subsidies.

4. Interest Rates

| Amount of Loan from NSFDC | Interest p.a. | Chargeable to ** |
|---|---|---|
| per project/unit | SCDCs | Beneficiaries |
| Up to rs. 5 lakhs | 4% | 6% |
| Above Rs. 5 lakhs | 6% | 8.5% |

*** The above rates of interest are not on slab basts.*

5. Term Loan is to be repaid in quarterly/half yearly/ annual installments as the case may be within a maximum period of 10 years including suitable moratorium period.

## II. Seed Capital:

1. Seed Capital assistance is provided to entrepreneurs availing term loan from State Financial Corporations (SFCs)/other financial institutions but not able to bring in their share of equity stipulated by the term lending institutions.

2. Seed Capital assistance is to meet the gap in the equity stipulated by the term lending institutions as per their norm of debt equity ratio.

3. The entrepreneur is to bring in a minimum of 20% of the equity.

4. NSFDC may provide Seed Capital assistance up to 80% equity or Rs. 30 lakhs whichever is minimum per unit/profit centre.

5. Seed Capital assistance is free of interest but the channelising agencies will levy a service charge of 1 % p.a. from the beneficiaries and pay 0.75% p.a. to NSFDC.

6. Seed Capital is to be repaid within a maximum period of 7 years from the date of first disbursement. inclusive of suitable moratorium. In cases where Seed Capital assistance remains unpaid beyond 7 years. The same shall be converted into term loan at the expiry of 7th year at an interest applicable to NSFDC term loan and shall be paid within 3 years in quarterly installments from the date of conversion into term loan.

7. Projects considered for Seed Capital assistance shall not be eligible for any other financial assistance from NSFDC.

## III. Bridge Loan:

1. Bridge Loan may be provided against investment subsidy sanctioned or any other source of funds sanctioned by any recognised agencies for projects costing up to Rs. 30 lakhs; but not disbursable within implementation period of the project.

2. Interest rates on bridge loan is as per NSFDC term loan interest rates.

3. Subsidy or other sources of funds sanctioning agency should assure to release the funds direct to NSFDC or its State level channelising agencies; within a maximum period of 2 years from the date of first release of bridge loan by NSFDC.

## IV. Working Capital Loan:

1. For projects/units costing up to Rs. 3 lakhs, entire Working Capital may be taken as part of project cost.

2. For projects/units with cost exceeding Rs. 3 lakhs and up to Rs. 30 lakhs, Working Capital margin alone be considered as part of project cost.

3. NSFDC may consider to provide Working Capital loan on specific request.

4. Channelising agencies shall charge 10% p.a. interest from the beneficiaries and pay 8% p.a. to NSFDC.

5. Channelising agencies and promoters shall ensure for take over the Working Capital loan by banks/financial institutions or from other sources within 3 years from the date of first disbursement of Working Capital loan by NSFDC and all dues on this account should be paid back to NSFDC within the last quarter of the 3rd year.

6. Working Capital loan would be considered only for projects availing term loan from NSFDC.

### V. Grant for Skills & Entrepreneurial Development Programmes:

1. Financial assistance in the form of grant is provided to the channelising agencies and NGOs for imparting skills and entrepreneurial development training to SCs and STs.

2. Financial grant is to cover up to 85% of the recurring expenditure of the training programmes.

3. The proposals for grants should necessarily indicate placement/self employment opportunities to the beneficiaries after training.

## EXECUTIVE DEVELOPMENT PROGRAMMES (EDPs) FOR OFFICERS OF CHANNELISING AGENCIES:

1. NSFDC provides training to the officers of State level channelising agencies for upgradation of their skills in project identification, formulation, appraisal, implementation, monitoring and recovery of loans.

2. State channelising agencies may seek the EDPs conducted for their officers by NSFDC at periodic intervals.

3. NSFDC provides faculty and course material and all other arrangements for EDPs made by channelising agencies.

## DISBURSEMENT OF FUNDS:

Funds for the sanctioned projects/schemes are released by NSFDC on specific request from the channelising agencies subject to:

1. Execution of General Loan Agreement.

2. Execution of State Govt. Guarantee/Bank Guarantee.

3. Identification of beneficiaries and approved as sets under the scheme.

4. Subsequent instalment of funds released on satisfactory utilisation of funds released earlier.

## FUNDS UTILISATION:

1. State Channelising Agencies are to utilise funds provided by NSFDC within 90 days of its release.

2. NSFDC funds released to the beneficiaries or advanced towards procurement of assets under the projects by the channelising agencies shall alone be considered as funds utilised.

3. NSFDC funds remaining unutilised by channelising agencies will attract interest at 10% p.a.

4. NSFDC funds returned unutilised by the channelising agencies. Even within 90 days shall attract interest at 10% p.a.

5. In no case the higher rate of interest charged will be levied subsequently by the channelising agencies from the beneficiaries.

## LIQUIDITY DAMAGES ON DEFAULTED PAYMENTS:

1. NSFDC seed capital assistance other loans and interest thereon are to be paid as per repayment schedules.

2. Defaulted repayments shall attract liquidity damages at 4% p.a. over and above normal interest rate and service charges applicable on dues.

## SECURITY:

1. Channelising agencies shall provide State Government guarantee/bank guarantee to NSFDC for the funds sanctioned to them.

2. For seed capital assistance provided through SFCs, security shall be the same as stipulated by SFCs for their term loan.

3. Channelising agencies may endeavour to provide block guarantee from State Govts. to cover their funds requirement from NSFDC for 2 to 3 years: to avoid repetitive work in seeking project wise State Government guarantee.

## PROCEDURE FOR AVAILING ASSISTANCE:

1. Submit proposed project reports in NSFDC application formats to the State Channelising Agencies.

2. NSFDC formats I, II and III for furnishing projects details are available with State Channelising Agencies and NSFDC representative Offices.

3. State Channelising Agencies may recommend the proposal to NSFDC subject to the beneficiaries fulfilling the eligibility criteria and the channelising agencies willing to:

(i) implement the schemes as sanctioned by NSFDC.

(ii) provide their share of financial assistance and subsidy as applicable.

(iii) monitor the project implementation and repay the loan.

(iv) provide state Government guarantee/Bank guarantee towards the assistance sought from NSFDC.

## FUNDS ALLOCATION TO CHANNELISING AGENCIES:

1. Funds mobilised in each year by NSFDC is notionally allocated to channelising agencies in the States in proportion to the SC and ST population of the country represented by them.

2. Within the above allocation. Funds are further allocated as detailed below:

| | | |
|---|---|---|
| (i) | for projects/units costing up to Rs. 5 lakhs | 75% |
| (ii) | For projects/units costing above Rs. 5 lakhs. inclusive of seed capital assistance | 25% |

3. Funds earmarked under (i) above may be made to flow follows:

| | | |
|---|---|---|
| (i) | Educated unemployed/ underemployed beneficiaries | 50% |
| (ii) | Scavengers & their dependents (till the NSS period) | 10% |
| (iii) | Women beneficiaries | 10% |
| (v) | Others | 30% |

## GENERAL:

1. NSFDC eligibility criteria for providing financial assistance is applicable in all cases.

2. Where a scheme contains identical projects/Units/ profit centres. Exposure of NSFDC will be limited to Rs. 150 lakhs per scheme.

3. For the schemes from cooperative societies. Companies and other forms of legally constituted firms, associations, etc. quantum of financial assistance depends on their paid up capital borrowing limits and past performance.

4. In case of Cooperative Societies. Companies and other forms of legally constituted firms, cost of project/unit/profit centre is decided based on whether the ownership of the assets rest with the members of the society of with the society.

5. The State Channelising Agencies are to provide their share of assistance and subsidy as per their schemes.

6. Those who own the assets under NSFDC assistance alone are considered as beneficiaries. The proposals from channelising agencies should specifically indicate the number of SCs and STs separately.

7. The guidelines are effective from October 1. 1995.

8. In case of any ambiguity in the guidelines, decision of NSFDC is final.

భారతీయ చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధి బ్యాంక్
5-9-89/1&2, చాపెల్ రోడ్, మూడవ అంతస్తు, పోస్టుబాక్స్ నం.130, హైదరాబాద్-500 001

**SMALL INDUSTRIES DEVELOPMENT BANK OF INDIA**

*5-9-89/1, 1&2, CHAPEL ROAD, III FLOOR, POST BOX No. 130, HYDERABAD - 500 001*

Ref: SIDBI (H) No. 2260 /PFS(SHBAPL) 17-01-1997

The Managing Director
Sri Hathiram Bava Agro Projects (P) Ltd.
D.No.11/339A-1, Aravindanagar
ANANTAPUR - 515 001

*Dear Sir,*

***Application for Term loan of Rs. 52 lakh under PFS***

*Please refer to your application seeking financial assistance for setting up a new dairy unit for processing of milk at Yerragunta village, Rapthadu Mandal, Anantapur District and subsequent discussions we had with you on the above subject. We request you to furnish information at the earliest:-*

1) *Details and terms and conditions of seed capital of Rs. 20 lakh to be sanctioned by National SC & ST Finance Corporation Ltd. as enumerated in the means of finance.*
2) *Details regarding margin money of Rs. 7 lakh to be provided by TRICAR.*
3) *Shareholding pattern of Sri Hathiram Bava Agro Products (P) Ltd.*
4) *Networth statement of the promoters*
5) *Details of dairy projects existing in Anantapur District as well as proposed to come up shortly including Govern ment Co-Operative dairies.*
6) *A detailed note regarding plans on procurement of milk vis-a-vis availability of milk in the area.*

*You may kindly call on us along with the above information during the office hours on any working day.*

Yours faithfully,
Sd/-
(M. Subramanian)
Dy. General Manager

Telephones: 234454,210247 Telex: 0425-6912 Telegrams: "LAGHUVIKAS" Fax: 040-236870

A wholly owned subsidiary of IDBI

Grams :"TRICOR" Phone : 391634

**ANDHRA PRADESH SCHEDULED TRIBES CO-OPERATIVE FINANCE CORPORATION LTD.,**

1st Floor, Telugu Samkshema Bhavan,Masab Tank, Hyderabad - 500 028.
T.A. No. 843
(A State Government Undertaking)

Rc. No. TRICOR /83/43/97. Date : 28-1-1997

To
The Managing Director,
National Scheduled Castes & Scheduled Tribes
Finance Development Corporation,
8. Balaji Estate, Guru Ravi Dass Marg,
Kalkaji, New Delhi.

Sir,

Sub:- Setting up a dairy plant in Anantapur District - Request for financial assistance for Seed Capital assistance from NSFDC and TRICOR - Reg.

Ref :- Lr. Dt. 22-1-1997 from Sri Hathiram Bava Agro Projects (P) Limited D.No. 11/339/A.1 Aravinda Nagar, Anantapur - 515 001.

We send here with a copy of the reference cited wherein the Managing Director, M/s. Hathiram Bava Agro Products (P) Limited, Anantapur has submitted a proposal to set up a milk processing plant in yerragunta (V) Anantapur District with an installed capacity of 10,000 letters per day with 35 share holders belonging to S.T.community for consideration on the merits of the case as detailed in the proposal against bak guarantee case as detailed in the proposal against bank guarantee purported to be provided by the SIDBI, Hyderabad.

However, it is not possible for this Corporation, to extend any financial assistance or fan for the Government of Andhra Pradesh to stand guarantee for the above unit as expected by the promoters of the above unit.

Yours faithfully.
**Sd/- T.S. APPA RAO**
MANAGING DIRECTOR
for Managing Director

Copy to Sri.B.B.H.Rathod, Managing Director,
M/s.Hathiram Bava Agro Projects (p) Limited,
Regd.office D.No.11/339/A.1, Arvinda Nagar,
Anantapur - 515 001.

Copy submitted to the Secretary to Government,
Social Welfare (T,W) Department,
Government of Andhra Pradesh, Hyderabad
for kind information.

భారతీయ చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధి బ్యాంక్

5-9-89/1&2, చాపెల్ రోడ్, మూడవ అంతస్తు, పోస్టుబాక్స్ నం.130, హైదరాబాద్-500 001

## SMALL INDUSTRIES DEVELOPMENT BANK OF INDIA

*5-9-89/1, B2, CHAPEL ROAD, III FLOOR, POST BOX No. 130, HYDERABAD - 500 001*

Ref: SIDBI (H) No. 2366 /PFD/Misc.　　　　February 7,1997

The Managing Director
Sri Hathiram Bava Agro Projects (P) Ltd.
D.No.11/339A-1, Aravindanagar
ANANTAPUR - 515 001

Dear Sir,

**<u>Project Finance Scheme-Financial Assistance of Rs. 52 lakh</u>**

Please refer to your letter dated January 20, 1997 seeking term loan assistance of Rs.52lakh in order to set up a dairy nit at Anantapur. It is observed from the letter that the institution which sanctions the term loan will have to extend the bank guarantee to NSFDC and TRICAR for their soft loan of Rs. 20lakh and Rs. 7lakh respectively. We do not operate any scheme under which we offer bank guarantee for the assistance given by other institution. Under the circumstances, we regret out inability to consider your application for assistance. However, we may be in a position to consider your project under our indirect finance schme under which we provide refinance support to Primary Lending Institutions in respect of their assistance to your project, subject to the proposal conforming to the norms/parameters under the scheme.

Yours faithfully,
Sd/-
(M. Subramanian)
Dy. General Manager

Telephones: 234454,210247 Telex: 0425-6912　Telegrams: "LAGHUVIKAS" Fax: 040-236870

A wholly owned subsidiary of IDBI

# కలియుగంలో సత్యం - అసత్యం

''నా అనుభవం'' ఈ కలియుగంలో ఎవరైతే నీతి నిజాయితీగా ఉంటారో, వారినే ప్రజలు దొంగ అని, నీతి లేనివాడని, మోసగాడని అవిధేయుడని నిందించుతారు. అదే నీతినిజాయితీ లేకుండ ప్రజలను మోసగిస్తూ, వారిని దోచకుంటు, దొరలాగా చలామని చేస్తారో వారిని సత్యవంతుడని, ధర్మప్రభువని, ప్రజల అభివృద్ధిని కాంక్షించే మహానుభావుడని, ఎంతయో పొగడుకుంటు, వారి ద్వారా మోసగించబడి కూడ వారినే ఆశ్రయించుతూ ఉంటారు. ఈ విషయములను గూర్చి అక్కడక్కడ చర్చించుతూ ఉంటారు. ఈ విషయములను గూర్చి ఇక్కడ చర్చించుకొందాము.

మోసగించటం అనేది ఒక్క చదువు కొన్నవాడిలోనే కాదు, చదువురాని వాడు కూడ అదే పని చేస్తున్నారు ప్రభుత్వ ఉద్యోగే కాని, నిరుద్యోగులు కూడ అదే చేస్తున్నారు. రాజకీయనాయకుడే కాదు, వారి ద్వారా పాలించబడే ప్రజలు కూడ చేస్తున్నారు. ప్రతి చోట ఈ మోసం, దగా, అసత్యం తాండవించుచున్నవి. ఈ విషయంలో నా స్వఅనుభవమును తెలియపరచుటకు సాహసించుచున్నాను.

1966 సం.లో నేను శ్రీశైలం గవర్న మెంటు ఐ.టి.ఐ.లో ఇన్స్ట్రక్టరుగా పనిచేయుచున్నాను. 1966 సం.జూన్ నెల 10వ తారీఖున జాయిన్ అయినాను. అక్కడితో ప్రారంభమైనది. ఈ తతంగం నేను అనంతపురంనుండి శ్రీశైలం చేరుటకు వ్రాసుకొన్న టి.ఎ. బిల్లుపాస్ ఆగుటకు 20 రూ.లు లంచం ఇవ్వవలయునన్నారు. నేను ఇవ్వను అన్నాను. నీ టి.ఏ. బిల్లు ఎలా పాస్ అవుతుంది అన్నారు. ఎలా పాస్ కాదో చూస్తాను అన్నాను. అంతే అలా కాదు అతని జీతంలోనే లంచం తీసుకొనవలయును అని ఎత్తువేసి, నీ ఎల్.పి.సి.లో తప్పు ఉన్నది. అది అనంతపురంనుంచి సరిఅయి వస్తే తప్ప నీకు జీతంరాదు అన్నారు. అంతే 3 నెలలువరకు జీతం రాలేదు. నా జీతం గూర్చి ఐ.టి.ఐ ప్రిన్సిపాల్‌గార్కి డైరెక్టరువారికి తెల్పటం జరిగినది. ఒక క్రొత్తగా వచ్చి చేరిన ఉద్యోగికి 3 నెలల వరకు జీతం ఎందుకు ఇవ్వలేదని ఐ.టి.ఐ ప్రిన్సిపాల్ శ్రీశైలం వారికి ఒక మెమో, ఐ.ట.ఐ. ప్రిన్సిపాల్ అనంతపురంవారికి ఒక మెమోను డైరెక్టరువారు పంపడం జరిగినది. అదే రోజు సాయంత్రంనకు, నాకు 3 నెలల జీతం ఒకేసారి ఇవ్వడం జరిగినది. ఈమెమో తీసుకొన్న ఐ.టి.ఐ. ప్రిన్సిపాల్‌వారు అనంతపురంనుండి నాకు మెమో పంపించారు. ఎందుకు డైరెక్టరు వార్కి తెల్పినారు. ఆ విషయంనాకు శ్రీశైలం ఐ.టి.ఐలోపనిచేయుచున్న కాంపోండరు ద్వారా తెలిసినది. నాకు 3 నెలల జీతం ఇవ్వకుండ నష్టపెట్టినది కాకుండ, దానికి వడ్డీగా మెమో పంపారా! నాకు మెమో ఇస్తే. అది అలాగే డైరెక్టరు వారికి పంపిస్తాను అని గుమాస్తాగారితో చెప్పడం జరిగినది. ఆ విషయం ప్రిన్సపాల్‌గార్కి తెలిసి నాకు మెమో ఇవ్వకుండా స్టాప్ చేశారు.

1968 సం.లో అనంతపురం జిల్లాలో అనావృష్టివల్ల పంటలన్ని ఎండిపోయి ప్రజలు ఊరు వదలి పోతున్నారని నా తండ్రి బి. చందేనాయక్, నారశింహపల్లి తాండా, పెనుకొండ తాలూకా, ఒక ఉత్తరం వ్రాసారు. ఆ ఉత్తరం చదివిన తరువాత నా మనస్సు బాధపడి చూచుటకు మా తాండాకు వచ్చాను. నేను తాండాకువచ్చిన రోజునే కుంభవృష్టిగా వర్షం కురసినది. ఎండిన

పైర్లు మళ్లి చిగుర్చి ఒక వారం రోజులలోనే పచ్చగా మారి, నడుం ఎత్తు పెరిగింది. అప్పటినుండి వర్షం తడి ఆరనీయకుండ పడుచునే ఉండెను. కానీ నా మనస్సుకు అది సంతోషము కల్గించలేదు. నేను 1964వ లో హైద్రాబాద్‌లో సి.టి.ఐ. ట్రయినింగ్ అయిన సందర్భములో హైద్రాబాద్ ఎగ్జిబిషన్‌లో ఒక పుస్తకం తెచ్చి ఉంటిని. అది సహకార, సమిష్టి వ్యవసాయం గూర్చి బాగా వ్రాసి ఉన్నాను. వ్యవసాయ రంగమును సమిష్టి పద్ధతిలో ఎలా అభివృద్ధిపరచ వలయును అని. ఆ పద్ధతులు నాకు బాగానచ్చినవి. అందువలన దానిని నా గ్రామములో అమలు పరచవలయును అని తలంచి, తాండా వారందరిని, రాత్రి పూట పెట్రోమాక్సు లైటులో వారిని సమావేశ పరిచి వారికి సమిష్టి వ్యవసాయం గూర్చి వివరించటం జరిగినది. వారందరు దానిని అంగీకరించి, నాకు ప్రోత్సహం ఇచ్చారు. నేను ఆ విషయంలో 3 రోజులు. రాత్రి పగలు అగకుండా, నాతో పాటు వారికి ఆ విషయం గూర్చి, మొత్తం 48 గంటలు పైన మాట్లాడటం జరిగినది. ఆవిధంగా మాట్లాడటంవలన అసలు గొంతులో సౌండ్ రావడం ఆగిపోయినది. ఎవరికి నా మాటలు వినిపించటం లేదు. మొత్తం సైగలతో చెప్పటం జరిగినది. అప్పుడు పెనుకొండలో యల్. రూప్లానాయక్, బి.కాం. మార్కెటింగ్ సొసైటీ మేనేజరు గా పని చేస్తున్నారు. వారికి ఈ విషయం తెల్పడం జరిగినది. అప్పుడు కేషన్న అను డాక్టరువారికి చూపించగా వారు 16 క్యాపిల్సు ఇవ్వడం జరిగినది. ఒక 10 క్యాపిల్చు తినగానే సౌండ్ తిరిగి వచ్చినది.

ఆ తరువాత శ్రీ రూప్లానాయక్ కో.ఆపరేట్యూ సీనియర్ ఇన్స్‌పెక్టరుగారు మేనేజరుగా పెనుకొండ కో. ఆపరేట్యూ మార్కెటింగ్ సొసైటీలో పనిచేయు చుండటంవలన వారికి మా తాండాలో సమిష్టి వ్యవసాయ సంఘం స్థాపించవలయునని చెప్పడం జరిగినది. వారు ఆ విషయంలో నిరుత్సాహపరచారు. ఎవరు చేస్తారు? ఎలా చేస్తారు? అని నాకు అదంతా అనవసరం, మీ సహకారంతో మాకు సంఘం రిజిస్టరు చేయిస్తారా లేదా? అని గట్టిపట్టు పట్టడం జరిగినది. అయితే నీ ఇష్టం, నాకు చేతనైన సహాయం చేస్తాను. పెనుకొండ సమితిలో శ్రీ కదిరెప్ప కో.పరేట్యూ ఎక్స్టెన్షన్ ఆఫీసరువారు ఉన్నారు. వారితో నీకు పరిచయం చేయిస్తాను అని చెప్పి తన జవానును పిలిచి శ్రీ కదిరెప్పగార్ని నేను పిలిచినానని, పిలుచుకొని రమ్మని తెల్పినారు. అంతే కదిరెప్పగార్ని పిలుచుకొని వచ్చారు. నన్ను పరిచయం చేసారు. వారితో ఈతను నా బంధువు ఉద్యోగి తన గ్రామంలో ఒక సహకార సమిష్టి వ్యవసాయమును రిజిస్టరు చేయించవలయునని ఉన్నాడు. ఇతనికి మీ సహాయం కావలయును అన్నారు.

అదేంటి సార్ తమరు చెప్పటం, నేను చేయకపోవటమా. మీరు యస్.టి.వేమ యస్.సి. మనం చేయకుంటే ఎవరు చేస్తారు సార్. పైగా నాకు సమిష్టి సహకార సంఘాలు, స్థాపించమని ఉత్తర్వులు కూడా ఉన్నవి. వెతకపోయిన తీగె నా కాళ్లకు తగులుకుంది. మంచిది సార్. తప్పకుండా చేస్తాను అన్నారు. సంఘంను స్థాపించుటకు మొదట టౌన్‌బాంక్‌లో ఛీఫ్ ప్రమోటర్ పేర 500 రూ.లు డిపాజిట్టు చేయవలయును హిందుపురం డిప్యూటి రిజిస్ట్రారువారికి ఆర్జి ఇచ్చుకొనవలయును అన్నారు. అప్పుడు మా మెంబర్లు వద్ద డబ్బులు లేవు. దాని కొరకై నా మేనమామ గారైన శ్రీ గొర్లసామే నాయక్( అడవి బ్రాహ్మణపల్లి తాండా) గారి వద్ద, సంఘం రిజిస్టరు చేయించుటకు 500రూ డిపాజిట్టు చేయవలయును. దయచేసి మీరు తప్పకుండా మా తాండా భవిషత్తు గూర్చి ఇవ్వండి అన్నాను. వారు నా మాట కాదనలేక 500/- రూ.లకు పత్రం వ్రాయించుకొని ఇచ్చారు. ఆ మొత్తం తెచ్చి పెనుకొండ టౌన్ బ్యాంకులో ఛీఫ్ ప్రమోటర్,

బి. చీనియానాయక్ (నా) పేర జమ చేయటం జరిగినది. ఇక అతని వెంట ఒక వారం రోజులు తిరిగి ఒకనాడు సాయంత్రం పెనుకొండనుండి బుక్కపట్నం బస్సు ఎక్కడం జరిగినది. అక్కడినుండి రాత్రి 9 గం. వెంగళమ్మ చెరువు బస్సు ఎక్కిరావలెను. వెంగళమ్మ చెరువులో భోజనాలుఉండవు. బుక్కపట్నంలోనే రవదోసెలు తిన్నాం. వెంగళమ్మ చెరువు బస్సు ఎక్కి రాత్రి 10 గం.లకు చేరుకొన్నాము. అక్కడినుండి 4 కి.మీ. నారశింహపల్లి తాండా రాత్రి పూట నడచిపోవలయును. ఇక కో.ఆపరేట్యూవారికి ప్రతి ఊర్లోను కొంత మంది గ్రామ పెద్దల పరిచయం ఉంటుంది. వారు మల్లి రెడ్డి ఇంటికి పోదాంరండి నాయక్‌గారు అన్నారు. వారి ఇంటికి పోయి కూర్చున్నాము. మల్లిరెడ్డిగారు. నాగిరెడ్డి అని ఆ ఊరి మరిఒక రైతు కూర్చొని ఉన్నారు. ఏం కదిరెప్పగారు ఇప్పుడొచ్చారు అని పలకరించారు. ఏమిటి సార్ ఈ నాయక్‌గారు వదలి పెట్టంలేదు. అని తెల్పినారు అంతే! ఇక మొదలు పెట్టారు. ఈ దొంగ సుగాలీ వాళ్ల సమిష్టి వ్యవసాయం చేయటమా! 24 గం. దొంగ సారాయి, దొంగ కోళ్లు, దొంగ కంకులు, దొంగ పైరు, దొంగ మిరపకాయులు, అని సుమారు ఒక 5 నిమిషములు ఇద్దరు చదవటం మొదలుపెట్టారు. అవన్ని చెప్పి తరువాత నన్ను చూచారు. అవి అన్ని మాన్పించుటకే కదండి ఇది చేపట్టవలయునని పూనుకొన్నాను, అన్నాను. నామాట పెడచెవిని పెట్టి, మా అన్నగారైన ఛత్రియా నాయక్‌గారితో ఏం నాయక్, నిజమా కాదా? అన్నారు. అతను వారికి సూటిగా సమాధానం చేప్పారు. తినేకి కూడ లేనప్పుడు ఇంకేం చేస్తారు నాయనా? అన్నారు. ఆ దెబ్బకు వారి మనస్సులు చివుక్కుమన్నవి.

అయితే సరే లెండి అని చెప్పి, భోజనాలు అన్నారు. మాకు వద్దు మేము బుక్కపట్నంలో చేసాము అన్నాము. అంతలో ద్రాక్షి తెచ్చారు. తిన్న తరువాత మేడపైకి తీసుకొని పోయి పండుకొండి అని చెప్పి కదిరెప్పగార్కి మంచం, నాకు పరుపు మీద పరుపు రెండు వేసి పండుకోమన్నారు.

నేను తెల్లవారు జామున నాల్గు గంటల కేలేసి మా తాండాకు పోయి, వారికి అన్ని భోజన వసతులు కల్పించి, బండి కట్టుకొని వెంగళమ్మ చెరువుకు వచ్చాను. ఈ లోపు శ్రీ కదిరెప్పగార్కి రాత్రి రవ దోసతిని, జలుబు, ఒళ్లు వెచ్చగవటం జరిగినది. బండిలో కూర్చున్నాడు. మా పొలం అంతా చూపించాము. చాలా బాగా ఉన్నదే. విశాలంగా వందల ఎకరములు ఉన్నవే అని చెప్పి మొత్తం పొలం చూపించి, తాండా స్కూలులో ప్రజలను సమావేశపరచి, అన్నియు చెప్పడం జరిగినది. అందరు చాలా సంతోషించారు. శ్రీ కదిరెప్పగార్కి ఆరోగ్యం సరిగా లేనందున, భోజనం చేయలేదు. ఆ దినం నా భార్య ఊరిలో ఉండుటవలన మంచి ఎ.వన్ భోజన పదార్థలు వండించాము. సేమ్యా పాయసం నేతితో గారెలు, కోడి మాంసం, పండ్లు చాలా పదార్థములు కాని పాపం కదిరెప్పగార్కి ఆ అదృష్టం లేదు. వారిని సాయంత్రానికి తిరిగివెంగళమ్మ చెరువు మల్లిరెడ్డిగారింటిలో చేర్చటం జరిగినది. ఎలాగుంది కదిరెప్పగారు అన్నారు. అయ్యా చాలా బాగున్నది సార్! మంచి పొలాలు ప్రజలు కూడ చాలా బాగా అనిపించారు, అన్నారు. అయితే సరేలేండి అన్నారు.

అప్పటికి నాకు అయనగారి వెంట ఉండి వారం రోజులపై బడింది. స్నానం లేదు. బట్టలు మార్చుకోలేదు. వారు వచ్చిన రోజు నోటిలో బ్రష్ వేసి పండ్లు కూడ తోముకోలేదు. ఆహారం కూడ తినలేదు. కాఫీ ఏమైన తాగనోలేదో నాకే తెలియదు. బస్సు తెల్లవారు జామున

5 గం.కే ఉన్నది. శ్రీ కదిరెప్పగారితో పర్మిషన్ తీసుకొని, తిరిగి ఇంటికి వచ్చి అప్పుడే స్నానం చేసుకొని, భోజనం చేసాను. తిరిగి తెల్లవారు 4 గంటలకే లేచి, శ్రీ కదిరెప్పగారు ఏమి తినలేదని, ఒక బ్యాగు కూరగాయలు, ఒక కోడి ఒక పెద్ద చెంబునిండా నెయ్యి తీసుకొని, వారిని పెనుకొండ చేర్చటం జరిగినది. నాకు అభయమిచ్చి వారం రోజులలో ఇన్స్పెక్షన్ రిపోర్టు పంపుదాము రండి అన్నారు.

అక్కడనుండి తిరిగితాండాకు రావడం జరిగినది. వారం అని చెప్పిన శ్రీ కదిరెప్పగారు 3 నెలల కాలం దాటించారు. పెనుకొండ నా ఇల్లు అయినది. శ్రీ రూప్లానాయక్ గార్కి పర్మనెంట్ గెస్టు అయినాను. వారు నన్ను చాలా గౌరవించుచుండిరి. శ్రీ రూప్లానాయక్ భార్య మా అక్క సీతాబాయి గారు, ఏ మాత్రం విసుగు చెందకుండ, ఆనందంతో భోజన వసతులు కల్పించేవారు. బంజారా సంఘం విషయంలో నాకు శ్రీ రూప్లానాయక్‌గార్కి పోట్లాట జరుగుచుండెది. చాలా పిసుగు చెందేవాడు. కోపంతో ఏ పోయి పండుకోరా అని గద్దించేవాడు. తిరిగి తెల్లవారుతూ నే శాంత చిత్తుంతో రే నాయక్ లెయ్యి అని నిద్దుర లేపేవారు. అదే నా సొంత ఇల్లు అయినది. భార్య బిడ్డలు, తాండాలో ఉండేవారు. ఉద్యోగానికి 3నెలలు అయినది. శెలువు పెట్టి, ప్రతి నెల, టెలిగ్రాములు, సెలువు చీకీలు పంపటం, శ్రీ శైలంలో ఐ.టి.ఐ లో జరిగిన సంఘటన మెమోల దెబ్బకు ప్రతి నెల జీతం యం.ఓ ద్వారా ఇంటి అడ్రస్సుకు వచ్చెది.

ఈ విధంగా మూడు నెలలు గడచిపోయినవి. కదిరెప్పగార్కి ఎప్పుడు అడిగినా, ఆ క్యాంపు ఉన్నది, అక్కడ పోవలయును, ఇక్కడ పోవలయును అని చెప్పి తప్పించుకొని తిరుగుతున్నాడే కాని, రిపోర్టు మాత్రం వ్రాయటంలేదు. ఆ విషయంలో శ్రీ రూప్లానాయక్‌గారికి చాలా కోపం వచ్చినది. నీవు హిందూపూర్ పోయి యల్. నారాయణ రెడ్డిగారు డిప్యూటి రిజిస్ట్రారుగారు ఉన్నారు. వారిని కలసి నీ విషయాలన్ని చెప్పు చాలా మంచివాడు తప్పకుండా చేస్తారు అన్నారు. నేను హిందుపురం పోయి, డి.ఆర్ శ్రీ యల్. నారాయణ రెడ్డిగారి ఇంటికి పోయి, శ్రీ రూప్లానాయక్‌గారు పంపించారు సార్. నేను ఉద్యోగినే, మా గ్రామ పరిస్థితుల గూర్చి శ్రీ కదిరెప్ప ఇన్సుపెక్షన్ గూర్చి మొత్తం చెప్పాను. డి.ఆర్. గారు నా గూర్చి విషయాలు బాగా తెలుసుకొని వెంటనే సి.యస్.ఆర్. శ్రీ ఆదినారాయణగార్ని పిలిపించి, వెంటనే పెనుకొండ పోయి, శ్రీ కదిరెప్పగార్ని కలసి, రిపోర్టు తీసుకొనిరండి అన్నారు. ఆ మధ్యానం పెనుకొండ రవాడం జరిగినది. సమితి ఆఫీసలో శ్రీ కదిరెప్పగారు లేరు. క్యాంపు కెల్లారు ల్యాండ్ మార్టిగేజ్ బ్యాంకు గూర్చి అన్నారు. రాత్రి బస్సు వద్ద కాచుకొన్నాము, వారితో పాటు పోయిన శివారెడ్డి నా ఫ్రెండ్, వెంగళమ్మ చెరువుగ్రామం, కదిరెప్పగారు సమితి ఆఫీసు వద్ద దిగి పాయారు అన్నారు. రెండవ రోజు సి.యస్.ఆర్. శ్రీ ఆదినారాయణగారు, టౌన్ బ్యాంకు జమానుతో, కదిరెప్పగార్ని పిలుచుకొని రా అని పంపించారు. అతను పోయిన, క్యాంపు నుండి ఇంకా రాలేదు అని చెప్పారు. నేను సుమారు 3 కి.మీ. నడిచి పోయి చూడగా ఆయన గారి భార్య ఇప్పుడే క్యాంపునుండి వచ్చారు. అని చెప్పారు. శ్రీ కదిరెప్పగారు నన్ను చూచి కోపమును ఆపుకొలేక ఏమిటయ్యా నన్ను శనిపట్టినట్టు పట్టావు. ఈ రోజు నీవు సొసైటి రిజిస్టరు చేయించి, నీ డ్యూటికి నీవు వెళ్లిపోతావు. ఆ తరువాత ఆ తాండాకు మెము తిరిగి రావాలా? అక్కడ పోతే మాకు కాఫీ నీళ్లు ఇచ్చే వారైనా ఉన్నారా? అని నా మీద విరుచుకు పడ్డారు. అప్పుడు నాకు అర్థమైనది. ఈ కిటుకంతా, మల్లిరెడ్డి, నాగిరెడ్డిగార్లు పెట్టింది, అని అంటే నేను ఆ రాత్రి వారిని

వెంగళమ్మ చెరువులో వదలిపెట్టి వచ్చిన తరువాత ఈ విషయమంతాను చర్చించినట్లు ఉన్నది. అదేంటి సార్ వారు బాగానే చూచారు అంటారు. అవునయ్యా, నాయక్ ఉద్యోగి, అన్ని తెలుసును, అన్ని సౌకర్యములు సమకూర్చుతాడు. ఇతను పోయిన తరువాత నీకు కాఫీలు ఇచ్చేవారుండారా ఆ ఊర్లో అన్నారు. మరి ఎలా చేయాలి? ఏమి లేదు, నాయక్ ఉద్యోగి, ఎన్ని రోజులు సెలువుపెట్టి ఉంటారు. ఉంటే ఒక నెల, లేక రెండు నెలలు ఆ తరువాత ఉద్యోగానికి వెళ్లిపోతారు. ఇక నీ వద్దవచ్చి అడిగేవాడు ఉండడు. నీవు నీ రిపోర్టు ఇవ్వనవసరం లేదు ? అన్నారు. ఇది అసలు జరిగిన విషయం అని అప్పుడు గ్రహించాను.

ఆ తరువాత వస్తాను ఫో అన్నారు, నేను టౌను బ్యాంకు వచ్చి విషయం సి. యస్. ఆర్ గార్కి చెప్పాను. వారు కోపగించుకొని ఒక మెమో తయారు చేసి. జవానుతో ఇచ్చిరమ్మని చెప్పే లోపు, చేతులు బాగుగా ఊపుకొంటూ శ్రీ కదిరెప్పగారు వచ్చారు. అంత సి. ఎస్. ఆర్. గారు మెమో ఇస్తూ సంతకం పెట్టు అన్నారు. అంతట కాళ్ల ముందు చాచి, ఇవ్వండి అని చెప్పి, చటుక్కున సంతకం పెట్టారు. ఆ తరువాత మెమో చూచి అక్కడనే ఛతికల పడ్డాడు. సి. యస్. ఆర్. గారు నన్ను మీరు రేపు సాయంత్రం 4 గం. హిందూపురం డి. ఆర్. ఆఫీసుకు రండి అన్నారు. వారికి పండ్లు ఇప్పించి బస్సు ఎక్కించి హిందూపురం పంపించాను.

రెండవ రోజు మధాహ్నం, పెనుకొండనుండి డి. ఆర్. ఆఫీసుకు వెళ్ళడం జరిగినది. ఖచ్చితంగా 4 గంటలకు శ్రీ కదిరెప్పగారు చేతులు ఊపుకొంటూ వచ్చారు. రిపోర్టు డి. ఆర్ నారాయణ రెడ్డి గార్కి ఇచ్చారు. ఎందుకు అంత లేటు అన్నారు. నాకు చాలా పనులున్నాయి సార్, అని ఏవేవో చెప్పారు. నీ డైరి ఇవ్వుమన్నారు. అంతా ఖాలి. వెంటనే సి. యస్. ఆర్‌ను పిలిచి, సెన్‌సార్ మెమో ఇవ్వమన్నాడు. ఆ దెబ్బతో శ్రీ కదిరెప్పగారు ఎక్కడ కనిపించినా నమస్కారం నాయక్‌గారు అనేవారు. అయితే నావల్ల తనకు లభించిన మెమో కారణంగా, ఆఫీసు సి. యస్. ఆర్ అయిన సింగ్‌గార్ని వేడుకొని, ఈ సొసటీ రిజిస్టరు కాకుండా చూడవలయునని, చెప్పగా, రిజిస్టరు అయిపోతుంది అనుకొన్న సొసైటి, సి. యస్. ఆర్. గారు అడ్డు పట్టడం వలన నిలిచిపోయింది. కారణం ఇది ఫార్మింగ్ సొసైటి కావున సొసైటి పేరున ప్రభుత్వం భూమి మంజూరు చేస్తాము. మీరు సొసైటి రిజిస్టరు చేయండి అని ఒక ఉత్తరం కలెక్టరు వారినుండి తీసుకొని సొసైటీ రిజిస్టరు చేయవలయును. అని ఒక పుల్ల అడ్డం పెట్టారు. అంతటితో ఆ సొసైటి రిజిస్టరు ఆగి పోయినది.

అది గ్రహించిన నేను, నా నెలవును పొడిగించుకొంటు, మా కుటుంభీకులందరిని సమావేశ పరచి, వారి అందరికి 3 గ్రూపులుగా చేసి, రెండు క్రొత్త బావులు, పాత బావికి, పూడు తియుచట, రెండు ఆయిల్ ఇంజనులు, బావినుండి నీళ్లు తోడుటకు గాను, పెనుకొండ భూమి తనకా బ్యాంకులో ఋణం మంజూరు కోరడం జరిగినది. మొత్తం 16,000/- రూ, పాత బావి, ఇంజను 4,000/- రూ. క్రొత్త బాయి 5,000/- రూ. మరి ఒక క్రొత్తబావి, ఆయిల్ ఇంజన్‌గాను 7,000/- రూ. మొత్తం 16,000/- రూ. మంజూరు చేయించటం జరిగినది. ఆ రోజులలో భూమి తనకా బ్యాంకులో వందల ఎకరములున్నరు 5,000/-కన్న ఎక్కువ ఋణం ఇచ్చేవారు కాదు. ఒకే పేరగల భూములలో 3 రకాల లోన్లు ఎలా తీసుకొన్నారు. అని అక్కడి ప్రజలకు అనుమానం వచ్చినది. ఆ విధంగా సొసైటి పనులు చూస్తూ వారి

కార్యక్రమం చేపట్టటం జరిగినది. శ్రీ సి. యస్. ఆర్. గోవిందప్పగారు మా తాండా కొచ్చి లోను రికార్డు చేయడం జరిగినది. వారికి నేను ఎక్కడ కనిపించిన, తన స్నేహితులతో మేము పోసిచ్చిన సేమియపాయసం గూర్చి చాలా చోట్ల చెప్పడం జరిగిన. నేను వీరి ఊరిలో త్రాగిన పాయసం మరవలేనయ్యా మొత్తం నెయ్యినే తాపించారు అని అంటుండేవారు.

ఒక రోజు లోను రెండవ కంతు తీసుకొని ఆయిల్ ఇంజన్లుకు డీజలు పట్టించుకొని వస్తామని, పెనుకొండ పోగా, అక్కడ జిల్లా కలెక్టరు వారువచ్చి, సబ్ కలెక్టరువారి బంగ్లాలో యున్నరని తెలసినది. వెంటనే బంగ్లాకు పోయాను. అప్పటి కలెక్టరు శ్రీ కె. యస్. ఆరోరుగారు. నన్ను గుర్తించి ఉండిరి వారు నన్ను చూచారు. నేను నమస్కరించు చుండగానే సబ్ కలెక్టరు వారిని చూచారు. సబ్ కలెక్టరు రత్నంగారు, తహసిల్దారు వారిని చూచారు. తహసిల్దారు వారు రెవిన్యూ ఇన్స్పెక్టర్ రాజు గార్ని చూచారు. అక్కడ సమితి ప్రెసిండెంట్ శ్రీరామ చంద్రయ్యగారు కూడ ఉన్నారు. వెంటనే రాజు గారు. రావయ్య నాయక్‌గారు వెంటనే నీకు కావలసిన పర్టికులర్స్ ఇస్తాను. ఇట్లే నా వెంట రా అన్నారు. కలెక్టరు గారు మీ తాండా స్కూలు ఎంతవరకు అయినది అన్నారు. టాప్ సీలింగ్ వేస్తున్నారు సార్ అన్నారు. వెంటనే పూర్తి చేయండి ఓపనింగ్ చేసిపోతాము అన్నారు.

వెంటనే నేను తనకా బ్యాంకులో రెండవ కంతు బ్యాలెన్సు లోను మా వారికి ఇప్పించి, డిజల్ డ్రమ్ముకు పోయించి ఎడ్ల బండ్లు తాండాకు పంపించి, బుక్కపట్నం వచ్చాను. బుక్కపట్నంలో రెవెన్యూ ఇన్స్పెక్టర్ రాజుగారు. తన పనులు చేసుకొంటున్నారు. కాని నా గూర్చి పట్టించుకోలేదు. ఒక రోజు , రెండు రోజులు మూడు రోజులు అయినవి. కాని వారు ఏ మాత్రం పలకటంలేదు. నేను రోజు బుక్కపట్నం హోటల్లో దొరికే తిండి తిని (చాలా అనారోగ్యకంమైన భోజనం తీసుకొంటు) చావడిలో బండపై టవల్ పరుచుకొని రెవిన్యూ ఇన్స్పెక్టర్‌గారి ప్రక్కన పండు కొనుచున్నాను. అతను నన్ను పలకరించటం లేదు. నేను అతనిని పలకరించటం లేదు. నన్ను చూచి తన మనస్సులో ఏమనుకొనుచున్నాడో నాకే అర్థం కాలేదు. నాల్గవ రోజు ఏమయ్యా నాయక్ నన్ను నక్షత్రకునిలా తగులుకొన్నావు అన్నాడు. నేనెందుకు నక్షత్రకుడను సార్. తమరే కలెక్టరువారి వద్ద, నేను అడగకనే, నీకు కావలసిని పర్టికులర్సు ఇస్తానన్నారు. ఆ విషయం తమరికి తెలుసు కదా అని, నేను మిమ్ములను అడగటం లేదు. మీరు వ్రాసిస్తే నేను వెళతాను. తెలసిన విషయమును తమరికి ఏమని అడగవలయునని, తమరికి మనస్సుకు నచ్చినప్పుడే వ్రాసివ్వమని చెప్పాను. అప్పుడు వారునాపై కోపగించుకొని, గొణగుకుంటూ, తెల్లకాగితం తీసి ఏదోరాసి నాకు ఇచ్చారు. ఇది తీసుకొని పొండి అన్నారు. దానిని నేను చదవగా మాకు ఏమాత్రం సంబంధం లేని విషయం వ్రాసి ఉన్నారు. ఈ కాగితంలో వ్రాసినది మాకు అవసరం లేదు సార్, మాకు కావలసినది, మా తాండాలోని కుటుంబాల పేర్లు, వారికి ఉన్న భూవసతి, ఆర్థిక సంబంధం మొదలైనవి కరణం వ్రాసివ్వవలెను అన్నారు. ఆ కరణం గారి వద్ద నేను పోను, వారు వ్రాసి ఇవ్వరు, మీరు పర్టికులర్సు వ్రాసివ్వలేదు. దయచేసి మా గ్రామమును దర్శించి మాకు సొసైటీ రిజిస్టరు చేయుటకు అనుకూలం ఉన్నది లేనిది తమరే నిర్ణయించండి అని కలెక్టరువారిని అడుగుతాను అన్నాను. ఏమయ్యా కాలికి వేస్తే మెడకు వేస్తావు, మేడకు వేస్తే కాలికి వేస్తావు అన్నారు. అంతపని నాకు అవసరం లేదు సార్. మా తాండాకు సంబంధించిన వివరములు వ్రాసి ఇస్తే చాలు అన్నాను.

అలాగైతే కరణం గారి దగ్గర నీవే పోయి స్వయంగా వ్రాయించుకొనవలయును అన్నారు. కరణం వ్రాయటం లేదు. వారు క్రొత్తకోట గ్రామం శ్రీ సుబ్బరావుగారు. వారు జిల్లా అంతటిలోను మంచిపేరు సంపాదించారు. కానీ మా విషయంలో వారు ఏమి వ్రాసి ఇవ్వటంలేదు అని, ఇది వరలో జరిగిన ఒక సంఘటన గూర్చి తెల్పడం జరిగినది.

శ్రీ కరణం సుబ్బారవుగారు సుగాలీలు, హరిజనులు కాని పోయిన వారికి ఏవేవో మాటలు చెప్పి మంచిగా వ్రాయకుండ పంపిస్తారు. ఒక నాడు నేను మా అన్నగారైన బి. లింబునాయక్‌గారు, ల్యాండ్ మార్టైజ్ బ్యాంకులో బావులు త్రవ్వించుటకు, ఆయిల్ ఇంజన్లు కోరుకు లోను తీసుకొనుటకుగాను, ఆ భూముల యొక్క 10–1చిట్టా,అడంగల్, భూమి స్కెచ్, మరియు భూకామందుల ఫామిలి హిస్టరి వ్రాయించుకొనుటకు పోగా అతను ససేమిరా, వ్రాసి ఇచ్చుటకు ఇష్టపడలేదు. డబ్బులు ఇచ్చి వ్రాయించుకొందామా అంటే, అలా కూడా వారు ఒక్కపైసా ఆశించరు. మరియు మాకు ఎవరు వ్రాసి ఇస్తారు. మాకు లోను ఎలా వస్తుంది. అప్పుడు నేను కరణం సుబ్బారావు గారితో కొన్ని న్యాయ సమ్మతమైన విషయాలను చెప్పటం జరిగినది, అందుకు వారు ఏమియు సమాధానములు చెప్పలేక పుస్తకం తీసి వ్రాయటకు పూను కొన్నారు. మా వాదనలను వింటున్న శ్రీమతి సుబ్బారావుగారు వచ్చి కరణంగారు వ్రాయుటకు తీసిన పుస్తకములాగి విసరకొట్టింది. ఈ లోపు వారి కుమారుడు ఇంటిమధ్యలో వేలాడుతన్న ఉయ్యాల మీద కూర్చొని, ఈ మాదిగలకు, సుగాలీలకు చదువు వస్తే ఎలా మాట్లాడుతారు చూడు అన్నారు. అంతలోనాకు చాలా కోపం వచ్చినది. కాదయ్యా నిన్ను పుట్టించిన, మీ తండ్రికి మీ తల్లికి మెమొ ఎవరు అని తెలుసు, వారు వారి రిజష్టరులో మా పేర్లు నమోదు చేసుకొని ఉన్నారు. నిన్ను బాపనోడా అంటే బాగుంటుందా అన్నాను. ఎక్కువ మాట్లాడ వద్దండి. మా ఇంటి లోనించి, బయటికి పొండి అన్నారు. నేను వచ్చినది. మీ ఇంటికి కాదు, కరణంగారి ఇంటికి, ఈ ఊరిలో కరణంగారి ఇల్లు ఎక్కడైన ఉన్నదేమో చూపండి అన్నాను. అంతేవారు మాట్లాడలేదు. ఇదే విషయం నేను కలెక్టరుగార్ని కలసి చెప్పుతాను. ఇదే రికార్డులు మీ తండ్రి నెత్తి మీద మోసుకొని మా తాండా 8 మైళ్ల అడవిలో నడచి మాకు అందించక పోతే నేను మా నాన్నకు పుట్టలేదు. అంతే కోపంతో వచ్చాను. ఆ తరువాత కరణంగారు, మాకు కావలసిన వన్నియు వ్రాసి, మా అన్నగారి చేత పంపించడం జరిగినది. ఈ విధంగా గ్రామాలలో కరణంగార్లు పనిచేస్తున్నారు. కావున నేను కరణంగారి ఇంటికి పోను, తమరే ఏమైన చేయండి అన్నాను. అప్పుడు నన్ను బంగపోయి, తలారిని పిలిచి, ఈ చీటిని కరణం గార్కి ఇచ్చి వెంటనే వ్రాసి ఇవ్వవలయును అని తెల్పినారు. ఇక నేను, తలారిని తీసుకొని బుక్కపట్నంనుండి రాసాన పల్లి దిగి అక్కడినుండి 6 కి.మీ. నడచి కొత్త కోట అడవి మార్గంలో చేరాము. కరణంగారు గొడుగు పట్టుకొని తన వ్యవసాయ బావి వద్ద పోవుటకు ప్రయాణమై ఉండెను. ఈ చీటి చూడగానే, తలారితో ఒబిరెడ్డిని పిలుచుకొని రమ్మనారు. వారు ఇద్దరు, కలసి మొత్తం రికార్డులు, మధ్యానం 1 గం. మొదలు రాత్రి అంతా కూర్చొని వ్రాసారట. నేను ప్రక్కనే ఉన్న పంచాయితి ప్రెసిడెంటు శ్రీరాములు గారింటిలో భోజనం చేసి, పడుకొన్నాను. తెల్లవారు జామున కాలకృత్యములకై బహిర్భూమికి వెళ్లగా, కరణంగారు ఎదురొచ్చి నాయక్‌గారు రికార్డులన్నియు తమరైనవి, వెంటనే పొండి మీకు బస్సు దొరకుతుంది అన్నారు.

వాటిని తీసుకొని, బుక్కపట్నం వచ్చి రెవెన్యు ఇన్స్‌పెక్టర్ గారితో వ్రాయించుకొని, సాయంత్రం 5 గం. ప్రాంతంలో తహసిల్‌దారు వారి ఇంటికి పోయి వారితో ఉత్తరం తీసుకొని

అదే రోజు 7 గం. బస్సు ఎక్కి 8 గం.కు హిందుపురంలో డిప్యూటి రిజిస్ట్రరువారికి అందచేయడం జరిగినది. ఈ ఒక్క రోజులో కావలసిన పనికి గాను నేను 9 నెలలు నా యొక్క జీతం పోగొట్టుకొని ఉండ వలసివచ్చినది.

డిప్యూటి రిజిస్ట్రారు శ్రీ యల్. నారాయణరెడ్డిగారు ఏమయ్యా నాయక్‌గారు మొత్తనికి సాధించావే అన్నారు. తమరికి తెలుసుకదండి నా పట్టుదల గుర్చి, నేను తలచుకున్న పని సాధించు వరకు నాకు నిద్దుర పట్టదండి అన్నాను చాలా సంతోషం. ఈ మధ్యలో ఒకటి జరిగింది. డి.ఆర్.గారు మీరు జిల్లా కలెక్టరు వారి మీటింగ్ ఉన్నది. మీరు అనంతపురం రండి నేను కూడ జిల్లా కలెక్టరు వారితో చెపుతాను, రెవెన్యూ పర్టికులర్సు ఇవ్వటంలేదని. మేము కూడ ఉత్తరం వ్రాసాం కదా అన్నారు. నేను అనంతపురం జిల్లా పరిషత్‌లో మీటింగ్ హాజరైనాను. నన్ను చూచిన కలెక్టరుగారు. ఏమిటి నాయక్ అన్నారు. నేను రెవెన్యూ పర్టికులర్స్ లేనిది సొసైటీ రిజిస్టరు చేయమంటున్నారు సార్ అన్నాను. మీ ఏరియాకు రిజిస్ట్రార్ ఎవరు అన్నారు. అంతలో డి.ఆర్.ఎల్. నారాయణరెడ్డిగారు లేచినారు. వారి మీద కలెక్టరుగారు విరుచుకపడ్డారు. మీరు పోయి ఎందుకు తీసుకోలేదు అన్నారు. ఆ విషయంలో నాకు బాధ అనిపించినది. అనవసరంగా డి.ఆర్. గార్కి మాట వచ్చిందే అని, ఆ విషయంను డి.ఆర్.యల్.నారాయణరెడ్డిగారు గుర్తు చేసుకొని, అనంతపురం సంఘటన గూర్చి చెప్పారు. సారీసార్ అన్నాను నీ తప్పు ఏముందయ్యా!

ఎలాగైతే నేమి సాధించావు. దీనిని నేను కలెక్టరువారికి పంపించి, వారి అనుమతి తీసుకొని వెంటనే రిజిస్టరు చేస్తాను. ఒకవేళ ఈ మధ్య నాకు ట్రాన్స్‌ఫర్ అయినా, నేను నీ సొసైటీని రిజిస్టరు చేసి, ఈ ఆఫీసు గడపదాటుతాను, నేను ఉంటే, నిన్ను పిలిపించి, సొసైటీ ప్రారంభం కూడ చేయించి, మీ కార్యక్రమాలన్ని చేపట్టగలను, నీవు ఇప్పటికే చాలా జీతం నష్టపోయావు. నీ పిల్లలకు విద్యలేకుండ చేసుకొన్నావు. అని వారే చాలా బాధ పడ్డారు, తప్పకుండా చేస్తాను. నీవు దిగులు పడవలసిన పనిలేదు అన్నారు. ఆ ధైర్యంతో నేను. నా డ్యూటికి శ్రీ శైలం చేరాను. అప్పటికి రెండు మూడు నెలలు ఇ.ఎల్, 40 రోజులు హెచ్.పి.ఎల్, 4 1/2 నెల ఎక్స్‌ట్రార్డినరి లీవు అయినది. నాకు రావలసిన ఇంక్రిమెంటు డేటు 1-4-68 అది 12-8-68 పోస్టు ఫోను అయినది. ఈ విధంగా ఎంతో శ్రమించి ఆ సొసైటీని స్థాపించడం జరిగినది. 12-8-67 నుండి 23-4-69 మొత్తం 254 రోజులు సెలువు పెట్టటం జరిగినది.

ఈ మధ్యలో ఇంకొక ఇన్సిడెంట్ జరిగినది. తనకా బ్యాంకు నుండి తెచ్చి అప్పును. 3 గ్రూపులుగా చేసి పని ప్రారంభించడం జరిగినది. మొదట తెచ్చిన డబ్బులలో నాల్గు వాటాలకు గాను 4 ఎడ్ల బండ్లు మరియు మా వాటాకు ఒక ఎడ్ల బండి మొత్తం 5 ఎడ్ల బండ్లు అదే డబ్బుతో కొన్నాము. 2 హై స్పీడు డిజల్ కూపర్, ట్రాలీ ఇంజన్లు కొని, బావులు త్రవ్వటం మొదలు పెట్టాము. వాటా దారులుతోనే రోజు కూలీ ఏర్పాటు చేసి స్వయంగా వారి బావులను వారే త్రవ్వటకు ప్రారంభించారు. బావి త్రవ్వినపుడు పంపు చేసే నీటిని వృథా చేయుకుండతడి పైరుగా వేరు శెనగ పంట కూడా వేసాము. ఈ విధంగా ప్రతి రోజు గంటల ప్రకారం, వారిని ఉత్సాహపరచుతూ అలారం గడియారం పెట్టి బావి పనులు చేస్తున్నము.

మా వాటాదారుడైన మా నాల్గవ చిన్నాయనగారు బి. రంజిత్‌నాయక్‌గార్ని, నారశింహ పల్లెలో ఉన్న రైతు నారశింహరెడ్డి, తన చెరుకుతోటలో, పాలికర్తగా ఉంచుకొన్నాడు. అతని ఉద్దేశ్యం నా అభివృద్ధి కార్యక్రమాలను కుంటు పరచవలయునని. ఒక రోజు రానే వచ్చింది. రాత్రి పూట పల్లెదగ్గర ఉన్న పొలం కావలి పోవలయును. నాల్గవ రోజులకు ఒకరి వంతు వస్తుంది,

ఆ రోజు మా చిన్నాయన గారి వంతు వచ్చింది. పాలికర్తగా పోతేకూడ నావాటకు నేను కావలి ఉంటాను అన్నాడు. అయితే ఆరోజు ఇంటిలో లేకుండ, చెరుకు గానిగలో వెళ్లాడు. మా పిన్నమ్మగార్కి చెప్పగా ఆమె ఆడ వాళ్లను పామ్మంటారు అని సంస్కృతం వల్లించ సాగినది. నాకు కోపం వచ్చి దండించడం జరిగినది. అంతలోనే మా విరోధి వర్గం మాపై విరుచుక పడినారు. కొద్ది సేపటికి పోట్లాట ఆగినది. మా విరోధి వర్గంతోని, బి. గోబర్ నాయక్ కె. బీముడూ నాయక్ నరసింహరెడ్డి వద్ద పోయి అర్జీ వ్రాయించి, పాముదుర్తి పోలీసు స్టేషన్‌లో ఇచ్చారని చెప్పడంతో నేను తెల్లవారుజామునే హిందుపురం బయలుదేరి వెళ్లాను. డి.ఆర్. గారితో మాట్లాడి నేను నా డ్యూటికి చేరుటకు వెళ్ల చున్నానని చెప్పి, తిరిగి పెనుకొండ రాగానే, నా కొరకు బి. లింబునాయక్, కాచుకొని ఉన్నాడు. ఏమిటి విషయం అని తెలుసుకొనగా, పాముదుర్తి పోలీసులు వచ్చి మొత్తం మీ ఇంటి వారిని 20 మందిని తీసుకెళ్లారు అన్నారు. అక్కడినుండి నేరుగా పాముదుర్తి చేరాము. మా ఎం.పి. గారైన శ్రీ బయపరెడ్డి గార్ని కలుసుకొనుటకు పోగా వారు బావి దగ్గర వెళ్లారని తెలిసినది. మా జనాభా అంతా రెడ్డిగారి ఇంటి వద్ద ఉన్నారు. ఎస్.ఐ. గారు సాయంత్రం రండి అని చెప్పి స్టేషన్‌నుండి పంపించారట. మేము వెంటనే బావి వద్ద శ్రీ బయ్యప్పరెడ్డి ఎం.పి. గార్ని కలుసుకొనుట జరిగినది. విషయం వివరించాము. నా గూర్చి తెలుసుకొన్నారు.

నీ మీద మీ అన్నలు వచ్చి ఏవేవో చెప్పుతున్నారే అన్నారు. తమరికి తెలియకుండా ఏ కార్యక్రమం చేస్తున్నాను సార్. మాకు ఉన్న జనసంఖ్యను, భూవసతిని అభివృద్ధి చేయవలయునను పట్టుదలతో వీరందరిని ఉత్తేజపరచి, ఒక సొసైటీ, తనకా బ్యాంకు ద్వారా అప్పులు తెచ్చి రెండు బావులు త్రవ్విస్తున్నాను, అన్నాను. వాటిలో ఏమి తప్పున్నది. ఈ గిట్టని వాళ్లు ఏదో చేస్తూన్నారు. అనగానే ఈ పోలీసులకు ఏమి పనిలేదు. ఎవరో ఏదో చెప్పితే అందర్ని పట్టుకొస్తుంటారు అన్నారు. వాళ్లేమి చేస్తారు? నేను చేప్పానని చెప్పు అన్నాడు. సరే సార్ అని వచ్చాము. ఆ రోజు రాత్రి మా అందరికి, ఎం.పి. గారి ఇంటిలో వారి భార్య మణిగాను భోజన ఏర్పాటు చేశారు. కానీ నా భోజనం మాత్రం, తమ డైనింగ్ హాలులో ఏర్పాటు చేశారు. ప్రొద్దుననే పోలీసు స్టేషనుకు పోగా గుసి చినియానాయక్ ఎవరయ్యా అని అడిగారు. నేనే అన్నారు. అక్కడ నా అడ్డపేరు వ్రాయించి ఉన్నారు. ఏమిటి పోట్లాట అన్నారు. తమరు మా తాండాకు పోయి వచ్చారు కదా సార్ నేను చేస్తున్న అభివృద్ధి కూడ చూచివచ్చారన్నారు. దీనికి గిట్టని వారు నా పై అభివృద్ధి నిరోధక కార్యం తలపెట్టారు సార్ అన్నాను. ఎక్కడా అంతేనయ్యా! ఈ స్వార్థపరులతో మేము పడలేకుండా ఉన్నాము. ఇక మీదట ఏది రాకుండా చూడండి అన్నారు. సరేసార్ అన్నాను. మీ వాళ్లు చాలా భయపడుతున్నారు. తాండాకు పోయిన తరువాత శాంతంగా ఉండమని చెప్పండి, అన్నారు. సరేసార్ అని చెప్పి అందరిని మా తాండాకు పంపించి, బస్సులో బుక్కపట్నం మీదుగా నేను నా గ్రామం చేరి, శ్రీశైలం ప్రయాణం చేపట్టి తెల్లవారు జామున 5 గం.వెంగళమ్మ చెరువు బస్సు ఎక్కాము. అదే బస్సులో శ్రీ రాజుగారు, రెవెన్యూ ఇన్స్‌పెక్టరు గారున్నారు. అదే బస్సులో శ్రీ మల్లిరెడ్డి మరియు వెంగళమ్మ చెరువు రైతులు కూడ ఉన్నారు. రాజుగారు అన్నారు. ఏమయ్యా నాయక్ నీ సొసైటీ రిజిస్టరు అయినదా అన్నారు. రిజిస్టరు అయినది సార్ అన్నారు. ఈ లోపు మల్లిరెడ్డిగారు అందుకొన్నారు, అప్పుడు రాజుగారు అన్నారు కదా? నా ప్రాణం తీసారండి ఈ నాయక్‌గారు, రిపోర్టు ఇచ్చేవరకు వదలి పెట్టలేదు అన్నారు. అప్పటికి రిజిస్టరు కాకపోయినా

మల్లిరెడ్డిగారు వినాలని రిజిస్టరు అయినది అన్నాను. అలా చెప్పకపోయిన, హిందుపురం పోయి రిజిస్టరు కాకుండా అడ్డుపడేవారే. బుక్కపట్నం దిగి ముదిగుబ్బ మీదుగా తిరుపతి వెళ్లాము. శ్రీ వెంకటేశ్వర స్వామి వారికి 1,116/- రూ. ఈ కార్యక్రమమును జయప్రదం చేసిన స్వయంగా వచ్చి ముడుపు చెల్లిస్తామని మొక్కుకొని ఉంటిమి. ఈ ముడుపును సమిష్టిమొత్తంలో నుండి తీసి ఉంటిమి. నేను ఏ మంచి కార్యక్రమము చేపట్టినాను స్వామి వారికి ముడుపులు 1,116/- చెల్లిస్తామని మ్రొక్కుకుంటాము. అదే నా కార్యక్రమములు జయప్రదం ఆగుటకు నేను చెల్లించే దక్షిణ. అక్కడి నుండి శ్రీ శైలం చేరుకొని డ్యూటి చేయటం ప్రారంభించాను.

హిందుపురం కో. ఆపరేట్యూ డిప్యూటి రిజిస్ట్రారు. శ్రీ యల్. నారాయణ రెడ్డిగారు. వారు నాకు ఇచ్చిన మాట ప్రకారం మా కో. ఆపరేట్యూవ్ కలెక్ట్యు ఫార్మింగ్ సొసైటీని, నారాశింహపల్లి తాండా కో. ఆపరేటివ్ కలెక్ట్యూ ఫార్మింగ్ సొసైటి నెం. టి. 216 పెనుకొండ తాలుకా, అనంతపురం జిల్లా On the basis of un-limited liability క్రింద, 30-7-1969న రిజిస్టరు కావించారు. కాని మాకు తెలియపరచలేదు. వారు రిజిస్టరు చేసి, ట్రాన్స్‌ఫర్ అయిపోయారు. అప్పటికి కదిరెప్పగారు ఉన్నారు. ఈ విషయం మాకు తెలియపరచలేదు.

వారు కూడ పెనుకొండ సమితి ఆఫీసునుండి ట్రాన్స్‌ఫర్ అయిపోయినారు. వారు పోయిన తరువాత కో. ఆపరేట్యూ ఎక్స్టెటెన్షన్ ఆఫీసరుగా, శ్రీ వెంకట నరసయ్యగారు వారి స్థానంలో వచ్చారు. వారు వచ్చిన తరువాత నా అడ్రస్సు అనగా శ్రీ శైలంనకు ఒక ఉత్తరం వ్రాసారు. మీ యొక్క సొసైటీ రిజిస్టరు అయి 6 నెలలు దగ్గర పడినది. ఇంకను 20 రోజులు టైమున్నది. ఈ లోపు వచ్చి మీ సొసైటీ యొక్క స్టార్టింగ్ రిపోర్టు డి. ఆర్. ఆఫీసుకు అందవలయును. లేకున్న మీ సొసైటీ క్యాన్సిలు చేయబడును అన్నారు. ఆ ఉత్తరం చూచుకొని వెంటనే బయలు దేరి, నాతో పాటు మా తాండా వాసులు, అన్నలు బి. లక్ష్మినాయక్, ఎల్. సి. ఇ. గారు, బి. నారాయణ నాయక్ పోస్ట్ మాస్టరుగారు, గుంతకల్లు, అనంతపురం జిల్లాలో ఉద్యోగం చేస్తున్నారు. వారిని కలసి సొసైటీ గూర్చి అన్ని విషయములు తెలియపరచి, వారిని కూడ వెంటపెట్టుకొని, అనంతపురం వచ్చాము. అనంతపురంలో కో. ఆపరేట్యూ సొసైటీల గూర్చిన రిజిస్టర్లు, రసీదు పుస్తకములు అన్నియు తీసుకొని, శ్రీ వెంకటనరసయ్యగార్ని కలసి, వారితో పాటు తాండాకు పోయి అందరిని సమావేశ పరచి, ప్రతి సభ్యుడు 26-25 రూ. చొప్పన 20 మంది సభ్యులను చేర్చుకొనునట్లుగా, పెనుకొండ టౌను బ్యాంకులో డిపాజిట్టు చేసిన మొత్తమును సరిచేయటం జరిగినది. ఆ టైములో మా వారు ఇందులో చేరుటకు వ్యతిరేకించారు. ఎందుకనగా దీని గూర్చిన సరియైన అవగాహన వారికిలేదు. ఈ విధంగా సొసైటీ రిపోర్టు మాత్రం ఇవ్వగలిగాము. కాని ఏమియు లాభం లేకుండ పోయినది. ఎన్ని తీర్మానములు చేసినా, భూములు సొసైటీ పేర పట్టా ఇచ్చిన కాని, ఏ కార్యక్రమం చేపట్టుటకు వీలుకాదన్నారు.

ఈ విధంగా ఎన్నో తీర్మానములు చేసాము. రెవెన్యూ డిపార్టుమెంటువారు, సుమారు 1975వ సంవత్సరంవరకు తిప్పారు. ప్రతి రెండు నెలలకు శ్రీశైలంనుండి అనంతపురం రావటం, అక్కడినుండి పెనుకొండ, పెనుకొండనుండి హిందుపురం, హిందుపురం నుండి నారశింహపల్లి తాండాకు ఈ విధంగా ప్రతి సారి 200రూ. లు సొంత ఖర్చు పెట్టుకొని, ప్రతి ఆఫీసరుకు టిఫన్లు, కాఫీలు, అవసరమైతే వారికి బస్సు ఛార్జీలు ఇచ్చుకొంటు ఖర్చు చేయడం జరిగినది. ఈ

ఖర్చులకుగాను ఒక్కరు ఒక్కపైసా ఇచ్చే వారుకారు. సొసైటీ ద్వారా ఖర్చుపెట్టుట అందులో ఏ విధమైన డబ్బు ఆదా లేదు. ఈ విధంగా అనంతపురం వచ్చిన ప్రతి జిల్లా కలెక్టరు వారిని, ప్రతి కో.ఆపరేటివ్ జిల్లా రిజిస్ట్రారు గారిని, ప్రతి ఎక్స్టెన్షన్ ఆఫీసరు గారిని, ప్రతి డిప్యూటి రిజిస్టరు గారిని, కో.ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రారు వారిని కలవటం జరిగినది. ప్రతి సబ్‌కలెక్టరు వారిని, తహసిల్‌దారు వారిని, ప్రతి రెవెన్యూ ఇన్సుపెక్టరు వారిని కలవటం జరిగినది. ప్రతి ఆఫీసరునుండి ఏమి ఎత్తుకొని పోతాడో అన్నట్లు ఎదురు చూస్తుంటారు. వారి ప్రక్కన పోయి కూర్చున్నచాలు. కాఫీకి పోయి వస్తాం రండి అంటారు. వారితోపాటు అందరు వస్తారు. వారందరికి కాఫీలు, టిఫన్‌లు, సిగరెట్లు ఇప్పించవలయును. ఆ విధంగా చేయక పోయిన, అసలు కన్ను ఎత్తికూడా చూడరు. ఆఫీసునుండి బయలు దేరునపుడు, నేను జవాను సార్ అని ఒకడు, నేను నైట్‌వాచ్ మెన్ సార్ అని ఎదురు వస్తారు. వారిని గౌరవించక పోయిన, కూర్చొనుటకు కూడ అవకాశం ఇవ్వరు. ఈ విధంగా 1976 సం. అనగా 8 సం. జరిగినది. నేను వ్రాసే ఉత్తరానికి, నారశింహపల్లి తాండా క్యాంపు ఉన్నది. మీరు హజరు కావలయుననీ బదులిస్తారు. ఆ ఉత్తరం మేరకు, శ్రీ శైలంనుండి వస్తే ఈ రోజు ఆఫీసరు వారు అర్జెంటుగా వేరే క్యాంపు వెళ్లారు, మీ తాండా క్యాంపు వాయిదా వేసారు అంటారు. ఆ వధంగా ఎన్నో సార్లు రావటం పోవటం జరిగినది.

ఒక్కసారి మాత్రం జిల్లా కో.ఆపరెటివ్ ఆఫీసర్ ఇన్‌ఛార్జి డిప్యూటి రిజిస్ట్రారు అనంతపురంవారు శ్రీ రెడ్డయ్యగారు. పెనుకొండ సబ్ కలెక్టరు గాయిత్రిగారు జాయింట్ ఇన్స్‌పెక్షన్‌వేసి కొన్నారు. రమ్మని ఉత్తరం పంపారు. ఆ రోజు శ్రీశైలంనుండి రావడం జరిగినది. వారు ఇద్దరు కలసి నారశింహపల్లి తాండా వచ్చారు. అన్నియు వివరంగా విచారించారు. కాని ఏవియు చేయలేదు. వారు ట్రాన్స్‌పర్ అయి పోయారు. ఈ విధంగా ఉద్యోగం చేసుకొంటూ, చాలీచాలని జీతంలో అదే డబ్బులు వాడకొంటూ, ఎంతో కష్టనష్టాలను ఓర్చి పనిచేయటం జరిగినది. నా జీతం డబ్బులన్నియు నా భార్య పిల్లలకు తిండికి మాత్రం ఇచ్చి, మిగిలినదంతా బస్సు ఛార్జీలకు, ఆఫీసర్ల టిఫిన్‌లు, కాఫీలు, జవానుల దక్షిణలకు సరిపోయేవి. తిరిగి ఇంటికి పోవునప్పుడు పిల్లలకు, పూలు, పండ్లు తీసుకొనుటకు కూడ డబ్బులుండేవి కావు. ఈ విధంగా జరిగినది.

ఒకసారి శ్రీశైలం దేవస్థానంనకు పోయినపుడు మా బుక్కపట్నం రెవెన్యూ ఆఫీసరు వారు శ్రీ రవి శంకరరెడ్డిగారు శ్రీ శైలం మల్లికార్జునులు భ్రమరాంబ వారి దర్శనార్థం, తన కుటుంబ సమేతంగా వచ్చి ఉండిరి. వారిని చూచిన వెంటనే మా యింటికి అతిధ్యమునకు రావలయునని అహ్వానించాము. ఆ రోజు బాగా మంచిగా భోజన సౌకర్యములు చేయటం జరిగినది. ఆ రోజు నుండి వారు, వారి కుటుంబ సభ్యులు మాకు మంచి స్నేహం ఏర్పడినది. ఆ స్నేహం ఇప్పటివరకు అలాగే ఉన్నది.

వారి స్నేహం ఏర్పడిన తరువాత రెవెన్యూవారి ద్వారా కొంత రికార్డులు కదలటం జరిగినది ఈ లోపు పెనుకొండ సబ్‌కలెక్టరుగారు శ్రీ పి.కె.అగ్రవాల్‌గారు వచ్చారు. వారు యువకులు, వారిలో యువక ఉత్సాహం బాగా ఉన్నది. వారిని, వారి బంగళాలో కలసి మాట్లాడటం జరిగినది. వారు మంచిగా ఆహ్వానించి, విషయంలన్నియు విన్నారు. వారు మా తాండా క్యాంపు వేసుకొని, తహసిల్‌దారుగార్ని రెవెన్యూ ఇన్స్‌పెక్టరుగార్ని, క్రొత్తకోట

కరణంగార్ని, వెంగళమ్మ చెరువు కరణంగార్ని నారశింహపల్లి తాండాలో హాజరు కావలయునని ఉత్తర్వు పంపియున్నారు. అలాగే నన్ను కూడ హాజరు కావలసినదిగా చెప్పారు. నేను శ్రీశైలంనుండి నారశింహపల్లి తాండాకు రావడం జరిగినది. మొత్తం రెవెన్యూ అధికారులు, కరణాలు, తలార్లు అందరు హాజరైనారు. క్రొత్త కోట దూరం ఆగుటవలన కరణం సుబ్బారావుగారు, తలారితోపాటు రికార్డులన్ని మోసుకొని వచ్చారు. ప్రొద్దుననే బయలు దేరి వచ్చారేమో పాపం, తలారి గార్కి ఆకలైనట్లు ఉన్నది కాబోలు. ఏమండి నాయక్‌గారు మాకు భోజనాలు ఎలా అన్నారు. నేను అన్నాను కదా? అయ్యా నేను కూడ మీకు వచ్చిన తాకీదు ప్రకారం హాజరైనవాడినే, నా సమస్య కూడ మీవంటిదే అన్నాను. ఆ ఇది మీ ఊరు కదా? అన్నారు. అవునయ్యా! నేను నీ క్రొత్తకొటకు ఎన్ని సార్లు ఈ కరణంగారి ఇంటికి వచ్చాను, ఒక్కనాడైనా ఏమయ్య మంచినీళ్లు తాగావా అనడిగావా? ఆ రోజు నా పని గూర్చి నేను వచ్చాను. ఈ రోజు మీ పనిగూర్చి మీరు వచ్చారు అన్నాను. ప్రభో మీ అన్నం వద్దు ఏమి వద్దన్నారు. కాని వచ్చిన వారి గౌరవార్థం, పండ్లు ఫలహారాలు అన్ని తెచ్చి ఉన్నాను. అయినా వారికి ఆ రోజు ఆ మాట చెప్పవలయుననే చెప్పాను.

ఈ లోపు సబ్ కలెక్టరు శ్రీ పి.కె. అగ్రవాల్‌గారు వచ్చారు. వారు రికార్డులన్నియు చూచి, వెంటనే అక్కడే సొసైటి అభివృద్ధి బిల్డింగులు కట్టుటకు గాను 5ఎకరములు, వ్యవసాయమునకుగాను 80 ఎకరములు మంజూరు చేస్తూ ఉత్తర్వులు జారిచేసారు. అంతటితో సొసైటీ పేర 85 ఎకరములు భూమి పట్టా మంజూరైనది. శ్రీ రవిశంకరరెడ్డిగారు మరియు పి.కె.అగ్రవాల్‌గారి పుణ్యమా అని సొసైటీ పేర భూమి మాత్రం వచ్చింది కాని, మిగిలిన కార్యక్రమములు చేపట్టుటకు ఎన్ని తీర్మానములు చేసినా, కో.ఆపరేటివ్‌వారు కాని, కో.ఆపరేట్యూ సెంట్రల్ బ్యాంకువారు కాని, ట్రైబల్ వెల్‌ఫేర్ డిపార్టుమెంటువారుకాని, ఒక్కపైసా మంజూరు చేయలేదు. సభ్యులందరు ఆర్థిక స్థోమత లేనివారు. స్వయంగా పనులు చేపట్టుటకు ఈ విధంగా సొసైటీ కార్యక్రమములు సాగలేదు. నేను శ్రీశైలంనుండి అనంతపురం, పెనుకొండ, హిందుపురం, నారశింహపల్లి తాండా, తీర్మానములు గావించుట, వాటిని, ప్రభుత్వంవారికి పంపటం వరకే జరిగినది కానీ, ఇక చేయునది లేక సొసైటీ ఎన్నికలు కూడ జరపము అని తీర్మానం చేసి, సొసైటీని బాయికాట్ చేసి, ప్రభుత్వం వారితో జరిపిన మొత్తం కరెస్పాండెన్సును, 902 పేజీలు, శ్రీశైలంలోనే క్యాలికో బైండిగ్‌చేయించి, శ్రీ యం.ఎల్.యన్. ఆచారి అని నా స్నేహితుడు, ఎ.జి.ఆఫీసు శ్రీశైలంలో పనిచేస్తుండిరి. వారు నాకు మంచి స్నేహం ఉండెను. మేమిద్దరం ఫోటో గ్రాఫ్ కూడ చేస్తుంటిమి. వారు శ్రీమతి ఇందిరా గాంధి ప్రధాన మంత్రిగారి పేర(సొసైటీ), సంఘం లెటర్‌హెడ్స్ పైన ఎర్ర టేపుతో 10 పేజీల ఉత్తరం ఇంగ్లీషులో మొత్తం సొసైటీ గూర్చి 902 పేజీలలో పొందుపరచిన మ్యాటర్‌గూర్చి వ్రాసి, వాటిని పుస్తకంలో ఒక కాపీ, స్వయంగా ఒక కాపీ ఉంచి, న్యూ ఢిల్లీ కి రిజిస్టరు ద్వారా పార్సిల్‌లో పంపించడం జరిగినది, ఇంతటితో దీని పీడవిరగడయ్యైనది. అని తలంచుకొని గాఢనిద్ర చెందటం జరిగినది.

కానీ ఈ ఉత్తరం ఢిల్లీ నుండి ఆంధ్రప్రదేశ్ గవర్నరుగారికి పంపించటం జరిగినది. అక్కడినుండి ముఖ్యమంత్రివారికి, వారినుండి గిరిజన శాఖావారికి, వారినుండి అనంతపురం జిల్లా కలెక్టరు వారికి పంపించారు. జిల్లా కలెక్టరువారు జిల్లా కో.ఆపరేటివ్ ఆఫీసరుగారికి పంపించారు. జిల్లా కో.ఆపరెటివ్ ఆఫిసరుగారు హిందుపురం డిప్యూటి రిజిస్ట్రారు గారికి

పంపించారు. వారు సొసైటీ గూర్చిన విషయములు తెలుసుకొని, పెనుకొండ సబ్‌రిజిస్ట్రార్‌వారికి పంపించారు. సబ్‌రిజిస్ట్రారు గారు సొసైటి బొర్డు లేనందువలన పెనుకొండ సమితిలో ఉన్న కో.ఆపరేటివ్ సీనియర్ ఇన్స్‌పెక్టరుగారు శ్రీ కోనయ్యగార్ని పర్సనల్ ఇన్‌ఛార్జిగా నియమించినారు. వారు నాకు శ్రీశైలం అడ్రస్‌కు ఈ విధంగా వ్రాసారు. తమరు ప్రధాన మంత్రిగారికి పంపించిన ఉత్తరం తిరిగి ప్రధానమంత్రిగారినుండి మాకు వచ్చినది. తమరు వెంటనే వచ్చి సొసైటీ కార్యక్రమాలు చేపట్టవలయునని తెల్పడం జరిగినది. వారు తెల్పిన ప్రకారం అనంతపురం వచ్చి కొన్ని వ్యవసాయ కార్యక్రమాలు చేపట్టుటకు గాను, ఉత్తరము వ్రాయటం జరిగినది.

శ్రీ పి.కె. అగ్రవాల్ సబ్ కలెక్టరుగారు సొసైటీ పేర భూములు మంజూరు చేయుటకు వచ్చుముందు సొసైటీలో ఎంత మంది మెంబర్లు ఉన్నారు అన్నారు. 30 మంది వరకు ఉన్నారు అన్నాను. మీరు తాండా మొత్తమును సొసైటీ మెంబర్లుగా చేర్చుకొనవలయునన్నారు. చేరుస్తాను అని చెప్పినాను. కానీ మెంబర్లు తమ షేరు మొత్తం కట్టుటకు డబ్బులు లేవు అన్నారు. అప్పుడువారి షేరు మొత్తమునకు గాను నా భాగమునకు వచ్చిన సేద్యపు ఎద్దను అమ్మి అందరి షేరు మొత్తం అనగా 45 మంది క్రొత్త సభ్యలను చేర్చుకొనడం జరిగినది. ఒక్కొక్కరి పేర 26-00 రూ.లు చొప్పన, రిసిప్టు నంబరు 38నుండి 84వరకు అనగా 36x45 = రూ. 1,620/- కట్టటం జరిగినది మరియు 1968 సం.లో అడవి బ్రాహ్మణపల్లి తాండాలో ఉన్న మా మేనమామ శ్రీ గొర్లసామే నాయక్ వద తీసుకొన్ని పెనుకొండ టౌను బ్యాంకులో, సొసైటీ పేర డిపాజిట్లు చేసిన రూ. 500/- అసలే డబ్బులు పుట్టని కాలంలో, తాండా అభివద్ధిని కాంక్షిస్తూ, ఎంతో కష్టంపైన ఈ రెండు కార్యములు నేరవేర్చడం జరిగినది. ఈ మొత్తం ఇంతవరకు ఇవ్వలేదు. తీసుకొనలేదు. 30 సం.లకు దాని విలువ 1,620+500=2,120 రూ.లు మల్టిప్లై చేస్తే ఇప్పటికి దాని విలువ కట్టిన రూ. 1,75,680 రూ. అవుతుంది.

# మహారాష్ట్రము - మైసూరు పర్యటనలు
## (సంధర్బములో గ్రహించిన కొన్ని ముఖ్య అంశాలు)

**అఖిల భారత బంజారా సేవా సంఘము :** అఖిల భారత బంజారాసేవా సంఘము రి.జి.నెం. 78/1947 సం.లో కీ.శే. శ్రీ వసంతరావు పూల్‌సింగ్‌నాయక్‌గారు భారత దేశములోని బంజారాలందరిని దృష్టిలో ఉంచుకొని, మొత్తం భారతావనిలోని బంజారాలను సమానాంతరంగా అభివృద్ధి పరచ వలయుననుకొని స్థాపించి ఉన్నారు. కానీ ఆ భావనతో సంఘ స్థాపన జరిగినా ఆ ప్రకారం అభివృద్ధి పరచలేక పోయినారు. కారణం బంజారాలలో చదువుకొన్నవారు చాలా తక్కువమంది. అందులోను వీరు ఆర్థికంగా చాలా వెనుకబడి ఉన్నారు. వీరు మొత్తం భారతంలో విస్తరించినందున, మొత్తం భారతంలో ఈ సంఘమును స్థాపించవలయునన్న చాలా కష్టమైనది. అందరిని సంఘటిత పరచవలయునంటే చాలా కష్టం. ఎందుకనగా మొత్తం భారతంలో బంజారాలు ఒకే భాష మాట్లాడిన వారందరిని సంఘటిత పరచవలయునంటే వారికి లిపి లేదు. అందులోను దేశము మొత్తములో ఒకే భాష వాడుకలో

లేదు. ప్రతి రాష్ట్రానికి ఒక ప్రత్యేక భాష ఉన్నది. దేశ భాష హిందీ ఉన్నది. కానీ మొత్తం దేశ ప్రజలకు హిందిరాదు. ఇంగ్లీషు ఉన్నదంటే, అది భారత మొత్తంలో ఉన్న ఏ కొద్ది మందికో వస్తుంది. అసలే విద్యలేక, పట్టణములకు, పల్లెలకు దూరంగా నివశించుచున్న ఈ బంజారాలకు రవాణా సౌకర్యం కానీ, తపాలా సౌకర్యం కానీ, రేడియోలతో ప్రసారం చేయవలయునంటే వీరికి అసలు ఆ సౌకర్యమే లేదు. అసలు ఉన్నా వీరికి రేడియోలు ఉంటే కదా? మరియు ప్రచారం చేయగలిగిన భాషా ప్రవీణులు ఉండవలయును కదా? అందువలన అఖిల భారత బంజారా సేవా సంఘ స్థాపించినను, దానిని మొత్తం భారతంలో రాష్ట్ర సంఘాలను, జిల్లా సంఘాలను , మండలం, తాండా సంఘాలను స్థాపించలేదు అందుకే ఈ సంఘముల వలన ప్రయోజనము లేకుండ పోయినది.

అసలు సంఘములు ఎందుకు స్థాపించవలయును? ఎందుకనగా జాతీయ భావము, కుల అభిమానము కలిగిన వ్యక్తులు, తోటి మానవులు అభివృద్ధిని చూస్తున్నారు కావున. తను కూడ అందరితో పాటు తన వారిని అభివృద్ధి పరచవలయుననుకోరిక పుట్టినందుకు. అటువంటి భావనలు కలిగిన తోటి కులస్థులతో స్థాపించే సంఘమునే సంఘం అంటారు. అటువంటి సంఘమునకు ప్రభుత్వ గుర్తింపు ఉండవలయునంటే దానిని, ప్రభుత్వం వారు ఏర్పాటు చేసిన రిజిస్ట్రారు ఆఫీసులో రిజిస్టరు చేస్తారు. ఎందుకు చేస్తారు అనగా, అందులో కొన్ని కట్టుబాట్లు ఉంటాయి.

(ఆర్టికల్) నియమం 1. ప్రకారం ఈ సంఘమును ఫలానా పేరుతో పిలువవలయునను నియమం. అనగా ''అఖిల భారత బంజారా సేవా సంఘము'' అని మాత్రమే పిలువవలయును.

విషయం 2. ఈ సంఘము యొక్క కార్యక్రమములు ఎంతవరకు విస్తరించి ఉండును అనగా, మొత్తం భారతంలో విస్తరించి ఉండును.

విషయం 3. ఈ సంఘము యొక్క ముఖ్యకార్యాలయము ఎక్కడ ఉండును, డిగ్రస్. మహారాష్ట్రము.

విషయం 4. ఈ సంఘం స్థాపించుటకు గల ముఖ్య కారణములు మరియు వాటి వివరములు ఏమిటి?

1. ఈ సంఘం యొక్క ముఖ్యఉద్దేశ్యము మొత్తం భారతదేశములోని బంజారాలకు విద్యాదానమును ఒసంగుట, నిరక్షరాశ్యత నిర్మూలించుట, ఆశ్రమ స్కూళ్లను స్థాపించుట. రాత్రి బడులు నడపుట, ఎయిడెడ్ స్కూళ్లు నడుపుట, ఎన్ని రకములు అవకాశములు, విద్యాభివృద్ధికి లభించుతాయో వాటి నన్నింటిని ఉపయోగించి బంజారా విద్యార్థులకు అన్ని రకాల విద్యను అభ్యసించునట్లు చేయుట.
2. విద్యావంతులైన బంజారాలకు వారి జీవనబృత్తికై ఉద్యోగ అవకాశాలను కల్పించుట.
3. బంజారాల సర్వతో ముఖాభివృద్ధికి పాటు పడుట, కృషి చేయుట, వారి అభివృద్ధిని ఆటంకపరచుచున్న వారినుండి రక్షించి, సాంఘికంగా, ఆర్థికంగా, వైజ్ఞానికంగా మరియు సాంస్కృతికంగా బంజారాల అభిరుచులను బట్టి అభివృద్ధి పరచుట.
4. బంజారాల అభివృద్ధిని చేపట్టుటగూర్చి ప్రభుత్వమునకు సలహాలను, సహకారాలను అందించుట, ప్రభుత్వ సహకారముతో కొన్ని పనులను చేపట్టి, ప్రభుత్వ

కార్యక్రమములలో పాలుపంచుకొనుట, ప్రభుత్వం చేపట్టుచున్న అభివృద్ధి కార్యక్రమములు గూర్చి బంజారాలలో ప్రచారం చేసి, ప్రభుత్వం తలపెట్టిన అభివృద్ధి కార్యక్రమములలో పాలుపంచుకొని విజ్ఞానికంగా, ఆర్థికంగా సాంస్కృతికంగా అభివృద్ధి పరచుట.

5. బంజారాలను జాగృతి పరచి దేశంలోను, ప్రపంచములోను జరుగుచున్న మార్పులు, అభివృద్ధి గూర్చి ఎప్పటికప్పుడు వారికి తెలియ పరచి, వీరిని కూడ అభివృద్ధి పథంలో నడిపించుట.

6. బంజారాలలో ఉన్న వివిధ రకాలైన వారి నైపుణ్యం, వారి ప్రత్యేకతను ప్రజలు మరచి పోకుండా ముందు తరాల వారికి భద్రపరచుట.

7. బంజారాల ప్రత్యేకతను నిలబెట్టిన వారి దుస్తులను, జాతి ప్రత్యేకతను నిలబెట్టుకొంటూ, ప్రస్తుత నవీన ప్రపంచ పోకడను బట్టి, వారి జాతీయతను మరచిపోకుండా ఉండునట్లు చూచుట.

8. బంజారా జాతిలో తరతరాలుగా వస్తున ఆచార వ్యవహారములను, పోగొట్టుకుండ వాటిని కాపాడుకొంటు నవీన పద్ధతులలో వాటిని అభివృద్ధి పరచే కార్యక్రమమును చేపట్టుట.

9. బంజారా జాతిని, ప్రస్తుత నీవన ప్రపంచ వాతావరణమునకు తగ్గట్టుగా శాంతి యుతంగావారి అభివృద్ధిని అందరితోపాటు సమానంగా అభివృద్ధి పరచుట.

పై తెల్పిన అన్నింటిని సాధించి బంజారా జాతిలో పుట్టి పెరిగినందులకు భగవంతుడు తనకు ఇచ్చిన శక్తి సామర్థ్యాలను ఉపయోగించి సహాయపడుట, అలా పడవలయునంటే( ఆర్టికల్) విషయం 5 ప్రకారం సంఘంలో సభ్యత్వం పొందవలయును. అలా సభ్యత్వం పొందినవారు మాత్రమే సంఘంలో సభ్యుడుగా ఉండి పనిచేయుటకు హక్కు కలిగి ఉంటారు. సభ్యత్వం పొందవలయునంటే విషయం(6) ప్రకారం. సంఘం అధ్యక్షుల వారికి దరఖాస్తు పెట్టి, సంఘం నియమ నిబంధనలకు కట్టుబడి ఉంటామని ప్రమాణం చేసి అధ్యక్షులు ఒప్పుకొన్నప్పుడే సంఘ సభ్యుడువుతాడు, లేకున్న అతనికి సంఘంపై ఏమియు హక్కు ఉండదు.

మన అఖిల భారత బంజారా సేవా సంఘమును స్థాపించిన పెద్దలు, మొత్తం, ఓత్‌మాల్ జిల్లా, డిగ్రెస్ తాలుకాకు సుమారు 10 లేక 15 మైళ్ల వ్యాసం దూరంలో ఉన్నవారే. శ్రీ ప్రతాప్ సింగ్ ఆడే అధ్యక్షులు, డిగ్రెస్ తాలూకా వారు, రాంశింగ్ భాణావత్‌గారు ప్రధాన కార్యదర్శి పూల్‌ఉమ్రి 5 మైళ్ళ దూరం, వస్రాంపటేల్, సుధాకర్‌రావు నాయక్‌గారు, మూడే గురూజీ సంఘంలో పనిచేయుచున్నవారు మొత్తం అక్కడివారే రంజిత్‌నాయక్‌గారు మెంబరు, బొంబాయిలో ఉంటారు. కీ.శే. శ్రీ కె.టి.రాఠోడ్, యల్.ఆర్. నాయక్ బెంగళూరు వీరు ఆల్ ఇండియా బంజారా సంఘంలో ముఖ్యులు.

అధ్యక్షుడు శ్రీ ప్రతాప్‌సింగ్ ఆడేగారు మొత్తం **31** సంస్థలు స్థాపించారు. ఆయన స్థాపించిన విద్యాలయాలు( కాలేజీలు) తొమ్మిది(9), ఆశ్రమ పాఠశాలలు రెండు(2), హైస్కూల్

పదకొండు(11), బాల్‌వాడీలు(5) ఐదు, సంస్కరణ కేంద్రాలు - మూడు(3), విద్యాలయాలు(1).

కాలేజీలు :-

1. వసంతరావు విద్యాలయ, వసంత్‌నగర్ సొంత ఊరు, ఆకోలా జిల్లా.
2. వసంతరావు నాయక్ విద్యాలయ-చికలి(రామనాథ్)
3. వసంతరావు నాయక్ విద్యాలయ కాలీ(దోలత్‌కాం)
4. వసంతరావు నాయక్ విద్యాలయ, ఓత్‌మాల్(జిల్లాకేంద్రం)
5. వసంతరావు నాయక్ ఉర్దు హైస్కూల్(కల్‌గామ్)
6. వసంతరావు నాయక్ విద్యాలయ, వాయిబజార్, కిన్‌వట్ తాలుకా, నాందేడ్ జిల్లా.
7. వసంతరావు నాయక్ విద్యాలయ, ఉమ్రి బుర్జ్, ఆకోలా జిల్లా.
8. వసంతరావు నాయక్ విద్యాలయ, మేరత్, ఓత్‌మల్ జిల్లా.
9. వసంతరావు నాయక్ విద్యాలయ, ఆరంసీ, ఓత్‌మాల్ జిల్లా.

క్రొత్తగా నిర్మాణలో ఉన్న హైస్కూలు భవనము
కుడి చేతి నుండి ఐదవ వారు శ్రీ ప్రతాప్ రామ్ సింగ్ అడే కుడి ప్రక్కన బి. చీనియా నాయక్
ఎడమ ప్రక్క భోపిదాస్ రాథోడ్ మరియు అధ్యాపకులు, విద్యార్థులు

ఆశ్రమ హాస్టలు :

1. సేవాదాస్ ఛేత్రాలయ, వసంత్‌నగర్, ఓత్‌మల్ జిల్లా, సొంతఊరు.
2. యస్‌వంత్ వసతీ గృహ. కాలీ దౌలత్‌ఖాన్.
3. మహాత్మా పూల్‌సింగ్ వసతి గృహ-చిక్‌లీ(రామనాథ)
4. వసంతరావు నాయక్ వసతి గృహ ఓత్‌మాల్(జిల్లా)

5. మౌలానా ఆజాద్ వసతి గృహ. ఓత్‌మాల్(జిల్లా)

6. సంమ్‌కి మాతా వసతి గృహ. ఉమ్‌రిబుర్జు, ఆకోలా జిల్లా.

7. వసంతరావు నాయక్ వసతి గృహ. కామ్‌గావ్, బుల్‌డాను జిల్లా.

8. వసంతరావు నాయక్ వసతిగృహ మేతులా, బుల్‌డాను జిల్లా.

9. యశ్వంత్ వసతి గృహ వాయీా బంజారా, నాందేడ్ జిల్లా.

10. రామ్‌సింగ్ భాణావత్ వసతి గృహ, ఆరంఖి, ఓత్‌మాల్ జిల్లా.

11. శ్రీ ధత్ వసతి గృహ, మేరత్, ఓత్‌మాల్ జిల్లా.

ఆశ్రమ స్కూళ్లు :

1. వసంతరావు నాయక్ విముక్తి జాతి ఆశ్రమ శాల, వసంత నగర్, ఓత్‌మాల్ జిల్లా

2. వసంతరావు నాయక్ ఆశ్రమ శాల, పూల్ ఉమ్రరి, ఆకోలా జిల్లా.

సంస్కరణ కేంద్రములు :

1. విముక్తి జాతి సంస్కరణ కేంద్రం, ఫీబ్ ఫత్తర్

2. విముక్తి జాతి సంస్కరణ కేంద్రం, డోలబా

3. విముక్తి జాతి సంస్కరణ కేంద్రం, వేడలా.

శ్రీ ప్రతాప్‌సింగ్ ఆడేగారు 1200 ఎకరములలో సమిష్టి వ్యవసాయ క్షేత్రమును స్థాపించి, ఎన్నో లక్షలు ప్రభుత్వంవారినుండి తీసుకొని అభివృద్ధి చేస్తున్నారు.

పై సంస్థలన్నింటికి శ్రీ సోన్‌బా చందూ జాదవ్ అధ్యక్షులు గాను

శ్రీ పరశురాం గణు చౌహాన్ ఉపాధ్యక్షులు

శ్రీ ప్రతాప్‌సింగ్ రామ్‌సింగ్ ఆడే బి.ఏ సంసద్ సచివ్(కార్యదర్శి)

శ్రీ లక్ష్మణసింగ్ దేవ్‌సింగ్ రాథోడ్ కోశాధికారిగాను

**సభ్యులు:** 1. శ్రీ సుధాకర్‌రావు నాయక్ 2. శ్రీ గజాధర్ రామ్‌సింగ్ రాథోడ్ 3. శ్రీ దల్‌సింగ్ రాయ్ సింగ్ ఆడే 4. శ్రీ నారాయణ స్వామి రాథోడ్ 5. శ్రీమతి నిర్మలా బాయి ప్రతాప్‌సింగ్ ఆడే 6. శ్రీ పాండు రంగభీకా మూడే 7. శ్రీ డుంగర్ సింగ్ జయరామ్ జాదవ్ 8. శ్రీ బాబుసింగ్ దల్‌సింగ్ తాదరా జాదవ్ 9. శ్రీ శిరాజుద్దిన్ సహబుద్దిన్.

**ఓత్‌మాల్(జిల్లా)** : నాయక్ ఎడ్యుకేషన్ సొసైటీ మోక్ ఓత్‌మాల్ జిల్లా. మేనేజర్ శ్రీ భోపిదాస్ రాథోడ్, బి.ఏ. డిప్.టి. బి.యిడి,(శ్రీ వసంతరావ్ నాయక్‌గారి అత్తకుమారుడు)

సంస్థలు :

1. వసంతరావ్ నాయక్ విద్యాలయ – మోక్

2. వసంతరావ్ నాయక్ విద్యాలయ – లాఖడ్

3. వసంతరావ్ నాయక్ విద్యాలయ – ఉత్తవాధన

4. వసంతరావ్ నాయక్ విద్యాలయ – జాండ్‌మోహో

5. వసంతరావ్ నాయక్ విద్యాలయ – రూయి

6. వసంతరావ్ నాయక్‌వసతిగృహ – మోక్

7. వసంతరావ్ నాయక్ వసతిగృహ – రూయి

8. మహాత్మాగాంధీ వసతి గృహ, ఉత్వాధన
9. లాల్‌బహుదూర్ శాస్త్రీ వసతి గృహ – జోడమోహ.

నాందేడ్ జిల్లా :

1. భీమ్‌సింగ్ ఆర్ చౌహాన్ కార్యదర్శి ఆద్వర్యంలో, శ్రీ గురునానక్ విద్యాలయ, గురుద్వారా నాందేడ్‌నందు ఇక్కడ వసంత ఎడ్యుకేషన్ సొసైటీ, చిక్కవాడి నాందేడ్ నందు 550 మంది విద్యార్థులకు విద్యా వసతికలిగి ఉంది.
2. యశ్వంత్ విద్య మందిర్ నందు 450 మంది విద్యార్థులు విద్య నేర్చుకొంటు ఉన్నారు.

పర్భాని జిల్లా : రామారావ్ భోజాజీ రాఠోడ్, అధ్యక్షులు.

1. వసంతరావ్ నాయక్ హాస్టల్, పరభని
2. వసంతరావ్ నాయక్ హాస్టల్ వసమత్‌నగర్
3. వసంత ఆశ్రమ శాల, లోహార్ కిల్లా
4. ఆశ్రమ పాఠశాల, రామేశ్వర్ తాండా
5. బంకవాడి కలాస్ హాస్టల్, పరభాని
6. శ్రీ కృష్ణ బాలమందిర్ తమాటి తాండా
7. బంకవాడి కలాస్ హాస్టల్ – నాందేడ్
8. శ్రీ నాయక్ విద్యాలయ డిగ్రెస్ తాండా
9. శ్రీ నాయక్ విద్యాలయ వసతి గృహ డిగ్రెస్, కంధార్
10. శ్రీ గురునానక్ విద్య మందిర్, నాందేడ్
11. లేబర్ కాంట్రాక్టర్ సొసైటీ విముక్తజాతి.
12. ఫూల్‌సింగ్ నాయక్ హైస్కూల్
13. లాల్ బహుదూర్ శాస్త్రీ హైస్కూల్, పర్తూర్.
14. రాఠోడ్ లేబర్ కాంట్రాక్టు సొసైటీ, తామతి తాండా
15. విముక్తి జాతి లేబర్ కాంట్రాక్టు సొసైటీ, రామేశ్వర తాండా
16. వసంతరావ్ నాయక్ హైస్కూల్ – పభాని
17. వసంతరావ్ నాయక్‌హైస్కూల్ – రసమత్ నగర్
18. మరాట్‌వాడా ప్రదేశ్ వెనుకబడిన వర్గం సేవాసంఘం, పరభాని

**5.** సర్వోదయ శిక్షణ సంస్థా – హోరు. థార్‌వార్ తాలూకా, ఓత్‌మాల్ జిల్లా. ఈ సంస్థకు నామ్‌దేవ్‌రావ్ జాదవ్. అధ్యక్షులు. వీరికి తాలూకా మొత్తంలో హైస్కూళ్లు, ఆశ్రమ స్కూళ్లు, హాస్టలు స్థాపించి వేలాదిమంది విద్యార్థులకు విద్యాదానం చేస్తున్నారు.

**6.** సాథ్‌పూడా శిక్షణ ప్రచారక మండల్, విష్ణునగర్ – ధులియా జిల్లా – ఖండేశ్ – మహారాష్ట్రము. ఈ సంస్థ అధ్యక్షులు శ్రీ ప్రేమ్‌సింగ్ అసరాంజాదవ్ వీరి అధ్వర్యంలో.

1. శ్రీ వసంతరావ్ నాయక్ ఛేత్రాలయ(హాస్టలు) – ధులియా
2. శ్రీమతి వత్సలా నాయక్ కన్యా ఛేత్రాలయ – ధులియా
3. యస్‌వంత్ ఛేత్రాలయ – సహరా





కుడి ప్రక్కనున్న శ్రీ ప్రేమసింగ్ ఆస్రామ్ జాదవ్‌తో పాటు జిల్లా సోషల్ వెల్‌ఫేర్ అధికారి

చిక్కిలి ఆశ్రమ స్కూలు, ధులియా జిల్లా, ఆశ్రమ పిల్లలు – అధ్యాపకులు

4. శ్రీ వికాస్ క్షేత్రాలయ – చికలీ మరియు బుద్రుల్
5. గాంధీ ఆశ్రమ శాల – చికలీ మరియు బుద్రుల్
6. ఆశ్రమ హైస్కూలు – చికలీ మరియు బుద్రుల్
7. కస్తూరిబా బాలమందిర్ – చికలీ మరియు బుద్రుల్
8. బాల వికాస్ మందిర్(3 సం. నుండి 5 సం. పిల్లలు) –చౌపాల మరియు నందుల్‌చా
9. బాల వికాస్ మందిర్ కానడి – సహదా 3 సం. నుండి 5సం. పిల్లలు
10. వసంతరావ్ నాయక్ మాధ్యమిక హైస్కూలు – సహదా 8నుంచి 11 తరగతి.
11. శారదా బాలికల హైస్కూలు – సహదా తాలూకా కేంద్రం

**7.** అకోలా జిల్లా : ఆత్మారాం అమర్‌సింగ్ రాథోడ్ ఎం.ఏ., ఇతను కోటీశ్వరుడు. ఆల్ ఇండియా బంజారా సంఘంలో మెంబరు. ఆకోలా, ఓత్‌మాల్ జిల్లా రెండింటికి మధ్య ఉన్నది. డిగ్రెస్ తాలూకా, పూసద్ తాలూకా, ఈ రెండు ప్రక్క ప్రక్కనే ఉన్న తాలూకాలు అఖిల భారత బంజారా సేవా సంఘ సభ్యులు మొత్తం ఇక్కడే ఉన్నారు. శ్రీ ఆత్మారాం అమర్‌సింగ్ రాథోడ్ నాయక్ ఎడ్యుకేషన్ సొసైటీని స్థాపించి సుమారు ఇరవై పై సంస్థలు నడుపుతున్నారు.

8.మాగా సమాజ్ సేవా మండల్ నెహ్రూ నగర్, షోలాపూర్, మహారాష్ట్రము, శ్రీ చంద్రాం చౌహాన్ గురుజీ, అధ్యక్షులు, శ్రీ లాల్ సింగ్ రజపుత్ ఉపాధ్యక్షులు వీరు నడుపుచున్న సంస్థలు:



షోలాపూర్ నెహ్రూనగర్, మాగా సేవా మండల్ ఎడమ ప్రక్క నుండి అధ్యక్షులు శ్రీ సి. ఆర్. చౌహాన్ (గురుజీ) ఎడమ ప్రక్క శ్రీ లాల్‌సింగ్ రాజ్‌పుత్ కుడి ప్రక్క శ్రీ బి. చీనియా నాయక్ మరియు సంఘ హభ్యులతో

1. ఇందిరా బాలికల మందిర్
2. గాంధీ బాలక్ మందిర్
3. కస్తూరిబా బాలక్ మందిర్
4. సానే గురుజీ విద్యార్థి వసతి గృహం( హాస్టల్) 5. విజయలక్ష్మి బాలికలు వసతి గృహం
6. గాంధీ ఆశ్రమ శాల
7. జాగృతి విద్యా మందిర్ హైస్కూల్
8. శ్రీ వసంతరావ్ నాయక్ హైస్కూల్
9. న్యూ హైస్కూల్ సల్‌గర్‌వాడి.
10. శ్రీ శివాజీ అధ్యాపన విద్యాలయ (టీచర్ ట్రెయినింగ్ స్కూలు)
11. రవీంద్ర వచనాలయ, లైబ్రరి.
12. సంస్కార కేంద్రం
13. కమలా నెహ్రూ సేవా కేంద్రము.
14. రాజీవ్, సంజీవ్ జీవన ఉపయోగ (ఐటిఐ) మందిర్ 15. శ్రీ సమతా మరాఠీ విద్యాలయ (హైస్కూల్) 16. పోస్ట్ బెశిక్ ఆశ్రమ హైస్కూల్ 17. వివిధ జాతుల వారికై హైస్కూల్.

9.పూసద్, ఓత్‌మాల్ జిల్లా :



శ్రీ బాబా సాహెబ్ నాయక్‌గారి డైరీ ఫారం

ఇక సుధాకర్‌రావు నాయక్‌గారు. తన తండ్రి రాజా సింగ్ నాయక్‌గారు; వి.పి. నాయక్ గారి అన్న వీరు తవు తండ్రి పూల్‌సింగ్ నాయక్‌గారి పేర పూసద్‌లో కాలేజీని స్థాపించారు. సుమారు 1,000 మందిపైన విద్యార్థులు చదువు చున్నారు. వీరు వ్యవసాయ పరిశ్రమను స్థాపించారు. కొన్ని వేల ఎకరములు ఉండవచ్చును. ఒక సొంత కాలువ వీరి పొలంలో ప్రవహిస్తూ ఉన్నది. ఒక్కొక్క పంటకు కొన్ని వందల ఎకరములు కేటాయించి ఉన్నారు. వీరు గోధమలు ఎక్కువ పండించుతారు. హైబ్రిడ్ జొన్నలు, హైబ్రిడ్ సజ్జలు, రకరకాల హైబ్రిడ్ పంటలు పండించి, విత్తన శుద్ధి చేసి, ప్యాకింగ్ చేసి వ్యాపారం చేస్తున్నారు.

శ్రీ బాబా సాహెబ్ నాయక్‌గారి వ్యవసాయ ఫారం

ఒక డైరి ఫారం నడిపించుచున్నారు. సుమారు 500 ఆవులు, గేదెలు పైబడి ఉన్నవి. మొత్తం పూసద్ పట్నం (తాలూకా కేంద్రం)లో ఉన్న వారిలో 80% మంది వీటిపైన పనిచేస్తున్నారు. కమలాలతోటలు కొన్ని వందల ఎకరములు ఉన్నవి. వీరి స్వగ్రామము గౌలి తాండా. పూసద్ నుండి గౌలి తాండా వరకు సుమారు 10 మైళ్లు అంతా వారి పొలాలే. అందరికీ జీతాలు ప్రతి సంస్థకు ఒక మేనేజరు, మిగిలిన స్టాఫ్ ఉంటారు. ఎవరు ఎంత పెట్టుబడి కావలయునో తీసుకొని పోవలయును. ఈ విధంగా ఎన్నో కోట్ల ఆస్తిని వారు వ్యవసాయ పరిశ్రమగా చేసి ఉత్పత్తి చేస్తున్నారు. నాకు ఒక కారు ఇచ్చి తమ సంస్థను చూచి రమ్మని ఇస్తే ఒక రోజంతా నాల్గవ వంతు కూడ చూడలేక పోయాను. పెట్రోలు బంకులు వారివే, అక్కడ ఉన్న ప్రతి ఒక్క సంస్థ వారి అధ్వర్యంలో నడుప బడుచున్నది. పూసద్ పట్నంలో ఉన్న జనాభాలో 60% మంది, ఇండ్లు బంజారాలవే అన్నారు. ఈ విధంగా మహారాష్ట్ర బంజారాలు అభివృద్ధి చెందుచున్నారు.

### కె.డి. జాదవ్ :

పూసద్ పట్టణంలో ఉన్నారు. వీరు ఓత్మాల్ జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు. ఓత్మాల్ జిల్లా బంజారా సంఘం అధ్యక్షులు వీరు పూసద్‌లో బాలబాలీకలకు పెద్ద పెద్ద హాస్టళ్లు నడుపుచున్నారు. ఇతని ఆధ్వర్యంలో పూసద్ తాలూకా మొత్తంలో కాలేజీలు, హైస్కూళ్లు ఆశ్రమ పాఠశాలలు, సంక్షేమ సంస్థలు మరియు బాల్‌వాడీలు నడుపబడుచున్నవి.

### ఔరంగబాద్ జిల్లా :

వసంతరావ్ నాయక్ విశ్వ విద్యాలయం బహుదూర్‌పుర, ఔరంగబాద్ మహారాష్ట్రంలో, ప్రారంభించారు.

శ్రీ వసంతరావు నాయక్ మహావిద్యాలయము, ఔరంగాబాద్



ఎడమ నుంచి శ్రీ వసంత్‌రావ్ నాయక్ మహావిద్యాలయ సంస్థాపకులు శ్రీ రాజారామ్ రాథోడ్‌గారు మరియు సహచరులతో

1. బంజారా బాలుర హాస్టలు, ఔరంగాబాద్
2. బంజారా బాలురు మరియు బాలికలు హాస్టళ్లు – 2 నంబర్లు
3. బంజారా హాస్టల్ బిల్డింగులు 20 రూములు, 22 X 17 చ ఒక్కొక్క రూము వైశాల్యము.
4. బంజారా విముక్తి హవ్‌సింగ్ కాలనీ 7 ఎకరముల పైన 225 ఇళ్లు, 4 రూముల ఒక వరండా, 1960లో ఒక్కొక్క ఇంటికి 14,000/– ప్రభుత్వం మంజూరు చేసింది.
5. బిండాన్ తాండాలో 7 ఎకరములలో 100 ఇండ్లు ఒక్కొక్క ఇంటి 10,000రూ. మంజూరు చేసారు.
6. సేవాభాయా పేరన గిర్‌నిరం తాండాలో 15 ఎకరములలో 125 ఇండ్లు 10,000–రూ. చొప్పున కట్టబడినవి.
7. 125 మందికిగాను ప్రభుత్వం కేటాయించిన 500 ఎకరములలో సమిష్టి వ్యవసాయం చేస్తున్నారు. ప్రభుత్వం 5 లక్షల రూ మంజూరు చేసినది. గోదాములు, బావులు, ఎద్దులు బండ్లు, వ్యవసాయ పనిముట్లు మొదలైనవి కొని అభివృద్ధి చేస్తున్నారు.

8. 1965లో మాయిస్మాతా తాండాలో బంజారా కో.ఆపరేటివ్ కలెక్టివ్ ఫార్మింగ్ సొసైటీ మొత్తం 1,000 ఎకరములో స్థాపించారు. ఈ సొసైటీకి ప్రభుత్వం వారు 3,00,000 రూ. గ్రాంటుగాను అప్పుగాను మంజూరు చేసినారు.

9. ఔరంగబాదులో శ్రీ వసంతరావు నాయక్ మహా విద్యాలయమును, విశ్వ విద్యాలయమును స్థాపించినారు, ఉత్తం రాథోడ్ దీనికి అధ్యక్షులు, రాజరాం రాథోడ్ ఎం.ఏ(చరిత్ర), ఎం.ఏ(పాలిటిక్స్) దీనిని నిర్వహిస్తున్నారు. దీనిని 30% మంది బంజారాలు నిర్వహిస్తున్నారు. విద్యార్థులు కూడ అంతే ఉన్నారు. ఇందులో చదువుచున్న పిల్లలకు ఉచిత వసతి, భోజన సదుపాయలు కల్పిస్తున్నారు.

10. ఈ విధంగా మొత్తం మహారాష్ట్రంలో ప్రతి ఒక్కరు విజ్ఞాన, ఆర్థిక, విద్యాసంస్థలను, గృహవసతికై బంజారా కాలనీలను, ఆర్థిక అభివృద్ధికై సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను, కాంట్రాక్టు సొసైటీలు, క్రెడిట్ సొసైటీలు స్థాపించి వారికి అన్ని విధాలుగా తోడ్పడి రాజకీయ చైతన్యమును పొంది, ఎమ్.ఎల్.ఏ లు, ఎం.పీ లు, మంత్రులుగా, ముఖ్యమంత్రులుగా కూడ పనిచేయుచున్నారు.

## ఔరంగబాద్ బంజారా సేవా సంఘం చేపట్టిన కార్యక్రమములు :

1. ప్రతి జిల్లా కేంద్రంలోను, తాలూకా కేంద్రంలోను, ప్రతి హైస్కూలు వద్ద బంజారా, బాలురకు బాలికలకు హాస్టలు వసతి కల్పించుటకు పాటు పడుచున్నది.

2. బంజారా విద్యార్థులు కూడా సంఘమునకు చాలా సహకారం అందిస్తున్నారు. మరియు బంజారా విద్యార్థి సంఘమును కూడ స్థాపించినారు.

3. ఈ జిల్లాలో ఉన్న బంజారా ప్రభుత్వ ఉద్యోగులు, 700 మంది ఉన్నారు. వీరు వివిధ రకాల ప్రభుత్వ శాఖలలో పనిచేస్తూ, ఆయా శాఖలలో ఆయా శాఖలకు సంబంధించిన పనులను సులభముగా చేయించి, బంజారా సంఘమునకు తోడ్పడుచూ, సంఘంలో మెంబర్లుగా ఉన్నారు.

ఈ అభివృద్ధి అంతుయు బంజారా సేవా సంఘమును స్థాపించి పై వాటిని సాధించారు. వారు స్థాపించిన సంఘం అఖిల భారత బంజారా సేవా సంఘం అయితే సంఘ ఉద్దేశాలను పూర్తి చేయుటకువారు స్థాపించిన సంస్థల అభివృద్ధిటి పాటుపడుటకై వారికి సమయము చాలలేదు. ఇక వారు మొత్తం భారతములో వాటి శాఖలను ఎలా స్థాపిస్తారు. అందువలననే అఖిల భారత బంజారా సేవా సంఘం స్థాపించి 50 సం.లు పూర్తి అయినను దేశం మొత్తంలో దాని రాష్ట్ర శాఖలు, ప్రాంతీయ శాఖలు, జిల్లా శాఖలు, మండల శాఖలు, తాండా సంఘములు గానీ స్థాపించబడలేదు. అవి స్థాపించబడకపోవుటవలననే బంజారాలు 6 నుండి 7 కోట్ల పైబడి ఉన్న ఇప్పటివరకు భారత ప్రభుత్వం వీరి భాషను గుర్తించలేదు. వీరి భాషాభివృద్ధికై తలంచనులేదు. అందువలననే 50 సం.ల క్రితం స్వాతంత్రం వచ్చినను బంజారాలు విద్యారంగంలోకాని, ఆర్థిక రంగంలో కాని, రాజకీయ రంగంలో కాని రాణించలేక పోయినారు. ఒక రాష్ట్రానికి ఎంత సంపదైతే ఉంటుందో అంత సంపదకు వీరు వారసులు. అయిన ఏమి లేని అనాథలుగా జీవించుచున్నారు.

**మైసూర్‌రాష్ట్ర పర్యటన :** అఖిల భారత బంజారా సేవా సంఘంలో సంయుక్త కార్యదర్శిగా ఉన్న కీ.శే. శ్రీ కె.టి. రాఠోడ్‌గారు తన స్వంత జిల్లా అయిన బిజాపూర్‌లో స్థాపించిన విద్యాసంస్థలు. శ్రీ నాయక్ ఎడ్యుకేషన్ సొసైటీని స్థాపించి ఈ క్రింది సంస్థలను నిర్వహించారు.



కీ. శే. శ్రీ కె. టి. రాఠోడ్,
మాజి కర్నాటక మంత్రులు



ఉప్లీ బుర్జ్- బీజాపూర్
శ్రీ ఎల్. ఎల్. రాఠోడ్, సంఘ సభ్యులు
మరియు విద్యార్థులు

1. శ్రీ బాబా సాహెబ్‌నాయక్ విద్యార్థి హాస్టల్, బిజాపూర్
2. శ్రీమతి చంద్రకళా విముక్తి జాతి గిరిజనుల ఉచిత భోజన వసతి గృహం బిజాపూర్
3. లమాణి విముక్తి జాతి గిరిజన ఉచిత భోజన వసతి గృహం, బిజాపూర్
4. శ్రీ వసంతరావ్‌నాయక్ విద్యార్థి హాస్టల్, భాగ్‌వాడి
5. లమాణి హాస్టల్, సింధగి (తాలూకా)
6. విముక్తి జాత హాస్టల్, హరతి, ఇంది తాలూకా , బిజాపూర్ జిల్లా
7. లమాణి హాస్టల్, ఇంది (తాలూకా)
8. లమాణి విముక్తి జాతి హాస్టల్, కోటూర్, బిజాపూర్ జిల్లా.

1. ఆశాదేవి రాఠోడ్ అధ్యక్షులు, ఎల్.ఎల్. రాఠోడ్ కార్యదర్శి, సీతారాం పి. పవార్ మెంబర్.

**చిత్రదుర్గ జిల్లా :** శ్రీ జాతర్‌నాయక్‌గారు స్థాపించిన సంస్థ వీరికి ఆల్ ఇండియా బంజారా సేవా సంఘమునకు సంబంధము లేదు వీరు స్వయంగా జాతి మీద ఉన్న ప్రేమతో క్రింది సంస్థలను స్థాపించారు.

1. బంజారాల బాలుర హాస్టల్, చిత్రదుర్గ
2. బంజారా బాలికల హాస్టల్, చిత్రదుర్గ
3. బంజారా కాలేజీ విద్యార్థులు హాస్టల్, చిత్రదుర్గ
4. వీరు పై హాస్టల్ భవనములు స్వయంగా బంజారాల సహకారంతో కట్టించారు
5. బంజారా బాలుర హాస్టల్‌కుగాను 40 ఎకరముల భూమి సంపాదించారు

6. బంజారా బాలికల హాస్టల్‌కుగాను 17 ఎకరముల భూమి సంపాదించారు మొత్త 57 ఎకరములు. వీటి విలువ ఆ నాటికి 10 లక్షలు పైబడి ఉన్నదని వీటి ఆదాయం పై ఆధారపడి హాస్టల్లు నడిపిస్తున్నారు. బంజారాలుకుగాను హౌసింగ్ కాలనీ స్థాపించారు.
7. దావణగేరిలో బంజారా హాస్టల్ స్థాపించుటకు ఒక లక్ష రూ. పోగుచేసి హాస్టల్ బిల్డింగ్‌లు కట్టించారు. శివమోగ్గాలో బంజారా హాస్టల్ స్థాపించుటకు స్థలం తీసారు. మధుగిరిలో బంజారా బాలుర హాస్టలుకుగాన్ను 40 ఎకరముల వ్యవసాయ భూమిని పొంది దానిని నిర్వర్తించుచున్నారు.

పై రెండు మాత్రమే మైసూరు రాజ్యములో పర్యటించి నేను చూచిన అభివృద్ధి కార్యక్రమాలు కీ.శె. శ్రీ కె.టి.రాథోడ్‌గారు స్థాపించిన విద్యాసంస్థలవల్ల ప్రజలలో పలకుబడి పెరిగి బిజాపూర్ జిల్లానుండి ఎమ్.ఎల్.ఏగా ఎన్నికై కర్ణాటక రాష్ట్రంలో మంత్రివర్యులు అయినారు.

కర్ణాటక రాష్ట్రంలో శ్రీ జాతరనాయక్ సహకారమువలన విద్యావంతులైనారు. కర్ణాటక బంజారాలు షేడ్యూల్డ్ కులం జాబితాలో ఉండుటవలన వారికి శాసన సభలలోను, విధాన సభలలోను, రాజ్య సభలలోను రిజర్వుడు సీటులు లభించుటవలన విద్యాసంస్థలు సంఘం తరపున ఎక్కువ స్థాపించక పోయినను రాజకీయ భద్రత దొరికినందునవారు విద్యారంగంలో బాగ ముందంజ వేసి ఉన్నారు. అఖిల భారతంలో మొట్ట మొదటి ఐ.ఏ.ఎస్ స్థానమును కర్ణాటక బంజారాలు సంపాదించుకొన్నారు. మంచి మంచి ఇంజనీర్లు, డాక్టర్లు చాల కాలం క్రిందటనుండి పనిచేసి రిటైర్డు అయి ఉన్నారు. శ్రీ వై. రూప్లానాయక్ బాలానాయక్ మరి కొంత మంది ఐ.ఎ.ఎస్. అధికార్లు రిటైర్డు అయి ఉన్నారు. విద్యా, ఉద్యోగ రంగాలలో భారత దేశం మొత్తం బంజారాలలో కర్ణాటక రాష్ట్రంవారే ముందంజ వేసారని చెప్పుటకు గర్వపడుతున్నాను.

అఖిల భారత బంజారా సమాజములో ప్రప్రథమ ఐ. ఏ. యస్ ఆఫీసర్ శ్రీ వై. రూప్లానాయక్

# నారసింహపల్లి తాండా వంశ వృక్షము









1. సితానాయక్

2. జేమానాయక్
తోకరిభాయి

3. హూనానాయక్
కేళిభాయి

4. రామ్లా నాయక్
హోంస్లీభాయి

5. థావురియా నాయక్
గోజిభాయి






2. జేమానాయక్
తోకరిభాయి

...రేనాయక్ | రేంజినాయక్ నాయక్ - మంగలిభాయి

...ోవిందనాయక్ — ...ల్లుడు హ్యామినాయక్
లోక్యానాయక్ — 2+3
చీనియానాయక్ — 2+6
రామదాస్‌నాయక్ — 2+3
లక్ష్మానాయక్ — 2+3

3. హూనానాయక్
కేళిభాయి

...ూనానాయక్ — ...శ్యానాయక్ — ...ళ్ళాయినాయక్ 3+2
రాంజీనాయక్ నాయక్
చంద్రాయుడు నాయక్ — 1+3
హరిశ్చంద్ర నాయక్ - మునిభాయి — 2+2
మీటియా నాయక్
చెన్నయ్యనాయక్ — 2+3
రెండవ భార్య కుమారులు — 3+4

4. రామ్లా నాయక్
హోంస్లీభాయి

గణేనాయక్
సితీక్నిభాయి
1. లక్ష్మానాయక్ 3+2
2. రామభోజీనాయక్ 2+1

లక్ష్మానాయక్ (బోడ్యానాయక్)
తులసిభాయి
1. చీనియానాయక్ 3+2
2. రామచంద్రనాయక్ -2
3. రామభోజీనాయక్ 2+2
4. రామదాస్ నాయక్ 2+2
5. రామస్వామినాయక్ 1+2
6. శంకరానాయక్ 2+2
7. సీతారామ్‌నాయక్

ఇసర్రా నాయక్
మంగ్లీభాయి
రామసింగ్‌నాయక్ 2+3

5. థావరే నాయక్
గోజిభాయి

...ర్జే నాయక్ - రంకిభాయి
...ముడు నాయక్ - హనిమీభాయి

| ...ా. బాపూజీ నాయక్ | డా. రవీంద్రనాయక్ | లక్ష్మీరాంనాయక్ | డా. శివశంకర్ నాయక్ | అశోకనాయక్ |
|---|---|---|---|---|
| ...ా. కృష్ణవేణమ్మ -3 | శకుంతలాభాయి 2+1 | శాంతాభాయి 2+2 | డా. పద్మావతీభాయి 1 | -2 |

లచ్చేనాయక్ (గోధి లచ్చే) హునికిభాయి
గోబర్‌నాయక్ 2+4

భీలే నాయక్ - లక్ష్మీభాయి (బులాకి)
ఛత్రియానాయక్ — సాలిభాయి 2+1
జీవలానాయక్ — సాలిభాయి -1

# (రాథోడ్) జాత్ - బాణోత్ గోత్రం



ద్దే నాయక్

కే నాయక్ – సక్రిభాయి

ామే నాయక్ 4+2
చాంప్లా నాయక్ 2+3
భీలే నాయక్ 4+0
దూదియా నాయక్ 4+1
లింబూ నాయక్ 2+6

## వసరాం నాయక్

మొదటి భార్య

రెండవ భార్య లాలి భాయి

డబ్బు నారాయణ నాయక్ సాలిభాయి

గోబర్ నాయక్ 2+2
నాగ్యా నాయక్ 2+2
తిర్‌పాల్ నాయక్ 4+2

ందే నాయక్
ుజరిభాయి

కాలియా నాయక్

రామస్వామి నాయక్
తులసిభాయి

బోడియా నాయక్
లాలి భాయి ఉరఫ్ చౌలిభాయి

రంజిత్ నాయక్
దంధల్‌భాయి

ినియా నాయక్
లక్ష్మీభాయి
1+3

థావురియా నాయక్
లాలిభాయి
1+4

ఠాకరియా నాయక్
లచ్చీభాయి
2+2

పెద్ద మునియా నాయక్
2+2

చిన్న మునియా నాయక్
(గుండాలి నాయక్)
2+3

శంక్రా నాయక్ 2+1
రాజు నాయక్ 2+2

ాలాజి హరినాథ్ రాథోడ్
ా. బి. పద్మావతి భాయి
ి. ఇందిరా భాయి
ి. బ్రమరాంబ మల్లేశ్వరి భాయి

వాసుదేవ నాయక్

బాలాజి నాయక్
రమేష్ నాయక్

జితేంద్ర నాయక్ 3+2
రామచంద్రా నాయక్ 1+3
కృష్ణా నాయక్ 3+0
రవి నాయక్ –2



చౌహాన్ వంశము
సభావట్ గోత్రం
పాల్త్యా గోత్రం
పాల్త్యా హర్జేనాయక్
దేవలానాయక్ టిప్యానాయక్ హేమ్లానాయక్ చంద్యానాయక్
గోవర్ధన్‌నాయక్ 2+3 మిగిలిన పై మూడు కుటుంబాలు తాండా వదిలివెళ్ళినారు
కేశేనాయక్ మీంజినాయక్ దేవలానాయక్ లక్ష్మానాయక్ (కాళో)
-2 1+1 2+2 3+2
మూడ్ గోత్రం
బండ మీద సోమ్లానాయక్ హూనేనాయక్ హామ్యానాయక్ మూడ్ సోమ్లానాయక్
అల్లుడు దేవలానాయక్ 4+3 బద్దునాయక్ 3+2
జాదవ వంశము (వడితియా)
అంగడి హంజేనాయక్ నారాయణనాయక్ వష్యానాయక్
బాల్యానాయక్ 2+3
చంద్యానాయక్ రాంభోజినాయక్ సేవ్యా నాయక్
4+3 1+2 3+3
1. ధేనేనాయక్
2. రామచందానాయక్
భూణానాయక్
హేమ్లానాయక్
గోపాల్‌నాయక్ 2+3 2 (2+2)
3. పండ్ల వసరాంనాయక్
చందేనాయక్ మల్లేనాయక్ లాల్యానాయక్ లక్ష్మానాయక్ (జేఢూ) ధావూజీనాయక్
5+3 4+3 4+2 -2 2+4
4. సబావట్ చీనియానాయక్
లక్ష్మానాయక్ శ్రీరాములునాయక్ 3 4 5
4+2 3+2 2+3 2+3 3+2
భజ్జేనాయక్, జేమ్లానాయక్, రామ్లానాయక్ సంసారాలు
తోళ్యానాయక్ హిరామణ్ నాయక్ గోన్యానాయక్ చోక్లానాయక్ భీమానాయక్
జీవలానాయక్ 2+2 4+2 -2 4+2 2+2

## స్త్రీల వంశవృక్షం, అడవి బ్రాహ్మణపల్లి తాండా, ముదిగుబ్బ మండలం, అనంతపురం జిల్లా.

కానావత్ గ్రోతం X X - X X రాఠోడ్ వంశం భూక్యా



## II. సామానాయక్

- బిండాల వెంకటేనాయక్
  - 1 రాముడునాయక్
    - నానేనాయక్
      - పెద్ద భార్య
        వింౖజావత్ గో(త్రం పవార్ వంశం
        - రంకీబాయి సబావట్ గో(త్రం
          రామ్లానాయక్ తాండా
      - చిన్న భార్య లక్‌మడి బాయి
        పాల్త్యా గో(త్రం చౌహాన్ వంశం
        - వెంకటానాయక్
        - తిరుపాల్ నయాక్
          - ఘమల్లిబాయి
            పాల్త్యాగో(త్రం
            చౌహాన్ వంశం
          - చిన్న అమ్మాయి
            మూడ్ గో(త్రం
            చౌహాన్ వంశం
    - గుజరిబాయి
  - 2 పోమానాయక్
  - 3 పెద్దబిడ్డ (వడతియా గో(త్రం, జాదవ్‌వంశం)
    - స(క్రిబాయి భర్త ధర్మానాయక్
      (పితావత్ గో(త్రం) రాఠోడ్ వంశం
      - హంజేనాయక్
        భార్య సాలీబాయి (మూడ్ గో(త్రం, చౌహాన్ వంశం)
        - భోజ్యానాయక్
        - లక్ష్మానాయక్ (దుబలియా)
        - రంగానాయక్
        - కృష్ణానాయక్
        - రవినాయక్ ఆడబిడ్డలు
          - ఘంల్లీబాయి భర్త
            నారాయణనాయక్
            బాణోత్ గో(త్రం
            రాఠోడ్ వంశం
            (2+1)
          - లక్ష్మీబాయి భర్త
            భీమానాయక్
            మూడ్ గో(త్రం
            చౌహాన్ వంశం
            (1+3)
          - కృష్ణమ్మ భర్త
            సోమూజి నాయక్
            విస్లావత్ గో(త్రం
            పవార్ వంశం
            (2+1)
          - పార్వతి భర్త
            గోవర్ధన్‌నాయక్
            అంగోత్ గో(త్రం
            పవార్ వంశం
          - లాలిబాయి భర్త
            పరశురామ్‌నాయక్
            మూడ్ గో(త్రం
            చౌహాన్ వంశం
            (2+1)
    - హనుమంతునాయక్
      వీరి సంతతి గుడ్డంపల్లి తాండా
      ముదిగుబ్బ మండలం
    - చిన్నబిడ్డ
      (మూడ్ గో(త్రం)
      చౌహాన్ వంశం
      శెట్టిపల్లితాండా
      పుట్టపర్తి మండలం
  - 4 లాలీబాయి
  - 5 లక్ష్మీబాయి (బాయన)
- పెద్దలచ్చేనాయక్
  - భీక్యానాయక్
    - పోమ్లానాయక్
    - లాల్యానాయక్
    - ఠాకరియానాయక్
    - సామ్యానాయక్
    - భోజ్యానాయక్
- చిన్నలచ్చేనాయక్
  - మటక్యా(గుంగో)

2. పోమా నాయక్

1. గోయిందానాయక్ పెంపుడు కొడుకు
భార్య లాంపళీబాయి, జాంగడ్ వంశం
ముగ్గురు కుమారులు ఇద్దరు కుమార్తెలు

2. బాల్యానాయక్
భార్యవాల్కీబాయి
మేనత్త కుమార్తె

3. హుక్కీబాయి
భర్త పూరియా నాయక్
(బాణోత్ గోత్రం,
నారసింహపల్లి తాండా 4+2

4 లాలిబాయి
భర్త వసరాం నాయక్
కుంతావాత్ రాఠోడ్,
బాణోత్ గోత్రం
నారసింహపల్లి తాండా

5 లక్ష్మీబాయి (బాయన)
భర్త పెద్ద బుడ్డేనాయక్
మూడ్ గోత్రం
చౌహాన్ వంశం
ఏటి ఒడ్డు తాండా
ముదిగుబ్బ మండలం

1. లచ్చీబాయి W/o బి. ఠాకరియానాయక్ ఎస్.పి. తాండా 2. తులసీబాయి భర్త గేమ్యానాయక్ 3. సాలిబాయి భర్త భోజ్యానాయక్ (పవార్‌వంశంలో విస్లావత్ గోత్రం) 4. సీనాబాయి భర్త మేగ్యా (జాదవ్ వంశం, వడితియా గోత్రం.) 5. శకుంతలాబాయి భర్త దీప్లానాయక్ (బాణోత్ గోత్రం రాఠోడ్ వంశం.) 6. శాంతాబాయి (పవార్ వంశం విస్లావత్ గోత్రం) 7. కుమారుడు వెంకటేనాయక్, (భార్య అలివేలిబాయి (మూడ్ గోత్రం, చౌహాన్ వంశం) 8. సాల్‌దేవి (బాణోత్ గోత్రం రాఠోడ్ వంశం) 9. పార్వతిబాయి (ఝుర్వలా పవార్ వంశం) 10. భ్రమరాంబ (Unmarried)

చందేనాయక్ | కాలియా | రామస్వామి | బోడియా | రంజిత్

పై తెల్పిన 4 లాలిబాయి కుమారునితో అన్న రాముడునాయక్ కుమార్తె గుజరిబాయితో వివాహం అయినందున మేనమామ బిడనే వివాహమాడతారు. జేజి, తల్లి ఇద్దరు ఒకే సంతతివారు.

బి. చీనియానాయక్ (1+3)
భార్య బి. లక్ష్మీబాయి
ధారావత్ గోత్రం, జాదవ్
వంశం (నల్లగొండ జిల్లా)

బి. థావురియానాయక్
భార్య లాలిబాయి (1+3)
మెగావత్ గోత్రం
రాఠోడ్ వంశం

బి. ఠాకరియానాయక్ భార్య
లచ్చీబాయి మేనమామ కుమార్తె
(2+2) కానావత్ గోత్రం
రాఠోడ్ వంశం

1. డా. పద్మావతిబాయి భర్త డా. కె. శివశంకర్‌నాయక్- కుమారుడు అనురాగ్ రాఠోడ్ (రాఠోడ్‌వంశం, కరమ్‌తోట్ గోత్రం) నారసింహపల్లి తాండా
2. బి. ఇందిరాబాయి భర్త డా. సురేంద్రనాథ్‌నాయక్ (విశ్లావత్ గోత్రం, పవార్‌వంశం, గోనిపెంట తాండా)
3. భ్రమరాంబ మల్లేశ్వరీబాయి భర్త సి.కె. అశోక్‌నాయక్ (రాత్లా గోత్రం, రాఠోడ్ వంశం, బెంగుళూరు)

**4. కుమారుడు బాలాజీహరినాథ్ రాఠోడ్**



5 లక్ష్మీబాయి (బాయన) భర్య పెద్ద బుడ్డేనాయక్ ఏటిఒడ్డు తాండా మూడ్ గోత్రం చౌహాన్ వంశం
సీతాబాయి
భర్త రామ్లానాయక్
కుమావత్ గోత్రం
(3+3) రాథోడ్ వంశం
రాసోరపల్లి తాండా
భీముడునాయక్
భార్య భీమణిబాయి
(3+2)
జేమ్లానాయక్
(4+1)
సక్రియానాయక్
భార్య చాందిబాయి
(2+2)
వాల్కిబాయి
భర్త బాల్యానాయక్
మేనమామ కుమారుడు
(1+9) కానవత్ గోత్రం
రాథోడ్ వంశం
గోప్యానాయక్
భార్య ధానీబాయి
పెద్దఅక్క బిడ్డను
చేసుకున్నారు)
(3+2)
బాల్యానాయక్
రామస్వామినాయక్
దశరథ్‌నాయక్
రవినాయక్
భార్య కస్తూరిబాయి
బాణోత్ గోత్రం
రాథోడ్ వంశం
కృష్ణానాయక్
కుమారుడు
ఇద్దరు
కుమార్తెలు
తాకరియానాయక్
భార్య అక్క
ధానిబాయి
కుమార్తెను
వివాహమాడెను
(3+1)
ధానీబాయి
భర్త గోప్యానాయక్
భర్త మేనమామ
(3+2)
హోకోర్డిబాయి
భర్త తాకరే నాయక్ బాణోత్ గోత్రం,
రాథోడ్ వంశం, 5గురు కుమార్తెలు
సాలీబాయి
భర్త
విస్లావత్ గోత్రం
పవార్ వంశం
పెనుమడి తాండా, కదిరి వెస్ట్, ఒక కుమారుడు, ఇద్దరు
కుమార్తెలు, అన్న కుమారుడు దశరథ్‌నాయక్‌తో కుమార్తె
వివాహమయినది.
దేవలీబాయి
భర్త గోప్యానాయక్ పితావత్ గోత్రం, రాథోడ్ వంశం
పొడరాళ్ళపల్లి తాండా ముదిగుబ్బ మండలం (7+1)
తన కుమారునకు అన్న జేమ్లానాయక్ కుమార్తెతో
వివాహము అయినది.

# జననీ జన్మ భూమిశ్చ - స్వర్గాదపి గరీయసి!

# నేను పుట్టిన నారశింహపల్లి తాండా

**తాండా నైసర్గిక స్వరూపం :** ఈ నారశింహపల్లి తాండా ఆంధ్రప్రదేశ్‌లోని రాయల సీమ జిల్లా అయిన అనంతపురం జిల్లా పూర్వపు తాలూకా పెనుకొండ, బుక్కపట్నం ఫారెస్టు రేంజిలోని క్రొత్తకోట గ్రామము మజరాలో ఉన్నది. ప్రస్తుతం తాలుకా, పుట్టపర్తి, బుక్కపట్నం మండలం, గోరంట్ల శాసనసభ స్థానంలోని హిందుపురం పార్లమెంటుకు చెందినది. ఈ తాండా, బుక్కపట్నం ఫారెస్టు రెంజి మధ్యలో, చుట్టు కొండలు ఆవరించి మధ్యలో ఉన్నది. ఈ ఊరినుండి తూర్పు దిక్కున ఉన్న నల్లమడ పోవలయునంటే సుమారు 6 మైళ్లు అనగా 10 కి. మీ. కాలినడకన పోవలయును. ఉత్తర దిక్కుగా పోవలయునంటే అరణ్య మధ్యనుండి లోయ మార్గంలో సుమారు 8 మైళ్లు అనగా 12,13 కి.మీ.నడకన క్రొత్తకోట గ్రామం చేర వచ్చును. అక్కడినుండి రోడ్డుచేరవలయునన్న సుమారు 6 కీ. మీ. పోవలయును. ఇక పడమర దిక్కుగా పోవలయునన్న సుమారు అరణ్యంలో ఘాటు మార్గంలో 9 కి.మీ మరియు సాధారణ మార్గం 2 కి.మీ. పోయిన బుక్కపట్నం చేరవచ్చును. ఇదే ఈ తాండాకు వ్యాపార కేంద్రం. ఇక్కడి నుండి దక్షిణం పోయిన మధ్యస్థ కొండలతో 4 కి.మీ. పోయిన వెంగళమ్మ చెరువు గ్రామం వస్తుంది. ప్రస్తుతం ఈ గ్రామము వరకు రోడ్డు మార్గం ఏర్పాటు చేయడం జరిగినది. పూర్వం ఈ తాండా ఏజెన్సీ ప్రాంతంలో ఉన్నట్లు ఉండెను. ఈ తాండా చుట్టు ఉన్న అడవి నల్లమల్ల ఫారెస్టును పోలీ ఉండును. పూర్వం ఈ అడవిలో చాలా రకముల వన్య మృగములు పెద్ద పులులతో నిండి ఉండెను. చిరుత పులులు, ఎలుగు బంట్లు, అడవి పందులు, ముండ్ల పందులు, దుప్పులు జింకలు, అడవి రేసుకుక్కలు, నక్కలు, కొండ సిలువలు, విష సర్పాలు, ఉడుములు, వాలగలు ఈ అడవిలో పెద్ద తేనే తెట్టు, పుట్ట తేనే, నెమిళ్లు రకరకాల అడవి పక్షులు, కోళ్లు ఉండెను. ఈ అడవి నిండా, నారేప చెట్లు, టేకు చెట్లు, శ్రీ గంధం చెట్లు, ఎర్ర చందనం చెట్లు, చింత చెట్లు గట్టికి పేరు గాంచిన బిల్లు ఎలము చెట్లు, రేగి చెట్లు, ఉసరి, వెలగ చెట్లు, నేరేడి చెట్లు, ఇంకను ఎన్నో రకాల చెట్లతో పచ్చగా విలసిల్లు చుండేది. ఈ అడవి ఎల్లప్పుడు పచ్చగాను, ఎల్లవేళల నీటి సెలయేళ్లతో పారుచూ ఉండినది. ఎందుకనగా ఈ అడవి సుమారు 12 X 12 = 144చ. కి. మీటర్లు విస్తర్ణంలో వ్యాపించి ఉండుటవలన, నారశింహపల్లి తాండా నాయకులు తమ జీవనాధారమైన అడవి ఆవులు ఈ అరణ్యంలో పెంచుచుండిరి. ఈ అరణ్య మంతయు గుంపులు గుంపులుగా గోవులతో తెల్లగా మెరుస్తూ పచ్చని అడవిలో, నిశ్చితంగా ఆనందంగా తమ జీవితములను గడుపుచుండినవి. ఒక్కొక్క గుంపు ఆవులు వేల సంఖ్యలో ఉండేవి నారశింహపల్లి తాండా ముఖ్య సంపద గోసంపద ఉండెను. ఆ అరణ్యంలో విసర్జించిన మలముత్రాముల సారమునకు ఆ అడవి సహజ ఎరువు సంపదను కలిగి, అక్కడి వన వృక్షములు, ఆనందాతి సమయంలో తమ యొక్క సౌందర్యమును ప్రకృతిలో వెదజల్లు చుండెను. ఈ అడవి ఆనందంతో పాటు ప్రతి ఋతువునందును రకరకములైన, పండ్లను రేగి పండ్లు, నేరేడు పండ్లు, చింత పండు వెలగ పండ్లు, బలిజ పండ్లు, కల్లికాయలు, కాళధామన్, ధోల్ దామన్, ధోలజార్ ( జొన్నలులాంటి తియ్యటీ పండ్లు) ఎర్రటి గ్యాదర పండ్లు, కుంకుడు కాయలు, ఉసరిక కాయలు సంవృద్ధిగా దొరకేవి. ఈ కాలంలో

పశువులు కాయుటకు అడవికి పోవటానికి పిల్లలు ఉత్సాహపడేవారు. ప్రకృతి వీటిని ప్రసాదించుచుండెను. అంతటి మనోహరమైన ఈ అడవి మధ్యలో నారశింహపల్లి తాండా వెలసినది.

## 1. తాండా స్థాపన :

ఈ తాండా ముఖ్యంగా మూడు క్షత్రియ వర్ణములు ప్రజలు నివశిస్తున్నారు.

1) రాథోడ్ వంశము 2) చౌహాన్ వంశము 3) జాదవ్ వంశం.

1) రాథోడ్ వంశము : ఇందులో రెండు వర్గములు వారున్నారు. ఒకటి. భుక్యా రెండవది. జాత్. భుక్యా వంశములో ముఖ్యంగా ఎక్కువ కుటుంబాలు కరంతోట్ గోత్రమునకు చెందినవారు. రాజావత్ గోత్రమునకు చెందిన కుటుంబము ఒకటి, పితావత్ గోత్రమునకు చెందిన కుటుంబము ఒకటి, నాల్గవది ఆఖరుదైనది ఖైతావత్ గోత్రమునకు చెందిన కుటుంబము.

జాత్ వర్గంలో బాణోత్ మరియు చౌహన్, జాదవ్ వంశములు కూడ కలుస్తవి. జాత్ గోత్రీయులలో బాణోత్, కుంతావత్ రాథోడ్ వంశమునకు చెందిన కుటుంబములు ఎక్కువగా ఉన్నవి.

రాథోడ్ వంశములోని కరంతోట్ భుక్యావారి, ప్రధాన కుటుంబములు.1) పూజారి హాంజేనాయక్ కుటుంబము 2) థావరే నాయక్, రామ్లానాయక్ దాసే నాయక్ వీరు ఒక కుటుంబ సంతతివారు. 3) హరేనాయక్, రంజిత్ నాయక్ ఒక తండ్రి సంతతివారు 4) మానానాయక్, రాంజీనాయక్, మీటేనాయక్ ఒక తండ్రి సంతతివారు. 5) గడ్డం రాముడు నాయక్, ఖీరేనాయక్, లక్కే నాయక్ ఒక సంతతివారు.6) ఎనుము గోడ్ల దేవలానాయక్, వీరి సంతతి తాండా వదలినది. 7) బోడియా నాయక్ కుమారుడి సియా వీరు తాండావదలినారు. 8)ఎనుము గొడ్ల నారాయణ్నాయక్ రాంసంగ్యా నాయక్ 9) బాండుగ హనుమానాయక్ వీరు తాండా వదిలారు. (ఈ రెండు కుటుంబాలు) జాంగడ్ వంశమునకు, పెంపుడు వంశము చెందినవారు. వీరిని ఇప్పుడు కులంలో కలుపు కోవటం జరిగినది. జాత్ గొత్రంలో, బాణోత్ తోకానాయక్ కుమారుడు లోకానాయక్ కుమారులు(అ) బద్దునాయక్,(ఆ) ఠాకూర్ నాయక్, (ఇ) వశరాం నాయక్, (ఈ) లక్షేనాయక్ వీరు ఒక సంతతివారు. సూబేనాయక్, బుదెలానాయక్, వీరు ఒక సంతతివారు . గాంగే నాయక్ కుమారులు, ఖూబే నాయక్, గోపే నాయక్, వీరు ఒక సంతతివారు. వెంకటేనాయక్ - వీరు తాండా వదలి పాడరాళ్ల పల్లి తాండాలో కాపురముంటున్నారు.

2) చౌహాన్ వంశము : ఇందులో సబావట్, పాల్త్యా, మూడ్ గోత్రములు.

1. సబావట్ గోత్రములలో 1) ధేనే నాయక్ కుటుంబం 2) భూణా నాయక్ కుటుంబం 3) పండ్ల వసరాం నాయక్ కుటుంబం 4) చీన్యానాయక్ కుటుంబము.

2. పాల్త్యా కుటుంబము : హర్జేనాయక్ కుటుంబము. వీరికి నల్గురు కుమారులు. వారిలో పెద్ద కుమారుడు దేవలా నాయక్వారి కుమారుడు గోబర్ నాయక్ కుటుంబము మాత్రమే ఉన్నది. మిగిలిన ముగ్గరు కుమారులు ఊరు వదిలి ధర్మవరం తాలూకాలోని ఫత్యాపురం తాండాలో నివశిస్తున్నారు.



*1*. నారసింహపల్లి తాండా తూర్పుదిశ నుండి కనిపించు దృశ్యం. *2*. దక్షిణ దిశ నుండి కనిపించు దృశ్యం. *3*. (క్రొత్తగా నిర్మితమైన నారసింహపల్లి తాండా సొసైటీ తూర్పు భాగములో *4*. నారసింహపల్లి తాండా కో. ఆపరేటివ్ సొసైటిబిల్డింగుల దృశ్యం.





నారసింహపల్లి తాండాలో మారెమ్మ జాతర విశేషాలు

3. మూడ్ గోత్రం : 1) బండ మీద సోమ్లానాయక్‌వారి కుమారులు 2) హూనేనాయక్ కుమారులు లేనందున అల్లుడు దేపలానాయక్ ఇల్లరీకం ఉన్నారు. 3) హోమ్యనాయక్ వీరి కుమారుడు బద్దు నాయక్ ఉద్యోగి అయి తాండా వదలినారు. 4) సోమ్లానాయక్ వీరి కుమారులు ముగ్గురిలో ఒకరు అనంతపురంలో కాపురముంటున్నారు.

3. జాదవ్ వంశం : అంగడి హంజే నాయక్ వారికి ఇద్దరు తమ్ముళ్లు, వీరిలో హాంజేనాయక్ కుమారుడు బాల్యానాయక్ కుటుంబము ఒక్కటే ఉన్నది. మిగిలిన ఇద్దరి కుటుంబములు తాండా వదలి ధర్మవరం తాలూకలో కాపురం ఉంటున్నారు. ఈ మూడు వంశములు వారిలో రాథోడ్ వంశమునకు చెందిన బాన్నోత్, కరం తోట్ కుటుంబాలు మాత్రమే ముందునుంచి ఆర్థికంగా బలపడిన కుటుంబాలు మిగిలిన, రాథోడ్ వంశాలు కానీ, చౌహాన్ వంశములు కానీ, జాదవ్ వంశం కాని, అన్ని రంగాలలో పై రెండు గోత్రముల వారిని పోటి పడలేదు. వీరు మధ్య రకంగాను, బీద కుటుంబాలుగాను ఉండి పోయినవి. వీరు ఎక్కువగా పై రెండు వర్గముల గోవుల కాపరులుగాను, వ్యవసాయ కూలీలుగాను జీవితం గడుపుతూ వస్తున్నారు.

**తాండా పూర్వం వైభం :** ఈ తాండా నాయకుడు మొదట ఠాకరేనాయక్, వీరి కుటుంబము మొదట అన్ని రకాల అభివృద్ధి చెంది ఉండినది. తోకానాయక్ కుమారుడు లోకానాయక్ వీరికి బద్దే నాయక్, ఠాకూర్ నాయక్, వశరాం నాయక్, లచ్చేనాయగారు 1) బద్దేనాయక్ 10 వేల ఆవులను 3 వేల గొర్రెలను కలిగి తాండాలోని బీదవారిని గోవులు మరియు గోర్ల కాపరులుగా చేసుకొని పోషించారు. 2) ఠాకరే నాయక్‌గారు తమ ఆవుదూడలను వ్యాపారం చేసేవారు. వీరు తమ ఆవుదూడలనే కాకుండా రాయల సీమ ప్రాంతములోని దూడలను వేల లక్షల సంఖ్యలో కొని వ్యాపారం చేసేవారు. వీరు వ్యాపార కాలంలో వెండి రూపాయలు కావళ్లతో తెచ్చి గరిసలో పోసేవారట. తన ఇంటిలో పెద్ద కందినం( గరిసె) నిర్మించి అందులో పోసారు. ఈ ధనం బ్రిటీషువారికి తెలయడంతో తన ఇల్లుని జప్తి చేస్తారని తెలుసుకొని తను స్వయముగా ఎవరికి తెలియకుండా మొత్తం ధనమును పెద్ద పెద్ద రాగి ఇత్తడి పాత్రలలోను, బానలలోను పోసి భూస్థాపితం చేసి పోయినారు. తన ఖర్చుల నిమిత్తం ఒక చిన్న బిందె నిండా నింపి తన బావ మరదికి దాచమని ఇవ్వగా, తను దానిని దక్కించుకొనుటకు చేతబడి చేయించి, ఛంపించాడని మావారు చెప్పకుంటారు. ఆ తొపెలీ ( బిందె) ను నేను కూడ చూచాను. ఆ ధనం ఇంతవరకు బయట పడలేదు. బయటపటిన అది దక్కలేదు, ఠాకరేనాయక్‌గారి తరువాత ఇంటి బాధ్యత తీసుకొన్నవారు.

శ్రీ కీ.శే. వసరాం నాయక్‌గారు , వీరు అన్న ఠాకరేనాయక్‌గారు చేసిన తప్పును గ్రహించినవాడై ఆ తరువాత గోసంపదనుండి మరియు గొర్రెలు, వాటి ద్వారా వచ్చిన ధనముతో మెట్ట, మాగాణి భూములను కొనటం ప్రారంభించారు. మొదట తాండాను అనుకొని పదకొండు ఎకరముల భూమి ఒక బావి తోట మాత్రం ఉండినది. ఆ తరువాతవారు మొత్తం తాండాకు అనుకూలమై భూములు ఒక్కొక్కటి 10,12, 15 ఎకరములకు పైబడిన ప్లాట్లను కొన్నాడు. మొత్తం 300 ఎకరముల భూమిపైన కొన్నారు. అందులో మదిరేబైలు దగ్గర 40 ఎకరముల మెట్ట రెండు బావులు, 7 ఎకరముల తోట, వెంగళమ్మ చెరువు క్రింద, వెంగళమ్మ చెరువు

తలపాటున, మరియు బులప్ చెరువు, పొలిమేరలోని, మాగాణి భూములు, మెట్ట భూములు కూడ కొన్నారు. వారు భూములు కొనటమే కాకుండ బీదవాడైన బుదేలా నాయక్ గార్కి భూమిని దానం కూడ ఇచ్చారు. ఆ భూమి ఆధారంగానే వారి కుటుంబము ఈ రోజు జీవించుచున్నారు. ఈ విధంగా వారు నలుగురు అన్నదమ్ములు సంతతికి సరిపోయిన భూమిని కొని, వారు ఉన్నట్లుగానే వారికి వాటాలు కూడ పంపి ఇచ్చారు. ఆ భూములనే ( దాయాదులు) వాటి ని అమ్ముకొన్నారు. ఈ విధంగా తన కాలంలో ఆ కుటుంబమును అభివృద్ధి పరచిపోయినారు. ఇక చెప్పదగిన రెండవ వ్యక్తి శ్రీ పూజారి హాంజేనాయక్‌గారు. వీరు ఎక్కువగా డబ్బును కూడబెట్టారు. కాని భూసంపద పై శ్రద్ధ చూపలేక పోయారు. వీరు చుట్టు ప్రక్క రైతులకు ధర్మవడ్డీ క్రింద పెద్ద పెద్ద మొత్తాలలో ఇచ్చేవారు, తీసుకొన్నారు. వీరికి, తన సంపాదనను భద్రం చేసుకొనే గుణం తప్ప, ఒకరిని మోసగించేగుణం లేకుండెను. వీరు మంచి దైవ భక్తులు, కృష్ణభక్తులు. వీరే తాండా నాయకుడుగా ఉన్నారు. వీరి నాయకత్వంలో తాండా చాలా సుఖంగా ఉండినది. మిగిలిన వారు అంతా మధ్య రకం కుటుంబాలు. చెప్పకోదగిన కుటుంబాలు, 1) హార్జేనాయక్ 2) దాసే నాయక్ 3) గోపాల్ నాయక్ 4) సేవే నాయక్ 5) రంజిత్ నాయక్ 6) మీటే నాయక్ మొదలైనవారు.

**తాండా వాతావరణం :** పూర్వం ఈ తాండాలోని ప్రతి ఇంటి ముందు పెద్ద పెద్ద లోగిళ్ళు ఉండేవి. ప్రతి లోగిలి ముందు, వందల సంఖ్యలో మేకలు ఉండేవి. గోవులు, పాడి గేదేలు, సేద్యపు ఎద్దులతో కిక్కిరిసి ఉండేది. తాండాలో నడువలయునంటే, సాధ్యమయ్యేది కాదు. మేకలను తోలుకుంటు, ఆవులను ప్రక్కకు తొలగిస్తు, గేదేలకు దూరంగా నడువవలసి ఉండెను. ప్రతి ఇల్లు పశుసంపదతో కళకళలాడుచుండెను ప్రతి ఇంటిలో పాడి సంవృద్ధిగా ఉండెను. పాలకుండలను, నుగ్గు( పిడికలు) వేసి కాస్తూఉండేవారు. పాల మీద మీగడ అరచేతి మందం పేరుకొని ఉండేది. ప్రతి ఇంటిలోని స్త్రీలు తెల్లవారు జామున బానల నిండ పెరుగు పోసుకొని. ఇంటిలోని స్తంభమునకు మజ్జిగ కవ్వముతో చిలుకుచుండిన, తాండా అంతయు నిశబ్దంలో ఈ కవ్వముల శబ్దం. ఎంతో హాయిగా, మాధుర్యంగా వినిపిస్తూ ఉండేది. ప్రతి కుటుంబములోని యువకులు తెల్లవారు జామున 4.30 గం.లకు లేక 5.00 గం.లకే లేచి తమ పశువుల శాలలో, పశువులు వేసిన పేడను, మేకల మందల ఎరువును తమ తమ ఎరువు దిబ్బలకు గంపలతో మోయుటకు సుమారు రెండు గంటల కాలం పట్టేది. పశువుల పేడను ఎత్తిన వెంటనే, బొగ్గుతో పండ్లు తోముకొని, ముఖం కాళ్ల చేతులు కడుగుకొని, రాత్రి సద్ది అన్నం గట్టి పెరుగుతో గాని చిక్కటి మజ్జిగతో తిని, వెంటనే పశువులకై గడ్డి కోసుకొని వచ్చుటకు పోవుచుండిరి. ప్రతి ఒక్కరు సోమారితనం చూపకుండా, తన శక్తి కొద్ది పెద్ద పెద్ద గడ్డి మోపులను తెచ్చుకొను చుండిరి. ఆడవారు, పెరుగు చిలికి తమ వంట పాత్రలను శుభ్రం చేసుకొని, సజ్జలు, జొన్నలు దంచేవారు దంచుతుండగా, ఇసర్రాయితో పిండి విసురతుండేవారు. ఆ తరువాత అన్నం ఎసురు పెట్టి చేంతాడు తీసుకొని, చాలా లోతైన చేదుబావి నీటిని, కడవలతో చేది, తమకు కావలసిన నీటిని, బానలలోను, తొట్లలోను, నింపేవారు,

త్రాగటానికి మంచి నీళ్ల కావలయునన్న సుమారు. అర్ధ కిలోమీటరు దూరంలో ఉన్న మానిం బావి లేక పెద్ద బావి నుండి పెద్ద పెద్ద ఇత్తడి బిందెలతో, కడవలతో, బానలతో

మోస్తూ ఉండేవారు. మొత్తం తాండాలోని ప్రజలు తమ అవసరమునకై ఇంటికి ఒకరు లేక ఇద్దరు మొదలు పెడితే ప్రొద్దున సుమారు 6 గం. నుండి 9 గం.వరకు మగవారు ఆడవారు బయలు దేరి హారంలాగా అగుపిస్తుండేది. ఈ విధంగావారి పనులను ముగించిన తరువాత సద్ది అన్నం సిక్కములో వేసుకొని తమ తమ గోవులను మేకలను మేపుటకు వదిలిన తాండా ఓణి(త్రోవ) నిండా పటుకుండా, ప్రతి ఇంటి, మేకల గుంపులు, ఆవులు గుంపులు, ఒకరి తరువాత ఒకరి గుంపులు పోవుచుండిన, మొత్తం, తాండా నుండి చెన్నమ్మ చెరువువరకు ఉన్న వంకదారి సుమారు మూడు నాల్గు కిలోమీటర్లు పొడుగువరకు , ఒక సైన్యం బెటాలియన్ పోవుచున్నట్లుగా అగుపించేది. అక్కడినుండి ఎవరి గుంపువారు, వారికి అనుకూలమైన ప్రాంతములకు తోలుకొని పోయి మేపు కొని వచ్చేవారు. తిరుగు ప్రయాణంలో కూడ అడవి పొలాలతో నిండి ఉండును కావున ప్రక్క పోవుటకు వీలు కలిగేది కాదు. ఆనాడు మొత్తం సంవత్సరంలో సుమారు 6 నెలల పైబడిన కాలం పంట పొలాలతో నిండి ఉండేది.

**పండించే పంటలు :** ఈ తాండాలో పూర్వం ఎక్కువగా, జొన్నలు, సజ్జలు పండించేవారు. వర్షాలు కూడ బాగా కురిసేవి. ఎందుకనగా ఈ తాండా చుట్టు ఎత్తైన పచ్చని చెట్లతో నాల్గు ప్రక్కల కొండలు వ్యాపించి ఉన్నది. ఏ కొద్ది పాటు మేఘములు ఏర్పడినా వెంటనే వర్షాలు కురుస్తూ ఉండేవి. ఈ తాండాకు పడమర దిక్కుగా వెంగళమ్మ చెరువు నుండి క్రొత్తకోట మీదుగా అగ్రహారం చెరువుకు పోవుటుకు వంకఉన్నది. ఈ వంకకు దక్షిణ భాగంలోని పడమట రాసాని గొందినుండి తూర్పున బోలిగుండ్లనుండి వంకలు వచ్చి కలుస్తవి. మరియు పడమర నుండి చెన్నమ చెరువు నుండి వంక వచ్చి కలుస్తుంది,. తూర్పునుండి వచ్చే వంకలు, దక్షిణ కొండలనుండి, ఉత్తర దిక్కున ఉన్న బాలమద్దిపల్లి అడవులనుండి, నల్ల మడ ప్రాంతం నుండి వచ్చు వంక కలుస్తుంది. ఈ వంకలో ఎల్లప్పుడు నీళ్లు ప్రవహిస్తూ ఉండేవి. మధ్య మధ్యలో మడుగులు ఏర్పడి వాటి యందు నీరు సమృద్ధిగా నిల్చిఉండేవి. వేసవి కాలంలో తాండా పశువులకు ఈ నీరు సమృద్ధిగా సరిపోయేది. ఉదాహరణకు ఎర్రాత మడుగు, పార్లే మడుగు, బండాల మడుగు ముఖ్యమైనవి. ఈ వంకకు ఇరు ప్రక్కలు మాగాణి ఉండి వరిపండిస్తారు. ఇరు ప్రక్కల బావులను త్రవ్వి వేసవిలో ఆరు తడిపంటలు, కూరగాయలు, రాగి, చెరుకు మొదలైన పంటలు పండిస్తుండిరి.

**తాండా చుట్టు ఉన్న కొండల పేరు :** తాండాకు అనుకొని, పలిగుట్లు, దక్షిణం కాలే బండా ఖోబో(లోయ) గాని గుట్ట, తాండాకు పడమరగా ఉన్న కొండను ''వలచికుప్ప'' అంటారు. ఉత్తర దిక్కుగా ఉన్న కొండ మర్రిమాను కుప్ప, దేవర కొండ, తూర్పు ఉత్తరాన బాల మిద్దపల్లి అడవి, ఉత్తరం పశ్చిమం చెంద్రాయుని అడవి, ఈ అడవిలో చంద్రాయుడు వెలసి ఉన్నారు. మార్కాపురం చెన్న కేశవస్వామి ఈ అడవిలో వెలసినారు. ఈ కొండ చుట్టు ఉన్న గ్రామ ప్రజలు ప్రతి శనివారం వచ్చి స్వామిని పూజించి వెళ్లుతుంటారు. పడమర బుక్కపట్నం అడవి, దక్షిణమున వెంగళమ్మ చెరువు అడవి అని పేర్లతో పిలుస్తారు. దక్షిణ భాగంలోని కొండ ఎక్కిన తరువాత మైదాన ప్రదేశమంతా గరుగు, ఇసుక నేలలతో కూడిన పొలములు ఉన్నవి, ఇక్కడ పండించే వరి పొలాలను బాణోతేర్ మడి, హర్జేనాయక్ మడి, దాస్యార్ మడి, సాదేర్ మడి, గోహ్యార్ మడి, ధేన్యార్ మడి అనిపిలుస్తారు. కూరగాయల తోటను బాణోత్తేర్ తోట

అంటారు. ఇక్కడి వ్యవసాయ భూములను రకరకాల పేర్లుతో పిలుస్తారు. ఎర్రమార్, గుండ్ల చేను, బల్జాటాపా, గరేపాఛేర్ ఖేతర్, గోర్లిగడ్డ, చిగర మాను బావి, మానిమ్ బావి, టాపా, చింతమాన్ చేన్, ఉడకరేవు చేను, గెసిగార్ మడి,పాలీపెటేర్, ఖేతర్, పర్తిమిన్ చేను. అయ్యవారి గడ్డ, వల్చికుప్ప చేను, గట్లా హేటేర్ ఖేతర్, కాపల గండి, మర్రిమాను చేను(చెరువు) కట్టకింద చేను, ధేన్యార్ ఖేతర్, పితావతేర్ ఖేతర్, వేంకట్యార్ ఖేతర్, బాండ్‌గార్ ఖేతర్, పాల్‌త్యార్ ఖేతర్, గాని గుట్ట చేను, దులాలగుంది, గరుగులు, పరమట గడ్డ, చికోతిర్ మూల మానిమ్ చేను, గుంట్లు, భోగమాన్ చేను, కొండ కావల్–ల్యార్ ఖేతర్, టెకమా కలగుట్ట, గుడిచేను ఈ విధంగా ఒక్కొక్క ప్రాంతమును ఒక్కొక్క పేరు పెట్టి పిలుస్తారు. ఈ భూములన్నియు అతిసార వంతమైనవి. మెట్ట వ్యవసాయంలో ఆంధ్రప్రదేశ్‌లోనే మొట్ట మొదటిదిగా చెప్పవచ్చును. ఇక్కడిరైతులకు, సారా, సగుటన ఒక ఎకరం, పొలం కూడ రాదు. కొందరికి సెంట్లతో మాత్రమే ఉన్నవి. ఇక్కడ 5 ఎకరములు భూమి కన్న ఎక్కువ ఎవరికి లేదు. పూర్వం ఉమ్మడి కుటుంబములుగా ఉన్నప్పుడు 5,10,15 ఎకరమువరకు ఉండినవి, ఆ భూములలో పండే పంట, తాండా అవసరముకు సంమృద్ధిగా అయికొంత వరకు అమ్ముచుండిరి. అంతర్ పంటగా, కంది, అనుములు, పెసలు, అలసందులు, నువ్వులు పండించుచుండిరి. ఇవి అన్నియు ఈదు పోవుటకు, పూర్వం సుమారు హోలి పండుగవచ్చుచుండెను. కంది–కట్టె, వాములు పెద్దగా ఉండేవి. ప్రతి ఇంట 3,4,5 బస్తాలు కందులు పండేవి. అంతర్ పంటగా అనుములు బాగా కాసేవి. వాటిని ఎద్దులతో త్రొక్కించేవారు. అలసందలు, పెసలు, నువ్వులు కూడ సమృద్ధిగా పండి అమ్ముచుండిరి. వీరి ముఖ్య సంపద గోసంపద, మేకలు, గేదేలు, కాయ ధాన్యములు, నెయ్యి ప్రతి ఇంటి సంమృద్ధిగా దొరకేది. వీటిని బుక్కపట్నం సంతలో అమ్ముచుండిరి. నారశింహపల్లి తాండా నెయ్యి అంటే క్షణములలో అయిపోయేది. ప్రతి సోమవారం సంతకు సుమారు 100నుండి 150 కె.జీ. నెయ్యి అమ్ముచుండిరి. నెయ్యి అమ్మి సంత చేసుకొని వచ్చు చుండిరి. పూర్వం ప్రజలలో రాజపుత్ర కళ ఉట్టిపడు చుండెను. ప్రతి ఒక్కరు సుమారు 5.9'' నుండి 6 అం.సైజులో ఆజానుబాహులుగా, ఎర్రగా, బలిష్ఠంగా, కండలు తిరిగిన, యోధులుగా కన్పించుచుండిరి, స్త్రీలలో కూడ రాజపుత్రు స్త్రీ గాంభీర్యంను కలిగి ఉండిరి. ఒకరిని నొకరు ఐకమత్యంగా, ఎవరికి ఏ కష్టమొచ్చిన, వెంటనే ఆదుకొనే గుణం కలిగి ఉండిరి. బంజారా సంస్కృతి. ఉట్టి పడుచుండెను. భక్తి భావములోను, పెద్దలను గౌరవించడంలోను ఒకరిని మించు ఒకరు కన్పించుచుండిరి. తాండా ప్రజలందరు నాయకుని కట్టుబడిలో ఉండి, వారు ఏమి చెప్పితే అదే పాటించుచుండిరి. ఏదైన తప్పు జరిగిన, వెంటనే పంచాయితి కూర్చొని ఎవరి తప్పు వుంటే వారిని దండించి, ఆ తప్పు తిరిగి జన్మలో ఎప్పుడు చేయకుండా ఉండినట్లు చేస్తుండిరి. తాండా నాయకుడైన పూజారి హంజే నాయక్ ఎంత తప్పున్న దండగ ఎక్కువ వేయకుండా రూ. 1.25పై. దండన విధించి అక్కడ వచ్చిన పెద్దలకు హుక్కా అందించో, ఒక బీడి కట్ట తెచ్చి, పంచి పెట్టి అందరికి పాదనమస్కారం దండన విధిస్తుండిరి. పంచాయితి అయిన తరువాత ఆనందంగా ఇండ్లకు వస్తుండిరి.

**విద్య :** ఈ తాండాలో 100 సం. వయస్సు పై బడినవారు చదువుకొన్నారు. వారిలో ముఖ్యులు పితావత్ నారాయణ్ నాయక్, రణజిత్ నాయక్, హర్జే నాయక్, ఘణే నాయక్, భజినే నాయక్ ముఖ్యులు. వీరంతా ఒకే ప్రాయంవారు. వీరు ప్రయివేటు టీచర్లను రప్పించి తాండాలోనే

నేర్చుకొన్నారు. వీరు తెలివి తేటలలో చాలా ఘనులు, స్వాతంత్ర్యమునకు పూర్వమే పితావత్ నారాయణనాయక్‌గారు, వారపత్రికను తెప్పించి ప్రపంచ జ్ఞానమును, ఆనాటి రాజకీయములను తెలుసుకొనుచుండిరి. మా తాత శ్రీ వసరాంనాయక్‌గారు తన గడ్డివాముల దొడ్డి స్థలం ఇచ్చి తాండా పిల్లల విద్యాభివృద్ధికై ఒక స్కూలును కట్టించి, అందులో ప్రయివేటు స్కూలును స్థాపించారు. తన పిల్లలందరితోపాటు, తాండా పిల్లలందరికి విద్యాభివృద్ధి గావించారు. నారశింహపల్లి తాండాలో 50% శాతం మంది 2 నుండి 5వ తరగతివరకు చదివినవారే. ఆనాడు రెండవ తరగతి చదివిన మా చిన్నాయనగారు నా 9వ, 10వ తరగతి పుస్తకములన్నియు చదువుచుండెను. నా చిన్నతనంలో తాండాలోబడి చెప్పే అయ్యవారు లేక, నారశింహపల్లిలో (పక్క ఊరిలో) ప్రైవేటు స్కూలు నడుపుచున్న లక్ష్మయ్య గురువు దగ్గర చదువుకొనుచుండిరి. సుమారు 20 మంది పైన బడికి పోవుచుండిరి. మగ పిల్లలతో పాటు ఆడపిల్లలు కూడ చదువుచుండిరి. వారిలో ముఖ్యులు. శ్రీమతి బి.లక్ష్మిబాయి కీ.శే. శ్రీమతి బి. తులసీ బాయి, ఇప్పటికి వారి వయస్సు సుమారు 65 సంవత్సరముల పైబడి ఉన్నది. నేను స్కూలుకు పోవుటకు మారాము చేస్తుంటిని. బడి పిల్లలు వచ్చి ఎత్తుకొని పోవుచుండిరి. నేను వారి కాళ్లను గట్టిగా రెండు కాళ్లతోను, రెండు చేతులతో పట్టుకొని, వారిని కదలకుండా చేస్తుంటిని, వారు నన్ను కాలునుండి విడిపించుకొనుటకు చాలా కష్టపడుచుండిరి. ఒక్కొక్కసారి విసిగి, వదలిపెట్టి పోవుచుండిరి. అయినా మా చిన్నాయన రామస్వామి నాయక్ అంటే నాకు చాలా భయం ఉండేది. నేను బడికి పోనిది చూచి, వెంటనే నా రెట్ట పట్టుకొని, కోడిపిల్లను పట్టికెళ్లినట్లు పట్టుకొని, ఒక రోజు ఒక మైలు దూరంలో ఉన్న స్కూలులో పైనుండి క్రింద పడి వేసాడు. టీచరుతో నా గూర్చి జాగ్రత్త చెప్పాడు. నా విద్య గూర్చివారు అంత శ్రద్ధ వహించేవారు. ఆ రోజులలో నేను స్కూలుకు పోవలయునన్న ప్రతి రోజు ఒక బొట్టు(మూడు దమిడీర్థెలు) మానాన్నగారు ఇస్తుండిరి, ఏ రోజు బొట్టు ఇవ్వరో ఆ రోజు న్ను బడికి పొమ్మని అనరు. ఒక బొట్టుతో ప్రతి రోజు ఒక దమిడికి బలపం, ఒక దమిడి బెల్లం, ఒక దమిడి పప్పులు కొనేవాడిని. ఈ మధ్యలో తాండాలోనే ప్రయివేటు స్కూలు ఏర్పాటు చేశారు. అంజనప్ప అయ్యవారు. లక్ష్మానాయక్ అయ్యవారు వీరు మిలటరి నుండి పారిపోయి వచ్చి మా తాండాలో దాక్కుని, పిల్లలకు చదువు చెప్పించారు. వారు తరువాత ప్రభుత్వ ఉద్యోగిగా ఉండి చనిపోయారు. వారి కుమారులంతా బ్యాంకు ఉద్యోగులు, డాక్టర్లు, ఇంజినీరు అయినారు.

1945 సం. స్వాతంత్రంకు పూర్వమే గిరిజన శాఖ వారిచే లేబర్ స్కూలు స్థాపించారు. మొదటి టీచరు నరసప్పగారు. వారి తరువాత వడ్డెర జాతికి చెందిన లక్ష్మయ్య టీచరు వచ్చారు. వారు భ్రాజులమని అన్ని ఆహారపానియాలను స్వయంగా చేసుకొని వారి వంట వార్పులలోనే ఉండిపోయేవారు. తరువాత రామయ్య టీచరువచ్చారు. వీరు తలవర్ల నివాసులు, మాలకులస్తులు, వీరు కమూనిస్టు భావములు కలవారు, పాఠములు బాగా చెప్పేవారుకాని, ఎక్కువ కాలం స్కూలులో ఉండెవారు కారు. స్వయంగా బుర్ర కథలు వ్రాసి, రెడ్ల పై హరిజనులను హింసించే పద్ధతులను, ఎగురుకుంటు, డ్యాన్సులు చేస్తు, పాటలు, బుర్ర కథలు చెప్పేవారు. 1947లో భారత దేశం స్వాతంత్రం లభించిన తరువాత తాండాలో గొప్ప ఉత్సవమును ఏర్పాటు చేయించి, ఉపన్యాసాలిప్పించి, మా అందరిని జండాలు పట్టుకొని, వెంగళమ్మ చెరువు స్వాతంత్ర్య వేడుకలలో పాల్గొనుటకు గాను పిలుచుకొని పోయారు. అక్కడ

లక్ష్మీనారాయణ రెడ్డి టి. వారి తండ్రి నరసారెడ్డిగారు ఉపన్యసించారు. ఆ వేడుకులు చాలా గొప్పగా చేశారు. శ్రీరామయ్యగారు కమ్యునిస్టు బావములు కలవారు కావున, వారిని ప్రభుత్వ బంధించుతుందని, అండర్‌గ్రౌండ్ అయినారు. తరువాత జైలుకు కూడ పోయారు.

1948లో శ్రీ వి.ఎబల్ టీచరుగారు వచ్చారు. వారు మా విద్యాభివృద్ధికై చాలా శ్రమ పడ్డారు. వారు ప్రతి రోజు ప్రార్థన చేయించి ''కా'' వత్తులు ఇసకలో దిద్దించేవారు, నోటితో ఒకటి నుండి 20 ఎక్కములు వరకు ప్రతి రోజు చెప్పించేవారు, క్లాసులను బట్టి పాఠాలు చెప్పించేవారు. ఒక్కొక్క తరగతివారికి ఒక్కొక్క రకమైన పనులు కల్పించేవారు. ప్రతి రోజు పలక పై లైను గీయించి కాపీలు వ్రాయించే వారు. డ్రిల్లు చేయించేవారు. డిక్‌టేషన్ చెప్పించేవారు. నోటిలెక్కలు చెప్పించేవారు. ఒక రూపాయలోని భాగములన్ని నేర్పించేవారు. నోటిలెక్కలలో నేను ఒకటి తరగతి అయిన, 5వ తరగతి పిల్లలతో పోటీపడి చెప్పేవాడిని, నా చేత అందరికి ముక్కు చెంపల కొట్టించేవారు. నేను భయపడి పెద్ద పిల్లలకు చిన్నగా కొడితే నన్ను పిలపించి ఇలా కాదు అలా గట్టిగా కొట్టు అని చెప్పేవారు. ప్రతి రోజు సాయంత్రం పూట కథలు చెప్పేవారు. రామాయణం, భారతం, క్రైస్తవ గ్రంథంలోని విషయములు అన్ని చెప్పేవారు. నలదమయంతి, నల మహారాజు, హరిశ్చంద్రుడు మొదలైన కథలు చెప్పారు. ఒకరోజు హరిశ్చంద్ర కథచెప్పుచుండగా చంద్రమతి, లోహితాసునకు, వచ్చిన కష్టములను కన్నులకుకట్టినట్లుగా చెప్పిన, కంటిలో నీరు ప్రవహించినది. ఆ విధంగా వారు కథలను చెప్పుచుండిరి. సినిమా కథలు, గుణ సుందరికథ చెప్పుచుండగా ప్రతి సంఘటన భయంతో నిండియున్నట్లుగా వాస్తవంగా సినిమా చూస్తున్నట్లుగా చెప్పేవారు, నేను వారినే నా ప్రథము గురువులుగా స్వీకరించాను. వారి పోత్సాహముతో రాత్రి పూట ప్రయివేటులు చెప్పించుకొని, ఫస్టుఫారం పుస్తకాలు ముందుగానే తెప్పించుకొని, ఇంగ్లీషు, హిందీ, తెలుగు, వడ్డీ లెక్కలు, చక్రవడ్డీ, భాగహారం, గుణకారం, శాతం లెక్కలు ముందుగానే నేర్చుకొన్నాము. నేను అందరికన్న చిన్నవాడను, ఒకటవ తరగతి తరువాత, రెండవ తరగతి పోకుండా 3 మూడవ, నాల్గవ తరగతి ఒకే సంవత్సరంతో పూర్తి చేసుకొని, ఐదవ తరగతి చదువ కుండానే ఫస్టుఫారం చేరాను. అప్పుడు పెనుకొండ హైస్కూలులో చేరుటకు పరీక్షలు నిర్వహిస్తుండిరి. మేము మొత్తం ఆరుమంది పరీక్షకు హాజరైనెము. బి.లక్ష్మానాయక్, బీ. నారాయణ నాయక్, కె. లక్ష్మనాయక్, పి. నరసింగ్‌నాయక్, కె. చీనియానాయక్, బి.చీనియానాయక్(నేను) మరియు పల్లెనుండి, రఘురాం రెడ్డి, విశ్వనాథ రెడ్డిలు.

1946 సం.లోనే పెనుకొండలో శ్రీ పూజారి చాంప్లానాయక్‌గారు బంజారా ఠక్కర్ బాబా హాస్టలు స్థాపించి ఉన్నారు. అందులో చేరి హైస్కూలో చదవలయునని చేర్పించారు. నన్ను చూచి హాస్టలు పిల్లలు, చిన్న పిల్లవాడు ఏడిస్తే వెంట తీసుకొచ్చారు. అనుకొన్నారట. నేను అట్ట తీసుకొని పరీక్షకు బయలు దేరి నప్పుడు తెలుసుకొన్నారట. వీడు హైస్కూలులో చేరటానికి వచ్చారని, ఆ పరీక్షలో మేము నల్గురు మాత్రం పాస్ అయినాము బి. లక్షానాయక్, బి. నారాయణ నాయక్, కె. చీనియనాయక్, నేను మిగిలినవారు ఫైల్ అయినారు. కాని ఋురాం రెడ్డి, విశ్వనాథ రెడ్డి గార్లను తరువాత చేర్పించినారు. కె. లక్ష్మానాయక్, పి. నరశింగ్‌నాయక్ అప్పుడే బుక్కపట్నంలో శ్రీ సత్యసాయి బాబా గారిచే, స్థాపించబడిన హైస్కూల్లో చేరి మూడు సంవత్సరములు ఒకే తరగతిలో ఉండి చదువు వదలి పెట్టారు. మా నాల్గురిలో. కె.

చీనియానాయక్ తొమ్మిదో తరగతి తప్పి చదువు చాలించాడు. నేను పదవతరగతి ఫైల్ ఆయి మానివేసినాను. బీ.నారాయత్ నాయక్ యస్.యస్.ఎల్.సి. తప్పి తిరిగి పాసయి బి.యస్సీ వరకు చదివారు. బి.లక్ష్మానాయక్ హైస్కూలు పూర్తిచేసి, ఇంటర్ మిడియట్ పూర్తి చేశారు. ఆ తరువాత తాండాలో పిల్లలు ఎక్కువ మంది హైస్కూలు చేరలేదు. ఒక హోర్జేనాయక్ మనములు తప్ప, మా నాల్గురిలో చాలా కాలం ఉద్యోగాలు లేక, వ్యవసాయం కూడ చేసాను మా అభివృద్ధి నిరోధం వలన తాండా ప్రజలతో పై చదువులపై మోజు తగ్గినది. కాని, మేము ఉద్యోగాలో చేరిన తరువాత, మా అభివృద్ధి, మా పిల్లల అభివృద్ధిని చూచిన తాండా ప్రజలు, ఒకరిని మించి, ఒకరు చదివించవలయునని పోటీపడి చదివించారు. ఈ రోజు తాండాలో డాక్టర్లు, ఇంజినీర్లు యం.ఏలు. బి.ఏ., బి.యస్సీలు, డిప్లొమాలు, కాలేజీ, హైస్కూలు విద్యా కలిగిన నిరుద్యోగులు 150 మంది పైబడి ఉన్నారు. కొంత మంది మాత్రమే ఉద్యోగాలు చేస్తున్నారు. అనగా 10% మంది 90% మంది నిరుద్యోగులు.

నా చిన్నతనంలో నాకు ఈత అంటే చాలా ఇష్టం. ఎల్లప్పుడు మా బావిలో ఈదు తుండేవాడిని. 6 లేక 7సం. ఉండవచ్చును. ఒక రోజు మా బావిలో ఈదుతుండగా, మా చిన్న తాత లక్షేనాయక్ వారి భార్య మా చిన్న(జేజీ) అవ్వ బావిలో బట్టలు ఉతుకు తున్నది. వారి చిన్న కుమారుడు చందేనాయక్ బావి గట్టు మీదకూర్చొని, నేను ఈత కొట్టేది చూస్తున్నాడు. మా అవ్వ బట్టలు ఉతకటంలో నేను నా ఈతలో మునిగి ఉన్నాము. నా ఈతను చూచున్న చిన్న పిల్లవాడు సుమారు 3లేక 3 1/2 సం. ఉండవచ్చును. బావిలో పడిపోయాడు. బావిలో పడి మునిగి పోతున్నాడు. ఆకస్మికంగా మా అవ్వ చూచుకొంది. గొల్లుమని ఏడ్పులంఘించు కొంది. నేను సడన్‌గా చూచాను, గట్టు పైకి ఎక్కుచుంటిని. పిల్లవాడు మునిగి పొతున్నాడు, చూచాను. అలాగే గట్టు మీదనుండి బావిలో దూకి వాడిని లాగుకొని వచ్చాను. మా అవ్వ గార్కి సంతోషం పట్టటానికే లేదు. నన్ను రకరకాలుగా ఆశీర్వదించింది. నీవు లేకున్న నా కుమారుడిని పోగొట్టుకోనే దాన్ని, అని ఈ విషయం తాండా అంతటా చెప్పినది. ఆ నాడు ధైర్యవంతులైన పిల్లలకు ఇచ్చే పురస్కారాలు లేవు. అయినా ఈ విషయం ఎవరికి చెప్పవలయును అను విషయం కూడ వారికి తెలియదు.

**తాండా అభివృద్ధి :** ఆనాడు తాండా అభివృద్ధి చేయవలయునన్న ఆ కాంక్ష ఆనాడు చదువుకొన్న వారిలో లేదు. నిజంగా పై తెల్పిన పితావత్ నారాయణ నాయక్, భజనే నాయక్, హోర్జే నాయక్, ఘణె నాయక్, రణజిత్ నాయక్ చదువు కొన్న వారిలో ముఖ్యులు, వీరు తెలుగు బాగా చదవటం వ్రాయటం వచ్చును. మిగిలినవారు స్కూళ్లకు పోయారు కాని, చదువు విలువ తెలియదు. స్కూలునుండి తప్పించుకొనుచుండిరట. మా నాన్నగారు చెప్పచుండెను. మీ తాతా అందరికి బడికి పంపాడు కాని నేను బడికి పొమ్మంటే, బడికి అనుకొని ఉన్న కొండ ఎక్కి దాగుకునే వాడిని, అన్నం టైములో ఇంటికి వచ్చేవాడిని. అయినా నాకు మంచి జ్ఞానమును కలిగించే నాల్గు పద్యములను నేర్పించినారు. యోగ్యతలేని వానికి అరటి ఆకులలో భోజన మేల, ఎంత వూదిన కరగని వెండి ఏల అను పద్యమును నేర్పించి మరియు పచ్చి మిరపకాయ, బాగైన వంకాయ, లేత చింత పండు, నెరుపు తోడు నెయ్యి వేసి పెట్టవే కన్న తల్లీ, అను పద్యంను నేర్పించారు. ఆ పద్యములు, నా జీవితంలో ఎంతో విలువను పెంచినవి. తండ్రి మీద గౌరవమును

పెంచినవి. నా తల్లికి నా చదువంటే చాలా ఇష్టము ఆమె ఎంతో కష్టపడి నాకు కావలసినవి సమకూర్చేది. నా చిన్నతనములో నెయ్యి, పాలు, పెరుగు, మీగడ, బెల్లమంటే నాకు చాలా ఇష్టము. ఒక డబ్బానిండా, మొలకెత్తిన ఎత్తిన సజ్జలు, నువ్వులు, బియ్యం వేయించిన ఉలవ బేడలు, బెల్లం కలిపి రోజు నేను స్కూలుకు పోయినపుడు ఇచ్చేది. సుమారు పాల డబ్బా నిండా అవి తినుటకు నా చుట్టు స్నేహితులు ఎక్కువగా చేరేవారు. అట్టివారిలో కె. లక్ష్మానాయక్, రంజిత్ నాయక్ కుమారుడు ముఖ్యులు తాండా స్కూలులో చదువుకొన్నంత వరకు మేమిద్దరం మంచి స్నేహితులం. చిన్ననాటి విషయములు ఎన్నో ఉన్నవి, కానీ అవి అన్నియు వ్రాస్తూ పోయిన పెద్ద గ్రంథము కావచ్చును.

తాండాలో చదువుకొన్న వారిలో రాజకీయ చైతన్యం కలిగిన శ్రీ యస్. ఘణె నాయక్ తాండాలో ప్రప్రథంగా తన ఇంటిలో స్త్రీలకు బంజారా దుస్తులను మాన్పించుటకు, చీరా, జాకెట్లును ప్రవేశపెట్టారు. అయినా తాండా మొత్తం దానిని ఆచరించలేదు. వారు కమ్యూనిస్టు ప్రభావితులై నారశింహపల్లి తాండా వదలి బుక్కపట్నంలో కాపురముంచాడు. అక్కడనే కమ్యూనిస్టు నాయకుల స్నేహంతో ఆ ఉద్యమంలో పని చేశారు. 8సం. జైలు జీవితం అనుభవించారు. మిగిలిన నాయకులు, తమ తమ సంసార సాగరంలను ఈదుకొంటూ పిల్లల విద్యాభివృద్ధికి పాటు పడవలయునని ఉండిరి. కె. హర్జీనాయక్ చాలా తెలివిపరుడు. అతని తెలివితేటలు, తాండా ప్రజలకు ఉపయోగపడలేదు. వారు ఎప్పుడు పల్లె ప్రజలతో స్నేహం చేసేవారు. వారికి తాండాలో కన్న చుట్టు ప్రక్కల పల్లె ప్రాంతాలలో మంచి పేరు. కానీ, తాండా ప్రజలలో మాత్రం వారంటే గౌరవం లేదు. తాండా న్యాయ వ్యవస్తను కాదని, ప్రభుత్వ వ్యవస్తను పరిచయం చేయించిన ఘనత వీరికే దక్కుతుంది. తాండాలో ఎవరికైన గొడవలు జరిగితే, పోలీసు స్టేషనులలో చెప్పటం, పోలీసులు తాండాకు రావటం వీరి పుణ్యాం వల్లనే ప్రారంభమైనది. ఆ నాటినుండి తాండాలో తాండా న్యాయ వ్యవస్త సన్నగిల్లి ప్రభుత్వ వ్యవస్త ప్రారంభమైనది. వీరికి తోడు వీరికుమారుడు కె. భీమానాయక్‌గారు కూడ తోడైనారు. నారశింహపల్లి తాండా అభివృద్ధి చెందుటకు ముఖ్య కారుకుడు కీ.శే. శ్రీ బాణోత్, గోపాల్ నాయక్‌గారు వీరికి చదువు వచ్చేది కాదు. ఒక సంతకం చేయటం మాత్రం నేర్చుకొన్నాడు. వీరికి చదువు రాకపోయనను, ప్రపంచ జ్ఞానం, రాజకీయ చైతన్యం కలవారు. వీరు తమ వ్యవసాయమును అభివృద్ధి చేయుటకు క్రొత్త క్రొత్త వంగడములను తీసుకొని వచ్చి, వాటిని తాండా ప్రజలకు పరిచయం చేసేవారు. ప్రభుత్వ అధికారులతో పరిచయం చేసుకొనేవారు. ఎవరైన తాండా చూచుటకు ప్రభుత్వ అధికారులు వచ్చిన వారిని గౌరవించి, వారికి అతిథి సత్కారములు చేసి, వారితో పరిచయం చేసుకొని వారి ఆదరాభిమాములను పొందేవారు. వారి సహాకారంతోనే తాండా అభివృద్ధికి పాటు పడినారు.

ఆ విధమైన సహకారముతోనే నారశింహపల్లి తాండాకు 1946లో గిరిజన శాఖ వారి సహకారంతో ఒక లేబర్ స్కూలును స్థాపించారు. దానికి తోడు ఉరవకొండ వెంకటంపల్లి తాండా, పెడపల్లి తాండా, శెట్టిపల్లి తాండాలలో, స్కూళ్లు స్థాపించారు. దానికి మిడ్డేమీల్ గ్రాంటును పొంది బడపిల్లలకు ఒక పూట భోజనం ఏర్పాటు చేయించారు. వారే ఈ మిడ్డేమీల్ ప్రోగ్రామును నడిపించారు. తన తాండా పిల్లలుకూ విద్యతోపాటు అన్నధానము కూడ చేయించారు. భోజనం చాలా ఆప్యాయంతో పెట్టుచుండిరి వారి సతీమణి శ్రీమతి సిత్కీభాయి

పిల్లలను చాల ఆదరణతో చూచేది. పిల్లలందరిని తన పిల్లలుగా బావించేది. మంచి రుచికరమైన వంటలు చేయించి పెట్టేది, నా చదువుగూర్చి మా అమ్మగార్ని ప్రొత్సాహించేది.

తాండా ప్రజలు నీటి గూర్చి చాలా అవస్థలు పడుచుండేవారు. ఒక చేదుడు బావి తాండాలో ఉంది. దానిని, తను కాంట్రాక్టు చేయించి ఆ బావిని, కొద్ది కొద్దిగా ప్రతి సంవత్సరం, ఎక్కడెక్కడి వడ్డెవాళ్లను తీసుకొని వచ్చి తోటాలు పెట్టించి, కష్టించి దానిని లోతుగా త్రవ్వించి, తాండా ప్రజలకు నీటి సమస్యను తీర్చారు. చిన్న చిన్న కాంట్రాక్టలు చేసి తన తాండానే కాకండ చుట్టు ప్రక్కల తాండాలలో కూడ చెదుడు బావులు త్రవ్వించి నీటి సమస్యకు పాటుపడినారు. వీరు చేస్తున్న ఈ అభివృద్ధిని కూడ సహించని వారు వీరిపై దుష్ప్రచారం కావించారు తన స్వంతానికి, తాను అభివృద్ధి చెందటానికి తాండా పేరు చెప్పుకొని, ఎవేవో లాభాలు పొందుతున్నారని ప్రచారం చేసేవారు. అయినా వారు తన మనస్సులోని ఆలోచనలను ఒదలి పెట్టేవారు కాదు. జిల్లాకు మారిన ప్రతి జిల్లా కలెక్టరును కలుసుకొని ఏదో ఒక అర్జీ సమర్పించి, వారి వెంటపడి కార్యమును సాధించేవారు. తాండా పిల్లలకు పాత బడిని (స్కూలును,) పడకొట్టించి, క్రొత్త బిల్డింగు కట్టించారు. తిరిగి దానిని అభివృద్ధికి, బల్లలు కుర్చీలు,బోర్డులు అన్ని తెచ్చి పెట్టేవారు. శ్రీ గోపాల్ నాయక్ గార్ని నేనంటే చాలా గౌరవము, అనంతపురంలో తన కుమార్తె తులసీ బాయి, అల్లుడు కృష్ణా నాయక్ ఉన్నా నాఇంటికి వచ్చేవారు. వచ్చేటప్పుడు 1/4 కె.జీ. బియ్యం కొని తెచ్చెవారు. ఎందకు పెద్దనాన్న అంటే, నీకు తెలియదు ఉరక ఉండురా. బియ్యం నీవు కొంటం లేదా అనే వారు. నీవు తాండాకు చేస్తున్న ఉపకారంలో. నీవు ఎప్పుడైన వచ్చితిని పోయే భోజనం నాకు ఎక్కువ అవుతుందా? ఇక మీదట నా ఇంటికి వచ్చినపుడు ఇటువంటిది చేసిన నేను ఒప్పుకోను. అలా చేసిన నా ఇంటికి రావద్దు అనే వాణ్ణి. అయిన వదలి పట్టేవారుకాదు. తన కుమారుడు బి.నారాయణ నాయక్, కుటుంబముతో ఉన్నా ఎక్కువ అక్కడ పోయేవారు కాదు. నా ఇంటికి వచ్చేవారు. కొడుకున్నారు కదా? అనే వాణ్ణి, ఎమోరా! నాకిష్టం లేదు అనేవారు. ఎందుకనగా తను రెండవ పెండ్లి చేసుకొన్నాడని, తమ ఆస్థిని రెండు వాటాలు పెట్టించాడని, తండ్రి పై కుమారునికి కోపం ఈ కారణంగా వారి ఇంటికి పోయెవారు కాదు.

వారి తరువాత తాండా అభివృద్ధికి పాటు పడినవారు నేను. నా ఆలోచనా విధానం ప్రస్తుత వాతావరణమునకు చెందినది. నేను తాండా ప్రజల మొత్తం వ్యవస్థను మార్పు గావించవలయునని, సమిష్టి వ్యవసాయమును స్థాపించాను. అంతకు ముందు 1964 లో అనంతపురం జిల్లా సంఘమును స్థాపించాము. ఆ మీటింగ్‌నకు మొత్తం జిల్లా నాయకులను పిలిపించాము. వారిలో గోపాల్ నాయక్, హర్జెనాయక్ వచ్చారు. హర్జెనాయక్, వీడు పేరు సంపాదించుటకు చేస్తున్నాడు అని దూరం వెళ్ళిపోయారు, గోపాల్ నాయక్ మాత్రం నా ఆలోచనా ధోరణికి ఆకర్షింపబడినారు. నేను తాండాలో ప్రజలందరిని సమీకరించి, సమిష్టి వ్యవసాయం గూర్చి తెల్పిన విషయాలకు ఆక్షరించబడినారు, సహకరించినారు. కాని, అది కూడా వ్యతిరేక ప్రచారం అందుకుంది. ఆ తరువాత, 1971 సం. ఆంధ్రప్రదేశ్ బంజారా విద్యావంతుల మహాసభను, నారశింహపల్లి తాండాలో , నేను కన్వీనరుగా ఏర్పాటు చేయడం జరిగినది. ఆ సభ, జయప్రదం చేయుటకు తాండా నాయకులు, పూజారి హంజేనాయకగారి ఇంటిలో సమావేశం జరిపించాను. మొత్తం ఆంధ్రప్రదేశ్‌లోని విద్యావంతులు వస్తున్నారు. మరియు జిల్లా కలెక్టరుగార్ని, జిల్లా పరిషత్ ఛేరమెన్‌గారు, జిల్లా అటవిశాఖాధికారిగారు, ఫాదర్ ఫెరర్

గారు, సమితి ప్రెసిడెంటుగారు, మరియు ఇతర అధికారులు వస్తున్నారు. తాండా అభివృద్ధికి ఎన్నో కార్యక్రమములు చేపట్టవలయును, చెన్నమ్మ చెరువు కట్టడం, తాండాకు రోడ్లు విద్యచ్ఛక్తి, పోస్టాఫీసు, సమిష్టి వ్యవసాయ సంఘ అభివృద్ధిగూర్చి, అని అందరికి నచ్చ చెప్పి, సమావేశం



సమిష్టి వ్యవసాయ ఆఫీసు స్థాపన ఎడమ ప్రక్కనుంచి శ్రీయుతులు చిన్న చందేనాయక్, బి. గోవిందనాయక్, బి. ధర్మానాయక్, బి. గో'పాల్‌నాయక్ - తాండా అభివృద్ధి కర్త, కరణం సుబ్బారావు, పెద్ద చందేనాయక్ - బి. చీనియానాయక్ తండ్రి, ఓబిరెడ్డి, వి.ఎం., తరువాత మూడవవారు బి. రామస్వామినాయక్, బి. చీనియానాయక్, గ్రామ నౌకరులు, బి. పూరియానాయక్, మరియు సంఘ సభ్యులు

కూర్చున్నవారిలో ఎడమ నుంచి కమలియానాయక్, చిన్న పూరియానాయక్, రామదాస్‌నాయక్, జీవలానాయక్, నరసింగ్‌నాయక్, బి. లింమ్యూనాయక్, బి. జిగడానాయక్, లక్ష్మానాయక్, లోక్యానాయక్, దూదియానాయక్, భీముడునాయక్

జయప్రదంచేయుటకు, తాండా పేరు చరిత్రలో నిల్చుటకు సహకరించవలయునని, తెల్పిన తాండా నాయకులందరు ఒప్పుకొనగా, శ్రీ హార్జేనాయక్‌గారు, గబుక్కున లేచి, వీడు వీని పేరు తెచ్చుకొనుటకు చేస్తున్నాడని, బుర్రమని వెళ్ళి పోయారు. ఇది చూచిన తాండా నాయకులు ఒక్కొక్కరు, జారి పోయినారు. కాని విషయమును గ్రహించిన గోపాల్‌నాయక్‌గారు నీవు భయపడ వద్దు నేను నీకు తోడుగా ఉంటాను.

ఈ మీటింగుకు గాను, వచ్చేవారి భోజనమునకు నేను ఒక బస్తా బియ్యం ఇప్పిస్తాను అని చెప్పి బియ్యం ఇప్పించారు. ఆ తరువాత మా తండ్రి సహాకారంతో అందరికి మాంసార విందు. భోజనం చేయించి, మీటింగ్‌ను జయప్రదం చేయించాను. కానీ ఈ నాడు తాండానుండి నాతోపాటు చదువుకొన్న విద్యాధికులుగాని, ఒక్కపైసా సహాయమును అందించలేదు, పైగా

తప్పుడు ప్రచారం గావించారు. వీడు మిమ్మల్లందరిని మోసం చేస్తున్నాడు. మీ అందరి పేర ఏవో స్కీములు తెప్పించి, కాజేస్తున్నాడు. అంత మాత్రం మేము చేయలేమో, వీడొక్కడేనా చదువుకొన్నవాడు. వీడికేనా తాండా అభిమానం ఉండేది, మాకు లేదా? మెము తలచుకొంటే అంతకన్నా ఎక్కువ చేయగలం అని ప్రచారం గావించారు. ఇవి విన్న అమాయాక ప్రజలు, నన్ను కాదనలేక, నాకు వారు మనస్ఫూర్తిగా సహకరించలేక ప్రతి విషయంలో ఆటంకాలు జరిగినవి. ఆ మీటింగ్ ద్వారా వెంటనే 7 లక్షలతో రూ. చిన్నమ్మ చెరువు కట్టడం మంజూరు చేశారు. వెంగళమ్మ చెరువు రోడ్డు ప్రారంభించుటకు, వెంగళమ్మ చెరువు ప్రజలే ముందుకు వచ్చి కలెక్టరు వారితో రోడ్డు ప్రారంభానికి, పూనుకొని, ఎవరి పొలం వద్ద వారే కంట్రాక్టు తీసుకొని వెంగళమ్మ చెరువునుండి తాండా వరకు రోడ్డు వేయడం జరిగినది. వెంటనే పోస్టాఫీసు మంజూరు చేశారు. విద్యచ్ఛక్తి కూడ మంజూరు చేయుటకు ఏర్పాటు గావించారు. తాండాలో భూములు రిక్లమేషన్‌లు, 3 లక్షలు మంజూరు చేసారు పాడి పశువులు ఇప్పించాను. ఈ విధంగా మొత్తం 15 లక్షలు రూపాయలు తాండా అభివృద్ధికి ప్రభుత్వం ద్వారా మంజూరు చేయించడం జరిగినది. దీనికి వారు చెప్పే సమాధానం ఏమంటే, గవర్నమెంటువారు చేసారు. ఏం చీనియానాయక్ తన ఇంటినుండి చేసాడా? అని చెప్పినారు. ఎంతమంది చదువుకొన్న, తమ సొంతమునకు పాటుపడిన వారేకాని, తమ పుట్టిన జన్మభూమికి సేవ చేయువలయునను ఉద్దేశ్యం ఇసుమంతయులేదు. ఈ విధంగా కీ.శే.శ్రీ బి. గోపాల్‌నాయక్‌గారు నా ద్వారా ఆ తాండా అభివృద్ధి చెందినది అని సగౌరవంగా చెప్పుచున్నను.

**తాండా రాజకీయం :** ప్రతి తాండాలో కానీ, ప్రతి గ్రామంలో కాని ఏదో ఒక రాజకీయం లేనిది అది ఊరు కాదు, తాండాకాదు. పూర్వం మా తాండా ప్రజలు గుంపులు గుంపులుగా ఏర్పడి మైసూరు రాష్ట్రమునకు పోయి వ్యాపారం చేస్తుండేవారు. కొంత మంది దేశిమి(మైసూరు) ఎద్దుల వ్యాపారం చేసేవారు. పూర్వంనుండి వీరి వృత్తియే వ్యాపారం. స్థిర నివాసం ఏర్పరచుకొన్న వీరు వీరికి అనుకూలమైన ఏదో ఒక వ్యాపారం చేసేవారు. దీపావళి అయిన తరువాత వారు తిపటూర్, శివమోగ్గాలనుండి, దక్షిణ కనుమలలో నివాసమున్న కొంకణి వారికి అవసరమైన కంబళ్ళు, కొబ్బరి గిన్నెలు, ఎంచిన పప్పులు తీసుకొని పోయి అక్కడినుండి వక్కలు వస్తు మార్పిడి పద్ధతిలో వ్యాపారం చేసి రెండు, మూడు నెలలోనే బస్తాల నిండా ఒక్కొక్కరు, 10,15,20 బస్తాల వరకు వక్కలు జమ చేసుకొని వచ్చేవారు. వాటిని రాసులుగా పోసి, వాటి రకాలను విడగొట్టి, వాటిని ఈ ప్రాంతం పల్లెలకు పోయి అమ్ముకొనుచుండిరి. ఈ విధంగా మా ఇంటిలో పండెండు బస్తాల వక్కలు ఉండెను. మానాన్న, మా పెద్దనాన్న చాంప్లానాయక్ కలసి చేసారు.

ఆ రోజులలో మా ఇల్లు, పూజారి హోంజే నాయక్‌గారి ఇల్లు ప్రక్క ప్రక్కలో ఉండేది. కొండ ప్రాంతం నుండి, వచ్చే నీరు మా ఇంటి మీదుగా పోయేది. ఆ నీరు రాకుండా చేయవలయునని, ఒక కట్ట అడ్డం వేసారు. దానికి పూజారి హోంజేనాయక్ పోట్లాటకు వస్తే మా వాళ్ల బలం ఎక్కువ ఆగుటవలన, మా తాతగారు తీసుకున్న 300 రూ.గాను, హామిగా మా ఊరి ప్రక్కన ఉన్న ఎర్రమారు చేను సుమారు 3.95 సెంట్లు + అయ్యవారగడ్డ పొలం 1.25 ఎరకములు జమీనుగా ఇచ్చాడట. దానిని మీరు ఎలా తీసుకొంటారు. అని చెప్పారు. అదేమిటి? ముందు మాటే కదా? మీ డబ్బులు మీకిచ్చిన మా పొలం వస్తుంది అన్నారట మానాన్నగారు.

అలాగైతే ఇప్పుడు ఇవ్వండి అని జోలిపట్టి చెప్పిన, మా పెద్దనాన్న బేరో చాంప్లానాయక్‌గారి వద్ద ఉన్న 300 రూ. తీసుకొని వచ్చి టవల్‌లో వేసేలోపు యస్. ఘణేనాయక్ వచ్చి ఆ టవలను వెనక్కి లాగు కొన్నాడట. అంతటితో పోరు ప్రారంభమైనది. వారి ప్రక్క ఘణేనాయక్, మా ప్రక్క హర్జేనాయక్. ఆ సంవత్సరం, కృష్ణస్వామి పూజ తాండాలో పొటిగా రెండు చోట్ల చేసారు. శ్రీ పూజారి హంజేనాయక్ ఇంటివద్ద. రెండవది హొర్జేనాయక్ ఇంటివద్ద, ఆ విధంగా సుమారు 10 సం. ఆ పోరాటం సాగినది. నేను చాలా చిన్న పిల్లవాడిని, ఇవన్నియు ప్రేక్షకుడుగా చూస్తుంటిని. ఎల్లప్పుడు కోర్టులు, వకీళ్లు, కచేరీలు తిరగటమే. ఎంత చేసిన అది ఆఖరుకు పాముదుర్తి వారే న్యాయం చేసారు. వీటికి రాత కోతలులేవు. వకీళ్ళు కల్పించిన కట్టు కథలే. మొత్తం డబ్బును దోచుకున్నారు. హర్జేనాయక్‌గారు వకీళ్ల కివ్వాలి, గుమాస్తాలకివ్వాలి అని మా నాన్న దగ్గర గుంజటమే. పాపం అమాయకుడు అతను ఎంత చెప్పితే అంత అందించటమే. బాకీలు చేసి అయిన ఇవ్వటమే. ఆఖరుకు, కోర్టులో అనగా మా పెద్దనాన్న మానాన్నగారు, పూజారి హొంజేనాయక్  నా డబ్బు 300 రూ. ఇచ్చిన వెంటనే మీ భూమి మీకు ఇస్తాను. అని చెప్పలేదని, పెనుకొండ ఆంజనేయ స్వామి ముందు ప్రమాణం చేసి, మెడలో పూలహారం వేసుకొని, పెనుకొండ కోటలో వీధులు వెంట ఊరేగించిన, మెము వదలిపెడతాము అని చెప్పగా, అలాగే ప్రమాణం చేసి వదలి పెట్టారు. ఆ తరువాత పాముదుర్తి బయపరెడ్డిగారి ద్వారా పంచాయితి చేయించి, ఖర్చులకు గాను 300 రూ. ఇవ్వవలెనని పూజారి హొంజేనాయక్‌గారి నుండి ఇప్పించారు. అది మా పెదనాన్న డబ్బు నారాయణ నాయక్ తీసుకొన్నారు. వారికి 5వ వాట వస్తుంది, వారు మా నాన్నకు ఇవ్వకుండా తానే ఉంచుకొన్నారు. వారితో మా నాన్న చిన్నాన్నగార్ల పోట్లాటలు రెండు మూడు సంవత్సరములు జరిగినది. తాండా మొత్తం పూజారి హొంజేనాయక్ ప్రక్క హొర్జేనాయక్ ఒక్కడే మా ప్రక్క ఈ విధంగా మా నాన్న అమాయకత్వమును అసరాగ చేసుకొని రాజకీయం ఆడేవాడు. మంచి తీయ తీయని మాటలు చెప్పేవాడు. ఆ మాట మా నాన్న నమ్మేవాడు ఇద్దరికి మంచి స్నేహం.

ఒకసారి మా నాన్నను మోసగించి, పాముదుర్తి సుంకు నాగేషం శెట్టి నీ ఇంటిని జప్తి చేయించుటకు వస్తున్నాడని నమ్మించి, నీ ఇల్లు జప్తి చేసిన నీ ఇంటిలో ఉన్న ఇనుప పెట్టిని (మేడ్ ఇన్ ఇంగ్లాండు) ఎత్తుకు వెళ్ళవచ్చు. మీ నాన్న వసరాం నాయక్‌గారు, బాకీ ఉన్నాడట, బుక్కపట్నంలో కోమటివాళ్లు చెప్పకొనుచుండగా విన్నాను అని చెప్పి, నమ్మించాడు. అలాగైతే ఎలా అని సలహా అడిగాడు. ఆ ఇనుప పెట్టి నా ఇంటిలో పెట్టించు అన్నారు. నీ ఇంటిలో పెట్టిన తెలియాదా? అన్నాడు అలాగైతే నేను నీకు 100 రూ. ఇచ్చినట్లు. ఆ బాకి క్రింద నేను ఇనుపెట్టి, నా ఇంటిలో పెట్టినట్లు చెప్పవచ్చు వారువచ్చి పోయిన తరువాత ఆ పెట్టి తిరిగి నీవు తీసుకొని పోవచ్చు అన్నాడట. అలాగే అని ఎవ్వరికి తెలియకుండ ఈ విషయం రహస్యంగా ఉంచుకొని, ఆ పెట్టె తన ఇంటికి తీసుకొని పోయాడు. ఆ తరువాత పాముదుర్తి సుంకు నాగేశం శెట్టి రాలేదు. ఏమిటి అన్నా! నా పెట్టి నేను తీసుకొపోతాను అంటే, ఏమిటి నీపెట్టె ఎక్కడ ఉన్నది. నాకు 100 రూ. అమ్మినావు కదా? ఇదిగో అమ్మినట్లు కాగితం అని అందరికి చూపించాడట. ఈ విధంగా మోసగించినారు.

ఒకనాడు మా అమ్మ, మా పిన్నమ్మ తులసి బాయి తోడికోడండ్లు పోట్లాడుకొనుచున్నారు. మధ్యలో మా నాన్న బి. చందేనాయక్ దండించాడు. మా పిన్నమ్మ

కోపంలో మా నాన్ననేదో అన్నది. అదే కోపంలో మా నాన్న ఒక చిన్న కట్టె విసిరాడు. అది మా పిన్నమ్మ తలకు తగిలి వెంటనే రక్తం వచ్చింది. అది చూచిన(వి.ఏ.ఓ) రెడ్డి పనిచేస్తున్న కె. భీమానాయక్ వెంటనే అర్జి రాసి పోలీసు కేసు పెట్టారు. కోర్టునుండి సమను వచ్చింది. పెనుకొండనుండి. అది చూచి మా నాన్న ఆశ్చర్య పోయాడు. ఏమిటి అనగా, పోట్లాడిన విషయం వారు పోట్లాడి ఎప్పుడో మరచి పోయారు. కానీ కోర్టుకు, మా నాన్న మా పిన్నమ్మ పోయి మాకేమి తగాదాలు లేవు. మా ఇంటి విషయంలో జరిగినది అని చెప్పిదాన్ని మాఫీచేయించుకొని వచ్చారు. ఈ విధంగా తండ్రి ఊర్లో ఉంటే కొడుకు కోర్టులో, కొడుకు కోర్టులో ఉంటే, తండ్రి ఊర్లో ఉండేవారు. ఒక్కొక్క సారి ఇద్దరు అదే పని మీద ఉండేవారు. ఆ తరువాత 1955 సం. లో వెంగళమ్మ చెరువు నిండి, మాగాణి పొలం దున్నుచుంటిమి. ఆ పొలందున్నేటప్పుడు భూమి అంతా వంకమయమైనది. భూమి కోతపడినది. చెర్లో పల్లి నేసే గందోడి వారి పొలం పూర్వం మా తాతాగారు కొన్నారు. నాల్గు వాటలలో 3 వాటాలు కొని ఒక వాటాదారు మాత్రం సాగు చేసుకొంటున్నారు. ఆ పొలం చేసే పెద్దామె, భూమి అంతా వంకలో కలసి పోయినది. అదిగో నంబరు రాయి, అక్కడివరకు మన పొలం గట్టు ఉన్నది అని చూపించింది. అలాగైతే భూమిని, కొంత, కోతనుండి తొలగించవలయునని, ఆ ప్రాంతమంతా దున్నినారు. ఆ ప్రాంతంలో శ్రీ హర్జేనాయక్‌గారి పంతం ఉండేదట. ఆ విషయం తెలుసుకొన్న హర్జేనాయక్‌గారు మండిపడి, నా పంతమును మీరు లేకుండా చేస్తారా! మీ బాణోత్ వారి అంతం చూస్తాను అని పరాక్రమం చేస్తు కోర్టులో కేసు పెట్టారు.

దానికి విరుగుడుగా మా వారు కేసు పెట్టారు. పూర్వం మా తాతాగారు, వారి నాన్న స్నేహంపై అక్కడ వారికి పంతం ఏర్పాటు చేయుటకు, వంక నీటిని, తమ పొలంనకు తీసుకొని పోవుటకు ఏర్పాటు చేసుకవన్నారట. ఆ కాలువ, మా మాగాణి గుండా మధ్యలో పోవుచున్నది. వారు కాలువ తీసినప్పుడల్లా కొంతభూమిని వంకలో కలిపి వేస్తున్నారు. అయిన మావారు ఉరుకున్నారు. మా పెద్దలకు ఎందుకు పంతం పీకేసారట సారట అని అడిగి ఉన్నా, వారు కాదు అనే వారు కాదు. కానీ అలా అనే స్వభావం అతనిలో లేదు. తనకున్న విద్యాగర్వంతో, మా వాళ్ల అమాయకత్వంను అసరాగ తీసుకొని, వీరిని బెదరించుటకు చూచాడు. కానీ మా వాళ్లు కూడ అతి తెలివిపరులు. ఇదే సమయం ఇతని ద్వారా మన పొలం అంతా వంక పాలు, అగుచున్నది.అని గట్టిపట్టు పట్టినారు. అక్కడకివారికి చెప్పారు. మాకు తెలియదు పిల్లలెవరైన చేసిఉంటారు, పోనిలే అని, అయినా ఒప్పుకొన్నవాడు కాదు. కేసు బనాయించారు. ఆఖరుకు తేలినది ఏమనగా, వెంగళమ్మ చెరువు నీళ్లు వెంగళమ్మ చెరువు పొలిమేర, పొలం వరకే, ఆ తరువాత ఆ నీరు అంతయు వంక ద్వారా అగ్రహారం చెరువుకు పోవలయును, వారి పొలంనకు కాలువ లేదు. ఉచ్చ నీటితో సాగు చేసుకొనవచ్చును. ఈ విధంగా మొత్తం సుమారు పది సంవత్సరములు ఆ విషయంలో కోర్టు చుట్టు తిరిగి వేల రూపాయలు ఖర్చు పెట్టించారు. ప్రతి గ్రామమునకు , తాండాలకు 100కి, ఇద్దరు లేక ముగ్గురు ఉంటారు. వారు బాగుపడరు. ఒకరిని బాగుపడనీయరు. అందువలననే గ్రామములో అశాంతి ప్రబలి ప్రజలు ఎన్నో రకాల ఇబ్బందులకు గురి అగుచున్నారు. ఎంత చదువు చదివినా జ్ఞానమన్నది, పుట్టుకతో రావలయునంటారు. చదువు వలన కాదు. చెడు అని తెలిసి కూడ, వారి బుద్ధి చెడు ప్రవర్తనలపైపే పోతుంది. ఇది ఉన్న వ్యక్తి ఎప్పుడు బాగుపడడు. వీరి కారణంగా, పూర్వంనుండి వస్తున్న

పంచాయితీ వ్యవస్థ, న్యాయం కుంటుపడింది, గ్రామ అభివృద్ధి నిరోధకులుగా చరిత్రలో మిగిలిపోయారు.

**ఐకమత్యం - స్త్రీల స్వభావం :** నారాశింహ పల్లి తాండాలో స్త్రీలు చాలా గొప్పవారు ఉండిరి వారిలో రాజపుత్ర స్త్రీ కళ ఉట్టిపడుచుండెను. చాలా అందంగా, గంభీరంగా, బలిష్టంగా శరీర లావణ్యమును కలిగి ఉండిరి. ఆటపాటలో ఒకరిని మించి ఒకరు ఉండిరి. గుణగుణములలో కూడ మంచి స్వభావమును కలిగి ఉండిరి. తాండాలో, ఏదైన శుభ కార్యములను చేయవలయునన్న అందరిని ఇంటింట పోయి పిలిచి వచ్చేవారు. పెండిండ్లు జరిగిన, పిల్లలు జన్మించిన వారికి రకరకముల కార్యక్రమములు వేకల్సేరో, దలవాధోకాఏరో, దాగ్‌దేరో, ఝూలిమా ఘాలేరో, పగళ్యా పడాపయేరో అనగా కాన్పు, తల్లి బాలెంతి జాగ్రత్త, పసిబిడ్డకు వాతలు వేసేది. ఉయ్యాలలో వేసేది. నడక నేర్పించే కార్యక్రమములలో అందరు పాల్గొని, పాటలు పాడి ఆ కార్యక్రమమును జయప్రదం చేస్తుండిరి. ఆడపిల్లలు పెద్దవారై( కాలీ పేరాఏరో) జ్యాకెట్లు తొలగించే కార్యక్రమం పెండిండ్లలో, సాడి తాణేరో, ఘోటా కాడేరో, వియా భాందేరో, చూడో తిపాఏరో, వళాఏరో మరియు పెండ్లిలో పెండ్లి కుమార్తెకు ''ధావలో'' నేర్పించే కార్యక్రమములు, పండగలలో దేవి పూజలలో, ఆ దేవికి సంబంధించిన పాటలు, పాడవలయునంటే ముఖ్యంగా మా పెద్దమ్మగార్లు ఖూబేనాయక్‌భార్య చింగలిబాయి, భీకేనాయక్ భార్య సక్రిబాయి, గోపేనాయక్ భార్య సీతాబాయి, మా చిన్న అవ్వలు - ధానీబాయి, బుదేలానాయక్ భార్య రంఖీ బాయి మొదలైనవారు చాలా గంభీరంగాను, భక్తితోను పాడేవారు. వారి పాటలు వినేవారకి, వినిసొంపుగాను, మంచి ఆనందమును ఆహ్లాదమును కలుగచేసేవి. ముఖ్యంగా నేను గ్రహించిన విషయం ఏమనగా కరంతోట్‌వారి ఆడ బిడ్డలకు బాణోతవారి ఆడ బిడ్డలలోని గుణములు ఏమనగా. బాణోత్‌వారి పిల్లలను కరంతోట్ వారికి ఇచ్చిన వారు తమ ఇంటి రహస్యములను తమలో దాచుకొని, భర్తలకు సహకరించే వారు. కానీ కరంతోట్‌వారి పిల్లలు బాణోత్ వారికి ఇచ్చిన అన్నదమ్ములమీదవున్న అభిమానముతో వారి ఇంటి రహస్యాలను వారికి అందచేసేవారు. ఈ విధంగా కొన్ని కలతలను అప్పుడప్పుడు కలుగ చేస్తుండేవారు.

ఆడవాళ్లందరు, ఒకరికొకరు అన్యోన్యంగా, సహకరించే గుణం కలిగి ఉండేవారు. వారు ఏ కార్యం చేపట్టిన ఒకరిని ఒకరు విడిచి పెట్టి ఉండేవారు కాదు. ఇంటిపనులలో కానీ, వంటలు చేయటంలో కానీ తమ డ్రస్సులు తయారు చేసుకొను విషయంలో ఒకరికి ఒకరు సహకరించుచుండిరి. స్త్రీలు తమకు కావలసిన గుడ్డలు తామే తయారు చేసుకొంటారు. కాలి, ఛాంటియా, ఫేటియా మొదలగునవి.

ఛాంటియాకు కావలసిన ఘంగటో, పాటో, లాపోలను రకరకాల ఎంబ్రయిడరి చేసి, అద్దాలను అమర్చి, వెండిగజ్జలు, వెండి బిళ్ళలు కలిపి వారి తీరిక వేళలో ఒకరికొకరు సహకరించి కుడుతుంటారు. అలాగే కాలీకి కావలసిన, పాటా ఖవ్‌య్యా పేటి వాటిని జోడించుటకు, అద్దాలు అమర్చిన ఖవ్‌య్యా, థన్ థన్‌యా, వేటీ, ఫూందా అనువాటిని పీసుల పీసులుగా తయారు చేసుకొంటారు. అలాగే ఫెటియా(లంగాకు) కావలసిన లేపో మందంగా, అద్దాలతో రకరకాల ఎంబ్రయిడరితో కుట్టి తయారు చేస్తుంటారు. ఘోరో, లామన్, సడకే అనునవి తయారు చేస్తుంటారు. వీటన్నింటిని వీరు ఏ పని చేసిన తమ వెంట ఉంచుకొనే ఉంటారు.

కొద్ది సమయం దొరకిన చాలును. కుట్టుకుంటూ కూర్చుంటారు. మరియు ఇంటిలో పెండ్లి కావలసిన ఆడ పిల్లలు ఉన్న వారికి చిన్నప్పటినుండే పై వాటిని తయారు చేసుకొనుచు వుంటారు. ఇవి అన్నియు ఎప్పటి కప్పుడు తయారు చేసుకొని, వేసవి కాలం వచ్చినప్పుడు వాటికి కావలసిన క్రొత్త గుడ్డలను భర్తల ద్వారా సంతలోగాని, పట్టణాలకు పోయినప్పుడు గాని తెప్పించుకొని, ఒక్కొక్కటి జోడించుకొని, ఫేటియా, ఘాంటియా, కాలీలు తయారు చేసుకొంటారు. ఒక్కొక్కరు 4 లేక 5 జతల వరకు తయారు చేసి ఉంచుకొంటారు. ఈ విధంగా వారి తీరిక సమయములు వృధా కాకుండా సద్వినియోగ పరచుకొంటూ ఉంటారు.

ఇక వెన్నెల రోజులలో రాత్రి పూట పాటలు పాడుకుంటు, డ్యాన్సులు చేసుకొంటు ఉండేవారు. ప్రతి ఇంటి ముందు పెద్ద పెద్ద మైదానములు(లోగిళ్లు) ఉండెను. తాండాలోని ఆడవాళ్లు 10లేక 15 కుటుంబములవారు ఒక్కచోట కలసి రాత్రులలో వెన్నెల ఆనందాన్ని పంచుకొనేవారు. మేము చిన్న పిల్లలుగా ఉన్నప్పుడు, తూర్పు భాగంలోని ఖిరే నాయక్ ఇంటి ముందు, ఉత్తర భాగంలో పితావత్ నారాయణ్ నాయక్ ఇంటిముందు, పశ్చిమ భాగంలో అంగడి హాంజే నాయక్, రణజిత్ నాయక్, హారెనాయక్ ఇంటిముందు, మధ్య తాండాలో భజినే నాయక్ ఇంటిముందు, ఒక్కొక్కసారి మా ఇంటి ముందు, ఆడ మగ అందరు కలసి, ఆడుతూ పాడుతూ ఉండేవారు. హోలి పండుగ రోజులలో పూజారి హాంజే నాయక్ ఇంటి ముందు. హోలి లేంగి, ఒక ప్రక్క మగవాళ్లు, మరో ప్రక్క ఆడవాళ్లు పాటలు పాడుకొంటూ డ్యాన్సులు చేస్తూ తమ ఆనందాన్ని పంచుకునేవారు. మేము చిన్న పిల్లలుగావున్నప్పుడు. దాగుడు మూతల ఆటలు ఆడుకొనేవారం. చేతి నిండా మట్టి తీసుకొని, కండ్లకు గంతలు కట్టి కుప్పలు కుప్పలుగా వేసి వచ్చే వాళ్లం. దానినితిరిగి ఎక్కడ వేసినది. కనుగొనవలయును. అటువంటి రకరకాల ఆటలు, చంద్రుడు మునిగే వరకు ఆడుకొంటూ ఉండేవారు. వేసవి కాలంలో చేలు అన్నియు బీళ్ళుగా ఉంటవి. అప్పుడు, తాండాలో కాకుండ చేలలో పెద్ద మైదానాలు ఉంటాయి. అక్కడ, పిల్లలు, పెద్దలు, అందరు కలిసి చాల రకాలు ఆటలు ఆడుకొనేవారు, ఆ విధంగా తాండా ప్రజల జీవితాలు ఆనందంతో తులతూగేవి.

బంజారా కుటుంబము-కీ.శే. శ్రీ బి. బోడియానాయక్ శ్రీమతి చౌలిబాయి (లాలిబాయి)

## అఖిల భారత బంజారా సేవా సంఘము స్థాపన పట్టిక /All India Banjara Seva Sangh Organisation Table

- దక్షిణ భారత మండల సంఘము / **South India Mandal Sangh**
- పశ్చిమ భారత మండల సంఘము / **West India Mandal Sangh**
- ఉత్తర భారత మండల సంఘము / **North India Mandal Sangh**
- తూర్పు భారత మండల సంఘం / **East India Mandal Sangh**

### రాష్ట్ర సంఘములు / State Sanghas

- South India: మైసూర్ Mysore, కేరళ Kerala, తమిళనాడు T.Nadu, ఆంధ్రప్రదేశ్ A.P
- West India: మహారాష్ట్ర M. Rastra, గుజరాత్ Gujarat, మధ్యప్రదేశ్ M.P., రాజస్థాన్ Rajastan
- North India: ఉత్తరప్రదేశ్ U.P., పంజాబ్ Punjab, హర్యానా Haryana, హిమాచల్‌ప్రదేశ్ H.Pradeh, జమ్ము,కాశ్మీర్ J. K.
- East India: ఒరిస్సా Orissa, బెంగాల్ Bengal, బీహార్ Bihar, అస్సాం Assam, త్రిపుర Tripura, మణిపూర్ ,Manipur

### ప్రాంతీయ సంఘములు / Regional Sanghas (A.P)

- రాయలసీమ ప్రాంతము / **Rayalaseema Region**
- సర్కారు ప్రాంతము / **Sarkar Region**
- ఉత్తర తెలంగాణా ప్రాంతము / **North Telangana Region**
- దక్షిణ తెలంగాణా ప్రాంతము / **South Telangana Region**

### జిల్లా సంఘములు / District Sanghas

- Rayalaseema Region: ఒంగోలు కర్నూల్ కడప చిత్తూర్ అనంతపూర్ — Ongole Kurnool Cudapah Chitoor Ananthapur
- Sarkar Region: నెల్లూరు గుంటూరు కృష్ణా ప.గో. తూ.గో. వి.నగర్ విశాఖ శ్రీకాకుళం — Nellore Guntur Krishna W.G., E.G, V.Nagar Vizag Srikakulam
- North Telangana Region: ఆదిలాబాద్ నిజామాబాద్ కరీమ్‌నగర్ వరంగల్ ఖమ్మం — Adilabad Nijamabad Karimnagar Warngal Khamam
- South Telangana Region: నల్గొండ మహబూబ్ నగర్ హైదరాబాద్ రంగారెడ్డి మెదక్ — Nalgonda Mahabubnagar Hyderabad Ranga Reddy Medak

## అనంతపురం జిల్లా సంఘం/ ANANTAPUR DISTRICT SANGH

### శాసనసభ స్థాన సంఘాలు / ASSEMBLY CONSTITUENCY SANGHAS

- కదిరి Kadiri
- నల్లమడ Nallamada
- గోరంట్ల Gorentala
- హిందూపురం Hindupur
- మడకశిర Madakasira
- పెనుకొండ Penukonda
- ధర్మవరం Dharmavaram
- కళ్యాణదుర్గం K. Durgam
- రాయదుర్గం Rayadurgam
- ఉరవకొండ Urvakonda
- గుత్తి Gooty
- అనంతపురం Ananthapur
- శింగనమల Singanamala
- తాడిపత్రి Tadipatri

### మండల సంఘాలు/MANDAL SANGHAS

(under Gorentala)

- గోరంట్ల /Gorentala
- క్రొత్తచెరువు/ Kottacheruvu
- పుట్టపర్తి / Puttaparthi
- బుక్కపట్నం/ Bukkapatnam

### తాండా సంఘాలు / THANDA SANGHAS

(under Bukkapatnam)

- మదిరేబైలు తాండా Maderebylu Thanda
- వాలేనాయక్ తాండా Valenaik Thanda
- రామస్వామి తాండా Ramaswamy Thanda
- రామ్లానాయక్ తాండా Ramlanaik Thanda
- జల్వబోయనపల్లి తాండా Jalvaboinapalli Thanda
- నారసింహపల్లి తాండా Narasimhapalli Thanda
- బాలేనాయక్ తాండా Balenaik Thanda
- చిన్నచెరువు తాండా C. Cheruvu Thanda
- రెడ్డివారిపల్లి తాండా Reddivaripalli Thanda
- పొడరాళ్ళపల్లి తాండా Podarallapalli Thanda
- మారాల తాండా Marala Thanda
- సిద్ధరాంపురం తాండా Siddapuram Thanda
- నేలకోట తాండా Nelakota Thanda

1. ప్రజా సంఘాలు పై నుండి స్థాపించుకొంటు రావాలి. / **Sanghas should be organised from top level.**
2. క్రింది నుండి అభ్యర్థులను ఎన్నిక చేసుకొంటూ పోవాలి. **Members should be elected from Thanda level.**

# రాజకీయ విస్తరణ పట్టిక/ POLITICAL TABLE

దక్షిణ మండలము
**South Mandal**

పశ్చిమ మండలము
**West Mandal**

1. మహారాష్ట్రము/ Maha rastra
2. రాజస్థాన్ /Rajastan
3. గుజరాత్ /Gujrat
4. మధ్యప్రదేశ్ / M.P.

ఉత్తర మండలము
**North Mandal**

1. జమ్ముకాశ్మీర్/ Jammu Kashmir
2. పంజాబ్ / Punjab
3. హరియానా/ Haryana
4. హిమాచల్ ప్రదేశ్/ H.Pradesh
5. ఉత్తర ప్రదేశ్/ Uttar Pradesh

తూర్పుమండలము
**East Mandal**

1. బీహార్/ Bihar
2. ఒరిస్సా/ Orissa
3. బెంగాల్/ Bengal
4. అస్సాం/ Assam
5. త్రిపుర, మణిపూర్/Tripura, Manipur

రాష్ట్రములు – రాష్ట్రప్రభుత్వములు/ **STATES - STATE GOVERNMNETS**

1. కేరళ రాష్ట్రము/ Kerala 2. తమిళనాడు/Tamilnadu 3. మైసూర్ రాష్ట్రము/Mysore 4. ఆంధ్రప్రదేశ్ / Andhra Pradesh

ప్రాంతీయబోర్డులు –ఎం.పి. లు, ఎం. ఎల్. ఎలు, జిల్లా ప్రజా పరిషత్ ఛైర్మన్‌లు, కార్పొరేషన్ ఛైర్మన్‌లు, బ్యాంకు డైరెక్టర్లు మొదలగున్నవి.
**Regional Boards - M.Ps, M.L.As, Zilla Parishat Chairmans, Corporation Chairmans, Bank Directors etc.,**

రాయలసీమ / Rayalaseema
**1**

సర్కారు / Sarkar
**2**

ఉత్తర తెలంగాణము /North Telangana
**3**

దక్షిణ తెలంగాణము / South Telangana
**4**

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| ఒంగోలు కర్నూల్ కడప చిత్తూర్ అనంతపూర్ | నెల్లూరు గుంటూరు కృష్ణా ప.గో. తూ.గో. వి.నగర్ విశాఖ శ్రీకాకుళం | ఆదిలాబాద్ నిజామాబాద్ కరీమ్‌నగర్ వరంగల్ ఖమ్మం | నల్గొండ మహబూబ్ నగర్ హైదరాబాద్ రంగారెడ్డి మెదక్ |
| Ongole Kurnool Cudapah Chitoor Ananthapur | Nellore Guntur Krishna W.G., E.G, V.Nagar Vizag Srikakulam | Adilabad Nijamabad Karimnagar Warngal Khamam | Nalgonda Mahabubnagar Hyderabad Ranga Reddy Medak |

అనంతపూర్ – పార్లమెంటు సభ్యులు , శాసనసభ్యులు – ప్రాంతీయ బోర్డులు

**ANANTAPUR - Parlamentary and Assembly Constituency, Regional Boards**

కదిరి Kadiri | నల్లమడ Nallamada | గోరంట్ల Gorentala | హిందూపురం Hindupur | మడకశిర Madakasira | పెనుకొండ Penukonda | ధర్మవరం Dharmavaram | కళ్యాణదుర్గం K. Durgam | రాయదుర్గం Rayadurgam | ఉరవకొండ Urvakonda | గుత్తి Gooty | అనంతపురం Ananthapur | శింగనమల Singanamala | తాడిపత్రి Tadipatri

మండల అధ్యక్షులు, మెంబర్లు – సొసైటీ మెంబర్లు/**MANDAL PRESIDENT, MEMBERS-SOCIETY MEMBERS**

గోరంట్ల /Gorentala | క్రొత్తచెరువు/ Kottacheruvu | పుట్టపర్తి / Puttaparthi | బుక్కపట్నం / Bukkapatnam

సర్పంచ్‌లు, బోర్డుమెంబర్లు, కమిటీ మెంబర్లు / **PANCHAYAT PRESIDENT, BOARD MEMBERS, COMMITTEE MEMBERS**

మదిరేబైలు తాండా Maderebylu Thanda | వాలేనాయక్ తాండా Valenaik Thanda | రామస్వామి తాండా Ramaswamy Thanda | రామ్లానాయక్ తాండా Ramlanaik Thanda | జల్వబోయనపల్లి తాండా Jalvaboinapalli Thanda | నారసింహపల్లి తాండా Narasimhapalli Thanda | బాలేనాయక్ తాండా Balenaik Thanda | చిన్నచెరువు తాండా C. Cheruvu Thanda | రెడ్డివారిపల్లి తాండా Reddivaripalli Thanda | పొడరాళ్ళపల్లి తాండా Podarallapalli Thanda | మారాల తాండా Marala Thanda | సిద్ధరాంపురం తాండా Siddapuram Thanda | నేలకోట తాండా Nelakota Thanda

## అఖిల భారత బంజారా సేవా సంఘము /All India Banjara Seva Sangh




సూచికలు:

1. అధికారాన్ని క్రిందినుండి సంపాదించుకు రావాలి
2. ఆదాయాన్నిపై నుండి పొందుతూ రావాలి.
3. ప్రజల ఇబ్బందులను క్రింది నుండి పరిశీలించాలి.
4. వాటి నివారణపై నుండి జరగాలి.
5. ప్లానులుపై నుండి తయారు చేయాలి.
6. నిర్మాణ కార్యక్రమములు క్రింద నుండి ప్రారంభించాలి.

# బంజారా తాండా భవిష్యత్ తెలుపు పట్టిక

నాయకుని ఫోటో

1. తాండా పేరు:
2. నాయకుని పేరు:
3. కార్‌భారి పేరు:
4. డావో పేరు:
5. శాశ్వత చందా: రూ.

గ్రామము: పంచాయితీ: పోస్టు:

మండలం: తాలుకా: జిల్లా: రాష్ట్రము:

1. స్కూలు:
2. మంచినీటి వసతి:
3. పశువులకు మంచినీటి వసతి:
4. రోడ్డు వసతి (దూరం):
5. బస్సు వసతి (దూరం):
6. విద్యుచ్ఛక్తి:
7. వైద్యవసతి (దూరం):
8. పశువుల వైద్యం (దూరం):
9. వయోజన విద్య:
10. బాల్‌వాడి:
11. మహిళా మండలి
12. కో-ఆపరేటివ్ సొసైటిలు:
13. వృద్ధాప్య పెన్షన్‌దారులు:
14. లైబ్రరి:
15. బ్యాంకు సౌకర్యం:
16. నిరుద్యోగులు:
17. ఉద్యోగులు:
18. ఇతరములు (అటవి భూములు)

| కుటుంబ సంఖ్య 1 | యజమాని పేరు 2 | వయస్సు 3 | చదువు 4 | భార్యపేరు 5 | వయస్సు 6 | చదువు 7 | మగపిల్లలు 8 | వయస్సు 9 | చదువు 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|

| ఆడపిల్లలు 11 | వయస్సు 12 | చదువు 13 | గృహ వసతి 14 | ఎద్దులు/ బండ్లు 15 | భూవసతి పట్టా/శివాయి 16 | ఆవులు /గేదేలు 17 | మేకలు/ గొర్రెలు 18 |
|---|---|---|---|---|---|---|---|

# సంఘాలు వాటి వివరములు

## అఖిల భారత బంజారా సేవా సంఘము, ఆంధ్రప్రదేశ్ శాఖ

**తాండాల అభివృద్ధి కార్యక్రమము :** బంజారాలు నివసించు తాండాను ఒక యూనిట్‌గా గ్రహించి, ఆ తాండాలలో నివసించు ప్రతి 18 సం. వయస్సు గలిగిన పురుషునకు ఒక కుటుంబముగా గుర్తించవలయును. అతని ద్వారా సంఘ గుర్తింపునకుగాను 1 రూపాయ రుసుమును స్వీకరించవలయును. ప్రతి కుటుంబము యొక్క స్థితిగతులను గ్రహించుటకుగాను ఆ కుటుంబమునకు సంబంధించిన వివరములు సేకరించవలయును.

అతని పేరు, వయస్సు అతని భార్య పేరు, వయస్సు, నివాసం ఉన్నది లేనిది, భూమి ఉన్నది, లేనిది పశుసంపద ఉన్నది లేనిది, మరియు అతనికి సంబంధించిన ఇతర విషయములు గ్రహించవలయును.

ఆ విధముగా మొత్తం తాండాలోని ప్రజలయొక్క స్థితిగతులను గూర్చిన విషయుములు గ్రహించి, వాటిని ఆధారము చేసుకొని ఆ తాండా యొక్క అభివృద్ధి కార్యక్రమములు గూర్చి ఆలోచించవలసి ఉన్నది, ముఖ్యముగా ప్రతి తాండాకు పిల్లల విద్యాభివృద్ధి అవకాశములు గురించి నీటి అవసరము, ఆరోగ్యము, ప్రజలు, పశువులకు, స్త్రీ జనాభ్యుదయము, నిరాశ్రయులైన కుటుంబములు, శిశు సంక్షేమము, ముసలివారు, రహదారి సౌకర్యములు విద్యుచ్ఛక్తి మొదలైన వాటిపై తగిన శ్రద్ధను తీసుకొనుటకు మార్గములు అన్వేషించవలయును.

ఈ మార్గములు ఒక వ్యక్తి ద్వారా కాని లేక ఇతరుల ద్వారా కానీ జరుగు విషయములు కావు. కావున పై కార్యక్రమములు సాధనకై మొత్తం తాండాను ఒక యునిట్‌గా గ్రహించి, ఆ తాండాలోని ప్రజలందరిని సమీకరించి ఒక సంఘం ఏర్పాటు చేయవలయును.

ఈ విధముగా ఒక సంఘంగా ఏర్పడుట వలన ప్రజలలో ఐకమత్యము ఏర్పడి, అందరి భావనలు ఒకటై వారి భవిష్యత్ కార్యక్రమమును వారే నిర్వహించుకొనుటకు అవకాశము కల్పించవలయును. ఈ కార్యక్రమముల నిర్వహణార్థం వారే వారిలో సేవాభావము కలిగిన కొందరు వ్యక్తులను ఎన్నిక చేసి ఆ సంఘ అభివృద్ధికై, కొంత ఆర్థిక వనరులను సృష్టించవలసి ఉండును.

ముఖ్యముగా ప్రతి కుటుంబమువారు, విధిగా కొంత సొమ్ము, చందా రూపంలోను కాని, లేక నిరాళ రూపంలో కాని వసూలు చేయించవలయును. మరియు తాండాయొక్క కట్టుబాట్ల మేరకు వారు వసూలు చేయు శుభ కార్యములలోని మొత్తం ఉదా: వివాహాలు, తాంబూల శాస్త్రములు, పంచాయితీలలో వచ్చు దండుగలు మొదలైన మొత్తములను వసూలు చేసి సద్వినియోగ పరచునట్లు చూడవలయును.

వారు వసూలు చేయు మొత్తంలో సగ భాగము అనగా 20 రూ. లలో 10 రూ. సంఘమునకు, మిగిలినది ఆ రోజు అక్కడ కూడిన ప్రజలు, వారు ఖర్చు చేసుకొనవచ్చును.

వచ్చిన సంఘ ఆదాయములో 1/2భాగము అనగా 5 రూ. పై సంఘమునకు, తాలూకా సంఘమునకు పంపించవలసి ఉండును.

తాండా సంఘములో ఎన్నిక అయిన తాండా నాయికుడు (అధ్యక్షుడు) తాలుకా సంఘములో మెంబరు కావలసిఉండును. తాండా సంఘములో ఎన్నిక అయిన కార్యదర్శి, కోశాధికారి జనసంఖ్యను బట్టి కార్యవర్గ సభ్యులు, పంచాయితిలో మెంబర్లుగాను, ఎన్నిక జరుగవలసి ఉండను.

ఈ విధంగా ఎన్నిక అయిన మెంబర్లు తాండా సంఘ సభ్యులు, తాండా అవసరములను తీర్చుటకుగాను, పంచాయితీ ద్వారా లభ్యమగు వనరులను గ్రహించి. తాండా అభివృద్ధికి పాటు పడుటకు వీలు కల్పించవలయును. మండల సంఘం ఆదేశాల మేరకు తాండా సంఘాలు పనిచేయవలసి ఉండును. తాండా సంఘము ద్వారా తీర్చలేని సమస్యలు, పంచాయితీ ద్వార నెరవేర్చలేని అభివృద్ధి కార్యక్రమాలు మండల సంఘాలకు, తమ తాండా తరుపున ఎన్నికైన అధ్యక్షుడు, మండల సంఘ మెంబరు అగుటవలన వారి ద్వారా జిల్లా సంఘములో ఉంచవలసి ఉండును.

తాండా నుండి ఎన్నికైన సంఘ అధ్యక్షులు మండల కమిటి మెంబరు అగుటవలన వీరందరు కలసి శాసన సంఘ అధ్యక్షులు, కార్యదర్శులు, కార్యవర్గ సభ్యులను ఎన్నిక చేయవలయును. శాసన ప్రజాపరిషత్‌లో ఎన్నికైన అధ్యక్షులను జిల్లా సంఘములో ఎన్నిక చేసి, జిల్లా ప్రజాపరిషత్ సమితి మెంబర్లుగాను, సొసైటీ డైరెక్టర్లుగాను, బ్యాంకులలో మెంబర్లుగాను ఎన్నుకొనునట్లు చూడవలసిఉండును.

ఈ విధముగా ఏర్పడిన మండల సంఘ కార్యవర్గ సభ్యులు, సలహా మేరకు ప్రజాపరిషత్ ద్వారా తమ యొక్క తాండా అవసరములను దృష్టిలో ఉంచుకొని, ప్రజాపరిషత్ అభివృద్ధి ప్రణాళికను దృష్టిలో ఉంచుకొని, ఆయా తాండాల అవసరమును బట్టి, వాటిని అమలు పరచునట్లు చూడవలయును ఈ విధముగా జరుగుటవలన మొత్తం ప్రజాపరిషత్ ఆదాయం, ప్రజాపరిషత్‌లో ఉన్న తాండాల సంఖ్యను బట్టి వీరి అభివృద్ధికై వచ్చు వాటా మేరకు సక్రమ మార్గములో ఉపయోగపడుటకు తోడ్పడవలయును.

మండల సంఘములు ద్వారా ఎన్నికైన అధ్యక్షులు, జిల్లా సంఘములో మెంబరుగా ఏర్పడి, అక్కడ జిల్లా సంఘమును మెంబరుగాను లేక బలము బట్టి జిల్లా పరిషత్ చైర్మన్‌గాను ఎన్నుకొనబడవలయును. మిగిలిన కార్యవర్గ సభ్యులు, వివిధములైన సంఘాలలో మెంబరుగా చేరి, జిల్లాస్థాయిలో అమలు పరచు అభివృద్ధి కార్యక్రమములను సక్రమముగా, మండల వాటాను బట్టి ఆయా మండలాలకు అమలు పరచునట్లు తగిన చర్యలు మండల సంఘము ద్వారా ప్రజాపరిషత్ ద్వారా జరుగునట్లు చూడవలసిఉండును.

ఈ విధముగా జిల్లా స్థాయిలో ఏర్పడిన సంఘ అధ్యక్షులు, ప్రాంతీయ సంఘ మెంబరుగా ఎన్నుకొనబడుదురు. ఈ ప్రాంతీయ సంఘ సభ్యులు, ప్రాంతీయ అభివృద్ధి బోర్డులు, ప్రభుత్వము వారుస్థాపించినవాటిలో, మెంబరుగా చేరి, జిల్లాల వారిగా, ప్రాంతీయ బోర్డులు కేటాయించిన, ప్రభుత్వ సహాయములను, జిల్లాల వారిగా సక్రమముగా అమలు జరుగునట్లు చూడవలయును.

ప్రాంతీయ బోర్డులలో ఎన్నికచేయబడిన సంఘ పెద్దలు రాష్ట్ర స్థాయిలో సంఘాన్ని స్థాపించి, రాష్ట్రస్థాయి సంఘమును ఏర్పాటు చేసి, ఇందులోని పెద్దలు, రాష్ట్ర ప్రభుత్వములో భాగ స్వామ్యమును సంపాదించవలసి ఉండును. ఇక్కడ వచ్చువరకు ముఖ్య రాష్ట్ర స్థాయీ సంఘ కార్యకర్తలు, మంత్రులు, యం.ఎల్.ఏలు, యం.యల్.సీలు ప్రాంతీయ బోర్డులలో ప్రభుత్వము ఏర్పాటు చేయు వివిధములైన బోర్డులలో మెంబరుగా ఉందురు.

ప్రాంతాల వారిగాను, జిల్లాల వారిగాను కేటాయించు, కేటాయింపులను ప్రజలకు సక్రమమైన మార్గములలో అందుబాటు జరుగునట్లు చూడవలసి ఉన్నది. ఇంతవరకు రాష్ట్రాల వారిగా జరుగు కార్యక్రమములు.

దేశములోని మొత్తం జనసంఖ్యను దృష్టిలో ఉంచుకొని మొత్తం దేశమును నాల్గు మండలములుగా ఏర్పాటు చేయవలసి ఉన్నది.

1. దక్షిణ భారతములో : ఆంధ్రప్రదేశ్, మైసూర్, తమిళునాడు, కేరళ రాష్ట్రములు.
2. పశ్చిమ భారతములో : మహారాష్ట్రము, మధ్య ప్రదేశ్, గుజరాతు రాష్ట్రములు.
3. ఉత్తర భారతములో : రాజస్తాన్, ఉత్తరప్రదేశ్, పంజాబ్, హర్యానా, హిమాచల ప్రదేశ్ జమ్ము మరియు కాశ్మీర రాష్ట్రములు.
4. తూర్పు భారతములో : ఒరిస్సా, బెంగాల్, బీహార్, అస్సాం, త్రిపుర, మణిపూర్ మొదలైన రాష్ట్రములు.

పై విధంగా విభజించుటవలన రాష్ట్రస్థాయిలో ఎన్నుకొనబడిన కార్యవర్గ సభ్యులలో ముఖ్యులు, మండల స్థాయిలో కార్యవర్గమును స్థాపించి, మండలాల అభివృద్ధికి ప్రభుత్వంవారు కల్పించిన కార్యక్రమములలో భాగస్వామ్యమును పొంది అభివృద్ధి కార్యక్రమములలో దేశము యొక్క నలుమూలలలో సమానస్థాయిలో అభివృద్ధిని సాధించుటకు పాటు పడవచ్చును.

ఈ విధముగా మండలస్థాయిలలో ఏర్పాటు అయిన సంఘ కార్యకర్తలనుండి కేంద్ర స్థాయిలో సంఘమును ఏర్పాటు చేసి ప్రభుత్వములో చేరి మండల స్థాయీలలోను, రాష్ట్రస్థాయీలలోను చేపట్టు కార్యక్రమములకు తగిన బలమును చేకూర్చి అభివృద్ధి కార్య క్రమమును చేపట్టవచ్చును.

ఈ విధంగా, సంఘస్థాపన అవసరము ఎందుకనగా, ఈ అఖిల భారత దేశములో, ఒకే భాష, ఒకే డ్రస్సు( దుస్తులు) ఒకే సాంప్రదాయము కలిగిన ప్రజలు 5నుండి 6 కోట్ల పై బడియుండి, అన్ని భాషలు మాట్లాడటము, వ్రాయటం, చదవటం వచ్చి, తిరగి అందరు కలసి ఒకే భాషలో చర్చించి, విషయ నిర్ణయం చేయగలిగిన శక్తి వీరిలో ఉన్నది. వీరిలో జాతి, కులం భాష, ప్రాంతీయ భేదాలు కాకుండ, అందరు ఒక్కటే అనగలిగిన శక్తి మొత్తం భారతదేశంలో 90 కోట్లలోను, 5నుండి 6 కోట్లు పైబడిఉండి, దేశ ఐక్యతను సాంప్రదాయమును, నిలబెట్ట గలిగిన శక్తి వీరిలో ఉన్నది.

''జాతీయ సమైక్యతను'' కాపాడగలిగిన శక్తి ఉన్నది. వీరికి భాషా రాష్ట్రము ఏర్పడుటకుగల అవకాశములన్ని ఉన్నను, దేశం మొత్తం పైన వ్యాప్తి చెందుట వలన, ఈ అవకాశము లేక పోయినను, ప్రాంతీయ తత్వాలు, విడనాడి, మేమంతా ఒక్కటే, మేము భారతీయలము, భారత దేశ సౌభాగ్యము, నా భాగ్యము అని గర్వముగా చెప్పగల శక్తి వీరికున్నది (అఖిల భారత బంజారా రాష్ట్రము అనవచ్చును).

జాతీయ సమైక్యతను నిలబెట్టుటకు గాను, భాషా రాష్ట్రముల ద్వారా అనుభవించుచున్న సౌకర్యములు వీరికి దక్కు విధముగా, కేంద్రప్రభుత్వముతో సంఘము ద్వారా పోరాడవలసి ఉన్నది.

1. ముఖ్యముగా భాషా అభివృద్ధి, ఈ భాషా అభివృద్ధికిగాను, హిందీని లిపిగా స్వీకరించి, అన్ని రాష్ట్రములలోని, భాషా జ్ఞానము కలిగిన పెద్దలను పిలిపించి, భాషా నిఘంటవును తయారు చేసి, వెంటనే భాషాభివృద్ధికి పాటు పడవలయును.
2. ప్రజలలో వెంటనే మార్పు తెచ్చుటకుగాను, కేంద్రస్థాయిలో ఒక రేడియో స్టేషన్‌ను స్థాపించి, భాషలో అభివృద్ధి కార్యక్రమములను గూర్చి ప్రచారం సాగించవలయును.
3. కేంద్ర రాష్ట్రస్థాయిలో ఉన్న ప్రచారశాఖ( ఫీల్డ్ పబ్లిసిటి) ద్వారా బంజారా భాషలో ప్రచారం సాగించుటకుగాను, ప్రచార సాధనములు( ఫీల్డ్ పబ్లిసిటి ఎక్విప్‌మెంట్) ద్వారా, బంజారా కార్యకర్తలను, నియమించి ప్రచారం సాగించవలయును. బంజారా టీవి స్టేషన్. డిడి 3 లేక డిడి 4 లాగా వీరికి కూడా ఒక డిడిని స్థాపించవలెను,
4. జాతీయ గ్రంథాలయ మరియు వినోదశాఖ(నేషనల్ లైబ్రరీ మరియు టూరిజం డిపార్టుమెంటు) ద్వారా కొంత ఆర్థిక సహాయమును గ్రహించి, అన్ని భాషలలోని పుస్తకములను గ్రహించి, ఒక ముద్రణాలయమును స్థాపించి భాషలో పుస్తకముల ప్రచురణ కార్యక్రమములు చేపట్టవలయును.

పై వాటిని ఏర్పాటు చేయుటకు, కారణం బంజారాలు అన్ని రాష్ట్రములలోను వ్యాపించి ఉన్నను, రాష్ట్ర ప్రజలతో గాని, భాషతో గాని, ఆచార వ్యవహారములతో గాని ఏ విధమైన సంబంధము కలిగి ఉండుటలేదు. వీరి ప్రత్యేకత వీరికే ఉన్నది, ప్రపంచములో మహాగొప్ప దేశమైన సోవియట్ రష్యాలో కూడ భాషా ప్రయుక్త రాష్ట్రాలు కాకున్నను, ఆయా భాషలు మాట్లాడువారికి, వారి మాతృ భాషలోనే అన్ని సౌకర్యములు కలుగచేసివారి సత్వర అభివృద్ధికి తోడ్పడి ఆ సమస్యను నిర్మూలించ గలిగినారు.

ఈ విధముగా చేయుటవలన చిన్న వయస్సులో ఉన్న పిల్లలకు, అతి సులభముగా, దేశ పరిస్థితులను సమైక్యతను కాపాడుటకు వీలుకలుగును. వీరికి నాల్గు భాషలు కాకుండ, సులభముగా రెండు భాషలలోనే అనగా మాతృ భాషకు, రెండింటిని, ఒక అక్షర లిపి జ్ఞానము వలనకలుగు చేయవచ్చును. మరియు ఏ రాష్ట్రమువారు, ఆ రాష్ట్ర భాషనువాడుక భాషగా గ్రహించగలరు. ఈ విధముగా భాషా సమస్యను నిర్మూలించవచ్చును.

ఈ కార్యక్రమములను గూర్చి ఆలోచించి సరియైన మార్గమును అన్వేషించగలిగినవాడు ''అంతర్ జాతీయ బంజారాలే కాక ఇంటర్‌నేషనల్ బంజారాల గూర్చి కూడ ఆలోచన ప్రారంభించవచ్చును. ఈ విధముగా, దేశ సమైక్యతను, ప్రపంచ సమైక్యతను గూడ చర్చించగల అవకాశములు ఏర్పడగలవు. ఈనాడు ఈ నవీన ప్రపంచములో భాష, వర్గము, రాష్ట్రము, ప్రాంతము, మతము, నల్లవారు, తెల్లవారు అని ఎన్నో విధములైన తగాదాలకు గురి అయి ప్రపంచ ప్రజలు శాంతిని పొందలేక పోతున్నారు.

'మానవలంతా ఒక్కటే, భూగోళమంతా ఒక్కటే. ఈ అఖండమండల మంతా ఒక్కటే అనే విషయాన్ని ఈ మానవాళే, చాటి చెప్పవలసి ఉన్నప్పుడు. ఈ మానవులోనే ఇన్ని విధములైన తేడాలు ఎందుకు వచ్చుచున్నవి.

**సంఘ స్థాపనలు :** అఖిల భారత బంజారా సేవ సంఘం వారు ఈ విషయమును కూలం కుశంగా గ్రహించి, భారతదేశమును, నాల్గు మండలములుగా స్థాపించవలయును, ఆయా మండలములలోని కార్యవర్గసభ్యులు, రాష్ట్ర కార్యవర్గ సభ్యులను ఏర్పాటు చేయుదురు. రాష్ట్ర కార్యవర్గ సభ్యులు, ప్రాంతీయ కార్యవర్గ సభ్యులను ఏర్పాటు చేయుదురు. ప్రాంతీయ కార్యవర్గ సభ్యులు, జిల్లా కార్యవర్గ సభ్యులను ఏర్పాటు చేయుదురు. జిల్లా కార్యవర్గ సభ్యులు, శాసన సభ కార్యవర్గ సభ్యులను ఏర్పాటు చేయుదురు మండల కార్యవర్గ సభ్యులు, తాండా కార్యవర్గ సభ్యులను ఎన్నిక చేయుదురు ఈ విధముగా పై నుండి సంఘములను స్థాపించవలసి ఉండును.

ఈ విధముగా సంఘ స్థాపన జరిగిన తరువాత అభివృద్ధి కార్యక్రమములు, అమలు పరచుటకుగాను, వారివారి సంఘములు ద్వారానే అమలుపరుచుటకుగాను, వారివారి సంఘములు ద్వారానే కార్యక్రమములు చేపట్టవలసి ఉండను.

సంఘ స్థాపనలు చేయుటకు మొట్ట మొదట, ఆర్థికముగా బలము కలిగిన బంజారా పెద్దల ద్వారా కాని లేక బంజారేతల ద్వారా సేకరించి, మరియు ప్రభుత్వ సహాయమును కూడా తీసుకొని కార్యక్రమములు చేపట్టవలసి ఉండను.

**సంఘ వర్గీకరణము :** సంఘమును నాల్గు విధములుగా వర్గీకరించవలసి ఉన్నది.
1) జనరల్ సంఘం 2) ఉద్యోగుల సంఘం 3) విద్యార్థుల సంఘం 4) స్త్రీ, శిశు సంక్షేమము.

1) జనరల్ సంఘం : అన్ని రకములైన సంఘ బాధ్యతలు, కార్యక్రమములు చేపట్టవలయును మిగిలిన 3 సంఘములు వీరి అదుపులోనుండవలయును.

2) ఉద్యోగుల సంఘం : వీరు తమ ఆదాయములో 1% సంఘమునకు రుసుముగా చెల్లిస్తూ, తాలూకా, జిల్లా, ప్రాంత, రాష్ట్ర మండల కేంద్ర సంఘములను స్థాపించి. వీరి ఉద్యోగ సర్వీసులు, మరియు నిరుద్యోగులైన బంజారాలను ఉద్యోగ సౌకర్యములు కలిగిస్తూ, జాతి అభివృద్ధికి పాటుపడవలసి ఉండను.

3) విద్యార్థి సంఘాలు : తాండా, మండల, శాసన, జిల్లా ప్రాంత, రాష్ట్ర, మండల కేంద్ర స్థాయిలలో స్థాపించి, విద్యార్థులు జనాభ లెక్కలు సేకరిస్తూ వారి వారి విద్యా సౌకర్యముల గూర్చి, సీట్ల రిజర్వేషన్లు, స్కూళ్లు, కాలేజీలు, విశ్వవిద్యాలయలలోను, మరియు ఆశ్రమ స్కూళ్ల మొదలైన అన్ని రకములైన విద్యలకు సంబంధించిన విషయములలో వారికి కావలసిన హక్కులను, సంఘం ద్వారా ప్రభుత్వముతో పోరాడి, వారి అభివృద్ధికి కావలిసిన అవకాశమును, వారే సూచించుట అమలు పరచినట్లు చేయుట మొదలైనవి చేపట్టవలసి ఉండును.

4) స్త్రీ, శిశు, సంక్షేమము : స్త్రీలు, వారి సంక్షేమము, శిశు సంక్షేమములలో వారికి రావలసిన వాటాను, వారు తమ సంఘము ద్వారా తాండా, మండలం, శాసన జిల్లా, ప్రాంతం, రాష్ట్రము మండలము, కేంద్రస్థాయి వరకు వ్యాపించి, అంతర్ జాతీయ స్త్రీ, శిశు సంక్షేమము వరకుపోయి, వారికి సంబంధించిన సౌకర్యములను పొంది అభివృద్ధి చెందుటకు పాటుపడవలసి ఉండును. పై సంఘమలన్నియు, బంజారా సంఘము యొక్క నియమ నిబంధనావళి మేరకు మాత్రమే ప్రవర్తింపవలసి ఉండును.

ఈ కార్యక్రమములు పేపరు మీద వ్రాయునంత వరకుబాగానే ఉండను, కానీ వీటిని అమలు పరచుటలో చాలా సాధక బాధకములన్నవి. నిజమే ఒప్పుకొంటాము. కానీ కార్యక్రమము చేపట్టకుండ ఈ కార్యక్రమములు చాలా కష్టం వీటిని చేయులేము, అని తప్పించుకొనుటతో సరిపోదు. ఏ కార్యక్రమమైనను, ముందు చేపట్టి, వాటిలో వచ్చు ఇబ్బందులను బట్టి, ఏ కార్యక్రమము ముందు చేపట్టిన మంచిది అని ఆలోచించి పని ప్రారంభించిన, వాటిని సాధించవలయునని పట్టుదల కలిగిన నాడు అది సాధ్యము కాగలదు లేకున్న లాభములేదు.

దీనిని చేపట్టుటకై, మొదట కేంద్రస్థాయిలో కాని, మండల స్థాయిలోకాని, రాష్ట్ర స్థాయిలోకాని, లేక ప్రాంత, జిల్లా స్థాయిలలో కార్యదీక్షాపరులైన కార్యకర్తల గూర్చి ఆలోచించి, వారిని సమీకరించవలసి ఉండును. అటువంటి వారు అందరు కలసి, పరిస్థితులను ఓపికతో కూర్చొని చర్చించగలగిననాడు పై కార్యక్రమములు సాధ్యపడగలవు.

ఏ జాతి అయిన, ఏ సంఘమైన, లేక ఏ దేశమైన అభివృద్ధి చెందవలయునన్న, దీక్షా బద్ధులైన కార్యకర్తలు ముఖ్యము. ''వీరు తలంచుకొన్న'' కాదు అనే సమస్య ఉండదు. అసలు ''మానవునికి అసాధ్యమనేది లేదు''. అలాంటప్పుడు సాధించలేము అని ఎలా చెప్పగలరు? ఇప్పటివరకు ఈ నవీన ప్రపంచముతో సాధించగలిగినవారు అంతయు మానవ జాతికి సంబంధించిన వారే కదా?

ఏ పని సాధించవలయునన్న ప్రణాళికా బద్ధమైన కార్యక్రమము చేపట్టవలసి ఉండను. ప్రణాళికాబద్ధమైన కార్యక్రమమునకు కావలసిన వనరులు, ఆర్థిక సహాయం, కార్యకర్తలు, అమలు జరుపవలసిన పనులు అన్నియు అందులో ఇమిడి ఉండుటవలన, అవి అమలు జరుపక ముందే వాటి యొక్క నిజ స్వరూపమును గ్రహించుటవలన వాటిని సాధించుటకు గట్టి ప్రయత్నములు జరుపబడును.

మానవ జాతికి కావలసిన ముఖ్యమైన తిండి, గుడ్డ, వసతి వీటిని ఆధారము చేసుకొని మిగిలిన కార్యక్రమములు అధారపడి ఉండును. వీటిని సాధించుటకుగాను అమలు పరచవలసిన కార్యక్రమములు, మరియు విద్య, సాంఘిక మార్పులు, ఆర్థికాభివృద్ధి, రాజకీయాభివృద్ధి అన్నియు కూడ సాధించి, తాండా, మండల శాసన జిల్లా, ప్రాంత, రాష్ట్ర, మండల, కేంద్రస్థాయి వరకు అభివృద్ధినిగాంచి, దేశసౌభాగ్యమున్నకై, ప్రపంచ శాంతికై పాటు పడవలసి ఉండును.

**సంఘాల అవశ్యకత :** విమర్శనాత్మకంగా ప్రతి కుటుంబమును చూచిన ఒక కుటుంబం అనగా భార్యభర్తలు, వారి పిల్లలు, ముఖ్యముగా ప్రతి కుటుంబమునకు కొంత ఆస్థి అన్నది ఉండక మానదు. అందులో ఇల్లు, కొన్ని పశువులు అనగా ఆవులు, గేదెలు, మేకలు, ఎద్దులు మరియు బావి క్రింద పొలం, చెరువు క్రింద పొలము, మెట్ట పొలాలు అటువంటివి ఒక చోటనే ఉండక ఒకటి ఒక ఫర్లాంగు దూరములో, రెండవది 5 ఫర్లాంగుల దూరములో. వేరొకటి ఒకమైలు దూరంలో ఈ విధముగా, ఒక సంసారమునకు 5 లేక 6 చోట్ల 10 సెంట్లు, 20 సెంట్లు, అర్థ ఎకరము, 3 ఎకరములు లేక 5 ఎకరములలోపు, ఈ విధంగా పొలం ఉంటుంది. మరియు 5 లేక 6 మేకలు, ఒకటి లేక జత ఎద్దులు, 1 గేదే, 2 లేక 4 ఆవులు, దూడలు మొదలైనవి ఉండవచ్చును.

ఇద్దరు భార్య భర్తలు, లేక ఒకరో ఇద్దరో ఎదిగిన పిల్లలు తమ చేతి క్రింద పనికి వచ్చు పిల్లలుండి, ఆ కుటుంబమునకు 1 రోజులో 10 నుండి 15 రకముల పనులు ఉండిన వారు పై పనులన్నియు ప్రొద్దున 5 గం. లేచినది మొదలు రాత్రి 8 లేక 9 గం. వరకు, పండుకొనునంతవరకు ఎడతెగని పని ఉండును ఆ కుటుంబమునకు ఇవి అన్నియు ఉండి నందువలన, ఇది అంతయు నా ఆస్థి అను సంతోషము తప్ప వాటివలన ఆ కుటుంబమునకు లభించు ఆదాయము మాత్రం సున్న.

ప్రతి గృహిణి ప్రొద్దున లేచినది మొదలు పొయ్యి రాచేయటము, వంట పాత్రలు తోముకొనటం, ఇల్లు శుభ్ర పరచటము, పిండి ఇసరుకొనుట, ఒడ్లు లేక జొన్నలు, సజ్జలు దంచుకొనుట ఆపూటకు తమకు కావలసిన ఆహారము వండుకొనటము, వంటకుగాను కావలసిన నీరు సుమారు 2 ఫర్లాంగులు నుండి, 1 మైలు దూరమునుండి కడవలతో తెచ్చుకొని, వంటకు, స్నానములకు, పశువులు త్రాగుటకు మొదలుకొని తమ అంతయు సప్లయి చేసుకొని వంట చేయునంతలో 9లేక 10 గంటలు అగును.

మరియు తను చేయవలసిన పొలం పనులుగాని, పశువులను మేపుటకాని, గడ్డి, వంటకట్టెలు, తేవటముగాని మరియు తన ఆశ్రయము కొరకు కాచుకొని ఉన్న తన కన్న బిడ్డను పోషించుటతోనే సరిపోయి, తిరగి సాయంత్రం కార్యక్రమము క్రింద పొద్దున 5 గం. నుండి 10 గ. వరకు చేసిన కార్యక్రమమును తిరిగి చేసుకొనునంతలో ఆమె యొక్క దినచర్యలు సరిపోవు చున్నవి.

అదే విధముగా భర్త ప్రొద్దున లేచినది మొదలు, పశువులను విడచుట, దూడలు విడచి పాలుపితుకుట, వాటిని సరియైన మార్గములో పోషించుట, పశువుల కొట్టములను శుభ్రపరచుట, వాటి పెంటను దూరముగా ఉన్న పెంటకుప్పలో తీసి వేయుట, అక్కడినుండి అతనికున్న తోట, మాగాణీ, మెట్ట పొలములు ఒకచోట కాకుండ నాల్గు లేక 5 చోట్లు పోయి వాటిలో వ్యవసాయ పనులు చేయుట మొదలైన అన్ని రకముల కార్యక్రమములు చేపట్టవలసి ఉండును.

మరియు ఆవులు, గేదెలు, గొఱెలు, ఎద్దులు, వాటి గూర్చి చూచుకొనుట మొదలైన విషయములలో ఏ పనిని సక్రమముగా చేయుట, వాటినుండి తన సంసారమును పోషించుటకు తగిన ఆహార పదార్థములు కాని, ఆర్థిక వసతి కాని పొంద లేక బ్రతక లేక చావలేక సతమతమై పోతున్నాడు. ఇన్ని కార్యక్రమములతో, ప్రతి రోజు జీవనముగడపవలసిన భార్యభర్తలకు, వారి సొంత ఆరోగ్యము మీద గాని, లేక వారి పిల్లల ఆరోగ్యము మీద కాని, ఏటువంటి ఆశలు పెట్టుకొని జీవించగలరు? మరియు వారి పిల్లల భవిష్యత్తును మార్చి, వారి పిల్లలను భావిభారత పౌరులుగా ఏలా తీర్చదిద్దగలరు?

ఇవన్నియు ప్రతిసంఘజీవి, విప్లవాత్మకంగాను, విమర్శనాత్మకంగాను, ఆలోచించి నిర్ణయించవలసి ఉన్నది. ఈ విధముగానున్న వీరి జీవితాలలో మంచి వెలుగును ప్రసాదించి, వారికి ఉన్న బరువు భాద్యతలను తొలగించినవాడు, వారి భవిష్యత్తును మార్చగల్గిన అవకాశములను ఆలోచించవలసి ఉన్నది.

పై చెప్పిన ఆస్థులు లేని బీద ప్రజలున్నారు. వీరు ప్రొద్దున లేచినది మొదలుకొని, భార్య తమకు కావలసిన భోజనమును తయారు చేసుకొని తయారు అయిన, అంతలో భర్త ప్రొద్దునలేచిన మొదలు ఊరంతయు తిరిగి కూలి పనికి ఒప్పుకొనివచ్చి, ఆసామి పొలంలో పోయి 10 గం. గొడ్డు చాకిరి చేసి, ఇంటికి వచ్చు సరికి ఒళ్లు అంతయు నీరశించి, శరీర బడలికి మీద, చేసిన ఆహారము కూడ భుజించలేని పరిస్థితిలో కాలం గడుపుచున్నారు.

ఒక వేళ కూలికూడ దొరకని పక్షములో కొండగడ్డి, కొండ కట్టెలు రోజంతయు ప్రోగుచేసి( అతికష్టముతో) నెత్తిన మోపు మోసుకొని చాలా దూరములో నున్న గ్రామములో వాటిని 5 రూ. లకో లేక 10 రూ. లకో అమ్మి చాలిచాలని ఆహారముతో జీవితాలు గడుపుకొన లేక సతమత మయిపోచున్నారు. ఇటువంటి ప్రజలు ఈ దేశములో ఉన్నారు. వారిలో బంజారాలు నూటికి నూరు శాతం ఈ స్థితిలో జీవించుచున్నారు. అటువంటి వారికై ఈ బంజారా సేవా సంఘం పనిచేయవలసి ఉన్నది. ఇది ప్రతి కుటుంబములోనున్న పరిస్థితి.

ఇక తాండా మొత్తం పరిస్థితులు చూచినట్లు అయితే బంజారాలు ముఖ్యముగా అరణ్య ప్రాంతములలోనో లేక గ్రామములకు దూరముగానో ఉంటవి. వీటికి పోవుటకు సరియైన రహదారి మార్గములుండవు, ప్రతి తాండా కనీసం బస్సు మార్గమునకు 2 మైళ్లు నుండి 10 లేక 12 మైళ్లు దూరమువరకు ఉంటవి. అవి కూడ రెండెడ్ల బండి బాటలు తప్ప మరి ఏమి ఉండవు. ఒక వేళ ఉండిన అవి కూడ సరిగా ఉండవు.

వీరి పిల్లలు చదువుకొని అభివృద్ధి చెందవలయునన్న అసలు పాఠశాలలుండవు. ఒక వేళ కొద్ది దూరముతో ఏ పల్లెలోనో 1/2 మైలు నుండి 1 మైలు దూరములోనున్న 5 సం. ప్రాయము వచ్చిన పిల్లవాడు అక్కడ పోయి చదువుకొని రాగలడా? ఇది ఆలోచించవలసిన విషయము. పైగా వీరి తల్లి దండ్రులకు ఎంత మాత్రం విద్యా జ్ఞానం ఉంది కనుకవారి పిల్లలకు దూరమైన సరే విద్యనేర్పించవలయునని పట్టుదల ఉంటుంది.

ప్రతి తాండాకు మంచి నీటి వసతి కావలయునన్న కనీసం 1/2మైలునుండి 1 మైలు దూరమువరకు పోయి మంచినీరు కానీ లేక తమ కుటుంబమునకు సరిపోవునీరు, పశువులు తాగుటకు తీసుకొని రావలసి ఉండును. ఈ కార్యక్రమములో ప్రతి కుటుంబములో ఒకరు లేక ఇద్దరు కనీసం రెండు మూడు గం. కష్టపడి తెచ్చుకొనిన కాని ఆ నీరు వీరికి లభించదు. ఈ విధముగా తాండా మొత్తం మీద ఎంత మంది ఒక నీటి గూర్చి వారిశ్రమను వృధా చేయుచున్నారు.

వీరికిగాను, వీరి పశువులకుగాని ఆరోగ్య విషయంలో ఎటువంటి వసతులుండవు, కర్మచాలకఅనారోగ్యము వచ్చినప్రజలు కానీ, పశువులు కానీ వాటి ప్రాణముల మీద ఆశ వదులు కొనవలసి ఉండును.

వీరికి పనులు లేని కాలములో జీవించుటకు ఆధారములుండవు. పనుల కాలములో సంపాదించినది, ఏ పూటకు ఆ పూట సరిపోవుటయే కష్టము. ఒక వేళ వీరు ఉత్పత్తి చేసిన ఆహార పదార్థములకు గాని లేక ఇతరములైన వస్తువులకు గాని సరియైన మార్కెట్టు వసతి ఉండదు. అందువలన వారు ఉత్పత్తి చేసినవాటికి సరియైన గిట్టుబాటు ధరులుండవు.

వీరికి దేశ పరిస్థితులు, సంఘములో మార్పులను గూర్చిన విషయములు తెలుసుకొనుట కష్టము, రేడియో సౌకర్యములు లేవు. వార్తా పత్రికలుండవు. క్రొత్త వారితో పరిచయము గాని సంఘ అభివృద్ధికిగాను సహకరించవలయునను ఉద్దేశ్యములు కానీ వీరిలో ఉండవు.

ఎప్పుడు తమ పిల్లలు, తమ పశువులు, తమ పొలములు అని వూరికే ఆరాటపడే అల్ప సంతోషులే కాని, తమ ఆస్తులను అభివృద్ధి చేసుకొనుట కాని, తమ పిల్ల భవిష్యత్తును మార్పుచెందుటకు, వారి విద్యజ్ఞానమును పెంపొందిచటంగాని, తమకు కావలసిన అవసరములను తీర్చుకొనుటగాని జరుగుట కల్ల. తనకు సంబంధించిన వాటి గూర్చి చెప్పు కొంటూ, అల్ప సంతోషం పడుటయే తప్ప, దానివలన తనకు గాని, తన సంసారమునకు గాని వచ్చులాభము ఏమీ ఉండదు. వాటి గూర్చి వృథాగా కష్టపడుట తప్ప.

పై కారణములన్నియు సంఘ కార్యకర్తలు మొట్టమొదట దూరదృష్టితో ఆలోచించి, విప్లవాత్మకమైన కార్యక్రమములు ప్రారంభించవలసి ఉండును. విప్లవం అనగా ఒకరిని ఒకరు చంపుకొనుట కాదు. దానివలన జరుగు లాభం ఏమియు ఉండదు. దాని వలన ఈర్ష్యా ద్వేషము ఆశాంతి, అభివృద్ధి పనులు కుంటు పడుట తప్ప. విప్లవం అనగా తను చేపట్టిన కార్యక్రమములో మార్పు, ఆలోచనలో మార్పు, మాటలలో మార్పు, కార్యక్రమములు చేపట్టి అమలు పరచుటలో మార్పు, విద్యలో మార్పు, ఉత్పత్తిలో మార్పు, పంటలు పండించుటలో మార్పు, పశుపోషణలో మార్పు, వాటి అభివృద్ధిలో మార్పులు తీసుకొని రావటం, దీనినే విప్లవం అంటారు. అదే కాదు ఆచార వ్యవహారములలో మార్పు, సాంఘికంగా మార్పులు, రాజకీయ కార్యక్రమాలలో మార్పులు తీసుకొని రావలసి ఉండును.

అప్పుడు కాని ఈ ప్రజల యొక్క ఇబ్బందులు తొలగవు. అవి తొలగించుటకు గాను, సంఘము ద్వారా ఆయా గ్రామములలో ప్రచారం సాగించి, వారి మనస్సులో ఉత్సాహకరమైన భావములు రేకెత్తించి, ఏ పనులు చేసిన, ఏ కార్యక్రమములు చేపట్టిన అన్నియు మా గురించియే కదా? అనుభావము కల్గునట్లు చేయవలసి ఉండును. అలా చేసిననాడు ఇది సాధ్యపడగలదు.

అందుకుగాను ఆయా తాండాలలోని ప్రజల నందరిని చేర్చి, వారికి అన్ని విషయములను బోధించి, సంఘములను ఏర్పాటు చేయవలసి ఉండను, ప్రతి వారి మనస్సులోను, ఆస్తి ప్రధానము కాదు. మాకు కావలసినది ఆహారము, కట్టుకొనుటకు గుడ్డ, నివసించుటకు ఇల్లు, మా పిల్లలకు విద్య, మరియు జీవించుటకు గాను సరియైన సంఘ వాతావరణము, ఏ పని చేస్తే ఏమి? కావలసినది సులభముగా, ఇప్పుడు చేస్తున్న కష్టము కన్నా, కొద్ది పాటి శ్రమతో లభించునప్పుడు దీనిని ఎందుకు అమలు పరచకూడదు అనునది చిన్నవాడినుండి పెద్దవాడి వరకు ఒకే భావము వచ్చునట్లు చేయవలసిఉండును.

దీనికిగాను ఆ గ్రామములో వున్న లోకజ్ఞానులు, విద్యకల కార్యకర్తలను ఎక్కువగా ముందుకురావలసి ఉన్నది. ఇది ఒకరో ఇద్దరో చేయవలసిన పనికాదు. ఎక్కడి కార్యకర్తలు అక్కడనే ఈ కార్యక్రమములు చేపట్టవలయును.

ఈ విధముగా బోధించి ప్రజల మన్నలను సంపాదించిననాడు, అక్కడలభించు భూసంపద, పశుసంపద, వనరులు సంపదలను ఆధారము చేసుకొని ప్రజలను(వర్గంగా)

గ్రూపులుగా ఏర్పరచి కార్యక్రమములు చేపట్టవలయును. దీనికి గాను ఎవరో వచ్చి, చేయవలయును అను భావమును కూడదు.

ఈ విధంగా మార్పులు తెచ్చిన నాడు ప్రజల ఓటుపై అధారపడిన ప్రజా ప్రభుత్వం, ప్రజా ప్రతినిధులు వారంతకు వారే వచ్చి, వీరి అవసరములను తెలుసుకొని, వారి కార్య క్రమములకు కావలసిన ఇతర సదుపాయములు, ఆర్థిక సహాయములు వాటంతట అవే రాగలవు. అట్లు కాకుండ ప్రభుత్వమే చేయవలయును, అని భావించిన నాడు వీరు ఇప్పుడున్న పరిస్థితులలోనే ఉండి పోగలరు. కావున సంఘము, జాతి, దేశాభివృద్ధి అన్నవారు వీటిని మెట్టమొదట గ్రహించవలసి ఉన్నది. ఇవి గ్రహించిననాడు వారి అవసరములు, వాటిని సాధించుటకు ప్రణాళికలు తయారు చేసుకొనవలసి ఉండును.

**విద్యాభివృద్ధి :** ముఖ్యముగా సంఘములు స్థాపించి, ఆయా తాండా ప్రెసిడెంట్ల ద్వారా వారి యొక్కవివరములు సేకరించవలయును. ముఖ్యముగా తాండాలోని కుటుంబములను వర్గీకరించవలసి ఉన్నది. 14సం. వయస్సు గల ఆడ, మగ పిల్లలు ఎంత మంది ఉన్నారు. వీరిలో ఆర్థికముగా కొంతమంది స్కూలు వసతి కల్పించిన సొంత ఖర్చులతో ఎంత మంది చదివించగలరు. మరియు స్కూలు వసతి కల్పించినను, చదివించలేని పిల్లలు ఎంత మంది ఉన్నారు. 3 సం. లోపు పిల్లలెంత మంది. 3 సం. నుండి 6 సం. లోపు పిల్లలెంత మంది ఉన్నారు? 6 సం. నుండి 11 సం. లోపు వయస్సుగల పిల్లలెంత మంది. 11 నుండి 16 సం. లోపు వయస్సుల పిల్లలెంత మంది. మరియు 16 సం. నుండి 18 లేక 20 సం. వయస్సు కలిగిన వారెంతమంది( కాలేజి విద్యకై తయారుగా ఉన్నవారు). ఈ విధముగా మొత్తం తాండాల వారిగా మండల్ లెవల్ వరకు వీరి సంఖ్యను తేల్చవలసి ఉన్నది.

ఈ విధముగా పిల్లల జన సంఖ్యను గ్రహించిన తరువాత, సొంత స్కూళ్ళు పెట్టవలసిన తాండాలు ఏన్ని? అందులో సింగిల్ టీచర్ స్కూళ్ళు ఎన్ని? డబల్ టీచరు స్కూళ్ళు ఎన్ని? స్కూళ్లకు పోయే పిల్లల సంఖ్య తగ్గే విధంగా అయితే దగ్గరలో స్కూళ్ళు ఎంత దూరంలో ఉన్నవి? అక్కడికి పోయి పిల్లల చదువుకొనిరాగలరా? లేక చుట్టు ప్రక్కల నున్న కొన్ని తాండాలను కలిపి ఒక ఆశ్రమ స్కూళ్ళు స్థాపించవచ్చునా? స్కూళ్ళ వసతి ఎంత మందికి? ఆశ్రమ స్కూళ్ళ వసతి ఎంత మందికి? బాల్‌వాడీలు స్థాపించుటకు అవకాశములు ఉన్నవా?

ఎలిమెంటరీ స్కూలు ఎడ్యుకేషన్ అయిపోయిన తరువాత హైస్కూళ్ళ వసతి సరిగా ఉన్నవా? హైస్కూలు అయిన ఎంత దూరం పోవలసి ఉండును? ఒకవేళ దగ్గరలో ఉన్న ఆ స్కూలులో ఈ పిల్లలను చేర్చకొంటారా? చేర్చుకోని పక్షమున హైస్కూలు స్థాపనకు అవకాశములున్నవా? వారికి హాస్టలు వసతి ఎంత వరకు కల్పించవలసి ఉండను?

ఈ విధముగా మండలాల వారి, జిల్లాలవారి, ప్రాంతాలవారి, రాష్ట్రంలోని బంజారా విద్యార్థులను గూర్చిన వివరాలను సేకరించ వలసిఉండను. దీనిని బట్టి వీరి వెనుకబడిన తనమును గూర్చి గాని, ఆర్థికముగా వెనుకబడిన తనమును గూర్చియో? కంపల్‌సరి ఎడ్యుకేషన్ అమలు పరచుటకుగల అవకాశములను ప్రభుత్వమువారు చేపట్టులాగు చూడవలసి ఉండును.

దీనిని బట్టి మండల స్థాయిలో విద్యను ఏ విధంగా అమలు పరచగలరు? జిల్లా స్థాయిలో విద్యను ఏ విధంగా అమలు పరచగలరు?. రాష్ట్రస్థాయిలో వీరి విద్యకై ఏ విధములైన చర్యలు తీసుకోగలరు అనునది చూడవలసి ఉండను.

ఈ విషయములను విద్యార్థి సంఘ నాయకులు, సంఘ నాయకుల సహాయముతో నెరవేర్చవలసి ఉండును. హరిజనులకు ఈ విద్యా సౌకర్యములు 100కి 80 శాతము వరకు ఉపయోగించుకొనుచున్నారు. కాని బంజారాలు కనీసం 100కి 10శాతం కూడ ఉపయోగించుకొనుటలేదు. ముఖ్యముగా ప్రభుత్వమువారు దినపత్రికలలో ప్రకటించిన మేరకు ప్రభుత్వ హాస్టల్లలో 60 శాతం హరిజనులకు, 25 శాతం హరిజన క్రైస్తవులకు, 10 శాతం వెనుకబడిన వారికి, 5 శాతం గిరిజన విద్యార్థులకు అని తెల్పియున్నారు.

ఈ 5 శాతం ప్రకారం ఎంత మంది గిరిజన పిల్లలకు విద్యావసతి దొరకగలదు. అందులో బంజారా విద్యార్థులకు ఎంత మందికి స్థానం లభించగలదు. ఈ విధముగా ఉన్న వారికి విద్యాభివృద్ధి ఎప్పుడు జరుగుతుంది? కావున ప్రతి బంజారా విద్యావంతుడు, కార్యకర్త దీనిని గ్రహించి బంజారాల విద్యాభివృద్ధికై, బంజారా తాండాలలో, బంజారా సంఘము తరపున ఎటువంటి కార్యక్రమములు చేపట్టిన వీరి విద్యాదాహమును, తీర్చగలమో అని ఆలోచించి తగిన శ్రద్ధ తీసుకొనవలసి ఉండును.

ఈ కార్యక్రమమును చేపట్టక, మాకు స్కూళ్ళు లేవు, హైస్కూళ్లలో సీట్లు దొరకటము లేదు హాస్టళ్లలో సీట్లు దొరకటము లేదు. కాలేజీలలో మాకు స్థానం లేదు అని వృథాగా చెప్పుకొనుటవలన ప్రయోజనము లేదు.

సంఘము ద్వారా దీనికై శ్రద్ధ వహించిననాడు, అన్నియు వాటి అంతట అవే రాగలవు. మొత్తం క్యాడర్ వారి, విద్యార్థుల సంఖ్యను తయారు చేసి ప్రభుత్వము, ముందు ఉంచి, మా విద్యాభివృద్ధికై ప్రభుత్వం గైకొను చర్యలేమిటి? అని అడుగ గలిగిననాడు ఇది సాధ్యముకాగలదు. అంతవరకు సంఘమును కాని, ప్రభుత్వమును కాని నిందించుటవలన ప్రయోజనము లేదు.

సమాజభివృద్ధికి సంఘ బలము ఎక్కువగా కావలసి ఉండును, దీనిని ప్రతివారు గ్రహించి, ఎక్కడి కార్యకర్తలు వారికి సంబంధించిన వివరములు సేకరించుటకు పూను కొనవలసి ఉన్నది.

ముఖ్యముగా ఇక్కడ సంఘ నాయకులుగాని, విద్యార్థి నాయకులుగాని ఒకటి గ్రహించవలసి ఉన్నది. గిరిజనులు రిజర్వేషన్ అను నెపముతో, విద్యార్హత ఉండి చదువగలిగిన వారికి, కమిటీ మెంబర్లు, మీ రిజర్వేషన్ భర్తి అయినవి అని కూడ చెప్పుచున్నారు. కాని రిజర్వేషన్ ఎవరికి? ఎవ్వరైతే సాంఘికముగా, ఆర్థికముగా, రాజకీయముగా, విద్యాభివృద్ధి కాలేదో వారికి కల్పించవలెను.

కాని ఇక్కడ దానికి వ్యతిరేకముగా జరుగుచున్నది. రాజకీయంగాను, సాంఘికంగాను, ఆర్థికంగాను, విద్యాభివృద్ధిలో వెనుకబడిన వారికి కాలేజీలలో సీట్లు దొరకటము లేదు. అన్ని విధములుగా అభివృద్ధి చెందిన వారికి దొరుకుచున్నది. 100కి 6 శాతం రిజర్వేషన్‌ను పెట్టి నలుగురికన్న ఎక్కువ మంది ముందుకు రాకుండ చేయుచున్నారు.

అదే ఆర్థికముగా, రాజకీయంగా, సాంఘికంగా, విద్యాభివృద్ధి చెందినవారు ఒక సబ్జక్టులో కాని, లేక ఒక సెషన్‌లోకాని, ఒకే కాలేజీలో కాని లెక్క వేసి చూచిన మొత్తం 3 లేక 4 కులములకు చెందినవారే, ఎక్కువగా ఉంటారు. ఈవిద్యా విధానములో రెడ్డి, బ్రాహ్మణ, వైశ్య, కమ్మ లేక మరి కొన్ని వర్గములవారే ఎక్కువగా ఉందురు. మొత్తం జనాభాను బట్టి చూచిన వీరి జనసంఖ్య ఎంత? వారు అనుభవించే ఉద్యోగాలు కానీ, విద్యా సంస్థలలో వారికి ఉన్న సీట్లుగాని ఎన్ని? అనునది ప్రతివారు గ్రహించవలసిన విషయం.

అన్ని రంగాలలో అభివృద్ధి చెందినవారు కాలేజీ విద్యను ఎలిమెంటరి విద్య లాగా చదువు కొనుచూ ఉంటే? అన్ని విధములుగా వెనుకబడిన వారు ఒక హైస్కూలు విద్యను యూనివర్సిటి విద్యకన్న అతి కష్టముగా పొందగలుగుతున్నారు. అన్ని రంగములలో అభివృద్ధి చెందినవారు యూనివర్సిటి విద్యనుకూడ వారు అతి సులభముగా పొందగలుగుచున్నారు.

కార్యకర్తలు గాని విద్యార్థి నాయకులుగాని(బంజారాలు) వీరి స్థితిని, అభివృద్ధిని అయిన వారి స్థితులను పోల్చుకొనిచూడ వలసి ఉండును. అప్పుడే వారికి నిజమైన అభివృద్ధి కార్యక్రమములు అర్థమవగలవు. చిన్న విషయమును కూడ పెద్దగా ఆలోచించగలిగిన నాడు వాటి నివారణోపాయం గోచరించగలదు.

**బంజరాలు – స్త్రీ – శిశు సంక్షేమము :** మహిళా సంఘము వారు ఈ కార్యక్రమమును చేపట్టవలసి ఉన్నది. ముఖ్యముగా ప్రతి తాండాలో భర్తలు కోల్పోయిన అనాథ స్త్రీలు ఉంటారు. వీరి అభివృద్ధికి సంఘము ద్వారా వివరములను సేకరించి, కొన్ని పథకములు తయారు చేయవలయును.

ముఖ్యముగా మన బంజారా స్త్రీలు, వారి డ్రస్సులను తయారు చేయుటలో చాలా కాలమును వృథా చేస్తూ ఉంటారు. అలాంటప్పుడు నిరాశ్రయులైన స్త్రీలకు కుట్టు మిషనులు నేర్పించి, చేతి కుట్టుకు బదులు మొత్తం డ్రస్సును ఎంబ్రయిడరి కుట్టు మిషను ద్వారా తయారు చేయించి, సరసైన ధరలకు విక్రయించి, వీరికి జీవనోపాధిని కల్పించవచ్చును.

మరి కొందరు స్త్రీలను, పిల్లల తల్లిదండ్రులు పొలం పనులకు పోవుకాలములో వారి పిల్లలను పోషించుటకు చాలా కష్టములు కలుగుచుండును. కావున చిన్న పిల్లలందరిని ఒక చోట చేర్చి, శిశు విహార్‌ను ఏర్పాటు చేయించి అక్కడవారి పోషణకు, కావలసిన కొన్ని ఆహార పదార్థములను ఉంచి, వారికి ఎటువంటి కష్టములు కలుగకుండ కాపాడి , వారి తల్లి దండ్రులు తిరిగి పనినుంచి వచ్చు వరకు ఎటువంటి దిగులు చెందక, పిల్లలను కాపాడు చుండునట్లు చేయవచ్చును.

మరి కొన్ని వారికి సంబంధించిన అభివృద్ధి కార్యక్రమములను చేపట్టివారిలో సాంఘిక మార్పులు, పిల్లల ఆరోగ్యమును గూర్చి శ్రద్ధ తీసుకొనునట్లు చేయుట, ఆహార పదార్థములను రుచికరముగా తయారు చేసి అందరికి నేర్పించుట, క్రొత్త క్రొత్త పాటలు, డ్యాన్సులు మొదలైన కార్యక్రమములలో వారిని ఉపయోగించి, ఇటు బీద స్త్రీలు జీవనాధారము, అటు ఇతరములైన సౌకర్యములు కలిగింప వలసివచ్చును.

ఈ కార్యక్రమమును సంఘీ భావము కలిగిన స్త్రీలు, విద్యావంతులైన స్త్రీలు, మరియు ఉద్యోగుల భార్యలు ముందుకు వచ్చి ఈ కార్యక్రమమును చేపట్టవలసి ఉండును. ఈ విధముగా చేసినచో, వాటి యొక్క సౌఖ్యములను అందరు స్త్రీలు, వారి పసి పిల్లలు అనుభవించుటకు వీలుకలుగును.

దీనికై విద్యావంతులైన, ఉద్యోగుల భార్యలు ఎక్కువగా పాటు పడవలసి ఉండును, ఈ విధములైన కార్యక్రమములు వీరు చేపట్టిన ఎడల తగినంత ప్రభుత్వ సహాయమును పొందుచూ సాటి కులములోనున్న బంజారా స్త్రీల మన్ననలను పడయుచూ, మంచి కీర్తిని సంపాదించుటకు రాజకీయ రంగములో స్త్రీల యొక్క హక్కులను కూడ సంపాదించుటకు అవకాశములు కలుగును.

ఈ విధంగా సంఘ సదుపాయములు పొందుటకై స్త్రీలు ముందుకు వచ్చిననాడు, జాతి అభివృద్ధి, దేశాభివృద్ధికిపాటు పడిన వారై, వారి యొక్క సేవ ఈ భూమి పై చిరస్థాయిగా ఉండుటకు అవకాశములు ఏర్పడగలవు. స్త్రీలు, స్త్రీలు యొక్క బాధ్యతలను గ్రహించగలిగిన నాడు వారే ముందుకు కార్యరంగములో దూకి పని చేయగలరని విశ్వసిస్తాను.

**బంజారా వృద్ధులు :** ప్రతి తాండా యందు నిరాశ్రయులైన ముసలివారు ఉంటారు. వారు తమ వృద్ధాప్యములో ఎటువంటి జీవనాధారము లేక ఎన్నో రకములైన బాధలకు గురియగుచుందురు. సంఘ కార్యకర్తలు అటువంటివారి గూర్చిన వివరములు కూడ సేకరించ వలసి ఉండును. ప్రభుత్వము వారు వీరికై వృద్ధాప్య ఫించను మంజూరు చేస్తూ వున్నారు. కాని వారికి ఈ సౌకర్యమును కలుగ చేయవలసి ఉండును. ప్రభుత్వము వారు ఇచ్చిన ఈ సౌకర్యము వీరికి చాలదు కనుక అటువంటి వారిని తాండాలలో అమలు పరచు కార్యక్రమములలో ఉపయోగించుకొని కొంత సహాయము అందివ్వవచ్చును.

వీరికి బావుల దగ్గర , కూరగాయల పెంపకము చోట, మాగాణి పొలముల దగ్గర , గోదాములు దగ్గర, పశువుల కొట్టముల దగ్గర కాపలాదారులుగా నియమించి వారి సహాయమును తీసుకొంటూ, మనము వారికి కూడ సహాయపడి, వారి జీవితములో కొంత శాంతిని, సౌఖ్యమును ప్రసాదించగిలిగిన వారముగుదము. కావున కార్యకర్తలు వీరిని గూర్చిన వివరములు కూడ సేకరించవలసి ఉండును.

**వారి అభివృద్ధి కార్యక్రమములు :** తాండాలోని 14 సం వయస్సు కలిగిన పిల్లల జనసంఖ్యను తీసిన తరువాత తాండాలోని కుటుంబములవారి పరిస్థితులు గ్రహించవలసి ఉన్నది. అందులో భూ వసతి కలిగినవారు ఎంతమంది? అందులో 2 ఎకరములలోపు ఎన్ని కుటుంబములు? 5 ఎకరములలోపు ఎన్ని కుటుంబములు? 10 ఎకరములలోపు ఎన్ని కుటుంబములు? ఎంతమందికి భూవసతి లేదు? అను విషయమును రికార్డు చేసిన తరువాత వీరి అభివృద్ధికి ఎటువంటి విధానమును అవలంభించిన లాభముండగలదు. అను విషయం తెలుసుకొనవలయును.

ఈ విధంగా భూమికి సంబంధించిన వివరములు తెలుసుకొన్న తరువాత ఇక ఎంత మందికి భూవసతి కల్పించవలసియున్నది అను విషయం తేలిపోగలదు. అందువలన ప్రభుత్వంవారు అమలు పరుస్తున్న భూ సంస్కరణలవలన ఎంత మందికి లాభం చేకూర్చగలదు. భూసంస్కరణల వలన వీరికి లాభము చేకూర్చలేని పక్షమున, వీరి తాండాకు సమీపములో వ్యవసాయ యోగ్యమైన భూములు ఏవైన యున్నవా, అను విషయమును గ్రహించి, వాటిని సంపాదించుటకై ప్రభుత్వము వారితో సంప్రదించి వీరికి ఇప్పించవలసి ఉన్నది. భూ వసతి కలిగి కూడ ఎంత మంది వ్యవసాయం చేయుటలేదు అను విషయం తెలుసుకొనవలసి ఉన్నది. వీరి అభివృద్ధికి కొన్ని పథకాలను తయారు చేయవలసి ఉండెను.

వీటి అభివృద్ధికి నీటివసతి యున్నదా? ఈ ప్రాంతములో చెరువులు ఏవైన యున్నవా? వాటిని మరమ్మత్తు చేయించుట. ఒకవేళ క్రొత్తగా చెఱువులు ఏర్పాటు చేయుటకు అవకాశములున్నవా? అట్లు లేకున్న బావులు త్రవ్వించుటకు ఏమైన అవకాశములు ఉన్నవా? ఏ విధముగా అభివృద్ధి పరచిన ఎన్ని ఎకరములు సాగులోనికి వస్తాయి? వారు ముఖ్యముగా పండించు పంటలు ఏమిటి? ఎటువంటి పంటలు పండించ వచ్చును? ఒకవేళ పండించిన పంటలకు వెంటనే మార్కెట్టు సౌకర్యములున్నవా? ఈ విధముగా అన్ని విషయములు గ్రహించి, మొత్తం తాండా ప్రజలను వారికి అనుకూలమైన పొలములను గ్రూపులుగా చేసి వారి పంటల అభివృద్ధి పథకములు తయారు చేయవలసి ఉండును.

కొన్ని పొలములు కూరగాయాలు పండించుటకు, కొన్ని పొలములు నీరు లేక నీటిసాగు ద్వారా పండించు పంటలుగా నిర్ణయించుట, పండ్ల తోటలు అభివృద్ధి చేయుటకు అవకాశమున్న వారిని కొన్ని గ్రూపులుగా తయారు చేయుట. ఈ విధముగా వరి పండించు పొలములు, ధాన్యములు పండించు పొలములు, కూరగాయలు పండించు పొలములు, మరియు వాణిజ్య పంటలు పండించు పొలములు, పండ్ల తోటలు పండించు పొలములు, అన్ని కలసి కొన్ని గ్రూపులుగా చేయవలయును.

ఈ గ్రూప్ వారికి ఏర్పాటు చేసిన తరువాత, వీటి సాగుకు కావలసిన వివరములను తెల్పుతూ, వీటిని సాగు చేయుటకు కావలసిన ఆర్థిక సహాయమును ప్రభుత్వము ద్వారా కాని లేక జాతీయము చేసిన బ్యాంకులు ద్వారా కాని, భూమి అభివృద్ధి బ్యాంకుల ద్వారా కాని పొంది, వాటి పథకములు తయారుచేసి, ఆహార ఉత్పత్తిని సాధించవలసి ఉండును.

ఈ విధముగా గ్రూపులు తయారు చేయుటవలన, ఎవరు ఎంత ధాన్యము పండించగలరు? ఎంత వాణిజ్య పంటలు పండించగలరు? కూరగాయలు ఎన్ని పండించగలరు? పండ్లు సంవత్సరములో ఎంత ఉత్పత్తి చేయగలరు? అను విషయములు ముందుగా తెలుసుకొని, వాటిని మార్కెట్టులో సులభముగా ఖర్చు చేయుటకు, కొన్ని ఏర్పాట్లు చేసుకొన వీలుకలుగును. ఈ విధముగా పంటల పథకంగా భూవసతిని బట్టి ఎవరికి ఎంత సహాయం ఏ విధముగా అందించవలసి ఉండును అను విషయం తెలిసుకొనవచ్చును.

ఎంత మందికి వ్యవసాయ ఎడ్లు ఇవ్వవలసి ఉండును, ఎంత మంది వ్యవసాయ దారులకు, వ్యవసాయ బావులు త్రవ్వించ వలసి ఉండును, పాత చెఱువుల మరమ్మత్తులుగాని,

క్రొత్తచెరువుల నిర్మాణముగాని, ఒకవేళ నది ప్రవాహము ఉన్న కాల్వ సౌకర్యములు కల్పించవచ్చునా? నీటిని తోడి వ్యవసాయ అభివృద్ధి చేయవలసిన పథకములు ఏవైన ఉన్నవా? పంటల అభివృద్ధికి ఆర్థిక సహాయం ఎంతమందికి అవసరము. రసాయనిక ఎరువులు ఎంత అవసరము, ఎవరి అవసరము ఎంత అను విషయములు తెలుసుకొనుట వలన ప్రతి వారికి సహాయము చేయుటకు వీలుకలుగును.

అట్లు కానిచో ఎవరైన మాటకారి ఉన్నచో, ప్రభుత్వం ఇచ్చు ఎడ్ల జతలు, బ్యాంకుల ద్వారా ఋణములు. బావులు త్రవ్వుటకు ఇచ్చు సబ్సిడీలు, వ్యవసాయ పనిముట్లు, ప్రభుత్వగ్రాంట్లు, పాడి అభివృద్ధికి ఇచ్చు పాడిగేదెలుకాని, అన్ని విధములైన సహాయ సహకారములు ఎన్నో కొన్ని కుటుంబములు మాత్రమే అనుభవించుటకు వీలు ఏర్పడుతుంది.

ఇటువంటి వివరములు సేకరించకపోవుట వలన సంఘకార్య కర్తలకు,ఎవరికి సహాయం చేయించ వలయును, ఎవరికి అవసరములేదు అను విషయం తెలియదు. పంచాయితీల ద్వారా కాని, ప్రజాపరిషత్‌ల ద్వారా కేటాయించు ఋణములు, వ్యవసాయ పనిముట్లు, ఎరువుల పెంపకం, బావులు త్రవ్వటం ఎంత అవసరము, అను విషయములు తెలియక సరియైన మార్గములో అడగలేని పరిస్థితిలో పడిపోతారు. ప్రజాపరిషత్ మొత్తం వాటిలో బంజారాలకు ఎంత వాటా ఇవ్వవలసి ఉండును? ఎంత ఇస్తున్నారు. ఎంత ఇవ్వలేదు? ఎందుకు ఇవ్వటములేదు. తరువాత ఏమైన ఇస్తున్నారా? ఇచ్చిన వాటిని ఎవరెవరికి ఇవ్వవలసి ఉండును, అను వివరములు ముందుగా తెలుసుకొనవచ్చును.

ప్రజాపరిషత్‌ల ద్వారా ఏర్పాటు చేయు పంట ప్రోగ్రాం. వాటి అభివృద్ధికి చేపట్టిన కార్యక్రమములను బట్టి బంజారాల వాటాను నిర్ణయించవచ్చును. మరియు ప్రజాపరిషత్ ఆఫీసులలోను వ్యవసాయ విస్తరణాధికారులను కూడ సరియైన మార్గములలో తాండాలను దర్శించి వారి అభివృద్ధి కార్యక్రమములపైన సరియైన రికార్డులు సృష్టించి, పంటల అభివృద్ధికై ప్రభుత్వంవారు ఏర్పాటు చేయుచున్న పంటల పోటీలలో పాల్గొని, వీరు కూడ బహుమతులను సంపాదించుటకు వీలు కలుగునట్లు చూడవచ్చును.

కావున సంఘకార్యకర్తలు భూ సంబంధమైన వివరములు సేకరించి, వ్యవసాయాభివృద్ధికి పాటుపడుటయే కాక, ఎప్పటి కప్పుడు ప్రభుత్వమువారు చేపట్టిన, అమలు జరుపుతున్న అభివృద్ధి కార్యక్రమములలో, వీరిని కూడ భాగస్వాములుగా చేసి, సంఘముపై మంచి అభిప్రాయము ఏర్పడి, సంఘ అభివృద్ధికి, జాతి అభివృద్ధికి, దేశాభివృద్ధికి పాటుపడునట్లు చూడవచ్చును.

అవకాశమున్న చోట్ల, జాయింట్ ఫార్మింగ్ సొసైటీలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రములు, ఏర్పాటు చేసి వీటి ద్వారా ప్రభుత్వ సహాయమును పొందవచ్చును. అనంతపురం జిల్లాలో కదిరి తాలూకా, పడమర బ్లాకు ద్వారా అడివి బ్రాహ్మణపల్లి తాండాలో జాయింట్ ఫార్మింగ్ సొసైటీని ఏర్పాటు చేసి, 110 జతల ఎడ్లు, 40,000 రూపాయల వ్యవసాయ పనిముట్లు, ప్రతి కుటుంబమునకు 3 ఎకరముల భూమి, వ్యవసాయ పనుల కాలంలో 7 నెలల కాలంనకు ప్రతినెల కుటుంబమనకు 50/- రూ. ల చొప్పున మరియు 35 వ్యవసాయ బావులు త్రవ్వటం, పాతచెరువు

మరమ్మత్తు, భూములులేని వారికి భూములు ఇప్పించుట, తాండా మొత్తంనకు కావలసిన ఇతర సౌకర్యములు పశువుల అభివృద్ధి, విద్యుచ్ఛక్తి ద్వారా వీధి లైట్లు, బావులకు పంపుసెట్లు ఈ విధముగా కేంద్ర ప్రభుత్వము ద్వారా ఇప్పటికి 10,50,000 రూ. ఖర్చు చేయటం జరిగినది.

ఈ జాయింటు ఫార్మింగ్ సొసైటీ ద్వారా మరియొక నష్టము ఉన్నది. ఇందులో ఉన్నవారికే అన్ని సౌకర్యములు లభించగలవు. లేనివారికి ఏదిలేదు. ఉన్నవారికి కొంత అభివృద్ధి చెందుటకు అవకాశం ఏర్పడుతుంది.

సమిష్ట వ్యవసాయం ద్వారా! ఉన్నవారు, లేనివారు అందరు సమానంగా అభివృద్ధి చెందగలరు. వీరి భూమి అంతటిని ఏక ఖండముగా చేసి, ఆ భూములో వరి పండించు భూములు కూరగాయలు పండించు భూములు, ధాన్యం పండించు భూములు, పండ్ల తోటలు పండించు భూములు, వాణిజ్య పంటలు పండించు భూములు(చెరుకు, వేరుశెనగ, ప్రత్తి, పొగాకు) గా ఏర్పాటుచేసి, అధిక పంటలు పండించి వాటి ద్వారా సంఘ ఆదాయమును అభివృద్ధి చేయుదురు.

ఇక్కడ ఒక కుటుంబమే అన్ని పంటలు పండించక, కొన్ని కుటుంబములు కలసి ఒక పంట పండించుటవలన వారు, ఎక్కువ మొత్తంలో పండించుటకు అవకాశము కలుగును. దీని వలన వ్యవసాయదారునకు అనవసరమైన త్రిప్పట, పంట సరిగా పండలేదే అనుభావము ఏర్పడదు. ఎవరు ఎంత పండించిన, ఆ పంట అంతయు సంఘమునకు వర్తించి, ఎవరి కుటుంబమునకు ఎంత ధాన్యము, కూరగాయలు, పండ్లు, పాలు, డబ్బులు అవసరమో అంత సంఘము ద్వారా అందివ్వగలరు.

ఈ విధముగా చేసినచో తక్కువ శ్రమతో, ఎక్కువ సుఖములను అనుభవించుటకు వీలుకలుగును. ఈ విధముగా చేయుటవలన ఎవరి ఆస్తికి ఏ విధమైన లోటుండదు. ఎవరి ఆస్తి వారికే ఉండును. నాది, నీది అనుభావము రాకుండ ఇదిమాది, ఇదంతామనది అనుభావము ఏర్పడి సుఖజీవనము ఏర్పడును.

ఈ పద్ధతిని ఏర్పరచినప్పుడు నీటి అభివృద్ధికి, చేపట్టవలసిన కార్యక్రమములు, ఆర్థిక సహాయము మొత్తం ప్రభుత్వమే భరించి సంఘాభివృద్ధికి ఎక్కువగా సహాయపడగలదు.

**పశు సంపద :** వ్యవసాయాభివృద్ధిలో ముఖ్యమైన పాత్రను వహించునది పశునంపద. దీనిని సంఘ కార్యకర్తలు ప్రతి కుటుంబములో ఎద్దులు ఎంత మందికున్నవి? ఆవులు ఎంత మందికున్నవి? గేదెలు ఎంత మందికున్నవి? గొఱ్ఱెలు, మేకలు ఎంత మందికున్నవి? అను విషయమును రికార్డు చేయవలసి ఉన్నది. వీటివలన ముఖ్యంగా పొలములకు ఎరువులు చాలా అవసరము ఎరువులులేనిదే పంటలు పండించుట చాలా కష్టము, అందువలన వ్యవసాయదారుడు, పశువులవలన, ఎరువులు, పాల ఉత్పత్తి, మాంసాహారము, వాటి సహాయమున ఆర్థిక సదుపాయములు కలుగ చేసికొనుచున్నాడు.

ఒకే కుటుంబీకుడు పొలం పనులు, పశువుల పోషణ చేసుకొని సరియైన మార్గంలో జీవించగలడా? లేదు. కారణం ఇంతకు ముందే ఒక కుటుంబము యొక్క పరిస్థితులు గూర్చి

చర్చించటం జరిగినది. మొత్తం తాండాలో ఒక్కొక్క కుటుంబమునకు ఏయే పశువులు ఎన్ని ఉన్నవి? మొత్తం పశువులు ఎన్ని ఉన్నవి? లేని కుటుంబములు ఎన్ని? అను వివరములు సేకరించవలసి ఉండును.

దాని ప్రకారం ఆవులు, గేదేలు ఎన్ని ఉన్నవి. ఎద్దులు ఎన్ని జతలు, గొఱ్ఱెలు, మేకలు ఎన్నియున్నవి, కోళ్లు ఎన్ని ఉన్నవి. అను విషయమును తెలుసుకొని, ఒక్కొక్క పశువర్గమును ఒక్కొక్క గ్రూపుగా చేసి వాటి అభివృద్ధికి పథకాలు తయారు చేయవలసి ఉండును.

వీటిని అభివృద్ధి పరచుటకు, గ్రూపులు తయారు చేయుటవలన, వాటి అభివృద్ధికై ప్రభుత్వమువారు చేపట్టిన, అభివృద్ధి కార్యక్రమాలలో వీరిని కూడ చేర్చి, వీరి అభివృద్ధికై జాతీయము చేయబడిన బ్యాంకులు ద్వారా ఋణములను గ్రహించి, మేలు రకములైన పశుసంపదను అభివృద్ధి పరచుటకు, అక్కడ నివసించుచున్న కుటుంబములను బట్టివాటి సంఖ్యను అభివృద్ధి పరచుటకు ఎక్కువ సంఖ్యలో కొనుగోలు చేసి వాటిద్వారా జీవనోపాదిని పొందుటకు అవకాశము ఏర్పడును. వాటిద్వారా ఉత్పత్తి అయిన, పాలు, మాంసము, కోడిగ్రుడ్లు మార్కెట్టులో సులభముగా ప్రవేశపెట్టి మంచి లాభమును పొందుటకు అవకాశము ఏర్పడును. ఈ విధముగానే కొంత మందికి కోళ్లు పెంచుటకు(పౌల్ట్రీ ఫారం) పందులు పెంపకం, చేపల పెంపకం చేయుటకు ప్రభుత్వము ద్వారా గ్రాంట్లుగాను, అప్పులుగాను స్వీకరింప చేసి, వాటి అభివృద్ధికి, వారి ద్వారా ఉత్పత్తిని పెంచి మంచి లాభములు పొందవచ్చును.

ఈ విధముగా పందుల పెంపకము, చేపల పెంపకం, కోళ్లు పెంపకం ద్వారా నిరుద్యోగులైన బంజారాలకు ఉపాధి పథకాలను సంఘము ద్వారా ప్రవేశింపచేసి ప్రతివాడికి సంఘము తరపున కొంత సహాయం అందివ్వవచ్చును. ఇది చేసిన నాడు సంఘ అభివృద్ధికి సంఘము ద్వారా బీదవారు, ఉన్నవారు దూరము అవటానికి అవకాశం ఏర్పడదు. సంఘములేకున్న షావుకారు అయిన, బీదవాడు అయిన సరియైన సహాయము అందుకోలేడు, అను విషయమును ఋజువు చేయవలసి ఉన్నది.

ప్రతివారికి పని, ఆదాయం, సుఖం, సౌఖ్యం లభించి ఆహార కొరత, అధిక ధరల బెడద, తీర్చటానికి అవకాశం ఏర్పడగలదు. కావున కార్యకర్తలు దీనిని గ్రహించి వారి అభివృద్ధికై తాండాల వారి, మండలం వారి, జిల్లావారి ప్రణాళికలను తయారు చేసి ప్రభుత్వము ఏర్పాటు చేసిన వ్యవసాయశాఖ ద్వారా, పశుపోషణ శాఖవారు చేపట్టిన అభివృద్ధి కార్యక్రమముల ద్వారా వీటి అభివృద్ధి చేపట్టవచ్చును.

పంటలకు వచ్చు చీడపురుగుల ద్వారా నష్టము, పశువులకు వచ్చు రోగముల ద్వారా వచ్చు నష్టము ప్రభుత్వము వారికి ఎప్పటికప్పుడు తెలుపుచు వాటి నివారణకు కావలిసిన మందులను ఎప్పటికప్పుడు గ్రహించి వాటి అభివృద్ధికిపాటుపడతూ మంచి లాభములను సంపాదించవచ్చును.

పై విధముగా భూములకు, మరియు పశువులకు సంబంధించిన వివరములు గ్రహించిన తరువాత ఎంత మందికి భూవసతి, పశు సంపద కాని లేదు. రికార్డు చేసిన తరువాత మిగిలిన కుటుంబముల గూర్చి, వారి జీవనాధారము గూర్చి ఆలోచించవలసి ఉన్నది. వారు

నివసించు భాగములో వారి జీవనాధారమునకు మరి ఏ విధమైన ఆధారము ఉన్నదా? చాలా మంది ఆడవిలోని కట్టెలను, కొండగడ్డిని గ్రామప్రాంతాలలో విక్రయించి జీవనం చేస్తూ ఉంటారు. కొంత మంది సున్నపు రాళ్లను కాల్చి అమ్ముతుంటారు. ఇటువంటి వారి అభివృద్ధికై లేబర్ కాంట్రాక్టు సొసైటీలు, రిజిస్టరు చేసి వారి అభివృద్ధికిగాను బ్యాంకుల ద్వారా ఋణములను ఇప్పించుట, కట్టెల డిపోలను ఏర్పాటు చేయుంచుట మరియు అడవి ప్రాంతములలో లభ్యమగు ఇతర వస్తువులను సులభముగా గ్రహించి, వారికి సరియైన ధరలకు మార్కెటు నందు విక్రయించి లాభమును చేకూర్చుట.

కొంత మందికి పశుపోషణ మీద ఆధారపడునట్లు గ్రూపులు, గ్రూపులు గా తయారు చేసి, కోళ్ల పెంపకం, పందుల పెంపకం, గొఱ్ఱెల పెంపకం, పాల ఉత్పత్తి చేయుటకు పాడి గేదెలు, ఆవులు ఇప్పించి వారి ఆర్థికాభివృద్ధికి పాటుపడునట్లు చేయుట, ఈ విధములైన కార్యక్రమములు చేపట్టవలసి ఉండును.

**గృహవసతి :** తాండాల వారి వివరములు సేకరించి ఎంతమందికి గృహవసతి కావలసి ఉన్నది. మండలంవారి, జిల్లావారి వివరములను సేకరించి ప్రభుత్వమునకు సమర్పించవలసి ఉండను. దీని ద్వారా ప్రభుత్వమువారు హరిజన, గిరిజన కార్పొరేషన్స్ కో. ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీని ఏర్పాటు చేసి ఉన్నారు. దీని ద్వారా ప్రతి గిరిజన కుటుంబమునకు 13,000/- రూ. మంజూరు చేస్తున్నారు.

దీనివలన ఎవరికివారు ఈ 13,000/- రూ.లలో ఇల్లు కట్టించుట కష్టమగును. వారిని ఒక గ్రూపుగా చేసి, అందులో కొంత మంది ఇటుకలు తయారు చేయుట, కొంత మంది చేత పునాదుల నిర్మాణమునకు రాళ్ళను కొట్టుటకు, కొంత మంది చేత పునాదులు తీయించుట, కొంత మందిని ఇంటి కట్టడములో పనిచేయించుట, కొంత మంది చేత కలప పని చేయించుట మొదలగు కార్యక్రమములు చేపట్టి, ప్రభుత్వమువారు మంజూరు చేసిన 13,000/- రూ అనగా ఒక తాండాలో సుమారు 50 గృహములు మంజూరు అయినవి అనుకొందాము. కాలని నిర్మాణమునకు సుమారు రూ. 6,65,000/- రూ.లను ఏక ఖండముగా ఉంచి, 50 గృహములకు కావలసిన, కలపను సిమెంటును, ఇనుమును, ఇంటి తలుపులకు ఉపయోగపడు ఇతర సామానులు అన్నియు ఒకేసారి కొని, వాటి రవాణా ఖర్చులను తగ్గించి లాభమును పొందవచ్చును.

ఈ విధముగా అన్ని పనులు ఉమ్మడిగా చేసి నిర్మించిన, అన్నివసతులు కలిగిన గృహమును తక్కువ మొత్తంలో నిర్మించవచ్చును. ఇట్లుకాక, గృహ నిర్మాణములను మధ్యవర్తితో నిర్మించుటకు స్వస్తి చెప్పించవచ్చును. మధ్యవర్తులు నిర్మించిన గృహములు సంసారము చేయుటకు సరిపడవు కారణం అన్ని పనులు 13,000/- రూ.లలో ముగించి, అందునుండి వారికి మంచి లాభము కూడ రావలసి ఉండును.

వారు కుటుంబమునకు సరిపడు గృహములను నిర్మించలేరు. ఈ కార్యక్రమమును కార్యకర్తలు గ్రహించి, ఇటువంటి కాలనీలు ఒక మండలంలో ఎన్ని నిర్మించవలసి ఉన్నది సేకరించవలసి ఉండును. వీటి నిర్మాణ అవకాశములను ప్రభుత్వముతో సంప్రదించి, నివాసమునకు సంబంధించిన, అవసరములు ముందు, ముందు తల ఎత్తకుండ చేయవచ్చును.

ఈ విధముగా గృహ నిర్మాణము జరిగిన తరువాత ఇతరములైన గ్రామ అవసరములను ప్రభుత్వ సహాయముతో శ్రమదానము వలన సులభముగా నిర్మించవచ్చును. 1) పిల్లల విద్యాభివృద్ధికి స్కూలు, 2) ప్రజా సౌకర్యములకు ఆసుపత్రి, 3) పశువుల ఆస్పత్రులు, 4) బాల్ వాడీలు, 4) స్త్రీ, శిశు సంక్షేమ భవనములు, 5) దేవుని గుడి, 6) అతిథి గృహము, 7) లైబ్రరి, 8) పార్కులు, 9) వ్యాయామ శాలలు, 10) కమ్యునిటి హాలు, 11) గోదాములు, 12) పశువుల కొట్టములు, మరియు ఎన్నో విధములైన ప్రజా సౌకర్యములకు ఉపయోగ పడు నిర్మాణ కార్యక్రమములను ప్రారంభించవచ్చును. ఈ విధముగా గ్రామపునర్ నిర్మాణ కార్యక్రమములు చేపట్టి మంచి లాభమును పొందవచ్చును.

**కుటీర పరిశ్రములు :** ముఖ్యముగా వ్యవసాయమును కూడ ఒక పరిశ్రమగా భావించ వచ్చును. వ్యవసాయమ ఆధునికముచేయవలయునన్న క్రొత్తక్రొత్త పనిముట్లు – ఉపయోగించ వలసి ఉండును. అందుకుగాను వ్యవసాయ పరిశ్రమలు, అనుకూలమున్న చోట్లలో స్థాపించవలసి ఉండును. దీనికిగాను ఐ.టి.ఐ లలో ట్రయినింగ్ అయిన వివిధ రకములైన పనివాళ్లను కొన్ని గ్రూపులుగా ఏర్పాటు చేసి, స్వయం ఉపాది కల్పన స్కీము ద్వారా వారిని సహకార పద్ధతిలో వర్కు షాపులను స్థాపింప చేసి మరనాగళ్లు, పంపునెట్లు, ఎలక్ట్రిక్ మోటారు వైడింగ్‌లు మొదలైన పనులు, మరియు వ్యవసాయంలో ఉపయోగించుపనిముట్లు తయారు చేయించవచ్చును.

గృహ నిర్మాణములో ఉపయోగించు ప్యాడ్‌లాక్సు, హింజస్, తలుపులకు ఉపయోగించు సామానులు, గృహములలో ఉపయోగించుకొను సామానులు, కుర్చీలు, మేజాలు, కిటికీలు, గేట్లు గోదాములు నిర్మాణముతో ఉపయోగించు ట్రస్సులు, మొదలైనవి ఉత్పత్తి చేయవచ్చును. ఈ విధముగా అందరికి ఉపాధి కల్పించవచ్చును.

వ్యవసాయ ఉత్పత్తిలో, ఉత్పత్తి అగు వేరుసెనగ నూనె తీయించి, వాటిని వాడకందారులకు సరసమైన ధరలకు అందునట్లు చేయుట. వాటి ద్వారా వచ్చు పొట్టును ఎరువులకు, మరియు రేకులను తయారు చేయుటకు ఉపయోగించవచ్చును, వేరుశెనగ చక్కను పాడి పరిశ్రమలో పశువులకు ఆహారముగా ఉపయోగించి మంచి లాభమును పొందవచ్చును. నూనె సహాయమున మామిడి పండ్లు, టమోటో, ఉసిరికాయలు, గోంగూర, పండుమిర్చి, మొదలైన పండ్ల ద్వారా పచ్చళ్లలను తయారు చేయించి మార్కెట్టులో ప్రవేశపెట్టవచ్చును, ఎగుమతులు కూడ ప్రారంభించవచ్చును.

కొందరి చేత సిరిసాపలు, గోనెలు పత్తి ద్వారా ఏకులు చేయించి వాటిని సరియైన మార్గములో తయారు చేయించి కుటీర పరిశ్రమలను అభివృద్ధి పరచి, ఆర్థికముగా మంచి లాభములను పొంది, ప్రజల శక్తిని సరియైన మార్గములో ఉపయోగించుకొన వచ్చును. ఆ విధముగా ప్రతి సమస్యను రూపమాపువలసి ఉండును.

**బంజారా తాండాలు – వస్త్ర సదుపాయములు :** మానవ జీవితములో చాలా ముఖ్యమైనది వస్త్రములు, ఇవి ఈనాడు బీద ప్రజలకు అందులో బాటులో లేకుండ, వాటి కొనుగోలు శక్తిని కూడ కోల్పోవుచున్నారు. నిజముగా చూచినట్లు అయిన ప్రత్తిని పండించునది రైతు. అతని ద్వారా ప్రత్తిని చాలా తక్కువ ధరకు కొనుగోలు చేసి వస్త్రములు

తయారు చేయు పరిశ్రమలకు పంపబడుతున్నది. కాని వస్త్రములు తిరిగి నేరుగా వాడకం దారులకు రాకుండ మధ్యలో దళారీ వ్యాపారస్తులు వాటిని హస్తగతం చేసుకొనుచున్నారు.

నిజానికి పరిశ్రమనుండి వచ్చు ధర కొంత, తక్కువగా ఉండిన, అవి రెండు మూడు చేతులు మారుటవలన వాటి యొక్క ధర విపరీతముగా పెరిగి పోవుచున్నది. కావున దీనిని నివారించుటకు మొత్తం జనాభా ఒక మండలంలో ఎంత ఉన్నది తెలుసుకొనుట వలన, ప్రజలకు మొత్తం ఎంత వస్త్రములు అవసరం అనునది సంఘముద్వారా లెక్కలు తయారు చేయవలసి ఉండును. ఈ విధముగా లెక్కలు తయారు చేయుటవలన ఎంత వస్త్రము అవసరము అనునది తేలిపోగలదు. అలాంటప్పుడు ఒక తాండా ప్రజలకు ఎంత వస్త్రములు అవసరము అను విషయం తెలుసుకొనవలసి ఉండును. వారు ఉత్పత్తి చేస్తున్న ధాన్యములు, కూరగాయలు, పండ్లు, పాలు, మాంసము, మరియు ఇతరములైన వాటి మీద వారికి లభించు ధన సంపదకు ముడిపెట్టివారికి వచ్చు ధనమునకు బదులు, వారికి సరిపడు వస్త్రములు సమకూర్చవలసి ఉన్నది.

ప్రజలకు కావలసిన వస్త్రములను మండల మార్కెటింగ్ సొసైటీ ద్వారా నియమ బద్ధమైన వస్త్రములను కొనుగోలు చేసి, వారికి తక్కువ లాభములో సమకూర్చవలసి ఉండును. ఈ పద్ధతిని అవలంభించిన, మధ్య దళారీలకు ఇస్తున్న లాభములనుండి వీరు బయట పడి వస్త్రములు వీరికి సరసమైన ధరలకు లభించగలదు. ఈ విధముగా చేయుటవలన ప్రజలకు వస్త్ర సౌకర్యములు కల్పించినట్లుగాను, ఈ పనుల నిర్వహణలో కొంత మందికి ఉద్యోగ అవకాశములు కల్పించి నిరుద్యోగ సమస్యను నివారించవచ్చును.

## సంఘము - ప్రణాళికలు

మండలంలోని అన్ని తాండాల వివరములు సేకరించిన తరువాత మండల కార్యకర్తలు మొత్తం మండలంలో ఎన్ని తాండాలు ఉన్నవి? అందులో మొత్తం ఎన్ని కుటుంబాలు నివసిస్తూ ఉన్నవి? వారిలో పొలమున్న కుంటుబాలెన్ని? భూ సంపదలేని కుటుంబములెన్ని? పశుసంపద పాడి గేదెలు, ఆవులు, ఎద్దులు, మేకలు గొఱ్ఱెలు మిగిలిన పశుసంపద ఎంత?

వ్యవసాయమునకు సంబంధించిన చెరువులు ఎన్ని? నిర్మాణం చేసినవి ఎన్ని? క్రొత్తగా చెరువుల నిర్మాణమునకు అవకాశములున్నవా? బావులు ఎన్ని? వాటి క్రింద సాగు ఎంత? ఏమి ఆధారము లేని కుటుంబాలేన్ని? అనాథ స్త్రీలు ఎందరు? నిరాశ్రయులైన ముసలివారు ఎందరు? ఎన్ని తాండాలలో స్కూలు వసతి ఉన్నది? ఇంకా ఎన్ని తాండాలలో స్కూలు వసతి కావలసి ఉన్నది? ఎన్ని తాండాలకు రోడ్డు వసతి ఉన్నది. ఎన్ని తాండాలకు విద్యుచ్ఛక్తి వసతి ఉన్నది? నీటి వసతి ఎన్ని తాండాలకున్నది? ఆరోగ్యవసతి ఎన్ని తాండాలకు ఉన్నది. అను విషయములను మండల స్థాయిలో గ్రహించిన తరువాత ప్రణాళికలను తయారు చేయవలసి ఉండును.

ఆయా తాండా ప్రజల స్వభావమును బట్టి, జాయింట్ పార్మింగ్ సొసైటీలు స్థాపించ వలసిన తాండాలు, సమిష్టి వ్యవసాయం స్థాపించవలసిన తాండాలు. క్రెడిట్ సొసైటీలు స్థాపించవలసిన తాండాలు, లేబర్ కాంట్రాక్టు సొసైటీలు స్థాపించవలసిన తాండాలు, పాల సొసైటీలు స్థాపించవలసిన తాండాలు, డైరీ ఫార్మింగ్ ఏర్పాటు చేయవలసిన తాండాలు, గొఱ్ఱెలు

అభివృద్ధి పథకం చేపట్టవలసిన తాండాలు, పౌల్ట్రీ ఫార్మింగ్ స్థాపించవలసిన తాండాలు( కోళ్లు) పందులు పెంపకం చేయవలసిన తాండాలు, చేపల పెంపకం చేయవలసిన తాండాలు సున్నపు రాయి తయారు చేస్తున్న తాండాలు, కట్టెల డిపోలు స్థాపించవలసిన తాండాలు, తెలుసుకొని వాటిని స్థాపించుటకు తగు ఏర్పాట్లు చేయవలసి ఉండును.

అలాగే కూరగాయలు అభివృద్ధి చేయవలసిన తాండాలు, పండ్ల తోటలు అభివృద్ధి చేయివలసిన తాండాలు, చెఱుకు ఉత్పత్తి చేయవలసిన తాండాలు, వేరుశనగ ఉత్పత్తి చేయగలిగిన తాండాలు మరియు ఇతరములైన వ్యవసాయ ఉత్పత్తులకు సంబంధించిన వివరాలు సేకరించ వలసి ఉండును.

ఆశ్రమ పాఠశాలలు స్థాపించవలసిన తాండాలు(ప్రాంతాలు) స్కూలు వసతి కల్పించవలసిన తాండాలు, హైస్కూలు, హాస్టళ్ళు స్థాపించవలసిన ప్రాంతములు. ఆరోగ్య సదుపాయములు చేయవలసిన తాండాలు, రహదారి సౌకర్యములు చేపట్టవలసిన ప్రాంతములు, విద్యుచ్ఛక్తి సదుపాయములు కల్గించవలసిన తాండాలు, కమ్యునిటి రేడియోలు ఏర్పాటు చేయవలసిన తాండాలు, లైబ్రరీలు స్థాపించవలసిన తాండాలు, మొత్తం తాలూకాలోని నిరుద్యోగులు, స్త్రీ సంక్షేమ శాఖలు స్థాపించవలసిన ప్రాంతములు, పారిశ్రామికంగా అభివృద్ధి చేయుటకు అనుకూలమైన ప్రాంతములు, అను విషయములు గ్రహించవలయును. పై వాటిని ప్రజాపరిషత్ ద్వారా, జాతీయం చేయబడిన బ్యాంకులు ద్వారా, భూమి అభివృద్ధి బ్యాంకు ద్వారా, జాతీయం చేయబడిన బ్యాంకుల ద్వారా, ప్రభుత్వ గ్రాంటు ద్వారాగాని ఎంత వరకు అవకాశములున్నవి, అను విషయమును తెలుసుకొన వలసిఉండును.

పై విధంగా వివరములు తెలుసుకొని ప్రణాళికలు ఏర్పాటు చేసిననాడు, వాటిని క్రమ పద్ధతిలో నిర్వహించుటకు, విద్యావంతులు కావలసి ఉండును, వాటికి సంబంధించిన లెక్కలు, ఆయా కార్యక్రమములు సక్రమ మార్గములో నడిపించుటకు కావలసి ఉండును. ఆయా సొసైటీలలోని కార్యక్రమములను, చేపట్టుటకు బంజారా విద్యావంతులను, ఉద్యోగులుగా నియమించవచ్చును.

ఈ విధముగా నియమించుటవలన నిరుద్యోగ సమస్య నిర్మూలించుటయేకాకుండా ఇంకను చాలా ఖాళీలు ఏర్పడుటకు అవకాశము ఉండును. ఫార్మింగ్ సొసైటీలు, గృహనిర్మాణ పథకములు, డైరీ ఫార్మింగ్, ఫౌల్ట్రీ మొదలైన సంస్థలు నడిపించుటకు వ్యవసాయ పట్టభద్రులు, ఇంజనీర్లు సాంకేతిక నిపుణులు, సహకార సంస్థ నిర్వాహణధికారులు, డాక్టర్లు, సూపర్‌వైజర్లు, వివిధములైన వృత్తులు చేపట్టగల కార్మికులు చాలా మంది కావలసి ఉండును. ఇందువలన నిరుద్యోగం అనుప్రశక్తి లేకుండ, ఇంకను ఎక్కువ మందికి అవకాశం ఏర్పడగలదు. మాటకువచ్చిన ఇప్పుడు ఉద్యోగములు చేయుచున్నవారు కూడ ఈ కార్యక్రమములో భాగస్వాములై, వారి సంసారము, వారిని ఆశ్రయించిన తోటి ప్రజలకు కూడ అన్ని విధములైన సౌఖ్యములు కలుగ చేసినవారు కాగలరు.

తాండాలలోని మానవ సంపదను, భూసంపదను, పశు సంపదను, వనరుల సంపదను సరియైన మార్గములో ఉపయోగించుటకు తగిన విధముగా ప్రణాళికలు సిద్ధపరచి, వాటిని

అమలు పరచినట్లు అయిన కొద్ది రోజులలోనే వాటి ద్వారా ఉత్పత్తులను ప్రారంభించివచ్చును.

వారు పండించు ధాన్యమును, కూరగాయలు, పండ్లు వాణిజ్య పంటలు, పాలు కోడిగుడ్లు, చేపలు మాంసము, అన్నియు వారివారి అవసరములకు సరిపోను, మిగిలిన వాటికి సరియైన మార్కెట్లు వసతి కల్పించవలసి ఉన్నది. వాటి అభివృద్ధికి తగినంత ఆదాయము రావటము ప్రారంభించిన ఉత్పత్తి అభివృద్ధి పరచుటకు ఎక్కువ శ్రద్ధ కనుపరచుదురు. అట్లు చేయుట వలన వాటి అభివృద్ధికి కావలసిన ఆర్థిక సహాయము, ఇతర సహాయములు సంఘము ద్వారా కల్పించవలసి ఉండును.

దీనికిగాను సంఘము తరపున తమ తాండాలలోని వ్యాపార స్వభావము కలిగిన యువకులను ఎన్నిక చేసి వారి ద్వారా నేరుగా ఉత్పత్తిని మార్కెట్టులో ప్రవేశింప చేసి, వాడకం దారులకు సరసమైన ధరలకు అమ్మి ఉత్పత్తిదారులకు మంచి లాభము చేకూరునట్లు చేయవచ్చును. ఎక్కువ ఉత్పత్తిని సాధించినట్లు అయిన స్టాకులున్న చోట్లలో మార్కెటింగు సొసైటీలు స్థాపించి, వాటిని కొనుగోలు చేసి స్టాక్ చేయుటకు ప్రారంభించవలయును.

ఇట్లు చేయుటవలన వారు పండించు పంటలకు మంచి మార్కెట్టు సదుపాయం చేసి, ఉత్పత్తి దెబ్బతినకుండ కాపాడ వచ్చును. ఈ విధముగా చేయుటవలన మధ్య దళారీలను అరికట్టి, అధికధరలను నివారించవచ్చును. మరియు వారికి కావలసిన అవసరములైన గుడ్డలు, వ్యవసాయ సామాగ్రి, సిమెంటు, ఎరువులు, ఇనుము మొదలైనవి కాని, వారి అవసరములను బట్టి సరసమైన ధరలకు అందివ్వవచ్చును.

కావున ప్రతి కార్యకర్తయు, నిజాయితిని పరిశీస్తూ, దృఢ సంకల్పముతో నిస్వార్థ బుద్ధితో ఈ కార్యక్రమములను చేపట్టిన తప్పక సాధ్యము కాగలదు. ఈ విధముగా ప్రతి విషయములోను జాగ్రత్త వహించగలిగినాడు, సంఘ అభివృద్ధి, సమాజాభివృద్ధి, దేశాభివృద్ధి, జరుగగలదు. అలా కాకున్న సంఘము, నాయకులు, అభివృద్ధి, సహాయము అను పేర్లు చెప్పుకొంటూ కాలం గడపవలసి ఉంటుంది.

పై విధముగా చేస్తూ పోయిన కొద్ది రోజులకు ఆర్థిక బలము ఏర్పడి, 'బంజారా బ్యాంకు' లను స్థాపించవచ్చును. ఇది చాలా గొప్ప సమస్య అని భావించవచ్చును. మానవుడు సాధించదలచిన ఏది గొప్ప సమస్య కాదు. ఏది సాధించలేని సమస్యకాదు.

మనము చూస్తూనే ఉన్నాము, ''వైశ్యా బ్యాంకులు'' వైశ్యులు మొత్తం దేశములో వారు సంఘమును ఏర్పాటు చేసుకొని వాణిజ్యమునంతా హస్తగతము చేసుకొని, వారు సంపాదిస్తున్న ధనమునంతను ఒకచోట జాగ్రత్తగా ఉంచుటకు, వైశ్యాబ్యాంకులు బాగా పనిచేయుచున్నవి. ప్రజల ధనమును, ప్రభుత్వ ధనమును వారు తీసుకొనుచున్నారు కాని, వారి సొమ్మును ప్రభుత్వ ఖజానాలో కాకుండ, వారి ఖజానాలో ఉంచుకొనుచూ, పరిశ్రమల అభివృద్ధి, వ్యాపారాభివృద్ధికి ఉపయోగించుకొంటూ, స్వజాతి వారికి ఉద్యోగ సౌకర్యములు కల్పిస్తూ ఉన్నారు. ఈ విషయం ప్రతి బంజారా కార్యకర్తలు గ్రహించవలసి ఉన్నది.

ఒకానొకనాడు (పూర్వము) బంజారాలు మొత్తం భారత దేశ సంపదను తమ చేతుల ద్వారా దేశములోను, పరదేశములకు పోయి వ్యాపారం చేస్తూ ఉండిరి. ఆనాడు ఈ విధముగా

వ్యాపారమును చేపట్టిన బంజారాలు ఈనాడు చేయలేరు, అని ఎలా చెప్పగలరు. కావున సంఘ బలముతో సాధించలేని కార్యము ఏదియులేదు. ''సంఘమునకు ప్రజాబలము, ప్రజాబలమే సంఘబలము'' అను విషయమును ఋజువు చేయవలసి ఉన్నది.

సంఘము ద్వార మండల స్థాయి వరకు అన్ని విషయములను చర్చించి, వాటి అభివృద్ధికి పాటు పడగలిగిననాడు, జిల్లా స్థాయిలో కొన్ని కార్యక్రమములు, ప్రాంతీయ స్థాయిలో కొన్ని కార్య క్రమములు, రాష్ట్రస్థాయిలో కొన్ని కార్యక్రమములు, మండల స్థాయిలో కార్యక్రమములు, కేంద్ర స్థాయిలో కొన్ని కార్యక్రమములు చేపట్టి నెరవేర్చవచ్చును.

ఈ విధముగా సమాజాభివృద్ధి చేయగలిగినవాడు అంతర్ జాతీయ స్థాయిలో కూడ కొన్ని కార్యక్రమములు చేపట్టవచ్చును. ఎప్పుడు, ఏనాడు కూడ ఎటువంటి పని అయినను సంఘ బలమును బట్టి, ఆ సంఘమును నడిపించు నాయకత్వమును బట్టి ఆధారపడి ఉండును.

వైశ్యులు కూడ మానవులే, ఈ నాడు వారు ఆర్థికముగా ముందంజ వేసి ఉన్నారు. అంటే వారు స్థాపించిన సంఘ ప్రభావము, వారిలో ఉన్న జాతియత, వారు చేపట్టిన పనులను బట్టి, వారి ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి అయినది, వారి ఆర్థిక వ్యవస్థను బట్టివారి పిల్లలకు విద్యాభివృద్ధి చేయగలిగినారు. వారి పిల్లలకు క్రింది చదువు నుండి, పై చదువు వరకు ఎక్కడికెళ్లిన హాస్టలు వసతి కల్పించి ఉన్నారు. వారు ఏ గ్రామము, ఏ పట్టణము పోయిన ధర్మసత్రములు స్థాపించి ఉన్నారు. గొప్ప గొప్ప కాలేజీలు వారి సంఘము ద్వారా స్థాపించినారు. ఏ దేవాలయములు దర్శించిన, అక్కడ వారి యొక్క ధర్మసత్రములున్నవి.

కార్యకర్తలు ఒకటి గ్రహించవలయును, ఎంతమంది వైశ్యులు వ్యవసాయము, పశుపోషణ మీద లేక ఇతరములైన పనులు చేయుచున్నారు. కాని వారు ఇంటిలో కూర్చొనియే దేశములో పండించబడుతున్న ధాన్యములు, పండ్లు కూరగాయలు, వస్త్రములు అన్ని తమ వద్దకు రప్పించుకొని వాటివల్ల చాలా గొప్ప లాభములు గడించి అన్ని విధములైన ఫలములను అనుభవించుచున్నారు. దానికి కారణం వారు స్థాపించిన సంఘాలు, వారు నిర్ణయించిన కట్టుబాట్లు సంఘ అభివృద్ధికైవారు కేటాయించిన ఆర్థిక వసతిని బట్టి అన్ని ఫలములను గ్రహించుచున్నారు. ఇది గ్రహించవలసి ఉండును. వీరిని ఆదర్శముగా ఉంచుకొని అయిన సంఘాభివృద్ధి, ఆర్థికాభివృద్ధి విద్యాభివృద్ధి, సాంఘిక మార్పులు, రాజకీయ మార్పులు చేపట్ట వచ్చును. వీరు సాధించిన ప్రగతిని ఈనాడు ఎవరు కూడ గ్రహించలేదు. దృఢముగా చెప్పవచ్చును. కావున బంజారా సంఘ కార్యకర్తలు ఈనాడు తను, తన చుట్టుపట్ల ఉన్న వాతావరణం, మరియు వారికి లభించు వనరులను ఆధారం చేసుకొని కార్యక్రమములను చేపట్టవలసి ఉన్నది.

# అనంతపురం సుగాలీ సేవా సంఘం

**సంఘములు – వాటి ఆవశ్యకత :** సంఘము అనగా కొంత మంది జ్ఞానులు చేరి వారికి సంబంధించిన విషయములను చర్చించి వాటి అభివృద్ధికి పాటుపడుట అని అర్థం. మనది ప్రజాతంత్ర రాజ్యము. ఇందులో ప్రజల అభివృద్ధికి కావలసిన విషయములను వారే స్వయంగా నిర్ణయించుకొని, వారి సమస్యలను వారే తీర్చకొనవచ్చును. అలా తీరని సమస్యలను

వారికి సంబంధించిన ప్రజాసంస్థల ద్వారా గాని, గ్రామ పంచాయితి ద్వారా కాని, ప్రాంతీయ అభివృద్ధి సంఘముల ద్వారాగాని, ప్రజా ప్రతినిధుల ద్వారాగాని, ప్రభుత్వ అధికారుల ద్వారా గాని, వాటిని పరిష్కరించుకొనవచ్చును. అట్లు పరిష్కరించుకొనవలయునన్న, తమ తమ సమస్యలను బట్టి సంఘాలను ఏర్పాటు చేసుకొనవచ్చును.

ఒక గ్రామ అభివృద్ధికిగాను ఒక గ్రామ సంఘం ఏర్పాటు చేసుకొనవచ్చును. అనగా తమ ఊరి పేరునకూడ సంఘం ఏర్పాటు చేసుకొనవచ్చు. అనంతపురంలో నివాసమున్న ఒక నాయక్‌నగర్ సంఘమును స్థాపించుకొనవచ్చును. ఆ సంఘం ద్వారా వారు వారి గ్రామ సమస్యలను తమ సంఘం ద్వారా ఏర్పాటు చేసుకొనవచ్చును. అనగా గ్రామములో వీధి దీపాలు కావలయునన్న, వీధి రోడ్లు బాగు పరచవలయునన్న, మంచినీటి సౌకర్యం ఏర్పాటు చేసుకొనవలయునన్న, పిల్లలకు స్కూలు కావలయునన్న చిన్న పిల్లలకు పోషక ఆహారం కావలయునన్న, తల్లిదండ్రులు పనులకు పోవునప్పుడు చిన్న పిల్లలను పోషించుటకు కేర్ (క్రిషి)సెంటర్ ఏర్పాటు చేసుకొనవలయునన్న, ఆరోగ్య కేంద్రమును ఏర్పాటు చేసుకొనవలయునన్న, లైబ్రరి, రీడింగ్ రూమ్, ఒక దేవస్థానమును కట్టు కొనవలయునన్న, శుభ కార్యములు చేసుకొనుటకు ఒక కమ్యునిటి సెంటర్‌ను స్థాపించవలయునన్న ఆర్థిక అభివృద్ధిని సాధించుటకు, కో.ఆపరేటివ్ అప్పుల సంఘము, సహకార కో.ఆపరేటివ్ సొసైటి, దీని ద్వారా పాల డైరీలను స్థాపించుట, కోళ్ల ఫారములనుస్థాపించుట, పందుల పెంపకం, చేపల చేపట్టుట, కొన్ని చిన్న చిన్న పరిశ్రమలు స్థాపించుట, అనగా కుట్టు సెంటర్లు, టైప్‌రైటింగ్ ఇన్‌స్టిట్యూట్‌లు బీద స్త్రీలను పోషించుటకు, స్త్రీ సంక్షేమ సంఘమును స్థాపించుట, ఓల్డ్‌ఏజ్ పెన్షనర్స్ (ముసలివాళ్ల) ను పోషించుటకు గల ఆశ్రమము, పండ్ల తోటలను పెంచుట, కూరగాయలను పెంచుటకు ఆ విధంగా ఒక గ్రామ సంఘం ద్వారా ఎన్నో పనులను సాధించి, విద్య, వైజ్ఞానము, ఆర్థికము, రాజకీయంగా అభివృద్ధి చెందవచ్చును. దీని ద్వారా ప్రభుత్వమంటే ఏమి? ఏవో పనులు, ఏ ఏ అధికారులకు సంబంధం ఉండును. పంచాయితిలో జరుగుచున్న అభివృద్ధి కార్యక్రమములు, మండలములలో చేపట్టబోతున్న అభివృద్ధి కార్యక్రమములు, జిల్లా చేపట్టబోతున్న అభివృద్ధి కార్యక్రమములు, జిల్లా మొత్తంలో అమలు పరచబడుచున్న అభివృద్ధి కార్యక్రమములు, అలాగే రాజకీయ కార్యక్రమాలు, రాజకీయ పార్టీలు చేపట్టుచున్న కార్యక్రమాలు గూర్చి, మరియు రాష్ట్ర స్థాయిలలో జరపబడుచున్న కార్యక్రమాల గూర్చి ఎప్పటి కప్పుడు తెలుసుకొంటూ, వారివారి సంఘాల అభివృద్ధికి పాటుపడుట అని అర్థం.

ఇప్పుడు గ్రామములలో చూస్తే! పలు రకాల కులస్థులు జీవించుచున్నారు. వీరిలో కొంత మంది విద్యా విజ్ఞానములోను, రాజకీయంగాను, ఆర్థికంగాను, బాగా అభివృద్ధి చెందిన వారున్నారు. అటువంటివారు ఆ గ్రామమును, అన్ని విధాలుగా అభివృద్ధి పరచవచ్చును కాని, కొంత మంది స్వార్థము వలన అలా జరుగుట లేదు. కారణం వారికి అందరిని అభివృద్ధి పరచవలయునన్న ఇష్టం ఉండదు. వారిలో ఆర్థిక అసమానతలు ఎక్కువ. మరియు కులాలు అడ్డుగోడలు. అందువలన అభివృద్ధికి ఆటంకాలు ఎక్కువ. అందరు సమానంగా అభివృద్ధి చెందితే వారి చెప్పు చేతులలో ఉండరని వారి భయం. అందువలన వారికి మనసు ఒప్పదు. మన రాజ్యాంగ కర్తలు, వారి వారి అభివృద్ధిని సాధించవలయునన్న, రకరకాల పేర్లతో సంఘాలను స్థాపించుకొని అభివృద్ధి చెందవచ్చును. ఒక ప్రాథమిక హక్కును ఏర్పాటు చేసి ఉన్నారు.

మన కుల వ్యవస్థలో అందరు సమానంగా అభివృద్ధి చెందవలయునంటే చాలా కష్టము. అందుకే ఆయా కులాల జాతుల పేర్లతో సంఘాలు, ఏర్పాటు చేసి, వారి వారి అనుకూలములను బట్టి అభివృద్ధి చెందండి. సంఘాల ద్వారా మంచిగా అభివృద్ధి చెందినట్లు అయిన, ప్రభుత్వంవారు వాటిని గుర్తించి ఆర్థిక సహాయం అందించగలదు అని అన్నారు.

ఆర్థిక సహకారం అందించవలయునంటే కో.ఆపరేటివ్(సహకార సంఘాలు) సొసైటీలను స్థాపించుకోవచ్చును. అనగా, కో.ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీ( అనగా బ్యాంకుల ద్వారా అప్పులు పొందుటకు గాను) కో.ఆపరేటివ్ జాయింట్ ఫారమింగ్ సొసైటీ, సమిష్టి వ్యవసాయం (జాయింట్ పార్మింగ్ సొసైటీ) పాల సొసైటీ, సిల్కు దారముల సొసైటీ చిన్నచిన్న పరిశ్రమల సొసైటీ, కన్స్యూమర్ సొసైటీ, చేపల సొసైటీ, అడవుల అభివృద్ధి సొసైటీ, పండ్ల తోటల సొసైటీ కూరగాయల సొసైటీ మార్కెటింగ్ సొసైటీ, కో.ఆపరేటివ్ బ్యాంకులు, టౌన్ బ్యాంకులు, పెద్ద పెద్ద చెక్కర కర్మాగారములు, సిమెంటు కర్మాగారములు, వస్త్రములు నేసే సొసైటీలు, మరి ఎంత పెద్ద సొసైటీనైన స్థాపించు కొనవచ్చును. అన్నిటికన్న ముఖ్యమైన సొసైటీ, ఎడ్యుకేషన్ సొసైటీ.

అలాగే నాల్గు వర్ణముల ప్రజలలో లెక్కలేనన్ని కులాలతో హరిజన, గిరిజనులు, వెనుకబడిన కులాలు, అభివృద్ధి చెందిన కులాలు, బ్రాహ్మణులు, వైశ్యులు, రెడ్లు, కమ్మలు, బలిజలు, కాపులు, గౌడలు, యాదవులు, సాలీలు, బెస్తలు, వాల్మీకులు(బోయలు) నాయీ బ్రాహ్మణులు, రజకులు అని ఎన్నో రకాల కులాలు, జాతులు హరిజనులు, మాలలు, మాదిగలు, గిరిజనులలో, ఎరుకలు, యానాదులు, బంజారాలు, కొండదొరలు, కొండకాపులు, అని నానా రకాల జాతులు, నానా రకాల సంఘాలు ఏర్పడి వారివారి కూలాలను, జాతులను అభివృద్ధి పరచుకొనుచున్నారు. అభివృద్ధి చెందిన బ్రాహ్మణులు, వైశ్యులు కమ్మలు, కాపులు మరి ఇతర కులస్థులవారు, వారివారి సంఘాలను స్థాపించి అభివృద్ధి పరచుకొనుచున్నప్పుడు అన్ని రకాలుగా, ఆర్థికంగా, వైజ్ఞానికంగా, రాజకీయంగా అభివృద్ధి చెందినవారే వారివారి జాతుల అభివృద్ధికి పాటుపడుచున్న, మరి అన్ని రకాల ఆర్థికంగా, విద్య, వైజ్ఞానికంగా రాజకీయంగా అభివృద్ధి చెందినవారు ఏ సంఘమును స్థాపించకుంటే వారి అభివృద్ధిని ఎవరు చూస్తారు?

కావున పై కారణములవలన ఎవరు ఏ జాతిలో కులములో పుట్టి పెరిగి జీవించుచున్నారో వారే ఈ కార్యక్రమమును చేపట్టవలసి ఉన్నది. అందుకే అన్నారు? ''ప్రపంచంలో ఏది హీన జాతి అనగా రాజకీయంగాఎవరైతే వెనుకబడి ఉన్నారో వారే హీన జాతి'' అన్నారు. ఎందుకనగా ఎప్పుడైతే రాజకీయ చైతన్యంలేదో, వారికి విద్యా వసతి ఉండదు. ఒకవేళ ఉన్న ఏ కొద్ది మందికో ఉంటుంది. ఎప్పుడైతే విద్య ఉండదో వారికి ఆర్థికము కూడ ఉండదు. ఎప్పుడైతే ఆర్థికం ఉండదో, అప్పుడు రాజకీయ చైతన్యం కూడా ఉండదు. ఇవి మూడు ఒకదాని కొకటి అవినాభావ సంబంధాన్ని కలిగియున్నవి.

అదేమిటి వీరిలో విద్య ఉన్నవారు లేరా? ఆర్థికంగా భాగ ఉన్న షావుకార్లు లేరా అనవచ్చును, ఉండవచ్చును, బియ్యంలో చిన్న చిన్న మట్టి పెళ్లలువున్నట్లు ఒక చాటడు బియ్యంలో ఒక నాల్గు మట్టి పెళ్లలు ఉన్న ఏమి చేస్తారు. వాటిని ఏరి పారేస్తారు. అలాగే రాజకీయంగా, ఆర్థికంగా, అభివృద్ధి చెంది ఉన్నా, వారిని కులాల పేరుతో మట్టిపెళ్లలు ఏరిపారవేసినట్లు ప్రక్కకు

నెట్టివేస్తారు. కావున జాతి అభివృద్ధి చెందవలయునంటే, ఆయా జాతుల వారు, కులాల వారు, సంఘటితం కావలయును. అలా సంఘటితం కావలయునన్న సంఘాలను స్థాపింవలయును.

సంఘాలను స్థాపించవలయునన్న, సంఘములను నడిపించగల విద్యావంతులైన, రాజకీయ చాతుర్యంగల, సంఘ సేవా పరాయణులైన కార్యకర్తలు కావలయును. సంఘం అనగానే నాయకత్వం సిద్ధిస్తుందని, స్వార్థపూరితమైన నాయకుల వలన సంఘం అభివృద్ధి చెందదు. అది అభివృద్ధి చెందే బదులు ఆ సంఘానికి నష్టమునే చేకూర్చుతుంది. కావున సంఘమనేది ఆ సంఘాన్ని నడిపే యోగ్యతనున్నవారు మాత్రమే ఆ జాతికి సేవలందించి, ఆర్థికంగాను, రాజకీయంగాను ముందుకు నడిపి, జాతి గౌరవము, రాష్ట్ర, దేశ గౌరవములను పెంచగలరు.

1965 సం. అనంతపురం జిల్లా సేవా సంఘమును స్థాపించాము. అప్పుడు అనంతపురంలోని 10 మంది సుగాలీ ఉద్యోగులున్నాము. శ్రీ యల్. రూప్లానాయక్ గారు నేను, శ్రీ ఎస్. ఘణేనాయక్‌గారు, శ్రీ టి. అర్జున్‌నాయక్‌గారు శ్రీ బి. జితేంద్ర నాయక్‌గారు శ్రీ లక్ష్మానాయక్ పి. బాలాజీనాయక్‌గారు మరికొంత మంది ఆర్ట్స్ కాలేజీ విద్యార్థులు. బంజారాలందరు కలసి అరవింద మందిరంలో ఒక చిన్న మీటింగ్ పెట్టి, టీ పార్టి చేసుకొన్నాము. అందులో అందరు కలసి ఒక సంఘమును స్థాపించుదాము అనుకొన్నాము. దాని ఏర్పాటుకు



అరవిందనగర్ లో సమావేశమైన సంఘ సభ్యులు

నన్ను కన్వీనరుగా ఉంచారు. నేను కన్వీనరుగా, 1965లో శ్రీ రూప్లానాయక్ కో.ఆపరేటివ్ ఇన్స్పెక్టరు సహకారంతో సంఘం రిజిస్టరు చేయించినాము. ఆ సంఘమునకు ప్రెసిడెంటుగా 1963 సం. కదిరి యస్.టి. రిజర్వు యం.ఎల్.ఏగా ఉన్న వి. గోపాల్నాయక్ను అధ్యక్షులుగాను, శ్రీ బి. దూదియానాయక్గార్ని సెక్రెటరిగాను ఎన్నుకొన్నాము. దాని మీటింగ్ను కో.ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకులో ఏర్పాటు చేసాము. ఆ మీటింగ్కు హాజరు కావలసినదిగా ఎం.ఎల్.ఏ గార్ని ఆహ్వానించాము. చాలా తాండాలనుంచి నాయకులు హజరైన్నారు. భోజనాలు కూడ ఏర్పాటు చేసాము. కాని ఎం.ఎల్.ఏ గారు రాలేదు. అయిన మీటింగ్ వచ్చిన పెద్దలు ఎం.ఎల్.ఏ గారినే ప్రెసిడెంట్ అన్నారు. సరే అని శ్రీ రూప్లానాయక్ సహకారంతో సంఘం రిజిస్టరు అయినది. అంతే దాని అభివృద్ధి చేపట్టేవారే ఎవరు లేరు. నేనే వారి తరపున సంఘం పనులు చేస్తూవచ్చాను. ఒక లైబ్రరిని నెలకొల్పవలయునని చాలా ఎంబసీలకు ఉత్తరాలు వ్రాసాను. చాలా పుస్తకాలు వచ్చాయి. జిల్లా లెవల్లో కొన్ని పనులు చేసాను. కాని ఒక్కరు సహకరించలేదు. అసలు, అధ్యక్షులు, సెక్రటరీలు దొరకరు. ఎం.ఎల్.ఏ గారు హైద్రాబాద్ పోయినప్పుడల్లా నాయింటికి వచ్చేవారు. అతనికి సంఘం విషయములు చెప్పితే పట్టించుకొనేవాడు కాదు. నీతో పాటు గుంటూరు జిల్లా ఎం.ఎల్.ఏ శ్రీ కేశవనాయక్గారు 40 సుగాలీ హాస్టళ్ళు ఏర్పాటుచేసారు కదా మీరు ఎందుకు చేయకూడదు అని అడిగితే బదులు చెప్పలేదు.

నీవు రిజర్వు సీటులో ఎం.ఎల్.ఏ అయినావు కదా ఏదైన కార్యక్రమం చేపట్టు అంటే, అతను అసలు మన వాళ్లకు ఏమి చేయకూడదు. మన బంజారాలు ఒక్క ఓటు కూడ నాకు ఇవ్వలేదు అన్నాడు. అసలు ఓటు ఇవ్వక పోయినా నీవు ఎన్నికైనది సుగాలీల రిజర్వేషను పైనే కదా అని అడిగితే సమాధానం చేప్పేవాడు కాదు. అసెంబ్లిలో ఇచ్చే పుస్తకాలు మాత్రం మూటకట్టుకు వచ్చి నా ఇంట్లో పడేసేవాడు. ఈ లోపు అనంతపురం రాజకీయ నాయకులు కనిపెట్టి, పది మంది సుగాలీలే సంఘం ఏర్పాటు చేసి, సెంట్రల్ బ్యాంకులోనే మీటింగ్ పెట్టగలిగినారు వీరికి ఎం.ఎల్.ఏ రిజర్వు సీటు కూడ ఉన్నది. వీరిని చెల్లాచెదరు చేయవలయునని వెంటనే, రూప్లానాయక్ను పెనుకొండ మార్కెటింగ్ సొసైటీకి, ఎస్. ఘణేనాయక్ను తాడిపత్రి, నన్ను శ్రీశైలం ఐ.టి.ఐ.కి, బి.జితేంద్రనాయక్ కుందుర్పి, ఇట్లు అందరిని మార్చి వేసినారు. అప్పుడు నావద్ద ఉన్న సంఘం రికార్డులను పాతూరు పోస్టాఫీసులో పనిచేయుచున్న టి. అర్జున్ నాయక్గార్కి తేది 28-5-1966లో నగదు 67.89 రూపాయలు, స్టాంపులు 2.20 రూపాయల మరియు రసీదు పుస్తకములు బైలా ఫైలు 1, క్యాష్ బుక్ 1, మీటింగ్ బుక్కు 1, ఓచర్ ఫైలు 2, ఇంకు ప్యాడ్ 1, పోస్టు ఫైలు 1, మొత్తం 11 అయిటమ్స్ ఇవ్వడం జరిగినది. వాటిని టి. అర్జున్ నాయక్ గార్కి అప్పచెప్పి శ్రీశైలం వెళ్లిపోయాను. నేను పోయిన తరువాత అమెరికన్ ఎంబసివారు, ఒక పెద్ద బాక్సుతో లైబ్రరి బుక్కులు, రైల్వే పార్సల్ పంపించారట, అది చాలా రోజులకు అర్జున్నాయక్ తీసుకొన్నారట. ఆ విధంగా అప్పటి రికార్డులు, సంఘంను కూడ ఎవరు పట్టించుకోక దానిని నిష్ప్రయోజనం చేసారు. కాని ఆ సంఘం పేరుతో 1968 సం. లో పెనుకొండలో అఖిల భారత బంజారా సేవా సంఘం మీటింగ్ జరిగింది. ఆ తరువాత కర్నాటక రాష్ట్రంలో గుల్బర్గానందు అఖిల భారత బంజారా సేవా సంఘం మీటింగ్ జరిగినది. అప్పుడు నా భార్య గర్భవతి, నిండు చూలాలుగా ఉండుట వల్ల నేను పోలేక, నా డబ్బుతో శ్రీ బి. దూదియా నాయక్ సెక్రటరీగారిని ఆ మీటింగ్కు పంపించాను.

ఈ విధంగా నాయకత్వలోపం వలన 1965లో స్థాపించిన అనంతపురం జిల్లా సంఘం పనిచేయక, నాయకులు, కార్యకర్తలు కరువైనారు. కాని ఎప్పుడైన కలసినప్పుడు ప్రగల్భాలు మాత్రం చెప్పుకొంటారు. అప్పుడు సంపాదించి పెట్టిన లైబ్రరి గ్రంథములు కూడ లేకుండ చేసినారు.

# ఆంధ్రప్రదేశ్ బంజారా విద్యావంతుల సమాజ్ కార్యక్రమములు

తరువాత 1969లో గుంటూరు జిల్లా పిరికిపాడు తాండాలో శ్రీ ఎ. గోప్యానాయక్ రైల్వే డి.ఐ.జి. గారి నాయకత్వంలో పుంగనూరు, బి. రామానాయక్ సి.ఐ.రైల్వే, యన్. భీమానాయక్, వి. గోపాల్‌రావునాయక్, మరియు గుంటూరు జిల్లాలోని సంఘం పెద్దలు సమావేశమై రాష్ట్ర స్థాయిలో సంఘం ఏర్పాటు చేయవలసినదని కోరగా, మామూలు సంఘం అనగా ఆంధ్రప్రదేశ్ బంజారా సంఘం అని పేరు పెట్టిన, ఉద్యోగస్తులు చేరుటకు భయపడతారు. కనుక, ఉద్యోగులు, విద్యావంతులు, ఇతరులు అందరు కలసి పనిచేయుటకు గాను, ఆంధ్రప్రదేశ్ బంజారా విద్యావంతుల సమాజము అని పేరు ఉన్న, బాగుండును అని తీర్మానించారు. ఆ తీర్మానంలో నేను( బి. చీనియానాయక్ ) కన్వీనరుగా ఉండి 1971 జనవరి 19–20 తారీఖులలో నారశింహపల్లి తాండాలో మారెమ్మ పరస( గుడిపూజ) సందర్భంగా, మొత్తం జిల్లాలోని ప్రజలు వస్తారు కనుక, మొత్తం ఆంధ్ర దేశములోని వారిని ఆహ్వానించి ఒక మీటింగ్‌ను ఏర్పాటు చేయడం జరిగినది. ఆ మీటింగ్‌లో తాండాకు సంబంధించిన కొన్ని విన్నపములతో ఒక ఆహ్వాన పత్రమును ముద్రించడం జరిగినది. ఆ మీటింగ్‌కు జిల్లా కలెక్టరు యల్. సుబ్బయ్య ఐ.ఏ.యస్. గారు, జిల్లా పరిషత్ అధ్యక్షులు శ్రీ వై.సి. తిమ్మారెడ్డిగారు, జిల్లా అటవి శాఖ అధికారి ఎం.ఎ. అబ్బాస్‌గారు, ఐ.ఎఫ్.యస్, ఫాదర్ ఫెరర్, పెనుకొండ సమితి ప్రెసిడెంటు నర్సి రెడ్డిగారు మరియు శ్రీపి. రంజిత్‌నాయక్‌గారు – బొంబాయి, శ్రీ బి. రామానాయక్, వి. గోపాల్ రావు నాయక్ శ్రీ యన్. భీమానాయక్, బి.కె. సత్యం గారు మరి విద్యావంతులు రాష్ట్ర కార్యకర్తలు హాజరు అయినారు. ఆ మీటింగ్ బాగా జరిగినది. జిల్లా కలెక్టరుగారు,



నారసింహపల్లి తాండా మీటింగ్‌లో ఎడమ ప్రక్కనుండి వి. గోపాల్‌రావు నాయక్, బి.చీనియా నాయక్, ఎల్. సుబ్బయ్య – జిల్లా కలెక్టర్, అధ్యక్షులు బి. రామానాయక్ మరియు బి. కె. సత్యం.

నారశింహపల్లి తాండాకు సంబంధించిన చెన్నమ్మ చెరువు 1911లో తెగిపోయిన దానిని పునర్ నిర్మించుటకు 7 లక్షల రూపాయలు మంజూరు చేసారు. వెంగళమ్మ చెరువునుండి నారశింహపల్లి తాండాకు రోడ్డు మంజూరు జరిగి వెంటనే కార్యక్రమములు చేపట్టారు. కాని నాతో పాటు విద్యావంతులైన బి. లక్ష్మానాయక్‌గారు, బి. నారాయణనాయక్‌గార్లను గుంతకల్లు పోయి ఆహ్వానించినాను. వారు నాకు సహకరించలేదు కాని బి. లక్ష్మానాయక్‌గారు నా మీద మండిపడినారు. నీవు తాండా పరువు తీయుటకు ఈ మీటింగ్‌ను ఏర్పాటు చేసావాయని, తరువాత మీటింగ్ జయప్రదమును చూచి, నేను తెచ్చిన గంపెడు పూల హారములోని హారం తెచ్చి నా మెడలో వేసారు. ఇలా ఉంటారు! ఆ తరువాత తన తోడల్లుడైన వి.సి.బి.నాయక్‌ను రాష్ట్ర సంఘానికి కార్యదర్శిని చేసాడు. ఈ మీటింగులో శ్రీ బి. రామానాయక్ రాష్ట్రం సంఘం అధ్యక్షుడుగాను, శ్రీ వి. గోపాల్‌నాయక్, పి. ధనంజయ నాయక్, యన్. భీమానాయక్ గార్లు ఉపాధ్యక్షులు, వి.సి.బి.నాయక్ ప్రధాన కార్యదర్శి, బి. చీనియానాయక్, యల్. రాములు, శివరాం రాథోడ్ గార్లను జాయింట్ సెక్రటరీలుగాను, కోశాధికారిగా యం.రామచంద్రానాయక్ గార్ని ఎన్నుకొనుట జరిగినది. జిల్లా సంఘమునకు వి. గోపాల్‌రావునాయక్ అధ్యక్షులు, శ్రీ యస్.కె. కేశవనాయక్ ఉపాధ్యక్షులు, బి.చీనియానాయక్ కార్యదర్శి, బి.దూదియానాయక్ సహాయ కార్యదర్శి, డి. రఘుపతి నాయక్ కోశాధికారిగాను ఎన్నుకొనడం జరిగింది.

5-6-1972న మహబూబ్‌నగర్ జిల్లా గొబ్బలపాడు తాండాలో ఒక గొప్ప సభను ఏర్పాటు చేయడం జరిగినది, ఆ సభకు, కర్నాటక మత్స్యశాఖ మంత్రి శ్రీ కె. టి. రాథోడ్ గారు, రాష్ట్ర గిరిజన శాఖామాత్యులు శ్రీ భీమరావుగారు శ్రీ మహేంద్ర రెడ్డి రాష్ట్ర రెవెన్యూ మంత్రిగారు హాజరైనారు. శ్రీ బి. రామానాయక్, సంఘ అధ్యక్షులవారి అధ్యక్షతన మీటింగ్ జరిగినది. ఈ సభకు రాష్ట్ర మాజీ మంత్రి అయిన రవీంద్రనాయక్, స్టూడెంట్‌గా, యాక్టివ్‌గా ఉండేవాడు. వారిని కూడ మాట్లాడే అవకాశం ఇప్పించడం జరిగినది. ఆ సభలో నా వంతు మాటలు నేను చెప్పినది ఒక్కటే! అయ్యా మా వారికి ఆవులు, గేదెలు, గొఱ్ఱెలు ఇప్పించటం కాదు. అవి ఈ రోజు ఉంటవి. రేపు ఉండవు. అవి మాకు ముఖ్యంకాదు. మా పిల్లలకు చదువు ముఖ్యం, మాకు ఆశ్రమ పాఠశాల, ప్రతి హైస్కూలు వద్ద బాలురకు, బాలికలకు హాస్టల్లు స్థాపించవలయును వారికి కావలసిన విద్యావసతులు తప్పని సరిగా కల్పించ వలయును. అని గర్జన చేసి చెప్పడం జరిగినది. అదే ప్రకారం ప్రభుత్వం వారు కూడ చేపట్టటం జరిగినది.



మహబూబ్‌నగర్ జిల్లా గొల్లపల్లి తాండాలో మీటింగ్ కుడిప్రక్కనుండి అధ్యక్షులు బి. రామానాయక్- గిరిజన శాఖామాత్యులు, కె. భీమరావ్, కర్నాటక మత్స్య శాఖామంత్రి శ్రీ కె. టి. రాథోడ్ గారు, రెవెన్యూ శాఖామంత్రి మహేంద్రరెడ్డిగారు.

15-9-1974లో హైద్రాబాద్ గాంధీ భవన్‌లో శ్రీ వి.పి.నాయక్ మహారాష్ట్ర ముఖ్యమంత్రిగారి అధ్యక్షతన, శ్రీ నిజలింగప్ప అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షులు, శ్రీ జె.వెంగళరావు ముఖ్యమంత్రిగారు మరియు రాష్ట్ర మంత్రులు నాయకులు హాజరై పెద్ద సభను ఏర్పాటు చేసి బంజారా ల అభివృద్ధి గూర్చి ఒక వినతి పత్రంను రాష్ట్ర ముఖ్యమంత్రిగారికి సమర్పించడం జరిగినది. ఆ సభలో నేను ఒక్కటే అన్నాను. మా నాయకుడు శ్రీ వసంతరావు ఫూల్‌సింగ్‌నాయక్‌గారు, వారు ఏమి చెప్పితే అది చేయుటకు మేము సిద్ధముగా ఉన్నామని గర్జించి చెప్పడం జరిగినది. అప్పుడు రాష్ట్ర ముఖ్యమంత్రిగారు లేచి, అయ్యా శ్రీ వి.పి.నాయక్‌గారు. మీ నాయకుడే కాదు అతను భారత దేశనాయకులలో ఒకరు అని సమాధానం తెల్పినారు.

అయితే పేరుకు సంఘ నాయకులను ఎన్నుకొనటం జరిగినదే కాని, ఒక్కరు తమ విధులను నిర్వర్తించలేదు. రాష్ట్రంలో ఎన్నుకోబడిన కోశాధికారి, ఒక్క పైసా ధనంకాని వసూలు చేసి, ఇవ్వలేదు. జిల్లాలో ఎన్నుకోబడిన కోశాధికారి ఒక్క పైసా జమచేయలేదు. మనవారు పనిచేసే వారిని బట్టి ఎన్నుకొనలేదు. వారి వారి హోదాను బట్టి అక్కడ జమ అయిన వారిలో వారి వారి బంధు ప్రీతిని బట్టి, సంఘ నాయకత్వానికి ఎన్నిక చేయించేది. ఎన్నిక చేయించే ముందు. ఎవరు ఏ హోదాకు సరిపోతారు, ఒక వేళ ఎన్నిక చేసిన ఈ వ్యక్తి ఆ హోదాకు సరిపోతారా లేదా, తనకున్న జ్ఞానముతో ఈ సంఘములను నడిపించుతాడా లేద అనే భావన లేకుండ, తమకంటు పదవి కావలయునని ఎగప్రాకటం తప్ప. మరి ఏ విషయంలోను అతను అర్హత కలిగియుండడు. సంఘ కార్యక్రమములు చేయవలయునన్న, సంఘం పై అభిమానము ఉన్నవాడు తన జాతి మీద, కులం మీద అభిమానము ఉన్నవాడు, కాస్తో, కూస్తో రాజకీయ చైతన్యం ఉన్నవాడు మాత్రమే సంఘములలో పనిచేయుటకు అర్హుడు.

అసలు మొదట, సంఘమంటే ఏమిటో, సంఘ నియమాలు ఏమిటి, సంఘంలో ఒక వ్యక్తిగా యుండవలయునంటే, ఏమి చేయవలయును, అను విషయవములను తెలుసుకొనవలయును. ఎవరికి వారు సంఘం పెట్టుకుంటే, అది సంఘము కాదు. సంఘముగా గుర్తింపు రావలయునంటే, అది ప్రభుత్వ సంఘముల రిజిస్టరు ఆఫీసులో రిజిస్టరు కావలయను. అందుకు కొంత ఫీజు కట్టవలయును. తరువాత ఆ సంఘం నియమ, నిబంధనలు, రాసుకొనవలయును, మరియు ఆ సంఘంలో మెంబర్లుగా చేరుటకు కొన్ని తీర్మానములు చేసుకొనవలయును. దానికి ఎంతెంత ఫీజు చెల్లించవలయును, అను అంశములను వ్రాసుకొని రిజిస్ట్రారు వారి ద్వారా రిజిస్టరు చేసుకొని, సంఘం పనులు ప్రారంభించవలయును.

ఉదాహరణకు : ఆంధ్రప్రదేశ్ బంజారా విద్యావంతుల సంఘం ఉన్నది. అందులో మెంబరుకావలయునన్న కొన్ని నియమాలు ఉన్నవి. ఆంధ్రప్రదేశ్ బంజారా విద్యావంతుల సంఘం అంటే అందులో అందరు సంఘ సభ్యులు కారు.

ఈ సంఘం యొక్క 5వ నిబంధన ఈ విధంగా చెప్పుచున్నది.

1. ఈ సంఘంలో మెంబరు కావలయునన్న సంఘంలో నిర్ణయించిన రుసుమును చెల్లించి, ఎవరైనను సభ్యుడు కావచ్చును. ఆ వ్యక్తి ఈ సంఘంలో ఉండుటకు అర్హుడా కాదా అను

విషయం మొదట గ్రహించవలయును. ఆ తరువాత అతను సంఘ నియమ నిబంధనలకు కట్టుబడి ఉంటాను అని ఒప్పుకొనవలయును.

ఒక బంజారా ఉద్యోగి సభ్యుడు కాదలచిన అతను తన జీతం, భత్యంలోను, ప్రతి నెల జీతంలో పే + డి.ఏ మొత్తం కలిసి 100 కి 1 రూ. చెప్పన లెక్కలో తీసుకొనవలయును.

2. (ఏ) బంజారా ఉద్యోగి కాకుండ, మిగిలిన బంజారా సభ్యులు సంఘంలో సభ్యులుగా చేరవలయునంటే సంవత్సరమునకు రూ. 20/- చెల్లించి, సభ్యులు కావచ్చును.

ఈ విధంగా వచ్చిన సంఘం మొత్తం నుండి, 100 కి - 40 రూ. పై సంఘమునకు పంపవలయును. ఈ విధంగా వచ్చిన మొత్తమే పై సంఘము యొక్క ఆదాయము.

(బి) ఎవరైన సరే బంజారా సంఘంలో ప్రముఖ వ్యక్తి కావలయునంటే, పాలక వర్గ సభ్యుడు కావలయునంటే, రూ. 100/-లు ప్రతి సంవత్సరం చెల్లించవలయును.

ఈ సంఘం యొక్క 6వ నిబంధన ఈ విధంగా చెప్పుచున్నది : ఎవరైతే సంఘంలో సభ్యుడుగా చేరవలయునంటే ముందుగా సంఘం ద్వారా తయారు చేయబడిన అర్జీ పత్రమును భర్తీచేసి, ఆ సమాజము యొక్క అధ్యక్షునికి అర్జీ పెట్టుకొనవలయును. అందులో నియమిత చందా చెల్లించుతానని, సంఘం నియమ నిబంధనలకు లోబడి పనిచేస్తానని, దరఖాస్తు పెట్టుకొన్న, దానిని అధ్యక్షుల వారు అతని సభ్యత్వం అనుమతించవచ్చును లేదా తిరస్కరించవచ్చుకూడా.

పై నియములను పాటించిన వారు మాత్రమే సంఘ సభ్యులుగా ఉండుటకు అర్హులు. వారినే సంఘం గుర్తించుతుంది. మన బంజారా విద్యావంతులకు, ఉద్యోగులకు ఇవి అన్నియు పట్టింపులు లేవు. బంజారా సేవా సంఘం అంటే అందులో అందరు సంఘ సభ్యులే అయినట్లు భావిస్తారు. ఇది చదువుకొన్నవారు కాని, చదువులేనివారు కాని అందరు అలాగే భావించుతారు. సంఘ నియమాలన్ని గాలికి వదిలేసి, వారికి తోచినదే నిజమని భావిస్తారు.

నేను అనంతపురం జిల్లా కార్యదర్శిగాను, రాష్ట్ర సంఘంలో జాయింట్ సెక్రటరిగాను, శ్రీ వి. గోపాలరావు నాయక్ శింగనమల బి.డి.ఓ. గారు, జిల్లా ప్రెసిడెంటుగా మరియు రాష్ట్ర సంఘమునకు ఉపాధ్యక్షుడుగా ఉన్నాము. నేను ఉద్యోగ రిత్యా శ్రీశైలం ఐ.టి.ఐలో పనిచేస్తున్నాను. అయితే సంఘం పనులు ఎలా చేసేది, అందుకు నేను అనంతపురం జిల్లా సంఘం, మరియు రాయలసీమ సంఘం తరపున కార్యదర్శి హోదాలోను, సంయుక్త కార్యదర్శి హోదాలోను పనులు చేసి ప్రభుత్వ అధికారులతోను, సంఘంలో పెద్ద, చిన్న ఉద్యోగస్తులతోను సమాజ్ కార్యక్రమములు, ఆర్థికం కొరకు, సంఘ సభ్యత్వం కొరకు పనులు చేపట్టుటకుగాను, నా ఇంటినే సంఘం ఆఫీసుగా చేసి, సంఘ కార్యక్రమములు నడిపించుటకుగాను ఒక రిటైర్డు అయిన మంచి వ్యక్తిత్వం, సంఘము, ప్రభుత్వ కార్యక్రమములు తెలిసిన వ్యక్తి అయిన శ్రీ గుంటూరు వెంకటశాస్త్రిగార్ని, గుమాస్తాగా నియమించి, నెలకు 150/- రూ. జీతం ఏర్పాటు చేయడం జరిగినది. అతని ద్వారా, జిల్లా ప్రాంతీయ ప్రభుత్వ అధికారులకు, రాష్ట్ర ప్రభుత్వంలో జరుగు పలు కార్యక్రమములు గూర్చి, ఆయా ప్రభుత్వ

మంత్రులకు బంజారాల స్థితిగతులను గూర్చి వ్రాస్తు వారి ఉత్తర్వులను జిల్లా, రాష్ట్ర మొత్తంలో అమలు పరచవలసినదిగా కోరుచు పనులు చేపట్టడం జరుగుచున్నది. సంఘ పనులు చేయుటకు కాగితములు, అర్జీలు, టైపు చేయించుటకు పోస్టలు ఖర్చులు ప్రతినెల గుమాస్తాగార్కి జీతం, ఇది అంతయు మరియు సంఘం పనులు చేయుట, హైద్రాబాద్ మరియు జిల్లాలలోను, తాండాలలోను తిరుగుటకు అన్నియు ప్రతి నెల సుమారు 300నుండి 500రూ. ఖర్చు అగుచున్నది. నాకు వచ్చే 400 రూ.లు జీతంలో గుమాస్తా జీతం, టైపుఖర్చులు, పోస్టలు ఖర్చులు, అన్నియు పోయేవి. అందుకుగాను కరపత్రములను ముద్రించి, పంచాయితీరాజ్ మంత్రిగారు జారీ చేసిన జి.ఓ. ను ముద్రించి, మన రాయలసీమ ప్రాంతంలో పనిచేస్తు ఉన్న డాక్టర్లు, ఇంజనీర్లు గుమాస్తాలు, ఇన్స్పెక్టరు, ఆఫీసరు చిన్న పెద్ద అనకుండా మొత్తం సుమారు 1,000 మందికి పైన ఎన్నో ఉత్తరాలు వ్రాయడం జరిగినది. ఒక్కొక్కరికి పోస్టు చేయువలయునన్న 1 రూ. నుండి 2 రూ. ఖర్చు అయ్యేది, ఎవరికి పంపిన 15 పైసలు పోస్టుకార్డు కూడ తిరిగి ఉత్తరం వ్రాయలేదు.

అప్పుడు ఒక స్పెషల్ ఉత్తరం తయారు చేయించి పెద్ద పెద్ద నాయకులకు, సినిమా యాక్టర్లకు సాంఘిక కార్యకర్తలకు పంపించాము. కాని ఎవ్వరి నుండి ఉత్తరాలు కూడ రాలేదు. ఒక ఉత్తరం వచ్చింది, శ్రీ ఎ. నాగేశ్వరావుగారి ద్వారా, నేను నిస్సహాయుడిని, ఏమి చేయలేను.

అదే ఉత్తరంలోని ఒక ఉత్తరం. మహారాష్ట్ర ముఖ్యమంత్రిగారు శ్రీ వసంతరావు పూల్‌సింగ్ నాయక్ గారు, వారు మేము వ్రాసిన 9వ రోజుకే ముఖ్యమంత్రిగారు, అనంతపురం జిల్లా సేవా సంఘ కార్యక్రమములకు అగు ఖర్చులకు ముఖ్యమంత్రి సహాయ నిధి నుండి 5,000/- రూ.లు మంజూరు చేసినారు. అది మీకు హోమ్ డిపార్టుమెంటువారు పంపుతారు అని తెల్పుతూ, ఆ ఉత్తరం వచ్చినప్పటి నుండి 6 నెలలు ఉత్తర ప్రత్యుత్తరములు జరిపి, ఆఖరుకు ఒక చెక్ 5,000/- రూ.లు ఎ/సి/ అని వచ్చినది. దానిని తీసుకొని, బ్యాంకు వద్దకు పోతే మీరు, మీ సంఘం బైలా, మరియు మీ రాష్ట్ర అధ్యక్షుడి నుండి సమ్మతి పత్రం తీసుకొని రావలయునన్నారు. ఆ విషయమై రాష్ట్ర అధ్యక్షుడు బి.రామానాయక్‌గార్కి ఉత్తరం వ్రాస్తే, అతను పంపను అన్నాడు. అప్పుడు స్వయంగా పోయి అడిగితే అతనంటాడు కదా, ఆ 5,000/- రూ.లు నాకు ఇవ్వు. నేను రాష్ట్రస్థాయిలో పని చేస్తున్నాను కదా? అంటాడు. నేను జిల్లా సంఘం పేర తెప్పించాను, తమరు కావాలంటే రాష్ట్ర సంఘం తరపున వి.పి.నాయక్‌గార్కి వ్రాయండి. ఎంతైన పంపించగలడు అన్నాను. దానికి అతను అంగీకరించలేదు. అప్పుడు నేను కోపంతో తిరిగివచ్చాను. సంఘం బైలా మాత్రం జె. భావసింగ్‌నాయక్, రిజిస్ట్రరువారు నేను పంపిస్తాను ఫీజు 11రూ.లు ఇవ్వండి అన్నారు. ఆ తరువాత అతను పంపారు. ఈ లోగా వి.గోపాల్ రావునాయక్‌గారు అధ్యక్షుని అనుమతి తెప్పించారు. దాని ద్వారా అనంతపురం బ్యాంకులో సంఘం తరపున ఖాతా తెరవడం జరిగినది.

అప్పటికి, సంఘంలో నా తరపున అడ్వాన్సుగా సుమారు రెండవేల రూపాయలు పెట్టి ఉన్నాను. అందులోనుంచి 500 రూ. తీసుకొని మరి ఒక 500 రూ. అడ్వాన్సుగా తీసుకొని, సంఘంను ఆర్థికంగాను, సాంఘికంగా, అభివృద్ధి పరచుటకుగాను, మహారాష్ట్రము, మైసూరు రాష్ట్రములను పర్యటించి వస్తాను అని అధ్యక్షునికి ఒక దరఖాస్తు ఇచ్చాను. అందుకు అతను

ఒప్పుకొని, అనుమతి ఇచ్చాడు ఆ ప్రకారం పర్యటనకు సంఘానికి సంబంధించిన విషయములు మరియు సంఘ ప్రెసిడెంట్‌గారి ఉత్తర్వులు అన్నియు ప్రెస్సులో ఇచ్చి ముద్రించడం జరిగినది.

ఆ విషయం నేను బి. లక్ష్మానాయక్, ఎల్.సి.ఇ గారితో నేను మహారాష్ట్రము, మైసూరు రాష్ట్రములు పర్యటించ బోవుచున్నాను అన్నాను. అప్పుడు ఆంధ్ర మరియు తెలంగాణా ఉద్యమం జరుగుచున్నది. అప్పటికి 40 రోజులు గడిచినది. ఇది తొందరగా తేలే విషయంకాదు. నేను ఉద్యోగస్తుడ్ని కాన, శెలవులు( జీతం) కలిసి వస్తుంది అనే ఉద్దేశ్యంతో ఈ ఏర్పాటు చేసుకొన్నాను. ఈ విషయం తెలుసుకొన్న బి. లక్ష్మానాయక్‌గారు, బి.చీనియానాయక్, మన్నకై వి.పి.నాయక్‌గారు పంపిన 5,000/- రూ. ఎత్తుకొని, రాష్ట్రాలు చూచుటకు వెళ్ళుచున్నాడని, అందరికి ప్రచారం చేయించి, తను ఫైర్ ఆఫీసరు అయిన, శ్రీ రాములు నాయక్‌గారు, పి. లక్ష్మీరాం నాయక్‌గారు, కృష్ణానాయక్ హెల్త్ ఇన్సుపెక్టరుగారు, విఠల్ బిల్డింగ్‌లో కూర్చొని, రామిరెడ్డి ప్రెస్సులో నేను. గోపాలరావునాయక్, ఏం? నీవు ఒక్కడి వేనా మేము సుగాలీలు కాదా? అని చెప్పుచున్నారు. మీరు మొదట మెంబర్లుకాండి, ఆ తరువాత మీరు చెప్పినది వింటాము అని తెల్పిన ఒప్పుకోరు.

అయితే మీతో నాకు సంబంధములేదని చెప్పి శ్రీశైలం వెళ్ళిపోయి, అక్కడినుండి హైద్రాబాద్ మీదుగా షోలాపూర్, బొంబాయి, ధులియా, భూస్వాల్, అకోలా, ఓత్‌మాల్, డిగ్రెస్, సేవాభాయా మందిరం పోహరాదేవి, పూసద్, వి.పి.నాయక్‌గారి జన్మస్థలం గౌలీతాండా, నాందేడ్, పరభాని, ఔరంగాబాద్ అక్కడినుండి తిరిగి షోలాపూర్ వచ్చాను. కర్ణాటక రాష్ట్రంలో బీజాపూర్, బాగల్‌కోట్, హుబ్లి, ధార్వాడ్, చిత్రదుర్గ అక్కడినుండి నేరుగా బెంగుళూరు చేరినాను. అక్కడినుండి అనంతపురం మొత్తం 45 రోజులు ప్రయాణం చేసి శ్రీ శైలం చేరాను. ఈ వివరా లన్నియు విశాలాంధ్ర దినపత్రికలో ''ప్రకటనలు మిను ప్రగతికి నోచుకొని ఆంధ్రప్రదేశ్ బంజారాలు'', ఆంధ్రప్రభ వార పత్రికలో ''ప్రగతి పథంలో బంజారాలు'', మరియు జాగృతి విజయవాడ వార పత్రికలో '' అలనాటి అసహాయ శూరులు, ఈ నాటి నిస్సహాయ ధీరులు-బంజారాలు'' అని వేరు వేరు పేర్లతో ప్రకటించబడినది. అందులో నా పర్యటన వివరములున్నియు ఉన్నవి.

ఈ విధంగా నేను టూర్ ప్రోగ్రాంలో ఉన్న కాలంలో అనంతపురంలో ఉన్న విజ్ఞానవంతులు, ఉద్యోగులు శ్రీ వి. గోపాలరావ్‌నాయక్ బి.డి.ఓ. గారి ఇంటి మీద పడి నానా మాటలని ఇంటి మీద రాళ్ళు రువ్వటం జరిగినదట. అతను బంజారా జాతిలో ప్రథమంనుండి అనగా 1947నుండి ఎటువంటి ప్రతిఫలమును ఆశించకుండా తను ఉద్యోగం చేస్తూ, సంఘములను స్థాపించుకొంటూ, కార్యకర్తలను తయారు చేస్తూ ప్రాంతీయ భేదము లేకుండా ఎక్కడ ఏ ప్రాంతములో ఉన్న తన తోటి బంజారాల అభివృద్ధిని,.తన, మన, ధనమును లెక్కచేయకుండా పనిచేసినారు వారిపై నీవు గుంటూరు జిల్లా వాస్తవ్యుడవు మా అనంతపురంలో సంఘ అధ్యక్షుడుగా ఎలా ఉంటావు అని అతనిని వేదించారు. ఆ బాధలు తట్టుకొనలేక, అప్పటికి బెంగళూరుకు, బొంబాయినుండి మకాం మార్చిన రంజిత్‌నాయక్‌గారిని పిలుచుకొనివచ్చి, అనంతపురం శ్రీకంఠం టాకీసులో మీటింగ్ ఏర్పాటు చేసి డబ్బు, రికార్డులు మొత్తం వి. గోపాల్‌రావ్‌గారి వద్దనుండి లాక్కొన్నారు. ఈ విధంగా సంఘ అభివృద్ధిని ఆటంక పరచినారు. జాతి సేవ చేసేవారిని కించ పరచినారు. దొంగలు అన్నారు. ఈ విషయమును

నాకు శ్రీ రంజిత్‌నాయక్‌గారు అకోలా జిల్లాలో తన చెల్లెలు సావిత్రి వివాహం జరిగినప్పుడు అక్కడ ఈ విధంగా జరిగింది అని నాతో చెప్పాడు. అప్పుడు నేను వారితో మీకు తెలిసి ఉండి ఎందుకు అలా చేసారు అని తెలిపిన గోపాలరావ్‌నాయక్‌గారు నా వద్ద వచ్చి ఏడుస్తూన్నాడు అని చెప్పినారు. కాని వారిని వారించలేక పోయారు.

శ్రీ రంజిత్‌నాయక్ స్వభావం గూర్చి కొంత ఇక్కడ తెలియపరచినాను. శ్రీ రంజిత్‌నాయక్‌గారు దేశం మొత్తంలో బంజారా సేవా సంఘం తరపున లెక్క కట్టలేనంత పని చేసారు. కాని తనకంటు ఒక రాజకీయ స్థానమును కల్పించుకోలేదు. మహారాష్ట్రవాళ్ళు ఈయనని పొగడి పొగడి పని చేయించుకొన్నారే కాని, ఏదైనా పదవి విషయం వస్తే దూరం ఉంచుతూ వచ్చారు. తను ఎక్కడ ఎవరు మీటింగ్ పెట్టిన, టెలిగ్రాం ఇచ్చిన, ఎన్నిపనులు ఉన్న, ఎంత డబ్బు ఖర్చు అయిన లెక్కచేయకుండ విమానంలో కాని, కారులు వేసుకోని కాని ఎంత దూరమైన ప్రయాణించి ఆ కార్యక్రమమునకు హాజరుకాగలడు. తన దగ్గర ఉన్న ఒక చెడ్డ గుణం ఏమనగా ప్రతివాడు తనకు తగ్గే ఉండాలని అంటారు. ఎవరైనా కార్యకర్త పైకి వస్తూన్నాడంటే ఓర్చుకోలేడు. ఏదో ఒక విధంగా అతనిని ఆటంక పరచటం అతని స్వభావం. హైద్రాబాద్ వచ్చినప్పుడు అమర్‌సింగ్ రాథోడ్ తన మాట వినటంలేదని అతన్ని నన్ను చూడమంటారు. రవీంద్రనాయక్, ఎక్కడ మీటింగ్ పెట్టితే అక్కడ పోయి పోటి మీటింగ్ చేస్తారు. నేను ఈ విషయంలో ఎన్ని సార్లు చెప్పినను, నా మీద మండి పడుతారు. నీవు నన్ను ఎప్పుడు సమర్థించవే! అంటాడు. అయ్యా పైపై మెరుగులకు సంఘాలు అభివృద్ధి కావు. అందరిని కూడ గట్టుకొన్నప్పుడే నీకు ప్రాముఖ్యత లభిస్తుంది అంటే దానిని ఓప్పుకోరు. శ్రీ వి.పి.నాయక్‌గారు అనంతపురం సంఘమునకు పంపిన రూ. 5,000/- రంజిత్‌నాయక్ చెప్పి ఇప్పించాడని ప్రచారం జరిగింది. అసలు దీనికి రంజిత్‌నాయక్‌గారికి సంబంధం లేదు. శ్రీ వి.పి.నాయక్‌గారు, ఆంధ్రప్రదేశ్ నుండి ఎవ్వరు బొంబాయి పోయిన బి.చీనియానాయక్ ఎవరు? కంట్రాక్టరా! అని అనేవాడట. చాలా మంది చెప్పినారు. నేను శ్రీ వి.పి. నాయక్‌గారికి భారత బంజారా సేవా సంఘం ఎలా స్థాపించవలయునను ఒక ఛార్టును పంపి ఉంటిని. దానికి అతను ఇంప్రెస్ అయి ఆంధ్రప్రదేశ్ వారు అంటే నా పేరు అడిగేవారట.

అనంతపురం జిల్లా సంఘమునకు సంబంధించిన డబ్బులు, ప్రభుత్వ ఉత్తర్వులు బుక్కులు, ఉత్తరములు, పోస్టల్ డెలివరి రిజిష్టరుబుక్కు అన్నియు వి.గోపాల్‌రావునాయక్ నుండి తీసుకొని అనంతపురం జిల్లా కొత్తపాలక వర్గంను స్థాపించుకొన్నారు. అయినా వారిలో సంఘం యొక్క ఆర్టికల్(5) మరియు (6) ఎవ్వరు పాటించి మెంబర్లు కాలేదు. ఈ సంఘం బంజారా (సుగాలీ - లంబాడి) విద్యావంతుల సమాజం కదా? కావున దానిలో అందరు మెంబర్లే అన్నట్లు చేసారు.

ఆ తరువాతనాకు ఒక ఆడిట్ రిపోర్టు పంపించారు! సంఘం డబ్బులన్నియు అవకతవకలు చేసాడని, ఆ డబ్బులు మొత్తం బి. చీనియా నాయక్ చెల్లించాలని, దానికి సమాధానంగా, అసలు ఆ డబ్బులన్నియు నేను స్వయంగా నా జీతం నుండి సంఘమునకు పెట్టుబడి పెట్టియున్నాను. తరువాత మీరు సంఘ నిబంధనల ప్రకారం వెంటనే ఆ డబ్బులు, రికార్డులు, నాకు ఒప్పచెప్పవలయునని, లేకున్న మీ పై చర్య తీసుకొంటానని తిరిగి తెల్పటం జరిగినది. శ్రీ వి.పి.నాయక్‌గారు పంపిన డబ్బులు, సంఘం కార్యక్రమములు నడపుటకే కాని

ఇతరములైన పనులను ఉపయోగించరాదని, మీ ఆటంకంవలన సాఫీగా జరగవలసిన సంఘం అభివృద్ధి కుంటు పడగలదని, ఆ తరువాత నేను మహారాష్ట్రము, మైసూరు రాష్ట్రములు పర్యటించి, అక్కడ అభివృద్ధి గూర్చి మరియు కొన్ని ఫోటోలు పంపడం జరిగినది.

నా పర్యటనలో బంజారా సంఘ నాయకులు, ఆంధ్రప్రదేశ్ బంజారాల అభివృద్ధికి క్రింది విధంగా తమ తమ శక్తిని బట్టి, తమ సంస్థల ద్వారా సంఘ అవసరాలకు కావలసిన వాటిని ఇస్తామని టేప్‌రికార్డు ద్వారా వారి సమ్మతిని తెల్పియున్నారు.

## సంస్థలు ప్రకటించిన బహుమతులు

| | | |
|---|---|---|
| 1. | షోలాపూర్, నెహ్రూనగర్, మాగా సేవా మండల అధ్యక్షులు శ్రీ సి.ఆర్. చౌహాన్‌గారు (గురు జీ) | 16 ఎమ్.ఎమ్ సినిమా ప్రొజెక్టరు ఇస్తామన్నారు |
| 2. | శ్రీ నాయక్‌నగర్, బొంబాయి నివాసి లోహిదాస్ రాథోడ్ | ఒక గోడ గడియారం ఇస్తామన్నారు. |
| 3. | శ్రీ పి. మోతిలాల్ నాయక్, వాడాలా, బొంబాయి (ప్రస్తుత హైకోర్టు జడ్జిగారు) | ఒక ఫోల్డింగ్ టేబల్, ఒక ఛేర్ ఇస్తామన్నారు. |
| 4. | శ్రీ భీమ్‌సింగ్ రూపసింగ్ చౌహాన్, గురునానక్ విద్యాలయ, నాందేడ్ | ఒక ఫోల్డింగ్ టేబల్, ఒక ఛేర్ ఇస్తామన్నారు. |
| 5. | శ్రీ భోపిదాస్ రాథోడ్, బి.ఏ., బి.ఇ.డి. మేనేజరు, నాయక్ ఎడ్యుకేషన్ సొసైటీ ఓత్‌మాల్(జిల్లా) మహారాష్ట్రము | మొత్తం ఆఫీసుకు కావలసిన ఫర్నిచర్ ఇస్తామన్నారు. |
| 6. | ప్రేమ్‌చంద్ అసరాం జాదవ్, అధ్యక్షులు, సాత్‌పూడా శిక్షణ ప్రచారక్ మండల్, ధులియా, ఖందేశ్, మహారాష్ట్రము. | ఒకగోద్రేజ్ టైప్‌రైటింగ్ మిషన్ ఇస్తామన్నారు. |
| 7. | శ్రీ కె.డి.జాదవ్, అధ్యక్షులు, ఓత్‌మాల్ జిల్లా కాంగ్రెస్ కమిటీ, పూసద్ తాలూకా బంజారా సేవసంగ్ కాలేజీవిద్యార్థి సంఘం తరపున, పూసద్ ఓత్‌మాల్ జిల్లా. | యాషికా 635 ఒక ఒక కెమేరా ఇస్తామన్నారు. |
| 8. | శ్రీ చరన్‌దాస్ డి.యస్.రాథోడ్, శ్రీ దుర్‌గాదాస్ రామదాస్ రాథోడ్,(శ్రీ రాథోడ్ క్లాత్ మర్చెంట్స్; డిగ్రెస్, ఓత్‌మాల్ జిల్లా. | వీరి తరపున ఒక పెద్ద షామియానా ఇస్తామన్నారు. |
| 9. | శ్రీ పి. రామానాయక్ బి.ఇ. సబ్ డివిజనల్ ఆఫీసరు దేవలాలి, మహారాష్ట్రము. | వీరు ఒకకెమెరా ఫ్లాష్‌గన్ ఇస్తామన్నారు. |
| 10. | ప్రతాప్‌సింగ్‌రాయ్‌సింగ్ ఆడే బి.ఏ అధ్యక్షులు, అఖిల భారత బంజారా సేవా సంఘం, వసంత్‌నాయక్ ఎడ్యుకేషన్ సొసైటీ మరియు, సమితి అధ్యక్షుడు డిగ్రెస్ తాలూకా, ఓత్‌మాల్ జిల్లా. | ఎలెక్ట్రిక్ డైనమో సెట్ ఇస్తామన్నారు. |

11. శ్రీ రామారావు మహారాజ్ సేవాభాయా మందిర స్థాపకులు పొహరాదేవి తాండా, అకోలా జిల్లా. — ఒక మైక్‌సెట్ ఇస్తామన్నారు.

12. శ్రీ శంకర్ రాథోడ్ బి.ఏ., ఎల్.ఎల్.బి. వకీలు, ధార్వా, ఓత్‌మాల్ జిల్లా — ఒక షామియాన ఇస్తామన్నారు.

13. శ్రీ రాజారామ్ రాథోడ్ ఎం.ఏ(చరిత్ర), ఎం.ఏ(పొలిటిక్స్) ప్రిన్సిపాల్, వసంతరావ్‌నాయక్, మహావిద్యాలయ, ఔరంగాబాద్. — వీరు మా సంఘ అభివృద్ధిని చూచి ఒక ప్రిటింగ్ ప్రెస్‌ను బహు కరిస్తాము అన్నారు.

పై విధంగా ఆ కాలంలో సుమారు 50వేల రూ. పైబడి విలువ గల వస్తువులను పొందుటకు వారి నుండి హామి తీసుకొని అనంతపురం వస్తే సంఘమును తలక్రిందల నడిపి ఉన్నారు. మన బంజారా విజ్ఞానవంతులు.

సంఘం డబ్బులు గూర్చి, నా నుండి వత్తిడి ఎక్కువైనందున ఆ డబ్బుతో సంఘం పేర 15 సెంట్ల స్థలము, బళ్ళారి రోడ్డు పైనున్న పాపంపల్లి పంచాయితిలోని. సర్వే నంబరు. 27లో బంజారా విద్యావంతుల సమాజం పేర రిజిస్టరు చేసామని, 26-10-73 సంవత్సరము సారథి పక్ష పత్రికలో ప్రచురించి ఉన్నారు. మరియు తాండాలకు పోయి చందాలు సుమారు రూ. 6,000 పై వసూలు చేసినట్లుగా ప్రకటించినారు. ఈ సంఘం ద్వారా వీరు అభివృద్ధి చేసిన పనులు ఏమిటి? వీరు తీసుకొన్న 15 సెంట్ల స్థలం ఏమైనది దాని గూర్చి తెల్పవలసి ఉన్నది.

ఈ విధంగా మన బంజారా నాయకులు, పని చేయువారిని చేయనీకుండ వారు చేయకుండా సమాజ అభివృద్ధికే గొడ్డలి పెట్టుగా తయారైనారు.

నేను రాష్ట్ర సంఘంలో జాయింట్ సెక్రెటరిగా, శ్రీ వి.గోపాల్‌రావ్‌నాయక్‌గారు, ఉపాధ్యక్షులు అయినందున రాయలసీమ రీజన్ సంఘమును స్థాపించి నాల్గు జిల్లాల కార్యక్రమములను చేపట్టడం జరిగినది. ఒంగోలు, కర్నూలు జిల్లాలలోని తాండాలను పర్యటించి, అక్కడి ప్రజల పరిస్థితులను, ఆయా జిల్లా అధికారులకు తెల్పి వారి అభివృద్ధికి పాటు పడటం జరిగినది. నారసింహపల్లి తాండా సమిష్టి వ్యవసాయ సంఘ అభివృద్ధికి కూడ శ్రద్ధ తీసుకొనటం జరిగినది. కర్నూలు, ఒంగోలు జిల్లాలలోని, గిద్దలూరు, మార్కాపురం, ఆత్మకూరు, నంద్యాల ప్రాంతములోని బంజారాలకు, అడవి భూములను సాగుచేయుటకు ఉత్తర్వులు ఇప్పించడం జరిగినది. నరజామల తాండా దగ్గర చిన్నరాయగుడి ప్రాజెక్టు, సట్టు తాండా దగ్గర చెరువు కట్టించడం జరిగినది. అడవులలో ఉన్నవారికి, పాడి గేదలు, న్యూట్రిషన్ సెంటర్లు స్థాపించడం జరిగినది. అక్కడి బంజారాలను జాగృతం చేయడం జరిగినది. ఆ ప్రాంతంలోని నాయకులు చాలా సహకరించారు. సట్టు తాండా బోడేనాయక్, నరజామల తాండా, మంత్రునాయక్, నల్లగుంట రామానాయక్, ఉప్పల దిన్న రామానాయక్, అక్కడ వీరికై ఒక గిరిజన మల్టీపర్‌పస్ కో.ఆపరేటివ్ సొసైటీని స్థాపించి, వారి ఆర్థిక సౌకర్యములను అభివృద్ధి చేయడం జరిగినది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మంత్రులు వారి వారి పరిధులలోని పనులను చేయడం జరిగినది. అప్పుడు ప్రభుత్వతంవారు మొబైల్ మెడికల్ వాన్‌లు, అగ్రికల్చర్ వాన్లు,

మొబైల్ పశువైద్యశాలలు, ప్రారంభించడం జరిగినది. మా గిరిజనులు గ్రామాలకు దూరంగా ఉంటారు. కావున వారికై ఏర్పాటు చేయవలయునంటే ప్రభుత్వంవారు, కామన్‌గా ఏర్పాటు చేసినారు.

పంచాయితీరాజ్ శాఖ మంత్రి వర్యులు శ్రీ హైగ్రీవా చార్యుల వార్కి పంపిన ఉత్తర్వు, మొత్తం రాష్ట్రంలోని జిల్లా పరిషత్ ఛైర్‌మెన్‌లకు పంపిస్తూ, ప్రతి జిల్లా కలెక్టర్లకు ఆ ఉత్తర్వులను పంపుతు బంజారా సంఘం వారు తెల్పిన ప్రకారం ప్రతి తాండాలోను కార్యక్రమములు చేపట్టవలయునని తెల్పియున్నారు. ఈ విధంగా తిరుగులేని విధంగా బంజారా సంఘం అభివృద్ధికి పాటుపడటం జరిగినది.

6–1–74 సంవత్సరములో శ్రీశైలం ప్రాజెక్టు నందు సంఘం సర్వసభ్య సమావేశం ఏర్పాటు చేయుట జరిగినది. ఆ మీటింగ్‌నకు, శ్రీ పి. రంజిత్‌నాయక్, పి. చంద్రాకళారంజిత్ నాయక్, వి. గోపాలరావునాయక్, శ్రీ మేఘునాథ్ చౌహాన్, శ్రీ బి. కె. సత్యంగారు(పుంగనూరు). శ్రీ భుట్టు పంతులు, నల్గొండ జిల్లా మరియు నల్లగుంట రామానాయక్‌గారు ఇంకను చాలా మంది పెద్దలు, కర్నూలు, ఒంగోలు జిల్లా కార్యకర్తలు హాజరై సభను జయప్రదం చేసినారు. ఆ సభలో శ్రీ రంజిత్‌నాయక్‌గారు, ఆంధ్రప్రదేశ్ బంజారా విద్యావంతుల సమాజము సంఘము పేరు విద్యావంతులకే అను భావమును తెల్పుచున్నది. ఈ పేరు మార్చిన బాగుండును అని చెప్పినారు. అప్పుడు నేను తమరు అఖిల భారత బంజారా సేవా సంఘం యొక్క ముఖ్యకార్యకర్తలు కదా? మరి ఆంధ్రప్రదేశ్, మైసూరురాష్ట్రములో దీని శాఖ లేదు కదా? అన్నాను. అప్పుడు అక్కడి సభ్యులందరు ఏకగ్రీవంగా, విద్యావంతుల సంఘమునకు బదులు ''అఖిల భారత బంజారా సేవా సంఘం, ఆంధ్రప్రదేశ్ శాఖ'' అని నామకరణం చేయడం జరిగినది. ఆ తరువాత అఖిల భారత బంజారా సేవా సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీరామ్‌సింగ్ బాణావత్‌గార్కి, ఉత్తరం వ్రాసి వారి అనుమతి పొందడం జరిగినది. అప్పటినుండి విద్యావంతుల సమాజం బదులు, అఖిల భారత బంజారా సేవా సంఘం పనులు చేపట్టడం జరిగినది. పంచాయితీరాజ్‌శాఖ మంత్రివర్యులు శ్రీ హైగ్రీవా చార్యులవార్కి పంపిన ఉత్తరం లేఖ నం. 151, తారీఖు 3–6–72 ప్రకారం రాష్ట్రములోని అన్ని జిల్లా పరిషత్ ఛైర్‌మెన్‌లకు ఆర్.సి. నం1622 ప్రొసిడింగ్. నం. 1/72–1 తేది 22–6–1972న ఆదేశాలిస్తూ అమలు పరచవలయునని తెల్పియున్నారు. అదే ఉత్తర్వును రాష్ట్రంలోని మొత్తం జిల్లా కలెక్టర్లుకు పంపిస్తూ , ట్రైబల్ వెల్‌ఫేర్ డైరెక్టరు హైద్రాబాద్ వారికి, ఒక కాపీని జాయింట్ సెక్రటరీ ఆం. ప్ర. బంజారా విద్యావంతుల సమాజం శ్రీశైలంకు పంపియున్నారు. ఆ ఉత్తర్వును తెలుగులో ప్రింట్ చేసి అందరు బంజారా కార్యకర్తలకు, విద్యా వంతులకు, ఉద్యోగస్తులకు తమతమ ప్రాంతాల అభివృద్ధికి పాటు పడవలసినదిగా పోస్టుద్వారా పంపించడం జరిగినది.

సమాజ్ ద్వారా 16–8–73న ఆంధ్రప్రదేశ్ గవర్నర్ సలహాదారు అయిన శ్రీ హెచ్.సి. షరిన్‌గారితో ముందుగా ఇంటర్వ్యూ తీసుకొని 18–6–73న అతని ఛేంబర్‌లో పోయి చర్చించి, సమర్పించిన వినతి పత్రం మేరకు బంజారా తాండాలలో ఫీల్డు పబ్లిసిటీ కార్యక్రమములలో బంజారా విద్యావంతులను నియమించి, బంజారా భాషలో ప్రతి తాండాకు పోయి వారిని జాగృతి చేయవలయునని తెల్పిన మేరకు, పబ్లిక్ రిలేషన్ డైరెక్టరు హైద్రాబాద్‌వారి

ఆర్.సి.నెం. 70356 ప్లానింగ్ అండ్ పబ్లిక్ 73 తారీఖు 19-9-1973 తమ జిల్లా అధికారులను ఆదేశిస్తూ ఉత్తర్వు జారి చేసారు.

26-12-1973న క్రొత్తగా ఎన్నికైన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గార్కి అభినందనలు తెల్పుచూ పత్రికా ముఖంగా చేసిన విన్నపములు. వారు వెంటనే స్పందించి ఒక బంజారాను ఎం.ఏల్.సిగా తీసుకొంటున్నామని ఆల్ ఇండియా రేడియో హైద్రాబాద్ ద్వారా తెలియ పరచారు. ఆ ప్రకారంగా శ్రీ జి. అమరసింగ్ రాథోడ్, ఎర్రగడ్డ తాండా హైద్రాబాద్ వారిని ఎం.ఎల్.సిగా తీసుకొన్నారు. ఆ తరువాత వారు తెలంగాణా డెవలప్‌మెంట్ బోర్డు ఛైర్‌మెన్‌గా కూడ పనిచేసారు.

## విద్యావంతుల సమాజ్ కార్యకర్తలకు పంపించిన ఉత్తరం.

## ఆంధ్రప్రదేశ్ బంజారా(లంబాడి-సుగాలి) విద్యావంతుల సమాజ్

### అనంతపురం జిల్లా బ్రాంచి

రిజిష్టరు నెం. 95/71

శ్రీ వి.గోపాలరావునాయక్, B.A. అధ్యక్షులు శ్రీ బి. చీనియానాయక్, కార్యదర్శి
శ్రీ యస్.కె.కేశవనాయక్, ఉపాధ్యక్షులు శ్రీ బి. దూద్యానాయక్, సహాయకార్యదర్శి
శ్రీ డి. రఘుపతినాయక్,(B.Sc. Ag) కోశాధికారి.

లెటరు నం **BES/1/208RR** తారీఖు 1-12-1972

**From :**
బి.చీనియానాయక్, జాయింట్ సెక్రెటరి
రాయలసీమ ప్రాంతం
B1/84 వెస్టు కాలనీ, శ్రీశైలంప్రాజెక్టు
కర్నూలు జిల్లా

**To,**
కార్యకర్తలు
బంజారా సేవా సంఘం
కర్నూలు

అయ్యా!

విషయము :- గిరిజన సంక్షేమం - ఆంధ్రప్రదేశ్ బంజారా(లంబాడి-సుగాలీ) విద్యావంతుల సమాజం - సుగాలీ తాండాలకు కొన్ని వసతులు కల్పించు సంబంధము.

రెఫరెన్సు : ఉత్తరువు నం. 1622/Prag 1/72-1 దినము 22-6-72 డిప్యూటీ సెక్రెటరి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము పంచాయితిరాజ్ శాఖ అన్ని జిల్లాల పరిషత్ ఛైర్మెన్‌గార్లకు.

క్రింద నివ్వబడిన రెఫరెన్సు ఈ ఉత్తరముతో పాటు జతపరచబడినది. దీని ప్రకారం మేము విన్నవించునది ఏమనగా ప్రభుత్వమువారు జారిచేసిన ఉత్తరువు ప్రకారం మా విన్నపము పంచాయితీరాజ్ మంత్రిగార్కి పంపిన విన్నపం నం 151 దిన 3-6-1972లో కోరినరీతిగా తాండాలలో నివసించు బంజారాలకు వసతులను కల్పించవలసినదిగా మీరు తీసుకొన్న చర్యను మాకు తెలియచేయవలసినదిగా ప్రార్థిస్తున్నాము.

Copy శ్రీ.........................
.........................
.........................

ఇట్లు, భవదీయుడు
బి. చీనియానాయక్, జాయింట్ సెక్రెటరి
రాయలసీమ ప్రాంతము

మీ ప్రాంతానికి సంబంధించిన సాంఘిక కార్యకర్తలైన మీరు మీ ప్రాంతములోని ఆఫీసర్లను కలసి వారు మీ ప్రాంతం ప్రజలకు మన విన్నపము నం. 151 దినము 3-6-1972లో కోరిన విధముగా పనులు చేయునట్లు చూడవలయును. ఈ విషయములో వచ్చిన అభివృద్ధిని మాకు ఎప్పటికప్పుడు తెలియపరచవలెను.

ఇట్లు, భవదీయుడు
బి.చీనియానాయక్, జాయింట్ సెక్రటరి
రాయలసీమ ప్రాంతం

## పంచాయితీరాజ్ శాఖ– ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి ఉత్తర్వు
## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము – పంచాయితీరాజ్ శాఖ

ఉత్తరం నం 1622/Prgas/1/72 దిన. 22-6-72
శ్రీ ఎమ్. వి. యస్ ప్రసాదరావు, I.A.S. డిప్యూటి సెక్రటరి, పంచాయితీరాజ్ శాఖ, సెక్రటెరియట్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్ వారినుండి

అన్ని జిల్లాపరిషత్‌ల ఛేర్‌మెన్‌లకు(w.e)

అయ్యా!

విషయము : గిరిజన సంక్షేమం, ఆంధ్రప్రదేశ్ బంజారా(లంబాడి–సుగాలీ) విద్యావంతుల సమాజం – సుగాలీ తాండాలకు కొన్ని వసతులు కల్పించుట – సంబంధం.

రెఫరెన్సు : సెక్రటరి, ఆంధ్రప్రదేశ్ బంజారా విద్యావంతుల సమాజం, హైదరాబాదు, ఉత్తరం నం. 151/ దినము 3-6-72.

పై నుదహరింపబడిన ఉత్తరము ఈ ఉత్తరముతోపాటు జతపరచబడినది, అందులో కోరిన పనులను తాండాలలో ఉన్న బంజారా, లంబాడి, సుగాలీలకు ఏర్పరచవలసినదిగా ప్రార్థించడమైనది.

ఇట్లు
(Sd/-) వి. ఆర్. నటేషశెట్టి,
for డిప్యుటి సెక్రటరి, పంచాయితి రాజ్ శాఖ,
సెక్రటేరియట్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు.

దీని నకలు పంపబడిన ఆఫీసులు :

1) డైరెక్టరు, గిరిజన సంక్షేమశాఖ, హైదరాబాద్ (w.e)
2) రెవిన్యూశాఖ, గిరిజన సంక్షేమ విభాగం (w.e)
3) సెక్రటరి ఆంధ్రప్రదేశ్ బంజారా(లంబాడి-సుగాలీ) విద్యావంతుల సమాజం, రాయలసీమ ప్రాంతం, H.No B1/84 శ్రీశైలం ప్రాజెక్టు, కర్నూలు జిల్లా.
4) ఆంధ్రప్రదేశ్‌లో అన్ని జిల్లా కలెక్టరులకు.
5) Ex. డిప్యుటి సెక్రటరి ఆఫీసుకు(sw) విద్యాశాఖ

జాయింట్ సెక్రటరి, రాయలసీమ ప్రాంతం H NoB1/84 వెస్టన్ కాలనీ శ్రీశైలం ప్రాజెక్టు కర్నూలు జిల్లా – ఆంధ్రప్రదేశ్ బంజారా(లంబాడ–సుగాలీ) విద్యావంతుల

సమాజంవారు పంచాయితీరాజ్ మంత్రిగార్కి, పంచాయితీరాజ్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం - హైదరాబాద్ పంపించుకొన్న వినతి పత్రం నకలు, వినతి పత్రం నం. 151 దినము 3-6-1972.

## విషయం : ఆంధ్రప్రదేశ్ బంజారా విద్యావంతుల విజ్ఞాపన పత్రం

గౌరవనీయులైన పంచాయితీరాజ్ మంత్రిగారికి,

తమ దివ్య సముఖమునకు మా విజ్ఞాపన పత్రమును పంపుచున్నాము. మీరు మాకు అనుకూలముగా పరిశీలించి ఉత్తరవు జారి చేయవలసినదిగా ప్రార్థన.

1) ఆంధ్రప్రదేశ్‌లోని సుగాలీలందరు వేరు వేరు తాండాలలో, కొండలకు, అడవులకు దగ్గరగా నివసిస్తున్నారు. తాండాలకు రోడ్లులేని కారణంగా హెల్తువిజిటర్లుగాని పల్లెల అభివృద్ధికి సంబంధించిన ఆఫీసర్లుగాని రాలేకపోతున్నారు. ఈ విధంగా మేము నిర్లక్ష్యం చేయబడ్డాము. అందువల్ల రోడ్లు లేని తాండాలకు పోవుటకు రోడ్లు వేయించవలసినది.

2) గృహనిర్మాణ పథకం : ప్రభుత్వంవారు హరిజన గిరిజనులకుగాను గృహనిర్మాణ పథకముక్రింద కాలనీలు నిర్మించుటకుగాను పథకములు తయారుచేసి అమలు పరుస్తున్నారు. కాని రాయలసీమ ప్రాంతంలో నివసిస్తున్న సుగాలీలకు ఒక్క కాలనీకూడ కట్టలేదు. దాని కారణంగా మా సుగాలీలు చెట్ల నీడలలో, చిన్న చిన్న పూరిగుడిసెలలో ఉండవలసి వచ్చినది.

అసలే రాయలసీమ వెనుకబడిన ప్రాంతము. అందులో ఈ బంజారాలు మరీ వెనుకబడిన వారు . రాయలసీమ డెవలప్‌మెంట్ బోర్డునుండి ఒక్క పైసాకూడా బంజారాల అభివృద్ధికోసం వినియోగించుటలేదు. కావున ట్రైబల్ ఫండ్సు మరియు రాయలసీమ డెవలప్‌మెంట్ బోర్డుఫండ్సుతో పంచాయితి సమితిద్వారా మాకు కాలనీలు కట్టించవలసినది.

ఇలాంటి కాలనీలు టౌన్‌లలో కూడ విద్యావంతులకు, ఉద్యోగులకు, సాంఘిక కార్యకర్తలకోసం కూడ కట్టించవలసినది. ఆ విధంగానైన బంజారులు పట్నం వాతావరణములకు అలవాటుపడి సంస్కృతి, నాగరికతకి అలవాటు పడగలరు.

ఈ కాలనీలు ప్రతి జిల్లా ముఖ్య పట్టణములలోను, తాలూకా ముఖ్యపట్టణములలోను, సమితి హెడ్ క్వార్టర్సులలోను కట్టించవలసినది. అప్పుడు ప్రతి తాండానుండి కనీసము రెండు కుటుంబాలవారు ఈ కాలనీలలో ఉండిన కొన్ని రోజులకైన వీరిద్వారా పై తెల్పిన వాటిని అభివృద్ధి పరచవచ్చును. గిరిజన బాలబాలికల హాస్టల్సు కూడ ఈ కాలనీలలో స్థాపించిన తాండాల నుండి వచ్చు విద్యార్థులు ఈ హాస్టల్సులో ఉండగలరు.

విద్యావంతులైన బంజారా వ్యక్తిని ప్రతి జిల్లా పరిషత్‌లలోను ప్రతి సమితిలోను, రాయల సీమ డెవలప్‌మెంటు బోర్డులోను ఒకరు లేక ఇద్దరు బంజారాలను సభ్యులుగా చేర్చుకొనవలయును. వారి ద్వారా పైనివ్వబడిన కార్యక్రమములను అమలు పరచు విధముగా చేయవలయును.

3) త్రాగుటకు మంచినీటి వసతి : మా తాండాలకు మంచినీటి బావులుగాని, చెరువులు గాని లేవు. చాలా దూరములోనున్న వాగునీటిని, బుగ్గనీటిని మంచినీళ్ళుగా

వాడుకొనుచున్నాము. కావున ప్రతి తాండాకు మంచినీటి బావులను త్రవ్వించే ఏర్పాటు చేయవలెను.

4) పశువులకు త్రాగే నీటివసతి : సుగాలీల పూర్తి సంపద పశువులు( ఆవులు, గేదెలు, మేకలు, గొఱ్ఱెలు) ప్రతి సుగాలీ కుటుంబమునకు 20నుండి 25వరకు పశువులున్నవి. ప్రతి తాండాలో దాదాపు 500 పశువులున్నవి. ఈ పశువులకు త్రాగే నీటిని సమకూర్చుటకు మనుష్యులతో సాధ్యం కానిపని, వాగులలో కేవలం వర్షాకాలం మాత్రమే పశువులకు త్రాగే నీరు లభిస్తుంది ఎండకాలం ఒక చుక్కకూడా దొరకదు. కావున పశువులకోసం కూడ బావులను కుంటలను త్రవ్వించవలెను. బావులనుండి నీరుతోడి పశువులకు త్రాపవలెనన్న చాలా కష్టము, కావున పెద్ద పెద్ద తొట్లను అనగా 20అం. లోతుగలవాటిని బావికి దాపులో సిమెంట్ ద్వారా నిర్మించి, సమితుల ద్వారా నీరు తోడుటకుగాని ఆయిల్ ఇంజన్‌లను ఏర్పరచి ఈ టబ్బులలోనికి నీటిని తోడిన పశువులు ఈ టబ్బులోని నీరు త్రాగ గలవు. ఈ విధముగా చేయుటవలన పశువులకు నీటి ఎద్దడి వేసవికాలములో తొలగగలదు.

5) విద్యా సౌకర్యము : ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు 25 లక్షలమంది బంజారాలున్నారు. అనగా 1/16వంతు ఆంధ్రప్రదేశ్ జనాభాలో ఉన్నారు. కావున బంజారాలు 1/16 వంతు ప్రభుత్వము యొక్క గ్రాంటులకు హక్కుదారులు. కావున బంజారాలకు చెందు ఫండ్సునుండి 50% బంజారాల విద్యా సౌకర్యమునకు వినియోగించవలెను. అనగా 1) ప్రతి తాండాలోను ప్రాథమిక పాఠశాలను స్థాపించవలెను. 2) రెండులేక మూడు తాండాలకు కలిపి సమితులు ద్వారా ఆశ్రమ పాఠశాలలను స్థాపించవలెను. 3) ప్రతి హైస్కూలు, కాలేజీ కేంద్రాలలో గిరిజనులకు హాస్టలు వసతి ఏర్పాటు చేయవలెను.

6) వైద్యసౌకర్యము : హాస్పిటల్సు తాలూకా, సమితి హెడ్‌క్వార్టర్సు వద్ద ఉండటంవల్ల మా తాండాలకు చాలా దూరమైనవి కావున మా వైద్యసౌకర్యము ఏర్పాటుకు ప్రతి సమితిలో ఒక మెడికల్ మొబైల్ వ్యాన్‌ని ఏర్పాటుచేయవలెను. వైద్యసౌకర్యం డాక్టర్లద్వారా, హెల్తు విజిటర్సు ద్వారా ఏర్పాటు చేయ ప్రార్థన

ప్రసూతి హాస్పిటల్సు తాండా ప్రజలకు అందుబాటులో ఉండునట్లు స్థాపించవలెను.

7) పశువుల వైద్యసౌకర్యం : ప్రతి సమితిలో సంచార వైద్య వాహనములను ఏర్పరచవలెను. ఈ వాహనములతో ప్రతి తాండాకు వెళ్ళి పశువులకు వైద్యసౌకర్యం కల్గించవలెను.

8) పంచాయితి సమితుల ద్వారా ప్రతి తాండాకు ''కమ్యూనిటి రేడియో సెట్'' ఏర్పరచవలెను దేశములో జరుగుచున్న విషయములు తెలుసుకునే అవకాశము లేదు. తాండాలలోని ప్రజలకు రేడియోద్వారా ప్రసారమయే ముఖ్యమైన వార్తలు, విషయములు వినగలరు. ఏ విధమైన వినోదము లేని ప్రజలకు వినోదము, విజ్ఞానమును అంద జేయవలెను.

9) బంజారాజాతి ప్రజల అభివృద్ధిగూర్చి ప్రచార నిమిత్తం ప్రతి సమితిలో ఒక బంజారా వ్యక్తిని నియమించవలెను. బంజారా ప్రజలకు తెలుగు సరిగా రానందున వారికి

బంజారా భాషలోనే ప్రచారం చేయవలసియున్నది. ఈ వ్యక్తి సంచార వాహనములో ప్రతి తాండాకు వెళ్ళి తాండా ప్రజలకు విద్య, సంస్కృతి, ఆరోగ్యము, వ్యవసాయము, పశుపోషణ మున్నగు ముఖ్యవిషయములనుగురించి బంజారా భాషలో ప్రచారము చేయుటకు బంజారా విద్యావంతులను నియమించవలెను.

10) తాండాలనుండి హాస్టళ్ళకు, తాలూకా కచేరిలకు, సమితి ఆఫీసులకు వచ్చు తాండా ప్రజలకు తాత్కాలికంగా విశ్రాంతి తీసుకొనుటకు ప్రతి సమితి హెడ్ క్వార్టర్సులలో ఒక బంజారా గృహమును నిర్మించవలెను.

ఆంధ్రప్రదేశ్ బంజారా విద్యావంతుల సమాజం, రాయలసీమ ప్రాంతం

నకలు

ఇట్లు భవదీయుడు,
బి.చీనియానాయక్, జాయింట్ సెక్రెటరి.
(Sd/-) పి. వెంకటరమణ, సెక్షన్ ఆఫీసరు

## ఆంధ్రప్రదేశ్‌లో అఖిల భారత బంజారా సేవా సంఘం ఆంధ్రప్రదేశ్ (బ్రాంచి) శాఖ కార్యక్రమములు

ఆంధ్రప్రదేశ్‌లో అఖిల భారత బంజారా సేవా సంఘం ఆంధ్రప్రదేశ్( బ్రాంచి) శాఖ 6-1-1974, శ్రీ శైలం పుణ్యక్షేత్రంలో శ్రీ పి. రంజిత్‌నాయక్, అఖిల భారత బంజారా సేవా సంఘం కార్యకర్త అధ్యక్షతన సమావేశమై ఈ క్రింది తీర్మానములు చేసినది.



కూర్చున్న వారిలో ఎడమ ప్రక్కనుండి బి.కె. సత్యం, వి. గోపాలరావునాయక్, శ్రీ పి. రంజిత్ నాయక్, చంద్రకళాబాయి, బి. లక్ష్మిబాయి, నిల్చున్నవారిలో శ్రీమతి మంగమ్మ, లక్ష్మిబాయి రామకృష్ణభార్య, మగవారిలో ఎడమనుండి నాల్గవవారు కీ.శే. శ్రీ డి. రామానాయక్, 7వవారు పి.నారాయణసింగ్ నాయక్, బి.చీనియానాయక్, 10వ వారు సోమునాథ్, 12వ వారు శ్రీ మేఘనాథ్ చౌహాన్, ఎమ్.స్వామినాయక్ తదితరులు.

1. అఖిల భారత బంజారా సేవా సంఘం నిబంధనల మేరకు, ఆంధ్రప్రదేశ్ శాఖ స్థాపించుటకు.

2. ఈ సంఘ స్థాపనకుగాను శ్రీ బి.చీనియానాయక్, కన్వీనరుగాను, శ్రీ పి. రంజిత్ నాయక్, వి. గోపాలరావునాయక్ శ్రీ బి.కె. సత్యం, మేఘనాథ్ చౌహన్ మరి మొత్తం 12 మందితో ఒక అడహక్ కమీటిని స్థాపించడం జరిగినది.

3. అడహక్ కమీటి మీటింగ్ 26-1-1974 అనంతపురంలో జరుపుటకై తీర్మానించడమైనది. 6-1-74 తీర్మానం మేరకు 15-1-74న అందరికి మీటింగ్ నోటీసులు పంపించడం జరిగినది. 26-1-74 అనంతపురం యన్.జి.ఓ. హోమ్‌లో సమావేశమై(సంఘం ఆఫీసులో) క్రింది విధంగా తీర్మానించడం జరిగినది.

   1. కార్యవర్గ సభ్యుల ఎన్నిక -

| | |
|---|---|
| అధ్యక్షులు | : శ్రీ పి. రంజిత్‌నాయక్ |
| ఉపాధ్యక్షుడు | : శ్రీ బి.కె. సత్యం |
| | : శ్రీ జి. స్వామినాయక్ |
| ప్రధానకార్యదర్శి | : శ్రీ బి.చీనియానాయక్ |
| సంయుక్త కార్యదర్శి | : శ్రీ పి.నారాయణ్‌నాయక్ |
| | : కె. లీలాబాయి |
| కోశాధికారి | : యం. మేఘనాథ్ చౌహన్ |

   మరియు కార్యనిర్వాహక సభ్యులు ప్రతి జిల్లాకొక్కరు.

   2. సహాయక కమిటి ఏర్పాటు శ్రీ వి.పి.నాయక్ ముఖ్యమంత్రి, మహారాష్ట్ర. శ్రీ కె.టి. రాథోడ్, కర్ణాటక మంత్రి, రామ్‌సింగ్ భాణావత్, రామచంద్ర చౌహాన్, (గురుజీ), షోలాపూర్, వి.గోపాల్‌రావునాయక్, ఎస్. ఘణేనాయక్, బుక్కపట్నం, అనంతపురం జిల్లా.

   3. గుమస్తాను నియమించుట.

   4. లెటర్ ప్యాడ్లు, సంఘ పుస్తకాలు, రసీదు పుస్తకములు ముద్రించుట.

   5. సంఘం ద్వారా ''బంజారా'' అను పేరుతో పక్షపత్రిక నడపుటకు శ్రీ రంజిత్‌నాయక్ శ్రీ బి.చీనియానాయక్‌కు అధికారం ఇచ్చినారు.

   6. అనంతపురంలో సంఘ కార్యాలయము నిర్మించుటకు స్థలము మరియు అనంతపురంలో నివశించుచున్న బంజారాలకు గృహనిర్మాణములు చేయుటకు గాను కావలసిన స్థలం మంజూరు చేయించుటకు జిల్లా కలెక్టరు వారిని అభ్యర్థించుటకు తీర్మానించడమైనది.

పై తీర్మానములు మేరకు నేను 20-1-74నుండి జులై 31వరకు నా ఉద్యోగమునకు సెలవు పెట్టి పనిచేయడం జరిగినది. ముఖ్యంగా ''బంజారా'' పక్షపత్రిక నడిపించుటకు పూర్తి విశ్వాసముతో పనిచేయడం జరిగినది. బంజారాల అభివృద్ధికి ముఖ్యమైన ఆయువు పట్టు పత్రిక. మొత్తం రాష్ట్రంలోని బంజారాల స్థితిగతులను తెలుసుకొని వారి కష్ట సుఖములను

ప్రభుత్వమునకు, ప్రజలకు తెల్పవలయుననంటే ప్రచార సాధనము ముఖ్యము. అందువలన 17-3-1974 కర్ణాటక మంత్రివర్యులు కీ.శె. శ్రీ కె.టి. రాథోడ్‌గారు, శ్రీ తేజ్‌సింగ్ రాథోడ్ ఎం.ఎల్.ఏ కర్ణాటక రాష్ట్రం, అసిస్టెంట్ కలెక్టరు. రామకృష్ణ ఐ.ఏ.యస్‌గారు, ఎన్.జి.వో. ప్రెసిడెంట్ రామమూర్తిగారి అతిధ్యమును ''బంజారా'' పత్రిక విడుదల చేయడం జరిగినది.



అనంతపురం నుండి బంజారా తెలుగు పక్ష పత్రిక ప్రారంభోత్సవ సందర్భంలో ఎడమ ప్రక్కనుండి కీ.శే. శ్రీ కె. టి. రాథోడ్, కీ.శే. తేజ్‌సింగ్ రాథోడ్- ఎం.ఎల్.సి., కర్నాటక, కీ.శే. ఎన్. రామమూర్తి-ఎన్.జి.ఓ. అధ్యక్షుడు., ప్రధాన కార్యదర్శి శ్రీ బి. చీనియానాయక్, అధ్యక్షులు శ్రీ పి. రంజిత్‌నాయక్ మరియు తదితరులు

ఈ పత్రిక ఎడిటింగ్‌కుగాను శ్రీ రామకృష్ణ పేపర్ కరస్పాండెంట్‌గార్ని రంజిత్‌నాయక్‌గారు నియమించడం జరిగినది. అతను మంచి పత్రిక రచయితే కాని అతనికి బంజారాల సమస్యలు ఏమి తెలుసు. అతను బంజారా సమస్యలకు బదులు, మామూలు సమస్యలను ప్రచురించటం జరిగినది. అందువలన బంజారాలలో దాని మీద ఆదరణ తగ్గినది. ఎంతో కష్టపడి భార్యా పిల్లలను అడివిలో(శ్రీశైలం) వదిలి పెట్టి జీతం నష్టం పెట్టుకొని పత్రిక నడిపించుటకు సహకరిస్తే రంజిత్‌నాయక్‌గారు తను రామక్రిష్ణకు ఒప్పచెప్పి, నేను చెప్పినది, పెడచెవిని పెట్టిన్నారు. నేను నా సంసార బాధ్యత, ఉద్యోగ బాధ్యత అన్ని వదలి పెట్టి ఇక్కడ ఉన్నాను. అంటే, నీకు జీతం ఇస్తాను, తీసుకో అంటారు. నాకు భగవంతుడు ఇచ్చిన జీతం ఉండగా, మీరు నాకు ఎంత జీతం ఇవ్వగలరు అని అడిగాను. అంటే సంఘం జాతి గౌరవం పై నేను పనిచేస్తున్నాను, అని అర్థం చేసుకోక నీకు జీతం ఇస్తాను అన్నారు. అందుకు నేను తిరిగి ఉద్యోగం చేస్తూ సంఘ కార్యక్రమాలు చేస్తుకుంటూ ఉన్నాను. ఆ తరువాత శ్రీ అమర్‌సింగ్ రాథోడ్ ఎం.ఎల్.సి గారి సహకారంతో అనంతపురం ట్రాన్సఫర్ అయి, అనంతపురం వచ్చి సంఘ కార్యక్రమములు చేపట్టటం జరిగినది. అనంతపురం ఆగస్టు 1976లో వచ్చాను. అప్పటికి

అనంతపురం జిల్లా బంజారాలకు ఎటువంటి అభివృద్ధి జరగటం లేదు. హరిజనులకు, గిరిజనులకు ఒకే సంక్షేమశాఖ పనిచేస్తున్నది. యస్. సుబ్బయ్య సోషియల్ వేల్‌ఫేర్ ఆఫీసరుగా పనిచేస్తున్నాడు. ఇతను, హరిజన అభిమాని గిరిజనులకు ఏ ఒక్క పని చేయలేదు. ఒకే ఒక్క గిరిజన హోస్టలైన పెనుకొండ హాస్టలను, హరిజన హస్టలుగా మార్చివేసినారు. ఇతను 1963 సం. నుండి 1976 సం. వరకు అనంతపురం జిల్లాలో ప్రభుత్వంవారు కేటాయించిన 3% డబ్బును ఖర్చు పెట్టలేదు. అనంతపురం జిల్లాలోని పదహారు పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్‌లోని కొన్ని లక్షల డబ్బును ఖర్చుపెట్టలేదు. సోషియల్ వెల్‌ఫేర్ ఆఫీసుకు పోయి అడిగిన ఆఫీసరు తన ముందు గంటలు గంటలు, కూర్చోపెట్టుకుంటున్నాడు. కాని నోరు విప్పి మాట్లాడేవాడు కాదు.

అనంతపురం జిల్లాలో కనీసం కాలేజీ గిరిజన పిల్లలకు స్కాలరు షిప్పు మంజూరు చేయలేదు. రాయలసీమ డెవలప్‌మెంట్ బోర్డుల గిరిజనులకు కేటాయించిన లక్షల డబ్బులు ఖర్చు చేయలేదు.

ఈ విషయమంతయు ఆంధ్రప్రదేశ్ లేజిస్లేచర్ కమిటి, అనంతపురం జిల్లాలో పర్యటించి, జిల్లా పరిషత్ హాలులో జరిగిన మీటింగ్‌నందు గిరిజన అభివృద్ధిగూర్చి, అనంతపురం జిల్లాలో ఖర్చుపెట్టిన రిపోర్టును సమర్పించటం జరిగినది. ఆ రిపోర్టు తీసుకొనటం జరిగినది. మీటింగ్ నందు గిరిజన సమస్యతోపాటు, అనంతపురంలో బంజారాల గృహనిర్మాణం గూర్చి చర్చించటం జరిగినది. ఆ కమిటీలో కృష్ణా జిల్లా ఎమ్.ఎల్.ఏ. వెంకటేశ్వరులుగారు ఎరికల వారిని కూడ ఎందుకు చేర్చుకోకూడదు అని అడిగారు. నేను వారికి సమాధానం ఇవ్వడం జరిగినది. గిరిజనులుగా, ఎరికల, బంజారాలు ఉన్నది వాస్తవం కాని, బంజారాల, ఆచార వ్యవహరములు, సంస్కృతి వేరు అంతే కానీ, బంజారాలకు ఎరికలకు ఇక్కడ సంబంధంలేదు అని తెల్పినాను ఆ వాదనను అందరు ఒప్పుకొనటం జరిగినది.

ఇక ఆ కమిటీకి సమర్పించిన రిపోర్టును, ఇంటికి తీసుకొని పోయి చదివితే ఎన్నో లక్షల డబ్బును ఖర్చు చేయలేదు. అది చూచి నా శరీరం భగభగ మంటలు చెలరేగినట్లు అయినది. ఆ రిపోర్టు సారాంశమును తెలుగులో వ్రాసి పత్రికా ముఖంగా పంపుచున్నాను అని, రాష్ట్ర ముఖ్యమంత్రిగార్కి, జిల్లా కలెక్టరువారికి, ప్రభుత్వ గిరిజన శాఖ సెక్రెటరిగార్కి, గిరిజన శాఖ డైరెక్టరు వారికి పంపించడం జరిగినది. అంత రిపోర్టు పంపినా ఒక్క పత్రికవారు కూడ ప్రచురించలేదు. ఒక విశాలాంధ్ర దిన పత్రిక మాత్రం మామూలుగా పత్రికలలో వచ్చే సంఘ కోరికలతో ఒక చిన్న ముక్క మాత్రం ప్రచురించారు.

కాని విశాలాంధ్రకు పంపిన ప్రతినివారు విజయవాడలో నడుపబడుచున్న ''సౌజన్య'' వారపత్రికకు ఇవ్వడం జరిగినది. వారు దానిని అనంతపురం లేఖ అని పెద్ద హెడ్డింగుతో ''బంజారాల బ్రతుకులు బాగుపడేదెప్పుడో'' అని మొత్తం వ్యాసమును ప్రచురించినారు. అది ప్రచురించినది నాకు తెలియదు. ఒక రోజు బస్సులో ముదిగుబ్బ మీదుగా ప్రయాణంచేస్తూ అనంతపురం వస్తుండగా ఎదురు సీట్లో కూర్చున్న వ్యక్తి దగ్గర ఈ పత్రిక ఉన్నది. అది తీసుకొని చూడగా నా వ్యాసమే, వెంటనే అనంతపురం వచ్చి, సప్తగిరి వద్ద పేపర్ రామయ్యను సౌజన్య పత్రిక ఉన్నదా అన్నాను, ఈ రోజే వచ్చినది 9 కాపీలున్నవి అన్నారు. ఆ 9

కాపీలను తీసుకొని వాటిని కత్తరించి, తిరిగి ముఖ్యమంత్రి గార్కి, జిల్లా కలెక్టరుగార్కి పంపించడం జరిగినది.

ఈ ఉత్తరం బాగా పనిచేసినది, జిల్లా కలెక్టరువెంటనే 10,80,864 రూ. మొత్తం డబ్బును నారశింహపల్లి తాండా సమిష్టి వ్యవసాయ సంఘమునకు ఇస్తునట్లుగా ఉత్తర్వు నాకు పంపించారు. అయితే సోషియల్ వెల్ఫేర్ ఆఫీసరు అడ్డుపడినారు. అనంతపురం జిల్లాలో 400 తాండాలు ఉన్నవి. ఒక్క తాండాకే ఇంత కేటాయిస్తే ఎలా అన్నారు. కలెక్టరువారు నీవు ఎప్పటినుంచి ఇక్కడ పనిచేస్తావు అని అడిగాడు, 1963నుంచి అన్నారు, అంటే ఇదంతా నీ ఉన్న కాలమే కదా? ఈ రోజు నీకు 400 తాండాలు కనుపిస్తున్నాయి అని, జిల్లా కలెక్టరు కె.యస్.శర్మగారు వారి మీద కోపగించుకొన్నారు.

అప్పుడు శర్మ కలెక్టరుగారు, నారశింహపల్లి తాండా సమిష్టి వ్యవసాయ సంఘమునకు, ఒక లక్ష నలభైవేలు, కేటాయించాడు. జిల్లా పరిషత్‌లో ఉన్న డబ్బుతో గిరిజన కార్పోరేషన్ స్థాపించారు. అనంతపురం జిల్లాలోని ఎలిమెంటరి స్కూలు నుండి కాలేజీవరకు అందరికి స్కాలర్ షిప్‌లు మంజూరు చేసారు. 1నుండి 5వ తరగతి వరకు 50 రూ. 6నుండి 10వరకు 70 రూ. కాలేజీ పిల్లలకు నెలకు 70 రూ.ల చొప్పున 6 లక్షలు పైబడి మంజూరు చేయటం జరిగినది. రాయలసీమ డెవలప్‌మెంటు బోర్డు గిరిజనుల కేటాయింపునుండి సుమారు 6 లక్షల రూపాయలు 50% సబ్సిడీ క్రింద 1200 మంది బంజారాలకు ఆర్.సి.నెం. ప్రకారం ఈ క్రిందివిధంగా ఆర్థిక సహాయములు మంజూరు చేసారు. ప్రోసిడీంగ్ నం. 258/76 తేది : 24-12-1976, 14-3-1977, 25-3-1977 మరియు 2066/76 హెచ్ ప్రకారం వ్యవసాయ ఎద్దులు, బండ్లు, ఆర్.సి.నెం. 3587/76 హెచ్ తేది 25-3-1977 ప్రకారము సబ్సిడీ క్రిందలోను ఆర్.సి.నెం. 327/77 హెచ్ తేది 23-4-1977 ప్రకారం ఐ.టి.ఐ.లో టైప్‌రైటింగ్ మరియు డ్రాఫ్ట్మెన్ ట్రయినింగ్ స్థాపించటం, ఆర్.సి.నెం. 2578/76 తేది 28-3-1977 పాడి పశువులు, 2072/77తేది 22-6-1977 ప్రకారం. కూడేరు సమితి ద్వారా, వేపచర్ల ఎగువ తాండా మరియు పంపనూరు తాండాలో ఎలిమెంటరి స్కూలు బిల్డింగ్‌లు, ఆర్.సి.నెం. 1111/77 హెచ్ తేది 30-6-1977 ప్రకారం వ్యవసాయ ఎద్దులు, ఈ విధంగా మొత్తం సుమారు 10లక్షలపైబడి బంజారాలకు ప్రభుత్వం ద్వారా ఇప్పించడం జరిగినది. ఐ.టి.ఐ.లో అడ్మిషన్లు అయి నాల్గు నెలలు అయిపోయినా జిల్లా కలెక్టరువారికి వ్రాసి 20మంది పైబడి బంజారా విద్యార్థులకు, ఐ.టి.ఐ.లో సీటు ఇప్పించడం జరిగినది.

మరియు ల్యాండ్ ఎక్విజేషన్ గ్రాంటు క్రింద, అనంతపురం టౌనులో 200 కుటుంబాలకుగాను 171మంది ఎంక్వయరి ప్రకారం యున్నవారు, దూరదృష్టితో ఇంకను 29 కుటుంబాలకె సరిపోవునట్లుగా ప్రతి ఒక్కరికి 3 సెంట్ల ప్రకారం, 6 ఎకరములు, రోడ్లు మరియు స్కూలు, గుడి, బంజారా హోమ్ కట్టుటకుగాను 4 ఎకరముల మొత్తం, పరసన్నయ్య పల్లి రోడ్డుకు ఉన్నట్లుగా అనంతపురం గెజిట్‌నందు 29-4-77లో ప్రకటించడమైనది. అందులో (Gazette Notification) To wit for provisions of house sites to Banjaras(Sugalies) of Anantapur Town only. అని మాత్రమే ఉన్నది. దీనికి జిల్లా కలెక్టరు శ్రీ కె,యస్. శర్మగారు. ఒక డిప్యూటి తాసీల్‌దారిగార్ని కేటాయించి, నాతోపాటు ఎంక్వయరి చేసి ఎంత మంది ఉంటే అంత మందికి ఇస్తామన్నారు. నేను డిప్యూటి తాసిల్‌దారు

మల్లయ్యగారు ప్రతిరోజు రిక్షా తీసుకొని అనంతపురం చుట్టు ప్రక్క సుమారు 6నెలలు కాలంలో సుమారు 2,000 రూ. సొంత డబ్బు ఖర్చు పెట్టినాయక్ నగర్‌ల స్థలము ఎంక్వయరి చేయడం జరిగినది.

కానీ, ఈ కష్టము నంత, మన బంజారా నాయకులు వృథా చేయించినారు. నాకు తెలియకుండ ఆర్. డి. ఓ. ఆఫీసులో లంచాలిచ్చి, తాండాలో ఉన్న వారందరికి ప్రచారం చేయించి, 3 సెంట్ల ప్రకారం ఇవ్వవలసిన స్థలంను. 2సెంట్ల ప్రకారం చేయించి, వారివారి బంధువులకు, వారి సొంతానికి తల్లిదండ్రుల పేర్లు రాయించి మొత్తం స్థలం పట్టా పొందినారు. ఈ విషయం యస్. ఘణేనాయక్ ద్వారా తెలుసుకొని వారిని అడ్డగించితే, చీనియానాయక్ గారు మన అందరికి పట్టాలు రాకుండా చేస్తున్నారని నా పైన తప్పుడు ప్రచారం సాగించారు. ఈ విధంగా తీసుకొన్న ఇళ్ళ స్థలాలను, 2 సెంట్ల స్థలంకై వచ్చిన తాండావారు ఒక్కొక్క ప్లాటు 600 రూ. సి.కె. ఫ్రకృద్దీన్ వద్ద తాకట్టుపెట్టి, అమ్ముకొని పోయినారు. ఇప్పుడు నాయక్‌నగర్ పేరు మాత్రం ఉన్నది. అందులో కొంత మంది ఏజెంట్లుగా ఉండి ఉన్న ఇండ్లను కూడ దలారి వ్యాపారం చేసి అమ్మివేసినారు. ఇదే అదును అనుకొని కొంత మంది ఎరికల కులస్తులు వాటిలో చేరి, మేము గిరిజనులు కాదా అని వారిని బెదిరించి, అమాయకులైన బంజారాలను తరిమి వేసి ఆ ఇండ్లను వారి పేర్ల పట్టాలు తెచ్చుకొని లాభం పొందుతున్నారు.

సంఘము పై ఏ మాత్రం అభిమానము లేని, సంఘం అంటే ఏమో తెలియని, సంఘములో మెంబర్లుకాని మన బంజారా విద్యావంతులు ఈ జాతిని అభివృద్ధి కానీకుండ అడ్డు పడుతున్నారు. ఏమంటే నాకన్న రాజకీయం తెలిసినవారు ఎవరున్నారు అని విర్రవీగుచున్నారు.

1976 సం.లో బంజారాలకు అనంతపురంలో ఒకే ఒక హాస్టలు, బళ్ళారి రోడ్డులో ఉండెడిది. అది 70 మంది పిల్లలు, వారికి ఏ విధమైన సౌకర్యం లేనిచోట హాస్టల్ ఉంచినారు. ఒక గిరిజన బాలుడు, వర్షమునకు నడిమి వంక వచ్చి అందులో కొట్టుకొని పోయి చనిపోయినాడు. ఆ విషయం గూర్చి కలెక్టరుగార్కి తెల్పగా. అనంతపురం ఐ. టి. ఐ.లో ఖాలీగా ఉన్న పెద్ద పెద్ద హాస్టలు షెడ్యులు మూడింటిని తీసుకొని 30వేల రూపాయలతో రిపేరి చేయించి, 200 మంది విద్యార్థులతో హాస్టలు ప్రారంభించడం జరిగినది. ఆ తరువాత గిరిజన ప్రభుత్వ కార్యదర్శి అయిన శ్రీ శంకర్ గార్కి పంపిన ఉత్తర్వు మేరకు వారు అనంతపురం జిల్లా వచ్చారు. అనంతపురం జిల్లాలో 400 తాండాలు పైబడియున్నాయంటున్నారు. కావున 200 మంది విద్యార్థులతో మరొక హాస్టలు ప్రారంభించండి అన్నారు. అప్పుడు పిల్లల్ని అనంతపురంలో వ్యాను వేసుకొని తిరిగి చేర్పించాము. ఇప్పుడు పక్కా బ్లిడంగులలో నాయక్‌నగర్ ఒకటి, రుద్రంపేటలో రెండు హాస్టలు, బాలికలకొక హాస్టలు నడుపబడుచున్నవి.

అదే విధంగా అనంతపురం జిల్లాలో ప్రతి హైస్కూళ్ళ వద్ద ఒక హాస్టలు స్థాపించవలయునని ఒత్తడి తేవడం జరిగినది. ఆ ప్రకారం గోరంట్ల,, కదిరి, తనకల్లు, ఉరవకొండ ప్రాంతం, పెనుకొండ, మరి కొన్ని చోట్ల స్థాపించడం జరిగినది.

# నూతన కార్యవర్గ సభ్యులకు శుభాకాంక్షలు

అఖిలభారత బంజారా సేవాసంఘం స్థాపించిన 50 సంవత్సరాల తరువాత ఆ సేవాసంఘం ఆంధ్రప్రదేశ్ బంజారా సంఘ కార్యకర్తల చేతులలోకి వచ్చినందుకు చాలా గర్వంగా ఉంది.

10-5-1998న ముంబయిలో జరిగిన సమావేశంలో అధ్యక్షులుగా శ్రీ పి.రంజిత్‌నాయక్, ప్రధాన కార్యదర్శిగా శ్రీ డి.రవీంద్రనాయక్‌గార్ల ఎన్నిక కావటం చాలా సంతోషాన్ని కలిగిస్తోంది.

వీరి ఆధ్వర్యంలో అఖిల భారత బంజారా సేవా సంఘం బ్రాంచీలు దేశం మొత్తాన్ని నాలుగు మండలాలుగా విభజించి, రాష్ట్రాలవారిగాను, ప్రాంతాలవారిగాను, జిల్లా, శాసనసభ స్థానాలలోను, తాలుకా/మండలాలవారి తాండా సంఘాలు స్థాపించబడగలవని ఆశిస్తున్నాం.

ఈ సంఘాల స్థాపనద్వారా దేశవ్యాప్తంగా బంజారా భాషాభివృద్ధికిగాను బంజారా పార్లమెంటు సభ్యుల సహకారంతో బంజారాల సమస్యల గురించి పార్లమెంటులో చర్చించి, ప్రత్యేక రాష్ట్రాధికారంలేని బంజారా రాష్ట్రాన్ని స్థాపించటానికి వీలు కల్పించగలరని ఆశిస్తున్నాం. UNO ఏ విధంగా అయితే భూభాగంలేని రోమా జిప్సీల రాజ్యాన్ని ప్రకటించిందో అదేవిధంగా, ఒక ప్రత్యేక రాష్ట్రానికి అర్హతగల బంజారాలను రాష్ట్రంకాని రాష్ట్రంగా ప్రకటించి, భాషాభివృద్ధికి ఒక భాషా రాష్ట్రానికి గల అర్హతలను ప్రసాదించి అభివృద్ధి పరచగలందులకు పాటుపడగలరని క్రొత్తగా ఎన్నికైన శ్రీ రంజిత్‌నాయక్, శ్రీ రవీంద్రనాయక్ గార్లను కోరుతున్నాం.

ఇట్లు
బి. చీనియానాయక్
ప్రధాన కార్యదర్శి
అఖిల భారత బంజారా సేవాసంఘం
ఆంధ్రప్రదేశ్ శాఖ

# ఉపసంహారం

ఒక జాతి చరిత్రను ఆ జాతికి చెందిన చరిత్రకారులే వ్రాయాలి. ఒక జాతి సంస్కృతిని ఆ సంస్కృతిలో నిండుగా జీవించే వ్యక్తి మాత్రమే సంపూర్ణంగా చిత్రించగలడు. భారతదేశ చరిత్రను గ్రీకులు, మహమ్మదీయులు, ఆంగ్లేయులు వ్రాయడంవల్ల ఎన్నో అసత్యాలు, అభూత కల్పనలు చోటు చేసుకున్నాయి. ఉదాహరణకు పురుషోత్తముడు అలెగ్జాండర్‌ను ఓడించాడు. ఇది సత్యం. దీనిని గ్రీకు చరిత్రకారులు వక్రీకరించి వ్రాశారు. పురుషోత్తముని ధైర్యానికి మెచ్చుకొని అలెగ్జాండర్ అతని రాజ్యాన్ని అతనికి ఇచ్చివేశాడని వ్రాశారు. ప్రపంచాన్ని అంతా జయించాలనే పెద్ద ఆశతో వచ్చిన అలెగ్జాండర్ తాను జయించిన రాజ్యాన్ని తిరిగి ఇచ్చివేస్తాడా? అలాగే రసపుత్రుల శౌర్యాన్ని, శివాజీ సాహస దండయాత్రలను మహమ్మదీయ చరిత్రకారులు వక్రీకరించి వ్రాశారు. ఆంగ్లేయులు హిందూ ముస్లిముల ఐక్యాన్ని గెబ్బతీసే విధంగా చరిత్ర సృష్టించారు. వెళ్ళేటప్పుడు దేశాన్ని రెండు ముక్కలు చేసి వెళ్ళారు. కాబట్టి భారతదేశ చరిత్రను, సంస్కృతిని భారతీయ చరిత్రకారులే తిరిగి వ్రాయవలసిన అవసరం ఉంది. ఆ బృహత్కార్యంలో ఈ గ్రంథరచన ఒక ఉడుతాభక్తి ప్రయత్నం. బంజారాల చరిత్రను, సంస్కృతిని బంజారా జాతిలో పుట్టిన నేను మొట్టమొదటిసారిగా అతి విపులంగా గ్రంథస్థం చేశానని సగర్వంగా చెప్పుకుంటున్నాను.

సుమారు 600 పుటలలో వ్రాయబడిన ''బంజారా చరిత్ర'' (సంస్కృతి- ప్రగతి) అనే ఈ గ్రంథంలో నాలుగు ప్రధాన అధ్యాయాలు ఉన్నాయి. మొదటి అధ్యాయం బంజారాల చరిత్రకు సంబంధించినది. ఇది 170 పుటలలో 51 ఉపశీర్షికలతో వ్రాయబడింది. బంజారాలు భారతదేశంలోనే కాదు- ప్రపంచ వ్యాప్తంగా ఉన్నారనీ; ఐరోపా దేశాలలోని జిప్సీలు బంజారాలే అనీ; బంజారా జాతికి గొప్ప చరిత్ర ఉందనీ; పృథ్వీరాజు చౌహాన్, రాణాప్రతాప్‌సింగ్ రాఠోడ్, సూరదాసు, మీరాబాయి (రాఠోడ్ వంశం), తాన్‌సేన్, గరూబావా (గురునానక్) ఇత్యాది వీరులు, భక్తులు, గాయకులు, మతప్రవక్తలు బంజారాలే అనీ; బంజారాలు క్షత్రియులనీ – వారి వంశనామాలు గోత్రనామాలతో సహా నిరూపించడం జరిగింది. 'నారసింహపల్లి' తాండాలో ఉన్న పురుషుల వంశ నామాలు, గోత్రాలు పూర్తిగా సూచించాను. అలాగే 'అడవిబ్రాహ్మణపల్లి' తాండాలో వున్న ఒక కుటుంబములోని స్త్రీల వంశనామాలు, గోత్రాలు పూర్తిగా పేర్కొన్నాను. భారతదేశ చరిత్రలో సాహసోపేతంగా బంజారాలు చేసిన అనేక యుద్ధాల ప్రసక్తికూడా ఈ అధ్యాయంలో ఉంది. భగవంతుడు ఈ బంజారా జాతిలో పుట్టాడనీ, తిరుమలలోని బాలాజీ మఠాధిపతి శ్రీ హాథిరాం బావాజీ పవార్ వంశస్థుడనీ, శ్రీ మీటుభుక్యాకి ఆదిశక్తి ప్రత్యక్షమయిందనీ ఈ అధ్యాయంలో స్థాపించాను.

రెండవ అధ్యాయంలో బంజారా సంస్కృతిని సూక్ష్మాతిసూక్ష్మంగా చిత్రించడం జరిగింది. ఇది కూడా మొదటి అధ్యాయంలాగే 175 పుటలలో 42 ఉపశీర్షికలతో కొనసాగింది. బంజారా స్త్రీల దుస్తులు – ఆభరణాలు; సీమంతం, జననం ఇత్యాది వేడుకలు; అతి విపులంగా పెండ్లి తతంగం; వితంతు వివాహాలు (దేవరన్యాయం); బంజారాల దేవతలు- పండుగలు- పబ్బాలు; బంజారాల జానపద కథలు; బంజారా భాషా సంగ్రహ వర్ణనం-లిపి సమస్య; ఇప్పటివరకు పాఠ్యాంశాలలో బోధించని విద్య-విజ్ఞానం, విద్య-ఉద్యోగం అను అంశాలలో తల్లిదండ్రులు తమ పిల్లలు స్వయం సమృద్ధి చెందాలంటే ఏ ఏ విద్యలు అభ్యసించిన, ఏఏ ఉద్యోగాలను చేపట్టవచ్చునో అన్న విషయాలను కూడా విపులంగా తెలియపరచడమైనది. కేంద్ర మానవ వనరుల శాఖామాత్యులకు బంజారాలు కావించిన విన్నపం, అనంతపురం జిల్లాలోని మండలాల వారిగా

బంజారా తాండాల సంఖ్య; బంజారా సామెతలు; మానవ శరీరంలోని భాగాలను బంజారా భాషలో ఏమని పిలుస్తారు? - ఇత్యాది వివరణ కూడా ఈ అధ్యాయంలో ఉంది.

ఈ గ్రంథంలోని మూడవ అధ్యాయం వర్తమాన కాలంలో బంజారాజాతికి సేవచేసిన మహానుభావుల పరిచయానికి కేటాయించబడింది. ''పెద్దల జీవిత చరిత్ర'' అని ఈ అధ్యాయానికి పేరు పెట్టాను. ఇది 60 పుటలలో 22 ఉపశీర్షికలతో కొనసాగింది. దీంట్లో కీర్తిశేషులైన మహాత్మా ఫూలేసింగ్‌నాయక్, వసంతరావు ఫూలేసింగ్‌నాయక్, బలిరాం హీరామన్ పటేల్, ఆర్. జాతరనాయక్, పూజారి చాంప్లానాయక్, బాబాసాహెబ్ రాజూసింగ్‌నాయక్, నారసింహపల్లి తాండా ప్రసాదించిన ప్రప్రథమ వైద్య పట్టభద్రుడు డ్డాక్టర్ కె. బాపూజీనాయక్, అభిమానవంతుడు శ్రీ వి. రామస్వామినాయక్ మొదలైన వారిని గురించి వివరించాను. ఈనాడు సజీవులై ఉండి, అనేక రంగాలలో కృషిచేస్తూ, బంజారా జాతికి విశేషమైన సేవలు చేస్తూ, బంజారా సంస్కృతికి వన్నెలు తీర్చి దిద్దుతున్న విశిష్ట వ్యక్తులను గురించిన సమాచారం కూడా ఈ అధ్యాయంలో ఉంది. భారత ప్రభుత్వం నుండి పద్మశ్రీ, పద్మవిభూషణ్ బిరుదులు పొందిన బంజారా మహావ్యక్తి శ్రీ రామ్‌సింగ్ ఫక్కీ- రాజీబాణావత్‌గారిని గురించి, పద్మభూషణ బిరుదాన్ని పొందినమైసూరులో డ్డాక్టర్‌గా ఉన్న శ్రీమతి కె. వెంకటలక్ష్మమ్మగారిని గురించి వివరించాను. శ్రీయుతులు చంద్రాం రామచంద్ర చౌహాన్ (గురూజీ), భుక్యా బాలాజిదాస్ రాథోడ్ రాజయోగి, వడితే గోపాలరావునాయక్, పి. రంజిత్‌నాయక్, రామవత్ లాలూనాయక్, సి.ఎస్. కల్యాణ నాయక్, సాధుసింగ్ ధర్మసోత్, శ్రీమతి డా. అనంతి జాబాసింగ్, నూన్‌సావత్ జీవలానాయక్, బేబి లక్ష్మి, శ్రీమతి హేమ్లిబాయిగారల గురించిన విశేషాలు ఇచ్చాను. వీరిలో విద్యావంతులు, రాజకీయవేత్తలు, లాయర్లు, డ్డాక్టర్లు, సంఘసేవకులు అందరూ ఉన్నారు. వీరందరూ కేవలం ఆంధ్ర రాష్ట్రానికే కాకుండా, మహారాష్ట్ర, పంజాబు, ఢిల్లీ, మైసూరు మొదలైన అనేక ప్రాంతాలకు చెందిన వ్యక్తులు కావడం గమనార్హం.

నాల్గవ అధ్యాయం కేవలం బంజారాలను గురించి నేను కావించిన కృషికి ప్రత్యేకించబడింది. ఇది 195 పుటలలో 50 ఉపశీర్షికలతో సాగిన సుదీర్ఘ ప్రకరణం. బంజారాల కర్తవ్యాన్ని నిర్దేశించే కొన్ని ప్రబోధగీతాలు ఈ ప్రకరణంలో చేర్చాను. అఖిల భారత బంజారా సేవా సంఘాన్ని స్థాపించాను. నేను పుట్టిన నారసింహపల్లి తాండాను గురించిన పూర్తి సమాచారాన్ని అందించాను. (ప్రతి తాండాను గురించీ ఈ రకంగా అధ్యయనం చేస్తే బంజారాల చరిత్ర-సంస్కృతి ఇంకా వివరంగా తెలుస్తాయి). బంజారాల తాండాలు అభివృద్ధి చెందాలంటే వివిధ సంఘాల స్థాపన అవసరమనీ; అఖిలభారత స్థాయిలో సంఘాలను ఏవిధంగా స్థాపించాలి అనే విషయాన్నిగూర్చి సంఘము మరియు రాజకీయ పత్రిక ద్వారా వివరించటం జరిగినది. రాజకీయాభివృద్ధి, విద్యాభివృద్ధి, స్త్రీశిశు సంక్షేమం, పశుసంపద, కుటీరపరిశ్రమలు మొదలైనవన్నీ వర్థిల్లడానికి ఈ సంఘాలు ఎంతగానో దోహదం చేస్తాయని నిరూపించాను. సంఘాలు- ప్రణాళికలు; అనంతపురం సుగాలీ సేవా సంఘం, ఆంధ్రప్రదేశ్ బంజారాల అభివృద్ధి కార్యక్రమం,. అఖిలభారత బంజారాసేవాసంఘం-ఆంధ్ర ప్రదేశ్ శాఖ చేపట్టిన కార్యక్రమాలు-ఈ అధ్యాయంలో వివరించాను. ఈ సంఘాల ద్వారా బంజారాలు అభివృద్ధి చెందడాన్ని సహించలేని కొన్ని సాంఘిక రాజకీయ దుష్టశక్తుల నెదుర్కోవడంలో నేను చూపిన ధైర్యసాహసాలు కూడా విపులంగా ఈ అధ్యాయంలో చర్చించబడ్డాయి. ఆనాటి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారితోను, ఆనాటి ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధితోను నేను జరిపిన ఉత్తర పత్యుత్తరాలు, వారికినేను సమర్పించిన వినతిపత్రాలు ఇత్యాదులు వివరంగా తెల్పినాను. భారతీయ చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధిబ్యాంకు ఉత్తరం, ఆంధ్రప్రదేశ్ గిరిజన కో ఆపరేటివ్ ఫైనాన్స్ కార్పొరేషన్ లిమిటెడ్ వారి ఉత్తరం, జాతీయ హరిజన గిరిజన ఆర్థికాభివృద్ధి సంస్థ (NSFDC) యొక్క కార్యక్రమములను గూర్చిన వివరములు తెలియజేయడమైనది. నేను జన్మించిన నారసింహపల్లి తాండాను ఆదర్శతాండాగా ఎలా తీర్చిదిద్దాలో విశదీకరించాను.

నేను ప్రభుత్వ ఉద్యోగిగా పనిచేస్తూ, 40 సంవత్సరాల కాలంలో దేశమంతా పర్యటించి, ఎన్నో విషయాలను స్వయంగా కంటితో చూచి తెలిసికొని సుమారు ఒక సంవత్సరంపాటు గ్రంథాన్ని వ్రాయటం జరిగినది. ప్రింటింగ్ చేయుటకు 6 నెలలు పట్టినది. ఎన్నో విషయాలను దృశ్యరూపంలో తెలియజేసే ఫొటోలు 100కి పైగా, మరియు రంగుల ఫొటోలు 40కి పైగా ముద్రించడం జరిగినది. భారతీయ సంస్కృతిలో భాగమైన బంజారాల సంస్కృతిని, దుస్తులను, సాంప్రదాయాలను ఎన్నో సంవత్సరాలపాటు భద్రపరచి రాబోవు ముందుతరాలవారు గర్వించే విధంగా వ్రాయడం జరిగినది.

ఎంతో శ్రమకోర్చి నా పెన్షన్ బెనిఫిట్స్ అన్నీ ఖర్చుచేసి ఈ బృహద్గ్రంథాన్ని సిద్ధం చేశాను. నా జాతి చరిత్రను సంస్కృతిని పరిరక్షించడం కోసం నేను చేసిన చిన్న త్యాగమే ఈ గ్రంథ ప్రచురణ. ఆంధ్రప్రదేశ్‌లోని బంజారా తాండాలు, బంజారా సంఘాలు, సాంఘిక శాస్త్రవేత్తలు, స్త్రీలు, పురుషులు, పండితులు-పామరులు అందరూ ఈ గ్రంథాన్ని సహృదయంతో ఆదరిస్తారని విశ్వసిస్తున్నాను. భారతదేశంలో ఏ మూలనున్న బంజారా అయినా సరే తన చరిత్ర సంస్కృతులు ఈ గ్రంథంలో ప్రతిబింబించడం చూచుకొని గర్వించి, ఉత్తేజితుడవుతాడని భావిస్తున్నాను. అభ్యుదయ పథంలో మునుముందుకు సాగుతాడని ఆశిస్తున్నాను.

భవతు! సర్వేజనాస్సుఖినో భవంతు!

## తప్పులు – ఒప్పులు

| పేజి సంఖ్య | – పాలు | – తప్పు | – ఒప్పు |
|---|---|---|---|
| 132 | 10 | B. Cheeniya Naik | B. Chendiya Naik |
| 138 | 6 | హరిదాసు | సూరదాసు |
| 173 | 21 | బేరో (Side Heading) | ఘేరో |
| 216/217 | 29/10 | ఘంగా హిరాణ్యాక్షుడు | కశ్యపుడు |
| 293 | 15 | భెవి | భెనేవి |
| 296 | 21 | జీటఖణజో | జీటభాణజో |
| 296 | 23 | జీటపోతీ | జీటభాణజీ |
| 296 | 24 | జీటపోతీ | జీటభాణజీ |
| 386 | 1 | భో320319జనం | భోజనం |
| 425 | 25 | letters | litres |
| 425 | 27 | case as detailed in the proposal against bak guarantee | line to be deleted |
| 426 | 13 | nit | unit |
| 426 | 19 | out | our |
| 448 | | ఫొటోలో [illegible] | ఐదవవారు |



II సామానాయక్ స్త్రీల [illegible] నాయక్ చిన్నభార్య పాల్త్యా సబావట్

ఘంలీబాయి పాల్త్యా సబావట్

ఆడబిడ్డలు – లాలీబాయి భర్త పరుశురామ్ బలరామ్

